స్వామి శ్రీ సర్వేశ్వరానందుల వారి

'ఇందూజ్ఞానశక్తి' సహిత

# గీతా సంహిత

సమర్పణ

బి. సిహెచ్. రంగారెడ్డి

ప్రచురణ

**శ్రీ బండారు రంగమ్మ గురువారెడ్డి**
**మెమోరియల్ అండ్ చారిటబుల్ పబ్లిక్ ట్రస్ట్**

124, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్-500 036.



# స్వామి శ్రీ సర్వేశ్వరానందులవారు

శ్రీ రాజరాజేశ్వరీ ఆశ్రమం : బొమ్మక్కపల్లి

# జయభగవద్గీతే

భారతావనికి విశేషమైన ప్రాభవమును గడించి పెట్టినది భగవద్గీతయే! భగవద్గీతకు పూర్వము యిక్కడ నాలుగువేదాలు ప్రభవించి నప్పటికి వేదార్థసారముగా భగవద్గీత యీ గడ్డమీద పుట్టిన సమస్త మతాల ఆదరప్రేమలకు, ఆరాధ్యతకు దేవతాస్థానమలంకరించింది. అందుకే గీతను మన సంహితలలో ఒక సంహితగా కూడా పరిగణించారు. అందుచేత ఈ గ్రంథనామము 'గీతా సంహిత' గా పేర్కొనటం ఎంతో సముచితమైనదని చెప్పక తప్పదు. ఇట్టి విశిష్టతమ శక్తి ఒక గ్రంథమునకు కలుగుట అపూర్వము.

సంశయగ్రస్త చిత్తుడగు పార్థుని మనస్సును ప్రదీప్తం చేసే ప్రజ్ఞావాదము మాత్రమే భగవద్గీత యందు నిహితమై వుంది అనుకోనవసరం లేదు. మానవతా విలువల పోషణకు ధర్మ కర్మ రహస్యాలను నాటి వేద ఋషులు ఈ గ్రంథం ద్వారా లోకానికి చాటారు. అందుకే యెన్నో యుగాలు గడచినా యుగ పురుషులందరికి ఈ గ్రంథం కరదీపికగా మార్గనిర్దేశత్వం వహించి మానవకళ్యాణానికి దోహదపడటం జరుగుతోంది. ఆయా వర్ణ ఆశ్రమ ధర్మపాలన క్రమోన్నతి పథంలో సాగించు విహిత ధర్మ రహస్యములనెన్నొంటినో ఆనాడు అర్జునునకు శ్రీకృష్ణుడు ఈ గీత ద్వారా బోధించాడు.

సర్వదా ప్రకృతి పరమైన గుణకర్మలను చరిత్ర శుద్ధినెరిగిన పండిత వర్గానికి తత్త్వచింతనా రతులకు, యోగులకు, భక్తులకు, ఆశ్రమవాసులకు, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ యతులకు కర్మధర్మ ప్రచారం చేసి సమాజమున శాంతిస్థాపనకు 'గీత' యెంతగానో తోడ్పడినది.

అనేక మంది మహాత్ముల వ్యాఖ్యలు, భాష్యములు, తాత్పర్యములు సంగ్రథితము చేసుకొని తన అంతరాంతర సద్వస్తు నిశ్చయమైన విషయమును బహుశ్రమల కోర్చి గీతా సంహితగా రూపొందించిన శ్రీ బి.సి హెచ్. రంగారెడ్డి గారు మహిత యశోధనుడు, గృహస్థుడు, రాజఋషి, చారిత్రక దృష్ట్యా, వివిధ మతముల దార్శనిక దృష్ట్యా వివిధకోణాల నుంచి 'గీత'ను ఈ గ్రంథంలో పరిశీలించటం జరిగింది. దివ్య సుందర భగవల్లీలా విభూతులను శ్రీ గోపాల కృష్ణుని చిత్రముల ద్వారా సామాన్య పాఠకునికి ఈ గ్రంథము అతి సన్నిహితమగునట్లు చేయుట బహుధా ప్రశంసనీయము.

మహర్షుల కృపచే విశేషాదరణమున ఈ గ్రంథము శోభించునదై యావదాంధ్రావని యందు చిరకీర్తినందుగాకయని ఆకాంక్షిస్తున్నాను.

స్వామి సర్వేశ్వరానంద

# నివేదన

"శ్రీకృష్ణార్జున సంవాదం" పేరిట మహాభారతం భీష్మ పర్వంలోని 43వ అధ్యాయం నాలుగవ శ్లోకం ఈ విధంగా తెలియజేస్తున్నది.

షట్ శతాని సవింశతి శ్లోకానాం ప్రాహకేశవః
అర్జున సప్తపంచాశత్ సప్తషష్టించ సంజయః
ధృతరాష్ట్రః శ్లోకమేకం గీతాయా మానముచ్యతే॥

అనగా శ్రీకృష్ణుడు 620 శ్లోకాలను, అర్జునుడు 57 శ్లోకాలను, సంజయుడు 67 శ్లోకాలను ధృతరాష్ట్రుడు ఒక శ్లోకాన్ని చెప్పారు అని శ్లోకార్థం.

ఈ విధంగా చూచినప్పుడు గీతలోని మొత్తం శ్లోకాల సంఖ్య 745 అయింది. కాని మనం యిప్పుడు నిత్యం వాడుకునే భగవద్గీతలో శ్రీకృష్ణుడు 574, అర్జునుడు 84, సంజయుడు 41, ధృతరాష్ట్రుడు ఒక శ్లోకాన్ని చెప్పినట్లు వుంది. అప్పుడు ఈ శ్లోకాల సంఖ్య 700 అవుతుంది.

అయితే కొన్ని గీతాగ్రంథాలలో 13వ అధ్యాయమందలి మొదటి శ్లోకమైన 'ప్రకృతిం పురుషంచైవ' అను శ్లోకం అర్జునుని ప్రశ్నరూపంలో వుంది. దీనిని కూడా కలుపు కుంటే మొత్తం 701 శ్లోకాలవుతాయి.

గీతలోనే 18వ అధ్యాయంలో సంజయుడు చెప్పిన 78వ శ్లోకాన్ని ఏక శ్లోక గీతంగా పేర్కొనబడింది.

ఇదే విధంగా గీతలోని 8-13ను, 11-36ను, 13-14ను, 8-9ని, 15-1ని, 15-15ను, 9-34ను సప్త శ్లోకగీతగా అభివర్ణితమౌతుంది.

భగవాన్ శ్రీ రమణ మహర్షులవారు తమ భగవద్గీతాసారంలో 42 శ్లోకాలను మాత్రమే జీవిత నౌకను ముముక్షపదవికి కొనిపోయేవిగా సంగ్రధితం చేశారు.

ఆర్య సమాజనాయకులు శ్రీ ముక్తి రామోపాధ్యాయగారు తెలిపిన మూడువందలకు పైబడిన శ్లోకాలే అసలు గీతాశ్లోకాలని ఆధ్యాత్మిక సంపన్నులు, ఆర్య సమాజ నాయకులు పండిత గోపదేవశాస్త్రి గారు తెలియజేసి వున్నారు.

జాతిపిత మహాత్మాగాంధీగారు మాత్రం తనలో యేదైనా సంశయం మొలకెత్తినప్పుడు భగవద్గీతను తెరచి యేశ్లోకం కనిపిస్తే ఆ శ్లోకాన్ని చదివి అర్థం చేసుకుంటే తన సంశయం నివృత్తి అవుతుందని తెలియజేశారు. దీనినిబట్టి భగవద్గీతలో యెన్ని శ్లోకాలున్నాయి. అందులో యేవి విశిష్టమైనవి అన్న మీమాంస జోలికి పోకుండా ఎవరి అనుభవాన్ని బట్టివారు గీతా శ్లోకాల అర్థాలను గ్రహించుకోవలసిందేనని చెప్పవలసి వుంటుంది.

పూజ్యులు మహర్షి మలయాళ స్వాములవారి గీతను నాకు తెలిసిన రీతిలో సాంగోపాంగంగా పరిశీలించగా అందులో నాకు ఒక అద్భుతమైన వాక్యం తటస్థపడటం జరిగింది. వేద వ్యాసమహర్షి శ్రీకృష్ణ భగవానుని తత్వం బాగా యెరిగిన వారు గనుక భగవద్గీత అంతటా ఆయన తత్వమేమిటో విపులీకరించారు - అన్న మలయాళ స్వాములవారి వివేచన నాకు శిరోధార్యమైంది. నాటి నుంచి నేను భగవద్గీతనే నా సర్వస్వంగా భావించాను. అందుకు మా తండ్రిగారి ప్రోత్సాహం కూడా కొంత తోడైంది. శ్రీమతి రంగమాంబదేవి - శ్రీ గురువారెడ్డి గారలు నా జననీ జనకులు. వీరు జీవితాన్నంతా ఆధ్యాత్మిక చింతనతోనే గడిపారు.

"గ్రామీణ ప్రజలందరికీ సరళమైన శైలిలో భగవద్గీత అర్థమయ్యేట్లు ప్రచురించవోయ్" అని మా తండ్రిగారు తన కోరికను ఒకసారి నాముందు వ్యక్తంచెయ్యటం జరిగింది. నా వివాహం అయిన తర్వాత జీవిత భాగస్వామినిగా వచ్చిన శ్రీమతి సరోజినీదేవి కూడా శ్రీ చిద్భవానంద స్వాములవారు వ్యాఖ్యానించిన భగవద్గీతను రోజుకొక్క శ్లోకాన్నయినా పఠించి మననం చేసుకొననిదే దైనిక కార్యక్రమాల లోనికి అడుగు పెట్టక పోవటం కూడా భగవద్గీతపై నా దృష్టి మరింత కేంద్రీకృతం కావటానికి కారణభూతమైంది. నాటినుంచి మూల శ్లోకాల అర్థాన్ని సరళమైన తెలుగులో వ్రాయటం ప్రారంభించాను.

ఆ తరువాత గీతపై వ్యాఖ్యానించిన అనేకమంది పెద్దల వ్యాఖ్యలను సందర్భాన్నిబట్టి గ్రంథంలో చొప్పించేసరికి ఇంత పెద్ద గ్రంథమై కూర్చుంది. అయినా వెనుతిరగక ఆ పరమాత్ముని కృప వలన 'గీతా సంహిత' పేరుతో ఈ గ్రంథాన్ని వెలువరించగలిగినందులకు నాకెంతో ఆనందంగా వుంది.

రక్తపు పోటు, శ్వాసకోశ వ్యాధులతో 1993లో ఒకసారి నేను మరణ శయ్యపైకి వెళ్ళినవాడినే అయినా ఆ సర్వేశ్వరుడు నా జీవితాన్ని మరికొంత కాలం పొడిగించటం ఇటువంటి గ్రంథం నా చేత వెలువరించటం కోసమేనని యిప్పుడు నాకు అనుభవమైంది.

గ్రంథముద్రణ దాదాపు పూర్తయి ఎవరైనా మహానుభావునిచేత పీఠిక వ్రాయించాలని ఆలోచిస్తుండగానే బొమ్మక్కపల్లి శ్రీ రాజరాజేశ్వరీ ఆశ్రమవాసులు స్వామి శ్రీ సర్వేశ్వరానందుల వారు అనుకోకుండా మా యింటిని పావనం చేయటానికి యేతెంచి తమ అమూల్యమైన పీఠికను ఈ గ్రంథానికి సమకూర్చటం కూడా భగవదేచ్ఛ కాకపోతే నేనింకేమనుకోగలను!

నాకున్న సాహిత్యాభిలాషను చూచి నిరంతరం నన్ను గ్రంథ రచనకు పూనుకొమ్మని ప్రోత్సహించిన ఆంధ్రప్రదేశ్ భూదాన యజ్ఞ బోర్డు ఛైర్మన్ శ్రీ సి.వి. చారి గారిని, ప్రముఖ స్వాతంత్ర సమరయోద్ధ సోదరి సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి గారిని యీ సందర్భంలో గుర్తుకు తెచ్చుకుంటూ వారిరువురికి నా నమోవాకాలు అర్పించుకుంటున్నాను. తన కల్పనా శక్తితో ఈ గ్రంథానికి సుందరమైన ఆకృతిని కల్పించటంలో చిత్రకారులు శ్రీ అంజన్‌బాబు, చిరంజీవి 'హంపి'లతో కలిసి ఎనలేని కృషిసల్పిన మిత్రుడు శ్రీ వెంపో గారిని యెన్నటికీ మరువలేను. ముద్దులొలుకు ముద్రణకు మారుపేరైన శ్రావణి గ్రాఫిక్స్ అధినేత శ్రీ యం. జనార్ధన్, డి.టి.పి. పై అక్షరాల అమరికను చేపట్టిన శ్రీమతి కె. సరోజిని గారికి నా కృతజ్ఞతలు.

నా సతీమణి వియోగం పిదప నిరంతరం నా వెంటనంటి ఆధ్యాత్మిక ప్రబోధం ద్వారా నన్ను నిలద్రొక్కుకునేట్టు ప్రోత్సహించిన సోదరి నిర్మలమ్మ, బావగారు మేడ రామచంద్రారెడ్డి, శ్రీ బుసిరెడ్డి సత్యనారాయణరెడ్డి గారలకు నా ప్రత్యేకమైన నమస్సులనర్పించుకుంటున్నాను.

పాండిత్య ప్రకర్షతోగాక భక్తితత్పరతతో సమర్పించుకుంటున్న ఈ 'గ్రంథం' తెలుగు పాఠకుల మనోవికాసానికి యేమాత్రం తోడ్పడినా నా కృషి ఫలించినట్లుగా సంభావించుకుంటున్నాను.


ఇట్లు
బుధజన విధేయుడు
బి.సి.హెచ్. రంగారెడ్డి
(బండారు చిన రంగారెడ్డి)

124, సలీం నగర్
మలక్‌పేట
హైదరాబాద్-500 036.

# మనవి

భగవద్గీతను గురించిన వ్యవహారం మాయింట నా ముందు రెండు తరాల నుంచి కొనసాగుతూ వస్తోంది. మూడోతరం వాడినైన నేను ప్రచురణకర్తగా నైనా గీతతో సంబంధం పెట్టుకో కలిగినందుకు ఆనందంగా వుంది. భగవద్గీతను గురించి మా తాత గురువారెడ్డి నాయనమ్మ రంగమాంబ గారలకున్న అభిమానాన్ని మా నాన్న రంగారెడ్డి గారి ద్వారా తెలుసుకోవటం తప్ప ప్రత్యక్షంగా నేనేమీ యెరగను.

నేను పెరిగి పెద్దవాడినైన దగ్గర నుంచి మా తల్లిదండ్రులు భగవద్గీత యెక్కువ మక్కువ కలిగి వుండటాన్ని ప్రత్యక్షంగా చూస్తూ వస్తున్నాను. మా అమ్మ శ్రీమతి సరోజినీదేవి గీతను యెంతో భక్తి ప్రపత్తులతో వుపాసించేది. ఇక మా తండ్రి రంగారెడ్డిగారు కనిపించిన భగవద్గీతనల్లా కొని తన గదిని నింపేస్తూ వుండటం నేనెరుగుదును. ఆయన గదిలో వందల కొద్దీ వుండే పుస్తకాలలో దాదాపు యెక్కువ భాగం భగవద్గీతలే! చిన్న పెద్ద సైజుల్లో వుండే యే పుస్తకాన్ని ముట్టుకున్నా అది భగవద్గీతే అయుండేది.

ఈ విధంగా మా తండ్రి అనేక మంది వ్యాఖ్యలు చేసిన భగవద్గీతలను యెప్పుడూ పఠిస్తూ వుండేవారు. నా చదువులో నేను నిమగ్నమై వుంటూ అనేక మంది వ్యాఖ్యలు చేసిన భగవద్గీతను ఆయనెంతో శ్రద్ధగా పరిశీలిస్తూ వుండటం నేను గమనిస్తూ వుండేవాణ్ణి. అసలే ఉబ్బసం వ్యాధితో బాధపడుతూవుండే మానాన్నకు యీ నిరంతర గ్రంథపఠనం వల్ల కంటి చూపుకు కూడా తీవ్రమైన ప్రతిబంధకాలేర్పడ్డాయి. ఇన్ని ప్రతిబంధకాలేర్పడినా గతమూడు నాలుగు సంవత్సరాల నుంచి గీతను తానేమి అర్థంచేసుకున్నారో కాగితం కలం తీసుకొని వ్రాయటం మొదలెట్టారు. ఈ వ్రాయటం ఒక్కొక్కసారి తెల్లవారేదాకా కొనసాగుతూ వుండటం ఆయన కళ్లు పూర్తిగా దెబ్బతినటానికి హేతువైంది. వయస్సు మీదపడిన కొద్దీ శరీరం కూడా బలహీనమౌతూవచ్చింది.

మా తాత నాయనమ్మగార్ల పేరుతో యేర్పరచిన శ్రీ బండారు రంగమ్మ గురువారెడ్డి మెమోరియల్ అండ్ చారిటబుల్ పబ్లిక్ ట్రస్ట్ ఆధ్వర్యాన 'గీతా సంహిత' పేరుతో ఇప్పుడు మా తండ్రి రంగారెడ్డి గారి యావజ్జీవిత కృషిని పుస్తకరూపంలో తీసుకొని రావాలని నేను చేసిన ప్రయత్నం కూడా ఒక సాహస యాత్రే అని చెప్పక తప్పదు. మానవాళికి శ్రీకృష్ణ భగవానుడిచ్చిన సందేశాన్ని ఆధ్యాత్మిక వినయసంపన్నులైన ఆంధ్రమహాజనులు అత్యంత ప్రీతితో స్వీకరించే ఆకర్షణ కలిగినదై వుండాలని నేను తీసుకున్న నిర్ణయమే నా సాహసానికి పరీక్షగా నిలచింది. ఎంతో ధనం వ్యయమైంది. ఇదిగో 'గీతా సంహిత' మీ కరకమలాలను అలంకరించింది. ఆమూలాగ్రం దీని పఠనం వల్ల ఆ సర్వేశ్వరుని కృపకు మీరు పాత్రులై మీ యింట పూజా మందిరంలో యీ పవిత్ర గ్రంథం నిరంతరం పూజలందుకోగలదని విశ్వసిస్తు మీ ఆదరణకు కృతజ్ఞతలు తెలియపరచుకుంటున్నాను.

కార్యనిర్వాహక అధ్యక్షుడు

లాల్ బహదూర్ రెడ్డి, BE, MBA

**శ్రీ బండారు రంగమ్మ గురువారెడ్డి మెమోరియల్ అండ్ చారిటబుల్ పబ్లిక్ ట్రస్టు**

జీవిత భాగస్వామిగా
నా జీవన నౌకకు చుక్కాని పట్టి
తీరం చేరక మునుపే
కనుమూసిన
నా అర్థాంగి
**సరోజినీదేవి** స్మృతి చిహ్నంగా

– బి. సిహెచ్. రంగా రెడ్డి





# యోగసూచిక

పడి అహంకార, మమకారాలతో కొట్టుమిట్టాడే మానవ కోటికంతటికీ "పరమాత్మ" చేస్తున్న మహోపదేశంగా భగవద్గీతను గుర్తుంచుకొని అధ్యయనం చేయాలి. భగవద్గీత యొక్క ఆదర్శం ఇదే, అప్పుడే మనం భగవద్గీత లోని పరమ శ్రేయాన్ని పొందగలుగుతాము. భగవద్గీతకు ప్రధాన వక్తలు- శ్రోతలు కృష్ణార్జునులు కాగా, అహంకారం, మమకారాలతో కన్నులు మూసుకుపోయిన ధృతరాష్ట్రుడు ఇక్కడ పృచ్ఛకుడు, అంటే అడిగేవాడు. ఇంద్రియాలను చక్కగా జయించిన జ్ఞాని అయిన సంజయుడు కథకుడు, అంటే చెప్పేవాడు. అంటే భగవద్గీతలో సంజయుడు, ధృతరాష్ట్రుడు అనుషంగిక వక్త- శ్రోతలు.

## ఈ అధ్యాయమందలి ముఖ్య విషయాలు

1. పాండవుల, కౌరవసేనల యందలి ముఖ్య వీరులను గూర్చిన వర్ణన.
   *(1 టి నుండి 11వ శ్లోకం వరకు)*
2. ఉభయ సేనల యొక్క శంఖనాదములు.
   *(12 నుండి 19వ శ్లోకం వరకు)*
3. సేనాని రక్షణమును గురించి అర్జునుని ప్రసంగము.
   *(20 నుండి 27వ శ్లోకం వరకు)*
4. మోహగ్రస్థుడైన అర్జునుని యొక్క విషాదపూరిత వచనములు.
   *(28 నుండి 46వ శ్లోకం వరకు)*

## వెనుకటి చరిత్రతో ఈ అధ్యాయమునకు గల సంబంధము

అప్పటికి మహా భారతయుద్ధం ప్రారంభమై పదిరోజులు గడిచిపోయాయి. మొదటి తొమ్మిదిరోజులలో ఉభయ పక్షాలలోని వీరులలో ఎందరో నేలకొరిగారు. పదోనాటి రణరంగంలో భీష్మపితామహుడు పతనమై యుద్ధభూమిలో అంపశయ్యపై పరుండియున్నాడు.

ఆ విషయాన్ని సంజయుడు హస్తినలో వున్న అంధుడైన ధృతరాష్ట్రమహారాజునకు తెలియజేస్తాడు. భీష్మ పితామహుని పతనానికి ధృతరాష్ట్రుడు పలుపలువిధాల శోకించి ఆ పిదప తేరుకొని యుద్ధం మొదలైనప్పటి నుండి అప్పటివరకు ఏం జరిగిందో ఆ విషయాన్ని వివరించమని సంజయున్ని కోరతాడు. అపుడు సంజయుడు ఇరుపక్షములందలి సైనికులు యుద్ధసన్నద్ధులగుట, కురుక్షేత్ర రణరంగ మధ్య భాగాన గాండీవమును రథం నుండి జారవిడిచి చేష్టలుడిగి, రథంపై కూలబడిన అర్జునునకు శ్రీకృష్ణ భగవానుడు చేసిన జ్ఞానోపదేశం మొదలుగా గల విషయాల నన్నింటిని సంజయుడు ధృతరాష్ట్రునకు వివరంగా తెలియజేస్తాడు. ఆ విధంగా భగవద్గీత సంజయుని ద్వారా శ్రీకృష్ణభగవానుడు చేసిన గీతా బోధన పదిరోజుల తరువాత లోకానికి వెల్లడైంది.

# అవతారిక

కురుక్షేత్రములో జరుగుతున్న మహాభారత యుద్ధమును గూర్చి "ధృతరాష్ట్రుడు" హస్తినలో వుండి సంజయున్ని ఈ విధంగా ప్రశ్నిస్తున్నాడు. దానితోనే భగవద్గీత ముందుగా "ధృతరాష్ట్ర ఉవాచ"అనే శ్లోకంతో ప్రారంభమయింది.

"ధర్మక్షేత్రే కురుక్షేత్రే
సమవేతా యుయుత్సవః
మామకాః పాణ్డవాశ్చైవ
కిమ కుర్వత సంజయ" శ్లో - 1

*సంజయా!*
*ధర్మభూమి అయిన*
*కురుక్షేత్రమందు*
*యుద్ధము చేయకోరిక గలవారై*
*మోహరించిన నాకుమారులైన*
*దుర్యోధనాదులు, పాండురాజ*
*తనయులైన ధర్మరాజాదులు ఏం చేసిరి?*

"గీత" - "ధర్మ" శబ్దంతో ప్రారంభం అయింది. గీతలో వ్యాసమహర్షి "ధర్మము" అనుపదమును మొట్టమొదట ప్రయోగించి గీతకు మంగళాచరణమును గావించిన వాడాయెను. భగవానుడు ధర్మస్వరూపుడై నందున ధర్మశబ్దోచ్ఛారణముచే వ్యాసమహర్షి గీత ఆరంభములో భగవన్నామమునే కీర్తించినట్లయింది. "గీత"యొక్క లక్ష్యం, సారాంశం ఈ మొదటి పదమునందే తేల్చివేయబడింది. ధర్మం అంటే అదియే. అట్టి ధర్మోద్ధరణ కొరకే తానీలోకములో అవసరమైనపుడల్లా ఆవిర్భవిస్తున్నానని గీత 4వ అధ్యాయము -7,8 శ్లోకాలలో

"యదా యదాహి ధర్మస్య
గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య
తదాత్మానం సృజామ్యహమ్"

అర్జునా!
ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానియును
అధర్మమునకు వృద్ధియు కలుగుచుండునో
అలాంటప్పుడల్లా నన్ను నేను సృజించుకొందును

"పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే"

సజ్జనులను రక్షించుట కొరకును
దుర్జనులను శిక్షించుటకును
ధర్మమును నెలకొలుపుటకును
నేను ప్రతి యుగము నందున
అవతరించుచుందును

అని తెలుపుతున్నాడు. "యతో ధర్మస్తతో జయః" అను వేదోక్తిననుసరించి ఎచ్చట ధర్మం వుండునో జయము అచటనే వుంటుంది అని తెలుపబడడానికి ధృతరాష్ట్రుని చేతనే ధర్మశబ్ద పదప్రయోగం చేయించి ధర్మజ్ఞులైన పాండవులకే జయము కలుగుతుందని పరోక్షంగా ఈ శ్లోకంలో చెప్పించినట్లు తెలుసుకొవలసి వుంది.



## కురుక్షేత్రం

కురుక్షేత్రం యొక్క మహిమ గురించి మహాభారతంలోని వనపర్వమందలి 83వ అధ్యాయములోను, శల్య పర్వమందలి 53వ అధ్యాయములోను విపులముగా వివరింపబడింది. ఇది సరస్వతీనదికి ఉత్తరంగాను, దృషద్వతీనదికి దక్షిణంగాను చతురస్రాకారములో వ్యాపించబడియున్న క్షేత్రము.

బ్రహ్మశ్రీ పరాయతం కృష్ణమూర్తిగారిచే వ్యాఖ్యానింపబడి, శ్రీ పబ్బా శంకరయ్యగారిచే శ్రీరామ విద్యున్ముద్రణాలయంలో ముద్రింపబడిన "శ్రీ మద్భగవద్గీతా" అనే గ్రంథంలో 25 యోజనముల వైశాల్యంగల ప్రదేశముగా వర్ణించబడింది.

అయితే "జయ దయాల్ గోయానంద్" వ్యాఖ్యానం చేసిన "శ్రీ మద్భగవద్గీతా తత్వవివేకి"ని అను గ్రంథరూపంలో గోరఖ్‌పూర్-గీతా ప్రెస్ వారు ప్రచురించిన గ్రంథములో "కురుక్షేత్రం" యొక్క వైశ్యాలం 5 యోజనములు అని తెలియజేయబడింది.

కాని శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్యాఖ్యానించిన "మహాభారత చరిత్ర" గ్రంథం 213వ పేజీలో ఈ విధంగా వుంది.

> *మహా భారత యుద్ధమున పదునెనిమిది అక్షౌహిణుల సైన్యం పోరియుండునా? అట్లుండి కురుక్షేత్రం యుద్ధమునకు తగిన చోటుగా వుండెనా?అను ప్రశ్న లున్నవి. పదునెనిమిది అక్షౌహిణుల సైన్యము వున్నదని ఇంచుమించు రాజ పుత్రస్థానపుటెడారి వరకు యుద్ధ రంగమనియు, అందు "వారణావతం- అహిచ్ఛత్రం- పంచనదం- కురు జాంగలం- రోహిత కారణ్యము- కాలకూటము- గంగాకూలము"లలో కౌరవుల సైన్యము పన్నబడి ఇంచుమించుగా 500 మైళ్ల యుద్ధరంగమై యుండెనని తెలియనగును.*

ఆ యుద్ధరంగములో భీష్మద్రోణాదులకు- పాండవుల లోని వారగు శిఖండి- ధృష్టద్యుమ్నాదులు "ఎదురెదురుగా ఒడ్డెనములు తీర్చుచుండిరి.

"సైంధవ వధం"నాడు అన్ని సైన్యములు ఒక్కటిగా కూర్చవలసి వచ్చినపుడు ఏ వైపున జూచినను కౌరవసైన్యములు పదిరెండు (12) యోజనముల స్థలమునాక్రమించినదై యున్నదని వర్ణింపబడి యుండుటచే కురుక్షేత్రంలో పదునెనిమిది అక్షౌహిణులు పోరాడిన వనుటలో విరుద్ధములేదు.

సైంధవుని చంపిన ప్రదేశము "నిషాదప్రదేశము" అని ధృష్టద్యుమ్నుడు చెప్పుట గమనించదగినది. ఇన్ని వందల మైళ్ల ప్రదేశములో నిషాదులుండు ప్రదేశము కూడా యుండియుండును.

కనుకనే డా॥ బోయి భీమన్నగారు "ఇదిగో! ఇదీ భగవద్గీత"- అనే తమ గ్రంథంలో "ఏకలవ్యుడు" కురుక్షేత్ర ప్రాంతములోని వాడు అని వ్రాసి యున్నారు. అంటే కురుక్షేత్ర ప్రాంతంలోని నిషాద ప్రాంతపు రాకుమారుడు అన్నమాట ఏకలవ్యుడు. అంటే ఆటవిక రాజు.

పాండవులు- కౌరవుల వంశానికి మూలపురుషుడైన "కురు మహారాజు" ఆ ప్రదేశమును దున్నినందున దానికి కురుక్షేత్రం అనే పేరు వచ్చింది. ఆ క్షేత్రమందు ఎందరో మహనీయులు ధర్మకార్యములు ఆచరించియున్నందున దానిని "ధర్మక్షేత్రము"గా పేర్కొనడం జరిగింది. ఆ క్షేత్రమునందు ఎవరు తపస్సు చేయుదురో లేక మృతినొందుదురో వారు ఉత్తమలోకాలకు వెళ్లెదరని ప్రతీతి.

పూర్వము అక్కడ బ్రహ్మదేవుడు, ఇంద్రుడు, అగ్ని మొదలగు వారు తపస్సు చేశారు. పరశురాముడు కూడా అచ్చోటనే పితృతర్పణము గావించియున్నాడు.

ఇది ఇపుడొక చిన్న పట్టంగా భారత రాజధానీ నగరమైన ఢిల్లీ పట్టణానికి ఉత్తరంగాను, హర్యానా రాష్ట్రానికి చెందిన జిల్లా కేంద్రమైన అంబాలా పట్టణానికి దక్షిణంగా రూపుదిద్దుకుంది. కురుక్షేత్రం పేరిట ఇక్కడొక విశ్వవిద్యాలయం కూడా నిర్వహించబడుతున్నది.

ఆధ్యాత్మిక వేత్తలైన తత్వజ్ఞులు "కురువు" అను పదానికి ఇంద్రియాలు అని అర్థం చెప్పి ఇంద్రియాలకు చోటైన స్థలము (క్షేత్రము) గనుక ఈ శరీరమే "కురుక్షేత్రం" అని ఈ శరీరంలో ధర్మాచరణము, ధర్మరక్షణ జరుగవలసివున్నది గనుక ఈ శరీరమే "ధర్మక్షేత్రం" అని తెలియజేశారు. ఈ శరీరములోనే ధర్మానికీ, అధర్మానికీ మంచికీ, చెడుకీ, జ్ఞానానికి, అజ్ఞానానికి సాత్విక- అసుర గుణాలకు నిరంతరం సంఘర్షణ (యుద్ధము) జరుగుతూనే యుంటుంది. ఆ యుద్ధము యొక్క పర్యవసానాన్ని తెలుసుకోవడం, అసురవృత్తులను జయించి దైవీవృత్తుల విజయానికై యత్నించడం ఇదే మానవజీవితానికీ, వేదాంతానికీ వున్న సంబంధము. అది జరుగనినాడు వేదాంతమువలన ప్రయోజనమే లేదు. కాబట్టి వేదాంతమనేది ఆకాశపురాణం కాదు, నేల విడిచిన సాము కాదు అని తెలియజేశారు "గీతాదర్శనం" వ్యాఖ్యాత నోరి శ్రీనాథ వేంకటసోమయాజులు గారు.

జాతి పిత మహాత్మా గాంధీ గారిచే వ్యాఖ్యానించబడిన " The Gospel of Selfless Action or The Gita According to Gandhi" అనే గ్రంథంలో కురుక్షేత్రం గురించి ఈ విధంగా వుంది.

The Human body is the battlefield where the eternal duel between right and wrong goes on. Therefore it is capable of being turned in to the gate way of Freedom. It is born in sin and becomes the seed-bed of sin. Hence it is also called the field of "Kuru" the Kauravas represent the forces of evil. The pandvas the forces of Good, who is there that has not experienced the daily conflict with in himself between the forces of evil and the forces of Good.

ఆ ప్రాంతానికి "శమంతక పంచకమ"ని మరొక పేరు కూడా వుంది.



## సంజయుడు

సంజయున్ని గూర్చి వ్యాసాశ్రమ పీఠాధిపతులైన మహర్షి సద్గురు శ్రీశ్రీశ్రీ మళయాళ స్వాములు తమ "భగవద్గీత" అనే గ్రంథ వ్యాఖ్యానములో (పేజి38) ఈ విధంగా తెలియజేస్తున్నారు. ఈ సంజయుడు సూతకులమున బుట్టినవాడు. అబ్రాహ్మణుడు. ఇతని జీవితము "మహాభారత" మందు కనందగును. సంజయుడనగా సర్వేంద్రియాలను లెస్సగా జయించినవాడు. అట్టిసంజయునివలె సర్వేంద్రియ నిగ్రహం గలవారికే గీతార్థము బోధపడును. ఆత్మ సంయమనము గలుగనివారికి పరమార్థ తత్వబోధనము కలగదు. ఆ కాలమున సంజయుని వంటి సంయమనముగలవారు ఎవరును లేనందున శ్రీ వేదవ్యాసమహర్షి కురుక్షేత్రములో జరుగు విషయములనన్నింటిని హస్తినలో వుండి గ్రహించెడి దివ్యదృష్టిని అతనికి అనుగ్రహించెను. ఇవన్నీ భారతమందు కనబడును. దాని వలన సర్వేంద్రియములను జయించిన వారికే పరమాత్మ సాక్షాత్కారము కలుగునని తెలియదగును. సంజయుడు అట్టివాడగుటచే ప్రప్రథమంగా భగవన్ముఖారవిందము నుండి స్వయముగా వినబడిన "గీత"ను గూర్చి ధృతరాష్ట్రునకు చెప్పడమైనది. దీనివలన బ్రాహ్మణేతరులకు కూడా గీతయందధికారము వున్నదా? లేదా? అను సందేహమునకు అవకాశము లేకుండా పోయింది.

భగవద్గీత వ్యాఖ్యాతలు అనేక మంది ధర్మక్షేత్రం-అయిన అట్టి కురుక్షేత్రంలో ప్రవేశించినందు వలన దాని ప్రభావముతో ధృతరాష్ట్రుని తనయులగు దుర్యోధనాదుల చిత్తమందు దయాది సద్గుణములు ఉదయించిగాని, పాండురాజతనయులగు పాండవులలో సహజంగా వున్న అహింసాది సద్గుణములు పెల్లుబికిగాని యుద్ధవిరమణను గూర్చిన సంకల్పములు ఏవైనా ఉదయించి గాని యుద్ధవిరమణ జరిగివుంటుందని భావించి ధృతరాష్ట్రుడు ఆ విధంగా ప్రశ్నించివుండ వచ్చునని వ్యాఖ్యానించారు.

కాని ఇది సరికాదు. మూడో పాదము ఆరంభంలో ధృతరాష్ట్రుడు "మామకః" అంటే "నావారు" అని కౌరవులను గూర్చి ప్రత్యేకించి చెప్పుట వలన పాండవుల యెడల ధృతరాష్ట్రునకు పక్షపాత బుద్ధి కలదని స్పష్టమగుచున్నది.

"భగవద్గీత" వ్యాఖ్యాత శ్రీశిష్ట్లా సుబ్బారావు గారి ఆలోచన ప్రకారము ఇక్కడ ధృతరాష్ట్రుని యొక్క "ధర్మక్షేత్ర పద ప్రయోగం" భావగర్భితం. భీష్మపితామహుడు దేవాసురులకు సైతం అజేయుడు. సంగ్రామ రంగమగు ధర్మక్షేత్ర మగు కురుక్షేత్రము. అట్టి చోట

## సంజయుడు

సంజయున్ని గూర్చి వ్యాసాశ్రమ పీఠాధిపతులైన మహర్షి సద్గురు శ్రీశ్రీశ్రీ మళయాళ స్వాములు తమ "భగవద్గీత" అనే గ్రంథ వ్యాఖ్యానములో (పేజి38) ఈ విధంగా తెలియజేస్తున్నారు. ఈ సంజయుడు సూతకులమున బుట్టినవాడు. అబ్రాహ్మణుడు. ఇతని జీవితము "మహాభారత" మందు కనందగును. సంజయుడనగా సర్వేంద్రియాలను లెస్సగా జయించినవాడు. అట్టిసంజయునివలె సర్వేంద్రియ నిగ్రహం గలవారికే గీతార్థము బోధపడును. ఆత్మ సంయమనము గలుగనివారికి పరమార్ధ తత్వబోధనము కలగదు. ఆ కాలమున సంజయుని వంటి సంయమనముగలవారు ఎవరును లేనందున శ్రీ వేదవ్యాసమహర్షి కురుక్షేత్రములో జరుగు విషయములనన్నింటిని హస్తినలో వుండి గ్రహించెడి దివ్యదృష్టిని అతనికి అనుగ్రహించెను. ఇవన్నీ భారతమందు కనబడును. దాని వలన సర్వేంద్రియములను జయించిన వారికే పరమాత్మ సాక్షాత్కారము కలుగునని తెలియదగును. సంజయుడు అట్టివాడగుటచే ప్రప్రథమంగా భగవన్ముఖారవిందము నుండి స్వయముగా వినబడిన "గీత"ను గూర్చి ధృతరాష్ట్రునకు చెప్పడమైనది. దీనివలన బ్రాహ్మణేతరులకు కూడా గీతయందధికారము వున్నదా? లేదా? అను సందేహమునకు అవకాశము లేకుండా పోయింది.

భగవద్గీత వ్యాఖ్యాతలు అనేక మంది ధర్మక్షేత్రం-అయిన అట్టి కురుక్షేత్రంలో ప్రవేశించినందు వలన దాని ప్రభావముతో ధృతరాష్ట్రుని తనయులగు దుర్యోధనాదుల చిత్తమందు దయాది సద్గుణములు ఉదయించిగాని, పాండురాజతనయులగు పాండవులలో సహజంగా వున్న అహింసాది సద్గుణములు పెల్లుబికిగాని యుద్ధవిరమణను గూర్చిన సంకల్పములు ఏవైనా ఉదయించి గాని యుద్ధవిరమణ జరిగివుంటుందని భావించి ధృతరాష్ట్రుడు ఆ విధంగా ప్రశ్నించివుండ వచ్చునని వ్యాఖ్యానించారు.

కాని ఇది సరికాదు. మూడో పాదము ఆరంభంలో ధృతరాష్ట్రుడు "మామకః" అంటే "నావారు" అని కౌరవులను గూర్చి ప్రత్యేకించి చెప్పుట వలన పాండవుల యెడల ధృతరాష్ట్రునకు పక్షపాత బుద్ధి కలదని స్పష్టమగుచున్నది.

"భగవద్గీత" వ్యాఖ్యాత శ్రీశిష్ట్లా సుబ్బారావు గారి ఆలోచన ప్రకారము ఇక్కడ ధృతరాష్ట్రుని యొక్క "ధర్మక్షేత్ర పద ప్రయోగం" భావగర్భితం. భీష్మపితామహుడు దేవాసురులకు సైతం అజేయుడు. సంగ్రామ రంగమగు ధర్మక్షేత్ర మగు కురుక్షేత్రము. అట్టి చోట భీష్మపితామహుని పతనము ధర్మంగానే జరిగిందా? లేక పాండవులు ఏదైనా అధర్మ వృత్తికి పాలుపడడం వలన జరిగిందా? అనే సందేహం ధృతరాష్ట్రునిలో వచ్చింది. ఆ విషయమును తెలుసుకొనుటకొరకే -

"మామకాః పాండవాశ్చైవ
కిమ కుర్వత సంజయః"

అంటే "నా వారును, పాండురాజు తనయులును ఏం చేసిరి?"అని ప్రశ్నించెను.

ధృతరాష్ట్రుని ప్రశ్నకు సమాధానంగా సంజయుడు ఇట్లు చెప్పుచున్నాడు.

"దృష్ట్వాతు పాండవానీకం
వ్యూఢం దుర్యోధనస్తదా
ఆచార్యముపసంగమ్య
రాజా వచనమబ్రవీత్ ॥ శ్లో -2

" అప్పుడు రాజైన దుర్యోధనుడు
వ్యూహాకారముగ నిర్మింపబడి
యున్న పాండవ సేననుగాంచి
ఆ పిదప గురువగు ద్రోణాచార్యుని
సమీపించిఇట్లు పలికెను"

కురు రాజ్యాధీశుడైన తన తండ్రి ధృతరాష్ట్రమహారాజు తరువాత మహాభారత యుద్ధకాలం నాటికి ప్రభుత్వమునందు సర్వోన్నత స్థానమును అలంకరించియున్నట్టి వాడు దుర్యోధనుడు, అయినపుడు తనకంటే దిగువ స్థానములో వున్న ఒకానొక సేనానాయకుని వద్దకు తానే స్వయముగా వెళ్లవలసిన పని ఏమిటి? ఆదేశిస్తే అతడే రాజైన దుర్యోధనుని వద్దకు వచ్చును గదా? యనే మీ మాంస ఉదయించే అవకాశము ఇక్కడ వుంది. అందుకు కారణాలు ఈ విధంగా వుండవచ్చునంటారు శ్రీకాళహస్తిలోని శుక బ్రహ్మాశ్రమపీఠాధిపతులు "శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాము"లవారు.

1. పాండవుల సైన్యమును, అందునా ముఖ్యంగా భీమాదులను జూచి భయపడిన దుర్యోధనుడు అధైర్యమును పొందియుండవచ్చును.

   (ప్రారంభములోనే రాజు ధైర్యమును కోలుపోవుట అశుభానికి సూచకము)

2. ద్రోణాచార్యుడు సేనానాయకులలో ఒకరై యున్నందున అతనిని ఆస్థానమునుండి కదిలించినచో సైన్యమంతయు చెల్లాచెదురైపోయే అవకాశము కలదు కనుక.

3. ద్రోణాచార్యుడు వయోవృద్ధుడు, జ్ఞానవృద్ధుడు, పైగా గురుస్థానమందున్నట్టివారు, అట్టి వాని యెడల విధేయత చూపడం దుర్యోధనుని యొక్కధర్మము.

4. ఏదోవిధముగ ద్రోణాచార్యుని మంచి చేసుకొని అతనిని తన స్వార్థ సంపాదనమునకు వినియోగించదలంచియుండవచ్చును.

ఈ అన్ని కారణముల వలన దుర్యోధనుడు ద్రోణాచార్యుని తన వద్దకు పిలిపించుకొనక తానే ఆయన వద్దకు వెళ్ళివిన్నవించుకొనెను. వీటిన్నిటికంటే ప్రధానమైన కారణము మరొకటుంది. భీష్ముడు సర్వసైన్యాధ్యక్షుడు అయి వుండగా దుర్యోధనుడు ఆయన వద్దకు వెళ్లక నేరుగా ద్రోణాచార్యుని వద్దకు వెళ్లడంలోని కారణము ద్రోణాచార్యుడు భీష్ముని కంటే అధికుడని కాదు.

ఇక్కడ గమనించాల్సిన అంశము ప్రధానంగా ఒకటుంది. అది వరకు భీష్ముడు తాను పాండవులను మాత్రము చంపననియు, "స్త్రీ"గా జన్మించిన శిఖండిపై శస్త్రాస్త్రములను ప్రయోగించననియు, తదితరులను మాత్రము దునుమాడి దుర్యోధనుని ఋణమును తీర్చుకుంటానని స్పష్టము చేసి వుండెను. ద్రోణాచార్యుడు కూడ పాండవపక్షపాతియే అయినా అతను భీష్మునివలె ఎలాంటి ప్రతిజ్ఞ చేసివుండలేదు. అందువలన పాండవసేనలకు సర్వసైన్యాధ్యక్షుడుగా వుండిన "ధృష్టద్యుమ్నుని" పై కినుక బుట్టించి పాండవ సేనలపై ద్రోణాచార్యుడు విజృంభించుటకు దుర్యోధనుడు ఆ విధంగా ప్రవర్తించాడన్నది సత్యం.

"పశ్యైతాం పాండుపుత్రాణా
మాచార్య మహతీంచమూం
వ్యూఢాంద్రుపదపుత్రేణ
తవ శిష్యేణ ధీమతా" శ్లో-3

"ఆచార్యోత్తమా!
బుద్ధిమంతుడును,ద్రుపదుని కుమారుడును
అగు నీ శిష్యుడు ధృష్టద్యుమ్నునిచే
వ్యూహాకారముగ నిర్మింపబడిన
పాండవుల గొప్ప సైన్యమును చూతము"

వాస్తవానికి ఈ శ్లోకానికి ముందు "దుర్యోధన ఉవాచ" అని వుండాలి. ఎందువల్ల నంటే ఇది దుర్యోధనుడు చెప్పిన శ్లోకము కనుక, కాని అతడు చెప్పినట్లు ఇక్కడ వ్రాయబడియుండలేదు. దుర్యోధనుడు పాపియగుటవలన అతని పేరును పుణ్యశీలులైన గీతాపాఠకులచే ఉచ్చరించకుండా చేయుటకై ఆ విధంగా చేయబడింది అని శుకబ్రహ్మాశ్రమపీఠాధిపతి శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు తమ గీతామకరందం (288పేజిలో) తెలియజేయగా-

వీరి గురువులు వ్యాసాశ్రమ పీఠాధిపతులు మహర్షి మళయాళస్వాములవారు తమ భగవద్గీత వ్యాఖ్యానంలో (పేజి 40) ఇక్కడ "దుర్యోధన ఉవాచ" అని వుండవలసి యుండెను. కాని అటుల కానరాదు, బహుశా పొరపాటైయుండవచ్చును అని తెలియజేశారు.

దుర్యోధనుడు మంచి రాజకీయ చతురత కలిగిన వాడు. తాను రాజై వుండి కూడా కార్యసాధన నిమిత్తము తానే తగ్గి ఒకానొక సేనానాయకుడుగా వున్న ద్రోణాచార్యునితో మాట్లాడటమే గాక విపక్షము వారిపై అతనికి రోషమును తెప్పించుటకై "ద్రుపదుని కుమారుడును, మీ శిష్యుడు అయిన ధృష్టద్యుమ్నుడు పాండవసేనలను వ్యూహాకారములో చక్కగా తీర్చిదిద్దెను" అని పలకడంతో ద్రోణాచార్యునకు- ద్రుపదునకు గల పూర్వపు వైరమును జ్ఞప్తికి తేవడమేగాకుండా ఇంకను మీకు శిష్యుడుగా ధృష్టద్యుమ్నుడే విపక్షమునకు నాయకుడై గురువులైన మీ పైననే కత్తి కట్టినాడని తెలిపి ద్రోణాచార్యునిలో తీవ్రమైన రోషమును జనింపజేయుటకు ప్రయత్నించాడు. ఎదుటి పక్షమును, దాని నాయకున్ని గొప్పగా అభివర్ణించడం ద్వారా స్వపక్ష నాయకుడైన ద్రోణాచార్యునిలో ప్రతీకార భావమును వృద్ధి నొందించుటయే దుర్యోధనుని ప్రధాన ఆశయము.

ధృష్టద్యుమ్నుని "ధీమంతుడు" - అంటే బుద్ధిమంతుడు అని దుర్యోధనుడు పేర్కొని యుండుట చేత అతను వ్యూహరచనలో గొప్ప నేర్పరియని తేలుతున్నది. ఆ కారణంగానే ఆయన్ను పాండవులు తమ సర్వ సైన్యాధ్యక్షునిగా ఎన్నుకొనిరి. ద్రుపదుడు, ద్రోణాచార్యుడు ఇద్దరు చిన్ననాటి స్నేహితులు. అయితే ఒకానొక సందర్భంలో ద్రోణుడు- ద్రుపదునిచే పరాభవింపబడ్డాడు. కనుక ద్రోణాచార్యుడు గురుదక్షిణ రూపంలో అర్జునుని ద్వారా ద్రుపదునిపై కసి తీర్చుకొని అతని రాజ్యంలో కొంత భాగాన్ని స్వాధీనం చేసుకుంటాడు. ఆ కారణంగా ద్రుపదుడు ద్రోణాచార్యుని వధించగల పుత్రునికై పుత్రకామేష్టి చేశాడు. ఫలితంగా ధృష్టద్యుమ్నుడు జన్మించాడు. ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుని వధించడానికై జన్మించినవాడేనని తెలిసినా

ద్రోణాచార్యుడు అతనికి ధనుర్వేదవిద్యను సంపూర్ణంగా బోధిస్తాడు. అందువల్లనే ధృష్టద్యుమ్నునకు ద్రోణాచార్యుడు గురువు. కనుకనే ఈ శ్లోకములో బుద్ధిమంతుడైన మీ శిష్యుడు ధృష్టద్యుమ్నుడు అనే సమాసాన్ని దుర్యోధనుడు ద్రోణాచార్యున్ని ఉద్దేశించి ప్రయోగించాడు.

ఇన్ని కారణాలను పురస్కరించుకొని అటు పాండవులపై, ఇటు ధృష్టద్యుమ్నునిపై ద్రోణాచార్యునిలో కినుకను పొడమింపజేసి దుర్యోధనుడు తన కార్యాన్ని సాధించదలచాడు.

"అత్ర శూరా మహేష్వాసా
భీమార్జున సమా యుధి
యుయుధానో విరాటశ్చ
ద్రుపదశ్చ మహారథః" శ్లో - 4

"ధృష్టకేతు శ్చేకితానః
కాశీరాజశ్చ వీర్యవాన్
పురుజిత్కుంతి భోజశ్చ
శైబ్యశ్చ నరపుంగవః" శ్లో - 5

"యుధామన్యుశ్చ విక్రాంతః
ఉత్తమౌజాశ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయాశ్చ
సర్వ ఏవ మహారథాః" శ్లో - 6

"ఈ పాండవ సేనయందు
మహాశూరులు, గొప్ప
విలు కాండ్రును, భీమార్జునులతో
సమానులైన వారలుగలరు, వారిలో
సాత్యకి, విరటుడు, మహారథుడగు
ద్రుపదమహారాజును "

"ఇంకను ధృష్టకేతువు
చేకితానుడు, బలాఢ్యుడైన
కాశీరాజు, కుంతి భోజుడు
మానవులలో శ్రేష్ఠుడగు శైభ్యుడును""

"వారే కాకుండ పరాక్రమ వంతుడైన
యుధామన్యుడును, అతి బలవంతుడగు
అభిమన్యుడును, ద్రౌపదీ కుమారులైన
ఉపపాండవులు ప్రతి వింధ్యాదులును వున్నారు"

పై దెలిపిన వీరులందరు భీమార్జునులతో సమానమైన వారని స్వయంగా దుర్యోధనుడే తెలిపినందున వారిరువురు శూరాగ్రేసరులని స్పష్టపడుతున్నది. ఆదినుండి దుర్యోధనునకు భయోత్పాతములను కలిగిస్తున్న వారు భీమార్జునులే.

ఇక్కడ ముఖ్యంగా మరొక అంశం గమనించ వలసి వుంది. నిజానికి ముందుగా దుర్యోధనుడు తన పక్షములోని వీరుల యొక్క శౌర్య ప్రతాపాలను గురించి తెలియజేయక విపక్ష వీరులను గూర్చి తెలియ జేయడానికి ఇవి కారణములై వుండవచ్చు.

1. ద్రోణాచార్యునకు శత్రుసైన్యముపై రోషము కల్పింపజూచుట. 2. తన స్వంత సైన్యం విషయములో అతనికి ధైర్యము తగ్గియుండుట లేదా తన సైన్యముకంటే విపక్ష సైన్యమే బలవత్తరమైనదని భావించియుండడం వలన దుర్యోధనుడు ఆ విధంగా చెప్పియుండవచ్చును.

**మహారథుడు** : అంటే పదివేల ధనుర్ధరులగు యోధులతో ఒంటరిగా యుద్ధము చేయువాడు. యుద్ధశాస్త్రమునందును, ఆయుధ శాస్త్రమునందును ప్రవీణుడైన శూరుణ్ణి "మహారథుడు" అని అనడం జరుగుతూ వచ్చింది.

**యుయుధానుడు** : అంటే సాత్యకికి గల ఇంకొక పేరు. ఇతను అర్జునునకు ముఖ్య అనుచరుడు. మహాభారతం - ఉద్యోగ పర్వం 81వ అధ్యాయంలో ఈ విషయము వివరించబడింది.

యాదవ ప్రముఖులలో ఒకరైన "శిని" కుమారుడు ఇతడు. మహాభారతం ద్రోణ పర్వం 114వ అధ్యాయంలో ఈ విషయము తెలుపబడింది. ఇతడుఎల్లప్పుడు శ్రీ కృష్ణ భగవానుణ్ణి అంటి పెట్టుకొనియుండే అతిరథుడు.

మహాభారతయుద్ధములో బ్రతికిబయటపడిన బహుకొద్దిమందిలో ఇతడొకడు. యాదవుల మధ్య జరిగిన అంతర్యుద్ధంలో ఇతడు మరణించాడు.

**విరటుడు** : మత్స్య దేశము నేలిన ప్రభువులలో "విరటుడు" ప్రముఖుడు. ఆయన కొలువులోనే పాండవులు ఒక సంవత్సరంపాటు అజ్ఞాతంగా కాలంగడిపారు. ఈ విరటుని కుమార్తె అయిన "ఉత్తర"ను అర్జున కుమారుడైన అభిమన్యునకిచ్చి వివాహం చేశారు.

ఈ విరాటు రాజు కుమారులు ముగ్గురు, వారు (1) ఉత్తరుడు (2) శ్వేతుడు (3) సనకుడు, వీరందరు భారత యుద్ధములో మరణించారు.

**ద్రుపదుడు** : పాంచాల దేశపు రాజు. పాండవుల ధర్మపత్ని తండ్రి, కనుక పాండవులకు ద్రుపదుడు మామ

**ధృష్టకేతువు**: ఇతడు ఛేదిదేశపు రాజైన శిశుపాలుని కుమారుడు. మహాభారతయుద్ధంలో ఇతడు ద్రోణునిచే వధింపబడ్డాడు. ఈ విషయం మహాభారతం ద్రోణపర్వం 125వ అధ్యాయంలో వుంది.

**చేకితానుడు** : ఇతను యాదవకుల వీరులలో వృష్ణీవంశీయుడు. గొప్ప పరాక్రమవంతుడు, పాండవ సేనలలోని ఏడు అక్షౌహిణులలో ఒక అక్షౌహిణికి సేనానాయకుడు. మహాభారతయుద్ధంలో ఇతడు దుర్యోధనునిచే చంపబడ్డాడు.

**కాశీరాజు** : ఇతను గొప్ప పరాక్రమశాలి, మహారథుడు. ఈతన్ని గూర్చి పేరు ప్రస్తావన ఎక్కడా లేదు కాని మహాభారతం ఉద్యోగ పర్వంలో ఈతన్ని గూర్చి "సేనాబిందు" - "క్రోధ హంత" అను పేర్లు వ్రాయబడ్డాయి. అయితే ఈతడు మరణము పొందిన కర్ణపర్వంలో ఇతని పేరు "అభిభవు" అని తెలుపబడింది.

**పురుజిత్తు- కుంతి భోజుడు** : ఈ ఇరువురు పాండవుల తల్లి అయిన కుంతీదేవికి సోదరులు. కనుక కుంతీదేవి కుమారులైన ధర్మ, భీమ, అర్జునులకు వీరు మేనమామలు. మహా భారతయుద్ధంలో ఈ ఇరువురు ద్రోణునిచే వధింపబడినట్లు తెలియజేయబడింది.

**శైభ్యుడు** : ఇతడు ధర్మరాజునకు మామ. ఈతని కూతురు "దేవిక"తో ధర్మరాజునకు వివాహము జరిగింది. ఆదిపర్వం 95వ అధ్యాయములో ఈ విషయమును చూడవచ్చును. శైభ్యుడు కేవలము ఒక గొప్ప యుద్ధవీరుడే కాదు. మహోన్నతాశయాలు కల నీతివంతమైన ప్రతిభాశాలి. అందువలననే ఈయనను మానవులలో శ్రేష్ఠుడు అని అభివర్ణింపబడింది.

**యుధామన్యుడు- ఉత్తమౌజుడు** : పాంచాల రాజ్యంలో అంతర్భాగంగా వున్న ఒక ప్రాంతానికి ఈ ఇరువురు సోదరులు సామంతరాజులు. మహా భారతము ద్రోణపర్వములో వీరిని గురించి తెలియజేయబడింది మహాభారత యుద్ధ సమయంలో ఈ ఇరువురు సోదరులు పాండవమధ్యముడైన అర్జునుని రథచక్రాలకు రక్షకులుగా వుండినట్లు తెలుపబడింది. ఈ విషయము గూర్చి భీష్మపర్వంలో వివరించబడింది. వీరిరువురు మహాయోధులు, వీరివురు నిదురించుచున్న సమయములో అర్ధరాత్రి వేళ ద్రోణాచార్యుని కుమారుడైన అశ్వత్థామ యుద్ధనీతిని తృణీకరించి సంహరించాడు.

**అభిమన్యుడు** : సుభద్ర - అర్జునుల తనయుడు. సుభద్ర శ్రీకృష్ణుని సోదరి, అందువలన కృష్ణుడు ఈయనకు మేనమామ. అభిమన్యుడు విరాటరాజు కుమార్తె అయిన ఉత్తరను వివాహమాడాడు. తండ్రి అర్జునుని వద్ద ధనుర్వేదాన్ని అభ్యసించాడు.

మహాభారతయుద్ధంలో ప్రధాన యుద్ధంగా పరిగణింపబడిన ఒకనాటి యుద్ధానికి ద్రోణాచార్యుడు చక్రవ్యూహాన్ని- (పద్మవ్యూహం) నిర్మించాడు, ఆ వ్యూహంలో ప్రవేశించుటకు ఆ సమయానికి అక్కడవున్న పాండవ వీరులలోని యుధిష్ఠరునికిగాని- భీమునకు గాని, నకుల, సహదేవులకుగాని, విరాట, ద్రుపదమహారాజులకుగాని ప్రవేశించగల శక్తి లేదు. అదే సమయానికి అర్జునుడు మరోచోట యుద్ధంలో నిమగ్నమైయున్నాడు. ఆస్థితిలో అభిమన్యునకు ఒక్కనికి మాత్రమే చక్రవ్యూహం - (పద్మవ్యూహం)లో ప్రవేశించగల శక్తి వుంది. వ్యూహాన్ని ఛేదించి యుద్ధం చేయుటకై అందులో ప్రవేశించాడు. ఆయన్ను వెంబడించడానికి సైంధవుని కారణంగా పాండవ వీరులలో ఎవ్వరికీ అవకాశము కలుగలేదు. ఒంటరిగానే అభిమన్యుడు వ్యూహంలోని ఎందరో కౌరవవీరులను అప్పటికే హతం చేశాడు. కాని ద్రోణుడు-కృపాచార్యుడు- కర్ణుడు- అశ్వత్థామ- కృతవర్మ మొదలుగా గల కౌరవవీరులందరూ ఒక్కుమ్మడిగా యుద్ధనీతిని అతిక్రమించి ఒంటరివాడైన అభిమన్యునిపై దాడి చేసారు. అయినను వారందరిని ఒంటరిగానే ఎదిరించగలిగాడు. కాని చివరకు దుశ్శాసనుని కుమారుడు దొంగచాటుగా అభిమన్యునిపై వేసిని వేటుకు అభిమన్యుడు మరణించాడు. మహాభారతం ద్రోణపర్వంలో ఈ విషయం స్పష్టీకరించబడింది.

**పరీక్షిత్తు** : ఉత్తర అభిమన్యుల కుమారుడు. మహారాజు.

**ద్రౌపదీదేవి కుమారులు ఉపపాండవులు** : వీరు (1) ప్రతివింధ్యుడు (2) శ్రుతసోముడు (3)శ్రుతవర్మ (4) శతానిక (5) శ్రుతసేన. వీరి గురించి ఆదిపర్వంలో వివరించబడింది. వీరందరిని ద్రోణాచార్యుని కుమారుడైన అశ్వత్థామ యుద్ధనీతికి విరుద్ధంగా అర్ధరాత్రి వేళ నిదురించుచున్న సమయంలో వధించాడు.

దుర్యోధనుడు ద్రోణాచార్యునకు పాండవ పక్షములోని ప్రధానవీరులందరిని గూర్చి పేరు పేరున తెలియజేసి అటు పిమ్మట తన పక్షంలోని యోధుల గూర్చి వివరించడానికి క్రింది శ్లోకాలలో ప్రయత్నిస్తున్నాడు.

"అస్మాకం తు విశిష్టా యే
తాన్నిబోధ ద్విజోత్తమ!
నాయకామమ సైన్యస్య
సంజ్ఞార్థం తాన్బ్రవీమితే" శ్లో -7

*ఓ ద్విజోత్తమా!*
*ఇక మనవారిలో శ్రేష్ఠులైన*
*వారలెవరెవరో వారిని గూర్చి*
*మీకు గుర్తుచేయుచున్నాను. ఆలకించండి.*

పాండవుల పక్షములోనె గాక తమ పక్షములో గూడా రణరంగమునందు ఆరితేరిన ప్రముఖులైన వీరులున్నారని ద్రోణాచార్యునకు తెలియజేస్తూ అందులోని కొందరు ప్రముఖులను గూర్చి ఆలకించమంటున్నాడు దుర్యోధనుడు.

"భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ
కృపశ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణశ్చ
సౌమదత్తిర్జయద్రథః" శ్లో -8

"అన్యేచ బహవశ్శూరా
మదర్థేత్యక్త జీవితాః
నానా శస్త్ర ప్రహరణాః
సర్వేయుద్ధ విశారదాః" శ్లో - 9

*మీరు (ద్రోణాచార్యుడు)*
*పితామహుడగు భీష్ముడు*
*కర్ణుడును, కృపాచార్యుడును*
*అశ్వత్థామయు, వికర్ణుడును*

భూరిశ్రవుడును-
ఇంకను నానిమిత్తము
తమ ప్రాణములను సైతము
ధారబోయునట్టి అనేకమంది
శూరాగ్రేసరులు వివిధ
శస్త్రాస్త్రములను ధరించి
యుద్ధము చేయుటకు సంసిద్ధులైవున్నారు

**ద్రోణుడు** : - భరద్వాజ మహర్షి కుమారుడు, తండ్రి భరద్వాజునివద్దనే వేదాధ్యయనాది విద్యలను నేర్చుకొనెను. ధనుర్వేదమును కూడా అభ్యసించి "అగ్నివేశుడు" అనుమునివద్ద ఆగ్నేయాది దివ్యాస్త్రములను సంపాదించెను. ద్రుపదుడు ఈతని చిన్ననాటి చెలిమికాడు. వీరిరువురు సహాధ్యాయులు కూడా.

సంతానము కొరకై "కృపుని"సోదరి అయిన "కృపి"ని వివాహమాడెను. ఆమెవలన ఈయనకు అశ్వత్థామయను కుమారుడు జన్మించెను. తదుపరి తన కుమారుని పాలకొరకై ధనార్జన నిమిత్తము పరశురాముని వద్దకేగెను. కాని ద్రోణుడు పరశు రాముని వద్దకు వెళ్లేసరికి అతడు తన వద్దవున్న ధనమంతయును పంచిపెట్టివైచి యుండెను. అప్పటికి ఆయన వద్ద శస్త్రాస్త్రములు తప్ప ఇంక ఏమియును మిగిలి లేవు. ద్రోణుడు ఆ శస్త్రాస్త్రములనే పరశురాముని వద్ద నుండి గ్రహించి వాటి ప్రయోగ, ఉపసంహరణాది అంశములను గూడా గ్రహించి వెనక్కు మరలి వచ్చెను.

తాను కోరిన ధనము తనకు పరశురామునివద్ద దొరకని కారణంగా తన చిన్ననాటి చెలికాడగు ద్రుపదమహారాజు కడకేగి తన రాకను దూతలతో ఆయనకు ఎరిగించెను. అపుడు ద్రుపద మహారాజు తాను ద్రోణుని ఎరుగననియు అయినా మహారాజులకు పేదవారైన విప్రులతో మైత్రి ఎట్లుండును? అని ప్రశ్నించి కసిరికొట్టి పంపెను. ఆ స్థితిలో ద్రోణుడు విచారగ్రస్థుడై హస్తినకువెళ్లి భార్యాపుత్రులతో తన భార్య కృపి సోదరుడు కృపుని ఆశ్రయంలో వుండసాగెను.

తదుపరి భీష్ముని కోరికపై ధృతరాష్ట్రపుత్రులగు దుర్యోధనాదులకు, పాండురాజు తనయులైన ధర్మరాజాదులకు ధనుర్వేదమును అభ్యసింపజేయ సాగాడు. ధనుర్విద్యను నేర్పుతున్న సమయంలో "మీలో నా కోర్కె తీర్చగలవారెవ్వరు?" అని శిష్యులను ప్రశ్నించెను. వెంటనే అర్జునుడు ముందుకు వచ్చెను. అందువలన ద్రోణునకు అర్జునుని యందు అధికప్రేమ. ఆ కారణంగా అర్జునునకు ద్రోణుడు ద్వంద్వ సంకీర్ణయుద్ధముల తీరు తెన్నును, వ్యూహముల భేదనోపాయములను విరివిగ నేర్పెను.

కొంతకాలము తరువాత తన గురు కట్నముగ తన చిన్ననాటి చెలికాడైన ద్రుపదమహారాజును పట్టితెండని శిష్యులకు జెప్పెను. ఆ పనిని అర్జునుడు సాధించాడు. ప్రాణాలతో ద్రుపదుని తెచ్చి ద్రోణుని ముందుంచాడు. అపుడు ద్రుపదుని చూచి ద్రోణుడు పరిహాసమాడి అతని రాజ్యంలో సగభాగం ఉత్తర పాంచాలమును తాను గ్రహించి దక్షిణ పాంచాలమును ద్రుపదునకు తిరిగి ఇచ్చివేసెను. అర్జునునిపట్ల సంతసమొందిన ద్రోణుడు ఆతనికి "బ్రహ్మశిరము" అనే అస్త్ర ప్రయోగమును కూడ నేర్పి అర్జునుణ్ణి తనతో సమానునిగా జేసెను. అయితే ఆ అస్త్రంతో తనతో మాత్రం యుద్ధం చేయవద్దని కోరెను. ద్రుపదుడు మాత్రము ఈతనిపై రోషం కలిగియుండెను. ద్రోణుని సంహరింపగల కుమారునికై పుత్రకామేష్టి చేసెను. దాని నుండి "ధృష్టద్యుమ్నుడు" అను కుమారుడు కలిగెను.

ధృష్టద్యుమ్నుడు తనను చంపడానికై జనించినవాడేనని తెలిసి కూడా ఆతనికి ద్రోణుడు ధనుర్విద్యాది విద్యలన్నింటిని బోధించెను. అందువల్లనే ధృష్టద్యుమ్నునిపై ద్రోణాచార్యునకు ద్వేషము పుట్టించే ఉద్దేశంతో ఈ అధ్యాయంలో పాండవసేననుద్దేశించి దుర్యోధనుడు ప్రసంగిస్తూ - మూడవ శ్లోకంలో

"వ్యూఢాం ద్రుపదపుత్రేణ

తవ శిష్యేణ ధీమతా"

అంటాడు. అంటే "ద్రుపదుని కుమారుడైన బుద్ధిమంతుడగు మీ శిష్యుడు ధృష్టద్యుమ్నునిచే వ్యూహాకారంలో నిర్మింపబడిన"అని తెలియజేస్తాడు.

మహాభారతయుద్ధంలో ద్రోణాచార్యుడు ప్రప్రథమంగా ధృష్టద్యుమ్నుని పై తలపడడం జరిగింది. పిమ్మట పాండవసైన్యంలోని కొందరిని నేల కొరిగింపజేసి ఆ పిమ్మట భీముని కుమారుడగు ఘటోత్కచుని పై తలపడెను.

భీష్ముడు పదోనాడు శరతల్పగతుడైన పిమ్మట ఆయన స్థానములో కౌరవ సేనలకు సర్వసైన్యాధ్యక్షుడుగా వ్యవహరించాడు. పాండవ పక్షమున పోరుసలిపిన విరాట- ద్రుపదమహారాజులను ద్రోణుడు సంహరించెను. అటు పిమ్మట అర్జునునకు - ద్రోణునకు ద్వంద్వయుద్ధము జరిగింది. అశ్వత్థామ మృతుడైనట్లు ద్రోణుని చెవినబడితేనే గాని ఆతన్ని ఓడించడం కష్టమని శ్రీకృష్ణుడు గ్రహించాడు. అందువల్ల యుద్ధంలో అశ్వత్థామ చనిపోయాడని భీముని చేత పలికించగా ఆ మాటలు వినడంతోనే ద్రోణుడు హతాశుడయ్యాడు. అయినా ఇది ఎంతవరకు నిజమో తెలుసుకోగోరి ధృష్టద్యుమ్నునిపై బాణము వేసి తన కుమారుని విషయమై ధర్మరాజును ప్రశ్నించెను. అపుడు ధర్మరాజు అశ్వత్థామ చచ్చెనని- అయితే అది ఆ పేరు గల ఏనుగు అని నెమ్మదిగా చెప్పెను.

అశ్వత్థామ అనే "ఏనుగు" అనుపదము వినబడకుండ పెద్దశబ్దములతో వాయిద్యములు వాయించబడెను.. అపుడు ద్రోణుడు నిజముగ తన సుతుడే చనిపోయెనని భావించి అస్త్రసన్యాసము చేసి యుద్ధకార్యమంతయును దుర్యోధనునకు, కృపాచార్యునకు అప్ప జెప్పి యోగముద్రలోకి వెళ్లెను.

ఆ స్థితిలో ధృష్టద్యుమ్నుడు పాదచారియై ద్రోణాచార్యుని రథం వద్దకు వెళ్లి ఆయన్ను వధించినట్లు మహాభారతం తెలుపుతున్నది.

**భీష్ముడు** : భీష్ముడు శంతన మహారాజు పెద్దకుమారుడు ఈయన తల్లి గంగాదేవి. ఈయన తొమ్మిదో వసువు యొక్క అవతారం, మహాభారతము శాంతిపర్వములో ఈవిషయం తెలుపబడింది. ఈయన అసలు పేరు "దేవవ్రతుడు". వసిష్ఠ మహాముని వద్ద సకల వేదములను, శాస్త్రములను అభ్యసించెను. అస్త్రవిద్యయందు పరశురామునకు సముడు. ఆత్మ విజ్ఞానములో సనత్కుమారులను పోలిన వాడు. శాస్త్రములయందు బృహస్పతిని అనుసరించి నడిచెడివాడు. శంతన మహారాజు ఈయనకు "యౌవరాజ్యపట్టాభిషేకము"గావించెను.

దాశరాజు పెంపుడుకూతురు "సత్యవతి"తో తన తండ్రికి వివాహము జరిపించుటకై తాను వివాహాన్ని విసర్జించి బ్రహ్మచర్య వ్రతము బూని, రాజ్యాధికారము వీడి, భీష్మ ప్రతిజ్ఞ చేసి నందున అంతవరకు దేవవ్రతుడుగా వున్న ఆయన పేరు "భీష్ముడు"గా మారిపోయెను. తనకొరకు అంతటి మహత్తర త్యాగము చేసిన తనకుమారుడు " భీష్ముడు" స్వచ్ఛంద మరణం పొందునట్లు శంతన మహారాజు వరమిచ్చెను.

భీష్ముడు పూర్తిగా కృష్ణతత్వము నెరిగినవాడు, కృష్ణభగవానుని పట్ల భక్తి ప్రపత్తులతో సంచరించెడివాడు. మహాభారతయుద్ధంలో ఆయనకు సరితూగే వీరుడు మరొకడు లేడు. అయితే ఆ యుద్ధంలో పాండవులను మాత్రము తాను చంపబోననీ, పాండవ సైన్యాలను యుద్ధములో రోజుకు పదివేలమంది చొప్పన నేలకూల్చెదనని తెలియజేసియున్నాడు. మహాభారతం ఉద్యోగ పర్వంలో ఈ విషయం వుంది. కౌరవుల సర్వసైన్యాధ్యక్షుడిగా పదిరోజుల పాటు పాండవ సేనలతో భయంకర యుద్ధము చేసిన మహావీరుడు భీష్ముడు. పదోరోజు నేలకూలాక అంపశయ్యపై నుండి స్వచ్ఛందమరణము పొందేంతవరకు కూడా ధర్మరాజుకు అపార జ్ఞానబోధచేశాడు. సూర్యుడు మకర రాశిలో ప్రవేశించగానే భీష్ముడు తన తుదిశ్వాసను వీడి ఇహలోక యాత్రను చాలించాడు.

**కర్ణుడు** : పాండవుల తల్లి అయిన కుంతీదేవికి ఆమె కన్యగావున్నపుడు "సూర్యుని" ద్వారా జన్మించినవాడు కర్ణుడు. లోకాపవాదుకు వెరచి అతన్ని ఒక పెట్టెలో పెట్టి సమీపములోని నదిలో ఆ పెట్టెను జారవిడిచింది కుంతి. అదృష్టవశాత్తు అతను చావలేదు. నీటి ప్రవాహంలో

కొట్టుకు పోతూ హస్తిన సమీపానికి చేరింది. ఆ పెట్టెను అతిరథుడు అనే సూతుడు అందుకొని అందులో బాలుడు వుండుట గ్రహించి ఇంటికి తీసుకువెళ్లి స్వంతకుమారుని వలె పెంచసాగాడు. సహజమైన బంగారు కవచకుండలములతో కర్ణుడు జన్మించి యున్నందున అతనికి "వసుసేనుడు" అని నామకరణము చేశారు. సూతుని భార్య రాధచే పెంచబడినందున ఆయన్ను రాధేయుడు అని కూడా పిలచెదరు. కర్ణుడు ద్రోణాచార్యునివద్ద ధనుర్వేదమును అభ్యసించాడు. ఆ పిదప పరశురాముని వద్దగూడా కొంతకాలము అస్త్ర, శస్త్రవిద్యను అభ్యసించాడు. గొప్ప యుద్ధవీరుడుగా వెలుగొందాడు. యుద్ధశాస్త్రములో అర్జునునకు సమమైనవాడు. అస్త్ర విద్యాప్రదర్శన సమయంలో ఈతనికి దుర్యోధనుడు అంగరాజ్య పట్టాభిషేకము గావించినట్లు మహాభారతంలో తెలుపబడింది. ( అప్పట్లో ఈ అంగరాజ్యం ప్రస్థుత బీహారు రాష్ట్రంలో అంతర్భాగంగావున్న భాగల్పూరు అని తెలుస్తున్నది) కాని మహాభారత చరిత్ర విమర్శకులైన శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మాత్రం అప్పటికి కనీసం యువరాజు కూడా కాని దుర్యోధనుడు కర్ణునకు అంగరాజ్యం ఇవ్వడం సంభవమా? అని ప్రశ్నించాడు! తమ మహాభారత చరిత్రలో పైగాఅతిరథునికి (కర్ణుని పెంపుడు తండ్రికి) వంశపారంపర్యంగా లభించినటువంటిది అంగరాజ్యం కనుక కర్ణుడు సహజంగానే అంగరాజ్యాధీశుడు అని తెలియజేశారు.

కర్ణుడు ఎల్లప్పుడు దుర్యోధనుని సంక్షేమమును గూర్చి ఆలోచించేవాడే. కురుక్షేత్రయుద్ధం ఆరంభంకావడానికి ముందు తల్లి అయిన కుంతీదేవి, ఆ పిమ్మట శ్రీకృష్ణభగవానుడు స్వయంగా కర్ణుని వద్దకు వెళ్లి కౌరవపక్షాన్ని వీడి పాండవ పక్షములో చేరమని కోరినపుడు వారి కోరికలను కర్ణుడు సవినయంగా తిరస్కరించాడు. అతను చేసిన దానధర్మాలు వర్ణించవీలుకానివి. నిరంతరం సూర్య భగవానుణ్ణి ఆరాధించే మహనీయుడు. అర్జునుని విజయాన్ని కాంక్షించిన ఇంద్రుడు బ్రాహ్మణ వేషంలో కర్ణుని వద్దకు వెళ్లి అతని కవచకుండలాలను అర్థిస్తాడు. సంతోషంగా వాటిని ఇంద్రునకు అర్పిస్తాడు కర్ణుడు. అర్పించడమంటే మామూలుగా అర్పించడం కాదు. సహజంగా తన చెవులకు అతుక్కుపోయివున్న ఆ కుండలాలనువిడదీయాలంటే కర్ణుడు తన చెవులను కోసి కవచకుండలాలను ఇంద్రునకు అర్పించాడు. అంతటి త్యాగశీలి కర్ణుడు. అందుకనే ఆయనకు దాన-వీర-శూర కర్ణుడుగా లోకంలో పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. ప్రత్యుపకారంగా కర్ణునకు ఇంద్రుడు ఒక మహాస్త్రమును ప్రసాదించాడు. మహాభారత యుద్ధంలో ఆ అస్త్రంతోనే కర్ణుడు భీమసేనుని కుమారుడు అయిన ఘటోత్కచుణ్ణి చంపింది.

దుర్యోధనుడు మరణించాక కౌరవ సైన్యాలకు రెండురోజుల పాటు సర్వసైన్యాధ్యక్షునిగా పనిచేశాడు. తదుపరి అర్జునుని చేతిలో మహాభారతయుద్ధమందు మరణించాడు.

**కృపాచార్యుడు :** కృపాచార్యుడు గౌతమమహర్షి వంశానికిచెందిన శరద్వంద మహాముని కుమారుడు. తండ్రి వద్దనే ధనుర్వేదమును అభ్యసించెను. యుద్ధశాస్త్రములో నిపుణుడు. ఈయనకు "కృపి" అనే సోదరి వుంది. వేదాల్లో మహాపండితుడు. ద్రోణాచార్యుడు దుర్యోధనాదులకు, పాండవులకు గురువు కాకమునుపు వారికి కృపాచార్యుడే సకల విద్యలను అభ్యసింపజేసెను. మహాభారతయుద్ధములో కౌరవులందరూ చనిపోయినా ఆయన జీవించి వున్నాడు. తదుపరికాలంలో పరీక్షన్మహారాజుకు యుద్ధవిద్యలను, ధనుర్వేదాన్ని నేర్పింది కృపాచార్యుల వారే. శత్రువులను ఎదుర్కొని వారిని జయించడంలో ఆయనకు ఆయనే సాటి. అందువల్ల ఆయన్ను "సమితంజయుడు" అని పిలువడం జరిగింది. ఆయన ఇంకను జీవించి వున్నట్లే చెప్పబడుతుంది, అంటే చిరంజీవి అన్నమాట.

**అశ్వత్థామ :** ఆచార్యద్రోణుని కుమారుడు, యుద్ధశాస్త్రంలో గొప్ప నిపుణుడు, వీరుడు, యోధుడు. మహారథులలో ఒకడుగా లెక్కించబడ్డాడు. తండ్రివద్ద ధనుర్వేదాన్ని అభ్యసించాడు. యుద్ధనీతిని అతిక్రమించి అర్ధరాత్రివేళ నిదురించుచున్న ఉపపాండవులను సంహరించినవాడు. ఇతడు కూడా ఇంకను జీవించి వున్నట్లే (చిరంజీవి) చెప్పబడుతున్నది.

**వికర్ణుడు :** వికర్ణుడు ధృతరాష్ట్రుని నూర్గురు కుమారులలో ఒకడు. గొప్ప ప్రతిభాశాలే గాక మహారథుల్లో ఒకడుగా లెక్కించబడిన వాడు.

రాజసభలో తనసోదరులు పాండవుల ధర్మపత్ని ద్రౌపదీదేవిని అవమానించినపుడు వారి దుశ్చర్యలను సంపూర్తిగా ఖండించిన ఏకైక వ్యక్తి ఈయన. ద్రౌపదివేసిన ప్రశ్నలకు సమాధానం చెప్పండి? అని తన సోదరులను గద్దించిన న్యాయమూర్తి.

మహాభారతం సభాపర్వం నుండి ఈ విషయాన్ని పూర్తిగా తెలుసుకోవచ్చు.

**భూరిశ్రవుడు :** భూరిశ్రవుడు సోమదత్తుని కుమారుడు. శంతన మహారాజు అగ్రసోదరుడైన బాహ్లికునికి మునిమనుమడు. యుద్ధశాస్త్రనిపుణుడు. మహారథులలో ఒకడు. మహాభారత యుద్ధంలో సాత్యకి చేతిలో ఇతడు మరణం పొందాడు. తొమ్మిదవ శ్లోకంలో "ఇంకను అనేకమంది శూరవీరులు నా నిమిత్తము తమ ప్రాణముల పై ఆశను వీడి యుద్ధవిశారదులై శస్త్రాస్త్రములను చేత బూనియున్నారు" అని దుర్యోధనుడు తెలియజేశాడేకాని వారి పేర్లను ఎందుకో ఏమో స్పష్టంగా పేర్కొనియుండలేదు. అట్టివారిలో శల్యుడు - బాహ్లికుడు భగదత్తుడు - కృతవర్మ - జయద్రథుడు వున్నారు.

శల్యుడు : శల్యుడు మద్రదేశాధిపతి, పాండురాజు రెండోభార్య "మాద్రి"ఈతని సోదరియే. మాద్రి కుమారులయిన "నకుల సహదేవులకు"మేనమామ . అందువలన అతడు తమ పక్షాన యుద్ధము చేయునని భావించిరి. శ్రీకృష్ణుడు కూడా పాండవులకు సహాయపడమని తెలియజేయుటకు శల్యునివద్దకు దూతలను పంపెను. అతడు సేనాసమేతుడై పాండవుల వద్దకు వచ్చుచుండెను. ఈ సంగతిని దుర్యోధనుడు తెలుసుకొని మార్గమధ్యమందు తన పరివారముచేత శల్యునికి అనేక ఉపచారములు చేయించెను. ఆ ఉపచారముల పట్ల శల్యుడు సంతృప్తి చెందినవాడై తనకిట్లు సదుపాయములను సమకూర్చిన వారెవ్వరని పరిచారకులను ప్రశ్నించెను. అదే సరైన సమయమని దుర్యోధనుడు శల్యుని ఎదుట ప్రవేశించి కురుక్షేత్రయుద్ధములో తనకు సహాయపడమని కోరెను. అందుకు శల్యుడు సరె అనియెను. కాని ఒక సారి పాండవులను చూచివచ్చెదనని దుర్యోధనునితో చెప్పెను. దుర్యోధనుడు అంగీకరించెను. శల్యుడు పాండవులకడకు వెళ్లి ప్రేమతో వారిని ఆలింగనము చేసుకొనెను. అపుడే ధర్మరాజు యుద్ధములో తమకు సహాయముగా రావలసిందని శల్యుని వేడెను. కాని ఆయన అప్పటికే దుర్యోధనునికి సహాయపడెదనని మాట ఇచ్చానని అందువల్ల పాండవులకు సహాయము చేయలేనని ప్రకటించెను. ఈతని కుమారుడు రుక్మధుడు యుద్ధంలో పాండవులచే వధింపబడెను. కర్ణునకు సారథిగయుండమని దుర్యోధనుడు శల్యుని కోరెను. సూత (శూద్ర)జాతివానికి మూర్ధాభిషిక్తుడగురాజు సారథి యగునా? ఇందరు మేదినీ పతులలో (రాజులలో) నన్ను అవమానం చేయుదువా? నేను మా దేశమునకు వెళ్లెదను అని శల్యుడు కురుక్షేత్రయుద్ధరంగములో కోపముతో పలికెను. అపుడు దుర్యోధనుడు అతనిని బ్రతిమాలి "అర్జునునికి ప్రతిగా యుద్ధరంగంలో కర్ణుని నిలిపితినని అతనికి కృష్ణుడు సారథి అయి వున్నాడని, కృష్ణునికంటే మేటి అయిన వాడవునీవు" అని బ్రతిమాలగా అందుకు అంగీకరించి అయితే నేను సారథ్యము చేయునపుడు నాకు తోచిన పలుకులు పలికెదననియు అందుకు కర్ణుడు అంగీకరించవలెనని తెలిపెను. అందుకు దుర్యోధన, కర్ణులు అంగీకరించిరి. ఆ విధంగా శల్యుడు కర్ణునకు సారథి అయ్యెను. వాస్తవానికి కర్ణునికి మేలు ఒనగూర్చు మాటలు చెప్పినను అవి కర్ణునకు కష్టము కలిగించేమాటలుగా వుండునట్లు చెప్పసాగెను. కాకము హంసోపాఖ్యానం తెలిపి కర్ణుని మనస్సుకు కష్టం కలిగించెను. అందువలన కర్ణుడు అతనిని నిందించెను. కర్ణుని మనస్సు నొప్పించి ఆతని మృతికికారకుడైన వాడయ్యాడు శల్యుడు. కర్ణుడు మరణించిన పిమ్మట శల్యుడే కౌరవసైన్యాలకు సర్వసైన్యాధ్యక్షుడయ్యాడు. కురుక్షేత్రయుద్ధంలో ఇతడు భీముని తోను, ధర్మరాజుతోను యుద్ధంచేసెను. చివరకు ధర్మరాజు చేతిలో మరణించెను.

**బాహ్లికుడు:** బాహ్లికుడు ప్రతీపమహారాజు కుమారుడు. శంతనమహారాజుకు అగ్రసోదరుడు. ఇతడు మహాభారతయుద్ధమునందు కౌరవుల పక్షమున పోరు సలిపెను. ఇతని కుమారుడు సోమదత్తునిపై సాత్యకి బాణము వేసి మూర్ఛనొందించగా అపుడు సాత్యకిని ఎదిరించెను. ఆ సమయములో భీముడు సాత్యకికి సహాయంగా రాగా ఇద్దరు కలిసి బాహ్లికున్ని కురుక్షేత్రయుద్ధంలో సంహరించారు.

**భగదత్తుడు** : భగదత్తుడు నరకాసురుని కుమారుడు. ఇతని రాజధాని ప్రాగ్జ్యోతిషపురం, పాండురాజంటే ఇతనికి ఇష్టము. కాని జరాసంధునకు వెరచి అతనితో కలిసిపోయాడు.

అర్జునుడు "దిగ్విజయార్థము" బయలుదేరినపుడు అర్జునునకు - ఈతనికి ఎనిమిది రోజులపాటు యుద్ధము జరిగింది. భగదత్తుడు గెలువలేక అర్జునునితో "నేను ఇంద్రుని సఖుడను-నీవు ఇంద్రకుమారుడవు మనమధ్యపోరాటమెందుకు?"అని అర్జునితో సంధిగావించుకొని ధనమిచ్చి పంపెను. మహాభారతయుద్ధమందు ఇతడు దుర్యోధనుని పక్షమున పోరు సలిపెను. నరకాసురుడు తాను సంపాదించిన వైష్ణవాస్త్రమును అతనికిచ్చెను. మహాభారత యుద్ధములో అర్జునునిపై ఆ అస్త్రాన్నే భగదత్తుడు ప్రయోగించాడు. ఆ అస్త్రమును ఎవ్వరును సహింపలేరు కావున దాని నడ్డుకొనుటకు శ్రీకృష్ణుడు ముందుకు వచ్చి అర్జునుని రక్షించెను. సుప్రతీక అను ఏనుగుచే ఈడ్వబడుచున్న రథంపై ఆశీనుడై పాండవ సైన్యమును ఎదుర్కొంటున్న భగదత్తునిపై అర్జునుడు బాణ ప్రయోగం చేసి ముందుగా రథాన్ని ధ్వంసంచేసి పిదప భగదత్తున్ని ఆయుద్ధంలో సంహరించెను.

**కృతవర్మ** : కృతవర్మ "హృదికుని" కుమారుడు. దేవమీఢునికి తమ్ముడు. భోజదేశమునకు అధిపతి. దుర్యోధనునకు మిత్రుడు. మహాభారతయుద్ధంలో **దుర్యోధనుని పక్షాన పోరు సలిపెను. ఇతర వీరులతో కలిసి అభిమన్యునితో** యుద్ధము చేసినట్లు తెలుపబడింది కాని పాండవ వీరులలో ఎవ్వరితోనూ ఇతను ప్రత్యేకంగా పోరుసలిపినట్లు మహాభారతయుద్ధ చరిత్ర లో అగుపించదు. ఆఖరున మడుగున దాగియుండిన దుర్యోధనుని చూచుటకు ఇతడు వెళ్లి ఆతనిని ఓదార్చెను. నిద్రలో వున్న పాండవేయులను సంహరించెదనని అశ్వత్థామ కృతవర్మతో చెప్పెను.

**జయద్రథుడు** : సింధుదేశాధిపతి అయిన వృద్ధక్షత్రుని కుమారుడే జయద్రథుడు. ఇతనిని "సౌవీరాధిపతి" అని అందురు. "సైంధవుడు" అను ప్రసిద్ధనామముతో మహాభారతయుద్ధంలో కౌరవపక్షాన పోరు చేసినవాడు. ధృతరాష్ట్రుని కుమార్తె దుస్సల (దుర్యోధనుని సోదరి) ఈతని భార్య.

వీరేకాక మహాభారతయుద్ధ సమయములో ఇంకా ఎందరో దుర్యోధనుని పక్షాన పోరుసలిపారు. వారందరు మహారథులే.

ఆ విధముగా దుర్యోధనుడు తన పక్షములోని శూరులనందరినీ పొగడి తదుపరి రెండువైపులగల సేనలను లెక్కగట్టి వాటిలో తన సైన్యమే మహాబలవంతమైనదని ద్రోణాచార్యునకు తెలియజేస్తున్నాడు.

"అపర్యాప్తం తదస్మాకం
బలం భీష్మాభిరక్షితం
పర్యాప్తం త్విదమేతేషాం
బలం భీమాభిరక్షితం" శ్లో - 10

పితామహుడు భీష్మాచార్యుల
వారిచే రక్షింపబడుచున్న
మనసైన్యం అపరిమితమైంది
భీమునిచేత రక్షింపబడుచున్న
పాండవుల సేన పరిమితమైంది.

"అపర్యాప్తము- పర్యాప్తం" అను పదాలకు సరైన అర్థముచెప్పక విపరీతార్థాలు కల్పించి దుర్యోధనుడు తన సైన్యము యొక్క సామర్థ్యమును గూర్చి శంకించినట్లు చాలామందివ్యాఖ్యాతలు వ్యాఖ్యానించారు. వారు వ్యాఖ్యానించినట్లు దుర్యోధనుడు ఏనాడును ఈ షణ్మాత్రం శంకించలేదు. ఈ విషయములు గురించి ఉద్యోగ పర్వం 54-60 -70 లో తన తండ్రి ధృతరాష్ట్రునితోను, తిరిగి ఇదే విషయాన్ని భీష్మపర్వంలో 51-4,6లలో ద్రోణాచార్యుని తోను తనసైన్యము యొక్క గొప్పతనమును గూర్చి బహుథా ప్రశంసించి యుండెను. ఆ విధంగా వారి మదిని ఉత్సాహపరచడం జరిగింది.

పైగా తనకు పండ్రెండు అక్షౌహిణుల సైన్యము వుంది. పాండవులకు వున్నది కేవలం ఏడు అక్షౌహిణుల సైన్యము మాత్రమే. కనుక భీష్మునిచే రక్షింపబడుచున్న సైన్యం అపరిమితం అంటే అపారమైంది.

పాండవ సేనలను వీరులందరిని గూర్చి చెప్పి ఆరవ శ్లోకం చివరి పాదంలో "సర్వ ఏవమహారథాః" వారందరు మహారథులే అన్నాడు. అంటే వారు అల్ప సంఖ్యాకులు. కౌరవ

సేనలను గూర్చి తెలుపుతూ 8వ శ్లోకంలో తాను పేర్లు తెలిపిన వారెగాక 9వశ్లోకం మొదటి పాదంలో "అన్యేచబహువశ్శూరాః" అంటే ఇంకా అనేక మంది మహాశూరులు తన పక్షాన వున్నారని తెలిపాడు. అలాంటప్పుడు అతనికి భయమెందుకు? తాను తప్పక జయింతునన్న పూర్ణవిశ్వాసంతోనే మహాభారతయుద్ధానికి పయనం సాగించాడు. ఆ యుద్ధంలో పాండవ పక్షపాతులైన భీష్మ -ద్రోణులు నేలకొరిగినా ఒక్క కర్ణుని సహాయముతో తాను కృతార్థుడు కాగలనని భావించాడు. అందువలన దుర్యోధనుడు తాను ఓడి పోతానని స్వప్నమందు గూడ తలంచ లేదు .పైగా భీమార్జునులున్నా పాండవ సైన్యం తనకు ఒకలెక్క లోనిదిగాదని హేళనగా మాట్లాడెను. అయితే ఇక్కడ గమనించవలసిన ప్రత్యేక అంశం ఏమిటంటే కౌరవసేనలకు భీష్ముడుఅధిపతి అయివున్నట్లు - పాండవసేనలకు ధృష్టద్యుమ్నుడు అధిపతి అయివుండగా "భీమాభి రక్షితం" అని ఎందుకన్నాడు- అంటే అందుకు కారణాలను ఈ విధంగా విశ్లేషించుకోవచ్చు.

1. భీముడు ధార్తరాష్ట్రులందరిని వధించుటకు ఏనాటినుంచో కృతనిశ్చయుడై యుండుట.
2. ధృష్టద్యుమ్నుడు సర్వసైన్యాధ్యక్షుడు అయినా అతనితోపాటు సైనిక రక్షణను భీముడు కూడా చేయుచుండుట.
3. అదిగాకుండా ధృష్టద్యుమ్నునిచే నిర్మింపబడిన వజ్రవ్యూహం యొక్క రక్షణ భారాన్ని నిర్వహించుటకు సేనల యొక్క అగ్రభాగాన భీమసేనుడు వుండుట. అందువలన దుర్యోధనుడు "భీమాభిరక్షితం" అనే పదప్రయోగం చేసివుండవచ్చు.

ఈ విధంగా తన సైన్యము అజేయమైనదని దుర్యోధనుడు అభివర్ణించి ఆ పిమ్మట తన సేనలోని వీరులందరు కలిసి భీష్మునిని రక్షించు చుండవలసిందిగా హెచ్చరిస్తున్నాడు.

"అయనేషుచ సర్వేషు
యథాభాగమవస్థితాః
భీష్మమేవాభిరక్షన్తు
భవన్త స్సర్వ ఏవహి" శ్లో -11

"మీరందరును వ్యూహస్థానముల
యందు మీమీనియమితస్థానముల
యందుండి భీష్మాచార్యుల వారిని
జాగ్రత్తగా సంరక్షిస్తు వుండండి"

భీష్మపితామహుడు మహాపరాక్రమశాలి. ఆయన తనను తాను రక్షించుకోగలడు. దుర్యోధనునకు కూడా ఈ విషయం బాగుగా తెలుసు. అయితే ద్రుపదుని పుత్రుడు "శిఖండి" జన్మతో ఆడశిశువుగా జన్మించి పిదప అంగమార్పిడి అనే ప్రక్రియవలన పురుషరూపం ధరించెను. స్త్రీగా జన్మించిన శిఖండితో తాను యుద్ధం చేయబోనని భీష్మపితామహుడు ఆదిలోనే ప్రకటించియుండెను. ఈ అపాయాన్ని గుర్తెరిగియుండిన దుర్యోధనుడు అంతకు ముందే దుశ్శాసనుడు మొదలుగా గల వీరులకు హెచ్చరికచేసియుండెను. మహాభారతము భీష్మపర్వం 15-14 నుండి 20 శ్లోకాలలో చూడవచ్చును. తమ బలగాలు చెదిరిపోకుండా వుండుటకుగాను దుర్యోధనుడు ఇపుడు కూడా అదేరీతిలో ప్రకటించెను. పాండవ పక్షమందున్న ద్రుపదమహారాజు కుమారుడు "శిఖండి"గనుక యుద్ధంలో భీష్మాచార్యుల వారికి ఎదురుగా వస్తె అప్పుడే భీష్ముడు అస్త్రసన్యాసం చేయును. అలాంటిది జరుగకుండుటకుగాను శిఖండి భీష్మపితామహునకు ఎదురుగాకుండా వుండునట్లు చూచి కాపాడండి అని హెచ్చరించాడు. భీష్ముడు ఒక్కడే ఎదురుగానుంటే చాలు ఆయనొక్కడే శత్రువులనందరిని పరిమార్చగల శక్తి ఆయనకుంది. భీష్ముడు క్షేమంగా వుంటే అతని సైన్యాలన్నీ క్షేమం అన్నది దుర్యోధనుని యొక్క ప్రధాన భావన.

"తస్యసంజనయన్ హర్షం
కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చై
శ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్ శ్లో - 12

*అంతట ప్రతాప శాలియును*
*కురువృద్ధుడును అగు భీష్మపితామహుడు*
*దుర్యోధనునకు సంతసము కలిగించనెంచి*
*బిగ్గరగా సింహనాదము చేసి శంఖమును పూరించెను.*

పరశురాముడు మొదలుగాగల శక్తి సంపన్నులను సైతం జయింపగలిగినట్టి పరాక్రమము కలిగియున్న వాడగుటచేత ఇక్కడ ఈ శ్లోకంలో "ప్రతాపవాన్"- అంటే పరాక్రమశాలి యని పేర్కొనడం జరిగింది. "కురువృద్ధః" అనే పదప్రయోగము చేయడం వలన ఇక్కడ ముఖ్యంగా గనించవలసిన అంశం ఏమిటంటే కురువంశములో అప్పుడున్న వారందరిలో "బాహ్లికుని" తరువాత వయస్సునందు అతిపెద్ద వాడు కావున "కురువృద్ధః" అంటే కురువంశంలో

వృద్ధుడు అని తెలుసుకోవలసి వుంది. ఆకారణంగా భీష్ముడు పితామహుడని పిలవబడినాడు. ఇక్కడ ప్రత్యేకంగా గమనించవలసిన అంశం ఏమంటే శత్రుసైన్యమును జూచాక దుర్యోధనుడు కాస్తంత కలవరిపడినట్లు భీష్మపితామహుడు భావించి వుండడం చేతనే ఆతనికి ఉత్సాహం గొలుపుటకై సింహనాదం చేసి శంఖమును పూరించినట్లు భావించాలి. భీష్మపితామహుని యుద్ధోత్సాహమును గాంచి కౌరవసేనలోని మిగిలిన వీరులందరును తమ తమ శంఖాదులను పూరించిరని సంజయుడు ధృతరాష్ట్రునికి తెలియజేస్తున్నాడు.

"తతః శంఖాశ్చ భేర్యశ్చ
పణవానకగోముఖాః
సహసైవాభ్యహన్యన్త
స శబ్దస్తుములో భవత్" శ్లో - 13

ఆ పిదప కౌరవసేనలోని
వీరులందరు తమతమ
శంఖములను, భేరులను
తప్పెటలను, రణభేరులను
ఒకేసారి మ్రోగించగా
ఆశబ్దములు భయంకరముగానుండెను.

సింహనాదముచేసి, శంఖమును పూరించడంతో భీష్మపితామహుడు యుద్ధం ఆరంభించెను. వెంటనే వ్యూహంలో ఆయా స్థానములందున్న కౌరవవీరులందరును ఒక్కుమ్మడిగా వివిధములగు రణధ్వనులను గావించిరి.

నా వారు అంటే నాకుమారులైన దుర్యోధనాదులు, పాండురాజుతనయులైన ధర్మరాజాదులు యుద్ధమునందు ఏంచేసిరి? సంజాయా! అని ధృతరాష్ట్రుడు వేసిన ప్రశ్నకు జావాబుగా సంజయుడు ఇంతవరకు కౌరవ పక్షమందలివార్తలను ధృతరాష్ట్రునకు తెలియజేసి ఆ పిదప దిగువ తెలిపిన ఐదుశ్లోకములలో పాండవ పక్షమందలి వృత్తాంతమును విశదీకరించుటకు సంజయుడు ఉపక్రమించుచున్నాడు

"తతః శ్వేతైర్హ యైర్యుక్తే
మహతిస్యందనే స్థితౌ
మాధవః పాండవశ్చైవ
దివ్యౌశంఖౌ ప్రదధ్మతుః" శ్లో - 14

పిమ్మట శ్రీకృష్ణభగవానుడును
అర్జునుడును శ్వేతాశ్వములు
(తెల్లటి)పూనిన రథంపై ఆశీనులై
దివ్యములగు తమ తమ శంఖములను పూరించిరి.

"పాంచజన్యం హృషీకేశో
దేవదత్తం ధనం జయః
పౌండ్రం దధ్మౌ మహాశంఖం
భీమకర్మా వృకోదరః" శ్లో - 15

శ్రీకృష్ణుడు పాంచజన్యమును
అర్జునుడు దేవదత్తమును
భయంకర కార్యములనొనర్చెడు
భీముడు పౌండ్రమును పూరించిరి.

"అనంత విజయం రాజా
కుంతీపుత్రో యుధిష్ఠిరః
నకులః సహదేవశ్చ
సుఘోషమణి పుష్పకౌ" శ్లో - 16

కుంతిపుత్రుడైన రాజగు
ధర్మరాజు అనంతవిజయమును
నకులుడు సుఘోషమును
సహదేవుడు మణిపుష్పకమును
అను శంఖములను పూరించిరి.

"కాశ్యశ్చ పరమేష్వాస
శిఖండీ చ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ
సాత్యకిశ్చా పరాజితః" శ్లో - 17



గొప్పదగు విల్లును కలిగియున్న
కాశీరాజును, మహారథుడైన
శిఖండియును, ధృష్టద్యుమ్నుడును
విరటుడును మరియు పరాజయ
మెరుగని సాత్యకియును

"ద్రుపదో ద్రౌపదేయాశ్చ
సర్వశః పృథివీపతే
సౌభద్రశ్చ మహాబాహుః
శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్" శ్లో - 18

ఓ మహారాజా!
ద్రుపదమహారాజును
ద్రౌపదీ తనయులగు ఉపపాండవులును
గొప్ప బాహువులు గలిగిన సుభద్ర
తనయుడగు అభిమన్యుడును
వేరు వేరుగా తమ తమ శంఖములను ఊదిరి.

**అర్జునుని రథం :** ఈ రథం చాలా గొప్పది. బలమైంది. అన్ని వైపులా బంగారు తొడుగు తొడిగినటువంటి రథం ఇది. రథానికన్నివైపుల చిరుగంటలు కట్టబడియుండును. చంద్రుడు -నక్షత్రాలు కలిసి "హనుమంతుని" చిహ్నంగల బొమ్మతో రథానికి ఎత్తైన జెండా అమర్చబడి వుంది. దీని పొడవు ఎత్తు ఒక యోజనము. అంటే మైళ్లలో ఎనిమిదిమైళ్లు. ఖాండవ వన దహనానంతరము ఈ రథాన్ని అగ్నిదేవుడు అర్జునకు బహూకరించాడు. మహాశక్తివంతమైన అర్జునుని ధనస్సు గాండీవమును కూడా అర్జునునకు అగ్నిదేవుడు ప్రసాదించాడు. నాలుగు శ్వేతాశ్వములచే (తెల్లటి గుర్రములచే) లాగబడుచున్న ఈ రథంపై ఆశీనులయ్యే శ్రీకృష్ణార్జునులు కురుక్షేత్ర యుద్ధంలో రంగప్రవేశంగావించారు. ఈ రథానికి సారథి శ్రీకృష్ణభగవానుడు. ఈ నాలుగు శ్వేతాశ్వములు "చిత్రరథుడు" అను పేరుగలగంధర్వరాజు అర్జునునకు బహూకరించిన నూరుగుర్రములలో నుండి ఎంపిక చేయబడినవి. ఇవి భూమిపైనను ఆకాశమార్గాన కూడా సంచరించగలవు. మహాభారతం ఉద్యోగపర్వంలో ఈ అశ్వములవిషయమై, ఆదిపర్వంలో రథం విషయమై సవివరంగా తెలుపబడ్డాయి.

**పాంచజన్యం - దేవదత్తం:** శ్రీకృష్ణార్జునులు పూరించిన పాంచజన్యం- దేవదత్తం అను శంఖములు సామాన్యమైనవి కావు. అవి దివ్యమైనవి.

పంచజనుడను రాక్షసుని ఎముకలచే ఏర్పాటు అయినది గనుక శ్రీకృష్ణభగవానుడు పూరించిన శంఖమునకు "పాంచజన్యం" అనుపేరు వచ్చింది.

హృషీకములకు అర్థం ఇంద్రియములు అని. ఈశుడు అంటే అధిపతి అని అర్థము. ఇంద్రియములకు అధిపతి అయినందున శ్రీకృష్ణభగవానుణ్ణి హృషీకేశుడని ఇక్కడ సంబోధించడం జరిగింది.

**ధనంజయుడు** : అదేవిధంగా రాజసూయయాగ సందర్భంలో అనేక మందిరాజుల వద్దనుండి అర్జునుడు ధనమును సంపాదించి తెచ్చుట చేత ఆయనకు ధనంజయుడు అను పేరు వచ్చింది.

**దేవదత్తం** : అర్జునుడు పూరించిన శంఖము దేవదత్తము. దానిని అర్జునకు ఇంద్రుడు బహూకరించాడు. ఇది శక్తివంతమైన శంఖము "నివాత కవచులు"అను రాక్షసులను చంపినందుకు ఈశంఖము బహుమానంగా ఇంద్రునిచే ఈయబడింది. మహాభారతం వన పర్వంలో ఈ విషయం వుంది.

**శిఖండి - ధృష్టద్యుమ్నుడు** : వీరిద్దరు ద్రుపదమహారాజు కుమారులు. శిఖండి పెద్దవాడు, ధృష్టద్యుమ్నుడు చిన్నవాడు. ఏదోనాటి మహాభారతయుద్ధములో ఈ శిఖండిని ముందుంచుకొనియే అర్జునుడు భీష్మపితామహుని నేలకూల్చగలిగాడు.

ధృష్టద్యుమ్నుడు పాండవుల సేనలకు సర్వసైన్యాధ్యక్షుడు. ద్రోణుడు యోగముద్రలో వున్నపుడు ఆతని తలను తెగనరికినవాడు. సర్వశః అంటే సర్వులు అని పదప్రయోగము చేయడంలో శ్రీకృష్ణుడు -పాండవులు ఐదుగురేకాక కాశీరాజు ఇంకా ఎందరో అతిరథ, మహారథులు పాండవసేనలో వున్నారు. వారందరు తమ తమ శంఖములను యుద్ధారంభానికి సూచికగా పూరించిరి అని తెలియజేయడం జరిగింది.

**ఈ ప్రకారమున పాండవుల వృత్తాంతం కూడా ధృతరాష్ట్రునకు సంజయుడు ఎరిగించి తదనంతరం రణరంగంలో జరిగిన సంఘటనలను వివరించుటకు ఉపక్రమించుచున్నాడు**

"సఘోషో ధార్తరాష్ట్రాణాం
హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీం చైవ
తుములోభ్యనునాదయన్" శ్లో - 19

పాండవులు చేసిన ఆ భయంకర
శంఖనాదములు భూమ్యాకాశముల
యందు మార్మోగి దుర్యోధనాదుల
హృదయములను బ్రద్దలు చేసెను.

కృష్ణార్జునులు, భీమ, ధర్మ, నకుల, సహదేవులు వారి సేనలు చేసిన శంఖములయొక్క సంకుల ధ్వని భ్యూమ్యాకాశములను దద్దరిల్లజేయడంతో దుర్యోధనాదుల హృదయాలు తల్లడిల్లి వారిలో ఉత్సాహం సన్నగిల్లినదని ఈ శ్లోకం రూఢిపరుస్తున్నది.

అటు పిమ్మట అర్జునుడు రెట్టింపైన ఉత్సాహంతో శ్రీకృష్ణునితో పలికిన పలుకులను దిగువ నాలుగు శ్లోకముల ద్వారా సంజయుడు ధృతరాష్ట్రునకు వివరిస్తున్నాడు

"అథవ్యవస్థితాన్ దృష్ట్వా
ధార్త రాష్ట్రాన్ కపిధ్వజః
ప్రవృత్తే శస్త్ర సంపాతే
ధనురుద్యమ్య పాండవః"
హృషీకేశం తదావాక్య
మిదమాహ మహీపతే" శ్లో -20

"ఓ ధృతరాష్ట్ర మహారాజా!
అటు పిమ్మట రణరంగమందు
ఆయుధ ప్రయోగము జరుగ
బోవు సమయంలో కపిధ్యజుడైన
అర్జునుడు యుద్ధ సన్నద్ధులైయున్న
కౌరవులను జూచి ధనస్సును
ఎక్కు బెట్టి శ్రీకృష్ణునితో ఇట్లు పలికెను"

అర్జునునకు కపిధ్వజుడను మరొక పేరుకూడా వుంది. ఆయన రథం యొక్క అగ్రభాగాన "హనుమంతుడు"వున్న జండా ఎల్లవేళలా ఎగురుతూ వుంటుంది. భీముని ప్రార్థనను అనుసరించి హనుమంతుడు (హనుమంతుడు భీముడు ఇరువురు వాయుదేవుని కుమారులు) పాండవులకు విజయము కలుగుటకు గాను అర్జునుని

రథము యొక్క టెక్కెముపై తాను ఎక్కి కూర్చుందునని వరమిచ్చి యుండెను. ఈ విషయము మహాభారతం అరణ్యపర్వం 151వ అధ్యాయంలో కలదు.

సేనయోరుభ యోర్మధ్యే
రథం స్థాపయమేచ్యుత"  శ్లో - 21

కృష్ణా !
రెండు సేనల మధ్యగా
నా రథమును నిలిపి వుంచుము.

" యావదేతా న్నిరీక్షేహం
యోద్ధు కామానవస్థితాన్
కైర్మయా, సహయోద్ధవ్య
అస్మిన్ రణసముద్యమే"  శ్లో - 22

"ఈ రణ రంగమునందు
నేను ఎవరెవరితో పోరు
సలుపవలసి యున్నదో
అట్టి యుద్ధ సన్నద్ధులైనట్టి
శూరులందరిని నేను చూచెదను"

ఏ యుద్ధవీరుడైనను శత్రువులతో తలపడడానికి ముందుగా శత్రుపక్షములో గల వీరులను గూర్చి పూర్తిగా ఒక అవగాహనకు రావలసి వుంటుంది. అవగాహన అంటే శత్రువీరులు ఏ ఏ రీతుల్లో ఏ ఏ వ్యూహాల్లో ఏ ప్రకారంగా మోహరించియున్నారో పూర్తిగా తెలుసుకోవడం అది ఉత్తమ వీరునకు వుండవలసిన ప్రధాన లక్షణము. (ఈనాటి ఆధునిక యుద్ధశాస్త్రములో గూడా ఇలాంటి అంచనాలు వేయబడుచుండుటను మనంగమనిస్తూనే వున్నాము) కనుక అర్జునుడు వారందరిని చక్కగా గ్రహించి వారి శక్తి సామర్థ్యాలను అంచనా వేసుకొనుటకుగాను వారందరిని ఎక్కడ నుండి సరిగ్గా చూచి వారి శక్తి సామర్థ్యాలను గూర్చి అంచనా వేసుకోగలనో అచ్చట తన రథాన్ని నిలుపుమని శ్రీకృష్ణుణ్ణి అర్థించాడు.

"యోత్స్య మానాన వేక్షేహం
య ఏతేత్రసమాగతాః
ధార్త రాష్ట్రస్యదుర్బుద్ధేః
యుద్ధే ప్రియచికీర్షవః          శ్లో - 23

"దుర్బుద్ధియగు దుర్యోధనునకు
ఈ యుద్ధమునందు మేలు
చేకూర్చదలచిన వారై ఇచ్చట
మోహరించియున్నట్టి యుద్ధ
వీరులను నేను వీక్షించెదను"

"బుద్ధినాశాత్ప్రణశ్యతి" అంటే బుద్ధి చెడినచో మనుజుడు నశించును అని భగవానుడు గీతలో ప్రకటించియున్నాడు.

దుర్యోధనుని బుద్ధి చెడిపోయింది. అందువల్లనే ఈ శ్లోకంలో "ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః" అనె సమాసము ప్రయోగించబడింది. అంటే దుష్టబుద్ధి అయిన దుర్యోధనుడు అని తెలియజేయబడింది.

దుర్యోధనుడు పాండవులకుఎన్నోమారులు అపచారములు చేసి యున్నాడు. అరణ్య, అజ్ఞాత వాసాల పిదప న్యాయంగా వారికి రావలసిన రాజ్యాన్ని కూడా రాకుండా జేసి దానిని తనస్వాధీనంలో వుంచుకొని పాండవులను నానా హింసలు పెట్టాడు. దానంతటిని మనస్సులో వుంచుకొనియే అర్జునుడు ఇక్కడ దుష్టబుద్ధియగు దుర్యోధనుడు అని అతన్ని గూర్చి ప్రకటించియున్నాడు.

అట్టి దుష్టబుద్ధిగల దుర్యోధనునకు "ప్రియచికీర్షవః" అంటే ప్రియము (మేలు) చేయగోరి వచ్చిన వారందరిని "అవేక్షేహం" నేను చూచెదను అన్నాడు అర్జునుడు ఈ శ్లోకంలో.

అర్జునుని ఈ వాక్యములను వినిన శ్రీకృష్ణుడు తదుపరి ఏం చేసినో దాన్ని గూర్చి సంజయుడు - ధృతరాష్ట్రునకు వివరిస్తున్నాడు.

"ఏవముక్తో హృషీకేశో
గుడాకేశేన భారత
సేనయో రుభయోర్మధ్యే
స్థాపయిత్వా రథోత్తమం"          శ్లో - 24

"భీష్మద్రోణ ప్రముఖతః
సర్వేషాం చ మహీక్షితాం
ఉవాచపార్థ! పశ్యైతాన్
సమవేతాన్ కురూనితి" శ్లో - 25

"ఓ ధృత రాష్ట్రమహారాజా!
అర్జునుడిట్లు చెప్పగనే
శ్రీకృష్ణుడు ఉత్తమమగు
ఆ రథమును రెండు సేనలకు
మధ్యగా, భీష్మ ద్రోణులకు
అభిముఖంగా, ఎల్లరు రాజులకు
ఎదురుగా నిలిపి అర్జునునితో
అర్జునా! యుద్ధమునకు సన్నద్ధులై
ఇక్కడ చేరియున్న కౌరవులను జూడుము అనెను"

తమోగుణమును నిర్జించిన వాడు గనుక అర్జునుణ్ణి శ్రీకృష్ణుడు "గుడాకేశః"అని సంబోధించడం జరిగింది. దానిని బట్టి అర్జునుడు అతి జాగరూకుడు అని తెలియుచున్నది.

"కురూన్"- అంటే కౌరవులు అని, "పశ్య" అంటే చూడుము అని అర్థము. "అర్జునా! యుద్ధమునకు సన్నద్ధులై ఇక్కడ చేరియున్న కౌరవులను జూడుము " అని శ్రీకృష్ణుడు పలకడంతో శ్రీకృష్ణ భగవానుని ఆంతర్యము ఏమిటో గ్రహించవలసి వుంది. కౌరవులు అనే పదానికి ఇక్కడ అర్థము ఇరుపక్షాలలోని అర్జునుని రక్తసంబంధీకులు అని , అంటే మొత్తము కురువంశీయులు, వారిలో ధృతరాష్ట్రుని కుమారులైన దుర్యోధనాదులున్నారు. పాండవీయులైన ధర్మరాజాదులునూ వున్నారు. ఆ భయంకర యుద్ధమే గనుక జరిగితే ఇరుపక్షాలలోని అర్జునుని ఆత్మబంధువులందరు నేలకూలెదరు. అపుడు అంతాస్మశానమే. ఇక రాజ్యమెక్కడిది? రాజ్యభోగమెక్కడిది? ఏ స్వజనమును చూడడంతో అర్జునుని చిత్తం చలించి శోకసంలగ్నము కాగలదో అట్టివారందరి ఎదుట శ్రీకృష్ణభగవానుడు ఉత్తమమైన రథమును నిలిపి "అర్జునా! యుద్ధమునకు సన్నద్ధులై యున్న కౌరవులందరినీ చూడుము"- అన్నాడు.

## గీత ఆవిర్భావమునకునాంది పలికినచోటు

గీతాబోధనకు అది అనువైన స్థలమని శ్రీకృష్ణ భగవానుడు భావించాడు. మానవాళి సంక్షేమమును కోరిన భగవానుడు అర్జునుని ఆ ప్రదేశంలో నిలిపి "గీత"ను బోధించాడు, అది భగవానుని నోటి నుండి జాలువారింది కనుక లోకంలో "భగవద్గీత"గా ప్రసిద్ధి పొందింది. అందుకనే గీతను దేశదేశాల ప్రముఖులు ఈ విధంగా ప్రస్తుతించారు.

**జాతిపితమహాత్మాగాంధీ** : "సంశయములు నన్ను ఆవరించినపుడు సంకటములు సంప్రాప్తమైనప్పుడు నిరాశ నిరుత్సాహములు జనించినపుడు నేను భగవద్గీతను తెరిచి చూచెదను. అందు ఏదో ఒక శ్లోకము నన్ను ఊరడించును. తత్ఫలితముగ మహావిపత్కర పరిస్థితులయందు గూడా నాముఖముపై చిరునవ్వు తాండవించుచుండును. నా జీవితము అనేక ఒడుదుడుకులతో కూడియున్నను, ఘోర సంకటములను నేను అనుభవించవలసి వచ్చినను అవి అన్నియు నా మనంబున లవలేశమైనను అశాంతిని కలుగజేయజాలకపోయినవో అదంతయు గీతా ప్రబోధము యొక్క మహత్యమే యగును"

**శ్రీ వివేకానందస్వామి** : "గీతలో శ్రీ కృష్ణపరమాత్మ అర్జునునకు చెప్పినవి మాటలు కావు. అవి జ్ఞానకణికలు. జీవితాదర్శమంతయు ఒక్కక్షణములో అచ్చట తెలిపివేయబడెను. ఉపనిషత్తులు అనుతోటలో నుండి "ఆధ్యాత్మిక సత్యములు" అను పుష్పములను యేర్చికూర్చిన మాలయే "భగవద్గీత"

**లోకమాన్య బాలగంగాధర్ తిలక్** : "ప్రపంచమున గల సాహిత్యమంతటిలోను గీతకుదీటు రాగల గ్రంథం మరొకటి లేదు. అది మహాప్రకాశ మానమగు అమూల్యరత్నం. మనలను అది పరమానందపదానికి గొనిపోవు అపూర్వ సాధనము".

**శ్రీ అరవిందయోగి** : "మానవుడు తన మేధనంతను ధారపోసినను గీతా జ్ఞానమునందలి ఒక అంశమును మాత్రమే తెలుసుకొని తెలుపగలడు"

**ఆచార్య వినోబాభావే** : "నా శరీరవృద్ధికి తల్లి పాలు ఎంతగా ఉపయోగ పడినవో, నా బుద్ధి వికాసమునకు భగవద్గీత అంతకంటే ఎక్కువగా ఉపయోగపడినది.

**మహర్షి మళయాళస్వాములవారు :** "సంసార సాగరమును సులభముగదాటుటకు భగవద్గీతను పఠిస్తూ, దానియందు చెప్పినట్లు ఆచరిస్తేచాలు"

**శ్రీ మదన మోహన్ మాలవ్యా :** "నాకు తెలిసినంతవరకు విశ్వ వాఙ్మయ మంతటిలోను గీతవంటి మహోన్నత గ్రంథరాజము మరియొకటి లేనేలేదు. అది జ్ఞాన భాండారము,తరగని నిధి. ఆనందసాగరం".

**శ్రీ బంకించంద్ర ఛటర్జీ :** "భగవద్గీతలోవలె అపూర్వ ధర్మసమన్వయము, అద్భుతవ్యాఖ్య ఏ దేశమునను, ఏ కాలమునను ఎవడును కని యుండలేదు. వినియుండలేదు".

**శ్రీ శివానంద సరస్వతీ స్వాములవారు:** "విశ్వ వాఙ్మయముంతటిలోను గీతవంటి మహోన్నత గ్రంథరాజము మరొకటి లేనేలేదు.

**శ్రీ ఎడ్విన్ ఆర్నాల్డ్ :** " భారతదేశము యొక్క ఈ సర్వప్రియ కావ్యమయదార్శనిక గ్రంథము లేనిచో ఆంగ్ల సాహిత్యము నిక్కముగ అసంపూర్ణముగనేనిలిచిపోయి వుండెడిది"

**శ్రీ వారన్ హేస్టింగ్స్ :** "ఉన్నత శిఖరములను అధిరోహించుటకు మానవులకు గీతోపదేశము అద్వితీయమైనది.



# కురువంశవృక్షము

1. ఈ కురువంశానికి ముందుతరం 'భరతవంశం'
2. భరతవంశానికి ముందుతరం "పురువంశం"
3. పురువంశానికి ముందుతరం చంద్రవంశం, "కురు, భరత, పురు వంశాలన్నీ కలిసిందే "చంద్రవంశం" - మొత్తంగా వీరందరు చంద్రవంశపు రాజులు.

ఈ వంశవృక్షము గురించి మహాభారతము ఆదిపర్వం 94వ అధ్యాయములో విపులంగా తెలియజేయబడింది.




ఆదిగాగల నూర్గురుకుమారులు "వైశ్య" అను స్త్రీవలన యుయుత్సుడు అను మరొక కుమారుడు కలడు.

# ధృతరాష్ట్ర సంతతి

1. దుర్యోధనుడు
2. దుశ్శాసనుడు
3. దుస్సహురుడు
4. దుశ్శలుడు
5. దుర్ముఖుడు
6. వివింశాతి
7. వికర్ణుడు
8. శలుడు
9. సత్వుడు
10. సులోచనుడు
11. విందుడు
12. అనువిందుడు
13. దుర్ధర్ముడు
14. సుబాహుడు
15. దుష్ప్రదర్శనుడు
16. దుర్మర్షణుడు
17. జలసంధుడు
18. దుష్కర్ణుడు
19. కర్ణుడు
20. చిత్రుడు
21. ఉపచిత్రుడు
22. చిత్రాక్షుడు
23. చారుచిత్రుడు
24. చిత్రాంగదుడు
25. దుర్మరుడు
26. దుష్ప్రదర్శనుడు
27. వివిత్సుడు
28. వికటుడు
29. వసుపూర్ణనాభుడు
30. పద్మనాభుడు
31. నందనుడు
32. ఉపలానందుడు
33. సేనాపతి
34. సుషేణుడు
35. కుండోదరుడు
36. మహోదరుడు
37. చిత్రబాహుడు
38. చిత్రవర్మ
39. సువర్మ
40. దుర్విరోచనుడు
41. అయోబాహు
42. మహాబాహు
43. చిత్రబాకుడు
44. సుకుండలుడు
45. భీమవేగుడు
46. భీమబలుడు
47. భీమవిక్రముడు
48. బలాకి
49. ఉగ్రాయుధుడు
50. భీమశరుడు
51. కనకాయుడు
52. దృఢాయుధుడు
53. దృఢవర్మ
54. దృఢక్షేత్రుడు
55. సోమకీర్తి
56. అనూదరుడు
57. జరాసంధుడు
58. దృఢసందుడు
59. సత్యసంధుడు
60. సహస్రవాక్
61. ఉగ్రశ్రవుడు
62. ఉగ్రశ్రేణుడు
63. క్షేమమూర్తి
64. అపరాజితుడు
65. పండితుడు
66. విశాలాక్షుడు
67. దురాగదనుడు
68. దృఢహస్తుడు
69. సుహస్తుడు
70. వాతవేగుడు
71. సువర్చసుడు
72. ఆదిత్యకేతువు
73. బహ్వాసి
74. నాగదత్త
75. అనుయాయి
76. కవచి
77. నిషంగి
78. దండి
79 దండి ధారి
80. దనుగ్రహుడు
81. ఉగ్రుడు
82. భీమరథుడు
83. వీర
84. వీరబాహు
85. అలోలుపుడు
86. అభయనుడు
87. రువుద్రకర్ముడు
88. దృఢరథుడు
89. అనాధృష్యుడు
90. కుండభేది
91. విరాలి
92. దీర్ఘలోచనుడు
93. దీర్ఘబాముడు
94. మహాబాహుడు
95. వ్యూఢోరుడు
96. కనకాంగదుడు
97. జలసంధుడు
98. కుందజుడు
99. చిత్రకుడు
100. దుస్సల (కుమార్తె)

'వైశ్య' అను భార్యద్వారా యుయుత్సుడు జన్మించాడు.



పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి విరచిత

**మహాభారత చరిత్ర సౌజన్యంతో**

# కురు పాండవ వీరులు

| కౌరవవీరులు | పాండవవీరులు |
|---|---|
| 1. దుర్యోధనుడు | 1. ధర్మరాజు |
| 2. దుశ్శాసనుడు | 2. భీముడు |
| 3. కర్ణుడు | 3. అర్జునుడు |
| 4. శకుని | 4. నకులుడు |
| 5. సైంధవుడు | 5. సహదేవుడు |
| 6. భీష్ముడు | 6. శ్రీకృష్ణుడు. |
| 7. ద్రోణుడు | 7. ద్రుపదుడు |
| 8. కృపుడు | 8. విరటుడు |
| 9. అశ్వత్థామ | 9. శ్వేతుడు |
| 10. కృతవర్మ | 10. ఉత్తరుడు(విరటుని కుమారుడు) |
| 11. ఉలూకుడు | 11. ధృష్టద్యుమ్నుడు |
| 12. శల్యుడు | 12. శిఖండి |
| 13. బాహ్లికుడు | 13. సాత్యకి |
| 14. సోమదత్తుడు | 14. అభిమన్యుడు |
| 15. భూరిశ్రవస్సు | 15. ఘటోత్కచుడు |
| 16. భగదత్తుడు | 16. సహదేవుడు (జరాసంధుని కుమారుడు) |
| 17. లక్ష్మణుడు (దుర్యోధనపుత్రుడు) | 17. ధృష్టకేతువు (శిశుపాలుని కుమారుడు) |
| 18. వృషసేనుడు | 18. మలయ ధ్వజుడు (పాండ్యదేశపు రాజు) |
| 19. సుశర్మ | 19. చేకితానుడు (యాదవవీరుడు) |

20. నీలుడు

21. బృహద్బలుడు

22. సాల్వుడు

23. శ్రుతాయువు
(కాశింగుడు)

24. సుదక్షిణుడు

25. క్షేమధ్వని

26. 1 విందుడు
2 అనువిందుడు (అవంతి ప్రభువులు)

27. శ్రుతాయువు
(అంబష్ఠుడు)

28. జలసంధుడు
(ఒకరాజు)

29. సుదర్శనుడు
(ఇంకొకరాజు)

30. అలంబసుడు

31. హలాయుధుడు.

20. ఇలావంతుడు
(నాగకన్య ఉలూచి-అర్జున కుమారుడు)

21. శైభ్యుడు
(శిబిదేశ ప్రభువు)

22. జయత్సానుడు మరి ఐదుగురు
(వీరె కేకయులు)

23. ఉపపాండవులు
1 ప్రతివింధ్యుడు
2 శ్రుతసోముడు
3 శ్రుతకీర్తి
4 శాతానీకుడు
5 శాత

24. 1 శ్రుతసేనుడు
2 ఉత్తముజుడు
(అర్జున రథ చక్రరక్షకులు
ద్రుపదుని జ్ఞాతులు)

25. యుధామన్యుడు

26. అంజన పర్వుడు
(ఘటోత్కచుని కుమారుడు)

27. ధృష్టవర్మ
(ధృష్టద్యుమ్నుని కుమారుడు)

28. హిరణ్య వర్మ
(దశార్ణ దేశ ప్రభువు)

# మహాభారత యుద్ధకాలము నాటి వివిధరాజ్యాలు - ఎల్లలు

హిమాలయములకు ఉత్తర భాగాన వున్న ఈనాటి టిబెట్టు (అప్పట్లో త్రివిష్టపము)లోని "ఉత్తర కురు- కాంబోజ- ఉలూక దేశాలు".

2. మధ్యఆసియా ఆఫ్ఘన్‌స్థానములలోని "ఉశీనర- మద్ర- బాహ్లిక" - దేశములును

3. ఆనాటి కురుమహాసామ్రాజ్యానికి ఉత్తరంగా వుండిన హిమాలయమును- తూర్పున గల పాంచాల దేశములోని అహిచ్ఛత్రము మాకంది కాంపిల్య అను భాగములును.

4. దక్షిణమున "మత్స్య దేశము"- అప్పట్లో "మరుస్థలం" అని పిలువబడిన "రాజస్థానపు ఎడారియు"

5. పశ్చిమమున "కాండహారు"ను - పశ్చిమోత్తర పరగణాలును, పంజాబులో కలిసి వున్న "గాంధార దేశము"

6. పశ్చిమోత్తర దిశలోని బాహ్లిక- మద్ర- కాశ్మీర దేశములు

7. నైరుతి దిక్కున వున్న "సింధు- సౌవీర" దేశములును

8. ఈనాటి గుజరాత్ లోని "రాజపుత్రస్థానం" అనబడుతున్న "మరుస్థలము" ఇంకను "మత్స్య- త్రిగర్త- రశార్గ దేశములు"లును- "శూరసేన - అవంతి- సౌరాష్ట్ర" దేశములను, "మాల్వా"- మధ్యరాష్ట్రభాగములలోని "నిషధ- హైహయ- విదర్భ- ఛేది - దక్షిణ కోసల దేశములును-

9. పాంచాలమునకు తూర్పున వుండిన "కాశీ-కోసల" దేశములును-

10. బీహార్- బంగాళ రాష్ట్రాలలోని విదేహ- మగధ- అంగవంశ- పుండ్రదేశములును

11. అస్సాం - చీనా(చైనా) - బర్మా భాగములలోని ప్రాగ్జోతిష రాజ్యమును

12. ఉత్కళ ఆంధ్ర - మహారాష్ట్ర దేశములలోని కళింగ - ఆంధ్ర- మణిపుర- శ్రోణ - మల్ల " దేశముల భాగములును

13. ద్రవిడ- కర్నాటక- మహారాష్ట్ర భాగములలోని చోళ- పాండ్య- కేరళ- కొంకణ- సౌక్య దేశములును కలవు. ఇవి మహా భారతకాలం (ద్వాపరయుగము) నాటి భరత ఖండస్థ రాజ్యాలు, ఎల్లలు.

## మహాభారత యుద్ధకాలము నాటి ముఖ్యమైన దేశాలు వాటి రాజధానులు - రాజులు

1. **కురు రాజ్యము** : రాజధాని హస్తిపురి, రాజు ధృతరాష్ట్రుడు కౌరవుల తండ్రి ఈయన కాలము లోనే మహాభారత యుద్ధం జరిగింది. ఇతను పుట్టు గ్రుడ్డి

2 **పాంచాల దేశము** : రాజధాని కాంపిల్యనగరం, రాజు ద్రుపదుడు. ఇతని పెద్ద కుమారుడు శిఖండి. ఇతడు మొదట్లో స్త్రీగా జన్మించి తదుపరి లింగమార్పిడి ద్వారా పురుష డయ్యాడు. పూర్వ జన్మలో ఇతడు కాశీరాజు కుమార్తె అయిన అంబ. భీష్మాచార్యుణ్ణి అర్జునుడు సంహరించింది ఈతనిని అడ్డ ముంచు కొనే. ధృష్టద్యుమ్నుడు ద్రుపదునికి పుత్ర కామేష్టివలన జన్మించిన వాడు. ద్రోణుణ్ణి సంహరించుటకై ద్రుపదుడు ఈతనిని జన్మింప జేశాడు. ౩. ద్రుపదునికుమార్తె ద్రౌపది, ఈమె పాండవుల ధర్మపత్ని.

3. **గాంధార దేశము** : రాజధాని ప్రష్ణలావతి, రాజు శకుని. ఇతడు కౌరవులకు మేనమామ. మాయజూదగాడు.

4. **మద్రదేశము**: రాజధాని శాకల్యపురం, రాజు శల్యుడు. ఇతని సోదరి మాద్రి నకుల సహదేవులుకు ఈమె తల్లి. పాండురాజు రెండోభార్య. అందువలన ఈతడు నకుల సహదేవులకు మేనమామ. అయినను దుర్యోధనుని పక్షములో చేరి మహాభారతయుద్ధములో పాల్గొని "శల్య సారథ్యము "చేసి కర్ణుని చావుకు కారకుడయ్యాడు. బాహ్లిక దేశములో కొంతభాగము ఈతనికి లోబడి యుండెడిది.

5. **బాహ్లికదేశము** : రాజు బాహ్లికుడు. ఇతడు భీష్మునికిపినతండ్రి. మహాభారతయుద్ధములో ఇతడు కౌరవుల పక్షాన పనిచేశాడు. యుద్ధములో పాల్గొనే నాటికి ఈతనికి నూరేళ్లు మించాయి. ఈతని కుమారుడు సోమదత్తుడు. మనుమడు భూరిశ్రవుడు కూడ మహాభారత యుద్ధములో కౌరవుల పక్షాన పోరాటము చేశారు. వీరందరు పాండవులచే చంపబడ్డారు. మేనమామకు దత్తత వెళ్లి బాహ్లికదేశానికి రాజు అయ్యాడు.

6. **కేకయదేశము** : రాజులు జయత్సేనాదులు అయిదుగురు. ధర్మరాజుని పినతల్లి కుమారులు. కుంతి చెల్లెంద్ర బిడ్డలందరిలో పాండవుల పక్షము వహించి పోరాడిన వారువీరే.

7. **సింధుదేశము** : రాజు జయద్రథుడు (ఇతడే సైంధవుడు), ధృతరాష్ట్రుని కూతురు దుస్సల భర్త. దుర్యోధనుని బావ పాండవులు అరణ్యవాసములో వున్నపుడు ద్రౌపదిపై అత్యాచారము చేయుటకు ప్రయత్నించినవాడు.

8. **సౌవీరదేశము** : పండ్రెండు మంది సోదరులు, ఈదేశము సైంధవునికి లోబడిన సామంతదేశము. ఆదేశ ప్రభువులు (పండ్రెండుగురు) అరణ్యవాసములో పాండవులతో పాటున్న ద్రౌపదిని సైంధవుడు ఎత్తుకొని వెళ్లడంలో సహకరించారు. వీరందరిని అర్జునుడు వధించాడు.

**9. కుంతి భోజదేశము :** రాజు శ్వేనజిత్తు. కుంతి తమ్ముడు. ఈతడునాగవంశస్థుడు అని శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన మహా భారత చరిత్రలో తెలుపబడింది. దీనిని బట్టి కుంతీదేవి నాగవంశస్థురాలని భావించవలసి వుంది.

**10. శూరసేనదేశము :** రాజధాని ద్వారక, రాజు ఉగ్రసేనుడు. శ్రీకృష్ణుని మాతామహుడు. ఉగ్రసేనాదులు కురు, పాండవ, యుద్ధసమయంలో తటస్థంగా వున్నట్లు తెలుస్తున్నది.

**11. అవంతి దేశము :** రాజధాని ఉజ్జయిని, విందుడు, అనువిందుడు, పాండవులకు పినతల్లి కుమారులు అయినవీరు మహా భారతయుద్ధములో దుర్యోధనుని పక్షములో చేరి యుద్ధముచేశారు.

**12. త్రిగర్త దేశము :** రాజు సుశర్మ. "సంశప్తసేన"లో చివరి వరకు అర్జునుని ప్రతిఘటించి పోరాడినవాడు. గోగ్రహణములో విరటుని పట్టుకొనగా పాండవులు ఈతనిని వధించి విరటుని విడిపించారు.

**13. మత్స్యదేశము :** రాజధాని ఉపప్లావ్యము, రాజు విరటుడు. మహాభారతం విరాటపర్వంలో ఈతని గాథ ప్రసిద్ధి గాంచినది.ఈయన వద్దనే పాండవులు, వారి సతీమణి ద్రౌపది అజ్ఞాతంగా కాలంగడిపారు. ఈయన కూతురు ఉత్తర ను అభిమన్యునకుఇచ్చి వివాహం చేశారు.తదుపరికాలంలో ఉత్తర-అభిమన్యుల కుమారుడు అయిన పరీక్షిత్తుమహారాజే కురు మహాసామ్రాజ్యాన్ని పాలించాడు. ఇప్పటికీ మనదేశంలో వర్షాలు కురవనప్పుడు వరుణదేవుని అనుగ్రహంకోసం విరాటపర్వం పఠిస్తూ వుండడం ఆచారం.

**14. దశార్ణదేశము :** రాజు పిచిర్యావర్మ. ఇతడు పాండవపక్ష మందుండి మహాభారతయుద్ధంలో పాల్గొనిన వాడు. యుద్ధంలో భగదత్తునితో పోరి చచ్చెను.

**15. హైహయదేశము :** రాజధాని మిష్మతి, రాజు నీలుడు. ఇతడు రాజసూయ కాలం నుండి సహదేవుని పట్ల వైరభావ ముండినందున కౌరవపక్షములో చేరెను.

**16. కాశీదేశము :** రాజధాని కాశి. రాజు కాశీరాజు. ఈ కాశీరాజు మహాభారతయుద్ధము కంటే ముందే శ్రీకృష్ణునితో పోరాడి మరణించినట్లున్నది. అతను మరణించి నందున అతని సైన్యము మాత్రము యుద్ధంలో పాల్గొని పాండవుల పక్షం వహించిందని శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ మహాభారత విమర్శ గ్రంథంలో తెలిపాడు. కాని కాశీరాజు స్వయంగా యుద్ధానికి ముందు తన శంఖాన్ని పూరించినట్లు భగవద్గీత 17వ శ్లోకం మొదటి పాదంలో "కాశ్యశ్చ పరమేష్వాసః" అంటే గొప్పదగు విల్లు కలిగినకాశీరాజు తన శంఖమును పూరించెను అని వుంది.

**17 ఉత్తరకోసలదేశము:** రాజధాని అయోధ్య, రాజుబృహద్రథుడు. పద్మవ్యూహంలో ఇతను అభిమన్యునిచేత చచ్చెను.

**18. మగధదేశము :** రాజధాని రాజగృహము, రాజు సహదేవుడు. జరాసంధుని కుమారుడు. ఇతడు మహాభారతయుద్ధములో పాండవుల పక్షములో పోరాటం చేసి ద్రోణుని చేత చంపబడెను. కాని ఈతని కుమారుడు మార్జారి అనునతడు పాండవులకు ఎదురొడ్డి అర్జునుని చేత చంపబడినట్లు అశ్వమేధపర్వంలో చెప్పబడినట్లు శ్రీ పెండ్యాల వేంకట సుబ్రమణ్యశాస్త్రిగారు తెలుపుతున్నారు.

**19 ఛేదిదేశము :** రాజధాని శక్తిపురి, రాజు ధృష్టకేతుడు. ఇతడు పాండవ పక్షములో చేరి మహాభారత యుద్ధములో పాల్గొనెను.

**20 ప్రాగ్జోతిషదేశము :** రాజధాని ప్రాగ్జోతిషపురం, రాజు భగదతుడు. ఇతడు నరకాసురుని కుమారుడు. యుద్ధంలో కౌరవపక్షమున చేరి అర్జునుని చేత చంపబడ్డాడు.

**21. అంగదేశము :** రాజధాని చంపానగరం. రాజు కర్ణుడు. ఇతడు కుంతి కన్యగా వున్నపుడు సూర్యభగవానుని వల్లజన్మించినవాడు. ఇతడు సహజకవచకుండలాలతో జన్మించాడు. లోకాపవాదుకు వెరచి కుంతి ఈతనిని పెట్టెలో పెట్టి నదిలో జారవిడిచింది. తదుపరి మహారథుడు అను సూతుని చేత పెంచబడ్డాడు.

కుమార విద్యా ప్రదర్శన సమయంలో కర్ణుడు అర్జునునితో పోరుటకు క్షత్రియుడు (రాజు) కాదన్న ఆక్షేపణమును కృపాచార్యుడు చేయగా వెంటనే దుర్యోధనుడు ఆతనికి అంగరాజ్య మిచ్చి పట్టాభిషేకము చేసెనని ఆదిపర్వమందున్నది. కాని అది అసత్యమని శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి గారు తరువాత భారత చరిత్రలో వ్రాశారు. అందుకు కారణం దుర్యోధనునకు అపుడెట్టి అధికారము లేదు అని తెలిపారు. అప్పటికే ధర్మరాజు కురురాజ్య పీఠానికి "యువరాజు" గా ప్రతిష్ఠింపబడియుండుట చేత దుర్యోధనుడు విలపించినట్లు మహాభారతములో తెలుపబడింది కనుక దుర్యోధనునికి రాజ్యమిచ్చే అధికారం ఎక్కడిది? అని ప్రశ్నించారు శ్రీ శాస్త్రిగారు.

పాండవులు అరణ్యవాసంలో వున్నపుడు మగధదేశపు రాజు జరాసంధుని రాజధానీ నగరం "రాజగృహం"లో జరిగిన ఒక స్వయం వరం సందర్భంగా దుర్యోధనుని పక్షంవహించి జరాసంధునితో పోరు సలిపి ఆతనిని ఓడించి బహుమతిగా "మాలినీ నగరం" చేకొనెనని శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తెలిపారు. కర్ణుడు జరాసంధుని నుండి బహుమతిగ గొనినదే అంగరాజ్యంలోని భాగం అని తెలిపారు.

"ద్రోణుడు, కర్ణుడు, బాహ్లికుడు" కురురాజ్యమునకు లోబడి అహిచ్ఛత్రము- అంగ-బాహ్లిక రాజ్యములకు సామంతరాజులు, ఆకారణంగా దుర్యోధనునకు రారాజు (చక్రవర్తి) అనిపేరువచ్చింది.

**22 పాండ్యదేశము :** రాజధాని మణిపురం, రాజు మలయధ్వజుడు. ఇతని కుమార్తె చిత్రాంగదను పాండవమధ్యముడైన అర్జునుడు వివాహమాడెను. ఈమె ద్వారా అర్జునునకు పుట్టిన బభ్రువాహనున్ని పాండ్యదేశానికి రాజుగ జేసెను "మలయ ధ్వజుడు" మహాభారత యుద్దంలో పాండవుల పక్షాన పోరుసలిపెను. ఆ యుద్ధంలో అశ్వత్థామ చేత సంహరించబడెను.

**23 కళింగదేశము** : రాజధాని రాజపురం. రాజు చిత్రాంగదుడు (మహాభారత యుద్ధసమయాన ఇతని పేరు శ్రుతాయువుగా మార్పు చేయబడింది), ఇతడు దుర్యోధనునికి మామ. కళింగ సైన్యములు కౌరవుల పక్షాన భయంకరపోరాటం శృతాయువుతో కలిసి సలిపింది. భీమునిచేత వధింపబడ్డాడు. వేరొక చోట వృద్ధుడైన కారణంగా శ్రుతాయువు యుద్ధంలో పాల్గొనక తన సైన్యాలను మాత్రం కౌరవుల పక్షానయుద్ధంలో నిలిపినట్లు తెలియజేయబడింది.

**24 సాళ్వదేశము**: రాజధాని సౌంధకపురి, దీనినే మృత్తికావతం అని కూడా అందురు. రాజు సాళ్వుడు. కాశీరాజు పెద్ద కుమార్తె "అంబ"విషయమై ఈతనికిభీష్మునితో పోరాటం జరిగింది. మహాభారత యుద్ధంలో ఈతడు కృష్ణునిచే చచ్చెను. అయితే సాత్యకి ధృష్టద్యుమ్నుల చేత చంపబడిన సాళ్వుడు వేరొకడు. అతడు మ్లేచ్ఛదేశాధీశుడు. అంబ కొరకు భీష్మునితో పోరాడిన సాళ్వుడు మొదటివాడు.

**25 ఉలూకదేశము** : రాజు క్షేమధ్వని. ఇతడు యుద్ధంలో కౌరవుల పక్షానపోరాటం సలిపి భీముని చేత చంపబడ్డాడు.

**26 కాంబోజదేశము** : రాజు సుదక్షిణుడు. ఇతడు యుద్ధమందు అర్జునుని చేత చంపబడెను.

**27 అంబష్ఠదేశము** : రాజు శ్రుతాయువు. ఇతడు కూడా అర్జునుని చేతిలో చచ్చెను.

**28 విదర్భదేశము** : రాజు రుక్మి . కుండిననగరం రాజధాని శ్రీకృష్ణునకు బావమరిది, ఈతని సోదరి రుక్మిణి శ్రీకృష్ణుడు వివాహమాడెను. శ్రీ కృష్ణుని అన్న బల రామునికి ఇతనికి వైరం. బలరాముని పక్షములో చేరి యుద్ధం చేయలేదు. గనుక ఇతడు కూడా మహాభారత యుద్ధంలో పాల్గొనలేదు.

శ్రీ కృష్ణ భగవానుని వాక్యమును వినిన అర్జునుడు అపుడు ఏం చేసెనో దానిని గూర్చి సంజయుడు ధృతరాష్ట్రునకు వివరిస్తున్నాడు.

"తత్రా పశ్యత్ స్థితాన్ పార్థః
పితౄనథ పితామహాన్
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్
పుత్రాన్, పౌత్రాన్ సఖీంస్తథా"
శ్వశురాన్ సుహృదశ్చైవ
సేనయోరుభయోరపి" శ్లో-26

"పిమ్మట అర్జునుడు అచట
రెండు సేనలయందున్నట్టి
తండ్రులను, తాతలను
గురువులను, మామలను
మేనమామలను, అన్నదమ్ములను
కొడుకులను, మనుమలను
స్నేహితులను కూడ చూచెను"

ప్రభువు యొక్క ఆదేశము మేరకు అర్జునుడు కళ్లు తెరిచాడు. అటువైపు, ఇటు వైపు కళ్లు త్రిప్పి అక్కడ ఆ యుద్ధ భూమిలో మోహరించియున్న ఉభయ పక్షాలలోని బంధు జనులందరిని చూచెను. అందులో భూరిశ్రవస్సు మొదలుగా గల తండ్రులను, భీష్ముడు, బాహ్లికుడు మొదలుగాగల తాతలను, ముత్తాతలను, ద్రోణాచార్యుడు కృపాచార్యుడు లాంటి గురువులను పురాజిత్తు, కుంతిబోజుడు (కుంతీదేవి సోదరులు) శల్యుడు (మాద్రిసోదరుడు) లాంటి మేనమామలను, యుధిష్ఠరుడు (ధర్మరాజు) తన స్వంత అన్నలను, పెద్ద తండ్రి కుమారులయిన దుర్యోధనాదులను అభిమన్యుడు, ప్రతివింద్యుడు, ఘటోత్కచుడు మొదలుగా గల కుమారులను, పెద తండ్రి ధృతరాష్ట్ర కుమారుడైన దుర్యోధనుని కుమారుడు లక్ష్మణుణ్ణి వారినే కాకుండా బాల్యదశలో వున్ననాడు తనతో సహాధ్యాయులుగా వుండిన అశ్వత్థామ మొదలుగా గల ఎందరో స్నేహితులను ద్రుపదుడు, శైభ్యుడు లాంటి మామలను ఇంకా అక్కడు చేరిన ఎందరో హితైషులను అర్జునుడు చూచెను. అర్జునుడు ఈ విధంగ ఉభయ సైన్యములలోని బంధుమిత్రాదులను చూచిన పిమ్మట అతను ఏం చేసెనో దానిని గూర్చి సంజయుడు ధృతరాష్ట్రునకు వివరిస్తున్నాడు.

తాన్ సమీక్ష్య స కౌంతేయ
సర్వాన్ బంధూన వస్థితాన్
కృపయా పరయా విష్టో
విషీదన్నిద మబ్రవీత్ శ్లో - 27

యుద్ధసన్నద్ధులైయున్న
బంధువులను జూచి
వారిపట్ల అపారమైన
దయ కలిగిన వాడై
దుఃఖించుచు అర్జునుడు
ఈవిధముగా పలికెను.

వెనుకటి ఒకటిన్నర శ్లోకంలో అర్జునుని యొక్క తండ్రులను, తాతలను, ముత్తాతలను, గురువులను, మామలను, మేన మామలను, సోదరులను, కుమారులను, మనుమలను గూర్చి పేర్కొనబడెను. అయితే బావమరదులు అయిన ధృష్టద్యుమ్నుడు, శిఖండి, సురథ మొదలైన వారిని, పెద తండ్రి ధృతరాష్ట్రుని కుమార్తె దుస్సల భర్త జయద్రధుడు మొదలగు వారిని గూర్చియు ఇంకా ఇతర బంధువులైన యోధుల గూర్చి ప్రత్యేకంగా వివరించక ఇతర బంధువులందరు అని తెలుపబడింది.

ఈ మానవ సంహార కార్యక్రమంలో కురుక్షేత్ర యుద్ధ భూమియందు వారందరు మోహరిస్తారని అర్జునునకు స్పష్టంగా తెలుసు. అట్లు తెలిసే కృతనిశ్చయుడై యుద్ధం చేయడానికే కురుక్షేత్ర రణరంగంలో ప్రవేశించాడు. కాని ప్రత్యక్ష దర్శనము వలన వీరందరు "నా వారు - నాబంధువులు" అనే మమకార బుద్ధిఅర్జునునిలో ఏర్పడింది. దానివల్ల వీరిని ఎట్లు చంపుదును? అను కారుణ్యం అతనిలో జనించింది. ఈ కారుణ్య దృష్టితోనే ఇక్కడ నుండి పూర్తిగా ఈ అధ్యాయములోని 46వ శ్లోకం వరకు అర్జునుడు యుద్ధ విముఖతను ప్రదర్శిస్తూ అందుకు ఏవేవో కారణాలను చూపుతున్నాడు.

తనదీన పరిస్థితిని గూర్చి శ్రీకృష్ణునితో అర్జునుడు ఈ విధంగా విన్నవించుకుంటున్నాడని సంజయుడు తెలుపుతున్నాడు.

"దృష్ట్వేమం స్వజనం కృష్ణః
యుయుత్సుం సముపస్థితం
సీదంతి మమగాత్రాణి
ముఖంచ పరిశుష్యతి          శ్లో - 28

కృష్ణా !
యుద్ధసన్నద్ధులై యున్న
నా బంధువులందరినీ
చూడగా నాఅవయములు
పట్టు తప్పుచున్నవి, నోరు
ఎండుకొని పోవుచున్నది
శరీరమందు వణుకు పుట్టి
గగుర్పాటు చెందుచున్నది"

పైన తెలిపిన మాటలను బట్టి ఈ భయంకర యుద్ధము వలన ఇరుపక్షాల వారికి సంభవింపనున్న ఘోర విపత్తును గూర్చి అర్జునుడు ప్రకటించాడు. అతని ఆ పలుకులను గూర్చి ఈ విధంగా భావించవలసివుంది. అతనికి తెలుసు అక్కడ అతని కళ్లముందు మోహరించియున్న యువకులు, వృద్ధులు అతనికి ప్రియమైన తండ్రులు, తాతలు, దాయాదులకుమారులు, తదితర బంధువులు, స్నేహితులు అని. ఈ బంధుత్వము అంటే రక్త సంబంధం అతని హృదయాన్ని కలచివేసి భయాన్ని పుట్టించింది. ఆ భయం అతని మనస్సులో నిప్పును రాజేసింది. దాని ప్రభావము అతని శరీరంపై శరీరావయాలలో వణుకును పుట్టించి శరీరం గగుర్పాటు చెందునట్లు చేసింది.

"వే పథుశ్చ శరీరేమే
రోమ హర్షశ్చ జాయతే
గాండీవం స్రంసతే హస్తాత్
త్వక్చైవ పరిదహ్యాత" శ్లో - 29

"నచశక్నో మ్యవస్థాతుం
భ్రమతీవచ మే మనః
నిమిత్తానిచ పశ్యామి
విపరీతానికేశవ" శ్లో - 30

"గాండీవము చేతినుండి
జారిపడిపోవుచున్నది
చర్మము మండుచున్నది
నిలబడుటకు కూడశక్తి
లేని వాడనై యున్నాను
నామనస్సు భ్రమించుచున్నది"

ఇక్కడ మనం తెలుసుకోవలసింది ఆ సమయములో అర్జునునికి కలిగిన శారీరక, మానసిక వికారముల గూర్చి అవన్నీ అతని భయానికి, అధైర్యానికి నిరుత్సాహానికి చిహ్నములు. అంతకు ముందు అతడు ఎన్నో యుద్ధాలలో పాల్గొని విజయాన్ని పొందాడు, ఆ సమయంలో జరిగిన శత్రు సంహారాన్ని గూర్చి అతడు బాధపడివుండలేదు. మరి ఈ సమయంలో ఎందుకీ బాధ అతనిలో కలిగింది. శారీరక బలానికిగాని, భౌతిక శక్తికిగాని అతనికి ఎంత మాత్రము

లోటు లేదే! అలాంటప్పుడు ఎందుకిదంతా? అంటే అతడు మానసికంగా దెబ్బ తినెను అని మనం తెలుసుకోవలసి వుంది. అతని మానసికస్థితి ఎందుకిట్లు అయింది అని విచారిస్తే వీరంతా నా వారు (స్వజనం) వీరిని నేనెట్లా చంపేది? అను మానసిక వేదన అతనిలో బయలుదేరింది. ఈ మమకారం అతన్ని పీడించ బట్టే "దృష్ట్వేమం స్వజనం కృష్ణ". కృష్ణాచూస్తుంటే ఇక్కడున్న వారందరూ నా స్వజనులుగా యున్నారు అన్నాడు. ఈ మమకారమే అతనిని బలహీనపరిచింది. "మహర్షి వినోబా" 1932లో ధూలియాజైలులో వున్నపుడు ఖైదీలనుద్దేశించి భగవద్గీతపై ప్రసంగిస్తూ ఈవిషయమై ఈ విధంగా వ్యాఖ్యానించారు.

" అర్జునుడు కృతనిశ్చయుడయ్యే కర్తవ్య భావముతోనే యుద్ధభూమిలో వచ్చి నిలుచున్నాడు. క్షాత్రవృత్తి అతని స్వభావము నందువుండియె యుండెను. యుద్ధములో దిగకుండానుండటకుగాను పాండవులు ముందుగా చేయవలసినన్ని ప్రయత్నాలు చేసి యున్నారు. అయినా యుద్ధము తప్పలేదు. కనీసపు కోరికల ప్రస్తావన, శ్రీకృష్ణుని లాంటివారి మధ్యవర్తిత్వం రెండును విఫలమై పోయాయి. ఇట్టి స్థితిలో అనేక దేశముల రాజులను ప్రోగుచేసి, తన సారథిగా వుండుటకు శ్రీకృష్ణుని ఒప్పించి తాను రణరంగమున నిలిచి వీరోచితమైన ఉత్సాహముతో అర్జునుడు శ్రీకృష్ణునితో ఇట్లు పలికెను - "కృష్ణా! రెండు సేనల మధ్యగా నారథమును నిలుపుము, నాతో యుద్ధము చేయసిద్ధమై వచ్చిన వారి ముఖవైఖరి నొక్కసారి చూచెదను" అనగా శ్రీకృష్ణుడట్లే చేసెను. అపుడు అర్జునుడు నలువైపులకు దృష్టిని సారించెను. అప్పుడక్కడ అతనికి అగుపించినదేమిటి? ఇరుపక్షములయందుండు ప్రచండమైన బంధుమిత్రుల సమూహమే చచ్చుటకును- చంపుటకును అంతిమ నిశ్చయంతో వచ్చి చేరిన నాలుగు తరముల ఆప్తులను, స్వజనులను, తాతలను, తండ్రులను, కుమారులను, మనుమలను అతడక్కడ చూచెను. ఇంతకు పూర్వం అతడు ఊహింపనిస్థితి కాదు అది. కాని ప్రత్యక్షదర్శనము వలన కలుగు పరిణామము ప్రత్యేకముగనేయుండును. స్వజనుల సమూహమును చూచిన మీదట అతని హృదయంలో అశాంతి వ్యాపించెను. అతడు ఖిన్నుడైపోయాడు. నేటివరకు అతడు అనేక యుద్ధములలో అసంఖ్యాకులగు వీరులను సంహరించియే యుండెను. అప్పుడతడు ఖిన్నుడు కాలేదు. అతని గాండీవము చేతి నుండి జారిపడలేదు. శరీరం కంపించి యుండలేదు. కాని ఇప్పుడతనికి ఎందుకట్లయినది? అతని మనస్సులో ఏమైన అశోకునివలె అహింసావృత్తి ఉదయించెనా? లేదే! మరి ఎందుకు? అది కేవలం స్వజనాసక్తి. ఈ సమయంలో కూడా గురువులు, ఆప్తులు, బంధువులు ఎదుట లేకుండినచో అతడు శత్రువుల తలలను బంతులవలె ఎగురగొట్టి యుండెడివాడే. కాని ఆసక్తి జనితమైన మోహము అతని కర్తవ్యనిష్ఠను మింగివేసింది. అప్పుడతనికి తత్వజిజ్ఞాస జ్ఞప్తికి వచ్చింది. కర్తవ్య నిష్ఠగలవాడు మోహగ్రస్థుడైనప్పుడు నగ్నరూపంలో కర్తవ్యచ్యుతుడగుటకు అంగీకరింపడు. అప్పుడతడు తన

ఆ పతనానికి ఏదో ఒక ధర్మసూత్రపు బురఖా తొడుగును. ఇక్కడ అర్జునునకిదియేస్థితికలిగింది. అందువల్లనే అతడు యుద్ధమే పాపకార్యమని చెప్పడానికి సాహసించాడు. యుద్ధము వలన కులంక్షయించునని, ధర్మము నశించునని, స్వేచ్ఛాచారము ప్రబలునని వ్యభిచారవృత్తి వ్యాపించునని, క్షామము వచ్చిపడుతుందని, రకగకాలైన సంకటాలు సమాజమును ఆవరించునని అనేక యుక్తికారకములతో కృష్ణునకు నచ్చజెప్ప ఆరంభించెను"

అర్జునుని వద్ద వున్న గాండీవము ఒకదివ్య ఆయుధము. అది తాడిచెట్టు ప్రమాణములో వున్నట్టు మహాభారతము ఉద్యోగ పర్వములో వివరించబడింది. ఈ విషయాన్ని బృహన్నల రూపంలో వున్న అర్జునుడు ఉత్తర గోగ్రహణ సందర్భంగా విరాటరాజు కుమారుడు ఉత్తరునితో స్వయంగా చెప్పాడు.

ఇది మొత్తం ప్రపంచములోని ఆయుధాల్లోనే గొప్ప దివ్యమైన ఆయుధం. దానిశక్తి వెయ్యి ఆయుధముల శక్తితో సమానమైనది. ఈ ఆయుధముతోనే అర్జునుడు ఎందరో దేవదానవులను కూడా ఎదిరించగలిగాడు. ఈ సున్నితమైన, చిత్ర విచిత్రమైన, బ్రహ్మాండమైన ఆయుధం చాలకాలం దేవతల వద్దను, రాక్షసుల వద్దను, గంధర్వుల వద్ద 1000సంవత్సరాలు, ప్రజాపతి బ్రహ్మవద్ద 503 సంవత్సరాలు, 85 సంవత్సరాలు ఇంద్రునివద్దను, 500 సంవత్సరాల పాటు చంద్రునివద్దను, 600 సంవత్సరాలు వరుణుని వద్దను, అటు పిమ్మట అగ్నిదేవుని ద్వారా వరుణ దేవుని నుండి ఖాండవ వన దహన సందర్భంగా అర్జునుడు పొందినట్లు మహాభారతం ఆదిపర్వంలో తెలుపబడింది.

నచ శ్రేయోను పశ్యామి
హత్వా స్వజన మాహంవే
నకాంక్షే విజయం కృష్ణః
నచరాజ్యం సుఖానిచ శ్లో -31

"'కృష్ణా !
అనేకములైన దుశ్శకునములను
గాంచుచున్నాను, ఈ యుద్ధము
నందు బంధువులను వధించి
నేను పొందబోయె శుభం ఏమిటో
తెలియజాలకున్నాను"

శకునాలు జరుగనున్న మంచిని గాని, చెడును గాని సూచిస్తాయి. సమయము గాని సమయంలో గ్రహణము సంభవించడం, భూమి కంపించడం, ఆకాశములోని నక్షత్రాలు నేలరాలడం లాంటివి ఇవన్నీ అశుభానికి సూచకాలు. ఇలాంటివన్నీ అగుపించడం వలన

యుద్ధం సంతోషకరమైంది కాదని అర్జునుడు భావించాడు. ఆ కారణంగా అతడు యుద్ధం చేయరాదని తలంచాడు. ఆతని అట్టి తలంపుకు కారణాలు ఈ క్రిందివిధగా భావించవచ్చు. హింసామార్గంలో బంధువులను వధించి శాశ్వతంగా మానసికవేదనను పొందకూడదనుకొనుట మొదటిది.

ఇక వారంతా లేనప్పుడు రాజ్యాధికారం పొంది లాభం ఏమిటి? అని భావించుట.

చివరి కారణం మారణహోమం వలన భూలోకంలో గానీ, స్వర్గంలో గాని పొందబోయేది ఏదీలేదని భావించుట. అందువల్లనే యుద్ధం అనవసరం అంటున్నాడు అర్జునుడు.

కింనోరాజ్యేన గోవిన్దః
కిం భోగైర్జీవి తేన వా?
యేషా మర్థే కాంక్షితం నో
రాజ్యం భోగా స్సుఖానిచ శ్లో -32

*నేను విజయమును గాని*
*రాజ్యమును గాని, రాజ్యసుఖములను*
*గాని ఆశించడం లేదు, గోవిందా!*
*మాకు రాజ్యము వలన గాని, రాజ్య*
*భోగముల వలన గాని, ఓడించడం*
*వలన గాని కలిగే ప్రయోజనము ఏమిటి?*

బంధు మిత్రాదులందరిని యుద్ధములో వధించిన పిమ్మట లభించబోయె రాజ్యము, రాజ్య భోగాలు ఏమీ అక్కర లేదని అర్జునుడు తన నిశ్చితాభిప్రాయాన్ని శ్రీ కృష్ణునికి ఈ శ్లోకములో తెలియజేశాడు. ఈ మారణహోమము వలన ఇహలోకంలో గాని, పరలోకములోగాని తాను పొందబోయేది ఏదీ లేదనీ, అది మానసిక వేదనను కలిగిస్తుందే తప్ప ఇంకే విధమైన సుఖాన్నివ్వజాలదని స్పష్టీకరించాడు. వారంతా అంటే బంధు, మిత్రులందరూ లేకుండా లభించే రాజ్యముగాని, రాజ్య సుఖాలు గాని అతని దృష్టిలో హీనమైనవి.

యుద్ధం ఎందుకు చేయకూడదో దానివలన కలగబోయె దుష్పరిణామము ఏమిటో ఇక్కడ అర్జునుడు తెలియజేస్తున్నాడు

త ఇమే వస్థితా యుద్ధే
ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ
ఆచార్యాః పితరః పుత్రా
స్తథైవ చ పితామహాః                శ్లో -33

‘ఏవరి కొరకు మేము రాజ్యమును
భోగమును, సుఖములను
అభిలషించు చున్నామో అట్టి
వారందరూ ఈ యుద్ధభూమిలో
తమ ప్రాణాలమీద ఆశను వీడి నిలిచి వున్నారు”

మాతులాః శ్వశురాః పౌత్రాః
శ్యాలాః సంబంధినస్తథా
ఏతాన్న హంతుమిచ్ఛామి
ఘ్నతో పి మధుసూదన”                శ్లో -34

అపి త్రైలోక్య రాజ్యస్య
హేతోః కింను మహీకృతే
నిహత్య ధార్త రాష్ట్రాన్నః
కా ప్రీతి స్స్యా జనార్ధనః                శ్లో -35

మధుసూదనా!
వారు నన్ను చంపవచ్చినను
త్రిలోక రాజ్యాధిపత్యానికైనా వారిని
నేను చంపబోను, అలాంటప్పుడు
కేవలం ఈ రాజ్యం కొరకు వారిని
నేను చంపలేనని వేరే చెప్పవలెనా?

“మధు” అను రాక్షసుని సంహరించి యున్నందున శ్రీకృష్ణునకు “మధుసూద నుడు’ ’ పేరు వచ్చింది.

పాప మేవాశ్రయే దస్మాన్
హత్వైతా నాతతాయినః
తస్మాన్నార్హా వయం హన్తుం
ధార్త రాష్ట్రాన్ స్వబాంధవాన్
స్వజనంహి కథం హత్వా
సుఖినః స్యామ మాధవ!                శ్లో - 36



జనార్ధనా!
దుర్మార్గులైన దుర్యోధనాదులను
చంపుటవలన మాకు కలుగబోయే
శుభం ఏమియులేదు. పాపాత్ములైన
వారిని చంపుటవలన మాకు
పాపమే చుట్టుకొనును

"ఆతతాయినః" అంటే మహాపాపాలు చేసేవారని అర్థము. వారు ఆరు రకాలు. 1.ఇంటికినిప్పపెట్టివారు 2. విషమిచ్చి మనుషులను లేదా ఇతర ప్రాణకోటిని చంపువారు 3. నిరాయుధులైయున్న వారిని ఆయుధములతో ఎదిరించి సంహరించువారు 4. ఇతరుల ధనమును అపహరించువారు. 5. ఇతరుల భూములను దౌర్జన్యంగా ఆక్రమించుకొనెవారు. 6. ఇతరుల భార్యలను చెరబట్టువారు, ఈ ఆరుగురు ఆతతాయులు అంటే మహాపాపులు. ఇట్టి వారిని ఎట్టి విచారణ లేకయే వధించవచ్చును అని అర్థశాస్త్రము తెలుపుతున్నది. అట్టివారు

"గురుంనా బాల వృద్ధా నా బ్రాహ్మణం నాగుణాన్వితం
ఆతతాయిన మాయాంతం, మన్యాదే నా విచారయన్
నాత తాయివధే దోషోహంతుర్భవతి కశ్యప"

గురువైనను, బాలుడైనను, గుణవంతుడైనను, బ్రాహ్మణుడైనను అతడు ఆతతాయి అయిన పక్షములో అతని మంచి చెడులను విచారింపకయే చంపదగును. ఆతతాయిని చంపువాని కెట్టి దోషము కలుగదు. అను అర్థస్మృతి వాక్యములననుసరించి దుర్యోధనుడు, అతని పక్షమందున్న వారందరునూ "ఆతతాయులు" అంటే పాపాత్ములు. కనుక వారిని చంపుట వలనఏ పాపము కలుగదని అర్థము.

ఇక్కడ మరొక్క గమనించదగ్గగల అంశం ఏమిటంటే పాపాత్ములైన దుర్యోధనాదుల పక్షాన చేరిన "భీష్మాచార్యులు- ద్రోణాచార్యు లు, కృపాచార్యులు" లాంటి వారు ఆతతాయులు కాబట్టి వారిని సంహరించిన కూడా సంహరించిన వారికి పాపము అంటుకోదు అని అర్థస్మృతి స్పష్టీకరిస్తున్నది.

కాని ఇక్కడ అర్జునుడు "మహింశాంసీః సర్వభూతానిః" అనువేద వాక్యముననుసరించి ఎట్టి ప్రాణిని చంపినను చంపిన వాడు పాపి కాక తప్పదు. అందువలన ఆతతాయులు (పాపాత్ములైన) దుర్యోధనాదులను చంపినప్పటికీ పాపమే చుట్టుకుంటుందని కృష్ణునితో చెప్పినట్లు భావించవలసి వుంది.

ఈ విషయమై పండిత గోపదేవ శాస్త్రిగారు తమ "భగవద్గీత" అనే గ్రంథంలో ఈ విధంగా వ్యాఖ్యానించారు.

అర్థశాస్త్ర విధానం కంటే ధర్మశాస్త్రమైన వేదవిధిని అధిక ప్రమాణముగా ఎంచవలెను. శృతి స్మృతులలో పరస్పర విరోధము కలిగినప్పడు శ్రుతినే అంగీకరించవలసి వుంటుందని మహర్షులైన వారు అంగీకరించారని మహర్షులు తెలిపిన ఈ అనుమానాన్ని ఇక్కడ సూచించారు.

"శ్రుతిస్మృతి విరోధేతు శృతిరేవగరీయుసీః అని.

*అందువలన ఓ మాధవా!*
*బంధువులైన దుర్యోధనాదులను*
*చంపుటకు నాకు అర్హత లేదు*
*స్వజనులను వధించి నేను సుఖపడగలనా?*

ఈ దృష్టి కోణము నుండి చూచినప్పుడు అర్జునుడు చెప్పిన మాటలు, సబబేననిపిస్తుంది. ఎందువల్ల నంటే ఈ మారణహోమమువలన కేవలం బంధుమిత్రాదులకు సబంధించిన కుటుంబాలకు కుటుంబాలే సర్వనాశనమైపోతాయి. దుర్యోధనుడు మాత్రం ఈ విషయాన్ని అంతగా లెక్కలోకి తీసుకోవడంలేదు. అయినను అర్జునుడు తన వరకుతాను మాత్రం యుద్ధము చేసేది లేదని అసలు యుద్ధము ఎందుకు చేయకూడదో అందుకు తగిన కారణాలను ఈ విధంగా తెలుపుతున్నాడు.

"యద్యప్యేతే న పశ్యంతి
లోభోపహత చేతసః
కులక్షయ కృతం దోషం
మిత్రద్రోహే చ పాతకం" శ్లో -37

"దుర్మార్గులైన దుర్యోధనాదులు
లోభోప హతమనస్కులై
కులనాశనము వలన కలుగు
దోషమును గాని,మిత్రద్రోహం
వలన కలుగు పాపమును గాని
చూడడం లేదు"

పాపపుబుద్ధి ద్రోహచింతన వున్నవారు కళ్ళుండి చూడలేరు. చెవులుండి వినలేరు. ఇక్కడ దుర్యోధనుడు, అతని అనుచరులు అలాంటి వారు అనే ఉద్దేశాన్ని ఈ శ్లోకం మనకు స్పష్టీకరిస్తున్నది.

"కథం న జ్ఞేయ మస్మాభిః
పాపాదస్మాన్ నివర్తితుం
కులక్షయకృతం దోషం
ప్రపశ్యద్భిర్జనార్ధన" శ్లో - 38

కులక్షయమువలన కలుగు
దోషమును చక్కగా గుర్తెరిగిన
మేము ఈ పాపము నుండి
మరలుటకు ఎందుకు ప్రయత్నించలలేము?

ఈ విషయమై జాతిపిత మహాత్మాగాంధి తమ అనాసక్తయోగములో ఈ విధంగా అభివర్ణించారు.

" It is not destruction of"a family"or "families" - But it is the destruction of the institution of the family, as a result of fratricidal war that Arjuna deplores physically. Psycholocally ethically, the family is the master piece of evolution, says **Henry drummond** It is the generator and the repository of the forces which alone can caryout the moral and social progress of the world. Nature has produced a Holy family. Not for centuries but for milleniums the family has survived. Time has not tarnished it, no later art has improved upon it no genius discovered any thing more lovely nor religion anything more divine".

To the author of the "Geeta" the family evidently stood for all this.

అర్జునుడు తన వాదమును ఈ విషయమై ఇంకా ఈ విధంగా కొనసాగిస్తున్నాడు.

"కులక్షయే ప్రణశ్యంతి
కులధర్మాస్సనాతనాః
ధర్మేనష్టే కులం కృత్స్న
మధర్మోభిభవత్యుత" శ్లో - 39

"కులక్షయము వలన
పరంపరాగతములైన
ధర్మములునశించును
ధర్మమునశించడం వలన
కులమంతయు అనాచారము
పొలగును కదా"

"అధర్మాభి భవాత్కృష్ణ!
ప్రదుష్యంతి కుల స్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ!
జాయతే వర్ణ సంకరః"         శ్లో - 40

'అధర్మం వ్యాపించడం వలన
కులస్త్రీలు చెడిపోదురు
వారు చెడుట వలన వర్ణ
సంకరము కలుగుతుంది"

సంకరోనరకాయైవ
కులఘ్నానాంకులస్యచ
పతన్తి పితరోహ్యేషాం
లుప్త పిండోదక క్రియాః         శ్లో - 41

"ఇందు వలన సంకరం
చేసినవారికి, సంకరము
పొందిన కులానికి నరకము
గతి, అట్టి వారిపితరులు
శ్రాద్ధ, తర్పణ క్రియలు
లేనివారలై పతనమయ్యెదరు"



ఈ విషయములో మనం మహర్షి మళయాళ స్వాములవారి భాష్యమును బాగుగా గ్రహించ వలసివుంది. వారు తమ భగవద్గీత వ్యాఖ్యానములో ఇట్లు తెలియజేస్తున్నారు.

సాంకర్యమువలన దుష్టసంతానము కలుగును. దుష్టసంతానము మాతపితలకు సేవ చేయరు. దైవ కార్యములను నిర్వర్తించరు. అలాంటప్పడు పితృకార్యములువారు ఆచరించరు అనడంలో ఆశ్చర్యం ఏమియు లేదు. మనం బాల్యావస్థలో అశక్త స్థితిలో వున్నపుడు షుమారు 15,16 సంవత్సరముల వరకు మనలను మాతాపితరులే ఎంతో కష్టపడి పోషించెదరు. అప్పడు వారు యవ్వన దశలో శక్తిమంతులై యుండెడివారు. మరల వారు వార్థక్యదశలో శక్తి హీనులై యుండుకాలమున మనము యౌవన వంతులమై శక్తి వంతులమై యుందుము. వృద్ధాప్య దశలో నుండు మాతాపితరులకు 16 నుండి ఇరవై సంవత్సరముల వరకు మనం సేవ చేయవలసి వున్నది. అట్టి వారే తల్లి దండ్రుల ఋణమును తీర్చినవారు కాగలుగుచున్నారు. వారు యవ్వన కాలములో గ్రహించియుండిన గృహకృత్యముల నన్నింటిని, మనం యవ్వనంలో వున్నపుడు, స్వయముగా నిర్వహించ వలసి వుండును. వృద్ధాప్యములో వున్న జననీ జనకులను దైవకార్యములో ప్రవేశింపజేసి వారు ఇచ్చటనే ఈ జన్మలోనే తరించునటుల చేయవలెను. మాతా పితరులను తరింపజేయాలన్న ధానికి ఇదే ముఖ్యార్థము.అని మహర్షి మళయాళ స్వాములవారు తెలిపారు.

దోషైరేతైః కులఘ్నానాం
వర్ణ సంకర కారకై
ఉత్సాద్యన్తే జాతి ధర్మాః
కులధర్మాశ్చ శాశ్వతాః    శ్లో - 42

"కులనాశకులు చేయు
ఈ సంకరమునకు కారణము
లైన దోషముల చేత
శాశ్వతమైన జాతి ధర్మములు
కులధర్మములు నశించి పోవును"

"ఉత్సన్న కులధర్మాణాం
మనుష్యాణాం జనార్ధన!
నరకేనియతం వాసో
భావతీత్యనుశుశ్రుమ"    శ్లో - 43

జనార్థన!
కులధర్మములు
నశించిన వారి కుటుంబాలకు
శాశ్వత నరక సంప్రాప్తియని వింటున్నాము గదా!

అహో బత మహాత్పాపం
కర్తుం వ్యవసితా వయం
యద్రాజ్యసుఖ లోభేన హన్తుం
స్వజన ముద్యతాః    శ్లో - 44

అక్కటా,
రాజ్య సుఖమందలి లోభముచే
స్వజనులను హతమార్చుకొనుటకు
పూనుకొనుట గొప్ప పాపకార్యమును
చేయుటకు పూనుకొనడంగదా;

"యది మామ ప్రతీకారం
అ శస్త్రం శస్త్ర పాణయః
ధార్త రాష్ట్రారణే హన్యుః
తన్మే క్షేమతరం భవేత్"  శ్లో - 45

ప్రతీకారము చేయ తలపెట్టక
ఆయుధములు చేపట్టక యున్న
నన్ను, శస్త్ర ధారులైన దుర్యోధనాదులు
ఈ యుద్ధమునందు చంపుదురేని
అది నాకు శ్రేయస్కరమే అవుతుంది.

ఏవ ముక్త్వార్జునస్సంఖ్యే
రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం
శోక సంవిగ్న మానసః    శ్లో - 46



"అర్జునుడీ విధముగ చెప్పి
దుఃఖము చేత చెదిరిన
మనస్సు కలవాడై శరములతో
కూడిన ధనస్సును (గాండీవము)
జారవిడిచి రణరంగమునందు రథముపై
కూర్చొనెను"

విషాదమునుండి అర్జునునిలో విచారము జనించింది. దాని నుండి ఆతనిలో ధర్మజిజ్ఞాస ఆవిర్భవించింది. త్రేతాయుగంలో శ్రీరామ చంద్రులవారు కూడా ఒక సందర్భంలో విషాదాన్ని పొందారు. ద్వాపరయుగాంతమందు అర్జునుడు కూడ విషాదాన్ని పొంద్నాడు. అటు పిమ్మట బుద్ధుడు కూడా విషాదాన్ని పొందాడు. వారి విషాదము యోగముగా మారింది.

దుఃఖమువలన మానవునకు లోక పరిస్థితులు స్పష్టముగా బోధపడును. దాని వల్ల అతనిలో వివేకము జనించును. దుఃఖమువలన హృదయము మృదువై ఇతరుల కష్టములందు సానుభూతి కలుగును. దుఃఖితులకు, బాధితులకు సహకారమందించాలనే సుగుణములు మానవునిలో ఆవిర్భవించును.

అందువలననే "ఉపాసనీబాబ" నరులకు తమ దుఃఖములే గురువులు అని ప్రకటించారు. అర్జునునిలో గూడ బంధువధను గూర్చిన దుఃఖము విచారణకు పురికొల్పి సద్గురు సాన్నిధ్యంను చేర్చి ధర్మసందేహములను తీర్చి ఆధ్యాత్మికోన్నతిని అలవర్చింది. అందుచే విషాదము యోగమైంది,

**ఈ విధంగా ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,**
**శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన**
**శ్రీ మద్భగవద్గీత యందలి అర్జున విషాదయోగమను పేరుగల**
**ప్రథమాధ్యాయము సమాప్తముగావించబడింది.**



# గీతా సంహిత

## అధ్యాయము రెండు | సాంఖ్య యోగము

"శబ్దరత్నాకరము" అనే తెలుగు నిఘంటువులో సాంఖ్యము అను పదానికి నామమాత్రంగా "యోగవిశేషం" అని అర్థము వ్రాయబడింది. ఇది సరికాదు.

డాక్టర్ బూదరాజు రాధాకృష్ణగారు తమ పురాతన నామకోశంలో "సాంఖ్యయోగ శాస్త్రము" అను దానికి "అత్యంత ప్రాచీనమైన భౌతికవాదశాస్త్రము" అనే అర్థంలో వివరణను ఇస్తు ఈ శాస్త్రం ప్రకారము ప్రపంచము ప్రకృతి నుంచి ఆవిర్భవించిందని, ఈ శాస్త్రాన్ని ప్రతిపాదించినవారు "కపిలముని" అని వివరించారు.

జాతీయోద్యమ నాయకుడు, జాతిపిత మహాత్మాగాంధీగారు తమ "Gospel of Self-less Action"(అనాసక్తయోగం) లో ఈ విషయాన్ని గూర్చి ఈ విధంగా తెలిపారు.

Kapila, or who ever the great seer was, who brought into being the Sankhyayoga, concepts, started not with an analysis of objective experience as Darwin did, but perhaps as a result of elaborate expirments in the laboratory of self, arrived at the evolutionary idea with the discovery of which Darwin concluded his researches. Darwin found the planet "Cycling on" from the simple begining of "a few forms or one" to "endless forms most beautiful and most wonderful", and evolving through the operation of one law - struggle for life. The Samkhya Philosopher, making provision for both matter and mind, started with two eternal principles, one conscious, unconditioned and pasive, the other unconsiciousness, unconditioned but active and manifesting the opertion of not one law but three; or, if we may say so, a triple law evidencing not only the struggle for life, but the stage before that, namely inertia, then the struggle for life, and lastly, the struggle for the life of others or sacrifice.

The Samkhya philosopher, as we have said, posits the existence of two eternal principles "Prakrithi-and-purusha". The existence of Prakrithi or Premordial matter of nature is, he says, proved by the manifested universe which is its effect. The effect really exists in the cause, which necessarily is a causeless cause. The evolution of the manifested universe out of this unmanifest prakriti arises as a result of the distrubance in the equilibrium of its three constituents which are postulated as self evident. These constituents which are called gunas, literally meaning threads of strands which compose the string of prakrithi. They are called "Satva, Rajas and Tamas" the sources respectively of existance, of motion and inertia, their functions being light, activity and restraint. They are, however, not mutually contradictory, and they exisist together, infact are never separate; They also into the another and inter mingle with one another. As soon as their equilibrium is distrurbed, prakriti begins to evolve and whatever evolves bears an impress of these constituents, and the infinite variety varying proposition of these constituents in each, and their interaction amongest themselves.

But prakriti cannot evolve, except under the influence of purusha, a principle as eternal as prakriti and of which existence is posited and proved by the Samkhyam philosophy by various arguments into which we need not go, purusha is the soul that informs the body Prakrithi; unlike the Prakrithi he is inactive, he is without gunas, and the subjected and seer of all objects possessing the gunas, uncaused and unproductive. But whilest Prakrithi is one, the purushas are taken to be countless, for while the constitute stuff is essentially one and the same in all, there are separate births and deaths, separate argans and varying functions in different individual. The process of evolution of the prakrithi may be thus tabularly shown :



గాంధీజీ అంతేవాసి, భూదానోద్యమనాయకుడు మహర్షి వినోబా తమ గీతాప్రవచనంలో సాంఖ్యము గురించి ఈ విధంగా తెలిపారు. సాంఖ్యము అను శబ్దమునకు అర్థము - జీవితము యొక్క మూలభూత సిద్ధాంతమును తెలుసుకొనుట అన్నారు. అవి

1. ఆత్మయొక్క అమరత్వమును గూర్చి తెలుసుకొనుట.
2. శరీరము యొక్క క్షుద్రత్వమును గూర్చి గ్రహించుట.
3. స్వధర్మము అంటే ఏమిటో గుర్తెరుగుట.

జాతీయోద్యమ నాయకుడు, అరవిందాశ్రమ సంస్థాపకులు అయిన అరవింద మహర్షి సాంఖ్యం గురించి ఈ విధంగా తెలిపారు.

"సాంఖ్యము యోగమే కాని అది జ్ఞానము ద్వారా ముందుకు పోతుంది. మానవుల అస్థిరత్వానికి సంబంధించిన సూత్రాలను విచక్షణతో విశ్లేషించి సత్యాన్ని దర్శింపజేసి దానిని తనదిగా చేసుకోవడం సాంఖ్యం" అన్నారు.

వ్యాసాశ్రమ సంస్థాపకులు మహర్షి మళయాళ స్వాములవారు 24 తత్వములను శోధించి, అవి పంచభూతాత్మకములని తెలుసుకొని వీటికి సాక్షియగు శుద్ధాత్మ తన యొక్క ఆత్మ స్వరూపమని సాంఖ్యము యొక్క ముఖ్యోద్దేశం అన్నారు.

శ్రీ కాళహస్తిలోని శుకబ్రహ్మాశ్రమం పీఠాధిపతులు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాముల వారు ప్రకృతి యందుగల 24 తత్వములను లేక 96 తత్వములను లెస్సగ బోధించి, అవి అనాత్మరూపములను ఎంచి వాటిని త్యజించి వాటికి సాక్షిగ వున్నట్టి పరమాత్మను గ్రహించుటయే సాంఖ్యవిద్య; ఆత్మానాత్మ వివేక రూపమే సాంఖ్యము అన్నారు.

సాంఖ్య యోగము అనబడు ఈ అధ్యాయము నందు మొత్తము 72 శ్లోకాలున్నాయి. ఇందులోని విషయాలు ప్రధానంగా ఈ విధంగా విభజింపబడ్డాయి.

1. అర్జునుడు తన మానసిక వ్యథను శ్రీకృష్ణునకు ఎరిగించి నివారణోపాయమును అర్థించుట *1 నుండి 10 శ్లోకాలు.*
2. ఆత్మయొక్క స్వరూపమును గూర్చిన వర్ణన *11 నుండి 30 శ్లోకాలు.*
3. స్వధర్మమున నుసరించి యుద్ధము చేయవలసిన ఆవశ్యకతను నిరూపించుట *31 నుండి 38 శ్లోకాలు.*
4. నిష్కామ కర్మను గూర్చిన ప్రతిపాదన *39 నుండి 53 శ్లోకాలు.*
5. స్థితప్రజ్ఞుని యొక్క లక్షణాలు అతని యొక్క సర్వోత్తమ పదవి *54 నుండి 72 శ్లోకాలు.*

వెనుకటి అధ్యాయము (అర్జున విషాదయోగము)తో ఈ అధ్యాయమునకు గల సంబంధము.

శ్రీకృష్ణుడు అర్జునుని రథమును రెండు సేనల మధ్య నిలబెట్టగా తన ఎదుట బారులు తీర్చియున్న బంధుమిత్రాదులను గాంచిన అర్జునుడు శోకతప్త హృదయుడై ఈ బంధుమిత్రాదులనందరిని నేనెట్లు చంపుదును అని మనస్సునందు దిగులుపొంది గాండీవమును జారవిడిచి రథముపై చతికిలబడెనని వెనుకటి అధ్యాయములో చెప్పబడింది. అర్జునుని యొక్క ఆ దీనస్థితిని గాంచిన శ్రీకృష్ణభగవానుడు ఈ అధ్యాయమున అతనికి ధైర్యోత్సాహములు కలిగించుటకె ఆత్మయొక్క నిజతత్వమును కర్మరహస్యమును ఈ అధ్యాయమందు బోధిస్తున్నాడు.

అర్జునుని యొక్క మానసిక పరిస్థితిని ధృతరాష్ట్రునకు వివరించి చెబుతూ ఈ అధ్యాయమునందు సంజయుడు ముందుకు సాగుతున్నాడు.

తం తథా కృపయావిష్ట
మశ్రు పూర్ణాకులేక్షణం
విషీదంతమిదం వాక్య
ముపాచ మధుసూదన : శ్లో 2-1

ఆ ప్రకారముగ
కారుణ్యముతో కూడికొనిన
మనస్సుగల వాడైన అర్జునుడు
కన్నీరు కార్చుచు వ్యాకులత్వము
చెంది దుఃఖించుచుండగా
ఆతనితో మధుసూదనుడు ఇట్లనియెను.

ఇక్కడ సంజయునిచేత వ్యాసమహర్షి - మధుసూదన శబ్ద ప్రయోగం చేయించాడు.

మధువు అనే రాక్షసుని సంహరించడము వలన శ్రీకృష్ణునకు "మధుసూదనుడు" అనే పేరు వచ్చింది. తాత్విక పరంగా లేక వేదాంత పరంగా ఆలోచించి చూచినట్లయితే సాధారణంగా "రజోగుణప్రవృత్తి" కలిగిన మానవులు అహంకారపూరితులై వుందురు. రాక్షసులను సంహరించినట్లు ఈ భక్తుల రజోగుణమును అణచివేయగల శక్తి ఒక్క భగవంతునకు మాత్రమే వుంటుంది. భగవానుడైన శ్రీకృష్ణుడు తన భక్తుడైన అర్జునునిలోని రజోగుణమును త్రుంచివేసే ఉద్దేశంతో ఈ విధంగా ప్రబోధించుటకు ఆరంభించాడు.

"కుతస్త్వా కశ్మల మిదం
విషమే సముపస్థితం
అనార్య జుష్టమస్వర్గ్య
మకీర్తికరం అర్జున!" శ్లో -2

*అర్జునా !*
*శ్రేష్ఠులైనవారికి (ఆర్యులకు)*
*తగనిదియును, స్వర్గమునకు*
*ప్రతిబంధకమైనట్టిదియును*
*అపకీర్తిని ఒనగూర్చునదియును*
*అయిన ఈ అజ్ఞానము (పామరులకు*
*వుండునది) ఈ విషమసమయమున*
*నీకెటు నుండి దాపురించినదయ్యా!*

అని ప్రశ్నింపు ధోరణిలో అర్జునున్ని మందలించాడు శ్రీకృష్ణుడు. ఈ మందలింపు మామూలు మందలింపుకాదు. చాలా ఘాటైన మందలింపు. అర్జునుని వైఖరి ఆర్యులు అంటే శ్రేష్ఠులైనవారు అనుసరించదగినది కాదు. స్వర్గ ప్రాప్తిని ఇచ్చేది కాదు. కీర్తికరమైంది కూడా కాదు. ఇక్కడ ఈ మూడు విశేషణాలను భగవానుడు సాభిప్రాయంగా ప్రయోగించినట్లు తెలుసుకోవాలి. రక్తపాతాన్ని ఏవగించుకొని శాంతిమార్గాన్ని అవలంబిస్తే ఆర్యులు (వివేకవంతులు) హర్షిస్తారని, పాపకార్యమైన యుద్ధము నరకహేతువు కనుక యుద్ధవిముఖత స్వర్గప్రాప్తిని కలిగిస్తుందని, అహింసామార్గాన్ని అవలంబిస్తే పరమధర్మాన్ని ఆశ్రయించినవాడుగా సత్కీర్తిని పొందగలనని అర్జునుడు భావించినట్లు శ్రీకృష్ణుడు పసికట్టి కర్తవ్యకర్మ విసర్జన వలన ఈమూడు ఫలితాలలో అతనికి ఏదీ దక్కదని హెచ్చరించాడు. అందువల్లనే పిచ్చిమాటలన్నీ కట్టిపెట్టి ఆయుధం తిరిగి చేపట్టి యుద్ధానికి సన్నద్ధుడవు కమ్ము అని ప్రబోధించాడు. "అనార్య జుష్టమ్"' అను పదానికి శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు ఈ విధంగా నిర్వచించారు. ప్రపంచములో రెండు తెగలవారు మాత్రమే వున్నారు వారిలో ఒకరు ఆర్యులు రెండోవారు అనార్యులు అని.

సన్మార్గమును అవలంబించువారు, పవిత్రతను చేపట్టువారు, ప్రకాశమును వాంఛించు వారు, ధైర్యము, ఉత్సాహం కలిగియుండువారు ఆర్యులు.

దుర్మార్గమును అవలంబించువారు, అపవిత్రతను, కశ్మలమును చేపట్టువారు, అంధకారమును వాంఛించువారు, నిరంతర భీతి కలిగియుండువారు అనార్యులు. అందువలన తాము ఆర్యుల తెగలో (వివేకవంతులలో ) చేరి యున్నామా? లేక అనార్యుల (అజ్ఞానుల) తెగలో చేరియున్నామా? అని ఎవరికి వారు తమను ప్రశ్నించుకొని ఆర్యుల తెగలో వుండుటకే ప్రయత్నించవలెను అని తమ గీతా మకరందము 234వ పేజీలో తెలియజేశారు.

## ఆర్యవీరుని ధర్మము

అరవింద మహర్షి చెప్పిన మాటలను శ్రీ తెన్నేటి పూర్ణచంద్రరావుగారు "శ్రీ అరవిందుల గీతాదర్శనము" అనే గ్రంథంలో ఈ విధంగా తెలియజేశారు. "అయోమయ స్థితిలో పడిపోయి దారీ తెన్ను కానక పరితపిస్తున్న అర్జునునితో శ్రీకృష్ణభగవానుడు వ్యవహరించిన తీరు ప్రత్యేకమైనది. భావతీవ్రతతో కూడిన అర్జునుని ప్రశ్నలు ప్రవాహంగా బయటకు వచ్చాయి. సంహారము పట్ల వైముఖ్యము ఏర్పడి అతనిలో దుఃఖము, పాపభీతి ఆవరించాయి. శూన్యమైన ఏకాకిజీవితంకోసం పరితపించసాగాడు. పాపకార్యము ఆచరిస్తే పాపఫలితాలే సంక్రమిస్తాయని వాదించాడు. దీనంతటికి శ్రీకృష్ణభగవానుని సమాధానం తీవ్రపదజాలంతో కూడిన మందలింపుగా వుంది. అర్జునుని స్థితిని ఆయన (భగవానుడు) మానసిక గందరగోళంగా పేర్కొన్నాడు. అతనిది హృదయ దౌర్బల్యం.

పురుషుడికి అది ఉచితం కాదు. యోధుడైన వాడు, వీరుడు తన మగటిమి నుంచి పతనముకావడమే అవుతుంది. పృథాపుత్రుడైన అర్జునునకు ఈ బలహీనత తగనిది. ధర్మపక్షాన్ని వహించి పోరాడతానని ప్రకటించిన వీరుడు సరిగా సంక్షోభసమయము దాపురించినపుడు, దానిని వదలిపెట్టిపోవడం, హృదయం, ఇంద్రియాలు ఆకస్మికంగా విభ్రమానికి లోనుకావడంతో, హేతువు మరుగున పడి ఇచ్ఛపతనమై, దివ్యాయుధాలను అవతలపారవేయడం భగవంతుని కార్యాన్ని నిరాకరించడం అర్జునుని లాంటివాడు చేయ వలసిన పనికాదు."అందువల్లనే భగవానుడు-

"అర్జునా! ఈ విషమ సమయంలో ఈ మోహమలినము నీలో ఎక్కడ నుంచి వచ్చిపడింది? ఇది అనార్యులు అంటే పామరులు చేయవలసిన పని. దీనివల్ల నీవు స్వర్గానికి అర్హుడవు కావు. నీకు కీర్తి కూడారాదు." అని పై శ్లోకంలో మందలించాడు. (అరవింద గీతాదర్శనం పేజీ 102)

ఈ అధ్యాయములోని ఈ రెండవ శ్లోకము గురించి ఆర్యసమాజము నాయకుడు పండిత గోపదేవశాస్త్రిగారి అభిప్రాయం ఈ విధంగా వుంది.

ఈ కశ్మలము, మాలిన్యము నీకు ఎటనుండి కలిగినది. ఇది ఆర్యులలో వుండదగినది కాదు అని శ్రీకృష్ణుడు తెలిపి వున్నారు. కాబట్టి అర్జునుడు ఆర్యుడనియు, అట్లే శ్రీకృష్ణాదులు కూడా అని బోధపడుతున్నది. ప్రస్తుతము భారతీయులు తమను తాము హిందువులము

అని చెప్పకొంటున్నారు. కావున భారతీయులు హిందువులా? లేక ఆర్యులా? అన్న సందేహము కలుగుట సహజం. ప్రాచీన కాలమున భారతీయులు ఆర్యులు అని వ్యవహరింపబడిరి. సంస్కృతసాహిత్యమును పరికించిన ఈ విషయము కనబడును. ప్రాచీన గ్రంథములలోను, వేదములందును, ఉపనిషత్తులందును, మనస్మృత్యాదులందును కాని ఎక్కడను "హిందు" పదము కనుపించదు. నేటి భారతీయులు హిందువులని ఏలపిలువబడుచున్నారు? ఎప్పటి నుండి? ఎందులకీ నామము వీరికి సంక్రమింప జేయబడింది? ఈ పదమునకు అర్థము ఏమి? అయ్యది ఏ భాషకు చెందినది? అను ప్రశ్నలు చదువరులకు కలుగకమానవు. భారతదేశమునకు హిందుస్థాన్ అను పేరు గలదనియు అందుండు వారు కావున వారు హిందువులని పిలువబడుచున్నారని కొందరు చెప్పదురు. కాని భారతదేశమునకు "హిందుస్థాన్" అను నామమెక్కడిది? ఎప్పటిది? హిందూస్థానమందుండువారు హిందువులగుచో క్రైస్తవులు, మహమ్మదీయులు ఈ హిందూస్థానమున వుండియు హిందువులని ఏల పిలువబడుట లేదు? మహమ్మదీయులను హిందువులు అనిన వారు ఏల ఒప్పకొనరు? కావున హిందూస్థానమున నివసించువారు హిందువులనుట సరికాదని తెలియుచున్నది. హిందూపదము భారతీయ భాషకు చెందినది కాదు అని నిజమారసిన తెలియును. ఈ పదము పారశీక భాషకు చెందినది. భారతీయులు స్వాతంత్ర్యమును కోలుపోయి మహమ్మదీయ శాసనములకు లోబడిన కాలమున మహమ్మదీయులు భారతీయులను హిందూ పదముతో వ్యవహరింప నారంభించినట్లు చరిత్ర పరిశోధన వలన తెలయుచున్నది. భారతదేశము పూర్వము ఆర్యావర్తమనబడెడిది. ఆర్యులు నివసించుచోటు కావున ఇక్కడి ఆర్యులు మహమ్మదీయుల ఆధిపత్యకాలమున ఇస్లాంమతమును స్వీకరింపనందున హిందువులనబడ సాగిరి. హిందూ పదమునకు అర్థం 'కాఫిర్-గులామ్' అని పారశీక భాషాకోశమునందు వ్రాయబడియుండుట చూడనగును. కాఫిర్ అనగా పాపి, మతమునందు విశ్వాసములేని వాడు అని అర్థము.

గులామ్ అనగా బానిస- అస్వతంత్రుడు అని అర్థము. అందువలననే మహమ్మదీయులను హిందూ పదముతో వ్యవహరించిన వారు అంగీకరించరు. ఈ పదమును భారతీయులు ప్రథమమున అంగీకరించకపోయినను కాలముగతించిన కొలది మహమ్మదీయ ప్రాభవమునకు లోబడి గత్యంతరము లేక మహమ్మదీయ

పాలకులచే తమపై రుద్దబడిన హిందూ పదమునకు తలవొగ్గి తమను తాము హిందూ పదముతో వ్యవహరించుకొన ఆరంభించినట్లు కనిపించుచున్నది. కావుననే సంస్కృత వాఙ్మయమున ప్రాచీన గ్రంథములలో ఎక్కడను ఈ హిందూ పదము కనుపించదు. కాబట్టి వాస్తవమున భారతీయులు హిందువులు కారు. ఆర్యులు అనగా పూజ్యులు, శ్రేష్ఠులు. జ్ఞానులు అని అర్థము. అందువల్లనే కృష్ణుడు అర్జునుని గురించి ఈ మాలిన్యము అనార్యులలో వుండదగినది. నీలో ఎట నుండి వచ్చినది? దానిని విడిచి పెట్టుము అని మందలించి యున్నాడు. గోపదేవశాస్త్రిగారి శ్రీమద్భగవద్గీత పేజి 26,27)

శ్రీ గోపదేవశాస్త్రిగారి వాదన ప్రకారము అసలు, అర్జునుడు, శ్రీకృష్ణుడు ఆర్యులా? కాదా? అని నిర్ధారించడానికి ఆర్యుల జన్మస్థానం ఏది? అన్న విషయం ముందుగా పరిశీలించ వలసి వుంది.

అనేకమంది పండితులు చేస్తున్న వాద ప్రతివాదాల వలన ఆర్యుల జన్మస్థానాన్ని గుర్తించడం చాల కష్టమైనపని. శబ్దపరంగా "ఆర్యక"అనే పదానికి ఉత్తమ జన్మ అనే అర్థమువుంది. కాని సాధారణంగా ఈ పదం భాష, జాతిని రెండింటిని సూచిస్తున్నది. ఆర్యుల జన్మస్థానాన్ని గురించి వాద ప్రతివాదనలు చేసేవారు "తత్వశాస్త్రము-సాంఘిక శాస్త్రము- పురావస్తుశాస్త్రము- మానవ శాస్త్రము"వంటి విభిన్న ఆధారాలను పరిశీలన లోనికి తీసుకొని ఈ సమస్య మీద విభిన్నాభిప్రాయాలు వ్యక్తం చేశారు. ఆ విధంగా ఈ సమస్య ఇప్పటికీ వివాదాస్పదంగానే మిగిలిపోయివుంది. ఈ సమస్యకు సంబంధించి ఒక ఏకాభిప్రాయానికి రావడానికి చేసిన ప్రయత్నాలు ఏవీ సఫలం కాలేదు.

క్రీ.శ. 16వ శతాబ్దంలో ఇటలీ దేశస్థుడైన "పిలిప్పోసెఫెత్తి" భాషలకు సంబంధించి తులనాత్మక అధ్యయనము చేసినప్పుడు ఈసమస్య వెలుగులోకి వచ్చింది. ఈయన సంస్కృత భాషకు , గ్రీకు, ల్యాటిన్, గోతిక్ ట్యూటానిక్ లేదా జర్మానిక్, సెల్టిక్ (ఇంగ్లీషు) వంటి యూరోపియన్ భాషలకూ, పర్షియన్ భాషకూ మధ్యకొన్ని ముఖ్యమైన పదాల విషయంలో ఈ భాషల మధ్య ఆకర్షణీయమైన కొన్ని పోలికలు కనుపిస్తాయి. ఉదాహరణకు ఇంగ్లీషులోని "మదర్" అనే పదం సంస్కృతంలో "మాతృ" గాను పర్షియన్‌లో "మతర్" గానూ, గ్రీకులో మెతర్‌గానూ, ల్యాటిన్‌లో "మాతార్" గానూ, జర్మన్‌లో "మత్తర్"గాను కనుపిస్తుంది.

అదేవిధంగా ఇంగ్లీషులోని "ఫాదర్" అనే పదము సంస్కృతంలో "పితృ"గాను పర్షియన్‌లో "పితర్"గాను గ్రీకులో "పాతర్"గాను ల్యాటిన్‌లో "ఫ్రాతర్"గాను, జర్మన్‌లో "వాతర్"గాను కనుపిస్తుంది. తమ పూర్వీకులు తగినంత సుదీర్ఘ కాలము ఒకటిగా కలిసి జీవించివున్న కుటుంబాల్లో మాత్రమే ఈ రకమైన పోలికలున్న పదాలను ఉపయోగించడం జరుగుతుంది.

ఆకర్షణీయమైన ఈ పోలికలూ, సంబంధాలూ కేవలం యాదృచ్ఛికంకాబోవనీ, మనకు తెలియనిమాతృభాష నుంచి ఇవి జనించి వుండవచ్చునని క్రీ.శ. 1786 వసంవత్సరంలో "సర్ విలియం జోన్స్" సూచించాడు. ఆ మాతృభాష వ్యవహారాలను ప్రస్థుతం "ఇండోయూరోపియన్"లనే, వారి వారసుల భాషలను ఇండో యూరోపియన్" భాషలనీ పేర్కొనడం జరిగింది. ఆ పిదప "మాక్స్ ముల్లర్" రంగం మీదికి వచ్చాడు. ఆయన ఈ భాషలను ఆర్యభాషలని వ్యవహరించాడు. అయితే "ఆర్యన్"అనే పదానికి అర్థం భాషేకాని జాతి ఎంత మాత్రం కాదని ఆయన నొక్కిచెప్పాడు.

అయితే మరో జర్మన్ పండితుడైన పెంకా (Penka) ఆర్యన్ అనే పదం కేవలం భాషనే సూచిస్తుందా లేక జాతినే సూచిస్తుందా? లేదా రెండింటిని సూచిస్తుందా? అనే ముగింపులేని వివాదానికి తుది పలుకులు పలుకుతూ జాతితో భాషను ఏకం చేశాడు. ప్రస్థుతం కొన్ని మినహాయింపులు వున్నప్పటికీ, ఆర్యన్‌అనే పదం భాష- జాతిని రెండింటిని సూచిస్తుందనే అభిప్రాయం ఏర్పడింది.

ఆ తరువాత పండితులు రెండో గుర్తింపు ఆధారాన్ని అంటే సాహిత్యపరమైన ఆధారాన్ని ఉపయోగించారు. కాలక్రమేణ ఇండో-ఆర్యులు "ఋగ్వేద సంహిత"ను మౌఖికంగా వెలువరించారు. భాషాపరమైన ఆధారాలను బట్టి క్రీ.పూ. 1500-1000 సంవత్సరాల మధ్య ఈ ఋగ్వేదాన్ని వెలువరించి వుండవచ్చని అభిప్రాయ పడడం జరిగింది. "జెండ్‌అవెస్తా" (పాత పర్షియన్) భాష కూడా ఈ ఋగ్వేద సంస్కృత భాషకు చాలా సన్నిహితంగా వుంది. వాస్తవానికి వేద సంస్కృతికీ ప్రాచీన ఇరాన్- ఆర్య సంస్కృతితో సన్నిహితసంబంధాలున్నాయి. ఇవి రెండు ఇండో- ఇరానియన్ అనబడే సంస్కృతినుంచి ఉత్పన్నమైనట్లుతోస్తున్నది..

దాదాపు ఇదేకాలంలో కొంతమంది పండితులు, పశ్చిమాసియా, భారతదేశాల నుంచి కొన్ని ముఖ్యమైన పురావస్తు సాక్ష్యాధారాలను వెలుగులోకి తెచ్చారు. కొన్ని

త్రవ్వకాలు, బాబిలోనియన్లు త్రిభుజాకార (Cuneiform) లిపిలో వున్న కొన్ని శాసనాలూ హిటైట్స్ (Hittites) అనే ప్రాచీన ఆర్యులకు సంబంధించిన కొంత సమాచారాన్ని అందించాయి. ఈ ప్రాచీన ఆర్యులు క్రీపూ. 1950లో ఆసియాలో సంచరించేవారు భారతీయ పురావస్తు సాక్ష్యాధారాలను బట్టి క్రీపూ. 1500 సంవత్సరములో ఆర్యులు వాయవ్య భారతదేశములోకి ప్రవేశించారని భావించడమైనది. గంగా, యమున, అంతర్వేది (Deab) అధి కేంద్రాలుగా (క్రీపూ. 1100-600) మధ్యకాలంలో విలసిల్లిన పెయింటెడ్ గ్రేలేక్ సంస్కృతి నిర్మాతలు ఆర్యులే అనికూడా అభిప్రాయపడడం జరిగింది.

చివరిగా కొంతమంది పండితులు మానవ శాస్త్ర సహాయంతో ఆర్యుల జన్మస్థానాన్ని గుర్తించడానికి ప్రయత్నించారు. వేదాల్లో వర్ణించిన ప్రకారము ఆర్యులు బాగా పొడవుగా తెల్లని చర్మంతో, ప్రకాశమైన వర్ణంతో, మంచిజుత్తు తో వుండేవారు.

కొంతమంది భారతీయ పండితులు ఆర్యులు ఎప్పుడూ భారతదేశములోనే నివసించారనీ, భారతదేశము నుంచి మిగతా ప్రాంతాలకు ఆ పిదప వలస వెళ్లారని గట్టిగా వాదించారు. ఆర్యుల నివాసస్థానం బ్రహ్మదేశమని జగన్నాథ్ ఝా, ముల్తాన్‌లోని దేవికానదీ ప్రాంతమని డి. యస్. త్రివేద్, కాశ్మీరుతోపాటు హిమాలయ ప్రాంతమని ఎల్.డి. కళా వాదించారు. క్రిందివాదనలు ఆధారంగా వీరు తమ సిద్ధాంతాన్ని బల పరుచుకున్నారు. ఒకటి వేదసాహిత్యములోని ఆర్యులు విదేశీయులని సూచించే సాక్ష్యాధారము ఏదీ లేదు. ఆ విధంగా లేకపోగా "సప్తసింధూ" (సప్తనదుల ప్రాంతం)ను తమ జన్మస్థానంగా వారు పరిగణించారని చూపడానికి తగిన సాక్ష్యాధారముంది.

ఇక రెండవది- వలస జాతి సాధారణంగా ఆర్థిక లేదా రాజకీయ అవసరాల కారణంగా వలసపోతుంది. అయితే! సహజంగా స్వస్థలంమీద (మాతృ భూమి) చింతతో తిరిగి వెనక్కు మళ్లుతుంది. కాబట్టి ఆర్యులు బయటి ప్రాంతాలనుంచి వచ్చివున్నట్లయితే వారి ప్రాచీన సాహిత్యము అంటే ఋగ్వేద సంహిత తమజన్మస్థానానికి సంబంధించిన విషయాలతోనిండి వుండేది.

మూడు : సంస్కృతానికి, ఇతర ఇండో యూరోపియన్ భాషలకు మధ్య గల భాషాపరమైన సంబంధాలు, ఆర్యులు భారతదేశానికి వలస వచ్చారనే విషయాన్ని ఋజువు చేయవు. దానికి విరుద్ధమైన విధానము చోటుచేసుకొని వుండవచ్చు. అంటే ఆర్యులు తొలుత ఆసియా లోని ఇతర ప్రాంతాలకు తరువాత యూరపుకూ వలస పోయి వుండవచ్చు, ఆర్య

భాషల్లో కనుపించే అనేక శబ్దాలు వేదకాలంనాటి సంస్కృతంలోవున్నాయి. కాబట్టి శతాబ్దాలుగా జాతుల మధ్య సంబంధాలు వున్నప్పటికీ, భారతదేశంలోని వివిధ ప్రాంతాల్లోని సంస్కృత భాషా కుటుంబానికి చెందిన భాషల్లో ఈ శబ్దాలను పరిరక్షించడం జరిగింది. కనుక ఈ వలస విధానం మరింత, సంభవనీయంగా కనుపిస్తుంది.

నాలుగవది: ఆర్యులకు సంబంధించిన వేద సాహిత్యామే అత్యంత ప్రాచీనమైన రికార్డు, ఒకవేళ వారు విదేశాల నుంచి వచ్చినట్టయితే ఈ వేదసాహిత్యంలాంటి సాహిత్యాన్ని భారతదేశానికి వెలుపల ఎక్కడయినా సృష్టించారో లేదో వివరించడం కష్టం. చివరిగా ఋగ్వేదంలోని భౌగోళిక వివరాలు ఈ ఋక్కులను కూర్చిన ప్రజలు పంజాబ్ ఆ పరిసరప్రాంతాలవారేనని స్పష్టంగా ఋజువుచేస్తున్నాయి. అయితే పైన పేర్కొన్న సిద్ధాంతాన్ని అనేకమంది పండితులు తీవ్రంగా వ్యతిరేకించి అందుకు వ్యతిరేకంగా కింది వాదాలను వినిపించారు.

మొదటిగా: "ఋగ్వేదం"అనే భారతీయ సాహిత్య ఆధారంతో ఆర్యుల జన్మస్థానాన్ని ఋజువు చేయలేము. ఆర్యులు భారతదేశానికి వలస వచ్చిన తరువాత కొన్ని శతాబ్దాలకు "ఋగ్వేదాన్ని" కూర్చి వుండవచ్చు. అందువలన అందులోని భౌగోళిక వాతావరణము సహజంగానే భారతదేశాన్ని సూచించి వుండవచ్చు. వాస్తవానికి ఋగ్వేదములోని ఋక్కులను "సప్తసింధు" ప్రాంతంలో కూర్చడం జరిగింది. అంతే కాకుండా దాదాపు పది తరాలు గతించిన తరువాత ఆ ప్రజలకు తమ జన్మస్థానానికి సంబంధించిన జ్ఞాపకాలు మరుగున పడివుండవచ్చు"

రెండవది: భారతదేశానికి వెలుపల వేద సాహిత్యము తరహా సాహిత్యము లభించకపోవడాన్ని కూడా వివరించవచ్చు. భారతదేశానికి వచ్చేముందు వీరు అనాగరికులు. పశుపాలన వృత్తిలో వుండేవారు. అందువలన తమ మాతృదేశములో వేద సాహిత్యము లాంటి సాహిత్యాన్ని సృష్టించి వుండకపోచ్చు. భారతదేశంలో సప్త-సింధు ప్రాంతం వీరుస్థిరనివాసం ఏర్పరుచుకున్న తరువాత వీరు మరింత నాగరికులయ్యారు. వేదసాహిత్యాన్ని సృష్టించారు.

మూడవది: ఆర్యుల జన్మస్థానము భారతదేశమే అయినట్లయితే మొత్తము ఉపఖండాన్నే ఆర్యీకరణము చేసివుండేవారు. మొత్తము దక్షిణ భారతదేశములోను, ఉత్తరభారత దేశములోని కొన్ని భాగాల్లోను ఈనాటికి కూడా ఆర్యేతర భాషలు ప్రబలంగా వుండడమనేది భారతదేశమే ఆర్యుల స్వస్థలమనే సిద్ధాంతానికి వ్యతిరేకంగా వున్న పటిష్ఠమైన వాదము.

ముఖ్యంగా బెలూచిస్థాన్‌లో ద్రావిడ భాష వ్యవహారంలో వున్నందున మొత్తం భారతదేశము లేదా భారతదేశంలో గణనీయమైన భాగము భాషాపరంగా ఆర్యేతర ప్రాంతమని తెలుస్తున్నది.

"భారతదేశ చరిత్ర ప్రాచీనయుగము" అనుగ్రంథము నుండి ఇస్లాం మతం అవతరించకముందు పశ్చిమాసియా లోని చాలా దేశాల్లో బౌద్ధ, బ్రాహ్మణ మతాలు విరివిగా ప్రచారములో వుండేవి. భారతీయు తత్వశాస్త్రం, సాహిత్యము గురించిన విజ్ఞానం పశ్చిమాసియాలోని ప్రజలకు వుండేదన్నది నిర్వివాదాంశము, అరబ్బులు చాలా వరకు భారతీయ సంస్కృతిని జీర్ణించుకున్నారు. వ్యాపారంతోపాటు ఈ సంస్కృతిని పశ్చిమఆసియా దేశాలకు వారు తీసుకు వెళ్లారు. భారతీయ వైద్యశాస్త్రం, అంకగణితంలో భారతీయులు కనుగొన్న దశాంశభావన అరబ్బుల ద్వారా అది ప్రపంచం సొత్తయింది. (పై పుస్తకంలోని 160 పేజిలోనిది)

ఇస్లాం మతం అరబ్బు ఎడారి ప్రాంతంలో పుట్టింది. క్రీ.శ. 570-632 సంవత్సరాల మధ్య జీవించిన మహమ్మద్ ప్రవక్త ఇస్లాం మతాన్ని శాంతియుతంగానే కాక యుద్ధాల ద్వారా కూడా వ్యాప్తి చేయవచ్చునని ఇస్లాం మతానుయాయులకు చెప్పాడని చరిత్ర తెలుపుతున్నది. మొదట్లో ఈ మతం ప్రారంభంకాక మునుపు అరబ్బులు భారతీయ సంస్కృతిని జీర్ణించుకుని వున్నారన్న విషయాన్ని మరచిపోరాదు. వారు ఈ సంస్కృతిని అరబ్బుదేశాలకు వ్యాపారముతో పాటు తీసుకెళ్లారన్నది నిర్వివాదాంశం.

ఆ పిమ్మట వారు ఇస్లాం మతాన్ని అవలంబించి తదుపరి దానిని ఆసియా అంతట విస్తరింపజేశారు. తరువాత పర్షియన్లు ఇస్లాంమతావలంబకులు అయ్యారు. అటు తరువాత తురుష్కులు అవలంబించారు. ఆపైన వందసంవత్సరాలకు అరబ్బులు పశ్చిమ అట్లాంటిక్ సముద్రము నుంచి తూర్పున సింధునది ఒడ్డువరకు, ఉత్తరాన కాస్పియన్ సముద్రము నుంచి దక్షిణాన నైలునదిలోయ వరకు విశాలమైన సామ్రాజ్యాన్ని ఏర్పరుచుకున్నారు. ఈ విధంగా విస్తరింపబడిన రాజ్యంలో మహమ్మద్ ప్రవక్త వారసులుగా "ఖలీఫాలు" ఏర్పాటు అయ్యారు. ఈ విధంగా ఏర్పాటైన ఖలీఫాల్లో ఒకడైన "ఖలీఫాదా వీద్" క్రీ.శ. 11-12 సం॥లలో "సింధు" ప్రాంతాన్ని ఆక్రమించాడు. ఈ సింధు ప్రాంత సంస్కృతిని "సింధు సంస్కృతి" అంటారు. అది క్రమంగా హిందుసంస్కృతిగా మారింది. ఆ సంస్కృతి ఆధారంగానే హిందూమతం ఏర్పాటయింది.

దీనిని బట్టి తేలుతున్నదేమంటే శ్రీగోపదేవశాస్త్రిగారు తమ భగవద్గీత గ్రంథంలో ఉటంకించినట్లు "అర్జునుడు- శ్రీకృష్ణుడు" ఈనాటి ఆర్య సమాజీయులు చెప్పేదాని ప్రకారంగా ఆర్యులు కారు. వారు వైజ్ఞానికపరంగా మాత్రమే ఆర్యులు. ఇది మొదటి అంశము.

ఇక రెండో అంశం : వేదాల్లో వర్ణించిన ప్రకారం బాగా పొడవుగా, తెల్లగా, ప్రకాశమానమైన వర్ణంతో, మంచి జుత్తుతో వుండేది. శ్రీ కృష్ణుడు పొడవుగా వుండవచ్చు. ప్రకాశమానంగా వుండే పొడవైన జుట్టును కలిగివుండవచ్చు కాని చర్మము మాత్రము తెల్లటిదికాదు. ఆయన శరీరం నీలమేఘశ్యామవర్ణంతో నిండివుంటుంది.

శ్రీకృష్ణభగవానుడు తనకు తానే స్వయంగా తన రంగును గురించి ఒకానొక సందర్భంలో అర్జునునితో చెప్పినట్లు "శ్రీరామకృష్ణ మఠము" నకు చెందిన శ్రీనిర్వి కల్పానందస్వామి గారు తమ శ్రీమద్భగవద్గీత 14వ పేజీలో ఈవిధంగా తెలిపారు.

"కృషామి పృథివీం పార్థ
భూత్వా కార్ష్ణాయసోహల:
కృష్ణోవర్ణశ్చ యేయస్మా
త్తస్మాత్కృష్ణో హమర్జున !"
"అర్జునా!
నల్ల ఇనుముతో జేయబడిన
నాగలినై భూమిని దున్నుట
వలనను, నా రంగు నలుపు
అగుట చేతను నేను కృష్ణుడను"

ఆర్యులు మృదువైన తెల్లని చర్మముగలవారని ఆర్యులను గురించి చేసిన వ్యాఖ్యలో తెలుపబడి వుండుటచేత శ్రీ గోపదేవశాస్త్రిగారు భావించినట్లు శ్రీకృష్ణుడు ఆర్యసమాజనాయకులు చెప్పే రీతిలో ఆర్యుడుకాడని శాబ్దికపరంగా ఆయన ఉత్తమ జన్మ కలిగిన మహనీయుడు(ఆర్యుడు) అని గ్రహించవలసి వుంది.

ఇక మూడో విషయమైన "హిందూ"శబ్దము విషయము గూర్చి ఆలోచిస్తే నిఘంటువులలో ఒక్కొక్క పదానికి ఎన్నో అర్థాలుంటాయి. అదే విధంగా పారశీక భాషలో హిందూ శబ్దానికి "కాఫిర్-గులాం" అని వుంటే వుండవచ్చుగాక! అంత మాత్రం చేత హిందూశబ్దం అపభ్రంశానికి గురికానవసరం లేదు. భారతదేశానికి మరొక పేరు హిందుదేశం- హిందూదేశంలో నివాసముంటూ ఆ సంస్కృతిపై విశ్వాసమున్న వారు హిందువులు లేక హిందూ మతస్థులు కావచ్చు. ముస్లింల పాలనా కాలంలో ఈ దేశ ప్రజల్లో కొందరు ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిస్థితుల కారణంగా ఇస్లాంను స్వీకరించి వుండవచ్చు. అట్లే బ్రిటిష్ హయాంలో ఇంకా కొందరు క్రైస్తవాన్ని స్వీకరించి వుండవచ్చు.

స్వామివివేకానంద తెలిపినట్లు గీతాచార్యుడైన శ్రీకృష్ణభగవానుడు ఐదువేలేండ్లకు పూర్వమే గీతద్వారా అన్ని రకాల సాంప్రదాయములను సమన్వయ పరిచి ప్రపంచములో లౌకిక తత్వమును ఏర్పరచిన మహానుభావుడు శ్రీకృష్ణుడు. ఈనాడు ప్రజాస్వామిక వాదులమని చెప్పకునే రాజకీయ నాయకుల లాంటి లౌకిక తత్వము కాదు.

అందువలన శ్రీ గోపదేవశాస్త్రిగారు హిందూపదంపై చేసిన విమర్శ సద్విమర్శన కాదు, శ్రీ శాస్త్రిగారిని విమర్శించే అర్హత నాకు లేదు. అయినా ఈ విషయంలో హృదయవేదనతో నేను ఈ విమర్శనను చేశాను. వారు మహాపండితులు, ద్రష్ట, ఎన్నో గ్రంథాలకు భాష్యకారులు. శతాయుష్మానులై ఇటీవలనే తమ అవతారాన్ని చాలించిన వారికి నానిండు ప్రణామాలను అర్పించుకుంటూ సహృదయులు ఈ విమర్శన చేసిన నన్ను మన్నించాలని వేడుకుంటున్నాను.

"క్లైబ్యం మాస్మగమః పార్థ!
నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయ దౌర్బల్యం
త్యక్త్వోత్తిష్ఠ పరన్తప" శ్లో - 3

*అర్జునా!*
*అధైర్యమును (క్లీబత్వము)*
*పొందకుము. ఇది నీకు తగదు*
*నీచమగు ఈ మనోదుర్బలత్వమును*
*వీడి లే, లేచి యుద్ధానికై ముందుకుసాగు.*

'క్లీబత్వము'అను పదప్రయోగములో అర్జునుణ్ణి శ్రీకృష్ణుడు ఒకవిధంగా అవహేళన చేశాడు. క్లీబత్వము అనే పదానికి నపుంసకత్వము పౌరుష హీనత- పిరికితనము- అధైర్యము అని ఇన్ని అర్థాలున్నాయి. ఈ విధమైన పదప్రయోగాన్ని ఇక్కడ శ్రీకృష్ణుడు చేయుటకు బహుశా ఈ దిగువ కారణము వుండి వుండవచ్చును. అర్జునుడు అజ్ఞాతవాసంలో వున్నపుడు "విరటుని"కొలువులో వుంటూ అక్కడి రాచకన్యలకు "బృహన్నల"రూపంలో నృత్యం-నాట్యం నేర్పాడు. ఊర్వశి శాప కారణంగా అర్జునుడు ఆ సమయంలో పేడివాని రూపం (నపుంసకుని) ధరించాడు. ఇది సరిగ్గా భారతయుద్ధసమయానికి కొద్ది కాలము ముందు జరిగిన సంఘటన, ఆ పేడితనము స్వాభావికంగా ఇంకా నీలో వుందా? అన్న ప్రశ్న రూపంలో శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి అవహేళన చేశాడు.

## ఊర్వశి ఎవరు?

ఈమె దేవేంద్రుని కొలువులో వుండు ఒక అప్సరస. నరనారాయణులు పూర్వము తపస్సు చేసుకొనుచుండగా దేవేంద్రుడు వారి తపస్సును భంగము చేయుటకు వారి వద్దకు అప్సరసలను పంపెను. ఆ అప్సరసలు తమ నృత్యగానములతో అచట నరనారాయణుల ముందుకొంత సందడి గావించిరి. అపుడు నారాయణుడు కన్నులు తెరచి వీరిని చూచి గోటితో తన ఊరువు (తొడను) గీరెను. అందునుండి వారికంటెను అతిసుందరమైన కన్య ఉదయించెను. అందువలన ఆమెకు "ఊర్వశి" అనే పేరు వచ్చింది. ఈమెను చూచి ఇంద్రునిచే పంపబడిన అప్సరసలు మరలిపోయిరి. చంద్రవంశపు రాజులలో ఒకడైన పురూరవుడు ఊర్వశిని జూచి మోహించి ఆమెయందు ఆసక్తి కలిగియుండెను. ఆమెను తనతో వుండమని కోరెను. ఆమెవిధించిన షరతులకు పురూరవుడు లోబడినందున ఊర్వశి చాలాకాలము వరకు పురూరవునితో వుండెను. ఊర్వశి పురూరవులకు జన్మించిన వాడు "ఆయువు" చంద్రవంశంలో పురూరవుడు మూడవ తరానికి చెందినవాడు. ఈ విధంగా పురూరవుని కుమారుడు- "ఆయువు"- ఆయువు కుమారుడు"నహుషుడు"- నహుషుని కుమారుడు "యయాతి"- ఈతని భార్య రాక్షసరాజు కూతురు శర్మిష్ఠ, యయాతి శర్మిష్ఠల కుమారుడు "పూరుడు"- పూరుని కుమారుడు "మనస్యుడు"- మనస్యుని కుమారుడు "రౌద్రాశ్వుడు" రౌద్రాశ్వుని కుమారుడు "అనాదృష్టి"- అనాదృష్టికుమారుడు "మతినారుడు"- మతినారుని కుమారుడు "తంసుడు"- తంశుని కుమారుడు"ఈశనుడు"- ఈశనుని కుమారుడు "దుష్యంతుడు' ' ఈయన భార్య మేనక. కుమార్తె "శకుంతల" దుష్యంతుడు- శకుంతుల కుమారుడు "భరతుడు" భరతుని కుమారుడు "భుమన్యుడు"- భుమన్యుని కుమారుడు "విరధుడు- విరధుని కుమారుడు "సుహోత్రుడు- సుహోత్రుని కుమారుడు "అజమీఢుడు"



# అజమీఢుని కుమారులు

- జమ్నుడు
  - కుశికుడు
- ఋక్షుడు
  - సంవరణుడు (భార్య తాపతి)
    - కురువు
      - అవీక్షితుడు
        - పరీక్షితుడు
          - జనమేజయుడు
            - ధృతరాష్ట్రుడు
              - ప్రతాపుడు
                - దేవాపి
                - శంతనుడు
                  - దేవవ్రతుడు (భీష్ముడు)
                  - చిత్రాంగదుడు
                  - విచిత్రవీర్యుడు
                    - ధృతరాష్ట్రుడు
                    - పాండురాజు
                      - అర్జునుడు
                - బాహ్లికుడు
                  - సోమదత్తుడు
                    - భూరిశ్రవసు
                    - శీలుడు
                    - భూరి
              - హస్తి
- దుష్యంతుడు
  - పాంచాలురు

ఈ రీతిగా చంద్రవంశములో మూడో తరానికి చెందిన పురూరవునికి "ఊర్వశి"కి జన్మించిన "ఆయువు"యొక్క సంతతిలో అనేక తరాల తరువాత పాండు రాజుకు కుంతిదేవి ద్వారా జన్మించిన వాడు అర్జునుడు

**శాపకారణము** : ఒక పర్యాయము అర్జునుడు ఇంద్రుని ఆహ్వానంపై ఇంద్రలోకానికి వెళ్లెను. ఒకనాడు సంజకాలసమయాన చంద్రోదయవేళ ఊర్వశి సింగారించుకొని ఇంద్రలోకములో వున్న అర్జునుని కడకు వెళ్లెను. అపుడాతడు ఆమెను తల్లీ! అని సంబోధించి నమస్కరించెను. అంతట ఊర్వశి నీ గుణముల గూర్చి దేవఋషి నారదుని వలన విని నిన్ను పొందగోరి వలచి వచ్చితినని చెప్పెను. ఆ విధంగా వచ్చిన నన్ను తల్లీ! యని సంబోధించుట నీకు న్యాయమా!యని ఊర్వశి అర్జునుని ప్రశ్నించెను. అమరవేశ్యలకు వావి, వరుసలు వుండవని తెలిపెను. ఇచ్చటకు వచ్చిన అందరు నాతో క్రీడింతురు. నీవునూ అట్లే యొనర్చి నాకోర్కెను తీర్చుమనెను. అందుకు అర్జునుడు అమ్మా! నీవు మా వంశకర్తయైన పురూరవ మహారాజుకు భార్యవగుటచేత నాకు తల్లి వంటిదానవు అని చెప్పి ఆమె కోర్కెను తిరస్కరించెను. అపుడు ఊర్వశికి కోపము వచ్చి నీవు షండుడవు కమ్మని ఆతన్ని శపించెను. ఆశాపము వరంగా మారి అజ్ఞాత వాససమయములో విరటుని కొలువులో ఉపయోగపడింది. బృహన్నల రూపంలో పేడివాని గా వుండి రాచకన్యలకు నృత్యం-నాట్యం నేర్పెను. ఈ విషయాన్ని సాకుగా తీసుకొని శ్రీకృష్ణుడు అర్జునుణి పై విధంగా అవహేళన చేశాడే తప్ప దానిని వాస్తవానికి అవహేళనగా భావించకూడదు. అతనిలో ఉత్సాహాన్ని రేకెత్తించుటకై యుద్ధము పట్ల అభి ముఖుడుకావడానికై ఆ విధంగా శ్రీకృష్ణుడు పలికాడు.

ధైర్యం, నిర్భయత్వముకలిగి వుండడం మంచి సుగుణాలు. ఆ రెండు వున్నచో మిగతా అనేక సుగుణాలు వాటంతటవే వచ్చి చేరతాయి. అందువల్లనే భగవానుడు గీత ౹౬వ అధ్యాయములో సుగుణాలను గూర్చి పేర్కొనుచు మొదటి శ్లోకంలో "అభయం" అను సుగుణరాజాన్ని గూర్చి వర్ణించిచెప్పాడు.

"ఉత్సాహము-సాహసము-ధైర్యము-సద్బుద్ధి, శక్తి, పరాక్రమము అను ఈ ఆరు సుగుణాలు ఎక్కడ నుండునో అక్కడ సాక్షాత్ భగవానుడు కాపురముండునని పెద్దలు తెలిపారు..

శ్రీకృష్ణుని యొక్క బోధన వాక్యములను విని కూడా అర్జునుడు తిరిగి తన పాతధోరణినే ప్రదర్శిస్తూ పూజనీయులైన భీష్మద్రోణాదులతో తలపడుట ఎంతవరకు సమంజసము అది పాప హేతువు కాదా? అని ప్రశ్నిస్తున్నాడు.

"కథం భీష్మ మహం సంఖ్యే
ద్రోణంచ మధుసూదన!
ఇషుభిః ప్రతియోత్స్యామి
పూజార్హా వరిసూదన" శ్లో - 4

కృష్ణా!
భీష్మ, ద్రోణులు ఇరువురును
పూజింపదగినవారు, అట్టి
వారిపై బాణములను వదలి
నేనెట్లు యుద్ధము చేయగలను!

దీనిని బట్టి భీష్మ ద్రోణులిరువురు శత్రుపక్షమునందున్నను వారిపై ఆయనకు ఎంతటి గౌరవము, భక్తి భావము వున్నదో ఈశ్లోకము విశదీకరిస్తున్నది.

"గురూన హత్వాహి మహాను భావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహలోకే
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్"శ్లో - 5

మహానుభావులైన గురువులను
చంపుటకంటే ఈ లోకమందు
భిక్షాటనము తిని జీవించుట
శ్రేయస్కరము కాదా! అర్థకామముల
కొరకు గురువులను, బంధుమిత్రాదులను
చంపి ఆ పిదప వారి రక్తముతో
తడిసివున్న రాజ్యభోగములు అనుభవించుట
శ్రేయస్కరమా!-

"గురూన్-మహాన్‌భావాన్" అను పదప్రయోగముల వలన "ద్రోణాచార్యుడు-కృపాచార్యునివంటి గురువులు,- భీష్మ, బాహ్లిక, సోమదత్త, భూరిశ్రవ, శల్యాది మహనీయులు అని గ్రహించవలసి వుంది.



"న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వాజయేమ యది వానో జయేయుః
యానేవహత్వా న జిజీవిషామ
స్తే వస్థితాః ప్రముఖే ధార్త రాష్ట్రాః శ్లో - 6

పైగా
ఈ యుద్ధమునందు మనమే
గెలిచెదమో శత్రుపక్షమునకు
చెందిన కౌరవులేగెలిచెదరో
అదియును కూడా మనకు తెలియదు.
ఎవరిని చంపి మనము జీవించ
జాలమో అట్టి దుర్యోధనాదులు
మన ఎదుటనిలిచి యున్నారు.

"కార్పణ్యదోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢ చేతాః
యచ్ఛ్రేయ స్స్యాని శ్చితం బ్రూహితన్మే
శిష్యస్తే హం శాధిమాంత్వాం ప్రపన్నమ్" శ్లో - 7

కృష్ణా !
ఆత్మజ్ఞాన శూన్యత అను
దోషముచే కొట్టబడిన
వాడనై, ధర్మనిర్ణయము
చేయలేని చిత్తము కలిగి
వున్ననేను నిన్ను అడుగు
చున్నాను. నాకు ఏది

శ్రేయమును ఒన గూర్చునో

దానిని గూర్చి నిశ్చయముగా

నాకు తెలుపుము. నేను

నీకుశిష్యుడను, నిన్ను శరణు

పొందినవాడను. నన్ను శాసింపుము.

నిఘంటువులో "కృపణుడు"అను పదానికి సామాన్యార్థాలు లోభి- దరిద్రుడు అని. "ఆత్మజ్ఞాన శూన్యుడు"అని మరొక విశేషార్థము కూడా వుంది. "ఆత్మజ్ఞాన శూన్యత అను దోషముచే కొట్టబడిన వాడనై, ధర్మ నిర్ణయము చేయలేని చిత్తము కలిగి వున్న నేను నిన్ను అడుగుచున్నాను. నాకు ఏది శ్రేయమును ఒనగూర్చునో దానిని గూర్చి నిశ్చయముగా నాకు తెలుపుము"అని అర్జునుడు శ్రీకృష్ణుని ప్రార్థించినందున సామాన్యార్థములో ప్రయోగింపబడే "లోభి- దరిద్రుడు" అర్జునునకు వర్తించవు.

అర్జునుడు మహానుభావుడు కనుక అతడు తన పరిస్థితిని వెంటనే గ్రహించి ఇక ఉపన్యాసాలవలన లాభము లేదని తలంచి తానున్న స్థాయినుండి క్రిందికి దిగి వచ్చి భగవానునకు శరణాగతుడయ్యెను. శరణాగతి యొక్కటియే తన విపత్కరమానసిక పరిస్థితిని చక్కదిద్దగల సాధనమని యెంచెను. తక్షణమే శిష్యభావమును స్వీకరించెను.

అర్జునుడు ఎపుడు ప్రపత్తి ద్వారా, శరణాగతి ద్వారా, ఆత్మార్పణము ద్వారా తన శిష్యధర్మమును పాలించెనో, కృష్ణభగవానుడు అవెనువెంటనే తన గురుధర్మమును పాలించెను. చక్కటి ఆధ్యాత్మిక బోధనచే ఆతనిని కడతేర్చెను. అర్జునుడు కురుక్షేత్రయుద్ధభూమిలో శిష్యస్థానమును ఆక్రమించకపోయినచో శ్రీకృష్ణుడు గురుస్థానమును ఆక్రమించి యుండెడి వాడుకాదు. "గీత"జనించియుండెడిదికాదు. ఈ విధంగా అర్జునుడు స్వకీయమైన ఆత్మార్పణం ద్వారా లోకమునకు మహోపకారము చేసిన వాడయ్యాడు. గీతయందు తెలుపబడిన ఈ గురుశిష్యన్యాయమును తెలుసుకొని వర్తించినచో మానవకోటి సంక్షోభమున గురికాక సంక్షేమ దిశగా ముందుకు సాగి ప్రపంచశాంతికి దోహదము కలిగించును.

శరణాగతి తప్ప తన మనస్తాపమును పోగొట్టునది మరొకటి లేదని అర్జునుడు ఇంకా ఈ రీతిగా పలుకుచున్నాడు.

"నహి ప్రపశ్యామి మమాపనుద్యాద్
యచ్ఛోక ముచ్ఛోషణ మిన్ద్రియాణామ్
అవాప్య భూమావ సపత్నమృద్ధం
రాజ్యం సురాణామపిచాధిపత్యం" శ్లో-8

ఈ భూమండలమునందు
శత్రువులు లేని సమృద్ధమైన
రాజ్యమును, స్వర్గాధిపత్యమును
పొందినను నా ఇంద్రియములను
శోషింపజేయుచున్న ఈ నాదుఃఖమును
ఏది పోగొట్టగలదో దానిని కనుగొన జాలకున్నాను

ఈ ప్రకారముగ పలికి అటు పిమ్మట అర్జునుడు ఏమి చేసెనో దానిని గురించి సంజయుడు ధృతరాష్ట్రునకు వివరిస్తున్నాడు.

"ఏవ ముక్త్వా హృషీకేశం
గుడాకేశః పరంతపః
నయోత్స్య ఇతి గోవింద
ముక్త్వా తూష్ణీం బభూవహ" శ్లో - 9

శత్రువులను తపింపజేయు
అర్జునుడు హృషీకేశుడైన
గోవిందునితో ఈ విధంగా
చెప్పియుద్ధము చేయనని ఊరకుండెను.

అపుడు శ్రీకృష్ణుడు ఏం చేసెనో దానిని గురించి సంజయుడు వివరిస్తున్నాడు.

"తమువాచహృషీకేశః
ప్రహసన్నివ భారత!
సేనయోరుభయోర్మధ్యే
విషీదన్త మిదం వచః" శ్లో- 10

ఓ ధృతరాష్ట్రమహారాజా
ఆ విధంగా రెండుసేనల మధ్య
రథంపై చతికిలబడి విలపించు
చున్న అర్జునుని జూచి శ్రీకృష్ణుడు
నవ్వుతూ ఇట్లనియెను

తదుపరి శ్లోకము నుండి (11వ శ్లోకము నుండి) శ్రీకృష్ణభగవానుడు అర్జుననకు గావించిన దివ్య ప్రబోధమును గూర్చి సంజయుడు వివరించుచున్నాడు.

ఈ వివరణలో భగవానుడు ప్రప్రథమంగా ఎవరిని గూర్చియు ఎవరూ శోకింప కూడదనియు తెలుపుతున్నాడు.

అశోచ్యానన్వ శోచస్త్వం
ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూన గతా సూంశ్చ
నాను శోచన్తి పండితా: శ్లో - 11

అర్జునా!
నీవుదుఃఖించ తగనివారిని
గూర్చిదుఃఖిస్తున్నావు, పైగా
బుద్ధివాదముతోపండితులు
పలికినట్లు పలుకుచున్నావు.
పండితులైన వారు గతించిన
వారిని గూర్చిగాని, జీవించి
యున్నవారిని గూర్చిగాని. శోకింపరు.

ఈ శ్లోకమును గూర్చి మహర్షి మళయాలస్వాములు ఈ విధంగా నిర్వచించారు.

"ఈ రెండవ అధ్యాయము 11వ శ్లోకము నుండి శ్రీకృష్ణభగవానుని ధర్మోపదేశము (గీతోపదేశము) ప్రారంభమగుచున్నది. భగవద్గీత అనే కల్పవృక్షానికి ఈ శ్లోకము బీజము. అందువలననే ఋష్యాదిన్యాసములలో "అశోచ్యానన్వశోచస్త్వమితి బీజమ్" అని తెలుపుటకు కారణమైంది. వట (మఱ్ఱి) గింజలో వట (మఱ్ఱి) చెట్టు ఏవిధంగా నిగూఢమై వుంటున్నదో అదే

విధంగా ధర్మములన్నియు గీతాశాస్త్రమునందు ఇమిడి వున్నవి. రణరంగమున మిక్కిలి స్వల్ప కాలములో 18 అధ్యాయములతో కూడిన మహోన్నతమైన ఈ గీతలను ఉపదేశించుటకు వ్యవధి ఏది? అని కొందరు విమర్శకులు ప్రశ్నిస్తున్నారు. భగవన్మహిమాతి శయమును గూర్చి తెలియక శ్రీకృష్ణుడు గూడా వారివలెనే ఒక సామాన్యమానవుడని తలంచుట చేత వారికీ శంకకలుగుటకు కారణమైయున్నది. గొప్పదైన మఱ్ఱిచెట్టును మిక్కిలి సూక్ష్మమైన మఱ్ఱిగింజలో ఇమిడ్చి సృష్టించిన భగవంతునకిది ఒక లెక్కలోనిదికాదు. సూత్రప్రాయంగా శ్రీకృష్ణుడు బోధించిన వాక్యములను గ్రహించిన వ్యాసముని యమునానది ద్వీపంలో ఏకాంతముగ వుండి శ్రీకృష్ణుని ఆశయమును తెలుసుకొని దానిని గ్రంథరూపముగావించివున్నదన్న విషయాన్ని ఎవరును విస్మరించరాదు. అందువల్లనే "అస్య శ్రీమద్భగవద్గీతాశాస్త్ర మహామంత్రస్య శ్రీవేదవ్యాసఋషిః" అని ఋష్యాదిన్యాసములలో నిరూపించుటకు కారణమైనది.

శ్రీకృష్ణుని అపరావతారము శ్రీ వ్యాసుడగుట వలన ఆయనకు శ్రీకృష్ణాశయము లన్నియును తెలుసుకోగల శక్తి యుండినది.

(మహర్షి మళయాలస్వాముల వారి శ్రీమద్భగవద్గీత 70-71 పేజీలు)

ఈ శ్లోకమును గూర్చి శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాముల వారు ఈ విధంగా నిర్వచించారు.

"ప్రపంచములోని ప్రతి పదార్థము" అస్తి - భాతి- ఠపియ-నామ-రూపము"లు అను ఐదింటితో ఏర్పడుచున్నది. అందు మొదటి మూడు "సత్-చిత్- ఆనందము"లు సత్యములు. "నామము- రూపము" అను రెండును కల్పితములు. మొదటి మూడు జీవుని వాస్తవ స్వరూపము  మిగతా రెండు అంటే "నామము- రూపము" అవాస్తవాలు. సత్యమగు స్వరూపము ఏకాలమందును నశించునది కాదు. అందువలన దాని కొరకు శోకింపపనిలేదు. అసత్యములగు నామము- రూపములు మార్పుపొందినా లేక నశించినా అవి తన స్వరూపము కాదు గనుక వాటి కొరకు కూడా శోకించుట నిష్ప్రయోజనమే. కాబట్టి ఇక శోకించడము ఎందుకు? అని భగవానుడు ప్రశ్నించుచున్నాడు"- (గీతామకరందం -పేజి 241)

బంధుమిత్రాదుల చావు, పుట్టుకల గురించి ఎందుకు శోకించరాదో ఆ విషయాన్ని భగవానుడు ప్రతిపాదిస్తున్నాడు.

"న త్వేవాహం జాతునాసం
నత్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామః
సర్వేవయ మతఃపరమ్"    శ్లో - 12

అర్జునా !

నేనును, నీవును

ఇక్కడ ఈ

యుద్ధభూమి

యందున్న

ఎల్లరు రాజులును

ఒకప్పుడు

లేని వారము

కాదు

ఇకముందును

లేకుండాపోవువారముకాము.

శరీరము నశించినను

ఆత్మకు నాశనములేదని

అర్జునునిలో ధైర్యము

కలిగించుటకు ఈ విధంగా

ఉపదేశించడమైంది. జనన

మరణాలు దేహమునకే గాని

ఆత్మకు లేవు అన్నది

ఈశ్లోకము యొక్క ప్రధాన

ఉద్దేశము.



## విశేషవ్యాఖ్య

(ఈ శరీరమే ఆత్మ. అంతకు మించి అంటే శరీరానికి మించి భిన్నమగు ఆత్మయను వస్తువు వేరొకటి లేదు అను భ్రమ అర్జునునిలో కలిగింది)

"పృథివ్యాది పంచభూతముల కలయిక వలన ఈ శరీరము ఏర్పడుననియు, అయ్యది (ఆ శరీరము) కొంతకాలము లోకమున పనిచేసి తదుపరి ఎప్పడో ఒకప్పుడు నశించుననియు, అంతకు మించి ఈ శరీరమున పంచభూతాత్మకము కాని ఆత్మయను వస్తువు- ద్రవ్యము- తత్వము వేరుగనుండుననుట తథ్యము కాదనియు ఎంచువారును భారతమున "లోకాయతులు- చార్వాకులు శరీరాత్మవాదులు" అనబడుచున్నారు. అట్టి వారిని ఈనాటి విద్యావంతులు భౌతికవాదులు అని అనుచున్నారు. ఆంగ్లములో వీరినే "మెటీరియలిస్టులు"అంటున్నారు. వీరి జీవితమునకు లక్ష్యం కేవలం శారీరక సుఖమే, కనుకనే వీరు "యావజ్జీవేత్- సుఖంజీవేత్" అంటే జీవించినంతకాలము సుఖముగ జీవింపవలయునందురు. వీరు జీవితములో సాధించదగ్గ పురుషార్థము కూడా ఇంద్రియ సుఖము తప్ప మరొకటి లేదందురు.

ఇక ఆత్మ వాదులు అట్లుగాక దేహమునందు దానికంటే భిన్నమగు వస్తువు వేరుగా ఇంకొకటి వుండుననియు అది పృథ్వాది పంచభూతముల రసాయనిక సమ్మేళనము వలన ఏర్పడునది కాదనియు అందురు. ఆ వస్తువును "ఆత్మ, జీవాత్మ, జీవుడు"అను నామములతో వ్యవహరింతురు. ఆ వస్తువు పంచభూతములకంటే విలక్షణమైనది. కాని పంచభూతములవలెనే అదియును ఒకద్రవ్యమే. దాని యందును భూతము లందుండునట్లే గుణములుండును. అయితే ఆ గుణములు గంధ రసాదులవంటివి కావు. అవి విలక్షణములు. వాటిని గూర్చి తత్వశాస్త్రకారులు అయిన గౌతమ, కణ్వాదులు "ఇచ్ఛా, ద్వేష, ప్రయత్న, సుఖదుఃఖజ్ఞానములు" అని పేర్కొన్నారు. ముఖ్యంగా జ్ఞానము, కోరిక అను గుణములు ప్రయత్నమునకు ఆత్మలింగములు. ఆత్మయనునది ఒక వస్తువనియు, ఇయ్యది భూమ్యాది పదార్థముల సమ్మేళనము వలన ఏర్పడునది కాదనియు తెలుపుటకు ఇవి ఆధారములు. మరియు రసాయనిక ప్రయోగముల మూలముననే వైజ్ఞానికుడు నేటివరకు జ్ఞానాది గుణములను ఉద్భవింపజేయలేదని యెంచెదరు. కాగా జ్ఞానాది గుణములకు ఆశ్రయమ్మై, స్వతసిద్ధమై కారణ ద్రవ్యములచే ఏర్పడనందున

నాశనము లేనిదై నిత్యముగనుండు ఒక వస్తువు "ఆత్మ" యనబడుచున్నది. అది శరీరముకాదు. శరీరము కారణ ద్రవ్యములచే ఏర్పడనందున నాశనము లేనిదై నిత్యముగ ఉండు ఒక వస్తువు 'ఆత్మయనబడుచున్నది. అది శరీరముకాదు. శరీరము కారణ ద్రవ్యములయిన భూమ్యాదులచే యేర్పడును. వృద్ధి క్షయాది వికారములకు లోనగును. నశించును. అట్టి శరీరముకంటే ఆత్మ భిన్నము, ఆ ఆత్మయే తెలుగున "నేను" ఆంగ్లమున "ఐ" హిందీలో "మై" సంస్కృతంలో 'అహం" అను పదములతో వ్యవరించబడుచున్నది. కొందరు పాశ్చాత్య తత్వవేత్తలు చెపుతున్నట్లు అయ్యిది కాల్పనికము కాదు. అది ఉనికి (సత్తా) కలిగినది. క్రైస్తవులు, మహమ్మదీయులు చెబుతున్నట్లు దేవునిచే మట్టి బొమ్మ ముక్కుపుటములలో ఊదబడిన ఊపిరి కాదు, ఆత్మ జనన మరణములులేని నిత్యవస్తువు, మిక్కిలి సూక్ష్మము. ఇంద్రియములకుగాని, యంత్రములకుగాని పట్టువడునదికాదు. ఇట్టి ఆత్మలు శరీరమునకు ఒక్కటి వంతున బ్రహ్మాండమున ఎన్నియున్నవో తెలియదు, మానవ గణితమునకు అందవు.

ప్రత్యేకముగా చూడదగు ఈ శరీరమునందు దానికి భిన్నమైన వస్తువు ఒకటి కలదనుటకు "నా శరీరము- నాశిరస్సు- నాబుద్ధి- నేను దేహముకాను. నేను శిరఃపాణ్యాదులను (తల, చేతులు మొదలైనవి) కాను" అను ఇట్టి వ్యవహారము ఒక ప్రమాణము. నా ఇల్లు, నా భార్య, నా బిడ్డలు మున్నగు వ్యవహారములందు ఇల్లు, ఆలు, బిడ్డలు తనకంటే వేరుగా ఎట్లు తెలియబడుచున్నవో అట్లే నా దేహాది ప్రయోగములందును "నేను" దేహముకంటే భిన్నమని తెలియబడుట మంచిదికదా! దేహాదులు తనకు సంబంధించినవే అయినా అవి నశించునవి కాని తాను (ఆత్మ) మాత్రము నశింపదు అను విషయము వివేకులైన వారు సులభంగా తెలుసుకోగలరు.

"దేహినోస్మిన్ యథాదేహే
కౌమారం యౌవనంజరా
తథాదేహాంతర ప్రాప్తిః
ధీరస్తత్రన ముహ్యతి" శ్లో - 13

జీవునకు బాల్య శరీరము, యౌవన శరీరము, వృద్ధ శరీరము అనే వివిధ అవస్థలు ఒకదాని పిదప మరొకటి కలుగుచున్నాయి. దేహము నందున్న ఆత్మకు ఒక్క జీవితములోనే

అనేక దేహములు ఒక దాని తరువాత మరొకటి కలుగుచున్నవి అనే అంశము జీవతత్వము యొక్క సత్యత్వమును నిరూపిస్తున్నది. దానిని బట్టి ఈ శరీరము నశించిన తరువాత కూడా జీవికి మరియొక శరీరము లభించునని తెలియుచున్నది. ఈ కారణముచేత జ్ఞాని అయినవాడు శరీరనాశనమునకు చింతించడు, తాను నశించునట్లు భ్రాంతిచెందడు.

ఈ విషయమ్మై ఆర్యసమాజనాయకుడు పండిత గోపదేవ శాస్త్రి ఈవిధంగా తెలియజేశారు.

"శరీరము"బాల్య, యౌవ్వన, వృద్ధాప్యములుగ మారినను దేహము లో వ్యవహరించు జీవుడు మాత్రము మారడు. ఒకప్పుడు బాల్యదేహములో క్రీడలు సలిపిన జీవుడు వృద్ధదేహములో వ్యవహరించబడుతున్నపుడు ఇచ్చోట నేను చిన్ననాటి స్నేహితులతో కూడి ఆడుకొన్నాను కదా! యని చిన్ననాటి గుర్తులను గూర్చి స్మరించును. శరీరముతో పాటు జీవుడు కూడా మారియుండిన పక్షమున ఇట్టి స్మరణీయ అవకాశము వుండదు. కావున జీవితకాలమందు శరీరమునందు వికారములు కలిగి ఎప్పటికప్పడు దేహము మారినను జీవుడు (ఆత్మ) మాత్రము మారడని స్పష్టమగుచున్నది. ఆత్మలు పలు శరీరములలో వ్యవహరించుననుట స్థిరమగుచున్నది. మార్పులు, వికారములు లేని వస్తువు నిత్యమనబడుచున్నది. నిత్యమైన జీవునకు (ఆత్మకు) పలుదేహములు లభించును. అందువలన జ్ఞానియైన వాడు దేహనాశనమునకు చింతించక కర్తవ్యములను ఆచరించబూనును. (పండిత గోపదేవ శాస్త్రిగారి భగవద్గీత 39-40 పేజీలు)

శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు తమ గీతామకరందం 214పేజీలో ఈవిధంగా తెలుపుతున్నారు.

"మార్పులు దేహమునకే గాని, ఆత్మకు కాదు. బాల్యము పోయి యౌవనము వచ్చునపుడు ఎవడును దుఃఖించడం లేదు. అట్లాగే యౌవ్వనముపోయి వృద్ధాప్యము వచ్చినపుడు కూడా ఎవరును దుఃఖించడము లేదు. అట్టిచో వార్ధక్యము పోయి మరణము సంభవించి దేహాంతర ప్రాప్తి కలిగినపుడు దుఃఖించడం ఎందుకు? అన్నది భగవానుని ప్రశ్న. ఈ రహస్యమును ఎరిగిన మహనీయులు దానిని గురించి పట్టించుకొనక అవి సంభవించినపుడు మేరుపర్వతము వలే ధీరులై గంభీరముగవర్తింతురు. పైన తెలిపిన నాలుగు అవస్థలలో మొదటి మూడు కలవని మానవులకు తెలియుచున్నను కాని నాలుగవ అవస్థ అయిన దేహాంతరప్రాప్తి వున్నదని ఎరుగరు.

అయితే భగవానుడు ఇట నాలుగవ అవస్థ అయిన దేహాంతర ప్రాప్తి వున్నదని మొదటి మూడు ఏ విధంగా సత్యములో నాలుగవది కూడా అదేవిధంగా సత్యము అని అందువలన దానిని గురించి దిగులు నొందక ధీరుల వలె ప్రవర్తించవలెనని ఈ శ్లోకంలో ఉద్బోధించారు. అంతేకాకుండా కర్మరాహిత్యము పొందిన జ్ఞానికి మాత్రము దేహాంతర ప్రాప్తి వుండబోదని అట్టి మహనీయుడు బ్రహ్మైక్యము నొందును అని పరోక్షంగా తెలియజేశాడు. దాని వలన దేహాంతరప్రాప్తి సామాన్య మానవునికి మాత్రమే వుంటుందని తెలుసుకోవాలి. (గీతామకరందం పేజి 245)

## దేహచక్రము

Cycle of the boday




మహర్షి మళయాలస్వాములవారు ఈ విధంగా తెలుపుతున్నారు. (శ్రీ మద్భగవద్గీత 73 పేజి)

“ఆకాశమున అనేక రంగులతో కూడిన మేఘములు ఉరుములు, మెరుపులు వున్నను, సూర్యగ్రహ నక్షత్రాదులు సంచరించుచున్నను ఏ విధంగా ఆకాశము స్వచ్ఛమై, నిశ్చలమై, నిర్మలమై పై చెప్పినవాటినన్నిటిని అతిక్రమించి నిస్సంగమై నిలిచియున్నదో, అట్లే శీతోష్ణములకు, సుఖ దుఃఖములకు లొంగక స్థిరుడై, నిశ్చలుడై, అసంగుడై నిలిచియున్నవారు ద్వంద్వాతీతుడు అనబడుచున్నాడు. లోకమును విడిచి జ్ఞానియుండుట లేదు. అయితే లోకముచే కలిగెడు ద్వంద్వములను అంటక తాను నిర్వికారుడై, సాక్షియై యుండును.

“మాత్రాస్పర్శాస్తు కౌంతేయ
శీతోష్ణ సుఖదుఃఖదాః
ఆగమా పాయినో నిత్యాస్తాం
స్థితిక్షస్వ భారత ” శ్లో - 14

కుంతికుమారుడవగు ఓ అర్జునా!
ఇంద్రియములు ఇంద్రియ
విషయములతో సంయోగము
చెందునపుడు శీతోష్ణ, సుఖ
దుఃఖములను కలిగించును
అవి క్షణ భంగురములు, అస్థిరములు
కావున అట్టి శీతోష్ణ సుఖదుఃఖములను
నీవు ఓరిమితో సహింపుము

ఈ ప్రపంచమునందు పనిచేయునట్టివాడు ఎంతటి మహాత్ముడైనను స్తుతి, నిందలను పొందుచుండును. అవి ఒకదాని తరువాత మరొకటి రాత్రింబవళ్లువలె వస్తూ, పోతుండును. కాని అవి అస్థిరములు. స్థిరములు కావు. వానిని ఓర్చుకోవడమే కార్యనిర్వహణ ధీరులయిన మహనీయుల యొక్క స్వభావము. అట్టి మనోధైర్యము లేనివాడు ఈ ప్రపంచంలో ఏ కార్యమును చేయలేడు. అట్లని సహనము మూఢమైనదిగా వుండకూడదు. అది సత్య ధర్మముల నుండి సహింపనటువంటి సహనం అయి వుండవలెను.

యంహిన వ్యథయన్త్యేతే
పురుషం పురుషర్షభ
సమదుఃఖ సుఖంధీరం
సోఽమృతత్వాయ కల్పతే"     శ్లో - 15

పురుషులలో శ్రేష్ఠుడవగు
ఓ అర్జునా! ఈ మాత్రాస్పర్శములు
సుఖదుఃఖములయందు
సమబుద్ధి కలిగిన ధీర పురుషుని
బాధించలేవు, అట్టివాడు
మోక్షమును పొందుటకు అర్హుడు
అని తెలుసుకో -

ఈ విషయమై మహర్షి మళయాలస్వాముల వారు ఈ విధంగా తెలిపారు.

"సముద్రము యొక్క ఆటుపోటులచేత అందులోని నీరు పొంగిపొర్లిన, తగ్గినా సముద్రమందలి అగాథ భాగమందుగల పర్వత ఖండము చలించ కుండి ఏ విధంగా

వుండునో అదే విధంగా ప్రకృతియను ప్రవాహమునందు వచ్చుచు, పోవుచు అస్థిరములైయున్న శీతోష్ణాది ద్వంద్వములకు, శబ్ద స్పర్శాది విషయములకు లొంగక సముద్రములోని పర్వత ఖండమువలె స్థిరుడై, నిర్వికారుడై యుండువాడే మోక్షమునకు అర్హుడు'' అని తెలిపారు.

శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు ఈ విధంగా తెలుపుతున్నారు.

"మోక్షార్హతపై భగవానుడిచట ఒకానొక జాతినిగాని, మతమును గాని, కులమునుగాని గూర్చి పేర్కొనలేదు. ఎవరు ఇంద్రియనిగ్రహము, విషయ రాహిత్యము, సుఖ దుఃఖ సమభావమును కలిగియుందురో వారేధీరులు, మోక్షమునకు అర్హులు'' అని తెలిపారు.

"నాసతో విద్యతేభావో
నాభావో విద్యతేసతః
ఉభయోరపి దృష్టోన్త
స్త్వరి నయోస్త త్త్వదృభిః శ్లో - 16

అసత్యములైనట్టి దేహాదులకు ఉనికి లేనేలేదు. సత్యమైనట్టి ఆత్మకు లేమి అంటూ వుండదు. తత్వజ్ఞులైన వారు ఈ రెండింటిని గూర్చి నిశ్చయముగా తెలుసుకున్నారు. ఉనికి (సత్తా) పదార్థములోకమునందు ఎన్నడును పుట్టదు. వర్థిల్లదు. వృద్ధిక్షయములను పొందదు. నశింపదు, ఉనికిని పోగొట్టుకొనదు. నశించి కూడా ఏదో ఒక రూపమున వుండనే యుండును. కావున ప్రాకృతిక పదార్థములు పుట్టినశించినంత మాత్రాన వాటికి ఉనికి లేదని యెంచకూడదు. నాశమనగా అభావము అని కాదు. రూప పరివర్తనమని భావము. నశించు వస్తువు తన కారణరూపమును పొందియుండును. వస్త్రములు నశించి తంతు (దారము) రూపముననను, ఘటాదులు నశించి మృత్తి కారూపముననను, కుండలాదులు నశించి బంగారు రూపమును పొందును. ప్రస్థుతము స్థూలరూపముగ అగుపించు పదార్థములన్నియు ప్రళయ కాలమునందు సూక్ష్మరూపముగ వుండును. ఈ సూక్ష్మరూపమునే ప్రకృతి , అవ్యక్తము, మాయ అని అనుచున్నారు. కనుక ప్రపంచము సత్తారహితము ఉనికి లేనిదికాదు. జీవులు (ఆత్మలు) నిత్యులైనట్లు ప్రకృతియునిత్యమే. స్థూలములై ఇంద్రియములకు తెలియనగు రూపములే అనిత్యములు.

దుఃఖము అంతము కావలెనన్నచో వున్నదానిని వున్నట్లుగను, లేని దానిని లేనట్లుగను చూస్తే చాలు. ఇదియే శాంతికి మార్గము. దుఃఖరాహిత్యమునకు బాట. తత్వజ్ఞులు ఈ కీలకమును గ్రహించియే తమ జీవితములను కృతార్థమొనర్చు కొనుచున్నారు. అజ్ఞానులు

దానిని తెలుసుకోలేక సంసార చక్రమున తగుల్కొని దుఃఖములను పొందుచున్నారన్నది శ్లోకము యొక్క ముఖ్యమైన భావన. పై దెలిపిన సత్-అసత్ రెండింటిలో సద్వస్తువును గూర్చి భగవానుడు తెలియజేస్తున్నాడు.

"అవినాశి తు తద్విద్ధి
యేన సర్వమిదం తతమ్
వినాశమవ్యయ స్యాస్య
నకశ్చిత్కర్తు మర్హతి" శ్లో - 17

ఈ సమస్తము దేనిచేత
పరివ్యాపితమైయున్నదో
అది అవినాశియని తెలుసుకో
అవినాశియగుదానిని ఎవరును
నాశము కల్పించలేరు

చరాచర వస్తువులన్నియు హృదయస్థమగు ఆత్మ చేతనే ఆవరించబడియున్నవి. అందువలన సర్వజీవులను ఆత్మరూపములుగ ఎంచివాటిపై ప్రేమ, దయ, కరుణ కలిగియుండవలెను.

మన ఇంద్రియములచేత తెలియబడుచున్న ఈ జడ ప్రపంచమంతయు నాశమగునదై యున్నది. మనం చూస్తున్న, పదార్థములు నిరంతరము మార్పు చెందుట ఇందుకు ప్రబల నిదర్శనము, మార్పులు చెందువస్తువులు నిత్యము కావు. అవి అనిత్యములు, పుట్టి చచ్చేటివి. పుట్టి చచ్చు వస్తువులను దార్శనిక భాషలో కార్యములు అనబడును. కార్యములు కారణముల వలన ఏర్పడును. ఒక కార్యమేర్పడుటకు అనేక కారణములుండును. అందు ఉపాదాన నిమిత్త కారణములు ముఖ్యమైనవి. ఏ కారణ పదార్థము కార్యరూపము దాల్చునో ఆకారణము ఉపాదాన మనబడుచున్నది. ఉపాదాన కారణమును కార్యరూపమునకు మార్చునది నిమిత్తకారణము నిమిత్తకారణములలో జ్ఞానవంతమగు చేతనము కర్త యనబడును. అయ్యది చేతన నిమిత్త కారణమనియు చెప్పబడును. ఉదాహరణకు మట్టి కుండయగును. కుండకార్యము. మట్టి ఉపాదానము మట్టిని కుండగా మార్చుచేతన నిమిత్తకారణము (కుమ్మరి) కర్తయగును.

అటులనే ఈ ప్రపంచము ఒకకార్యమనుకొనిన దానికి ఉపాదాన కారణము ప్రకృతి. ఆ ప్రకృతి ప్రపంచముగా స్థూలరూపమున మార్చు చేతన నిమిత్త కారణము " సృష్టికర్త" అంటే పరమేశ్వరుడు దేవుడు, భగవంతుడు అని నానావిధములైన నామములున్నవి.

కార్యము పరిమితమై యుండును. దేశకాలములు దానికి అవధులుగా వుండును. కావున ఈ ప్రపంచము అనెడి కార్యము కూడ పరిమితమే.

మానవదృష్టికి బ్రహ్మాండము ఎంతపెద్దదిగా తోచినను విజ్ఞుల దృష్టిలో ఇది పరిమితము. ఇట్టి ప్రపంచమునకు కర్తయగు చేతన నిమిత్త కారణము పరమేశ్వరతత్వము, అది వ్యాపకమై ప్రపంచమందంతటను వుండుటయే గాక దానిని మించియుండి దానిని సృజించుచుండును. వ్యాపకమై అంతటను వుండు ఆ పరమేశ్వరతత్వము నశింపదు. పరిమితవస్తువులే నశించును. అపరిమితము నశించదు, వికారములకు లోనుకాదు.

ఇంతవరకు శ్రీకృష్ణుడు అర్జునునకు ప్రకృతి-జీవులు- పరమేశ్వరుడు అనుమూడు స్వయం సత్తాకములైన నిత్య సత్యములయిన పదార్థములున్నట్లు వివరించియున్నాడు. ఇందు ప్రకృతి మార్పులు చెందు స్వభావయోగ్యతలు కలది. జడము. క్రియారహితము. పరిణామము పొందుటకు కావలసిన యోగ్యత దాని యందున్నది, కాని అది స్వయముగమారదు. దానిని మార్చు చేతన వ్యాపకతత్వము పరమేశ్వర తత్వము. ఇక జీవులు జ్ఞానేచ్ఛాది గుణములు కలిగి, సూక్ష్మములై నాశనములేని నిత్యచేతనములు. (శ్రీగోపదేవ శాస్త్రిగారి వ్యాఖ్య,)

"అన్తవన్త ఇమేదేహా
నిత్యస్యోక్తాశరీరిణః
అనాశినో ప్రమేయస్య
తస్మాద్యుధ్యస్వ భారత!" శ్లో - 18

అర్జునా!
నిత్యుడును, అవినాశియును
అప్రమేయుడును అగుదేహి
యొక్క ఈ దేహములు
నాశవంతములని చెప్పబడినవి
కనుక దేహమును గూర్చిన చింతను
వదలి, లే, లేచి యుద్ధమునకై ముందుకు సాగు.

ఆత్మ నశింపదు, నశించేది శరీరముమాత్రమే, దేహము నందంతటను వ్యాపించియున్న ఆత్మ శరీరమునశించినా అదినశించదు అని భగవానుడు అర్జునునకు హితబోధచేశాడు ఈశ్లోకమందు.

"య ఏనం వేత్తి హంతారం
యశ్చైనం మన్యతేహతమ్
ఉభౌతౌన విజానీతో
నాయం హన్తి నహన్యతే" శ్లో -19

ఎవరు ఈ ఆత్మను చంపుదానినిగను
ఎవడు ఈ ఆత్మను చంపబడుదానినిగను
భావిస్తున్నారో వారిరువురును
వాస్తవమును ఎరిగిన వారుకారు
ఆత్మ ఎవరినీ చంపేదికాదు ఎవరి
చేతను చంపబడునది కాదు.
కఠోపనిషత్తు ద్వితీయ వల్లి -19లో ఈవిధంగా వుంది.
"హంతా చేన్మన్యతేహంతుం హతశ్చేన్మన్యతేహతమ్
ఉభౌతౌన విజానీతో నాయం హంతినహన్యతే"

హంత=చంపేవాడు, హంతుమ్=చంపుతున్నాడని, మన్యతేచేత్=భావించినట్లయితే, హతః=చంపబడినానని, మన్యతేచేత్=భావించినట్లయితే, తౌ=అ, ఉభౌ=ఇరువురూ, నవిజానీతః=సరిగా తెలుసుకోలేరు, అయం= ఇది, నహంతి=చంపదు, నహన్యతే=చంపబడదు..

తా: చంపేవాడు తాను చంపుతున్నాననీ చంపబడిన వాడు తాను చంపబడ్డాననీ భావిస్తే ఆ ఇరువురికీ దానిని (ఆత్మ) గురించి సరిగా తెలియదన్నమాట, నిజానికి అది చావదు, చంపబడదు.

"నజాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వాభవితా వా న భూయః
అజోనిత్య: శాశ్వతోయం పురాణో
న హన్యతే హన్య మానేశరీరే" శ్లో - 20

ఆత్మకు జనన మరణములు
లేవు, అది గతంలో లేకుండ
గనే కొత్తగా గోచరించునది కాదు
దానికి చావు, పుట్టుకలు లేవు
అది నిత్యమైనది, శాశ్వతమైనది
పురాతనమైనది, దేహమునశించును
అది నశించునదికాదు

కఠోపనిషత్తు ద్వితీయవల్లి 18వ శ్లోకములో ఇదే విషయము ఈ విధంగా చెప్పబడింది.

"నజాయతేమ్రియతే వావిపశ్చి
న్నాయంకుతశ్చిన్న బభూవకశ్చిత్
అజోనిత్యః శాశ్వతోయం పురాణో
స హన్యతేహన్యమానేశరీరే"

విపశ్చిత్=జ్ఞాతఅయిన ఆత్మ నజాయతే=జన్మించదు మ్రియతేచ= మరణించదు కూడా, అయం=ఇది కుతశ్చిత్=ఎక్కడ నుండిగానీ నబభూవ=పుట్టుకొచ్చినదికాదు, (అస్మాత్=దానినినుండి) కశ్చిత్=ఏదిగానీ న(బభూవ) = రాలేదు, అయం=ఇది, అజః=జన్మరహితం, నిత్యః= అనశ్వరము శాశ్వత= శాశ్వతం, పురాణ=సనాతనం, శరీరే =శరీరము, హన్యమానే=నిర్మూలించబడుచుండగా, నహన్యతే=నిర్మూలించబడనిది.

జ్ఞాతఅయినఆత్మపుట్టదు,
దేనినుండిగాని అది పరిణమించదు
దాని నుండి కూడా ఏదియు పరిణామము
పొందదు, శరీరమునశిస్తూ వున్నపుడు
కూడా జన్మరహితమూ, అనశ్వరము,
శాశ్వతమూ,సనాతనమూ,అయిన
ఈ ఆత్మకు నాశనము అనునది లేదు.

వివరణ : కఠోపనిషత్తు రెండవవల్లి పదునాలుగవ శ్లోకములో అన్ని ధర్మాలకూ, సంబంధాలకూ అతీతమైన అనాదీ, ఇంద్రియాతీతమూ అయిన సత్తను గూర్చి "నచికేతుడు" యముణ్ణి

అడుగుతాడు. దానికి సమాధానంగా యముడు మొదట బ్రహ్మానికి ప్రతీక బ్రహ్మ(ఆత్మ) సాక్షాత్కారానికి ఉపాయము అయిన "ఓంకారం" గూర్చి చెప్పి ఈ శ్లోకంలోను తరువాతి శ్లోకాలలోను ఆత్మ స్వరూపాన్ని గూర్చి తెలియజేశాడు.

ఈ విషయమై పండిత గోపదేవ శాస్త్రిగారు ఈవిధంగా తమ భగవద్గీతలో వ్యాఖానించారు.

"అనేక సూక్ష్మ పదార్థములు కలిపి స్థూలరూపమును పొందుటకు పుట్టుక లేక జన్మము అనబడుతున్నది. ఇట్టి స్థితి దేహమునకు కలదు కాని జీవునకు (ఆత్మకు)లేదు. జీవతత్వము అనేకము కలిసి ఏర్పడునది కాదు. అది ఒకే సూక్ష్మతత్వము, దాని ఉనికి స్వతంత్రము. కొందరు భావించునట్లు జీవాత్మ ఈశ్వర నిర్మితము కూడా కాదు. మరి కొందరు భావించునట్లు బద్ధి ప్రతిబింబిత చిదా భావము కూడాకాదు. కావుననే తత్వజ్ఞులు దానిని గురించి - ప్రకృతిపురుషంచెవ విద్వనాదీ ఉభావపి" అని తెలిపారు. అంటే ప్రకృతి -జీవుడు(ఆత్మ) ఈ రెండును అనాదులు. ఆది లేనివి, కారణముల వలన ఏర్పడినవి కావు అని నుడివిరి"

"వేదావినాశినం నిత్యం
య ఏనమజ మవ్యయమ్
కథంస పురుషః పార్థ!
కం ఘాతయతి హన్తికం" శ్లో - 21

అర్జునా!
ఎవడు ఈ ఆత్మను నిత్యమైనదినిగను
జనన మరణములు లేని దానిగను
నాశరహితునిగను, అక్షయమైన
దానిగను ఎరుంగునో అట్టి వాడు
ఎవరిని ఎట్లు చంపించును? ఎటుల చంపును?

"వాసాంసి జీర్ణాని యథావిహాయ
నవానిగృహ్ణాతి నరోపరాణి
తథా శరీరాణి విహాయజీర్ణా
న్యన్యాని సంయాతి నవానిదేహీ " శ్లో -22

మానవుడు చినిగిన వస్త్రములను
వీడి ఇతరములైన నూతన వస్త్రములను
ధరించునట్లు జీవుడు శిథిలములైన
పాత శరీరములను విడిచి ఇతరములగు
నూతన శరీరములను ధరించుచున్నాడు

ఈ శ్లోకము గురించి మహర్షి వినోబా ఈవిధంగా గీతా ప్రవచనములో వ్యాఖ్యానించారు..

"దేహము వస్త్రము వంటిది. పాత వస్త్రములు చినిగిపోవును. కనుకనే కొత్తవి ధరింతుము. ఒక్క శరీరమే శాశ్వతముగ ఆత్మను అంటిపెట్టుకొనియున్నచో ఆత్మకు దుర్గతి కలుగును. వికాసమంతయు ఆగిపోవును. ఆనందము లోపించును. జ్ఞానప్రభమందగించును. అందువలన దేహనాశము శోచనీయముకాజాలదు. నిజమే ఆత్మ నశించునదైనచో అది తప్పక శోచనీయము అగును. కాని ఆత్మ నాశరహితము, అది యొక అఖండ నదీ ప్రవాహము. దానిపై అనేక దేహములు వచ్చుచూ, పోవుచుండును. ఇందువలన దేహసంబంధమను చక్రమున చిక్కుకొని శోకించుట, 'వీరు నావారు' వారు పరాయి వారు అని ఎక్కడికక్కడ వేరు చేయుట కేవలము అనుచితము.ఈ బ్రహ్మాండమంతయు చక్కగా నేసిన వస్త్రము, చిన్నవాడు కత్తెరను తీసుకొని వస్త్రమును ముక్కలు ముక్కలుగ కత్తిరించినట్లే మనము దేహమును కత్తెరతో విశ్వాత్మయను వస్త్రమును తునకలు చేయబూనుట కుర్రతనం కాదా!"-

"నైనం ఛిన్దన్తి శస్త్రాణి
నైనం దహతి పావకః
నచైనం క్లేదయన్త్యాపో
నశోషయతి మారుతః" శ్లో -23

ఈ ఆత్మను ఆయుధములు
ఛేదించజాలవు, అగ్ని
దహించజాలదు, నీరు
తడుప లేదు, గాలి ఎండింపజాలదు

జీవునకు (1)శరీరము-(2) మనస్సు (3) ఆత్మ అనునవి వుండును. ఇవి ఒక దానికంటె ఇంకొకటి అతి సూక్ష్మమైనవి. స్థూలమైన పంచభూతములు స్థూలమగు శరీరమును మాత్రమే బాధించగలవుగాని సూక్ష్మమగు మనస్సును కాదు. అలాంటప్పుడు అతి సూక్ష్మమైన ఆత్మను

అవి ఎట్లు బాధించగలవు? అని వివరణ ఇచ్చారు ప్రకాశానందగిరి స్వామి, జీవాత్మ కారణములకలయికచే ఏర్పడినది కాదని ఇంతకు ముందే చెప్పబడింది. కావున అట్టి సూక్ష్మతత్వమును కత్తులు, కటారులు ఖండించలేవు, ఖండించుట-ఛేధించుటయన విభజించుటయని అర్థము. అనేకములైన చిన్న చిన్న వస్తువులు కలిపి ఒక పెద్దవస్తువుగా ఏర్పడును. అట్టి వస్తువును కత్తులచేత విభజించవచ్చును. అవయవ మేళనము లేని ఒకే సూక్ష్మతత్వమును మరియొక తత్వము ఏదియు విడదీయజాలదు. కావుననే ఇటు కృష్ణుడు అర్జునునకు పృథివి, జలము, అగ్ని, వాయువు అను ఈ తత్వములేవియు జీవాత్మలో ఎట్టి వికారమును కలిగింప జాలవని స్పష్టముగ చెప్పియున్నాడు. దానిని బట్టి గరుడ పురాణాదులందు వర్ణింపబడిన బూటకపు కథల వలన జీవాత్మను యముడు కింకరులచే యమలోకమునకు తెప్పించి యటజీవునకు శస్త్రాదులతో బాధలు కలిగించుననుట తత్వశాస్త్ర విరుద్ధమంటున్నారు శ్రీ గోపదేవశాస్త్రిగారు తమ భగవద్గీతా వ్యాఖ్యానంలో.

"అచ్ఛేద్యోయ మదాహ్యోయం
అక్లేద్యో శోష్యఏవచ
నిత్యః సర్వగతఃస్థాణుః
రచలోయం సనాతనః" శ్లో - 24

*ఈ ఆత్మ ఛేదింపవీలుకానిది*
*తడుపరానిది, ఎండించరానిది*
*నిత్యమైనది, సర్వగతమైనది*
*స్థిరమైనది, అచలమైనది, సనాతనమైనది*

ఇరవై మూడవశ్లోకములోని భావమే ఈ శ్లోకమునందు తిరిగి చెప్పబడింది. ఆ విధంగాచెప్పడానికి గల కారణాలను వివరిస్తున్నారు శ్రీమలయాళ స్వాములవారు తమ వ్యాఖ్యానములో- గ్రాహ్యముకాని విషయమును బోధపడేలాగున చెప్పునపుడు రెండు మారులు చెప్పుట శాస్త్ర మర్యాద అయివున్నది. ఈ విషయములో ద్విరుక్తి దోషము లేదు. సనాతన మత ప్రచారకులు భగవంతుడుపదేశించిన ఈ సనాతన పదము యొక్క అర్థమును గ్రహించిన లోకమునకు ఎంతో మేలు కలుగును. అట్లు గాక దేహమును గురించిన వర్ణాశ్రమములు సనాతన ధర్మములని చెప్పుటవలన దేశము ఇంతహీనస్థితికి వచ్చింది.

"విస్మయేచ విషాదేచ ధైన్యే చైవావ ధారణే
తథా ప్రసాదనే హర్షే వాక్యమేకం ద్విరుచ్చతే"

విస్మయమందును, విషాదమందును, తత్త్వ ధారణయందును, అనుగ్రహమందును, హర్షమందును ద్విరుక్తి ప్రయోగముగలదు.

"అవ్యక్తోయ మచిన్త్యోయ
మవికార్యోయముచ్యతే
తస్మాదేవం విదిత్వైనం
నాను శోచితుమర్హసి" శ్లో - 25

**ఈ ఆత్మ అవ్యక్తమైనది**
**అచింతనమైనది, వికారములు**
**లేనిది అనిచెప్పబడుతున్నది**
**ఆత్మను గూర్చి ఈ విధంగా**
**అర్థము చేసుకొని దానిని**
**గూర్చి నీవు శోకించవలదు**

"అథచైనం నిత్యజాతం
నిత్యంవా మన్యసేమృతం
తథాపిత్వం మహాబాహో
నైనంశోచితు మర్హసి శ్లో - 26

***అర్జునా!***
***ఒకవేళ నీవు ఈ ఆత్మను***
***నిత్యము పుట్టుచు చచ్చుచు***
***నుండుదానినిగ తలంచినను***
***అట్టి స్థితిలో గూడా నీవు ఈ విధముగ***
***శోకించుట తగదు -***

"జా తస్యహి ధ్రువోమృత్యుః
ధ్రువం జన్మ మృతస్యచ
తస్మాదపరిహార్యేర్థే
నత్వం శోచితు మర్హసి" శ్లో - 27

"విస్మయేచ విషాదేచ దైన్యే చైవావ ధారణే
తథా ప్రసాదనే హర్షే వాక్యమేకం ద్వీరుచ్చతే"

విస్మయమందును, విషాదమందును, తత్త్వ ధారణయందును, అనుగ్రహమందును, హర్షమందును ద్విరుక్తి ప్రయోగముగలదు.

"అవ్యక్తోయ మచిన్త్యోయ
మవికార్యోయముచ్యతే
తస్మాదేవం విదిత్వైనం
నాను శోచితుమర్హసి" శ్లో - 25

ఈ ఆత్మ అవ్యక్తమైనది
అచింతనమైనది, వికారములు
లేనిది అనిచెప్పబడుతున్నది
ఆత్మను గూర్చి ఈ విధంగా
అర్థము చేసుకొని దానిని
గూర్చి నీవు శోకించవలదు

"అథచైనం నిత్యజాతం
నిత్యంవా మన్యసేమృతం
తథాపిత్వం మహాబాహో
నైనంశోచితు మర్హసి శ్లో - 26

అర్జునా!
ఒకవేళ నీవు ఈ ఆత్మను
నిత్యము పుట్టుచు చచ్చుచు
నుండుదానినిగ తలంచినను
అట్టి స్థితిలో గూడా నీవు ఈ విధముగ
శోకించుట తగదు -

"జా తస్యహి ధ్రువోమృత్యుః
ధ్రువం జన్మ మృతస్యచ
తస్మాదపరిహార్యేర్థే
నత్వం శోచితు మర్హసి" శ్లో - 27



జన్మించిన వానికి మరణము తప్పదు
మరణించిన వానికి తిరిగి జన్మము తప్పదు
అనివార్యమగు ఈ విషయమున
శోకించడం నీకు తగని పని

" అవ్యక్తా దీని భూతాని
వ్యక్తమధ్యాని భారత
అవ్యక్త నిధనాన్యేవ
తత్రకా పరిదేవనా! శ్లో -28

అర్జునా!
ప్రాణికోట్లన్నియు జన్మాదియందు
అగోచరములుగను, జీవిత
కాలమున గోచరములుగను
గతించిన పిదప మరల అగోచరములు
గను అగుచున్నవి, ఇట్టి విషయములో
నీవు శోకించరాదు

ప్రాణులకు పుట్టుకకు పూర్వము ఈదేహములతో సబంధములేదు. మరణించిన పిదపను లేదు. జీవించి వున్న సమయంలో మాత్రం ఈ దేహంతో సంబంధం కలిగివున్నారు. ఆద్యంతములందు లేనిదై, మధ్యకాలమున మాత్రమే అగుపించునది మిథ్యావస్తువే కాగలదు. అది భ్రాంతిమాత్రమే, స్వప్న జగత్తు నిద్రకు పూర్వము లేదు. నిద్దుర ఉడిగిన పిదపను లేదు. కేవలము నిద్రించునపుడు మాత్రమే అది వుంది. అది మిథ్యా మాత్రమే ఎట్లగుచున్నదో మధ్యకాలమున మాత్రము అగుపడు ఈదేహాది దృశ్య పదార్థములున్ను ఎండమావులవలె అసత్యములు, భ్రాంతి రూపములు, అట్టి వాటి కొరకు దిగులు అనవసరం అని భగవానుడు ఈ శ్లోకంలో వివరించాడు.

ఆశ్చర్య వత్పశ్యతి కశ్చిదేనం
ఆశ్చర్య వద్వదతి తథైవచాన్యః
ఆశ్చర్య వచ్చైన మన్యశృణోతి
శ్రుత్వాప్యేనం వేద నచైవకశ్చిత్ శ్లో - 29

ఒకడు ఈ ఆత్మను అద్భుతమైన
దానివలె దర్శించుచున్నాడు
మరొకడు ఈ ఆత్మను గూర్చి అద్భుత
మైన దానినిగా భాషిస్తున్నాడు

ఆభాషణను యింకొకడు
అద్భుతమైనదానిగా ఆలకిస్తున్నాడు
ఆ విధంగా దర్శిస్తూ, భాషిస్తూ, ఆలకిస్తూ
వున్నవారిలో ఏ ఒక్కడును, దానిని
గూర్చి సరిగా తెలుసుకొనుట లేదు.

ఇదే విషయాన్ని కఠోపనిషత్తు ద్వితీయవల్లిలోని 7వ శ్లోకం ఈ విధంగా తెలియజేస్తున్నది.

"శ్రవణాయాపి బహుభిర్యో నలభ్యః
శృణ్వంతోఽపి బహవోయం న విద్యుః
ఆశ్చర్యోవక్తా కుశలోస్యలబ్ధా
శ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః"

యః= ఏదైతే(ఆత్మ), బహుభిః = చాలా మందిచేత శ్రవణాయ= వినడానికి, అపీ=కూడా, అలభ్యః=లభ్యంకాదో, బహువః= చాలామంది, శృణ్వంతు అపీ= వినికూడా, యం=దేనికైతే నవిద్యుః= తెలియ జాలదో, అన్య= దానియొక్క వక్తా= ఉపదేశకుడు, ఆశ్చర్య= అద్భుతమైనవాడు, అస్య=దాని యొక్క, లబ్ధా= పొందినవాడు (శిష్యుడు) కుశలః=చాతుర్యం కలవాడు కుశలాను శిష్టః= చతురుడైన ఆచార్యుని చేత నేర్పించబడి, జ్ఞాతా= జ్ఞాతీ, (తెలుసు కొనినవాడు), ఆశ్చర్యః=అద్భుతమైన వాడు.

తా॥ దాని (ఆత్మ) గురించి వినడం కూడా ఎంతోమందికి సాధ్యపడదు. దాని (ఆత్మను గూర్చి) వినని వారుకూడా ఎందరో దానిని గ్రహించలేరు దానిని ఆత్మనుగూర్చి ఉపదేశించే ఆచార్యుడు అద్భుతమైనవాడు. శిష్యుడు కూడా అదే విధంగా అద్భుతమైన బుద్ధి దక్షత గలవాడు. సమర్ధుడైన ఆచార్యుడు ఉపదేశించగా దానిని (ఆత్మను గూర్చి) గ్రహించగలిగే శిష్యుడు నిజంగా అద్భుతమైన వాడు గదా!

**వివరణ :-**

1. ఆచార్యుడు అద్భుతమైనవాడు, సమాజంలో అతి సకృత్తుగా కనుపించేవాడు ఆత్మజ్ఞాని. ఆయన శక్తి, స్వభావమూ కూడా. నిజంగా అద్భుతమైనవే. నిజంగా ఆశ్చర్యమైనవే. సమాజానికి వారే జీవగర్రలు.
2. శిష్యుడు బుద్ధి తీక్షణతగలవాడు. ఆత్మవిద్యను అర్ధము చేసుకోగల శిష్యుడు కూడా ఎంతో అరుదు, సామాన్యమానవులకంటే అతడు ఎంతో విశిష్టుడు. అవసరమైన అర్హతలు సాధన చతుష్టయములు మాత్రమే ఆత్మ విద్యకు తగిన శిష్యులుగా చేయగలవు.

## సాధన చతుష్టయాలు

This is a pharaphrase of Katho Upanishad 2.7 " He whom many cannot get even to hear of; He whom many even having heard of do not know; rare is he whom can describe Him, ingeneious is who has won Him; and rare he who, having been instructed by much a one, as known Him, "The word marvel, in the gita may apply both to this (Atma) and to the various subjects of the verbs. Shankaracharya does not refer to the upanishad but accepts both and interpretation as possible.

1. ఏది శాశ్వతమో, ఏదిక్షణికమోనన్న నివేదన.
2. ఈ జీవితము లోనూ, స్వర్గాది లోకాలలోను అనుభవించగలిగే సుఖాల పట్ల వైరాగ్యము.
3. మనో నిగ్రహము, ఇంద్రియ నిగ్రహము, ఆనందాన్వేషణ నుండి విరమించడము, సమానము, శాంతి, శ్రద్ధ అను ఆరు విషయములను కలిగి యుండడము.
4. మోక్షము సాధించవలెనన్న కోరిక.

ఈ నాలిగింటికీ సాధన చతుష్టయములు అనిపేరు.

భగవానుడు ఇంతవరకు ఆత్మను గూర్చిన విచారణను సలిపి ఇకదానిని ఉపసంహరించి ఆత్మనిత్యుడు కావున ఎవరును, ఎవరికొరకు శోకింపపనిలేదని మరల చివరిగా దానిని గూర్చి తెలియజేస్తున్నాడు.

"దేహీ నిత్య మవధ్యోయం
దేహే సర్వస్య భారత!
తస్మాత్సర్వాణి భూతాని
నత్వంశోచితు మర్హసి" శ్లో - 30

అర్జునా!
సమస్త ప్రాణులయొక్క
దేహములందున్న
ఆత్మ చంపబడునది కాదు
అందువలన నీవు ప్రాణుల
విషయమై విలపించవద్దు

ఇంతవరకు సాంఖ్యయోగముననుసరించి ఆత్మయొక్క నిత్యత్వమును గూర్చి బోధించి, ఇక ఇపుడు రాబోయె ఏడు శ్లోకాలలో స్వధర్మముననుసరించి అయినను (క్షాత్రధర్మము) దుఃఖించుట నీకు తగదు అని భగవానుడు అర్జునునకు బోధిస్తున్నాడు.

"స్వధర్మమపిచాపేక్ష్య
నవికంపితు మర్హసి
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోన్యత్
క్షత్రియస్య నవిద్య తే" శ్లో 31

అర్జునా!
నీవు నీ స్వధర్మమును
గూర్చి దృష్టి యందుంచు
కుంటే యుద్ధ విషయమై
నీవు చలించనవసరము
లేదు. క్షత్రియుడైన
వానికి ధర్మయుతమైన
యుద్ధమును గూర్చి ఆలోచించడం
కన్న శ్రేయస్కరమైనది మరొకటి లేదు

భారతజాతీయోద్యమ నాయకులలో ఒకరు మహాత్మాగాంధీ అనుచరులు, మొట్టమొదటి వ్యక్తి సత్యాగ్రహి, భూదానోద్యమ నాయకులు అయిన మహర్షి వినోబా ధూళిలో జైలులో ఖైదీల నుద్దేశించి చేసిన ప్రవచనాలను ఇక్కడ మననం చేసుకుందాం.

"అర్జునుడు ధర్మసమ్మూఢుడై యుండెను. స్వధర్మము విషయమున అతని మనస్సున మోహముదయించి యుండెను. మొదట శ్రీకృష్ణుడు అతనియందు నిందారోపణ చేసిన తరువాత అర్జునుడీ విషయమును తనంతట తానే ఒప్పుకొనెను. ఆమోహమును మమత్వమును, ఆసక్తిని తొలగించుటయే గీత చేయు ముఖ్యమైనపని. అందుచేతనే భగవానుడు గీతనంతను వినిపించి చివరలో "అర్జునా! ఇపుడు నీ మోహమంతయు తొలగిపోయినదా!" అని ప్రశ్నించెను. "ఔను ప్రభూ! తొలగిపోయినది. స్వధర్మము అంటే ఏమిటో నాకు బోధ పడినది" అని అర్జునుడు జవాబిచ్చెను. ఈ విధముగ గీతయొక్క ఉపక్రమణమును, ఉపసంహారమును కలిపి చూచినచో మోహనిరసనమే గీత వలన ఫలితము అని తెలుచున్నది. మహాభారతమంతయు ఈ ఉద్దేశమునే వెలిబుచ్చుచున్నది. మానవుని హృదయమును ఆవరించి యున్నమోహమును తొలగించుటకే ఈ ఇతిహాస దీపమును వెలిగించుచున్నాను అని వ్యాసముని భారత ప్రారంభమునందే చెప్పియున్నాడు.

స్వధర్మ సిద్ధాంతము కర్తవ్యరూపమైనది, స్వధర్మము మనకు ప్రకృతి సిద్ధముగనే ప్రాప్తమగున్నది. స్వధర్మమును వెదకిపట్టుకొనుటకు ఎక్కడికి వెళ్లనవసరములేదు, మనము

జన్మింపక ముందే ఈ సమాజము ఇక్కడేవుంది. మన తల్లిదండ్రులు, ఇరుగుపొరుగు వారును వున్నారు. ఈ ప్రవాహములో మనకు జన్మకలుగుచున్నది, కనుక మనలను గన్న తల్లి దండ్రులను సేవించు ధర్మము జన్మసిద్ధముగనే మనకు లభించినది. మనము జన్మించిన సమాజమును సేవించు ధర్మము కూడా ఈ రీతిగనే తనకు తానుగ మనకు లభించినది. మన జన్మతోనే స్వధర్మము కూడా జన్మించినదనుట సత్యము, అంతేకాదు మనము పుట్టక ముందే మనకుగాను స్వధర్మము తయారై వున్నదని కూడా చెప్పవచ్చును. ఎందువల్లనంటే మన జన్మకు గలహేతువే అది, దాని పరిపూర్తి కొరకే ఈ జన్మము.

ఈ జగతిలో స్వధర్మము వినామనకు మరొక యే ఇతరాశ్రయమును లేదు. స్వధర్మమును తప్పించుకొని తిరుగుట తనను తాను కాదనుకొను ఆత్మఘాతుక కృత్యమువంటిది, స్వధర్మము యొక్క సహాయముతోనే మనం పురోగమించగలము. కాబట్టి ఎవరును ఎప్పుడును దాని ఆశ్రయమును విడనాడ కూడదు. ఇదే మన జీవితమున కొకమూల భూత సిద్ధాంతముగ స్థిరమగు చున్నది. (గీతా ప్రవచనం 15-16 పేజీలు)

**అరవింద మహర్షి విశ్లేషణ** : అర్జునుడు క్షత్రియుడు. తన స్వధర్మం దేనిని నిర్దేశించిందో దానిని చేయడంలో అని వార్యంగా ఈ మారణ హోమం దానంతటదే వచ్చిపడింది. అర్జునుడు ప్రయాణించవలసిన దారిలో దాని అవసరం వున్నది. స్వధర్మం అంటే అతని సాంఘిక విధి, అతని జీవిత ధర్మం, అతని అస్తిత్వ ధర్మము, దానిని మనం ప్రస్తుత సమాజములోని కులాలకు అన్వయించి ఎవరి కులవృత్తుల్ని వారు నిర్వహించడం స్వధర్మం అని చెప్పకూడదు. అదే విధంగా భగవానుడు కేవలం క్షత్రియుని సామాన్యకర్తవ్యాన్ని అర్జునునికి గుర్తు చేశాడనీ, ఆ విధంగానే తమ తమ కులాచారాలను బట్టి పోవాలనేదే భగవానుని ఆశయంగా చిత్రంచకూడదు, గీత కుల వ్యవస్థను సమర్థించడం లేదని గ్రహిస్తే ప్రస్తుతానికి సరిపోతుంది.

పై శ్లోకం (2-31) రెండవ పాదంలో ధర్మయుద్ధము క్షత్రియుడు కోరదగినది ఏదీ లేదని చెబుతూ ఆత్మ నిత్యత్వ దృష్టితో కాకపోయినా క్షత్రియుని కర్తవ్య దృష్టితో నైనా ధర్మయుద్ధమే శ్రేయస్కరమైనదని ప్రకటిస్తున్నాడు. భౌతిక జగత్తులో ఆత్మకు అభివ్యక్త రూపం అయిన ఈ ప్రపంచం కేవలం అంతర్గతమైన అభివృద్ధికి మాత్రమే చెందిన ఆకృతి కాదు, అంతరంగంలో ఆధ్యాత్మికమైన వికాసాన్ని కలిగించడానికి మాత్రమే తోడ్పడేదిగా ప్రపంచాన్ని పరిగణించకూడదు.

ఆ అంతర్గతమైన ఆధ్యాత్మికాభివృద్ధికి, జీవితానికి, బాహ్యంలో ఒక పర్యావరణము (Environment) ఒక సందర్భము (occassion) అవసరమౌతాయి. ప్రపంచము వాటిని సమకూర్చే ఒక క్షేత్రం. ప్రపంచపర్యావరణము, ప్రపంచ సందర్భము, అంటే బాహ్యక్షేత్రం ఈ అభివృద్ధికి అని వార్య అవశ్యకస్థితి. అయితే ఈ ప్రపంచము అతి సులభంగా దొరికే సంతోషాల ద్వారా నిరామయ ప్రశాంత స్థితిలో హాయిగా జారిపోవడం ద్వారా అభివృద్ధిని పొందనీయదు. ప్రపంచము పరస్పర సహాయము, సంఘర్షణ ఈ రెండింటితోను కూడివుంది. వీరోచిత కృషి వల్లను , విరుద్ధ శక్తుల సంఘర్షణ వల్లనే మనం అడుగుముందుకు వేయగలం. ఈ అంతర్బాహ్య సంఘర్షణను అత్యంత భౌతిక సంఘర్షణ అయిన యుద్ధము వరకు కూడా చేపట్టే వారే క్షత్రియులు. మహాశూరులు, యుద్ధము,శక్తి, ఔన్నత్యము, ధైర్యము వారికి పుట్టుకతో వచ్చిన గుణాలు. ధర్మాన్ని కాపాడడం, యుద్ధము అవసరమైనప్పుడు జంకూ, కొంకూ లేకుండా దానిని అంగీకరించడం వారి ఉత్తమ గుణమేకాదు, వారి విద్యుక్త ధర్మం కూడా. రక్షించే శక్తికి, ఉల్లంఘించి అణిచివేసే శక్తికి మధ్య అంటే ధర్మాధర్మాలు, న్యాయ, న్యాయాల మధ్య సంఘర్షణ ఎప్పుడూ వుండనే వుంటుంది. ఇది భౌతికంగా ఒక్కొకసారి పోరాటానికి త్రోవతీస్తుంది. ధర్మపక్షాన నిలిచి, ధర్మపతాకాన్ని ధరించినవాడు ఆ సమయములో తన కర్తవ్య కర్మాచరణ హింసాత్మకంగా, భయానకంగా గోచరిస్తే బెంబేలు పడిపోయి గజగజవణికిపోకూడదు. బలహీనత వలన హింసా పరులు, క్రూరులు అయిన వారి మీద జాలితో, జరిగితీరవలసి వున్న విధ్వంసము అంటే భయంతో తన అనుచరులను సహ యోధులను గాలికి వదిలిపెట్టి, ధర్మానికి ద్రోహంచేసి, ధర్మన్యాయపతాకాన్ని నేలపాలు చేసి, క్రూరుడైన నియంత నెత్తుటి పాదాల క్రింద నలిగిపోయేట్లు చేయకూడదు. కర్తవ్య కర్మాచరణం ఇంతకఠినమైనది. కఠోరమైనది. దానికి మరొక పేరేనిష్కామ కర్మ దానిని నిర్వహించడానికి ఎంతో ధైర్యం, సూక్ష్మమైన అంతర్గత వివేకం, అచంచల దీక్ష అవసరం. అందుచేతనే శ్రీకృష్ణుడు అర్జునునికి స్వధర్మాన్ని, సందర్భాన్ని కూడా వివరించి ఏ పరిస్థితులలోనైనా సరే అతని కర్తవ్యము యుద్ధము చేయడమేనని ఉద్ఘాటించాడు. ద్వంద్వాలలోపడి శోకమోహాలకు గురికావద్దని, ఫలితాలు ఎంత ఘోరమైనవే అయినా, కర్తవ్య కర్మ కర్మాచరణను వదలిపెట్టకూడదనీ భగవానుడు ఉపదేశించాడు. అది పాపమైనా, పుణ్యమైనా లెక్కచేయకూడదన్నాడు. పైగా అతని పుణ్యం, ధర్మం యుద్ధము చేయడంలోనే వున్నది కాని యుద్ధము నుంచి విరమించుకోవడంలో లేదు, పాపపుణ్యాలను గురించి సాధారణ భావాలు లోతైనవికావు.

అతనికి పాపము వచ్చేది సంహారమువలన కాదు. సంహరించకపోవడం వలన అంటూ ఆచార్యుడు అర్జునుని పాపభయాన్ని పోగొట్టడానికి ప్రయత్నించారు. పాపంగా కనుపించినా సరే కర్తవ్య కర్మ అవశ్యం ఆచరించదగింది. ఎంత పుణ్యంగా కనుపించినను కర్తవ్యం కాని కర్మ అనుసరణీయం కాదు. శ్రీకృష్ణుడు స్వధర్మాచరణ అంటే కర్తవ్య కర్మాచరణ అంటే నిష్కామకర్మ ఒక్కటే చేయదగినదని అందులో పాప పుణ్యముల విచారణకు తావులేదని నిష్కర్షగా తేల్చి చెప్పాడు. ధర్మయుద్ధం కన్న క్షత్రియునికి మరొక శ్రేయస్సు లేదని స్పష్టంగా పేర్కొన్నాడు.

(శ్రీ అరవిందుల గీతాదర్శనము వ్యాఖ్యత శ్రీ తెన్నేటి పూర్ణచంద్రరావుగారు)

"యదృచ్ఛయా చోపపన్నం
స్వర్గ ద్వార మపావృతం
సుఖినః క్షత్రియాః పార్థ!
లభన్తే యుద్ధమీ దృశ్యం" శ్లో -32

అర్జునా!
అప్రయత్నముగ లభించు
నట్టిదియును, తెరువ
బడిన స్వర్గద్వారము
గలదియును అగు ఇట్టి
యుద్ధము సుఖవంతు
లైన క్షత్రియులకు మాత్రమే
లభించును.

"అథచేత్త్వ మిమం ధర్మ్యం
సంగ్రామం న కరిష్యసి
తతః స్వధర్మం కీర్తిం చ
హిత్వా పాపమవాప్స్యసి" శ్లో - 33

అందువలన
ధర్మయుతమైన ఈ యుద్ధమును
నీవు విడిచితి వేని దానినుండి
నీవు నీ స్వధర్మమును పోగొట్టు
కొనినవాడవై, కీర్తిని జారవిడుచు
కొని పాపమును పొందెదవు.

పాండవులు తమ అజ్ఞాత వాసాన్ని పూర్తిచేసుకొని యుద్ధ నివారణకై శ్రీకృష్ణుని తమ పక్షాన హస్తినకు ధృతరాష్ట్రుని వద్దకు రాయబారము పంపిన సందర్భంలో శ్రీకృష్ణుడు తన మేనత్త పృథ(కుంతీదేవి) ను దర్శిస్తాడు. (అర్జునుని తల్లి) అపుడు కుంతీదేవి శ్రీకృష్ణునితో ఈ విధంగా చెప్పింది.

కృష్ణా !
దేనినిమిత్తము క్షత్రియమాత
కొమరునిగనుచున్నదో
అట్టి సందర్భము ఇపుడు
ఏ తెంచినదని అర్జునుని తోను,
నిరంతరము యుద్ధసన్నద్ధుడై
యుండే భీమునితోను చెప్పుము

కుంతీ దేవి చెప్పిన మాటలను పరోక్షంగా అర్జునుని ముందుంచి "నీవు నీ స్వధర్మముతో యుద్ధమునకై ముందుకు సాగుము" అని హెచ్చరించాడు.

" అకీర్తింగాపి భూతాని
కథయిష్యంతి తేవ్యయామ్
సంభావితస్య చాకీర్తి:
మరణా దతి రిచ్యతే" శ్లో - 34

అపుడు లోకులు నీయొక్క
అపకీర్తిని గూర్చి శాశ్వతముగ
చెప్పుకొనెదరు, మాననీయుడైన
వానికి అపకీర్తి కన్న మరణమే మేలు

"భయాద్రణాదు పరతం
మంస్యన్తే త్వాం మహారథా:
యేషాం చత్వం బహుమతో
భూత్వా యాస్యసిలాఘవం" శ్లో - 35

ఇంతవరకు నిన్ను గొప్పగా

గౌరవించిన మహారథు
లందరు ఇకముందునిన్ను
చులకన చేసి మాట్లాడెదరు
అంతేకాదు, భయము
వలన నీవు యుద్ధమును
విరమించినట్లు భావించెదరు

"అవాచ్య వాదాంశ్చ బహూన్
వదిష్యన్తి తవాహితాః
నిన్దన్త స్తవ సామర్థ్యం
తతో దుఃఖతరం ను కిం" శ్లో - 36

నీ యొక్క శత్రువులు
నీసామర్థ్యమును నిందించుచు
నిన్ను గూర్చి అనరాని మాటలను
ఎన్నో అనెదరు, దానికంటే
మించిన దుఃఖము మరొకటి లేదు

"హతోవా ప్రాప్స్యసి స్వర్గం
జిత్వావా భోక్ష్యసే మహీమ్
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ!
యుద్ధాయ కృతనిశ్చయః" శ్లో - 37

అర్జునా!
ఒకవేళ నీవు ఈ యుద్ధరంగమున
చనిపోయెదవేని స్వర్గమును
పొందెదవు, యుద్ధములో
జయించితివేని రాజ్యభోగము
లను అనుభవించగలవు
కనుక దృఢసంకల్పముతో
యుద్ధమునకు సంసిద్ధుడవుకమ్ము



కార్యములను (పనులను) ఏ విధంగా ఆచరించవలెనో దానిని గూర్చి భగవానుడు అర్జునునకు తెలియజేయుచున్నాడు.

"సుఖదుఃఖే సమేకృత్వా
లాభా లాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ
నైవం పాప మవాప్స్యసి" శ్లో - 38

అర్జునా !
సుఖ దుఃఖములందును
జయాప జయములందును
సమ బుద్ధి కలిగి యుద్ధమునకు
సంసిద్ధుడవుకమ్ము, ఇటుల
చేసినచో నిన్ను పాపములంటవు

"ఏషా తే భిహితా సాంఖ్యే
బుద్ధిర్యోగే త్వివమాం శృణు
బుద్ధ్యా యుక్తోయయా పార్థ!
కర్మబంధం ప్రహాస్యసి " శ్లో - 39

అర్జునా !
నేను నీకు ఇంత వరకు
సాంఖ్య తత్వశాస్త్రమును
తెలుపు ఆత్మతత్వమును
గూర్చి ఎరుక పరిచితిని
ఇక ఏ యోగ శాస్త్రము చేత
కర్మబంధమునుండి విడివడ
గలవో అట్టి కర్మ యోగమును
గూర్చి తెలుపుచున్నాను, వినుము

జీవుడు (ఆత్మ) మానవ శరీరమును పొంది నానావిధముల సకర్మముల యందు ప్రవర్తించుచున్నది. సాధారణంగా మనుష్యుడు ఫలమును అపేక్షించియే ఏదో ఒక పనిని

చేయును. ఫలాపేక్షతో కర్మములను ఆచరించి ఆఫలములు లభించినపుడు సుఖదుఃఖ రూపములో వాటిని అనుభవించును. కర్మములనొనర్చుటకై జీవునకు (ఆత్మకు ) దేహము అవసరమగునట్లు వాని ఫలమును అనుభవించుటకును దేహము అవసరమే. దేహమును ధరించకుండా జీవుడు కర్మలను ఆచరించలేదు. ఫలములను కూడా అనుభవించలేదు. శుభకర్మల వలన కలుగు ఫలము సుఖము, అశుభ కర్మలవలన కలుగు ఫలము దుఃఖము, కనుక సుఖదుఃఖములు అనే ద్వంద్వములు కర్మ ఫలములనుటను ఎన్నడును మరువరాదు. ఇట్టి కర్మ ఫలములను జీవుడు దేహము నందుండి అనుభవించవలెను. కాబట్టి దేహము జీవునకు ఇంధనము. అందువలన జీవులు దేహముతో కర్మలు చేయుచు వాని ఫలములను అనుభవించుటకు దేహరూప బంధనమున పడుచున్నారు. అట్టి బంధనముతొలగుటకు ఉపాయము కావలెను. అర్జునుడు యుద్ధమొనర్చి దాని వలన రాబోవు దుఃఖరూప ఫలమునను భవించుటకు దేహబంధనమున పడకుండా యుండుటకు నిశ్చయించుకున్నాడు. అందువలననే యుద్ధము నుండి విరమించుకొనదలచాడు. కర్తవ్య కర్మ నుండి విముఖుడయ్యాడు.

అట్టియెడ శ్రీకృష్ణభగవానుడు అర్జునుని కర్తవ్యాభిముఖుని జేసి దాని నుండి కలుగు ఫలము నుండి తప్పించుకొనుటకు తగిన ఉపాయము చెప్పదలిచాడు. కనుక కర్మయోగము అట్టిదని బోధించుటకు యత్నించుచున్నాడు. తాను వర్ణింప బోవు కర్మయోగము నందు అర్జునునకు ప్రవృత్తి కలిగింపగోరి కర్మయోగమును ఈ విధముగా ప్రశంసిస్తున్నాడు.

"నేహాభి క్రమనాశోస్తి
ప్రత్యవాయో న విద్యతే
స్వల్ప మప్యస్య ధర్మస్య
త్రాయతే మహతో భయాత్" శ్లో - 40

*ఈ కర్మయోగమునందు
అభిక్రమ నాశము లేదు
ప్రత్యావ్యాయ దోషమును
లేదు. ఈ ధర్మమును కొద్దిగా
అనుష్ఠించినను గొప్పదైన
సంసార భయమునుండి
రక్షణ పొందవచ్చును*

ప్రాణులకు కలుగు అన్నిభయాలలో మృత్యుభయము చాల గొప్పది. దాని నుండి తప్పించు కొనుటయే మానవజాతి లక్ష్యము. కనుకనే మానవుడు సాధించవలసిన చతుర్విధపురుషార్థములలో అంతిమ పురుషార్థం మోక్షము. మృత్యువును ఉల్లంఘించుటకు శాస్త్రములు వివరిస్తున్నాయి. మన మహర్షులందరు మృత్యుభయము నుండి బయట పడుటచే తమకు గల మహదైశ్వర్యములను, ఇతర సుఖాలను వీడి అరణ్యాలలో సంచరించి ఆత్మసాక్షాత్కారము పొంది జన్మరాహిత్యాన్ని (మోక్షాన్ని) పొందగలిగారు.

ఉత్తమ కర్మ యోగం యొక్క స్థిరచిత్తమును భోగాసక్తుల చంచల మానసమునకుగల తేడా ఏమిటో వివరిస్తున్నాడు భగవానుడు

"వ్యవసాయాత్మికా బుద్ధి
రేకేహ కురునందన!
బహుశాఖాహ్యనంతాశ్చ
బుద్ధయో వ్యవసాయినామ్" శ్లో - 41

అర్జునా !
ఈ యోగమునకు కావలసినది
నిశ్చయాత్మక బుద్ధి యొక్కటియే
నిశ్చయాత్మకత్వము లేనివారి
బుద్ధులు బహు శాఖలు కలవియు
గను, అనంతములు గను వుండును

నిశ్చయాత్మక బుద్ధిలేనివారి స్వభావమును గూర్చి వర్ణించుచున్నాడు.

"యామిమాం పుష్పితాం వాచం
ప్రవదన్త్య విపశ్చితం
వేదవాదర తాః పార్థ!
నాన్యదస్తీ తి వాదినః" శ్లో -42

కామాత్మా నః స్వర్గ పరా
జన్మకర్మఫల ప్రదామ్
క్రియా విశేష బహుళాం
భోగైశ్వర్య గతింప్రతి" శ్లో - 43

"భోగైశ్వర్య ప్రసక్తానాం
తయా పహృత చేతసామ్
వ్యవసాయాత్మికా బుద్ధిః
సమాధౌనవిధీయతే" శ్లో - 44

అర్జునా !
వేదవాదములయందు
రమించువారును, కామ్య
కర్మలే అధికమైనవని
వాదించువారును
స్వర్గమే ఉత్కృష్టమైనది
యని భావించి పుష్పిత
వాక్కులచే ఈ విధంగా
పలుకు వారునూ
కోరికలతోనిండిన వారునూ
స్వర్గాభిలాషులును
జన్మకర్మఫలములు
ఒసంగునట్టి దియును
భోగైశ్వర్యములనొన గూర్చునదియు అయిన
భోగైశ్వర్య ప్రసక్తి కలవారును
పుష్పిత వాక్కులచే అపహరింప
బడిన హృదయము కలవారును
అగువారలకు సమాధియందు
నిశ్చయాత్మకమైన బుద్ధియుండదు

"త్రైగుణ్యా విషయావేదా
నిస్త్రై గుణ్యోభవార్జున !
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో
నిర్యోగక్షేమ ఆత్మవాన్" శ్లో - 45



అర్జునా !
వేదములు త్రిగుణములే
విషయములు గా కలిగి
యున్నవి, నీవు ఆ త్రిగుణము
లను అతిక్రమించుము
ద్వంద్వా తీతుడవుకమ్ము
సత్వాశ్రయుడవు కమ్ము
యోగక్షేమముల నుండి విడివడి
ఆత్మ జ్ఞానివి కమ్ము

వేదములు ఎక్కువ భాగము కర్మకాండమును, వర్ణాశ్రమములను, తత్కార్యములను గూర్చి తెలుపును. వేదముల యొక్క ఈ కర్మకాండమంతా సత్వ, రజ, స్తమోగుణములను మాత్రము ప్రతిపాదించును. అయితే వేదముల యొక్క అంతిమ భాగములయిన ఈ మూడుగుణములకు పై భాగమున వుండు శుద్ధాత్మను గురించి వివరించును. ఇవి వేదముల యొక్క చివరి భాగములగుట చేత వీటికి వేదాంతమనే పేరు వచ్చింది. ఇది నిరతిశయానందమగు బ్రహ్మ ప్రాప్తిని కలుగజేస్తుంది.

"యావానర్థ ఉదపానే
సర్వత స్సంప్లుతోదకే
తావాన్‌సర్వేషు వేదేషు
బ్రాహ్మణస్య విజాన తః"        శ్లో- 46

నీరు అన్నివైపుల నిండియుండగా
జలాశయమునందలి నీటివలన
ఎంతటి ప్రయోజనముగలదో
బ్రహ్మజ్ఞాని యైన బ్రహ్మవేత్తకు
వేదముల వలన అంతియే ప్రయోజనము
వుండును

"కర్మణ్యే వాధికారస్తే
మాఫలేషు కదాచన
మాకర్మఫల హేతుర్భూ
ర్మాతే సంగోస్త్వ కర్మణి"        శ్లో - 47

కర్మను చేయుటయందే
నీకు అధికారం వున్నది
కర్మయొక్క ఫలమును
ఆశించుటలో నీకు ఎంత
మాత్రం అధికారం లేదు
కనుక నీవు కర్మఫలము
నకు కారణ భూతుడవు కావద్దు
అట్లని కర్మలను ఆచరించుట
యందు అనాసక్తుడవు కావద్దు

ఈ విషయములో మహాత్మాగాంధీగారు చెప్పిన విషయాన్ని ఆంగ్లములో యథాతథంగా వ్రాస్తున్నాను.

"This need not and certainly does not, involue the idea of" all absence of purpose as a christean cretic would make out. The supreme purpose is before man, viz, self realization or freedom, and it is with that end in view that the fruit of all action is to be abdnoned, we find the same idea beautifully pharapharased and explained in Tolestoy's "What I believe" the belief in a Remunararation of work rests on the assumption that we have a claim to some thing; but man has no rights and can have none. He is ever in debt for the welfare given him and there fore can make to demands on any one,...This is a necessiary condition of both service and the true welfare of his life. Nor yet does it mean that because a man will have no eye to fruit he will have no fruit on the contrary, the ultimate fruit is made all the more certain by the renunciation of the desire for it, see v.4 where the author actually refers to the fruit of yoga. The koran has the same thought over and over again, "Who so ever Surrenderth his purpose to Allah while doing good., his verily hath grasped the firm hand hold into Allah be longath the sequal of all things." (31-22). My wage is the concern of Allah only" (10-72) and it becometh not a believing man or believing woman, when Allah has decided an affair for them, that they should claim any say in the affair" (33-36)

Gandhiji explained the verse in another connection.

There should be no selfish purpose behind our actions and to be detached from the fruits of Actions is not to be ignorant of them or disregard or dison them. To be detached is never to abonden action, because the comtemplated man not follow, onthe cuntrarcy, it is proof on the immovable faith in the certanity of the comteplated result following in the course. (Young India 15-3-1938

మహర్షి వినోబా దృష్టిలో కర్మ : కర్మనాచరించు వారి మనోవృత్తి రెండు విధములు. (1) కర్మను ఆచరించువారము మనమే. కర్మఫలములను అనుభవించువారమును మనమే. ఇందులకు మనకు అధికారము వున్నది" అనునది ఒక మనోవృత్తి. అందుకు విరుద్ధంగా "ఫలాను భవము లభింపకపోయినచో అసలు కర్మలు చేయటం ఎందుకు?" అనునది రెండో రకమైన వృత్తి. ఈ రెండింటికి భిన్నంగా గీత మరొక మూడవ మనోవృత్తిని ప్రతిపాదించింది. "కర్మలను మాత్రము తప్పక ఆచరింపుము. కాని ఆ కర్మల నుండి రాబోయే ఫలముల మీద అధికారమును వుంచుకోవద్దు" అని ప్రకటించింది. కర్మఫలముపై నీ కధికారంవుందనుకున్నా దానిని ఇచ్ఛాపూర్వకముగ వదలి పెట్టుము అంటున్నది గీత" అని తెలిపారు దీనినిబట్టి గ్రహించవలసిందేమిటంటే

1. "కర్మలను స్వీకరించినచో ఫలసహితముగనే స్వీకరింపుము" అని రజోగుణము
2. "ఫలమును వదలిన కర్మను సైతము వదలుము" అని తమోగుణము
3. "ఈ రెండును అన్నదమ్ములే, కనుకు నీవు ఈ రెండింటిని అధిగమించి, శుద్ధసత్వగుణుడవు కమ్ము" అని సత్వగుణము ప్రకటిస్తున్నాయి.

"యోగస్థః కురుకర్మాణి
సంగంత్యక్త్వా ధనంజయ!
సిద్ధ్య సిద్ధ్యో స్సమోభూత్వా
సమత్వం యోగ ఉచ్యతే" శ్లో - 48

అర్జునా !
నీవు యోగమునందున్న వాడవై
సంగత్వమును వీడి, కార్యము
సిద్ధించినా, సిద్ధించక పోయినా
ఆరెండింటి పట్ల సమముగావున్న
వాడవై కర్మలను ఆచరింపుము
యోగమంటే సమబుద్ధియే

దూరేణ హ్యవరం కర్మ
బుద్ధి యోగా ద్ధనంజయ!
బుద్ధౌశరణ మన్విచ్ఛ
కృపణాః ఫలహేతవః శ్లో- 49

అర్జునా !
బుద్ధియోగముకంటే కామ్యకర్మ
నికృష్టమైనది. అందువల్ల నీవు
నిష్కామ కర్మను ఆశ్రయింపుము
ఫలమును గోరు వారు కృపణులు

"యపన మవిదిత్వా ప్రైతిసకృపణః" అంటే "మానవుడై జన్మించి తన్నుదా తెలియక మరణించువాడే కృపణుడు" అని తత్వజ్ఞుల అభిప్రాయము.

బుద్ధియుక్తో జహాతీహం
ఉభేసుకృత దుష్కృతే
తస్మాద్యోగాయ యుజ్యస్వ
యోగం కర్మసు కౌశలమ్" శ్లో - 50

సమత్వ బుద్ధి గలమానవుడు
పాపపుణ్యములను రెండింటిని
ఈ జన్మయందేనిర్లిప్తున్నాడు
కావున ఓ అర్జునా! నీవును అట్టి
సమత్వ బుద్ధిగల నిష్కామత్వ
యోగమును అవలంబించి కర్మల
యందు కుశలత్వమును పొందుము
కర్మలయొక్క కుశలత్వమే యోగము

"కర్మజం బుద్ధియుక్తాహి
ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబంధ వినిర్ముక్తాః
పదం గచ్ఛన్త్య నామయం" శ్లో - 51

సమత్వబుద్ధితో గూడిన
వివేకవంతులు కర్మలను
ఆచరించుచున్నను ఫలా
పేక్ష రహితులైన వారగుట
చేత జన్మబంధము నుండి
విడివడిన వారై దుఃఖరహిత
మైన మోక్షపదవిని పొందెదరు

నిష్కామకర్మ ద్వారా చిత్తము శుద్ధము కాగా, అట్టి నిర్మల చిత్తమున ఆత్మజ్ఞానముదయించుటచే వారు జన్మ బంధరహితులగుచున్నారు. దీనిని బట్టి కర్మ మార్గము మోక్షమునకు ఎట్లు ఉపకరించుచున్నదో స్పష్టపడుతున్నది. అట్టి మోక్షస్థితి ఎపుడు కలుగుతుందో వివరిస్తున్నాడు భగవానుడు.

"యాదాతే మోహకలిలం
బుద్ధి ర్వ్యాతితరిష్యతి
తదా గన్తాసి నిర్వేదం
శ్రోతవ్యస్య శ్రుతస్యచ" శ్లో - 52

అర్జునా !
నీ బుద్ధి ఎపుడు మోహము అను
కాలుష్యమును దాటి వేయునో
అప్పుడిక నీవు వినవలసిని
దానిని గూర్చియును, వినిన దానిని
గూర్చియు విరక్తిని పొందెదవు

"శ్రుతివిప్రతి పన్నాతే
యదాస్థాస్యతి నిశ్చలా
సమాధావచలా బుద్ధి
స్తదాయోగమ వాప్స్యసి" శ్లో - 53

నానావిధములగు శ్రవణాదులచే
విచలితమైన నీ బుద్ధి ఇపుడు
సమాధియందు స్థిరముగ లేదు
ఎపుడ నీ బుద్ధి స్థిరముగనుండునో
అపుడు నీవు యోగమును పొందుదువు

మనుష్యుడు ఆత్మసాక్షాత్కారమును ఎపుడు పొందగలడు అను ప్రశ్నకు ఈశ్లోకము నందు చక్కగా జవాబు చెప్పబడింది. ఆత్మానుభూతికి ఎలాంటి కాలనియమము వుండదు. ఎపుడు చిత్తము విషయ విముఖతను, ఏకాగ్రతను పొందునో అపుడే అది మోక్షస్థితిని బడయగలదు..

**జీవన్ముక్తుడు లేక స్థితప్రజ్ఞుడు** : స్థిర బుద్ధియుడగు జీవన్ముక్తిని గూర్చి భగవానుడు పలికిన ఆ వాక్యములను విని అట్టి స్థితప్రజ్ఞుని లక్షణములు ఏవియో తెలుసుకోవాలన్న అభిలాషతో అర్జునుడు భగవానుని ఈ క్రింది విధముగ ప్రశ్నిస్తున్నాడు.

స్థిత ప్రజ్ఞస్యకాభాషా?
సమాధిస్థస్యకేశవః
స్థితధీః కిం ప్రభాషేత?
కిమాసీత వ్రజేతకిమ్? శ్లో - 54

*కృష్ణా !*
*సమాధియందున్న జీవన్ముక్తుడగు*
*స్థిత ప్రజ్ఞుని లక్షణమేమి?*
*అతడెట్లు మాట్లాడును? ఎట్లు*
*కూర్చుండును? ఎట్టు సంచరించును?*

సమాధినిష్ఠయందుండు ఆత్మజ్ఞానియగు స్థిత ప్రజ్ఞుని లక్షణములు ఎలాంటివో అర్జునుడు తెలుసుకోగోరెను. కొందరు వేషధారులు డాంబికంగా పైకి తాము సమాధి నిష్ఠయందున్నట్లు నటించు చుందురు. నిజమైన సమాధినిష్ఠులెవ్వరో లోకము తెలుసుకొనుట ఎంతో అవసరం. అదృష్టవశాత్తు కొన్ని వేల సంవత్సరాల క్రితం అర్జునుడు శ్రీకృష్ణభగవానున్ని ఈ విషయమై తెలుపమని ప్రార్థించెను.

నిజమైన సమాధినిష్ఠలో వున్నవారిని గుర్తించుటకు అతని "వాక్కు" (మాట) అతని నివాసము, అతని నడక ఎలాంటివో తెలుసుకోవడం అవసరం. ఈ మూడింటిలో అతని

యోగనిష్ఠ ప్రతిబింబిస్తుంటుంది. వివేకహీనుని యొక్క ప్రతి కార్యము నందు తమోగుణము, రజోగుణము, అపవిత్రత గోచరిస్తుంటుంది. బ్రహ్మజ్ఞాని యొక్క నిత్యవ్యవహారములలో దైవత్వము, శాంతి, పవిత్రత ఉట్టిపడుతుంటాయి. అందువలన స్థితప్రజ్ఞుని యొక్క లక్షణములు, స్వరూప స్వభావములు, దైనందిన జీవిత రహస్యములు తెలుసుకొనినచో అవి చూచి తక్కినవారు కూడా ఆ మార్గమున నడిచి తరించుదురన్న ఉద్దేశముతో అర్జునుడు ఈ ప్రశ్న వేసివుండవచ్చునని శ్రీవిద్యా ప్రకాశానందగిరిస్వాములవారు అభిప్రాయపడ్డారు. గీతామకరందము 287 పేజి.

ఈ స్థిత ప్రజ్ఞుని లక్షణాలను గూర్చి జాతీయోద్యమకాలంలో జాతి పిత మహాత్మాగాంధీగారు తమ అనుచరులతో ప్రార్థనాసమావేశాలలో పారాయణము చేసేవారు. ఇప్పటికినీ గాంధీజీ పేరిట దేశంలో వున్న ప్రతి ఆశ్రమంలో సాయం ప్రార్థనా సమావేశాలలో పారాయణము చేస్తున్నారు.

అంతేకాదు జాతిపిత మహాత్మా గాంధీ అంతేవాసి మహర్షి వినోబా కూడ తమ భూదానపద యాత్రలలో తప్పక స్థిత ప్రజ్ఞలక్షణాలను గూర్చి సాయం సమావేశాలలో పారాయాణ చేసే వారు. వినోబాజీతో భూదాన పదయాత్రలో మేము స్వచ్ఛంద సేవకులుగా పనిచేసిన రోజులలో ఈ అధ్యాయాన్ని తప్పక పారాయణము చేసేవారం. ఈనాటికి కూడా సర్వోదయ, గాంధేయ కార్యక్రమ, సభలు- సమావేశాలు జరిగినప్పుడు కార్యకర్తలు తప్పక స్థిత ప్రజ్ఞ లక్షణాలను గూర్చి పారాయణం చేస్తారు.

అర్జునుని ప్రశ్నకు సమాధానంగా 18శ్లోకములలో శ్రీకృష్ణభగవానుడు స్థితప్రజ్ఞుని యొక్క లక్షణములను గూర్చి వివరిస్తున్నాడు,

ఈ స్థిత ప్రజ్ఞుని లక్షణాలకు సంబంధించిన శ్లోకములు, తెలుగు తాత్పర్యముతో గాంధీగారి ఆంగ్లానువాదాన్ని కూడా ఇక్కడ పొందు పరుస్తున్నాము.

"ప్రజహాతి యదాకామాన్
సర్వాన్ పార్థ! మనోగతాన్
ఆత్మన్యేవాత్మనాతుష్టః
స్థితప్రజ్ఞ స్తదోచ్యతే" శ్లో - 55

అర్జునా !
ఎప్పుడు మానవుడు తన మనస్సులో
చెలరేగెడు కోరికలన్నింటిని
త్యజించి ఆత్మయందే ఆత్మచేత
నిరంతరము సంతుష్టిని పొందునో
అప్పుడు అతనిని స్థిత ప్రజ్ఞుడని చెప్పవచ్చును

**The Lord Said**

When a man puts way, partha, all the cravings that arise in the mind and find comfort for himself only from "Atman", then is he called the man of secure understanding.

మానవుని మనస్సు ఆత్మచే ప్రేరితమై నేత్రాది ఇంద్రియముల మూలమున బయటికి ప్రవహించి వస్తువులందు జేరి, ఆ వస్తువుల ఆకృతులను ధరించుచుండును. అప్పుడే ఆ వస్తువుల జ్ఞానము మానవునకు కలుగును. నదులలోని నీరు పంటకాలువల ద్వారా క్షేత్రములందు (పొలములందు) జేరి కేదారముల (పంటపొలాల) యాకృతిని ధరించునట్లు మనస్సు.ఇంద్రియ ప్రణాళికల మూలమున వస్తువులంజేరి వాటి యాకృతి పొందును. ఈ మానసిక ఆకృతులనే చిత్తవృత్తులంటున్నాము. ఇది యోగుల పరిభాష, మానవుడు ఇలా శ్రద్ధావస్థలో వున్నంతకాలము చిత్తవృత్తులు నిరంతరము ఏర్పడుచుండును. స్వప్నావస్థయందును ఇట్టి వృత్తులు కలుగుచునేయుండును. కాని అవి బాహ్యములుకావు. ఈ వృత్తులే మానవులకు జ్ఞానములకు ఆధారము. వీటినే జ్ఞానాకారకులనినను దోషము లేదు.

అట్టి వృత్తులు కలుగకుండునట్లు చేయుటయే యోగము. దీనినే సమాధి అని కూడా అందురు. అందువలననే పతంజలి మహర్షి తన యోగదర్శనమునందు (సూ :- యోగశ్చిత్త వృత్తి నిరోధః) అన్నాడు. అంటే "యోగము చిత్తవృత్తుల నిరోధము" అని సూత్రీకరించియున్నాడు. చిత్తవృత్తులు ఏర్పడుచున్నంతకాలము జీవుడు బాహ్య ప్రపంచమును ఎరుగుచుండును. ప్రాకృతిక పదార్థముల నెరుగుచు అవి తనకనుకూలములై సుఖకరములై, వానిని సంపాదించుకోలేక తనకనుకూలములు కాక దుఃఖకరములు అని తోచినపుడు దాని నుండి దూరమగుటకు ప్రయత్నించుచుండును. ఆ సమయమున అతడు - (జీవుడు) ప్రపంచమున వుండును, చిత్తవృత్తులను నిరోధించి మనస్సును బాహ్య వస్తువులజేరనీయక దానిని అరికట్టిననాడు జీవుడు (ఆత్మ) తనలో తానే వుండును. ఇదియే కైవల్యస్థితి .ఈ అభిప్రాయమునే శ్రీకృష్ణుడు అర్జునునకు పై శ్లోకము మూలమున తనలో తాను తుష్టుడగునని (ఆత్మన్యేవాత్మనా తుష్టః) తెలిపినాడు. స్థితప్రజ్ఞుడు చిత్తమునరికట్టి బాహ్య పదార్థముల వంక బోక తనలోనే తాను స్థిరుడై ఆత్మానుభూతిని పొందును. ఈ స్థితినే యోగదర్శన కర్త పతంజలి మహర్షి (సూ- తథాద్రష్టుఃస్వరూపేవస్థానం) చిత్తవృత్తులు నిరోధించినపుడు జీవుడు (ద్రష్టుః స్వరూపే) ద్రష్టమైన తన స్వరూపమునందో లేక లోక ద్రష్టమయిన పరమేశ్వరుని స్వరూపమునందో వుండునని సూత్రీకరించినాడు.

దుఃఖేష్వనుద్విగ్నమనాః
సుఖేషు విగత స్పృహః
వీతరాగ భయక్రోధః
స్థితధీర్మని రుచ్యతే"          శ్లో - 56

దుఃఖములందు కలత చెందని వాడును, సుఖములపట్ల ఆసక్తినొందనివాడును అనురాగము, భయము, క్రోధము తొలగిన వాడును అగు మననశీలుడు (ముని) స్థితప్రజ్ఞుడని చెప్పబడుచున్నాడు

"Whose mind is untroubled in sorrows and longeth not for Joys, who is free from passion, fear and wrath- he is called the ascetic of secure understanding"

యః సర్వత్రా నభిస్నేహ
స్తత్తత్ప్రాప్య శుభాశుభం
నాభినందతి నద్వేష్టి
తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా "          శ్లో - 57

ఎవరు సమస్త విషయములందును అభిమానములేనివారై ఆయా విషయ సంబంధములైన శుభా శుభములు కలిగినపుడుసుఖ దుఃఖముల నొందక యుందునో అట్టివాని బుద్ధి స్థిరమైనది



Who owns attachment
no where, who feals
neither joy nor resentment
wheather good or bad comes
his way, that man's understanding
is secure

"యథా సంహరతే చాయం
కూర్మోన్ గానీవ సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః
తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా" శ్లో - 58

*తాబేలు తన అవయవములను*
*విపత్సమయాన్ని గుర్తించినపుడు*
*ఏవిధంగా లోనికి ముడుచుకొనునో*
*మనుష్యుడు కూడా తన ఇంద్రియములను*
*ఆ విధంగానే విషయములనుండి మరల్చి*
*అంతర్ముఖుడైనచో అట్టివాని*
*జ్ఞానము స్థిరమైనట్టి దగును.*

"And when, like the tortoise
drawing inits limbs from every
side, this man draws his
senses from their objects,
his understanding is secure"

మానవుని నేత్రాది ఇంద్రియములు తమచే గ్రహింపబడు (తెలియబడు) రూపాది విషయములచే ఆకర్షింపడును. రూపరసాదులు గల వస్తువులు విషయములు అనబడును అవియే ఇంద్రియార్థములు. ఇంద్రియములు, విషయములు రెండును ప్రాకృతిక పదార్థములే. అందువలన ఇంద్రియములు విషయములచే ఆకర్షింపబడుట సహజము. కావున స్థితప్రజ్ఞుడు ఇంద్రియములను విషయముల వెంట పరువిడనీయక వాటిని స్వాధీనము చేసుకొని తనకు హాని కలుగకుండునట్లు వాటిననుభవించునని ఈ శ్లోకము యొక్క ప్రధాన భావము.

[illegible]
[illegible]
[illegible]
[illegible]" శ్లో - 59

శబ్దాది విషయములను
స్వీకరింపనట్టి జీవునకు
ఆ విషయములు దూరమగు
చున్నవేకాని వానియందలి
రాగము(వాసన)పోవుట
లేదు, పరమాత్మను దర్శించగనే
విషయములతో పాటురాగము
కూడా దూరమగుచున్నది

"When a man starves
his senses, the objects
of those senses disapper
from him. But not
the yearning for them;
the yearning too departs
when he beholds the supreme"

Explaing the verse Gandhiji wrote in Young India 22-12-1927
"Fasting and similar discipline is one of the means to the end of self-restraint. But it is not all, and it physical fasting is not accompanied by mental fasting, it is found to end in hypocrisy and consequent disaster".

"యతతోహ్యాపి కౌంతేయ!
పురుషస్య విపశ్చితః
ఇంద్రియాని ప్రమాథీని
హరన్తి ప్రసభంమనః" శ్లో - 60

అర్జునా!
ఇంద్రియములు మహాశక్తివంతము
లైనవి.వివేకి అయిన మానవుడు
ప్రయత్నిస్తున్నను అవి బలాత్కారముగ
అతని మనస్సును విషయముల వైపు
లాగుచునేయుండును

For, inspite of the wiseman's
endeavour, "O" Kauntyeya
the unruly senses distract
his mind perforce

"తాని సర్వాణి సంయమ్య
యుక్త ఆసీత మత్పరః
వశేహియస్యేంద్రియాణి
తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా" శ్లో - 61

బలవత్తరములైన అట్టి
ఇంద్రియములనన్నింటిని
చక్కగా వశపరుచుకొని
మనఃస్థిరత్వము కలిగిన
వాడై ఆత్మయందు అసక్త
మైన మనస్సును నిలిపిన
వాడై ఇంద్రియములను
స్వాధీన మందుంచుకున్నవాడు
స్థిరబుద్ధి కలిగినవాడు. అట్టి
వాని జ్ఞానము సుస్థిరమై వెలయును

Holding all these in cheek
the yogi should sit
intent on me; for he
whose senses are under
control is secure of
understanding

This means that without devotion and the consequent grace of God, man's endeavour is vain.

ధ్యాయతో విషయా న్పుంసః
సంగస్తేషూప జాయతే
సంగాత్సంజాయతేకామః
కామాత్క్రోధోభి జాయతే" శ్లో - 62

మానవుడు ఇంద్రియ విషయములను
గూర్చి చింతించుట చేత వాటియందు
అతనికి సంగత్వము కలుగుచున్నది
సంగత్వము వలన కోరికలు జనించు
చున్నవి, కోరికల వలన క్రోధము
ఉద్భవించుచున్నది

In a man brooding on
objects of the senses,
attachment to them springs
up attachment begets
craving and craving
begets, wrath

" క్రోధాద్భవతి సమ్మోహః
సమ్మోహాత్ స్మృతివిభ్రమః
స్మృతి భ్రంశాత్ బుద్ధినాశో
బుద్ధి నాశాత్ప్రణ శ్యతి" శ్లో - 63

క్రోధమువలన మోహము
జనించుచున్నది. మోహము
వలన విస్మృతి కలుగుచున్నది
విస్మృతి వలన బుద్ధినశించుచున్నది
బుద్ధినశించడము వలన
మనుజుడు తానే నశించుచున్నాడు

"Wrath breeds stupefaction
stupefaction leads to loss
of memorary, loss of memory
ruins the reason, and the ruin
of reason spells utter destraction"

"రాగద్వేష వియుక్తైస్తు
విషయా నింద్రియైశ్చరన్
ఆత్మవశ్యైర్వి ధేయాత్మా
ప్రసాదమధిగచ్ఛతి" శ్లో - 64

రాగద్వేష రహితుడై, తనకు
స్వాధీనమైన ఇంద్రియముల
చేత ప్రవర్తించుచున్నను
యోగయుక్తుడైనవాడు
ప్రశాంతతను పొందుచున్నాడు

"But the disciplined soul,
who moving among
sense-objects with the
senses weaned from likes
and dislikes and brought
under the control of "Atman"
attains peace in mind"

"ప్రసాదే సర్వ దుఃఖానాం
హాని రస్యోప జాయతే
ప్రసన్నచేతసోహ్యాశు
బుద్ధిః పర్యవతిష్ఠతే" శ్లో- 65

ప్రసాదమనస్తత్వముగల
మనుజునకు సర్వదుఃఖములును
నశించుచున్నవి, ప్రసన్నమనస్తత్వం
గలవారికి త్వరితముగ బుద్ధిస్థిరపడును

"Peace of mind means
the end of all ills, for the
understanding of him
whose mind is at
peace stands secure"

"నాస్తి బుద్ధిరయుక్తస్య
నచాయుక్తస్యభావనా
నచాభావ యతః శాంతి
రశాంతస్య కుతఃసుఖమ్" శ్లో- 66

యోగయుక్తుడుకాని వానికి
నిశ్చయ బుద్ధి వుండదు, అతనికి
ఆత్మభావనము కలుగదు
ఆత్మభావన లేని వానికి శాంతి
లభించదు, శాంతిలేనివానికి
సుఖము లేదు

The undisciplined man
has neither understanding
nor devotion;for him
who has no devotion there
is no peace, and for him
who has no peace, whens
happiness?

చిత్తమునందు రాగద్వేషాది మాలిన్యములున్నంత వరకు స్థిర బుద్ధి ఏర్పడదు. అందుకు చిత్త ప్రసాదకులు అవసరము. చిత్తమునందలి మాలిన్యములను తొలగించి అందు ప్రసాద గుణమును చేకూర్చుటకు మహర్షి పతంజలి తమ యోగదర్శనము నందు భావన సాధనముగ ఇట్లు నిర్దేశించాడు.

సూ :- "మైత్రీకరుణా మరిలోపేక్షాణాం
సుఖదుఃఖపుణ్యా పుణ్య విషయాణాం
భావనాతశ్చిత్త ప్రసాదనమ్" యో. సా. 33

చిత్తమునందు ఈర్ష్య, పరోపకారబుద్ధి, అసూయ, అసహనము (అమర్షము) అను నాలుగు విధములైన మాలిన్యములుండును. ఈ మాలిన్యములను తొలగించిన పక్షమున చిత్తమున ప్రసాదగుణము కలుగును.

సంపన్నులై సుఖముగా కాలము గడుపువారిని చూచి వారియెడ మిత్రభావముతో వున్న యెడల ఈర్ష్య యనెడి మాలిన్యము తొలగును. సుఖముగా నుండు మిత్రుని జూచి ఈర్ష్య పడని వారు తమ మిత్రుని సుఖము తమ సుఖమని భావించి చిత్త ప్రసాదమును పొందెదరు.

అట్లే దుఃఖములననుభవించు వారిని జూచి అయ్యో! వీరు బాధలు పడుతున్నారే, వీరి ఈబాధలు ఎట్లు తొలగును అన్న కరుణ గలవారై వారికి తోడుపడువారి చిత్తమునందు పరోపకారబుద్ధి అంటే పరులకు అపకారము చేయవలెననెడి మాలిన్యము కలుగదు. అంటే మాలిన్యం ఏదైనా వుంటే అది తొలిగిపోతుందన్నది ఇక్కడి భావన.

మరియు పుణ్యమొనర్చి సుఖముగా కాలమును ఉపనయించు వారింజూచి ముదము అంటే సంతోషము చెందువారి మనస్సున వుండు అసూయ యనెడికాలుష్యము తొలగిపోవును.ఇక పాపులను జూచినపుడు అమర్షము అంటే అసహనము కలుగుట లోకసామాన్యము. అసహనము అనునది చిత్తమాలిన్యము కావున పాపులను జూచి వారి యెడల జాలి కలిగిన పక్షమునందు అసహనము కలుగదు. ఇట్లు మైత్రీ, కరుణ, ముదిత ఉపేక్షయను నాలుగు విధములైన భావనల వలన చిత్తమునందు ఈర్ష్య, పరోపకారబుద్ధి, అసూయ, అసహనము అనెడి మాలిన్యములు క్రమముగా తొలగి చిత్తము ప్రసన్నమగును. ప్రసన్నచిత్తునకు నిశ్చిత బుద్ధికలుగును, అట్టి వారు ఆత్మసాక్షాత్కారమును పొంది సుఖింతురని పతంజలి మహర్షి వర్ణించియున్నాడు.

"ఇంద్రియాణాం హిచరతాం
యన్మనోను విధీయతే
తదస్యహరతి ప్రజ్ఞాం
వాయుర్నావ మివామ్భసి" శ్లో - 67

నీటియందలి నావను
గాలి పెడదారిపట్టించు
నటుల విషయాసక్తము
లైన ఇంద్రియముల
ననుసరించెడి మనస్సు
మనుష్యుని వివేకమును
హరించివేయుచున్నది

"For when his mind
runs after any of the
roaming senses, it
sweeps away his understanding
as the wind a vesel upon the waters"

"తస్మాదస్య మహాబాహో!
నిగృహీతాని సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్య
స్తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా" శ్లో - 68

కనుక ఓ అర్జునా!
ఎవడు తన ఇంద్రియములను
ఇంద్రియ విషయములనుండి
మరలించునో అట్టి వాని బుద్ధి
స్థిరమై యుండును

Therefore, "O" Mahabahu,
he whose senses are revived
in on all sides from their
objects, is the man of secure
understanding

"యా నిశాసర్వభూతానాం
తస్యాం జాగర్తి సంయమి
యస్యామ్ జాగ్రతి భూతాని
సానిశా పశ్యతో మునేః శ్లో - 69

సర్వభూతములకు ఏది రాత్రియో
దానియందు సంయమిమేలుకొని
యుండును, దేనియందు సర్వ
భూతములు మేలుకొనియున్నవో
అదిసంయమికి రాత్రిగా వుండును.

"When it is night for all
other beings, the disciplined
soul is awake, when all
other beings are awake,
it is night for the seeing ascetic"

"అపూర్య మాణమచల ప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తియద్వత్
తద్వత్కామాయం ప్రవిశన్తి సర్వే
సశాన్తి మాప్నోతి న కామకామీ"శ్లో-70

నీటిచే పూర్తిగా నిండింపబడి
నిశ్చలమై యున్నట్టి సాగరము
నందు నదీ ప్రవాహములు
ఏవిధముగా ప్రవేశించుచున్నవో
అదే విధముగ విషయములన్నియు
యోగయుక్తుని పొంది తద్రూపములు
చెందుచున్నవో అట్టి యోగి శాంతిని
పొందుచున్నాడు. విషయలోలుడు శాంతిని
పొందలేడు

He in whom all longings
subside, even as the waters
subside, inthe ocean which,
though every being filled
by them, never over flows
that man finds peace, not
he who cherishes longings

"విహాయకామాన్ యస్సర్వాన్
పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకారః
సశాన్తి మధిగచ్ఛతి" శ్లో - 71

సమస్త మైన కోరికలను త్యజించి
వాటియందు స్పృహ లేనివాడై
మమకారం, అహంకారములను
వీడి చరించు మనుషుడు శాంతిని పొందును

"The man who sheds
all longing and moves
with out concern,
free from the sense of"I"
and "Mine"-he attain
peace"-

"ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ!
నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాస్యా మన్తకాలేపి
బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి" శ్లో - 72

అర్జునా!
ఇదియే బ్రాహ్మీస్థితి
దానిని పొందినవాడు
మోహమును పొందడు
అంత్యకాలమందు కూడా
ఈ యోగమునందు నిలిచి
బ్రహ్మ ప్రాప్తిని పొందుచున్నాడు

"This is the state,
"O" partha, of the man
who rests in "Brahman"
having attained to it,
He is not deluded
He who abides in this
state even at the hour
of death pases in to
oneness with"Brahaman"



ఇక ఈ విషయమై మహర్షి వినోబా ఏమంటున్నారో పరిశీలిద్దాం.

"అర్జునునకు శాస్త్రము చెప్పబడింది. కళకూడా చెప్పబడింది. కాని ఇంతమాత్రమున తత్వమంతయు చిత్రపటమువలె స్పష్టముగా కనబడలేదు. శాస్త్రము నిర్గుణము కళ సగుణము సగుణము కూడా సాకారమైనప్పుడు కాని వ్యక్తముకాదు. నిర్గుణము రూపరహితముగ కేవలము గాలిలో వున్నట్లే,, సగుణము కూడా నిరాకారముగ వున్నంతవరకు ఆస్థితిలోనే వుండును. మూర్తీభూత సద్గుణుడైన మహాత్ముని దర్శించుటయే దీనికి సరియగు ఉపాయము అందులకనియె అర్జునుడు ఈ విధముగా అడుగుచున్నాడు.

" ఓ దేవా! జీవిత ముఖ్య సిద్ధాంతములను వానిని సాధించు కళలను గూర్చి ఇంతవరకు చెప్పియుంటివి. అయినను దాని రూపము స్పష్టముగ కన్నులకు కనుపించలేదు. కనుక ఇప్పుడు ఉదాహరణ పూర్వకముగ దాని రూపమును నాకు చిత్రించి చూపుము. బుద్ధియందు సాంఖ్యనిష్ఠ సుస్థిరమై యున్నట్టి ఫలత్యాగ రూపమైన యోగము రోమ రోమము నందును వ్యాప్తమై యున్నట్టి, పురుష లక్షణము లెట్టివో చెప్పము. ఫలత్యాగము యొక్క లోతుపాతులను చూపదగిన వారు కర్మ సమాధిలో నిమగ్నులైన వారు ఆత్మనిశ్చయములో మహామేధావులు, స్థిత ప్రజ్ఞులు అనబడువారు ఎట్లు మాట్లాడెదరో, సంచరింతురో ఇదంతయు నాకు తెలియ చెప్పము! అని అర్థించాడు.

ఇందులకనియే భగవానుడు రెండవ అధ్యాయము చివరి పదునెనిమిది శ్లోకములలోను స్థితప్రజ్ఞుని యొక్క, గంభీరమైన, ఉదాత్తమైన చరిత్రమును సృష్టించినాడు. ఇందులో గీత యొక్క అష్టాదశ అధ్యాయముల సారమంతటిని ఇమిడ్చి పెట్టినట్లున్నది. స్థిత ప్రజ్ఞుడు గీతలోని ఆదర్శమూర్తి. ఈ శబ్దము కూడా గీతయొక్క స్వతంత్ర కల్పన, ఈ విధముగనే ఐదవ అధ్యాయములో జీవన్ముక్తుని యొక్కయు, పండ్రెండవ దానిలో గుణాతీతుని యొక్కయు, పదునెనిమిదవదానిలో జ్ఞాననిష్ఠుని యొక్కయు వర్ణన చేయబడింది. కాని స్థిత ప్రజ్ఞుని వర్ణన వీటిన్నింటికంటే ఎక్కువగా చేయబడింది. ఇందు సిద్ధుని లక్షణములతోపాటు సాధకుని లక్షణములు కూడా చెప్పబడినవి.

వేలకొలది స్త్రీ - పురుష సత్యాగ్రహులు సాయంకాల ప్రార్థనలో ఈ లక్షణములను పఠించుచున్నారు. ఈ శ్లోకములను ప్రతిగ్రామ గ్రామములోని, ప్రతి ఇంటకి అందించడం ఎంత ఆనందదాయకము, అవి మొదట మనహృదయములలో నెలకొన్నచో తదుపరితమంతట తాము బయటివారి హృదయాలలో అవి ప్రవేశింపగలవు. నిత్యము పఠించునది వట్టి చిలుక పలుకులైనచో అది హృదయములో అంకితమగుటకు బదులు వున్న భక్తి భావమును కూడా తుడిచివేయును, ఇది నిత్య పఠనము వలన వచ్చు

దోషము కాదు, మననము చేయకుండుట వలన వచ్చు కీడు. నిత్య పఠనముతో పాటు నిత్యమననము కూడా అవసరము. నిరంతరాత్మ పరీక్షయు అవసరము.

స్థితప్రజ్ఞుడనగా స్థిరబుద్ధి కలవాడు, అసలా పేరులోనే ఆ అర్థముంది. కాని సంయమము లేకుండా బుద్ధి యెట్లు స్థిరపడును? కనుకనే స్థిత ప్రజ్ఞుని సంయమమూర్తి అన్నది గీత, బుద్ధి ఆత్మ నిష్ఠ కలదయి వుండవలె, అంతరేంద్రియములు బుద్ధికి అధీనములు కావలెను. సంయమనమంటే ఇదే. స్థిత ప్రజ్ఞుడు సమస్తేంద్రియములకును కళ్లెము వేసి కర్మయోగమను క్షేత్రమును దున్నును, ఇంద్రియములనెడి ఎద్దులతో అతడు నిష్కామ స్వధర్మాచరణమను సేద్యమును కట్టుదిట్టముగ చేయును. తన ఉచ్ఛ్వాస; నిశ్వాసములన్నియు పరమార్థమునకే వినియోగించుచుండును.

ఇంద్రియ సంయమనము సులవైనది కాదు. ఇంద్రియములను అసలే ఉపయోగింపకుండుట ఒక విధముగ సులువుకావచ్చును. మౌనము, నిరాహారము అంత కఠినమైనవి కావు. అట్లే ఇంద్రియములను యధేచ్ఛముగ వదలి వేయుట కూడా అందరికి సులువే. కాని తాబేలు ప్రమాదస్థితిలో తన అవయవముల నన్నింటిని ముడుచుకొని దాచుకొనును. నిర్భయ స్థలములలో తిరిగి వాటిని వినియోగించుకొనును. అదే విధంగా ఇంద్రియములను విషయ భోగముల పైకి వెళ్లనీయకుండా ముడుచుట, వానిని పారమార్థిక కార్యములలో ఉచిత రీతిని వినియోగించుట లెస్స. ఈసంయమము కఠినమైనది. దీనికి అత్యంతమైన ప్రయత్నం అవసరం. జ్ఞానము కూడా అవసరం. కాని ఇవన్నియు వున్నను అది ఎల్లప్పుడును సాధ్యంకాదు. అట్లని మనం నిరాశ చెందరాదు. సాధకుడు ఎన్నడును నిరాశచెందకూడదు. సాధకుడు సమస్తోపాయముల ద్వారా ప్రయత్నించియు సంయమస్థితిని చేరలేక పోయినచో, అపుడు అతడు భక్తి యొక్క ఆశ్రయమును పొందవలెను. అమూల్యమైన ఈ సూచనను భగవంతుడు స్థిత ప్రజ్ఞుని లక్షణములలో ఇచ్చి యున్నాడు, దానిని తూచినట్లు క్లుప్తముగ చెప్పినాడు. బండెడు వ్యాఖ్యానముల కంటె దాని విలువ హెచ్చు. ఎందుల కనగా భక్తికి సరిగా అవసరమున్న చోటనే దానికి స్థానమీయబడింది. స్థితప్రజ్ఞుని లక్షణములను సవిస్తరముగ ఇక్కడే మనం వర్ణింప పనిలేదు. కాని మనము ఈ సాధనలన్నిటిలోను భక్తి యొక్క నిశ్చిత స్థానమును మరువకుండుటకు దానిని జప్తికి తేవలసి వచ్చినది. ఈ జగత్తులో స్థితప్రజ్ఞుడు ఎవడయినాడు అనువిషయము భగవంతునకే యెరుక కాని సేవా

పరాయణుడైన స్థిత ప్రజ్ఞునికి ఉదాహరణగా పుండలీకుని మూర్తి యెల్లపుడును నా యెదుట కనబడుచునే యుండును. దానిని నేను మీ ఎదుట పెట్టనే పెట్టితిని.

సరే ఇప్పడు స్థిత ప్రజ్ఞుని లక్షణములను దానితో రెండవ అధ్యాయము కూడా సమాప్తము చెందినది.

(నిర్గుణ)సాంఖ్య బుద్ధి (సగుణ) యోగబుద్ధి (సాకార) స్థితప్రజ్ఞ కలసి సంపూర్ణ జీవిత శాస్త్రము దానిలో నుండి బ్రహ్మనిర్వాణము లేక మోక్షము కాక మరేమి ఫలము రాగలదు.

28-2-1932 ధూలియా జైలులో రాజకీయ ఖైదీల నుద్దేశించి చేసిన ప్రసంగం నుండి గీతాప్రవచనములు పేజి 31,32,33,34,

మరొక జాతీయోద్యమ నాయకుడు మహర్షి అరవిందయోగి దృష్టిలో "స్థిత ప్రజ్ఞుడు" అంటే ఏమిటో ఇపుడు చూద్దాం.

"ఇంతవరకు మనం వేదాంత సిద్ధాంత బీడుభూముల్లో చిక్కుదారుల్లో సంచరించవలసి వచ్చింది. పూర్తిగా కాకపోయినా, సంగ్రహంగా, అంతలోతుకు పోకుండా సాంఖ్యయోగ వేదాంతాల ప్రధాన సిద్ధాంతాలను ప్రస్తావించక తప్పలేదు. గీత అవలంబించిన ఒక విచిత్రమైన పద్ధతి అవగాహన కావాలంటే ఈ పరామర్శ అనివార్యం అవుతుంది. ఈపద్ధతి ఏమంటే ముందుగా ఒక పాక్షిక సత్యాన్ని బహిర్గతము చేస్తుంది. దాని లోతైన అర్థము తేటతెల్లంగా అగుపించదు. కనపడి కనపడనట్లుగా వుండే సూచనలు మాత్రమే వుంటాయి. కొంతదూరము పోయిన తరువాత మళ్లీ ఆ సూచనల దగ్గరకు తిరిగి వస్తుంది. అప్పడు వాటి ప్రాముఖ్యతను వెల్లడిస్తుంది. చిట్టచివరగా ఒక గొప్ప సూచన దగ్గరకు ఉద్గమిస్తుంది. అదే పరమ రహస్యము. దానిని బహిరంగ పరచకుండా దానిలో జీవించమని మనకే వదలివేస్తుంది. భారతీయ ఆధ్యాత్మిక దశలలో ఈ పరమ రహస్యంలో జీవించడానికి ప్రయత్నం జరిగింది. తత్ఫలితంగా వచ్చిన వే ప్రేమ, ఆత్మసమర్పణ, భక్తి పారవశ్య మహాతరంగాలు, గీతాదృష్టి ఎంతసేపు సంయోజనం మీదనే. దానిలో కనుపించే విభిన్న ధోరణులన్నీ కట్టకడపటతాను అందించబోయే ఉన్నతవాక్యాన్ని స్వీకరించగలందులకు గాను మనస్సును

క్రమంగా సిద్ధము చేయడానికి ఉద్దేశించినవే. గీత అనుసరిస్తున్న ఈ విలక్షణ పద్ధతిని జాగ్రత్తగా గ్రహించవలసి వుంది. ఏ సిద్ధాంతాన్ని వివరించినా, ఏ తాత్విక చర్చను కొనసాగించినా దాని లక్షణం ఆ మహాచరమ వాక్యానికి మనస్సును చేర్చడానికే, ఆ దృష్టితోనే భగవానుడు వివరించే సాంఖ్యయోగ వేదాంత సూత్రాలను పరిశీలించాలి. గీతాచరమ వాక్యము వీటన్నింటి సంయోజనం మీదనే ఆధారపడి వుంది.

దానిని గూర్చి తెలుసుకోడానికే సగటు మనిషి యొక్క మానసిక తత్వాన్ని ప్రతిబింబిస్తూ అర్జునుడు "మహాసమాధిస్థితి" ని ఆచరణాత్మకంగా వివేచించి గుర్తించడానికి వీలయ్యే చిహ్నాలను గురించి సమాధి స్థితుడైన స్థిత ప్రజ్ఞుడు ఎలా సంభాషిస్తాడు! ఏ విధంగా కూర్చుంటాడు! ఏవిధంగా నడుస్తాడు! అని ప్రశ్నించాడు. ఇందులో "కాభాషా" అంటే లక్షణము ఏమిటి? అని అర్థము చెప్పకోవాలి. ఎందుకంటే శ్లోకం రెండవ పాదంలో "కింప్రభాషేత" ఎలా మాట్లాడుతాడు అని వచ్చింది. కనుక "కాభాషా" కు కూడా అదే అర్థము చెబితే పునరుక్తి దోషము అవుతుంది. సమాధిస్థితుడైన స్థిత ప్రజ్ఞుని లక్షణాల గురించి తెలుసుకోవాలని అర్జునుని కోరిక, శ్రీకృష్ణుడు ఈ ప్రశ్నలకు సమాధానము చెప్పలేదు. సమాధినిష్ఠుని లక్షణాలు బాహ్యము లోకనుపించవు, అందుచేతనే ఆచార్యుడు వాటిని గురించి ప్రస్తావించను కూడా లేదు. సమాధి కేవలము అంతర్గత స్థితి. దానికివిరోధమైన మనస్తత్వ శక్తులు మాత్రము ఎన్నో వున్నాయి. అవి లేకపోతే సమాధి వున్నదని భావించవచ్చు. ముక్త జీవిని గుర్తించడానికి వీలయ్యే మహాముద్ర ఒకటి వున్నది. అదే సమత్వము, కాని ఎంతో బాగా దానిని తెలియజేసే గుర్తులన్నీ కూడా అంతర్గతమైనవే.

అతడుఆత్మలో ఆత్మ చేతనే సంతుష్టి పొంది, మనోగతాలైన సర్వ కామాలను విడిచి పెట్టినపుడు స్థిత ప్రజ్ఞుడు అవుతున్నాడు.

దుఃఖములు కలిగినపుడు కలవలరపడక, సుఖముల పట్ల ఆశలేక, రాగము, భయము, క్రోధము లేని స్థితప్రజ్ఞుని "ముని"అని వ్యవహరిస్తున్నారు.

ఇంతకు ముందు గీత వర్ణించినట్లు అతడు త్రిగుణాలకు అతీతుడు, ద్వంద్వరహితుడు, నిత్యము తన నిజమైన అస్తిత్వములోనే నిలిచిన వారు పొందవలసినది, ఉంచుకొనవలసినది లేకుండగ వున్న ఆత్మవంతుడు అతడు.

ముక్త అంతరాత్మకు యోగక్షేమాలతో అవసరంవుండదు. ఒకసారి ఆత్మ వంతులమైతే మనకు సమస్తమూ వున్నవే అవుతాయి. కనుక ఇంకా పొందవలసినది (యోగము) కాని ఇపుడు కాపాడు కొనవలసింది (క్షేమము) కాని ఏమియు వుండదు.

అయితే స్థిత ప్రజ్ఞుడయిన ముని కర్మలను ఆచరిస్తాడా? అనే ప్రశ్న ఉదయిస్తుంది. దానికి జవాబుగా ఆ ! ఆచరిస్తాడనే గీత పేర్కొంటుంది. అతడు (పనిని) కర్మను వదలిపెట్టడు. గీతయొక్క ప్రత్యేకత ఇక్కడనే యున్నది. స్థిత ప్రజ్ఞుని నిశ్చలసమాధి స్థితిని ధృవపరిచింది; సాధారణంగా కర్మకు కారణమైన వాటన్నింటిని తొలగించి విముక్తి అంతరాత్మకు శూన్యత్వాన్ని స్థిరపరిచింది. అయినా కూడా కర్మాచరణ ముక్తాత్మకు అత్యావశ్యకమని సమర్థించి కర్మాచరణము కొనసాగించ వలసిందేనని విధించింది. ఇందు మూలముగా కేవలశాంతిని సన్యాసాన్ని బోధించే తత్వ శాస్త్రాలు చేసిన పొరపాటును గీత తొలగించింది, ఈ సన్యాస తాత్విక ధోరణులు ఈ నాడు శాంతివాదమునుంచి, సన్యాసవాదం నుంచి తప్పించు కోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నవి.

జగత్ప్రసిద్ధమైన ఈ క్రింది శ్లోకము ముక్తిని పైన పేర్కొన్న కర్మాచరణను వివరిస్తున్నది.

"కర్మణ్యావాధి కారస్తే- మాఫలేషుకదాచన
మా కర్మ ఫల హేతుర్భూర్మాతే సంగోస్త్వకర్మణి" 2-47

ఆధునికులు వ్యాఖ్యానిస్తున్నట్లు ఇది విద్యుక్త ధర్మాన్ని నిర్వహించడం లేదని "గీతోపదేశ హృదయం" లో పేర్కొనడం జరిగింది. ఈ శ్లోకంలోని

నాలుగు పాదాలు కర్మయోగానికి చెందిన నాలుగు సూత్రాలను వివరిస్తున్నందుచేత ఈ శ్లోకాన్ని "కర్మయోగి యొక్క చతుస్సూత్రిగా" చెప్పవచ్చునని జాతీయోద్యమంలో అగ్రనాయకులు, స్వాతంత్ర్యంనా జన్మహక్కు, దానిని సాధించే వరకు విశ్రమించను, అని చాటి చెప్పిన "లోకమాన్య బాలగంగా ధరతిలక్" (గీతారహస్యంభాష్యకారుడు) ప్రకటించాడు.

ఆచతుస్సూత్రాలు ఇవి :

1. కర్మచేయుట యందేనీ కధికారము.
2. కర్మఫలము మీద అధికారము లేదు
3. కర్మఫలం కోసం కర్మలు చేయవద్దు
4. అకర్మకు అంటే కర్మ చేయక పోవడానికి అంటిపెట్టుకోవద్దు

ఎవరిని దృష్టిలో పెట్టుకొని ఈ మాటలన్నీ చెప్పినట్లు? దానికి తరువాత వస్తున్న శ్లోకం స్పష్టము చేస్తున్నది.

"యోగస్థః కురు కర్మాణి సంగంత్యక్త్వా ధనంజయ
సిద్ధ్య సిద్ధ్యో సమోభూత్వా సమత్వంయోగఉచ్యతే" 2-48

అర్జునా!

యోగంలో స్థిరంగా వున్న వాడవై సంగాన్ని త్యజించి జయాపజయాల పట్ల సమ బుద్ధితో కర్మలు చేయవలసి వున్నది. యోగము అంటే సమత్వమే, అని ఆచార్యుడు ఉపదేశిస్తాడు. కోరికలతో వేదవాదులు అనుష్ఠించే కర్మగాని, ప్రాకృతుల అజ్ఞాన కర్మను గాని గీత కర్మయోగంలో భాగంగా పరిగణించ లేదు. గీత పరిభాషలో అవి కర్మలు కావు, ముక్తుడు, యోగస్థుడు, స్థిత ప్రజ్ఞుడు చేయవలసిన కర్మను గురించి మాత్రమే భగవానుడు ప్రస్తావిస్తున్నాడు. ముక్తుడికి ఫలాపేక్ష లేదు కనుక అతడు కర్మలు చేయడం మానుకొనే అవకాశం వుంది. అందుచేత ఫలాశ లేకపోయినా అతడు కర్మలు చేయవలసిందేనని ఆచార్యుడు

విధిస్తున్నాడు. ముక్తుడు కూడా అందరిలాగా కర్మలలో ప్రవర్తించాలి, కాని ప్రాకృతులకు ముక్తునికి తేడా ఏమంటే ముక్తుడు కర్మతోసంగాన్ని వదిలి పెట్టాడు. అంతేగాక కర్మఫలం జయం అయినా, అపజయం అయినా ఆశించిన ఫలితము లభించినా, లభించకపోయినా, కర్తవ్య కర్మాచరణను విడిచిపెట్ట కూడదు అని ఆచార్యుడు ఉద్ఘాటిస్తున్నాడు. కర్మఫలాల పట్ల సమబుద్ధి కలిగి వుండాలని మాత్రమే యోగమని చెప్పడం వలన కర్మాచరణంలో యోగి దృక్పథానికి, వేదవాదుల, ప్రాకృతుల దృక్పథానికి ఎంతో తేడా వున్నదని సూచిస్తున్నాడు. పై చూపుకు తేడా కనిపించకపోయినా అంతరంగ దృక్పథానికి ఎంతో తేడా వుంది. పై రెండు శ్లోకాలను కలిపి చదివితే భగవానుని ఆజ్ఞలో వున్న ప్రాశస్త్యము బోధపడుతుంది. యోగస్థుడైన స్థితప్రజ్ఞుని కర్మ విషయమేగాని, వేదవాదుల అజ్ఞానుల కర్మ విషయం ఇక్కడ ప్రస్థుతం కాదు.

ఈ విధంగా ఉపనిషత్తును బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాద రూపమును అయిన
శ్రీ మద్భగవద్గీతయందలి సాంఖ్యయోగమను
పేరుగల ద్వితీయ అధ్యాయము
సమాప్తము గావించబడింది.



# గీతా సంహిత

**అధ్యాయము మూడు** | **కర్మ యోగము**

అర్జునా !

బుద్ధియోగముకంటెను, కామ్య కర్మ నికృష్టమైనది. కనుక నిష్కామ కర్మమును ఆశ్రయింపుము. ఫలమును కోరు వారు కృపణులు - 2-49

సమత్వ బుద్ధియుక్తుడగు మనుజుడు పాప, పుణ్యముల రెండింటిని ఈ లోకమునందే విడిచివేయుచున్నాడు - 2-50

సమత్వ బుద్ధి కలిగియున్న ఉత్తములు కర్మలను ఆచరించుచున్నను ఫలాపేక్షలేని వారగుటచేత వారు జన్మబంధముల నుండి విడివడి దుఃఖ రహితమైన మోక్షమును పొందుచున్నారు 2-51

అని భగవానుడు కర్మయోగముకంటెను బుద్ధియోగమే గొప్పది, శ్రేష్ఠమైనది అని రెండవ అధ్యాయమైన సాంఖ్యయోగములో ప్రకటించాడు.

అంతకు ముందు ఇదే అధ్యాయములో- నీకు కర్మములు చేయుట యందే అధికారము వున్నది. కర్మముల యొక్క ఫలములను ఆశించుట యందు నీకు ఎన్నడును అధికారములేదు. కర్మఫలమునకు నీవు కారణభూతుడవుకావద్దు. అట్లని కర్మలను ఆచరించుట యందు నిరాసక్తుడవుకావద్దు. 2-47

అర్జునా !

నీవు యోగమునందున్న వాడవై సంగత్వమును వీడికార్యము సిద్ధించినా, సిద్ధించక పోయినా వాటిపట్ల సమముగా నున్న వాడవై కర్మలను ఆచరింపుము. యోగము అంటే సమబుద్ధి కలిగి యుండడమే అని 2-48లో అన్నాడు.

ఈ రెండు ప్రకటనలు ఒకదాని కొకటి పరస్పర విరుద్ధంగా వున్నాయి. ఒకసారేమోకర్మ యోగము కంటే బుద్ధియోగమే గొప్పదంటాడు, మరొకసారేమో బుద్ధియోగమే గొప్ప దంటాడు. ఏమిటిదంతా? అని చికాకు పడ్డాడు అర్జునుడు. ఏది చేయదగినదో, ఏది చేయకూడనిదో తెలుసుకోలేక ఖిన్నుడయ్యాడు, ఆ స్థితిలో తనలో రేగిన సంశయాన్ని శ్రీకృష్ణుని ముందుంచాలనుకున్నాడు.

ఇంతలోనే భగవానుడు అర్జునునితో

అర్జునా!

శ్రవణాదులచే విచలితమైన నీబుద్ధి సమాధి యందు ఎపుడు స్థిరమగునో అపుడు నీవు యోగమును పొందెదవు, అని 2-53లో ప్రకటిస్తాడు.

ఆ వెనువెంటనే అర్జునుడు సమాధి యందు నిలకడ పొందినవానిని అంటేస్థితప్రజ్ఞుణ్ణి గూర్చి తెలుసుకోవాలన్న ఉత్సుకత కలవాడై ఆ విషయాన్ని తెలుపమని అర్థిస్తాడు. స్థిత ప్రజ్ఞుని లక్షణాలను భగవానుడు 18 శ్లోకాలలో విపులంగా వివరిస్తాడు. అది విన్నను అర్జునుని మనస్సు నిలకడ లేక తిరిగి తన పాత సందేహన్ని అంటే బుద్ధి యోగము గొప్పదా! లేక కర్మ యోగం గొప్పదా అని ప్రశ్నించగా సమాధానంగా కర్మయోగము యొక్క విశిష్ఠతను గూర్చి భగవానుడు తెలియజేస్తాడు. అందువల్లనే ఈ మూడవ అధ్యాయమునకు కర్మయోగము అనే పేరు వచ్చింది.

ఇక్కడ మనము అరవిందమహర్షి యొక్క ఆలోచనా విధానాన్ని కూడా పరిశీలించడం కొంత అవసరం.

గీత అవలంబించిన ఒక విచిత్రమైన పద్ధతి మనకు అవగాహన కావాలనుకుంటే ఈ పరామర్శ అవసరమంటాడు అరవిందయోగి అదేమిటంటే:

"గీత ముందుగా ఒక పాక్షిక సత్యాన్ని బహిర్గతము చేస్తుంది. దానిలోతైన అర్థము తేటతెల్లముగా అగుపించదు. అగుపించీ, అగుపించనట్లు వుండే సూచనలు మాత్రమే

అందులో వుంటాయి. కొంతదూరం ముందుకు వెళ్లాక తిరిగి ఆ సూచనల దగ్గరికే మనలను తెస్తుంది. అప్పుడు వాటి ప్రాముఖ్యతను వెల్లడిస్తుంది. చివరకు ఒక సూచన దగ్గర ఉద్గమిస్తుంది. పరమ రహస్యము అంటే అదే. దానిని బహిరంగ పరచకుండా దానిలో జీవించమని మనకే వదలి వేస్తుంది. భారతీయ ఆధ్యాత్మిక చింతన ఈ పరమ రహస్యంలో జీవించడానికి బోధిస్తుంది. తత్ఫలితంగా వచ్చినవే ప్రేమ, ఆత్మసమర్పణ, భక్తి పారవశ్య మహాతరంగాలు గీతా దృష్టి ఎంత సేపు సంయోజనం మీదనే. దానిలో కనుపించే విభిన్న ధోరణులన్నీ చివరిగా తాను అందించబోయే ఉన్నత వాక్యాన్ని స్వీకరించగలందులకు గాను మనస్సును క్రమంగా సిద్ధము చేయడానికి ఉద్దేశించినవే. గీత అనుసరిస్తున్న ఈ విలక్షణ పద్ధతిని జాగ్రత్తగా గ్రహించవలసి వుంది. ఏ సిద్ధాంతాన్ని వివరించినా, ఏ తాత్విక చర్చను కొనసాగించినా దాని లక్ష్యం ఆ మహా చరమ వాక్యానికి మనస్సును చేర్చడానికే. ఆ దృష్టితోనే భగవానుడు వివరించే సాంఖ్యయోగ వేదాంత సూత్రాలను పరికించాలి. గీతచరమ వాక్యం వీటన్నింటి సంయోజనము మీదనే ఆధారపడి వుంది. (పేజి 176- శ్రీ అరవిందుల గీతా దర్శనం)

ఈ లోకములో ప్రతి మనిషి తన గుణమునను సరించి ఏదో ఒక కర్మచేస్తూనే యుండును. అట్లు చేయకుండా ఒక్క నిమిషమైనను ఊరకుండడు. అయితే ఆ చేసే కర్మలను నిష్కామతత్వముతో చేయాలంటాడు భగవానుడు. ఆయా కార్యములను మానవుడు ఎందుకు ఆచరించవలెనో వాటిని ఆచరించుట వలన కలుగు ఉపకారమేదో, ఆచరించకపోవడం వలన కలిగే నష్టం ఏదో, ఏ కర్మ బంధనమునకు దారితీయునో, ఏ కర్మ ముక్తికి మార్గదర్శిగా వుండునో ఆ విషయాలన్నీ విపులముగ కర్మయోగం అనే ఈ అధ్యాయమందు చర్చించబడినందుననే దీనికి కర్మయోగము అనే ప్రతిష్ఠ కలిగింది. ఈ యోగము నందు మొత్తం 43 శ్లోకములు వున్నవి.

ఈ అధ్యాయములోని ముఖ్యవిషయాలు

1. అనాసక్త భావముతో కర్మలను ఆచరించడం ఉత్తమమని తెలియజేయుట.
*(1 నుండి 8వ శ్లోకం వరకు)*
2. ఫలాపేక్ష లేకుండా చేయు కర్మను యజ్ఞముగా నిరూపించుట.
*(9 నుండి 16వ శ్లోకము వరకు)*
3. జ్ఞానియు, భగవానుడు ఉభయులును లోకసంరక్షణార్థం కర్మలను ఆచరిస్తూనే వుంటారని తెలియజెప్పుట. *(17 నుండి 24 వరకు)*
4. అజ్ఞాని యొక్కయు, జ్ఞానియొక్కయు లక్షణములను, పేర్కొనుచు రాగ, ద్వేష రహితముగ కర్మలను ఆచరించవలసిందని ఉద్బోధించుట
*(25 నుండి 35 వరకు)*
5. కామ, క్రోధాదుల స్వభావము వాటిని జయించు విధానమును తెలియజెప్పుట.
*(36 నుండి 43 వరకు)*

కర్మయోగము కంటే జ్ఞాన యోగమే శ్రేష్ఠమైనదన్నది భగవానుని అభిమతం అయినచో నన్నెందులకు ఈ జ్ఞాన యోగ రంగమునందుండి తప్పించి యుద్ధమనే ప్రచండ కర్మ క్షేత్రములో ప్రవేశించమంటున్నాడు, ఏమిటి దంతా? అనే సంశయములో దానిని గూర్చి తెలుసుకోడానికై భగవానుని ఈ విధంగా ప్రశ్నిస్తున్నాడు.

జ్యాయసీ చేత్కర్మణస్తే
మతాబుద్ధిర్జనార్దన!
తత్కిం కర్మణి ఘోరేమాం
నియోజయసి కేశవ! శ్లో - 1

కృష్ణా !
ఏమిటిదంతా!
కర్మకంటెను జ్ఞానం
శ్రేష్ఠమని ఒక సారి, జ్ఞానం
కంటే కర్మయే శ్రేష్ఠమని
మరొకసారి తెలుపుతూ
ఎందుకు నన్నీ భయంకర
యుద్ధకార్యానికి పురికొలుపుతున్నావు?

"వ్యామిశ్రేణేవ వాక్యేన
బుద్ధిం మోహ యసీ వమే
తదేకం వదనిశ్చిత్య
యేన శ్రేయోహ మాప్నుయాం" శ్లో -2

మిశ్రమ వాక్యములచేత
(గజిబిజి మాటలవలన)
నా మదిని కలత చెందించు
చున్నావు. అందువలన నేను
దేనిచేత శ్రేయమును పొంద
గలనో దానిని గూర్చినిశ్చయించి
చెప్పుము

అర్జునుడు వేసిన ఈ రెండు ప్రశ్నలకు భగవానుడు సమాధానమొసంగుచున్నాడు.

"లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా
పురాప్రోక్తా మయానఘ
జ్ఞాన యోగేన సాంఖ్యానాం
కర్మయోగేన యోగినాం" శ్లో - 3

అర్జునా!
ఈ లోకములో సాంఖ్యులకు
జ్ఞానయోగమును, యోగులకు
కర్మయోగము అను రెండు
విధములగు కర్మలను గూర్చి
పూర్వమునేనే చెప్పియుంటిని

"న కర్మణామనారంభాత్
నైష్కర్మ్యం పురుషోశ్నుతే
నచసన్న్యసనాదేవ
సిద్ధిం సమధి గచ్ఛతి" శ్లో - 4

మనుజుడు కర్మలను
ఆచరించకపోవడము
వలన నిష్క్రియ రూపమగు
ఆత్మ స్వరూప స్థితిని పొంద
లేడు, కర్మములను విడిచి
నంతమాత్రము చేత ఎవడును
మోక్షమును పొందలేడు.

"నహికశ్చిత్ క్షణమపి
జాతు తిష్ఠత్య కర్మకృత్
కార్యతే హ్యా వశః కర్మ
సర్వః ప్రకృతి జైర్గుణై శ్లో - 5

కర్మాచరణము లేకుండా
ఎవ్వరును ఒక్క క్షణ కాలమైనను
వుండలేరు, ప్రకృతి వలన
పుట్టిన గుణముతో ప్రతి
ఒక్కరు పరవశులై కర్మలను
ఆచరించుచునే యున్నారు.

ఇంద్రియములను అణచిపెట్టి కూర్చొనుట కర్మత్యాగము కాదని వచిస్తున్నాడు.

"కర్మేంద్రియాణి సంయమ్య
యాస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థాన్వి మూఢాత్మా
మిథ్యా చారస్స ఉచ్యతే" శ్లో - 6

ఎవడు కర్మేంద్రియములను
అణచిపెట్టి మనస్సు చేత
శబ్దాది ఇంద్రియ విషయములను
గూర్చి చింతించుచుండునో
అట్టివాడు అవివేకియై కేవలము
కపట వర్తనుడని పిలువబడుచున్నాడు

"యస్త్వింద్రియాణి మనసా
నియమ్యారభ తేర్జున
కర్మేంద్రియైః కర్మయోగ
మసక్తః స్వవిశిష్యతే" శ్లో - 7

జ్ఞానేంద్రియములను
మనస్సుచేత అరికట్టి
కర్మేంద్రియముల చేత
ఫలాసక్తి లేకుండా కర్మ
యోగమును ఆచరించు
వాడు శ్రేష్ఠుడనబడుచున్నాడు

"నియతం కురు కర్మత్వం
కర్మజ్యా యోహ్యా కర్మణః
శరీర యాత్రా పిచతే
న ప్రసిద్ధ్యేద కర్మణః" శ్లో - 8

నీవు చేయవలసి వున్న
కర్మను నీవు ఆచరింపుము
నీనియమిత కర్మను నీవు
చేయకుండా వుండడం
కంటే చేయడమే
ఉత్తమం. కర్మచేయని
వానికి శరీరయాత్ర కూడా సిద్ధించదు.

"యజ్ఞార్ధా త్కర్మణో న్యత్ర
లోకోయం కర్మబన్ధనః
తదర్థం కర్మ కౌంతేయ!
ముక్త సంగః స్సమాచరః" శ్లో - 9

అర్జునా!
లోకహితార్థము కొరకు
కాకుండా చేయు ఇతర
కర్మలన్నియు మానవునకు
బంధహేతువులగుచున్నవి

లోకమునకు మేలు చేసే కార్యములన్నియు యజ్ఞములు అనబడుచున్నవి. "యజ్ఞోవైశ్రేష్ఠతమం కర్మ"- అంటే "యజ్ఞము అత్యుత్తమ కార్యము"- అని శతపథ బ్రాహ్మణమునందు చెప్పబడింది. అందువలన స్వార్థబుద్ధిని వదలి పరహిత బుద్ధితో ఫలాపేక్షను దరిజేరనీయక కర్తవ్య కర్మను ఆచరించిన అది బంధనమును కలిగించదు. "యజ" అను క్రియా పదముతో "యజ్ఞ" శబ్దం ఏర్పడింది. యజ "ధాతువు" నకు దేవపూజ- సంగతి కరణము- దానము అని మూడు అర్థములు. "ధాతువు' యొక్క అర్థమును బట్టి చూచిన యజ్ఞము ఒకశుభకార్యము అని తెలియుచున్నది.

1. దేవపూజ అంటే విద్వాంసులకు సత్కారము.

2. సంగతికరణము అంటే ఉత్తమ పదార్థముల సేకరణ.

3. దానము అంటే కష్టపడి న్యాయమార్గమున సంపాదించిన ద్రవ్యమును తోటివారికి అంటే ప్రాణికోటి ప్రయోజనార్థము వినియోగించుట. అంటే ఒక వస్తువు పై తనకు గల స్వామిత్వమును వదలుకొని దానిని సమాజమునకు సంక్రమింపజేయుట. గాంధీజీ దృష్టిలో ఇది ధర్మకర్తృత్వ సిద్ధాంతము. మహర్షి వినోబా దృష్టిలో " గ్రామదానము" అంటే యావదాస్తి గ్రామానిదై వుండడం. సామ్యవాదం అంటే ఇదే. ఇటీవలి కాలంలో "మార్క్సు - ఎంగెల్సులు ప్రతిపాదించిన కమ్యూనిజం కంటే ఎన్నో వేల సంవత్సరాల క్రిందట శ్రీకృష్ణభగవానుడు ప్రతిపాదించిన కమ్యూనిజం ఇది. ఇవన్నీ యజ్ఞ శబ్దానికున్న విశేషార్థములు, యజ్ఞమంటే ఇలాంటి ఉత్తమ కర్మలతో కూడుకొన్నది.

అయితే కొందరు కర్మకుల మని చెప్పకొని యజ్ఞముల పేరిట జంతుహింసను కొనసాగిస్తున్న విషయము అందరికీ తెలిసిందే. అట్టివారిని యజ్ఞముల పేరుతో హింసను ఎందుకు కొనసాగిస్తున్నారు అని ప్రశ్నిస్తే ఇది 'వేద విహితం' అని చెప్పచున్నారు. వేదములను గూర్చి ఎంత మాత్రము తెలియని సామాన్య ప్రజలు ఈ మాటలను నిజమని నమ్మి వేదముల పట్ల తమకు గల భక్తి కారణంగా ప్రాణి ఘాతుకులకు ధనధాన్యములు ఇచ్చి తోడ్పడుచున్నారు. దీని వలన తమకు పుణ్యము లభించునని తలంచుచున్నారు. ఇది ఎంత పొరపాటు? ఎంత తప్పిదం!

'గాం మాహిగ్ంసీః
అవింమాహిగ్ంసీః
అశ్వంమా హిగ్ంసీః
మాహిగ్ంసీః సర్వభూతాని"

ఇవి వేదవాక్యములు, గోవును గాని- గొర్రెను గాని- అశ్వమును గాని ఇంకేదానిని గాని హింసింపకుము. సర్వభూతములను మిత్ర దృష్టితో చూచుచు దేనిని హింసింపకుము అని పై వేద వాక్యములు తెలుపుతున్నాయి. అలాంటప్పడు యజ్ఞ ములందు పశువులను హింసింపుమని వేదములెట్లు చెప్పగలవు? చెప్పవు.

"యజ్ఞము, యాగము, అధ్వరము" అను యజ్ఞవాచకములలో హింసకు సంబంధించిన అర్థము ఎక్కడను అగుపించదు. అంతే కాకుండా "అధ్వర" శబ్దము ప్రత్యేకంగా హింసా రాహిత్యాన్ని బోధిస్తుంది.

"ధ్వరతిర్ హింసాకర్మ- నధ్వరతీ త్యధ్వర:" ధ్వరతి అంటే హింసాకర్మ. అది లేనిది అధ్వరము అని వైదిక శబ్దాన్ని నిర్వచిస్తూ "యాస్కాచార్యుడు" స్పష్టీకరించియున్నాడు.

ఈ విషయములో మహాభారతము "అనుశాసన పర్వం"లోభీష్ముడు- యుధిష్ఠరునితో (ధర్మరాజుతో) ఈ విధంగా అంటాడు.

" ధ్రువం ప్రావధో - యజ్ఞేనాస్తి యజ్ఞ స్త్వహింసకం:

తతో హింసక: కార్య:సదా యజ్ఞో యుధిష్ఠర!"

"యూపం ఛిత్వా పశూన్ హత్వాకృత్వా రుధిర కర్ధమం

యద్యేవం గమ్యతే స్వర్గం, నరకం కేన గమ్యతే"

"యజ్ఞము నందు ప్రాణి వధ లేదు. ఇది నిశ్చితము, యజ్ఞము అహింసకము. కావున యుధిష్ఠర! (ధర్మరాజా!) యెల్లపుడు యజ్ఞమును హింసారహితము ఒనర్చవలెను"

" యూప (స్థంభము) నొకదానిని నెలకొలిపి దానికి పశువును కట్టిచంపి, ఆ రక్తముతో యజ్ఞస్థలిని బురదగా (మలినముగా) చేసినవాడు స్వర్గమునకు ఏగిన యెడల ఇక నరకమునకు ఎవడేగును?"

మహాభారతములోనే "శాంతి పర్వము"నందు భీష్మ- యుధిష్ఠరుల (ధర్మరాజు) సంవాదము మరొకటి ఈ విధంగా వుంది.

**యుధిష్ఠరుడు:** యదా భాగవతోత్యర్ధమాసీద్ రాజామహాన్ వసు:
కిమర్థం స పరిభ్రష్టో వివేశ వివరంభువ:!"

**భీష్ముడు:** అత్రా వ్యుదాహరంతీమ మితిహాసం పురాతనమ్
ఋషీణాం చైవ సంవాదం త్రిదశానాంచభారత!
అజేన యష్టవ్యమితి ప్రాహుర్ దేవా! ద్విజోత్తమాన్
నచ ఛాగో హ్యజో జ్ఞేయో నాన్య: పశురితిస్థితి:"

**ఋష:** బీజైర్ యజ్ఞేషు యష్టవ్య మితి వై వైదికీ శ్రుతి:
అజసంజ్ఞాని బీజాని, ఛాగంనో హంతుమర్హథ
నైవ ధర్మ: సతాం దేవా, యత్ర వధ్యేత వైపశు:
ఇదం కృతయుగం శ్రేష్ఠం కథం వధ్యేత వై పశు:

| | |
|---|---|
| భీష్మ: | తేషాం సంపదతా మేవమ్ ఋషీణాం విబుధై: సహ<br>మార్గాగతో నృపశ్రేష్ఠస్తం దేశం ప్రాప్తవాన్ వసు:<br>అంతరిక్ష చర: శ్రీమాన్ సమగ్ర బలవాహన:<br>తం దృష్ట్వా సహసాయాంతం, వసుం తే త్వంతరిక్షగం<br>ఊచుర్ ద్విజాతయో దేవా నేష ఛేత్స్యతి సంశయం<br>యజ్వా దానపతిః, శ్రేష్ఠ, సర్వభూత హిత ప్రియ:<br>కథం స్విదన్యథా బ్రూయా దేష వాక్యం మహాన్ వసు:<br>ఏవంతే సంవిదం కృత్వా, విబుధా ఋషయ స్తథా,<br>అపృచ్ఛన్ సహితాభ్యేత్య వసుం రాజాన మంతికాత్<br>భో రాజన్! తేనయష్టవ్యం, అజేనా హోస్వి దౌషధై:<br>ఏతన్న: సంశయంఛింధి ప్రమాణంనోభవాఽమత:<br>సతాన్ కృతాంజలిర్ భూత్వా, పరి పప్రచ్ఛ వై వసు:<br>కస్యవై కోమత: కామో బ్రూత సత్యం ద్విజోత్తమా: |
| ఋషయః | ధాన్యై ర్యష్టవ్య మిత్యేవ పక్షోస్మాకం నరాధిప ! |
| ఊచు: | దేవానాం తు పశు: పక్షో మతో రాజన్ వదస్వన: |
| భీష్మ: | దేవానాంతు మతంజ్ఞా త్వా వసునా పక్ష సంశ్రయాత్,<br>చాగేనాజేన యష్టవ్య మేవ ముక్తం వసుం తదా<br>కుపితాస్తే తత: సర్వే మునయః సూర్యవర్చస:<br>ఊచుర్ వసుం విమానస్థం దేవపక్షార్థ వాదినం<br>సురపక్షో గృహీత స్త్వం యస్మాత్తస్మా ద్దివ: పత<br>అద్య ప్రభృతి తే రాజన్ ఆకాశే విహతా గత:<br>అస్మచ్ఛా పాభిఘాతేన మహీం భిత్వా ప్రవేక్ష్యతి,<br>తత స్తస్మిన్ ముహూర్తేథ రాజోపరిచర స్తదా<br>అథోవై సంబభూ వాశు, భూమేర్వి వరగో నృప!<br>అజైర్ యజ్ఞేషు యష్టవ్యమితివై వైదిక శ్రుతి:<br>అజసంజ్ఞాని బీజాని ఛాగం నో హంతు మర్హథ<br>అవ్యవస్థిత మర్యాదై ర్విమూఢైర్ నాస్తికై ర్నరై:<br>సంశయాత్మభిరవ్యక్తై: హింసా సమనువర్ణితా |

మహాభారతం శాంతిపర్వం 366 అధ్యాయం

తాత్పర్యం:"ఐశ్వర్యవంతుడైన వసురాజు ఎందువలన భ్రష్టుడై భూవివరమున ప్రవేశించవలసి వచ్చినది? అని యుధిష్ఠరుడు (ధర్మరాజు) భీష్ముని ప్రశ్నించగా ఆయనిట్లు చెప్పెను.

యుధిష్ఠరా!

ఈ విషయమును దెలుపుటకు పూర్వపు గాథను ఒకదానిని ఇట్లు చెప్పదురు.

దేవతలకు- మహర్షులకు యజ్ఞ సంబంధమైన విషయములో ఒక సంవాదం జరిగింది. దేవతలు మహర్షులతో "అజ"తో చేయమనియు, అజ అంటే మేక అని ఇంకొక పశువు కాదని చెప్పిరి. అపుడు మహర్షులు "బీజము" లతో యజ్ఞమొనర్చ వలయునని వేదము తెలుపుతున్నదని చెప్పిరి. ఆ బీజములు "అజ" నామము కలిగియుండవలెనే తప్ప పశువు మాత్రము కాదు దానిని (మేకను) చంపరాదని తెలిపిరి. యజ్ఞమునందు పశువులను చంపుట శ్రేష్ఠమైన ధర్మము కాదని చెపుతూ ఇది కృతయుగం. శ్రేష్ఠమైన ఈ కృతయుగంలో పశుహింస చేయడం ఎట్లు సంభవం? అని దేవతలను ప్రశ్నించిరి.

ఆ సమయములో నృపశ్రేష్ఠుడైన "వసువు" ఆ మార్గము గుండా వెళుతూ "దేవతలు ఋషులు" వున్నచోటికి వచ్చెను. అతడు అంతరిక్షగామి, శ్రీమంతుడు, సమగ్రబల వాహనములు కలవాడు. వసురాజు అచటకి వచ్చిన వెంటనే తిరిగి వెళ్ళడానికి వెళ్ల ప్రయత్నించుచుండగా, మహర్షులు- దేవతలతో ఇట్లనిరి.

ఈ వసు రాజు యాగములు చేసిన వాడు, దాత, శ్రేష్ఠుడు, సర్వభూతములకు హితమొనర్చినవాడు. కావున ఇతడు మన సంశయములను తీర్చగలడు. గొప్పవాడు. విపరీతము చెప్పడు. అని ఇట్లు మహర్షులు - దేవతలు నిర్ణయించుకొని ఉభయులు వసురాజు చెంతకు వెళ్లి అతనితో ఓ రాజా! దేనితో యజ్ఞమొనరింపవలెను? "అజ(మేక)తోనా లేక ఓషధులతోనా" అనే సంశయం మాలో కలిగింది. నీవే మాసంశయము తీర్చగలవని మేము నిన్ను ప్రమాణముగ అంగీకరించుచున్నాము అనిరి. అప్పడా వసురాజు దేవతలు- ఋషులు ఇద్దరకు ప్రణమిల్లి "మీ ఇరు పక్షములవారిలో ఎవరిది ఏమతమో చెప్పండి" అని ప్రశ్నించెను. అంతట ఆ ఋషులు "ధాన్యములతో యజ్ఞము ఒనరింపవలెనన్నది మా పక్షము. పశువును వధించి యజ్ఞము చేయవలెనన్నది దేవతల పక్షము" అని చెప్పి ఇందేది ఉచితమో తెలియజేయవలయునని కోరిరి. "వసువు" దేవతల ఎడల గల పక్షపాతబుద్ధి వలన పశువులజంపి యజ్ఞము ఒనరింపవలెనని తెలిపెను.

అది విని ఋషులు కుపితులై పక్షపాత బుద్ధితో "వసువు" దేవతల పక్షమున వహించి ఆ విధంగా తెలిపారు గనుక ఆకాశమున విమానము నందున్ననీవు క్రిందపడిపోవుదువుగాక! అని శపించిరి. ఓ రాజా! అదియును గాక ఈనాటినుండి నీకు ఆకాశగమనము శక్యము కాదు. మా శాపకారణంగా నీవు భూవివరమున ప్రవేశింతువు గాక! అనుటయేతడవుగా ఉపరిచరవసువు ఆకాశమునుండి క్రింద పడి భూమిలో ప్రవేశించెను.

అందువలన ఓ యుధిష్ఠరా! అజనామక బీజముతోనే యజ్ఞము ఒనరింపవలయునని ఎరుగుము. పశువులను చంపి యజ్ఞములు చేయరాదు అనెను. మర్యాదలు విడిచి మూఢులు, సంశయాత్ములు- నాస్తికులు అయిన వారు యజ్ఞములందు హింసను వర్ణించినారు. అట్టివారు అవ్యక్తులు.

మహాభారతములోని ఈ ప్రసంగమును బట్టి చూచినను వేదము హింసాయుత యజ్ఞము విధింపదనియు, మధ్యకాలములో ఎవరో ధూర్తులు హింసాత్మక యజ్ఞములను వేదము పేరిట నడిపిరని బోధ పడుచున్నది.

"సహయజ్ఞాః ప్రజాసృష్ట్వా
పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రస విష్యధ్వ
మేషనో స్త్విష్ట కామధుక్" శ్లో - 10

**"పూర్వం బ్రహ్మదేవుడు**
**యజ్ఞములతోకూడా**
**ప్రజలను సృష్టించి ఈ**
**యజ్ఞములచే మీరు**
**వృద్ధిపొందుడు, ఇవి మీ**
**కోరికలను నెరవేర్చును"అనెను**

"దేవాన్ భావయతానేన
తేదేవా భావయన్తు వః
పరస్పరం భావయంతః
శ్రేయః పరమవాప్స్యథ" శ్లో - 11

ఈ యజ్ఞముల ద్వారా
మీరు దేవతలను తృప్తి
పరచండి. ఆ దేవతలు
మిమ్ములను సంతృప్తి నొందించెదరు
ఈ విధముగ ఒకరినొకరుత ృప్తి
నొందించుకొనుటవలన ఉత్కృష్ట
మైన శ్రేయమును పొందెదరు

"ఇష్టాన్ భోగాన్ హి దేవా
దాస్యన్తే యజ్ఞ భావితాః
తైర్దత్తా నప్రదాయై భ్యో
యోభుంక్తే స్తేన ఏవసః" శ్లో - 12

యజ్ఞముల చేత
తృప్తినొందిన దేవతలు
మనుజునకు ఇష్టములైన
భోగములననుగ్రహింతురు
అట్లు దేవతల చేత ఇవ్వబడిన
భోగములను వారికి తిరుగ
సమర్పించక ఎవడనుభ
వించునో అట్టివాడు చోరుడు.

యజ్ఞమును గురించి గాంధీజీ తెలిపిన అభిప్రాయాలను ఆంగ్లములో యథాతథంగా ఇక్కడ పొందుపరచబడ్డాయి.

"Yagna is a Word full of beauty and power. Hence with the growth of knowledge and experience and with the change of the time its meaning is likely to grow and change. "Yagna" literally means worship, hence sacrifice, hance any sacrificial act or any act of service, and in this sense every age may and should have its own particular Yagna. for mankind and by Yagna, sacrifice" (Young India)

Also Yagna means an act directed to the welfare of others, done without receiving or desiring a return for it, wheather of a temporal or a spirutual nature. Act

must be taken in its widest sense, and includes thought and word, and other embraces not only humanity but all life. Therefore, it will not be a Yagna, to sacrifice lower animals even with a view to the service of humanity.

The word cannot subsist for a single moment with out "Yagna" in this sense, and threfore the Gita after having dealt with true wisdom in the second chapter, takes up in the third the means of attaining it, and declares in so many words, that "Yagna" came with creation itself. This body therefore has been given us only in order that we may serve all creation with it. And therefore, says the Gita he who eats without offering "Yagna" eats stolen food. Every single act of one who would lead a life of purity, should be in the nature of "Yagna". Yagna having come to us with our birth, we are debtors all our lives and thus for ever bound to serve the universe. And even as a bond slave receives food, clothing and so on from the master whom he serves, so should be greatfully accept such gifts as may be assigned to us by the lord of the universe"

(Yarawada Mandir chap XIV)

"Earn they bread by the sweat of the brow, says the Bible, sacrifices may be of many kinds, one of them may well be bread labour. If all laboured for their bread and no more, there would be enough food and enough leisure for all, then there would be no cry of over population, no disease, and no such misery as we see around us. Such labour will be the highest form of sacrifice, men, will no doubt do many other things either through their bodies or through their minds, but all this will be a labour of love for the common good. May not men earn their bread by intellectual labour? No, the needs of the body must be supplied by the body, 'Render unto caesar that which is caesar's perhaps applies here well," (Gandhiji in the Harijan 29th June 1935)

"యజ్ఞంలో హింసకూడదు" అని మహాభారతం అనుశాసన పర్వం-శాంతిపర్వములలో భీష్ముడు యుధిష్ఠరునికి (ధర్మరాజుకు) తెలిపియున్నాడు గదా! అట్లయినప్పడు "గీత" మహాభారతయుద్ధాన్ని ప్రోత్సహించి మహామారణ హోమానికి దారి తీయించింది గదా! అనే సందేహం చాలా మందికి కలుగవచ్చు. అందుకు మహర్షి అరవిందులవారు "గీత హింసను ప్రోత్సహించలేదు" అని తెలిపిన ఈ అంశాన్ని కూలంకషంగా పరిశీలిస్తే దానికి జవాబు దొరుకుతుంది.

"శ్రీకృష్ణుడు యుద్ధము చేయవలసిందిగా, శత్రువులను సంహరించవలసిందిగా అర్జునుని ప్రోత్సహించడం వలన "గీత" హింసను ఘోరకర్మను, సమర్థించినట్లుగా లేదు! అనే ప్రశ్న ఉత్పన్నము కావచ్చు. అహింసయే పరమ ధర్మమని సర్వశాస్త్రాలు ఘోషిస్తుంటే

శ్రీకృష్ణుడు అర్జునుని హింసకు పురికొల్పడం ఎంతవరకు సమంజసము? ఈ సమస్యకు రాబోయే అధ్యాయాలలో సందేహానికి అణుమాత్రమైనా తావులేని సమాధానాన్ని ఇచ్చారు. ఆయా సందర్భాలలో వివరంగా ఆవిషయాన్ని. చర్చించడం జరుగుతుంది. అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియనిగ్రహః" అని సర్వ మానవులు అనుసరించ వలసిన ధర్మాలను పేర్కొంటూ మనుస్మృతి అహింసకు అగ్రస్థానాన్ని ఇచ్చింది.

"అహింసా పరమోధర్మః"అని ఉద్ఘాటించింది మహాభారతం. మరి శ్రీకృష్ణుని ఉపదేశము వీటికి వ్యతిరేకంగా వున్నది కదా! శ్రీ అరవిందులు కూడా 'గీతావ్యాసాలు' అను గ్రంథంలో కురుక్షేత్రం అను వ్యాసంలో ప్రపంచ జీవితంలో నివారించరాని అంశంగా హింసవున్నదని నిరూపించారు. అంటే గీతోపదేశము హింస అని శ్రీ అరవిందుల వారి అభిప్రాయమా? ఇటువంటి ప్రశ్నని లేవనెత్తిన ఒక సాధకునికి సమాధానంగా శ్రీ అరవిందులు ఈ విధంగా వ్రాశారు. "గీతావ్యాసాలు" పుస్తకము గీత పెపొందించిన సాధారణ కర్మయోగాన్ని వివరించింది. గీతలో కర్మ ఒక అంతరంగ మార్పుతో కూడిన మానవ జీవితానికి చెందిన సాధారణ కర్మ. అక్కడ కూడా చెప్పినది వ్యక్తిగతమై అహంకార ఉద్దేశాలవల్ల చేసే హింసవిషయము కాదు. సాంఘిక జీవితానికి చెందిన క్రమవ్యవస్థలో భాగంగా జరుగవలసిన హింస గురించి, ఆగ్రహము, తీవ్ర భావన లేదా ఏ ప్రాణికిఉద్దేశపూర్వకంగా జరిగే హింసను ఆధ్యాత్మికంగా ఏదీ సమర్థించదు. అంతేగాక శ్రీ అరవిందుల యోగం సాధారణ మానవ జీవితాన్ని దాటి పైకి పోవాలనే లక్షణము కలదికాబట్టి సంపూర్ణంగా హింసను వదలివేయవలసిందే. హింసవలన అంతరాత్మ పరివర్తనగాని, ఆధ్యాత్మిక పరివర్తన గాని రాదు. సాధకులలో రావలసింది కేవలం ప్రవర్తనలో మార్పు కాదు. మనస్సును, ప్రాణాన్ని శరీరాన్ని మానసిక, ప్రాణిక తత్వాలు పరిపాలించడానికి బదులుగా అంతరాత్మ, ఆత్మచైతన్యాలు పరిపాలించడం, హింస దానికి పూర్తిగా విరుద్ధము . దీనివలన మానసిక అహం, ప్రాణికి తీవ్రభావన, క్రోధము లేక క్రూరత్వము గద్దె ఎక్కుతాయి. సాధారణ ప్రకృతిలో వున్న హింస ఆధ్యాత్మిక కర్మలో హింసను సమర్థించదు, పై వాక్యాల వలన భగవద్గీతను గాని, భగవద్గీత వ్యాఖ్యాతలలో శిరోమణి అయిన శ్రీ అరవిందులు గాని ఆధ్యాత్మిక సాధనలో హింసకు ఏ విధమైన స్థానాన్ని కల్పించలేదని స్పష్టపడింది.

కాని శ్రీకృష్ణుడు అర్జునుని యుద్ధము చేయవలసిందని శాసించడం లోగల భావం ఏమిటో ఇంకా బోధ పడలేదు. ఉన్నత ఆధ్యాత్మిక స్థితిలో అహింస పరమ ధర్మమే. అయినా సాధారణ ప్రపంచ జీవితంలో హింస అనివార్యంగా కనుపిస్తుంది. సాధారణ ప్రపంచములో మంచి చెడు పడుగు పేకల వలె కలిసి వున్నాయి.

"దుష్టత్వము విజృభించి ప్రపంచ పురోగమనాన్ని అస్తవ్యస్తము చేయకుండా నివారించడానికి హింస తప్ప వేరేమార్గము వుండని పరిస్థితులు ఏర్పడతాయి. అందుచేతనే గీతనాలుగవ అధ్యాయం 7వ శ్లోకం రెండవ పాదంలో "వినాశాయ చ దుష్కృతాం" అని భగవానుడు దుష్ట వినాశనాన్ని తన అవతారప్రయోజనాలలో ఒకటిగా పేర్కొనడం జరిగింది. హింసా ప్రయోగంతో దుష్ట శక్తులను ఆపకపోతే వాటి విజృంభణమువలన ఎంతో కల్లోలము, మారణ హోమము సంభవించి హింస ఎన్నో రెట్లుగా పెరిగిపోతుంది. అజ్ఞాన ప్రపంచంలో పురోగతికి హింస అనివార్యం అవుతుంది. శ్రీ అరవిందులు అందువల్లనే పాతకట్టడాలు కూలందే కొత్త కట్టడాలు నిర్మాణము కావంటూ "రుద్రుని రుణం తీర్చకుడా విష్ణు ధర్మాన్ని ప్రవర్తింపచేయలేము" అని హెచ్చరించారు. శ్రీ వినోద్ బరన్ గారితో జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలో ఈ విషయాన్ని గురించి ఆయన ఇలా వ్రాశారు. అహింసలో ఒక నిజం వుంది. విధ్వంసం లోను ఒక నిజం వుంది. ఆధ్యాత్మిక పరంగా నీవు ప్రతిరోజూ ప్రతివారినీ చంపుతూ పోవాలని నేను బోధించను. దైవం ఆజ్ఞాపించినపుడు దివ్యకర్మలో భాగంగా వినాశనాన్ని చేయగలుగుతాము అని నేను అంటున్నాను. ఒక నియమంగా హింసకన్న అహింస మెరుగైనదే కాని కొన్ని సార్లు హింసయే సరి అయినది కాగలదు. "తిలక్" కూడా తన గీతారహస్యంలో ఈ చర్చను విపులంగా కొనసాగించారు. గీత అహింసా సిద్ధాంతాన్నే బోధిస్తున్నదని భావించిన వారు గాని, హింసనే గీత బలపరిచిందని వాదించెవారు గాని గీతాహృదయాన్ని సరిగా గుర్తించలేదని చెప్పవలసి వస్తుంది. గీతా సందేశము సారాంశం ఒక్కటే మానవుడు నిమ్న ప్రకృతిని అధిగమించి దివ్య ప్రకృతిని చేరి భగవదిచ్ఛను తెలుసుకొని దానిని లోకంలో ప్రవర్తింపజేయడానికి సాధనంగా రూపొందాలి. అప్పడతనికి ఈశ్వరాజ్ఞ శిరోధార్యము, ఈశ్వరుడు నియోగించినది ఘోరకర్మా! సాత్విక కర్మా అనే మీమాంసగాని, హింసా, అహింసా అనే ప్రశ్నగాని అక్కడ తలెత్తవు. అపుడు అతడు (అర్జునుడు) చివరకు అనేదల్లా 18వ అధ్యాయం తనముగింపు శ్లోకంలోని "కరిష్యేవచనంతవ:" అని - అంటే "కృష్ణా" నీవు చెప్పినట్లే చేస్తాను" అని

ఈ సందర్భంగా "మహాత్మా గాంధి" గారి నైతిక ధృక్పథాన్ని గురించి "హరిదాసచౌదరి" అన్నమాటలను కూడా గమనించడం ఉపయోగకరంగా ఉంటుంది.. "సాంఘిక, రాజకీయ క్షేత్రంలో సత్యాహింసలు అనే నైతిక సూత్రాలను అనుసరించడము వలన మానవాంశాన్ని సమర్థవంతంగా మార్పు చేయవచ్చని మహాత్ముడు విశ్వసించాడు. ఆయన మతానికి నైతిక ధర్మంతో, దైవానికి సత్యం అహింసలతో అభేదాన్ని కల్పించారు. పర్యవసానంగా ఆయన దృష్టిలో సంఘాన్ని ఆధ్యాత్మికంగా పునర్నిర్మాణము చేయడానికి

నైతిక సూత్రాలే ఆధారం. కాని మానవునిలో వున్న "మృత్యు" అంతఃప్రేరణ మానవ ప్రకృతిలో వున్న ""రాక్షసుడు మానవ చైతన్యములో దాగియున్న హేతునిరోధక శక్తులు" ధర్మానికి, హేతువుకు లొంగేవికావు. శాంతియుత సమాధాన ప్రయత్నాలు విఫలం అయినప్పడు చాకచక్యానికి ప్రతిహింసకు అవసరం ఏర్పడవచ్చు.

కురుక్షేత్ర సంగ్రామరంగంలో శ్రీకృష్ణుని ఉపదేశం ప్రదర్శించినట్లుగా చాతుర్యానికి, ప్రతిహింసకు సమర్థనీయ అవకాశము తలెత్తితే అప్పడు భగవంతునికి, సత్యాహింసలకు నైతిక సూత్రాలకు అభేదత్వాన్ని కల్పించలేము. అపరిమితమైన అన్వయం కలిగిన నిరపేక్ష సత్యాలుగా వాటిని పరిగణించలేము. తేలినదేమంటే మనం నిమ్న ప్రకృతిలో కొనసాగుతున్నంతవరకు హింసకుతావు వుండనే వుంటుంది. దైవీ ప్రకృతిలో చేరినప్పడు మన ఇచ్ఛ దైవేచ్ఛలో ఒకటి అయిపోతుంది. కనుక హింసాహింసల వివేచనతో మనకు నిమిత్తం ఏమీ వుండదు"

(శ్రీ అరవిందుల గీతాదర్శనము , వ్యాఖ్యాతలు- శ్రీ తెన్నేటి పూర్ణచంద్రరావుగారు, పేజీలు 19,20,21)

"యజ్ఞ శిష్టాశినఃసంతో
ముచ్యంతే సర్వకిల్బిషైః
భుంజతే తేత్వఘంపాపా
యే పచంత్యాత్మకారణాత్" శ్లో - 13

యజ్ఞ శేషమును భుజించు
సజ్జనులు సర్వోపద్రవముల
నుండి విడివడుచున్నారు అట్లు
కాకకేవలము తమనిమిత్తమే
భుజించువారు పాపమును
ఆరగించువారై యున్నారు

"అన్నాద్భవన్తి భూతాని
పర్జన్యాదన్న సంభవః
యజ్ఞాద్భవతి పర్జన్యో
యజ్ఞఃకర్మ సముద్భవః శ్లో- 14

అన్నము వలన ప్రాణులు
కలుగుచున్నవి, అన్నము
మేఘము వలన కలుగు
చున్నది మేఘము
యజ్ఞము వలన కలుగు
చున్నది, కర్మము యజ్ఞము
వలన సంభవమగుచున్నది.

"కర్మబ్రహ్మోద్భవం విద్ధి
బ్రహ్మాక్షర సముద్భవమ్
తస్మాత్సర్వ గతంబ్రహ్మ
నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్" శ్లో - 15

కర్మ వేదము వలన
కలుగుచున్నది. వేదము
అక్షర పరబ్రహ్మమునుండి
ఉత్పన్నమగుచున్నది. కనుక
సర్వగతమైన బ్రహ్మము
నిరంతరము యజ్ఞమునందు
ప్రతిష్ఠితమై యున్నదని తెలుసుకో

## ధర్మచక్రం

బ్రహ్మము

యజ్ఞము



వేదము

కర్మ

గీతామకరందం సౌజన్యంతో 334పేజి

గాంధీగారు తమ "Gospel of Self less Action"పేజి 176లో 14,15 శ్లోకాల గురించి ఈ విధంగా తెలిపారు.

" A rather unhappy use of the word "Brahaman" has created much unnecessiary difficulty in the interpertion of shloka 15, "Brahaman" in the first two mentions of it means prakrithi and in the third and last mentions it means the imperishable, infinite, pervading the entire creation, The idea is that sacrifice is both the cause and consequence of creation, shanti parva (267-34) Expresses the same idea, "The whole creation issues from sacrifice and sacrifice issues from creation" "Tolstoy" said the same thing in simpler language, dropping out the intermediate links in the circular chain of sacrifice.

"Work produces food, food produces work. That is the unending circle. The one is the consequence and cause of the other". It is the eternal processes of sacrifice that makes what browning called, "This dread machinery of sin and sorrow"- a well devised plan that makes man.

"love in turn, and be beloved creative and self sacrificing too and thus eventually God like

### ఆద్యంతాలు లేని సృష్టి చక్రము

Work

పని

food

ఆహారము



food

ఆహారము

Work

పని

"ఏవం ప్రవర్తితం చక్రం
నాను వర్తయతీహయః
అఘాయు రింద్రియారామో
మోఘం పార్థ సజీవతి"          శ్లో - 16

*అర్జునా!*
*ఈ విధంగా ప్రవర్తింపజేయబడిన*
*సృష్టి చక్రమును ఎవడు*
*అనుసరింపడో వాడు ఇంద్రియ*
*లోలుడై పాపజీవనమును గడుపుచున్నాడు*

"యస్త్వా త్మరతిరేవస్యా
దాత్మతృప్త శ్చమానవః
ఆత్మన్యేవచ సంతుష్ట
స్తస్యకార్యం నవిద్యతే"          శ్లో - 17

*ఎవడు ఆత్మయందే క్రీడిస్తూ*
*ఆత్మయందే తృప్తిని*
*పొందుతూ, ఆత్మయందే*
*సంతోషిస్తూ వుండునో*
*అట్టి జ్ఞానికి చేయ*
*దగిన కార్యము ఇంకొకటి లేదు.*

This pithy shloka is pregnant with manifold meanings. It indicates the unfailing source of imperishable joy, and distinguishes the carnally minded described in the preceding shloka from the spiritually minded man.

"It doth make a difference whence a man's joy is" said saint augustine and while the carnally minded man, doing no sacrifice and sating His senses, lives in vain. His activity involving him in further sin and bondage. The spirutually minded man turns his eye inword- to-wards the perennial source of all Joys- Atman, and in so doing wins freedom from action.

The shloka does not mean that for him in all activity ceases, but that he is freed from all action that binds.

ఈ విషయాన్నే నాలుగవ అధ్యాయములోని 23వ శ్లోకము స్పష్టీకరిస్తున్నది.

సంగములేనివాడును
ముక్తుడును, మనస్సును
జ్ఞానము నందు నిలిపిన
వాడును, యజ్ఞార్థమై
కర్మలను ఆచరించువాడును
అగుమనుజుని యొక్క కర్మ
సంపూర్ణముగ నశించి పోవుచున్నది.

Master of himself , having made himself one with the universe he doesnot live for the self but for "Atma" or the self which is the same as the self of the universe. His threfore will be the utmost freedom of Action and freedom of will. C. F .the source verses from the upnishads;

(1) Chaa up 7.25 . 2 verily it is Atman above, Atman below, Atman in the front, Atman in the rear, Atman on the right, Atman on the left. He who seeing this, beliving this, realising this, reveals in Atman, sports with Atman, enjoys the company of Atman, seeks all his joy in Atman. He has swarajya. He has complete freedom of movement in all the three worlds.

(2) Mund 3-1,4" He who has known Atman, sports with Atman, reveals in Atman, is ever in action and the best among all the knowers of "Brahaman". What is activity would be no one can say, no scripture may lay down. That the very fact of his life inthe flesh will be synonymous with the good of the world is certain. C.F Mahaparinibbna sutta,33 "Be ye as those who have the Atman as their light. Be ye as those who have the Atman as their refuge. Be take yourselves to no external refuge.

"నైవతస్య కృతేనార్థో
నాకృతేనేహ కశ్చన
న చాస్య సర్వభూతేషు
కశ్చిదర్థ వ్యపాశ్రయః" శ్లో -18

అట్టి ఆత్మనిష్ఠుడైన వానికి
ఈ ప్రపంచమునందు కర్మలను
ఆచరించుటవలన ఎట్టి ప్రయోజనము
లేదు, చేయకపోవడం వలన
కూడ ఎట్టి దోషమును అంటదు
స్వప్రయోజనార్థము అతడు ఏ
ప్రాణిని ఆశ్రయించనవసరంలేదు.

"తస్మాదసక్తః సతతం
కార్యం కర్మసమాచర
అసక్తోహ్యా చరన్ కర్మ
పరమాప్నోతి పూరుషః" శ్లో - 19

కనుక నీవు
ఫలాపేక్ష లేనివాడవై
నీనియమిత కర్మను నీవు
సదా ఆచరించు చుండుము
ఫలాపేక్ష లేక కర్మలను
ఆచరించు మనుజుడు
మోక్షమును పొందును

"కర్మణైవ హి సంసిద్ధి
మాస్థితా జనకాదయః
లోక సంగ్రహ మేవాపి
సమ్పశ్యన్ కర్తు మర్హసి" శ్లో - 20

జనకుడు మున్నగువారు
ఈనిష్కామకర్మమును
ఆచరించినందువలననే
మోక్షమును పొందిరి
లోక సంగ్రహము కొరకైనను
నీవు కర్మలను ఆచరించవలసిందే

Janaka was the philospher king of Mithila whose name is always cited in India as the stock instance of compleate self realization and incessant self less activity. His sense of "mine" was estinguished to such as extent that when he was told that his capital was on fire, he is said to have exclaimed; if Mithila is on the fire nothing that is mine is on fire." Tilak quotes a verse from Aswaghosha's Budda charita indicating the reputation that Janaka had won; "Janaka obtained the position of Acharya (preceptor) in Yogavidhi (selfless action) a position never before won by any one else"

From the Gospel of Self less Action pages 178.179

"జనకుడు, అశ్వపతి, ఇక్ష్వాకుడు, ప్రహ్లాదుడు, అంబరీషుడు, భగీరథుడు మున్నగుచక్రమ్తులు" అని ౨౦వ శ్లోకం రెండవ పాదంలో జనకాదయః అన్నపదానికి అర్థము.

దాని నుండి గ్రహించవలసిందేమిటంటే ఈ నిష్కామ కర్మ కొత్తదేమీకాదని, పూర్వం అనేకమంది రాజులు ఈ నిష్కామ కర్మయోగమును ఆశ్రయించి ముక్తిధామము చేరుకున్నారని, అర్జునుడు కూడా ఈ యోగాన్ని అవలంబిస్తే పై వారి స్థాయిని చేరుకో వచ్చునని భగవానుడు తెలిపాడన్న సత్యమును గ్రహించగలందులకై ఈ ఉదాహరణను ఇవ్వడం జరిగింది.

"యద్య దాచరతి శ్రేష్ఠ
స్తత్త దేవేతరో జనః
సయత్ప్రమాణం కురుతే
లోకస్తదనువర్తతే" శ్లో - 21

శ్రేష్ఠుడైన వాడు దేనిని ఆచరించునో
ఇతరులు కూడా అద్దానినే ఆచరించెదరు
శ్రేష్ఠుడు దేనిని ప్రమాణముగ స్వీకరించునో
ఇతరులు దానినే ప్రమాణముగ యెంచెదరు

"నమేపార్థాస్తి కర్తవ్యం
త్రిషులోకేషు కించన
నానవాప్తమ వాప్తవ్యం
వర్తఏవచ కర్మణి" శ్లో - 22

అర్జునా!
నాకు ఈమూడు లోకములందును
చేయదగిన కార్యము ఏదియును
లేదు, పొందబడనిదియును
పొందతగినదియును అగు వస్తువు
ఏదియును లేదు, అయినను నేను
కర్మములను ఆచరించుచున్నాను

ఈ మాటలు చెప్పిన శ్రీకృష్ణభగవానున్ని ఉద్దేశించి మహర్షి వినోబా హృదయాన్ని పులకింపజేసే మాటలతో ఏమన్నాడో చూడండి.

మహాభారతయుద్ధంలో- సూర్యాస్తమయంకాగానే అందరును సంధ్యావంద నమునకై వెళ్లేవారు. కాని శ్రీ కృష్ణభగవానుడు రథాశ్వములను విప్పి వాటికి నీరు పెట్టుట, దాణా వేయుట, వాటి శరీరాలలో గుచ్చుకొన్న బాణములను తీసివేయుట, పసరుమందులు వేసి వాటి గాయములను మాన్పుట మొదలుగాగల పనులలో వుండెడివాడు. ఆ సేవ ఆయనకెంతయో ఆనందదాయకమై యుండెను"

గీతా ప్రవచనములు - 3-IIపేజి 40

"కర్మయోగులలో కర్మయోగి అయిన ఆ పరమేశ్వరుడు గుఱ్ఱములకు దాణా పెట్టినాడు. రాజసూయ యాగములో ఎంగిలి విస్తళ్లు ఎత్తివేసినాడు. అడవిలో ఆవులను మేపినాడు"

"గుర్రములకు దాణాపెట్టువాడు, గోవుల కాపరి, రథసారథి, ఎంగిలివిస్తళ్లు ఎత్తివేయువాడు, నేలను అలుకువాడును అయిన కర్మయోగిని మహాత్ములు పరమేశ్వరునిగ నిరూపించినారు. మహాత్ములు కూడా స్వయముగ కుట్టుపనియో, కుమ్మరి పనియో, నేతపనియో, తోటమాలి పనియో, ధాన్యమును దంచు పనిలోనో, పిండిని విసరుటయందో, వర్తకమో, లేక మంగలి పనియో, చెప్పలు కుట్టుపనియో చేయుచు ముక్తిని పొందిరి' (గీతా ప్రవచనములు 36 పేజి)

For, "I am ever in Action; one may even say out biblical language , I live and move and have may being in action; for the verb " varte"has all that cannotation"

From the Gospel of Self less Action page 180

"యది హ్యహం నవర్తేయం
జాతు కర్మణ్య తంద్రితః
మమ వర్మ్యాను వర్తన్తే
మనుష్యాః పార్థ సర్వశః శ్లో - 23

అర్జునా!
నేను అప్రత్తుడనై కర్మలను
ఆచరించకుండు నేని తద్వారా
ప్రజలు సర్వవిధాల చెడిపోయెదరు
అపుడు సంఘమునందు ఏర్పడే
అన్యాయాలు, అక్రమాలు, విధ్వంసక
చర్యలకు బాధ్యత నాదే అగుతుంది
దానివలన ప్రజలను నేను చెడ
గొట్టిన వాడనగు చున్నాను

"ఉత్సీదేయురిమేలోకా
నకుర్యాం కర్మచేదహం
సంకరస్యచ కర్తా
స్యా ముపహన్యా మిమాః ప్రజాః" శ్లో-24

నేను కర్మలు చేయని ఎడల
ఈ లోకములన్నియు నశించును
అపుడు సంఘమునందు
ఏర్పడు వివిధ దురాచారాలను
నేను ప్రోత్సహించినవాడనగుచున్నాను

"సక్తాః కర్మణ్య విద్వాంసో
యథా కుర్వంతి భారత
కుర్యాద్విద్వాం స్తథాసక్త
శ్చి కీర్షుర్లోక సంగ్రహమ్" శ్లో - 25

అర్జునా!
అజ్ఞానులగు జనులు
ఫలాసక్తితో కర్మలను
ఆచరించుచున్నారు, కాని
జ్ఞానులైన వారు ఫలాపేక్ష
లేనివారై లోక సంగ్రహార్థం
కర్మలను ఆచరించవలెను

"న బుద్ధి భేదం జనయేత్
అజ్ఞానాం కర్మ సంగినాం
జోషయే త్సర్వ కర్మాణి
విద్వాన్ యుక్తః సమాచరన్"శ్లో - 26

జ్ఞాని అయినవాడు కర్మ
ఫలాసక్తులైన అజ్ఞానుల
బుద్ధిని కలతపెట్టరాదు
తాను యోగ యుక్తుడై
సమస్త కర్మములను
ఆచరించుచూ, తన
యాచరణల వలన ఇతరులు
తనను అనుసరించునట్లు చేయవలెను

"ప్రకృతే క్రియ మాణాని
గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా
కర్తాహ మితిమన్యతే" శ్లో - 27

ప్రకృతి వలన పుట్టిన సత్వరజస్తమో
గుణముల చేతనే సమస్త కార్యము
లకు తానే కర్తయని అహంకారము
వలన వివేక శూన్యుడై తలంచుచున్నాడు

"తత్త్వవిత్తు మహోబాహోః
గుణకర్మ విభాగయోః
గుణా గుణేషు వర్తన్త
ఇతి మత్వాన సజ్జతే" శ్లో - 28

వీరుడవు అగు ఓ అర్జునా!
గుణముల యొక్కయు
కర్మముల యొక్కయు
విభజనను గూర్చిన యథార్థ
మెరిగిన జ్ఞాని యొక్క గుణములు
(ఇంద్రియములు) గుణముల యందు
(ఇంద్రియ విషయములందు) ప్రవర్తించు
చున్నవని తలంచి కర్మములందు
ఆసక్తి లేకుండా యుండును

ప్రపంచమునందును, దేహమునందును "ఆత్మ- అనాత్మ దృక్కు- దృశ్యము" కలిసి యున్నవి. ఆరెండింటిని విడదీయ వలెను. తత్వవేత్త అయిన వాడు వాటిని విభజించ గలడు. అటుల విభజింప శక్తిగల వానినే తత్వ వేత్త అని అందురు.

కఠోపనిషత్తు షష్ఠవల్లిలో 17వ శ్లోకం ఈ విధంగా వుంది.

" అంగుష్ఠ మాత్రః పురుషోంత రాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః
త్వం స్వాచ్ఛరీరాత్ ప్రవృహేన్ముంజాదివేషీకాం ధైర్యేణ
తం విద్యాచ్ఛుక్రమమృతం తంవిద్యాచ్ఛుక్రమ మృతమితి"

**తాత్పర్యం :** అంతరాత్మ అయిన పురుషుడు బొటన వ్రేలంత వాడు సర్వదా ప్రాణుల హృదయాల్లో నివసిస్తూ వుంటాడు. శరీరము నుండి అతనిని గడ్డిలోనున్న లోపలి పోచను లాగావేరుచేయాలి. అతడే పరిశుద్ధుడు, అమరుడు అని తెలుసుకోవాలి.

**వివరణ :** "జ్ఞాని (తత్వజ్ఞుడు) ఆత్మానాత్మ వివేకము కలవాడగుటచేత అతడు తనలోని ఆయా గుణములు ఆయాకార్యములందు ప్రవర్తించు చున్నవే కాని "ఆత్మ" యగు తానేమియు చేయుట లేదు అని నిశ్చయించి కార్యము లందు సంగవర్జితుడై మెలగును"

ఆసక్తితో కర్మలను చేయువారి చిత్తమును కదలించరాదనియు తాను చక్కగా అనుష్ఠించి అవతలి వారిని కూడా సక్రమమైన దారికి తీసుకొని రావలయుననియు ఇదివరలో తెలిపిన భావములనే భగవానుడు తిరిగి నొక్కి చెప్పు చున్నాడు.

"ప్రకృతేర్గుణ సమ్మూఢాః
సజ్జన్తే గుణకర్మసు
తానకృత్స్న విదోమందాన్
కృత్స్న విన్న విచాలయేత్" శ్లో - 29

ప్రకృతి గుణముల చేత
సమ్మోహితులై ఫలాపేక్షచే
కర్మలను జేయు మందమతు
లగు అల్పజ్ఞులను జ్ఞానులైన
వారు చలింపజేయగూడదు

ఈ అధ్యాయములో 26శ్లోకములో చెప్పిన భావాన్నే తిరిగి ఇక్కడ చెప్పడమైంది. జాగ్రత్త కొరకు చెప్పిన విషయాన్ని మరల మరల చెప్పటము తత్వవేత్తల (పెద్దల) యొక్క ప్రధాన లక్షణముగా గుర్తించవలెను.

మయిసర్వాణి కర్మాణి
సంన్న్యస్యా ధ్యాత్మచేతసా
నిరాశీర్నిర్మమో భూత్వా
యుధ్యస్వ విగతజ్వరః శ్లో - 30

సమస్త కర్మలను నాయందు
ధ్యానబుద్ధితో సమర్పించి
ఆశ, మమకారము, సంతాపము
లేనివాడవై నిశ్చింతగ యుద్ధము
చేయుము

"యేమే మతమిదం నిత్యం
అనుతిష్ఠన్తి మానవాః
శ్రద్ధావంతో నసూయంతో
ముచ్యంతే తేపి కర్మభిః          శ్లో - 31

శ్రద్ధగలవారు, అసూయ లేనివారు
అగు ఏ మనుజులు నా ఈ అభి
ప్రాయమును ఎల్లప్పుడు అనుస
రించు చుందురో అట్టివారు
కర్మబంధముల నుండి విడివడుచున్నారు

"యేత్వేత దభ్యసూయంతో
నాను తిష్ఠన్తి మేమతం
సర్వజ్ఞాన విమూఢాస్తాన్
విద్ధినష్టాన చేతసః"          శ్లో - 32

నా ఈ అభిప్రాయమును ఎవరు
ద్వేషించి అనుసరించకుండ యుందురో
అట్టివారు మూర్ఖులు, జ్ఞానహీనులు
భ్రష్టులు అని గ్రహించుము

"సదృశం చేష్టతే స్వస్యాః
ప్రకృతేర్జ్ఞానవానపి
ప్రకృతింయాంతి భూతాని
నిగ్రహః కిం కరిష్యతి"          శ్లో - 33



జ్ఞానవంతుడైనను మానవుడు తాను
ప్రకృతిననుసరించి యే
ప్రవర్తించు చున్నాడు
ప్రాణులన్నీ తమ ప్రకృతి
ననుసరించియే చరించు
చున్నవి, కనుక నిగ్రహము
ఏమియును చేయలేదు

ఇచట పూర్వజన్మ సంస్కారము యొక్క ప్రాబల్యమును వచించడమే ముఖ్యమైన అంశం. అంతే తప్ప నిగ్రహము యొక్క నిరుపయోగత్వము వివక్షితము కాదు. అట్లు కాకున్న ఎడల మరుసటి శ్లోకములో ఇంద్రియములకు లోబడక వానిని నిగ్రహించవలెను అని భగవానుడు చెప్పియుండడు

గీత ఆరంభమైన మొదలు - "దుష్టసంస్కారమును వీడండి - కామమును పార ద్రోలండి. క్రోధమును అరికట్టండి. ఇంద్రియములను నిగ్రహించండి" అని ప్రబోధించిన భగవానుడు ఇక్కడ ఈ శ్లోకములో నిగ్రహము వలన ప్రయోజనము లేదని ఎందుకు వచించును? లేదు, జన్మాంతర వాసనల యొక్క సంస్కారముల యొక్క దృఢతరశక్తిని గూర్చి వర్ణించుచూ ఇట్లు చెప్పవలసి వచ్చింది. అంతే

ప్రతివాడు తన ప్రకృతిననుసరించియే వర్తించుచో ఇక కర్మబంధముల నుండి విముక్తుడగుటకు అతడేమి చేయవలెను అను ప్రశ్నకు భగవానుడు సమాధానం చెప్పుచున్నాడు.

"ఇంద్రియ స్యేంద్రియస్యార్థే
రాగద్వేషౌవ్యవస్థితౌ
తయోర్న వశ మాగచ్ఛేత్
తౌహ్యస్య పరిపంథినౌ" శ్లో 34

ప్రతి ఇంద్రియమునకును
తత్సంబంధిత ఇంద్రియ
విషయమునందు రాగ
ద్వేషములు ఏర్పడియున్నవి
వాటికి ఎవరును వశులు
కాకూడదు, రాగద్వేషములు
జ్ఞానికి ప్రబల శత్రువులు

"శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః" శ్లో - 35

పరధర్మము కంటే
స్వధర్మము మేలైనది
స్వధర్మమునందు
మృత్యువు సంభవించినను
అది శ్రేయస్కరమే
పరధర్మము భయంకరమైనది

One man's duty may be to serve the community by working as a sweeper, another's may be to , work as an accountant. An acountants work may be more inviting but that need not draw the sweeper away from his work. Should he allow himself to be drawn away he would himself be lost and put the community in to danger. Before God the work of man will be Judged by the sprit in which it is done, not by the nature of the work which makes no defference what so ever. Who ever acts in a spirit of dedication fits himself for salvation.

CF Epictetus who , though a slave, conqured his slavery by becoming the slave of God. Remember you are an actor in a drama of such a kind as the author pleases to make to make it. if short, of a short one, if long , of along one. If it be His pleasure you should be a poor man a cripple, a Governor or a Private person, see that you act it naturally. For this is your business -to act well the part assigned to you; to choose it is another's". Also Koran. "It may happen ye hate a thing which is good for you, and it many happen that you love a thing which is bad for you. Allah knoweth , you know not". (2-216)

Gandhiji bases his doctrin of Swadeshi on this verse "pure service of ones neighbours connot be disservice to those who are remotely situated; rather the contrary. A man who allows himself to be lured by the distant sene and runs to the ends of the earth for service, is not only foiled in his ambition but fails also in the duty to wards his neighbours. That seems to me to be the sense of the verse. Interpreted in terms of ones physical environment this gives us the law of Swadeshi. Swadeshi is Swadharma applied to ones immediate environment" (YoungIndia, 18th June 1931)

వివరణ : కష్టముగా తోచినను స్వధర్మమే మేలైనది. సుఖంగా వుందనిపించినను పర ధర్మము భయంకరమైనది. స్వధర్మము ఉన్నతిని కలుగజేస్తుంది. స్వధర్మ పాలన నిర్వహణలో ఒకవేళ మరణము సంభవించినను అది జీవునకు శ్రేయస్కరమైనటువంటిది.

ఈ విధముగ పరధర్మమును ఆశ్రయించుటగాని, చెడు కార్యములు చేయుట గాని దుఃఖప్రదము లైనటువంటివని తెలిసినప్పటికీ మనుష్యుడెందుకు వాటి వైపు బలవంతంగా లాగబడుతున్నాడు అనుశంక అర్జునునిలో ఉదయించింది. దాని గూర్చి భగవానుని ఈ విధంగా ప్రశ్నిస్తున్నాడు.

"అథకేన ప్రయుక్తోఽయం
పాపంచరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ!
బలాదివ నియోజితః" శ్లో - 36

కృష్ణా !
అయితే తనకు ఇష్టము లేకున్నను
మనుజుడు దేని చేత ప్రేరేపించ
బడి బలాత్కారముగ పాప
కార్యములను ఆచరించుచున్నాడు?

అర్జునుని ప్రశ్నకు భగవానుడు ఈ దిగువ శ్లోకముల ద్వారా సమాధాన మొసంగుచున్నాడు.

"కామ ఏష క్రోధ ఏష
రజో గుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా
విద్ధ్యేన మిహ వైరిణమ్ శ్లో - 37

రజోగుణము వలన పుట్టిన
కామము సఫలము
కానపుడు అది క్రోధ
రూపమును పొందుచున్నది
ఈకామమునకు తృప్తి అంటూ
లేదు, ఇది పాప భూయిష్టమైనది
ఆత్మయోగమునకు అది శత్రువు
ఈ విషయాన్ని తెలుసుకో

"ధూమేనా వ్రియతే వహ్ని
ర్యథా దర్శో మలేనచ
యథోల్బేనావృతో గర్భ
స్తథా తేనేదమావృతమ్"  శ్లో - 38

పొగచేత నిప్పు, మురికిచేత
అద్దము, మావిచేత గర్భమందున్న
శిశువు కప్పబడియున్నట్లు
కామము వలన జ్ఞానము
కప్పబడియున్నది

"ఆ వృతంజ్ఞాన మేతేన
జ్ఞానినోనిత్య వైరిణా
కామ రూపేణ కౌంతేయ!
దుష్పూరేణానలేన చ"  శ్లో -39

అర్జునా!
ఎన్నటికి తీరనిదియును
అగ్నివలె తృప్తిచెందనిదియును
జ్ఞానులైన వారికి నిత్యశత్రువును
ఆశారూపమైనదియును అగు
కామము చేత జ్ఞానము
ఆవరింపబడియున్నది

" ఇంద్రియాణి మనోబుద్ధి
రస్యాధిష్ఠా నముచ్యతే
ఏ తైర్వి మోహయత్యేష
జ్ఞానమావృత్య దేహినమ్"  శ్లో - 40

ఈ కామమునకు ఇంద్రియములు,
మనస్సు, బుద్ధియును, ఆశ్రయము
లై యున్నవి, ఈ ఇంద్రియముల
చేత కామము జ్ఞానమును ఆవరించి
మనుజునికి మోహమును కల్గించుచున్నది

తస్మాత్వ మింద్రియాణ్యాదౌ
నియమ్య భరతర్షభ!
పాప్మానం ప్రజహిహ్యేనం
జ్ఞాన విజ్ఞాన నాశనమ్"  శ్లో - 41

అర్జునా!
అందువలన నీవు మొదట
ఇంద్రియములను నిగ్రహించి
జ్ఞాన విజ్ఞానములను
నాశనము జేయునట్టిదియును
పాపభూయిష్టమును అయినదియగు
ఈ కామమును పూర్తిగా విడిచివేయుము

కామమును పూర్తిగా విసర్జించి శ్రీ మహా విష్ణువు యొక్క పరమపదాన్ని చేరుకోడానికి కఠోపనిషత్తు తృతీయవల్లి 9వ శ్లోకం ఈవిధంగా తెలుపుతున్నది.
విజ్ఞాన సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః
సోద్వనః పారమాప్నోతి తదొవిష్ణో పరమం పదం
తాత్పర్యం : విజ్ఞానమే, బుద్ధి సారధిగా గలవాడు, మనస్సే చాకచక్యంతో పట్టుకోబడిన కళ్లెం అయినవాడూ అయిన మానవుడు ప్రయాణపు గమ్యమైన - విష్ణువు యొక్క పదాన్ని చేరుకుంటాడు. విష్ణువు "సర్వవ్యాపి అయిన ఆత్మ"

"ఇంద్రియాణి పరాణ్యాహు
రింద్రియేభ్యః పరంమనః
మనసస్తు పరాబుద్ధిః
ర్యో బుద్ధేః పరతస్తు సః"  శ్లో - 42

దేహము కంటెను ఇంద్రియములు
గొప్పవి, ఇంద్రియములకంటెను
మనస్సు గొప్పది, మనస్సుకంటెను
బుద్ధి గొప్పది, బుద్ధికంటెను
గొప్పవాడెవడో అతడే "ఆత్మ"
యని పెద్దలు చెప్పుదురు

ఇదే విషయము కఠోపనిషత్తు తృతీయవల్లి 10-11 శ్లోకాలలో ఈ విధంగా చెప్పబడింది.

" ఇంద్రియేభ్యః పథాహ్యర్థా అర్థేభ్యశ్చ పదం మనః
మనసస్తు పరా బుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్ పదః" కఠఉ -10

" మహతః పరమవ్యక్తాత్ పురుషఃపదః
పురుషాన్న పదం కించిత్ సాకాష్ఠా సపరాగతిః" కఠఉ - 11

**తాత్పర్యము** : ఇంద్రియాలకంటే వాటి విషయాలు శ్రేష్ఠమైనవి. విషయాలకంటె మనస్సు గొప్పది. మనస్సు కంటె బుద్ధి ప్రశస్తమైనది. బుద్ధి కంటె కూడా ప్రశస్తమైనది "మహత్తు", అవ్యక్తం మహత్తుకంటే ఉత్కృష్ఠమైనది. ఆ అవ్యక్తాని కంటే కూడా పరమోత్కృష్టమైనది పురుషుడు, ఆ పురుషుని మించినది మరేమీ లేదు. అదే చరమ సీమ, అదే పరమ గమ్యము.

"ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా
సంస్తభ్యా త్మానమాత్మనా
జహిశత్రుం మహాబాహో
కామరూపం దురాసదమ్" శ్లో - 43

అర్జునా!
"ఆత్మ" బుద్ధికంటెను
పరమపదమైనదని
తెలుసుకొని ఆ బుద్ధి
చేత దేహేంద్రియములను
మనస్సునునిగ్రహించి
అజేయమైన
కామము అనెడి శత్రువును
సంహరించుటకు ఉద్యుక్తుడవుకమ్ము

"When man realizes him,
his mind will be under his control.
not swayed by the senses. And
when the mind is conqured, what
power has Lust? It is indeed
a subtkle enemy, but when
once the senses, the mind and
the reason are under the control
of subtlemost self, Lust is
estinguished"

From the Gospel of Self less action by
Mahatma Gandhi. page 188

ఈ కర్మయోగమును గూర్చి చివరగా మహర్షి వినోబా ఏం చెప్పారో పరిశీలించి ఈ అధ్యాయాన్ని ముగిద్దాం.

# కర్మయోగి

"కర్మయోగి ఫలాశను వదులుటవలన అనంత ఫలములను పొందును. అతని శరీర యాత్ర నడుచుచునే యుండును. దేహము, బుద్ధియును తేజస్వంతములై యుండును. తానుండు సమాజము సుఖవంతమై యుండును. అతనికి చిత్తము పరిశుద్ధమై జ్ఞానము కూడా లభించును. ఇంతేకాదు సమాజ జీవితంలో మోసమును, కపటమును పోయి పవిత్రా దర్మము చేజిక్కును. కర్మయోగికి ఈ మహిమ అనుభవసిద్ధము"

కర్మయోగి తన కార్య క్రమములను ఇతరుల కంటే ఉత్కృష్ఠరీతిని నిర్వహించును. అతనికి కర్మయే ఉపాసన. కర్మ యేపూజ. మనము భగవంతుని పూజించి అతనికి సమర్పించిన నైవేద్యమును తిరిగి ప్రసాద రూపమున తీసుకొందుము. కాని ఈ ప్రసాదము ఆ పూజయొక్క ఫలమా, కాదు- ప్రసాదము నిమిత్తము పూజచేయువానికి అది వెనువెంటనే లభించును. కాని కర్మయోగి పూజరూపమైన కర్మల ద్వారా భగవద్దర్శనము అను మహోఫలమును వాంఛించును. ప్రసాదము దొరికిననే చాలునన్నంత తక్కువ విలువను అతడు కర్మకు ఈయడు. కర్మ యొక్క విలువను తగ్గించుటకు అతడేమాత్రమును సమ్మతించడు. స్థూలమైన కొలబద్దతో దానిని నతప్పడును కొలవడు. స్థూల దృష్టి కలవానికి లభించు ఫలము కూడా స్థూలముగనే వుండును. "లోతుగా నాటుము. కాని తడిపి నాటుము" అని రైతులలో ఒక సామెత వుంది. లోతుగా దున్నినంత మాత్రమున ప్రయోజనములేదు. అడుగున తడి కూడా వుండవలెను. లోతు తడి రెండును వున్నచో పైరు మొక్క మణికట్టు లావున వెన్ను వేయును. కర్మ గంభీరమైనది అంటే ఉత్కృష్టమైనది అయి వుండవలెను. కర్మయోగి కర్మను ఉత్కృష్ఠముగ ఆచరించి దానిని ఈశ్వరార్పితము చేయును. పరమార్ధమును గూర్చిన కొన్ని అపోహలు కలవు. అవేమిటంటే పరమార్ధ సాధకుడు, కాలు చేయి కదప నక్కర లేదని. ఖద్దరు నేయుట కూడా పరమార్ధమా? అని కొందరు ప్రశ్నిస్తున్నారు. మరి భోజనము చేయుట కూడా పరమార్ధమా? యని వీరు ప్రశ్నించుకోరు.

మానవులీనాడు దివ్యమైన కర్మయోగ వ్రతమునుండి పడిపోవుచున్నారు. దానికి కారణములు రెండు. ఇంద్రియముల విశిష్ఠస్వభావమును మనం జ్ఞప్తియందుంచు కొనవలె. మన ఇంద్రియములు ఎల్లపుడు 'ఇది కావలెను- అది అక్కర లేద' ను అన

ద్వంద్వములచేత చుట్టబడియున్నది. కనుక కావలసిదాని యెడల అనురాగము, అక్కరలేని దాని ఎడల ద్వేషమును మనస్సునందు ఉత్పన్నమగును. ఇట్టి రాగద్వేషములును, కామ క్రోధములును, మనుష్యుని పీక్కొని తినుచుండును. కర్మ యోగము స్వయముగా శ్రేష్ఠమును, రమణీయమును, అనంత ఫలదాయకమును అయివున్నది. కాని ఈ కామ క్రోధములు ఇది తీసుకొనుము దానిని వదిలిపెట్టుము అను పోరాటమును మన గొంతుకకు చుట్టి మనలను విడువక బాధించును. కనుక ఈ అధ్యాయము చివర, వీని సంపర్కమును వదులుకొనుము. వీని నుండి బయట పడుము. అపాయము జాగ్రత్త అని భగవానుడు హెచ్చరించినాడు. స్థిత ప్రజ్ఞుడు సంయమన మూర్తి అయినట్లే కర్మయోగి కూడా కావలె.

(6-3-22. గీతా ప్రవచనాలు, ధూళిజైలులో)

ఈశా వాశ్యోపనిషత్తు కర్మయోగి లక్షణాలను ఈ విధంగా వర్ణించింది.

"ధర్మ కర్మలు జేయుచునే
నిరతము నూరేండ్లు బ్రతుకు నెంచవలయున్
మరొకగతి లేదు నీకిక
అరసి ఇటుల చేయు కర్మలంటవు నరునిన్"

***ఈ విధంగా ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును***
***శ్రీకృష్ణార్జున సంవాద రూమును అయిన***
***శ్రీ మద్భగవద్గీత యందలి కర్మయోగమను పేరుగల***
***మూడవ అధ్యాయము సమాప్తముగావించబడింది***



# గీతా సంహిత

**అధ్యాయము నాలుగు** | **జ్ఞాన యోగము**

వెనుకటి అధ్యాయంలో మనము నిష్కామ కర్మమును గూర్చి వివేచన చేసితిమి. స్వధర్మమునకు స్వస్తి చెప్పి మధ్య వచ్చిన పర ధర్మమును మనము స్వీకరించినచో నిష్కామ రూపమైన ఫలమును పొందలేమని తెలుసుకొనవచ్చును. నిష్కామ ప్రాప్తి కొరకు మనం పరధర్మం నుండి విముక్తులం కావలయును. అయినప్పటికీ ఇది నిష్కామ సాధనకు ప్రారంభము మాత్రమే. పరధర్మము నుండి విముక్తులం అయినంతమాత్రము చేత మనం నిష్కామత్వ లక్షణమును చేరుకున్నట్లుకాదు.

నిష్కామత్వమనునది ఒక మానసిక వృత్తి. ఇది కలుగుటకు స్వధర్మాచరణ రూపమైన సాధన ఒక్కటే చాలదు.ఇతర సాధనలయొక్క సహకారము కూడా ఎంతో అవసరం. ఒక్క చమురు వత్తివున్నంత మాత్రమున దీపము వెలుగదు. దానికొక జ్యోతి కూడా వుండవలె. జ్యోతి వున్నపుడే అంధకారము తొలగిపోతుంది. మరి ఈ జ్యోతిని వెలిగించడం ఎట్లా? అని ఆలోచిస్తే ఇందుకుపరిశోధన అవసరం అని తేలుతున్నది. ఆత్మ పరీక్షణము ద్వారా చిత్తమాలిన్యమును కడిగిపారవేయవలెను. మూడవ అధ్యాయము చివరలో భగవానుడు ఈ విషయాన్నే చెప్పినాడు. దాని నుండియే ఈనాలుగవ అధ్యాయం పుట్టింది.

గీతయందు కర్మ శబ్దము "స్వధర్మము" అను అర్థముతో వ్యవహరింపబడింది. మనం తింటున్నాము. త్రాగుతున్నాము, నిద్రిస్తున్నాము, ఇవన్నియు కర్మలే. కాని గీతలోని కర్మ శబ్దానికి పై నున్నవేమియు సరైన అర్థములో సరిపడేవి కావు. కర్మయనగా స్వధర్మాచరణ అనియే గీతలోని అర్థము. కాని ఈ స్వధర్మమును ఆచరిస్తూ, నిష్కామత్వమును పొందుటకు మరియొక వస్తువు కూడా అవసరమై యున్నది. అదేమిటంటే కామ, క్రోధములను జయించడం,

మనస్సు గంగాజలము వలె నిర్మలమును, ప్రశాంతమును కానంత వరకు నిష్కామత్వము సిద్ధించదు. ఈ విధముగా చిత్త సంశోధన నిమిత్తము చేయుకర్మలనే గీత "వికర్మ" అంటుంది. "కర్మ- అకర్మ- వికర్మ" ఈ మూడు శబ్దాలకు ఈనాలుగవ అధ్యాయములో ఎంతోమహత్వమున్నది.

కర్మయనగా స్వధర్మాచరణము యొక్క స్థూల రూపము - ఈ బాహ్య కర్మలో చిత్తమును లగ్నము చేయడమే వికర్మ. మనము ఎవరికైనను నమస్కరించినపుడు శిరస్సును వంచి బాహ్య క్రియతో పాటే లోపలి మనస్సును కూడా వినయముతో వంచకపోతే ఆ బాహ్యక్రియ వ్యర్థము. అంతర్బాహ్యములు రెండునూ ఒకటి అయినపుడే శివలింగమునకు తెంపులేని జలధారలతో అభిషేకము చేయవచ్చును. ఆధారతోపాటే మానసిక చింతనము అను ధార కూడ అఖండముగ ప్రవహింపనిచో ఆ అభిషేకమునకు విలువలేదు. ఆ స్థితిలో శివలింగము ఒకరాయే, అభిషేకము చేయువాడు ఒక రాయియే అగును. 'రాయి -రాయి" ఎదురుగా కూర్చున్నట్లుగా దానిని అర్థము చేసుకోవలసి వుంటుంది. మనబాహ్య కర్మతో లోపలి నుండి చిత్తశుద్ధియను కర్మ కూడా కలిసినపుడే నిష్కామ కర్మ సిద్ధిస్తుంది.

ఈ విషయాన్నే ఈనాలుగవ అధ్యాయంలో భగవానుడు ప్రబోధిస్తున్నాడు.

ఈ అధ్యాయము నందు 42 శ్లోకాలున్నాయి.

1. భగవానుడు తన ప్రభావాన్ని గూర్చి వివరిస్తూ నిష్కామ కర్మను గూర్చి తెలుపుతాడు. *(1 నుండి 18 శ్లోకము వరకు)*
2. జ్ఞాని యొక్క పవిత్ర ఆచరణను గూర్చి తెలుపుతాడు.*(19 నుండి 23 శ్లోకము వరకు)*
3. వివిధ యజ్ఞముల వర్ణన. *(24 నుండి 32శ్లోకము వరకు)*
4. జ్ఞాని యొక్క మహిమ *(33 నుండి 42 శ్లోకము వరకు)*

ఈ అధ్యాయమున వివరింపబడిన ఈ నిష్కామ కర్మయోగ రూపమైన విద్య అతి ప్రాచీనమైనదని ఆదిలో భగవానుడే దానిని సూర్యునకు ఉపదేశింప అది సూర్యుని ద్వారా క్రమంగా "మనువు" మొదలైన మహర్షులు అవలంబించిరని తెలుపడంతో అధ్యాయం ప్రారంభమవుతున్నది.

ఇమం వివస్వతే యోగం
ప్రోక్త వా నహమవ్యయం
వివస్వాన్మనవే ప్రాహ
మనురిక్ష్వాక వేబ్రవీత్ శ్లో - 1

**అవ్యయమగు ఈ యోగమును**
**ఆదిలో నేను సూర్యునకు చెప్పి**
**యుంటిని, సూర్యుడు మనువు**
**నకును, మనువు ఇక్ష్వాకునకును**
**బోధించెను**

"ఏవం పరం పరా ప్రాప్త
మిమం రాజర్షయో విదుః
సకాలేనేహ మహతా
యోగో నష్టః పరంతప" శ్లో - 2

అర్జునా!
ఈ విధముగా పరంపరగా
వచ్చిన ఈ యోగమును
రాజర్షులు తెలుసుకొని
యుండిరి. చాలా కాలము
అయినందున ఇపుడీ యోగం
లోకమునందు ప్రచారములో లేదు

"సఏవాయం మయా తేద్య
యోగః ప్రోక్తః పురాతనః
భక్తోసి మే సఖాచేతి
రహస్యం హ్యేతదుత్తమం" శ్లో - 3

నీవు నాకు భక్తుడవు, చెలికాడవు
అయివున్నందున ఆపురాతనమైన
యోగమును గూర్చి తిరిగి ఇపుడు
నీకు నేను చెబుతున్నాను. ఇది
మిగుల శ్రేష్ఠమును, రహస్యమైనదియు
అని ఎరుగుము

ఒకటి, రెండు, మూడు శ్లోకములకు వివరణ :-

భగవానుడు అర్జుననకు బోధిస్తున్న ఈ పరమార్థ విద్య కొత్తగా ఆవిర్భవించినది ఏమీ కాదు. అనాది నుండి ఇది వున్నదే. అందువల్లనే మూడవ శ్లోకం మొదటిపాదం చివరలో పురాతనః అంటే అది పురాతనమైనది అని భగవానుడే ప్రకటించాడు. దేశకాల పరిస్థితులనుబట్టి ఎంతటి మహత్తరమైన విలువలున్న సందేశాలైనా కాలగర్భంలో కొంత కాలంపాటు కలిసి పోవడం పరిపాటి. అలాంటి సమయాల్లో దైవాంశ సంభూతులైన వారు అట్టిదానిని సముద్ధరించుటకు పూనుకొనెదరు. అర్జునుని ద్వారా ఈ ప్రాచీనమైన విద్యను భగవానుడు లోకానికి తిరిగి ప్రకటించాడు. అర్జుననకు ఎందుకు ఈ విషయాన్ని బోధించాలి? అనే ప్రశ్న కొందరిలో ఉదయించవచ్చు. దానికి జవాబుగా శ్రీకృష్ణుడు ఈ విధంగా తెలిపాడు.

"భక్తోసిమే సఖా చేతిరహస్యం" పరమభక్తుడవు, మిత్రుడవు కనుక నీకీ అతి రహస్యమైన దానిని ఉపదేశిస్తున్నాను అని ప్రకటించాడు. దానిని బట్టి ఎవరైనను గ్రహించవలసిందేమంటే అర్జునునివలె ఎవరైనను నిర్మల భక్తితో భగవానుని ఎడల ప్రవర్తించవలెనన్న అంశం. ఇక రెండవ శ్లోకం లోని రెండవపాదంలో "రాజర్షయః" అని ప్రకటించి యుండడం వలన రాజులైనవారు ఆధ్యాత్మిక విద్యయందు అనుభూతి కలిగిన వారై వుండవలెను అన్న అంశం స్పష్టపడుతున్నది. అంటే రాజులైన వారు వారి రాజత్వముతో పాటు ఋషత్వము కూడా కలిగి వున్నపుడే వారు ప్రజానురంజకంగా దేశపాలనా వ్యవస్థను, శాంతి భద్రతలను, సంక్షేమాన్ని కాపాడగలరన్న అంశాన్ని ఈ రెండవ శ్లోకం స్పష్టపరుస్తున్నది. "ఋషి" అనునది ఒక బిరుదులాంటిది. దీనిని ఎవరైనను పొందవచ్చును. ఆధ్యాత్మిక జ్ఞానాన్ని చక్కగా సాధించిన ఏమనుష్యుడైనను మహర్షి కాగలడు.

నిష్కామకర్మలను ఆచరిస్తూ, ఇంద్రియములను జయించి, మనస్సును స్వాధీన పరుచుకొని, కామాదులను నిర్జించి ఆత్మానుభవమును పొందినవారందరూ ఋషులే యగుదురు. దానికి ఈ కులము, ఆ కులము, ఈ మతము, ఆమతం, ఈ దేశము, ఆదేశము అన్న కుల, మత, ప్రాంతీయ భావాలు అడ్డురావు. పూర్వం ఎందరో రాజులు ఈ విధంగా రాజర్షులై ప్రజాను రంజకంగా పాలనను సాగించినట్లు అనేక ప్రాచీన గ్రంథాలు తెలుపుతున్న సంగతి అందరికీ విదితమే.

ఇక మొదటి శ్లోకంలో ఈ నిష్కామ కర్మ యోగమును గూర్చి తాను మొదట సూర్యునకు ఉపదేశించితినని భగవానుడు ప్రకటించడంలోని ఔచిత్యాన్ని గూర్చి అర్జునునిలో శంక ఏర్పడింది. ఏమిటి? ఈయన ఇట్లంటున్నాడు. ఇతను కేవలము మొన్న మొన్న ద్వాపరయుగాంతమున దేవకీ - వసుదేవుల గర్భాన జనించిన వాడు. నేనూ ఈయన సమకాలీనులము. సృష్ట్యాదినుండీ వుంటున్న సూర్యునకు ఎట్లు ఈయన ఈ విద్యను బోధించగలిగాడు అన్న సంశయంతో ఈ విధంగా ప్రశ్నిస్తున్నాడు.

"అపరం భవతో జన్మ
పరం జన్మ వివస్వతః
కథమేత ద్విజానీయాం
త్వమాదౌ ప్రోక్త వానితి" శ్లో - 4

కృష్ణా!
నీ జన్మము ఇటీవలది
సూర్యుని జన్మమో బహుపురాతనమైంది
అలాంటప్పుడు ఈయోగ విద్యను నీవు
సూర్యునకుపదేశించితినని చెపితే
నేనెట్లు నమ్మగలను?

ఈ ప్రశ్నకు సమాధానంగా భగవానుడిట్లు తెలుపుతున్నాడు.

బహూనిమేవ్యతీతాని
జన్మాని తవ చార్జున!
తా న్యహం వేద సర్వాణి
నత్వం వేత్థ పరంతప! శ్లో - 5

అర్జునా!
ఇంతవరకు నీకును, నాకును
అనేక జన్మలు గడిచినవి
ఆజన్మలన్నింటి విషయము
నాకు బాగుగా తెలియును నీకు
వాటి గురించి ఎంతమాత్రం తెలియదు

"అజోపిసన్న వ్యయాత్మా
భూతానా మీశ్వరోపిసన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ
సంభవామ్యాత్మ మాయయా" శ్లో - 6

నేను అజుడను, అవ్యయుడను
సర్వభూతనాధుడను, అయినప్పటికీ
స్వకీయమైన ప్రకృతి నాశ్రయించిన
వాడనై నామాయాశక్తి చేత అవతరించు
చున్నాను

"యదాయదాహి ధర్మస్య
గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య
తదాత్మానం సృజామ్యహమ్" శ్లో - 7

అర్జునా!
ఎప్పుడెప్పుడుధర్మమునకు
హానియును, అధర్మమునకు
వృద్ధియును కలుగుచుండునో
ఆ సమయాల్లో నన్ను నేను
సృజించుకొందును

"పరిత్రాణాయ సాధునాం
వినాశాయ చదుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగేయుగే" శ్లో -8

సజ్జనులను రక్షించుటకును
దుర్జనులను శిక్షించుటకును
ధర్మమును నెలకొలుపుటకును
నేను ప్రతియుగమునందును
అవతరించుచుందును

"జన్మ కర్మ చమే దివ్య
మేవంయో వేత్తి తత్త్వత:
త్యక్త్వా దేహంపునర్జన్మ
నైతిమామేతి సోర్జున" శ్లో - 9

అర్జునా!
ఎవడు ఈ విధముగ నాయొక్క
దివ్యమైన జన్మమును, కర్మమును
గూర్చి యధార్థముగ తెలుసుకొను
చున్నాడో అట్టివాడు ఈ శరీరమును
విడిచిన పిదప మరొక జన్మమునొందక
నన్నే (మోక్షమును) పొందుచున్నాడు

" వీత రాగభయ క్రోధా
మన్మయా మాము పాశ్రితా:
బహవో జ్ఞాన తపసా
పూతా మద్భావ మాగతా: శ్లో - 10

అనురాగము,భయము, క్రోధము
విడిచిన వారలై నాయందు అనన్య
మైన భావమునుంచి, నన్నే
ఆశ్రయించిన అనేకులు జ్ఞాన
మనెడి తపస్సుచే పావనులై
నా స్వరూపమును పొందుచున్నారు

"యేయథా మాం ప్రపద్యంతే
తాంస్తథైవ భజామ్యహం
మమవర్త్మాను వర్తంతే
మనుష్యాః పార్థః సర్వశః"    శ్లో - 11

అర్జునా!
నన్ను ఎవరు ఏవిధముగా
సేవింతురో వారిని ఆ విధము
గనే నేను అనుగ్రహింతును
మానవులు సర్వ విధముల
నామార్గమునే అనుసరించెదరు

"కాంక్షన్తః కర్మణాంసిద్ధిం
యజంత ఇహ దేవతాః
క్షిప్రంహిమానుషేలోకే
సిద్ధిర్భవతి కర్మజా"    శ్లో - 12

ఈ లోకమున కర్మఫల
ప్రాప్తిని కాంక్షించువారు
దేవతలను ఆరాధించుచున్నారు
అందువలన వారికి శీఘ్రముగ
కర్మఫల సిద్ధి లభిస్తున్నది

"చాతుర్వర్ణ్యం మయాసృష్టం
గుణకర్మ విభాగశః
తస్య కర్తారమపిమాం
విద్ధ్యకర్తార మవ్యయం"    శ్లో - 13

గుణములు, కర్మలను బట్టి
నాలుగువర్ణములు నాచే
సృజింపబడినవి. వాటికి
నేను కర్తనైనను, నన్ను
అవ్యయమైన వానిని గను
అకర్తగను గ్రహింపుము



ఈ శ్లోకము యొక్క అర్థాలను ముందుగా పరిశీలించి చూద్దాం

చాతుర్వర్ణ్యమ్ = నాలుగు వర్ణములు

గుణకర్మ విభాగః = సత్వ, రజ, స్తమోగుణముల వలన చేయబడు కర్మల యొక్కవిభజనను అనుసరించి మయా = నాచేత, సృష్ట్యం = సృష్టింపబడినవి తస్య = దానికి, కర్తారం అపి= కర్తనైనను, మాం= నన్ను అకర్తారం=కర్తనుగాని వానినిగను అవ్యయమ్ = నాశనము లేనివానిగను విద్ధి = ఎరుగుము

అనేక మంది "గీత" వ్యాఖ్యాతలు ఈ శ్లోకానికి నిర్వచనమిస్తూ "బ్రాహ్మణ-క్షత్రియ, వైశ్య- శూద్ర అను పదాలను వాడారు - ఈ శ్లోకములో వాస్తవానికి పైన తెలిపిన అర్థాల ప్రకారము బ్రాహ్మణ-క్షత్రియ- వైశ్య- శూద్రపదాలు లేనేలేవు. కాని ప్రతివ్యాఖ్యాత తమ వాఖ్యానంలో పై నాలుగు పదాలను ఎందువల్లనో ఏమో వాడతారు. ఇది అర్థం కాని విషయం. పూజ్యులు మహర్షి మలయాళస్వాముల వారు కూడా తమ వ్యాఖ్యానంలో ఈ పదాలను వాడడం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. గుణకర్మలు అంటే ఒక్కొక్క మనిషి నైజాన్ని, శక్తి సామార్థ్యాలను బట్టి, మానసిక పరిణతిని బట్టి, అతడు చేయదగిన పనిని బట్టి నిర్ణయించుకోవడము.

హిందూసమాజంలో వర్ణవ్యవస్థ అత్యున్నతమైనదని అందులో బ్రాహ్మణ వర్ణం అత్యుత్తమమైనదని చెప్పడానికి వర్ణాశ్రమాల పేరిట నాలుగు వర్ణాలను సృజించానని తెలివైన ఒక వర్గం భగవంతునిచేత పలికించింది. సాక్షాత్ భగవంతుడే అయిన ఆ శ్రీకృష్ణుడు చెప్పినపుడు మనం నమ్మకపోతే ఎట్లా? అని మనం నమ్ముతున్నాము.

యుధిష్ఠరుడు (ధర్మరాజు) తప్పని సరై మహా భారతయుద్ధంలో అశ్వత్థామ హతః కుంజరః, అన్నట్లు చాతుర్వర్ణము అంటూనే వెంటనే గుణకర్మల ప్రస్తావన తేవడం జరిగింది. ఒక్కొక్క వర్ణములో జన్మించడానికి గల అర్హతా అనర్హతలను గూర్చి మాత్రం ప్రస్తావించలేదు. కానీ ఈ రకమైన వర్ణాల వర్గీకరణకు తాను కర్తను అని భగవానునిచే పలికించారు. నేను పోషకుడను అని పలికించలేదు. సమస్త ప్రాణి కోటియొక్క పర్యవేక్షకుడు ఆ ఈశ్వరుడే. మానవులకు ఈ కర్మలను పంచేది ప్రకృతి మాత్రమే, ప్రకృతి ఈ కర్మలను వ్యక్తులకు పంచి ఇవ్వడము వారిని ఈ జన్మలకు పంపడం వారి పూర్వకర్మల వలన కాదు. అదికేవలం ఈశ్వర సంకల్పము వలన, పరిణామ క్రమంలో ఏ ఏ జీవులు పూర్ణత్వం సాధించాలో దానిని తెలుసుకొని ఈశ్వరుడు సంకల్పించి ఈశ్వరుడు వారి వారి జన్మలను నిర్దేశిస్తాడు. అందువల్లనే ఎవరి జీవిత విధానము వారిది అయింది. ఎవరి అనుభవాలు వారివి, జీవుడు ఈశ్వరసంకల్పంతో జన్మిస్తాడు. కనుక తనను తాను చక్క దిద్దుకొనే అవకాశం వుండదు. గత కర్మలు అనాదిగనక వాటిని పట్టుకుని వేలాడడం దుఃఖానికి హేతువు. ఒక్కొక్కజీవి పరిణామానికి చేసే సహాయము

అత్యల్పమే కావచ్చు. కాని ఈశ్వర మహాసంకల్పముతో దాని వాటా దానికుంటుంది. కనుక మనం పుట్టినపుడు ఈజీవితంలో మనం సాధించ వలసిన మహత్కార్యాల నమూనా ఏర్పడుతుంది. దానినే అదృష్టం అని, కర్మ అని తప్పుగా అర్థంచేసుకుంటున్నాము. అది పరమాత్మ ప్రేమతో మనకు అప్పగించిన బాధ్యత. అది మన పరిణతికి, పరిణామానికి దోహదం చేస్తుంది. ప్రకృతి-పరమాత్మ మనకు నిర్దేశించిన మహత్కార్యం ఇది.

ఈ ప్రపంచంలో జన్మించిన తరువాత ప్రాపంచిక అనుభవాలతో రంగరించి జ్ఞానం పొంది మనం దానిని సాధించవలసి వుంటుంది. అనేక నాటకాలలో బహుపాత్రలను పోషిస్తున్న నటుని వంటిది జీవుని (ఆత్మ)స్థితి. ప్రతిజీవి కూడ పరిణామ క్రియకు సహకరించి తీరవలసిందే, పూర్తి బాధ్యతలు స్వీకరించడానికి తగిన సాధన సంపత్తిని జీవుడు పొందివుండకపోవచ్చు. బాధ్యతలనుపొంది అర్హతను సంపాదించడానికి ముందు మానవుడు నిజమైన ముక్తుడు కావాలి. ఇపుడు మనం కర్తృత్వము లేని ఒక మహత్కార్యంలో పశువులుగా, పశుతత్వంతో జీవితాలను కొనసాగిస్తున్నాము. సృష్టిపుట్టినపుడు మనకు పూర్ణత్వము వుంది. మనకు అంటే మన ఆత్మలకు అని ఇక్కడ అర్థంచేసుకోవాలి. అందువల్లనే ఈశావాశ్యోపనిషత్తు మొదటి మంత్రములో

"పూర్ణము బ్రహ్మము జగమిది
పూర్ణమ, యాపూర్ణము నుండి పూర్ణమ వెడలెన్
పూర్ణంబగు నీ జగతికి
పూర్ణత్వము గూర్చి యింక పూర్ణమె మిగులున్" అని తెలుప బడింది.

అయితే మనం ఇపుడీ సంసార బంధంలో పడి పూర్ణత్వాన్ని కోలుపోయి, బాధలను అనుభవిస్తున్నాము. ఈ జీవితములో చేసిన తప్పులను మళ్లీ చేయకుండా జ్ఞానము పొందడము మనం చేయవలసిన ప్రధానమైనపని. ముందుగా ఆత్మను ఆవరించి వున్న మాయలను తొలగించుకోవాలి. కర్మ అంటే! అదే నిజమైన కర్మ. ఆ కర్మకు ప్రతివ్యక్తీ ప్రత్యక్షంగా బాధ్యుడు. ఇక వర్ణాల వర్గీకరణ విషయానికొస్తే ప్రాచీన కాలంలో అప్పటి సామాజిక పరిస్థితులను బట్టి అవి ఏర్పాటైనవేమో వేరుగా పరిశోధించి చూడాలి. ఆ పరిస్థితులు ఈనాడు లేవు. వర్ణాల వర్గీకరణ గురించి ఈ అధ్యాయంలో మరెక్కడా అగుపించదు. అయితే 18వ అధ్యాయము అయిన మోక్షసన్యాసయోగము అనే అధ్యాయంలో 41,42,43,44 శ్లోకాలలో బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-శూద్రుల ప్రస్తావన వుండడంతో పాటు వారి విధులు కూడా అక్కడ చెప్పబడ్డాయి. ఈ శ్లోకాలకు ముందుండే 40వ శ్లోకంలోనూ, తరువాత వచ్చే 45, 46వ శ్లోకాలను లోతుగా పరిశీలించి చూస్తే వాటి భావన ఈ విధంగా వుంది.

"ప్రకృతి వలన ఏర్పడే మూడు
గుణాలను జయించిన వారు
భూలోకములో గాని, స్వర్గ
లోకములోగాని, మానవులలో
గాని లేరనే చెప్పవచ్చు" 18-40

"ప్రతివ్యక్తి తనగుణ కర్మలను
నిర్వర్తించడం ద్వారా సిద్ధిని
పొందుతాడు. అది ఎట్లా సాధ్యమో
చెబుతావిను, సిద్ధి అనగా
అంతః కరణ శుద్ధి అని చెప్పుకోవచ్చు"18-45
ఎవనిచేత సమస్త ప్రపంచము
ఏర్పడి వ్యాపించబడి వున్నదో
ఎవరి వలన మనిషి తన కార్య
నిర్వహణ భారాన్ని కౌశలంతో
ఆచరించి యోగ్యతను పొందుతున్నదో
ఆ కర్మ సంస్కారముతోనె ఈశ్వరార్పణగా
అంతఃకరణ శుద్ధిని (సిద్ధిని) పొందుతున్నాడు

ఈ ప్రపంచాన్నంతా ఈశ్వరుడే ఆవరించి వున్నాడన్న సిద్ధాంతాన్ని మరువరాదు. ఇక 41,42,43, 44 శ్లోకాలను పరిశీలిద్దాము

బ్రాహ్మణ క్షత్రియవిశాం
శూద్రాణాం చ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని
స్వభావ ప్రభవైర్గుణైః

## ప్రతి పదార్థము

పరన్తప = అర్జునా! బ్రాహ్మణ క్షత్రియ విశాం= బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు, శూద్రాణాం+చ = శూద్రులకును, స్వభావ ప్రభవైః = స్వభావముచే కలిగిన, గుణైః = గుణములచేత కర్మాణి= కర్మములు, ప్రవిభక్తాని = వేరు వేరుగ విభజింపబడినవి. ఈ శ్లోకమునందు 4వ అధ్యాయంలోని 13వ శ్లోకంలో వలె ఎక్కడను "వర్ణ" శబ్దము ప్రతి పదార్థాలలో అగుపించదు. దాని తాత్పర్యము ఈ విధంగా వుంది.

వారి వారి గుణాలను బట్టి
బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్ర
అనే వర్గ విభజన జరిగింది.

దానిని బట్టి ఈ విభజన మానవుల గుణ కర్మలను బట్టి జరిగిన దానిగా భావించవచ్చు. జన్మను బట్టి గుణాలు ఏర్పడవు. మనిషిలోని ఆయా గుణాలు స్వభావాలు అతని అర్హతను నిర్దేశిస్తాయి. సమాజములో అతని స్థాయిని వర్గీకరిస్తాయి. అంతే తప్ప మోక్షమార్గాన్ని సూచించే గీతలో వర్ణాల విభజన వుండడానికి వీలు లేదు. జీవన సూత్రాలను ఆచరించడంలో కొందరు అర్హులు- మరి కొందరు అనర్హులు కానేకాదు. మానవసమాజము అవతరించినపుడే ఈ నాలుగు వర్ణాలు ఏర్పడ్డాయని చెప్పే మాటలకు ప్రయోజనము ఎంత మాత్రం లేదు.

అయితే సమాజ పరిణామములో కొన్ని కాలాలలో ఈ వర్గాలు అవసరమై వుండవచ్చు. తరువాత అవి క్రమంగా అంతస్థులను, తెలివి తేటలను బట్టి అంతరాలుగా ఏర్పడి చారిత్రక ప్రాచుర్యాన్ని పొందితే పొందివుండవచ్చు.

మనదేశంలో మాదిరే ఈనాడు కొన్ని వర్ధమాన దేశాలలో వర్ణవిభజన లేని చోట్ల కూడా తెల్లవారు-నల్లవారు- రెడ్ ఇండియన్స్ వంటి వర్ణజాతిభేదము వుంది. అయితే మనదేశములో వలె అక్కడ ఆదేశాల్లో మతం పేరిట వర్ణ, వర్గ విభేదాలు లేవు అన్న సత్యాన్ని గుర్తించాలి. అది అక్కడ కేవలం సామాజికమైన ఏర్పాటు మాత్రమే.

ఒక తరగతివారు మరొక తరగతి వారిని హీనంగా చూడడం అన్నది వారి వారి ఆర్థిక అంతస్థులు మేధాసంపదను బట్టి ఏర్పడినవే. మనిషిలోని 'అహం-స్వార్థం' ఈ రెండు ఈ వర్గవిభేదానికి కారణాలయ్యాయి. గీ త ప్రకారము ధర్మానికి ఎక్కువ విలువ వుంది. ప్రతిమనిషి స్వధర్మాన్ని అనుసరించాలి. పరుల ధర్మాన్ని తనదానిగా చేసుకోరాదు. అర్జునునికి శ్రీకృష్ణుడు చేసిన ప్రధానమైన బోధ ఇదే. హిందూమతంలో ఈవర్ణ విభజనకృతయుగాంతాన ఏర్పాటైందని భావించవచ్చు. కృతయుగాంతానికి ముందున్నది అంతా ఒకేవర్గం ఒక సమాజం కొంతపరిణామము తర్వాత కొంత వరకు సమాజ సంక్షేమదృష్ట్యా ఈ విభజన ఏర్పాటైందని భావించవచ్చు. దానినే పని విభజన అని కూడా చెప్పకోవచ్చు. ప్రభుత్వనిర్వహణలో -రాష్ట్రపతి- ప్రధానమంత్రి- కార్యదర్శి- సహాయకార్యదర్శి- పర్యవేక్షకుడు- బంట్రోతు వున్నట్లుగానే- అప్పట్లో సమాజం సంక్షేమం దృష్ట్యా వారి వారి గుణాలను బట్టి వర్గీకరణ జరిగి వుంటుంది. వాటిని పరిశీలిద్దాం.

బ్రాహ్మణ స్వభావముతో జన్మించిన
వారి జీవన చర్యలు శాంతియుతంగా
వుంటాయి. వారికి ఇంద్రియ
నిగ్రహము, శమదమాదులు, పవిత్ర
కార్యనిర్వహణ, క్షమ, కారుణ్యం
విజ్ఞానం, వివేకం, తపస్సు, భగవద్భక్తి
వుంటాయి. ఈ గుణాలున్నవారు ఎవరైనా బ్రాహ్మణులు అవుతారు.

**వివరణ :** "బ్రహ్మ కర్మ స్వభావజం" అనడంలో ఇక్కడ గుణానికే ప్రాధాన్యత వుంది. ఇది స్వభావరీత్యా ఏర్పరుచుకున్న గుణంకానీ జన్మవల్ల ఏర్పడింది. కాదు, "బ్రహ్మ కర్మ అనేది, జన్మజం కాదు, స్వభావము, బ్రాహ్మణ గుణాలు, లక్షణాలు సత్వగుణం వలన ఏర్పడతాయి. ఎవరిలో సత్వగుణం వుంటే వారిని బ్రాహ్మణులుగా గుర్తించాలి. అంటే హిందువులు కాని వారిలోను బ్రాహ్మణులు వుండవచ్చు. అందువల్లనే బుద్ధ భగవానుడు సాంప్రదాయ వర్ణ విభాగాలను గర్హించాడు. బ్రాహ్మణేతరులలో బ్రాహ్మణులు వున్నారని, బ్రాహ్మణులలో అబ్రాహ్మణులు వున్నారని ఖండితంగా పేర్కొన్నాడు బుద్ధ భగవానుడు.

"శౌర్యం- ప్రతాపం, ధైర్యం
సామర్థ్యం, యుద్ధంలో
పలాయనం కాకుండా
వుండడం, ఈశ్వర
భావనతో దానం చేయడం
క్షాత్రం యొక్క లక్షణాలు
వీటిన్నే క్షత్రియ కర్మలంటారు
ఇవి రాజలాంఛనాలు" 18-43

ఈ గుణాలున్న వారు ఎవరైనా క్షత్రియులు కావచ్చు, అంతే తప్ప జన్మతః ఎవరును క్షత్రియులుకానేకారు అట్లాగే

"వ్యవసాయం, గోసంరక్షణ
వ్యాపారము వైశ్యకర్మ
స్వభావాలు" 18-44
" దాస్య కర్మలు, సేవకావృత్తులు
కర్మలస్వభావం కలవారు
శూద్రులు 18-44

**వివరణ :** 44వ శ్లోకంలో తెలిపిన స్వభావాలున్న వారు వైశ్యులు - శూద్రులు అని చెప్పబడింది.

ఇవన్నీ వారివారి గుణాలు, కర్మల వల్ల వచ్చినవే తప్ప జన్మతః వచ్చినవికావు. దానిని బట్టి ప్రతి మానవుడు తన కర్మను బట్టి, స్వభావాన్ని బట్టి బ్రాహ్మణుడుగాను, క్షత్రియుడుగాను, వైశ్యుడుగాను శూద్రుడుగాను మార్పుచెందే అవకాశముందన్న సత్యాన్ని గుర్తించాలి.

| | సంఖ్య గుణము | కర్మ | వర్ణము |
|---|---|---|---|
| 1 | కేవలం సత్వగుణం కలవారు చేసేకర్మ | శమదమాదులు తపస్సు | బ్రాహ్మణులు |
| 2 | స్వల్పముగ సత్వగుణం కలిగి రజోగుణం అధికంగా వున్నవారు చేసే కర్మ | శౌర్య, ధైర్య, గాంభీర్యాలు కలిగి వుండి రాజ్యపాలన రాజ్యపాలన చేస్తూ, అవసరమై నపుడుయుద్ధమునకై ముందుకు సాగువాడు | క్షత్రియుడు |
| 3 | రజోగుణము, తమోగుణము అధికంగా వుండి సత్వగుణం బహుస్వల్పంగా గలవారు చేసే పనులు | కృషి, గోరక్షణ వాణిజ్యాదులు | వైశ్యులు |
| 4 | తమోగణము అధికంగా వుండి, రజోగుణము స్వల్పంగా కలిగి సత్వగుణం అసలే లేని వారు | పరిచర్యలు చేయడం అంటే ఉత్పత్తి కార్యక్రమాల్లో మునిగి వుండడం | శూద్రులు |

ఈ నాలుగు విభాగాలనే త్రిదండి చిన్నజీయర్ స్వాములవారు "దేవ-మనుష్య-తిర్యగ్- స్థావరములు" అని నిర్వచించారు. రజస్సు, తమస్సు అధికముగ గలవానిని వైశ్యునిగాను, తమస్సు అధికముగను, రజస్సు స్వల్పముగను గలవానిని శూద్రునిగను గుణములచే తెలుసుకొనవచ్చును అని వివరించారు.

కాని శ్లోకాన్ని బట్టి ఇంత వివరణ ఇవ్వవలసిన అవసరము లేదు. ఇదే విధంగా కాళహస్తిలోని శ్రీ శుకబ్రహ్మాశ్రమ పీఠాధిపతి శ్రీవిద్యాప్రకాశానందగిరిస్వాములవారు కూడా వ్రాశారు . ఈ వ్యాఖ్యానాలు శ్లోకానికి సరిపడునట్లుగా లేవు. వీరికి పూర్వం గీతకు భాష్యాలు చెప్పిన ఎందరో వ్యాఖ్యాతలవలె వీరును చెప్పడం కడుంగడు అసమంజసమని నా భావన.

ఇక్కడ అరవింద మహర్షుల వారి గీతావ్యాసములకు వ్యాఖ్యను వ్రాసిన శ్రీ తెన్నేటి పూర్ణచంద్రరావుగారి అనువాదము సమంజసంగా వుంది.

"నాలుగు వర్ణాలతో కూడిన వ్యవస్థను గుణకర్మ విభాగాన్ననుసరించి నేనే సృష్టించాను, వీటికి నేను కర్తనే అయినా, అవినాశిగా, అకర్తగానన్ను తెలుసు కోవాలి" - అని అనువదించారు.

శ్రీ చిన్నజీయర్‌స్వామివారి అనువాదం కూడా ఎంతో శ్లాఘనీయంగా వుండి చదువరులకు గగుర్పాటును కొలుపునదిగా వుంది - దాన్ని చూద్దాం.

"ఈ ప్రపంచమంతయు నాలుగు వర్ణములుగ విభాగింపబడినది. అవి దేవ, మనుష్య, తిర్యక్, స్థావరములని, పూర్వజన్మాంత మందు సత్వ, రజః, తమస్సులనే మూడు గుణములలో ఏ గుణము పైకి వున్నదో చూచి ఏ కర్మ చేసిన ఆ గుణము తొలుగునో నాకు తెలియును గాన అట్టి కర్మచేయుటకు అనువగు జీవులను నేను ప్రవేశపెట్టెదను. ఆయా జన్మను బట్టి దానికనువగు కర్మలను వాడు ఆచరించుచుండును. జీవులు ఆయా వర్ణమును ధరించునట్లు సృష్టించువాడను కనుక నన్ను "కర్త" అనవచ్చును. కాని ఆయా తేడాలు కల్పించడంలో నాకు ఎలాంటి పక్షపాతము లేదు. వారు ఆర్జించిన గుణములే వారినట్లు పుట్టించుటకు కారణమగుటచేత కర్తృత్వము ఆ జీవులకేగాని నాకు కాదు కనుక నేను "అకర్తను" అని జీయర్ స్వామి వ్యాఖ్యానించిన తీరు అమోఘమైంది. ఈ విషయములో జాతిపితగాంధీజీ ఏం చెప్పారో దానిని గూర్చి విచారించి ఈ అంశాన్ని ముగిద్దాం. 24-11-1927న యంగిండియాలో ఈ విషయము గాంధీజీ ఈ విధంగా వ్రాశారు.

"The order of the four Varnas
was created by Me according
to the different Gunas and
Karma of each;Yet no that though,
therefore author
thereof, being change less I am
not the author"

The Gita does talk of Varna being according to Guna and Karma, but Guna and Karma are inherited by birth, the law of Varna is nothing if not by birth. But there is no superiority implied here. Brahamanisam is the culmination of other Varnas just as the Head is the culmination of the body. It means capacity for suprior service, not superior status . The movement superior is arrogated it becomes worthy to be trampled under foot.

"నమాం కర్మాణి లిమ్పన్తి
న మే కర్మఫలే స్పృహా
ఇతి మాం యోభిజానాతి
కర్మభిర్న స బధ్యతే శ్లో -14

నాకు కర్మలంటవు, నాకు కర్మఫలము
నందు ఆశలేదు. నన్ను గూర్చి
ఈ ప్రకారముగ ఎవడు తెలుసుకొనునో
అట్టివాడు కర్మములచే బంధింపబడడు

**వివరణ :** తనకు కర్మలంటవని, తనకు కర్మఫలాసక్తిలేదని తెలుసుకుని పరమాత్మను గూర్చి తెలుసుకొను వాడు కర్మల చేత బంధితుడుకాడు. పరమాత్మకు విశ్వసృష్టికి వున్న సంబంధమే ఇది. ప్రతి జీవునకు శరీరధారణతో తన వంతు కార్యనిర్వహణ ఈ లోకమునందున్నది కనుక జీవునకు ఏ బంధాలు వుండవు. దేనికొరకు దిగులు పడనవసరం లేదు, దేనికి లొంగిపోనవసరం లేదు, ఆపనిని చేయించేది ప్రకృతి. జీవుడు కేవలం చూచి ఆనందించేవాడు మాత్రమే. ఇక్కడ భగవంతుని తెలుసుకోడం అనే మాటకు అర్థం ఇదే.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ
పూర్వైరపి ముముక్షుభిః
కురుకర్మైవ తస్మాత్వం
పూర్వైః పూర్వతరం కృతమ్ శ్లో - 15

పూర్వం ముముక్షవులెందరో
ఈ విధముగ తెలుసుకొని
కర్మలను ఆచరించియుండిరి
వారు ఆచరించినట్లే నీవును
కర్మలను ఆచరించుము

కిం కర్మ కిమకర్మేతి
కవయోప్యత్ర మోహితాః
తత్తేకర్మ ప్రవక్ష్యామి
యజ్ఞాత్వా మోక్షసే శుభాత్ శ్లో 16

*కర్మఎట్టిది? అకర్మ ఎట్టిది?*
అను విషయమునందు బుద్ధి
మంతులు సైతం మోహమును
జెందియున్నారు. దేనిని తెలుసు
కోవడం వలన నీవు అశుభాన్ని
పొందవో అట్టి కర్మ తత్వమును
నీకు తెలియజేయుచున్నాను

కర్మణో హ్యపి బోద్ధవ్యం
బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణ్యశ్చ బోద్ధవ్యం
గహనా కర్మణో గతిః శ్లో - 17

వివరణ : తనకు కర్మలంటవని, తనకు కర్మఫలాసక్తిలేదని తెలుసుకుని పరమాత్మను గూర్చి తెలుసుకొను వాడు కర్మల చేత బంధితుడుకాడు. పరమాత్మకు విశ్వసృష్టికి వున్న సంబంధమే ఇది. ప్రతి జీవునకు శరీరధారణతో తన వంతు కార్యనిర్వహణ ఈ లోకమునందున్నది కనుక జీవునకు ఏ బంధాలు వుండవు. దేనికొరకు దిగులు పడనవసరం లేదు, దేనికి లొంగిపోనవసరం లేదు, ఆపనిని చేయించేది ప్రకృతి. జీవుడు కేవలం చూచి ఆనందించేవాడు మాత్రమే. ఇక్కడ భగవంతుని తెలుసుకోడం అనే మాటకు అర్థం ఇదే.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ
పూర్వైరపి ముముక్షుభిః
కురుకర్మైవ తస్మాత్త్వం
పూర్వైః పూర్వతరం కృతమ్ శ్లో - 15

పూర్వం ముముక్షవులెందరో
ఈ విధముగ తెలుసుకొని
కర్మలను ఆచరించియుండిరి
వారు ఆచరించినట్లే నీవును
కర్మలను ఆచరించుము

కిం కర్మ కిమకర్మేతి
కవయోప్యత్ర మోహితాః
తత్తేకర్మ ప్రవక్ష్యామి
యజ్ఞాత్వా మోక్షసే శుభాత్ శ్లో 16

*కర్మఎట్టిది? అకర్మ ఎట్టిది?*
అను విషయమునందు బుద్ధి
మంతులు సైతం మోహమును
జెందియున్నారు. దేనిని తెలుసు
కోవడం వలన నీవు అశుభాన్ని
పొందవో అట్టి కర్మ తత్వమును
నీకు తెలియజేయుచున్నాను

కర్మణో హ్యపి బోద్ధవ్యం
బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణ్యశ్చ బోద్ధవ్యం
గహనా కర్మణో గతిః శ్లో - 17



కర్మము యొక్కయు
వికర్మము యొక్కయు
అకర్మము యొక్కయు
తత్వము తెలుసుకొన
దగినది. కర్మల తత్వమును
తెలుసుకొనుట అంత సులభ
మైన పనికాదు

కర్మణ్యా కర్మ యః పశ్యే
ద కర్మణి చ కర్మ యః
స బుద్ధిమాన్ మనుష్యేషు
స యుక్తః కృత్స్న కర్మకృత్ శ్లో - 18

ఎవడు కర్మము నందు అకర్మమును
అ కర్మమునందు కర్మమును
చూచునో వాడు మనుష్యులలో
బుద్ధి మంతుడును, యోగియును
సర్వకర్మములను ఆచరించు
వాడును అగుచున్నాడు

వివరణ : మన మనస్సు యొక్క స్వరూపమును తెలుసుకొనుటకు కర్మ చాలా ఆవశ్యకమై యున్నది. కర్మలో దోషములు కనబడినప్పుడు వానిని తొలగించుకొన వచ్చును. దోషములు తెలియకపోతే ప్రగతి ఆగిపోతుంది. వికాసము శూన్యం అవుతుంది. కర్మలను ఆచరించినపుడే దోషములు కనుపిస్తాయి. వాటిని అంటే ఆ దోషాలను తొలగించుకోవాలంటే వికర్మను ఆశ్రయించవలసి వుంటుంది. ఈ వికర్మవలన కామ క్రోధాతీతుడు, లోభమోహాతీతుడు యెట్లు కావచ్చునో క్రమ క్రమంగా బోధ పడుతుంది. కర్మలను నిష్కళంకముగ వుంచుటకై చేసే నిరంతర ప్రయత్నమే వికర్మ. దాని వలన కర్మలు నిర్మల కర్మలగును. నిర్వికార కర్మలగును. ఇవి ఒకదాని వెంట ఒకటి సహజముగా జరుగుతుండడమువలన ఏ కర్మ ఎప్పుడు జరిగిందో కర్మ చేసినవానికి స్పృహ వుండదు. అది అపుడు అకర్మ అవుతుంది. ఇట్టి సహజ కర్మనే అకర్మ అని చెబుతున్నారు, కనుకనే "కర్మయందు అకర్మను- అకర్మయందు కర్మను చూచిన వాడు మనుష్యులలో బుద్ధిమంతుడు, యోగియును, అట్టివాడు సర్వ కర్మములను ఆచరించినవాడగుచున్నాడు" - అని భగవానుడు ప్రకటించాడు.

"యస్య సర్వే సమారంభాః
కామ సంకల్ప వర్జితాః
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం
తమాహుః పండితం బుధాః" శ్లో - 19

ఎవరి కర్మలు సంకల్పములు
(కోరికలు) లేకుండాయుండునో
జ్ఞానమనెడి అగ్ని చేత అవి దహింప
బడియుండునో అట్టి వాడు
పండితుడని బుధజనులు పేర్కొనిరి

"త్యక్త్వా కర్మ ఫలాసంగం
నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభి ప్రవృత్తోపి
నైవ కించిత్కరోతి సః" శ్లో- 20

కర్మలయందు ఫలాపేక్షను
వదలి, సదాసంతృప్తితో
నిరాశ్రయుడై యుండువాడు
కర్మలయందు చరించుచున్నను
వాటిని కొంచెమైనను చేయని
వాడే యగుచున్నాడు

"నిరాశీర్యత చిత్తాత్మా
త్యక్త సర్వపరిగ్రహః
శారీరం కేవలం కర్మ
కుర్వన్నాప్నోతి కిల్బిషమ్" శ్లో -21

ఆశలేనివాడు, దేహ మనో
బుద్ధులను జయించిన
వాడును అగు మనుజుడు
కేవలము దేహము కొరకు
కర్మలాచరించినను పాపమును
పొందడు

"యదృచ్ఛా లాభసంతుష్టో
ద్వంద్వాతీతో విమత్సరః
సమఃసిద్ధావ సిద్ధౌచ
కృత్వాపి ననిబధ్యతే" శ్లో - 22

అప్రయత్నముగ లభించిన
దానితో సంతుష్టిని పొందువాడు
సుఖ దుఃఖములనే ద్వంద్వము
లను అతిక్రమించిన వాడును
మాత్సర్యము లేనివాడును
కార్యముల యొక్క ఫలాఫలము
లందు సమబుద్ధిగలవాడును
అగుమనుజుడు కర్మలను చేసినను
వాటిచే బంధింపబడడు

"గత సంగస్య ముక్తస్య
జ్ఞానావస్థిత చేతసః
యజ్ఞాయాచరతః కర్మ
సమగ్రం ప్రవిలీయతే" శ్లో - 23

దేనియందును సంగము
(ఆసక్తి) లేనివాడును
రాగద్వేషకామ క్రోధాది
రూపముల నుండి విముక్తి
నొందిన వాడును
మనస్సును నిలుకడగ
జ్ఞానమునందు లయింప
జేసిన వాడును అగు మనుజుని
యొక్క కర్మ సంపూర్ణముగా
నశించిపోవుచున్నది

బ్రహ్మార్పణం బ్రహ్మహవి
ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గన్తవ్యం
బ్రహ్మకర్మ సమాధినా శ్లో -24

హోమసాధనములు, హవిస్సు
హోమాగ్ని, హోమము చేయువాడు
హోమముచేయబడునది సర్వం
బ్రహ్మమే యనెడి భావముతో
యజ్ఞములను ఆచరించువాడు
పొందెడు ఫలము కూడా బ్రహ్మమే
అయివున్నది

అంటే నామ రూపాత్మకమగు ఈ జగమంతా బ్రహ్మస్వరూపమే.

"దైవమే వాపరే యజ్ఞం
యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నావ పరేయజ్ఞం
యజ్ఞేనై వోపజుహతి" శ్లో - 25

కొందరు యోగులు దేవతల
నుపార్జించునట్టి యజ్ఞమును
చేయుచున్నారు, మరికొందరు
ఆత్మైక్య భావనచే బ్రహ్మమనెడి
అగ్నియందుహోమము చేయుచున్నారు

శ్రోత్రాదీనీంద్రియణ్యాన్యే
సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీన్విషయానన్యే
ఇంద్రియాగ్ని షు జుహ్వతి శ్లో-26

కొందరు చెవి మొదలుగాగల
ఇంద్రియములను సంయమనెడి
అగ్నియందును, మరికొందరు
శబ్దాది విషయ రూపమైన
హవిస్సును ఇంద్రియము
లనెడి అగ్ని యందును
హోమము చేయుచున్నారు.

"సర్వాణీంద్రియ కర్మాణి
ప్రాణ కర్మాణి చాపరే
ఆత్మ సంయమ యోగాగ్నౌ
జుహ్వతి జ్ఞాన దీపితే" శ్లో - 27

మరికొందరు ఇంద్రియ
వ్యాపారములను, ప్రాణ
చేష్టలనన్నింటిని జ్ఞాన
దీప్తమైన ఆత్మసంయమ
యోగమనెడి అగ్నియందు
హోమము చేయుచున్నారు

"ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా
యోగయజ్ఞాస్తథాపరే
స్వాధ్యాయజ్ఞాన యజ్ఞాశ్చ
యతయః సంశిత వ్రతాః" శ్లో -28

కొందరు ద్రవ్యయజ్ఞమును
మరికొందరు తపోయజ్ఞమును
ఇంకొందరు యోగయజ్ఞమును
వేరె కొందరు స్వాధ్యాయ యజ్ఞమును
చేయువారై యున్నారు, వీరందరును
దృఢదీక్ష గలవారై యున్నారు

"అపానే జుహ్వతి ప్రాణం
ప్రాణే పానం తథాపరే
ప్రాణాపాన గతీరుద్ధ్వా
ప్రాణాయామ పరాయణాః" శ్లో 29

కొందరు ప్రాణాయామము
నందు ఆసక్తి కలవారై
ప్రాణాపాన వాయువులు
యొక్క గతిని నిరోధించి
అపానమునందు ప్రాణవాయువును
లయము చేయుచూ ప్రాణాయామ
యజ్ఞమును చేయుచున్నారు

అపరే నియతాహారా:
ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి
సర్వే ప్యేతే యజ్ఞవిదో
యజ్ఞక్షపితకల్మషా: శ్లో - 30

మరికొందరు ఆహారనియమము
కలవారై ప్రాణములను ప్రాణము
లందే హోమము చేయుచున్నారు
వీరందరు యజ్ఞ విధులను
యజ్ఞము నెరిగిన వారైనందున
పాపమునశించినవారయ్యారు

"యజ్ఞ శిష్టామృతభుజో
యాన్తి బ్రహ్మసనాతనమ్
నాయంలో కోస్త్య యజ్ఞస్య
కుతోన్యః కురుసత్తమః" శ్లో - 31

కురు శ్రేష్ఠుడవగు ఓ అర్జునా!
యజ్ఞ శేషమైన అమృతమును
భుజించెడివారు నిత్యమైన
బ్రహ్మమును బడయుదురు
యజ్ఞకర్మలొనరింపని వానికి
ఇహలోక సుఖమే లేదు. అలాంటప్పుడు
అతనికి పరలోక సుఖమెటనుండి
వచ్చును?

"ఏవంబహూ విధా యజ్ఞా
వితతా బ్రహ్మణోముఖే
కర్మజాన్ విద్ధి తాన్ సర్వాన్
ఏవం జ్ఞాత్వా విమోక్ష్యసే" శ్లో - 32

ఈ ప్రకారముగ బ్రహ్మముఖము
నుండి అనేక విధములైన
యజ్ఞములు బయల్వెడలినవి,
ఈ యజ్ఞములన్నియు ఏదో
ఒకవిధమైన కర్మ నుండి పుట్టినవే
వీటిని గురించి ఈ విధముగ తెలుసు
కొని నీవును ఆచరించినచో
మోక్షమును పొందగలవు

"శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞా
జ్ఞానయజ్ఞః పరంతప!
సర్వం కర్మాఖిలం పార్థ!
జ్ఞానే పరిసమాప్యతే" శ్లో -33

అర్జునా!
ద్రవ్యము వలన సాధింపబడు
యజ్ఞము కంటెను జ్ఞాన
యజ్ఞము శ్రేష్ఠమైనది
అఖిలములగు ఈ సమస్త
కర్మములును జ్ఞానము
నందే పరిసమాప్తమగుచున్నవి

"తద్విద్ధి ప్రణిపాతేన
పరి ప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తేజ్ఞానం
జ్ఞానిన స్తత్వ దర్శినః" శ్లో - 34

అర్జునా!
తత్వవేత్తలగు జ్ఞానులకు
సాష్టాంగప్రణామము లాచరించుచు
సమయము చూచి వినయముగ
పరి ప్రశ్నించుచు, సేవించుచు
వారి నుండి జ్ఞానమును పొందుము

యజ్ఞాత్వా న పునర్మోహ
మేవం యాస్యసి పాండవ!
యేన భూతాన్యశేషేణ
ద్రక్ష్యస్యాత్మన్యథోమయి శ్లో - 35

అర్జునా!
దేనిని తెలుసుకొనుటవలన
తిరిగి ఇట్టి మోహముకలుగదో
ఏ జ్ఞానము చేత సర్వభూతములను
నీయందును, అటు పిమ్మట నాయందును
చూడగలుగుదువో అదియే జ్ఞానము

అపిచేదసి పాపేభ్యః
సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవేనైవ
వృజినం సంతరిష్యసి శ్లో - 36

నీవు పాపులందరికంటెను
పాపాత్ముడవైనను అట్టి
పాపమును జ్ఞానమనెడి
తెప్పచేత లెస్సగ దాటగలవు

"యథైధాంసి సమిద్ధోగ్ని
ర్భస్మ సాత్కురుతేర్జున!
జ్ఞానాగ్ని సర్వకర్మాణి
భస్మసాత్కురు తే తథా" శ్లో - 37

మండుచున్న నిప్పు
కట్టెలను ఏ రీతిగ
భస్మమొనర్చునో
అదేరీతిగ జ్ఞాన
మనే అగ్ని సమస్త
కర్మములను భస్మమొనర్చును

"నహిజ్ఞానేన సదృశం
పవిత్రమిహ విద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః
కాలేనాత్మని విందతి" శ్లో -38

జ్ఞానముతో సమమైనది
పవిత్రమైనది లోకమున
మరొకటిలేదు, ఆ జ్ఞానమును
సిద్ధింపజేసుకొనిన వాడు కాల
క్రమమున దానిని తన ఆత్మ
యందే పొందుచున్నాడు

"శ్రద్ధావాల్లభతే జ్ఞానం
తత్పరః సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాంశాన్తి
మచిరేణాధి గచ్ఛతి" శ్లో - 39

శ్రద్ధగలవాడును, జ్ఞానాసక్తి
కలవాడును, ఇంద్రియ
నిగ్రహము కలవాడును
జ్ఞానమును పొందును
అట్టివాడు త్వరితగతిన
శాంతిని పొందుచున్నాడు

"అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ
సంశయాత్మా వినశ్యతి
నాయంలోకోస్తిన పరో
న సుఖం సంశయాత్మనః" శ్లో - 40

జ్ఞానశూన్యుడు, శ్రద్ధారహితుడు
సంశయాత్ముడు నశించును, సంశ
యాత్మునకు ఇహముగాని పరము
గాని లేదు. సుఖముకూడా లేదు

యోగసన్న్యస్త కర్మాణం
జ్ఞానసంఛిన్న సంశయం
ఆత్మవంతం న కర్మాణి
నిబధ్నన్తి ధనంజయ! శ్లో - 41

అర్జునా!
యోగము వలన సంశయములను
ఛేదించి, కర్తృత్వా భోక్తృత్వాభి
మానరహితుడై ఆత్మనిష్ఠుడై
కర్తవ్యముల నిర్వహించుచు
వ్యవహరించునో అట్టివానిని
కర్మలు బంధించవు

తస్మాద జ్ఞాన సంభూతం
హృత్స్థం జ్ఞానాసినాత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగ
మాతిష్ఠోత్తిష్ఠ భారత! శ్లో - 42

అర్జునా!
అజ్ఞానమువలన
నీ హృదయమున కలిగిన
సంశయములను జ్ఞాన
మనెడి కత్తితో నరికి
యోగస్థుడవై నీ కర్తవ్యమును
నిర్వహింపుము లే, లేచి
యుద్ధమునకై ముందుకు సాగు

ఈ అధ్యాయమునందు బోధింపబడిన యోగ పద్ధతి "సనాతన యోగము" దానినే జీవిచేయు శాశ్వత వ్యాపారము అని కూడా అనడం జరుగుతున్నది. ఈ యోగమునందు యజ్ఞ వ్యాపారములకు సంబంధించిన రెండవిభాగాలున్నాయి. భౌతిక వస్తుత్యాగము. శుద్ధ అధ్యాత్మిక వ్యాపారమైన ఆత్మ జ్ఞానము అనునవి ఈ రెండు విభాగాలు.

వ్యక్తికున్న భౌతిక వస్తువుల త్యాగము ఆధ్యాత్మికత్వ అనుసంధానము కలిగి యుండనిచో అట్టి యాగము భౌతికము అవుతుంది. అయితే ఆధ్యాత్మిక లక్ష్యముతో త్యాగము చేసినవాడు సంపూర్ణమైన త్యాగము చేసినవాడు కాగలడు. కాని ఆధ్యాత్మిక వ్యాపారములను కూడా తిరిగి రెండుగా విభజించవచ్చును. ఆత్మనెరుగుట అంటే స్వీయ సహజస్థితి నెరుగుట మొదటిది. దేవదేవుని గూర్చిన సత్యము నెరుంగుట రెండవది. అంటే భగవద్గీతామార్గాన వున్నదున్నట్లుగా అనుసరించుట. ఆ విధంగా అనుసరించు వాడే ఆధ్యాత్మిక జ్ఞానము యొక్క ఈ రెండు ముఖ్యవిభాగములు సులభముగా తెలుసుకొనగలడు. అట్టి వానికి ఆత్మ భగవంతుని యందలి భాగమే అనుసంపూర్ణ జ్ఞానమును పొందుటలో కష్టముండదు. అట్టివాడు భగవంతుని దివ్య వ్యాపారములను సులభముగా అర్థముచేసుకోగలడు! ఈ అధ్యాయములో భగవంతుని యొక్క దివ్యవ్యాపారములను గూర్చి భగవంతుని చేతనే చర్చించబడినవి. గీతయొక్క బోధనలను అర్థముచేసుకొననివాడు శ్రద్ధావిహీనుడు. భగవానునిచే ప్రసాదింపబడిన స్వాతంత్ర్యమును అతడు పూర్తిగా దుర్వినియోగము చేసుకొన్నవాడౌతున్నాడు. అట్టి బోధనలను చదివి కూడా భగవంతుడు శాశ్వతుడు, ఆనందమయుడు, సర్వజ్ఞుడు అని ఆయన సత్య స్వభావమును అర్థము చేసుకొననివాడు అజ్ఞాని.

భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు ఉపదేశించిన సిద్ధాంతములను క్రమక్రమముగా అవలంబించినచో అజ్ఞానమును తొలగించుకొనవచ్చును. ఉపదేవతలకు చేయు వివిధ యాగములచేతను, బ్రహ్మమునుద్దేశించి చేయుయాగము చేతను, బ్రహ్మ చర్యమునందును, గృహస్థధర్మమందును ఇంద్రియనిగ్రహమునందును, భక్తియోగాభ్యాసమునందును, తపస్సునందును, భౌతిక వస్తువిసర్జనమునందును, వేదాధ్యయనమునందును త్రిగుణముల వలన ఆయా మనుజుల గుణ స్వభావములను బట్టి నిర్మాణమైన సామాజికి వ్యవస్థను అంగీకరించుట యందును చేయు పనుల చేత శ్రీ కృష్ణతత్వమును జాగృతము చేయవచ్చును. వీటన్నింటిని యాగము లేక యజ్ఞమనే చెప్పడం జరుగుతున్నది. నియమితమైన కర్మలపై ఇవి ఆధారపడి వున్నాయి. ఈకార్యకలాపాలన్నింటిలో ఆత్మ సాక్షాత్కారము ప్రధానమైంది. ఆ లక్ష్యాన్ని అన్వేషించేవాడే భగవద్గీతను అధ్యయనము చేసే నిజమైన విద్యార్థి. ఇక్కడ గీతలో శ్రీకృష్ణుడు తెలిపిన ప్రామాణిక తత్వమును సందేహించువాడు పతితుడుకాగలడు. అందువలన భగవద్గీతను కాని, మరే ఇతర ప్రామాణికమత గ్రంథమును కానీ ఆధ్యాత్మికాచార్యుని వద్ద సేవా

వినమ్రతా భావముతో అధ్యయనము చేయవలసివుంది. ప్రామాణికాధ్యాత్మికాచార్యుడు అనాదికాలము నుండియు గురుశిష్యపరంపరలో వుంటున్నాడు. అందువలననే ఈ అధ్యాయము మొదటి శ్లోకములో భగవానుడు అర్జునునితో

అర్జునా!
నాశరహితమగు ఈ నిష్కామ కర్మ
యోగమును పూర్వము నేను
సూర్యునకు తెలిపితిని, సూర్యుడు
వైవస్వతమనువునకు ఉపదేశించెను
మనువు ఇక్ష్వాకునకు బోధించెను అని

తెలుపడము జరిగింది. అందువలన ఎవరైనను గీతలో వ్యక్తము చేయబడినట్లుగా భగవద్గీతా మార్గమును అనుసరించి ఆత్మాభ్యున్నతిని పొందడం అవసరము. భగవంతుడు పరమపురుషుడు, ఆయన వ్యాపారములు దివ్యములు. దానిని అర్థము చేసుకొని గీతను అధ్యయనము చేయవలెను. ఆ విధంగా చేసిన వ్యక్తులు ముక్తులు.

ఈ విధంగా ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన
శ్రీ మద్భగవద్గీత యందలి జ్ఞానయోగమను పేరుగల
చతుర్థోధ్యాయము సమాప్తము గావించబడింది.



# గీతా సంహిత

**అధ్యాయము అయిదు** | **కర్మసన్న్యాస యోగము**

సన్న్యాసము అంటే ఏమిటి?

కొన్ని కర్మలను చేయుట, కొన్ని కర్మలను వదలుట సన్న్యాసము అనిపించుకోదు. సన్న్యాసము అంటే అన్ని కర్మలను వదలివేయుట. అదియే దానికి సరైన నిర్వచనము. సర్వకర్మలనుండి విముక్తము పొందుట. కర్మ అనునది అతి విచిత్రమైన వస్తువు. కర్మ అనునది "ముందు-వెనుక-ఇటు-అటు" అన్ని వైపుల వ్యాపించియున్నటువంటిది, కూర్చుండుట- లేచుట- తినుట- త్రాగుట-నడుచుట ఇదంతా కర్మే, ఇదంతా ఒక క్రియ, కూర్చున్నపుడు ఏ పనియును చేయము. అలాంటప్పుడు కూర్చుండుట కూడా ఒక క్రియ ఎట్లయింది? అని ప్రశ్నిస్తే దానికి జవాబుగా వినోబా ఈ విధంగా చెప్పారు.

"భగవంతుడు అర్జునునకు విశ్వరూపమును జూపెను. అంతటను వ్యాపించిన ఆ విశ్వరూపాన్ని గాంచిన అర్జునుడు భయపడి కన్నులు మూసుకున్నాడు. అతడు కన్నులు మూసుకున్నను అదృశ్యము అతనికి అగుపిస్తూనే యున్నది. కన్నులు మూసుకొన్నను కనబడుదాని నుండి తప్పించుకొనుట యెట్లు? మనం చేయకపోయినను జరుగుచున్న దానినుండి తప్పించుకొనుట ఎట్లు? అని ప్రశ్నించి తిరిగి ఈరీతిగా వినోబా ఇందుకు జవాబు ఇస్తున్నారు.

ఒకనివద్ద అమూల్యమైన సువర్ణాభరణములు వుండెను. వానినన్నిటిని ఒక పెద్ద పెట్టెలో పెట్టి దాచిపెట్టవలెననుకున్నాడు. సేవకుడు అందుకు తగిన పెద్ద ఇనుప పెట్టెను చేయించి తీసుకువచ్చెను. దానిని చూచి యజమాని ఇట్లన్నాడు. ఓరీ! నీవు ఎంత మూర్ఖుడవురా!

ఓ పల్లెటూరి వాడా! సౌందర్యమన్న ఏమో నీకు తెలియనట్లున్నదే, ఇట్టి అమూల్యమైన ఆభరణములను అసహ్యమైన ఈ పనికిమాలిన ఇనుపపెట్టెలోనా పెట్టవలసింది? పో, పోయి ఒక చక్కటి బంగారపు పెట్టె ఒకటి చేయించి తీసుకురా! దానికొక బంగారు తాళమును కూడా చేయించి తీసుకురమ్ము, బంగారపుపెట్టెకు బంగారు తాళమే శోభించును అన్నాడు యజమాని. అసలు యజమాని యొక్క ఉద్దేశము నగలను మరుగున దాచి వుంచవలెనన్నది. బంగారు తాళంవేసిన బంగారు పెట్టెలో ఆభరణములను వుంచినందువలన ఆ నగలను మరుగునదాచి యుంచినట్లా? కాదు, చోరులకు (దొంగలకు) ఆ నగలను వెదుకుకొనవలసిన అవసరమేలేదు. దొంగలు ఆచందుగు పెట్టెను కాజేశారు. దానితో యజమాని పని తీరిపోయింది. దీని భావమేమనగా కర్మనాచరించక పోవుట కూడా ఆచరించు విధానమే యగుచున్నది. కర్మ ఇంత వ్యాపకమైనదైయున్నపుడు ఇక దానిని వదలుట ఎట్లు?

ప్రపంచములో వున్న కర్మలన్నిటిని ఆచరించుచున్నను అవి అన్నియు కరిగి అదృశ్యమగు ఉపాయమును సాధించుటయే కర్మసన్న్యాసమును పొందుటకు మార్గము. ఇట్లుకాగలిగినప్పుడు సన్న్యాస ప్రాప్తి అయినదని చెప్పవచ్చును. కర్మలు ఆచరించుచుండగనే అవి అన్నియు కరిగిపోవుట ఎట్లు? అని ప్రశ్నించుకుంటే సూర్యుడు ఆచరించు పనులు కరిగినట్లే అని జవాబువచ్చును. సూర్యుడు నిరంతరము కర్మరతుడై యుండును. రోజులో కొంతభాగము ప్రథమ గోళార్థములోను మరికొంత భాగం ద్వితీయ గోళార్థములోను పనిచేయుచుండను. అంటే రాత్రింబవళ్లు ఇరవైనాలుగుగంటలు నిరంతరము పనిచేయుచునే యుండును. అందువల్లనే భగవానుడు వెనుకటి అధ్యాయం మొదటి శ్లోకములో

అర్జునా!
"అవ్యయమగు ఈ యోగమును
నేను సూర్యునకు చెప్పియుంటిని"
అని ప్రకటించాడు. తిరిగి సూర్యుడి
నుండి మనన శీలుడు అయిన
మనువు దానిని నేర్చుకొనెను"

అని భగవానుడు ప్రకటించాడు. ఈ విధంగా చెప్పుటలోగల విశిష్ఠత ఏమిటంటే ఇరువది నాలుగు గంటలును కర్మలను ఆచరించుచున్నను లేశ మాత్రము తానుకర్మలను ఆచరిస్తున్నట్లు తలంచడు. అసలు ఆయనకు ఆ స్పృహయే వుండదు. నిజానికి ఈస్థితి అద్భుతమైనస్థితి.

కాని ఇది సన్యాసమునకు ఒక రూపము మాత్రమే, కర్మనాచరించుచుకూడా ఆచరింపకుండునట్లుండుట సన్న్యాసంలో ఒక భాగము మాత్రమే, తానేమాత్రము కర్మ చేయకుండా ప్రపంచములోని వారినెల్లా కర్మ ప్రవృత్తులను చేయుట రెండవ భాగము. దీనియందు అపారమైన ప్రేరక శక్తి యున్నది. అకర్మలోని విశేషం కూడా ఇదే, అకర్మయందు కర్మాచరణకు అవసరమైన శక్తి నిండియున్నది. ఆవిరి శక్తి కూడా ఇలాంటిదే. బంధించి యుంచిన ఆవిరి ఎన్నో పెద్ద పెద్ద పనులను చేస్తుంది. పెద్ద పెద్ద ఓడలను, రైలు బండ్లను క్షణమాత్రములో ఆ ఆవిరి ముందుకు లాగుకొనిపోతుంది. సూర్య భగవానుడు కూడా ఇంతే. ఆయన లేశ మాత్రమును ఏ పనిని చేయడు. వున్నచోట నుండి కదలడు. కాని ఇరువదినాలుగు గంటలు తెంపులేని పనిచేస్తూనే వుండును.మనం ఆయన్ను భగవాన్! నీవు ఎంత శ్రమించి పని చేస్తున్నావయ్యా! నీకు మా ప్రణామాలు అంటే దానికి ఆయన నేనేమియు చేయుట లేదే? అనును. రేయింబవళ్లు పనులు (కర్మలు) చేయుచునే ఎంత మాత్రము చేయనట్లుండుట, ఏమియు చేయకుండా అహోరాత్రములు అనంతకర్మలు ఆచరించుట, ఈ రెండును, సూర్యుని యొక్క రెండు రూపములు, సన్న్యాసమంటే ఇట్టి రెండు రూపములలో అలంకృతమై యుంటుంది.రెండును అసాధారణములే. ఒక విధానములో కర్మ ప్రకటితమై యుండును. అకర్మావస్థ గుప్తముగవుండును. రెండవ విధానములో అకర్మ స్థితి ప్రకటితమైయుండును. కాని దాని ద్వారా అనంతమైన కర్మలు జరుగుచునే యుండును. ఈ స్థితి యందు అకర్మలో కర్మ పూర్ణముగనిండియుండును. దాని వలన ప్రచండమైన కార్యాచరణ జరుగును. ఇట్టి స్థితిని పొందిన వ్యక్తికిని, సోమరికిని చాలా వ్యత్యాసమున్నది. సోమరి అలసిపోవును, విసుగు చెందును. కాని అకర్మస్థితిని పొందిన సన్యాసి కర్మశక్తిని బంధించియుండును. కర్మ లేశమాత్రము చేయడు. కాళ్లు, చేతులతో గాని, మరే అవయవములతోగాని ఎట్టి పనిని చేయడు. కాని ఏ పనిని చేయకయే అతడు అనంత కర్మలను ఆచరించును.

ఒకనికి కోపము వచ్చిందనుకుందాం. ఏదైన మనలోపము వలన అతడు కోపగించి వుంటే మనము అతని యొద్దకు పోయినపుడు అతడు మౌనము వహించును. ఆ మౌనము వలన, ఆ కర్మత్యాగము వలన ఎంత ప్రచండ పరిణామము కలుగును! ఇంకొకడు ఆ కోపము వలన మనలను చూడగనే బడబడ వాగి తిట్టును. కావటానికి ఇద్దరిదీ కోపమే. కాని ఒకడు మౌనము వహించి కోపాన్ని ప్రకటించాడు. రెండవవాడు బడబడా వాగి తన కోపాన్ని ప్రకటించాడు. రెండును కోపానికి మచ్చుతునకలే. ఏమియు మాటలాడకపోవుట క్రోధమునకు రూపమే, దాని వలన కూడా పనులు నెరవేరుచుండును. తల్లిగాని, తండ్రిగాని బిడ్డతో మాటలాడుట మానివేసినచో దాని పరిణామము ఎంతో ప్రచండముగా వుండును. మాటలాడుట

కట్టిపెట్టినందువలన మాటలాడినందువలన కలిగిన ఫలము కంటెను ఎక్కువ ఫలము కలుగును. మౌనము వలన కలుగు ప్రభావము మాటలాడుటవలన కలుగదు. జ్ఞానుల యొక్క స్థితి ఇట్టిదే, అతని అకర్మ, అతని మౌనము అతనితో ప్రచండమైన కార్యాన్ని చేయిస్తుంది. అతనిలో ప్రచండమైన సామర్థ్యాన్ని ఉత్పత్తి చేయిస్తుంది. క్రియల ద్వారా ప్రకటితము కాని పనులను అతడు అకర్మకుడుగా వుండి చేయగలుగును. సన్యాసము యొక్కరెండవ రూపు ఇది . ఇట్టి సన్యాసి యొక్క సమస్త కార్యములును సమస్త ప్రయత్నములును ఒకచోట కలిసి ఒకే రూపమును పొందును . అట్టి సన్యాసి రూపం ఇది.

"ఎద తెగకుండ నేను చేయు ప్రయత్నములన్నియు నిలిచిపోయినవి. భగవంతుని రెండు రెక్కలపై మూటవలె పడియున్నాను, చింతలన్నియు తొలగిపోయినవి, ఆశ్రయము చిక్కినది. శరీర సంబంధమయిన వికారములన్నియు నశించినవి. ఇపుడు నేను నాబలముపై ఆధారపడి లేను. ప్రభువు నాఅహంకారమును పటాపంచలు చేసెను. పసిబిడ్డవలె నిర్మలుడనయితిని"

॥భక్తతుకారాం॥

సూర్యుడు తాను ఉదయిస్తున్నప్పుడు రాజులు రాజదర్బారులో ప్రవేశిస్తున్నట్లు భేరి మ్రోగించుకొన్నట్లు మ్రోగించుకొనడు. సహజంగా తూర్పుదిక్కున ఆయన పైకి లేచును. ఆయన దర్శన మాత్రముచేత పక్షులెగురుట మొదలిడును, మేకపిల్లలు గొర్రెపిల్లలు గంతులు వేయును. ఆవులు అడవులకు మేతకై బయలు దేరును. వ్యాపారులు తమ అంగళ్లను తెరచెదరు. రైతులు నాగలి బట్టి పొలమును దున్నెదరు. సూర్యోదయముతో ఇట్లు ప్రాపంచిక వ్యవహారములన్నియు ప్రారంభమగును. సూర్యుని ఉనికి మాత్రము చేత అనంతకోటి కార్యములు జరుగును. ఈ అకర్మావస్థయందు అనంతమైన కర్మలకు కావలసిన ప్రేరణ, సామర్థ్యము పూర్ణముగ నిండియున్నది

ఈశావాస్యోపనిషత్తులోని 3,4 మంత్రాలు ఈ విషయాన్నే మనకు బోధిస్తున్నవి.
మెదలదొకటి ఆత్మము, కాని మించు మనోజవంబు
గదియలేరు దేవులు దాని, కాని ముందదియెపోవును
అది కదలకయె పరువెత్తునన్నింటిదాటిపోవు
అదియె యుండగ వాయువు ప్రాణుల పనులదిద్దు" 4
అది కదలును, మరి కదలదు
అదెవరికందనిది, కాని అందరకందున్
అది అన్నింటిలోపలగల
దది అన్నిటి బయట కూడనగపడుచుండున్"

ఈశావాశ్యోపనిషత్తులోని ఈ రెండు మంత్రాలు కలిసి ఒక స్వతంత్రప్రకరణము. ఈశ్వర శక్తి అలౌకికమని ఈ మంత్రములభావము. ఈశ్వర శక్తికి హద్దులు లేవు. అది తర్కాతీతమైనది. మనము తర్కింప మొదలిడిన దానికి హద్దులు పెట్టినట్లగును. ఈశ్వరుడు అవతారమెత్తినపుడు గొప్పగా కర్మలు ఆచరించునట్లు కనబడుచున్నను ఆ కర్మల పట్ల ఆయనకు ఆసక్తి ఏ మాత్రం వుండదని భగవద్గీత బోధిస్తున్నది. అట్టి సమయాన కూడా అతడు అకర్మిగా వుండును. తన మూలస్వరూపమందున్నపుడు ఏమియు చేయనివానివలె వుండును. అప్పుడుకూడా సర్వ ప్రపంచమును శాసించును. అనగా అకర్మణిగా వుండియు సర్వకర్మలను చేయు చుండును. ఈశ్వరుని యొక్క ఆ వ్యాపక స్వరూపములే ఈ అధ్యాయమునందు మనము దర్శించెదము.

ఈ అధ్యాయములో అకర్మదశయొక్క రెండు రూపములు పోల్చి చెప్పబడినవి. ఇట్లు పోల్చిచెప్పడంలో భాష కూడ తబ్బిబ్బగును. కర్మయోగి శ్రేష్ఠుడా? లేక కర్మసన్యాసి శ్రేష్ఠుడా! అంటే ఎవరు ఎక్కువ, ఎవరు తక్కువ అని చెప్పలేము. చెప్పడం కష్టము అన్నియు చేయుచునే ఏమియు చేయకపోవుట ఒకటి కాగా ఏదియు చేయక సమస్తమును చేయుట రెండవది. ఈ రెండును యోగములే, కాని పోల్చిచెప్పుట కొరకు మొదటి దానిని యోగం అన్నారు, రెండవ దానిని సన్న్యాసం అన్నారు. కర్మ సన్న్యాసయోగం అంటే ఇదే.

ఈ అధ్యాయమందలి ముఖ్య విషయాలు

| | | |
|---|---|---|
| 1 | 1నుండి 6శ్లోకములు | నిష్కామ కర్మయోగమును స్థిరీకరించుట |
| 2 | 7నుండి 12వశ్లోకం వరకు | సాంఖ్య, కర్మయోగియొక్క లక్షణములు తిరిగి చెప్పుట |
| 3 | 13నుండి 26వ శ్లోకంవరకు | జ్ఞానయోగము యొక్క విపులీకరణ |
| 4 | 27 నుండి 29 శ్లోకము వరకు | భక్తితో కూడిన ధ్యానయోగ వర్ణన |

వెనుకటి అధ్యాయంలో మహనీయులను సేవించుట ద్వారా జ్ఞానమును పొందవచ్చునని భగవానుడు ప్రకటించి యున్నాడు. అయితే జ్ఞానం, కర్మ రెండింటిలో ఏది శ్రేష్ఠము? అనే సంశయము అర్జునునకు కలిగింది. దాని నివారణ కొరకు అయిదవ అధ్యాయమైన ఈ కర్మసన్న్యాస యోగములో అర్జునుడు శ్రీకృష్ణుణ్ణి ఈ విధంగా ప్రశ్నిస్తున్నాడు.

"సన్న్యాసం కర్మణాం కృష్ణ!
పునర్యోగం చ శంససి
యచ్ఛ్రేయ ఏతయోరేకం
తన్మే బ్రూహి సునిశ్చతమ్" శ్లో - 1

కృష్ణా!
నీవు ఒకసారి కర్మ సన్న్యాసమును
మరొక సారి కర్మయోగమును గూర్చి
చెప్పుచున్నావు, మరి ఈరెండింటిలో
ఏది శ్రేష్ఠమో దానిని గూర్చి నాకు తెలుపుము

అర్జునుడు వేసిన పై ప్రశ్నకు భగవానుడు వెనుకటి అధ్యాయం అంటే 4-33న 34 శ్లోకాలలో

"అర్జునా!
ద్రవ్యము వలన సాధింపబడు
యజ్ఞము కంటెను జ్ఞాన
యజ్ఞము శ్రేష్ఠమైనది
అఖిలములైన ఈ సమస్త
కర్మలన్నియును జ్ఞానము
నందే పరిసమాప్తమగుచున్నవి"
"సాష్టాంగ ప్రణామము ఆచరించుచూ
పరిప్రశ్నించుచూ, సేవించుచూ
బ్రహ్మజ్ఞులైన జ్ఞానుల నుండి
జ్ఞానమును తెలుసుకొనుము"

అని జవాబు ఇవ్వనే ఇచ్చియున్నాడు ఆరెండింటిలో ఏది గొప్పది? అనే సంశయం అర్జునుని హృదయంలో అంకురించింది. ఇలాంటి సందేహమే మూడవ అధ్యాయము ప్రారంభంలో కూడ అతనికి వచ్చి ఈ విధంగా ప్రశ్నించాడు.

కృష్ణా!
కర్మకంటెను జ్ఞానము
శ్రేష్ఠమని నీ అభిప్రాయము
అయినచో యుద్ధమనే ఈ
భయంకర కర్మయందు
నన్నేలవినియోగించదలిచావు?

అని ప్రశ్నించాడు అర్జునుడు - ఈస్థితిలో భగవానుడు ఈ విధంగా సమాధానమును తెలుపుతున్నాడు

సన్న్యాసః కర్మయోగశ్చ
నిశ్శ్రేయసకరావు భౌ
తయోస్తు కర్మసన్న్యాసా
త్కర్మ యోగోవిశిష్యతే  శ్లో - 2

కర్మసన్న్యాసము- కర్మయోగము
రెండును మోక్షదాయకములే
కానీ ఆ రెండింటిలో కర్మ సన్న్యాసం
కంటే కర్మయోగమే గొప్పది

కర్మసన్న్యాస పూర్వకమైన జ్ఞానయోగము, కర్మాచరణ పూర్వక నిష్కామ కర్మయోగము రెండును గొప్ప శ్రేయస్సును కలుగజేయునవియే. ఈ రెండును మోక్షప్రదములే, కాని ప్రారంభస్థితిలో వున్నవారు కర్మలను వదలివేయడము కంటే ఆచరించడమే ఉత్తమము. వారికి కర్మను సన్యసించడమంటే కర్మను ఆచరించడమే సక్రమమైన మార్గం. అర్జునుడు ఇంకను పూర్వ నిర్విషయ జ్ఞానస్థితిని పొందనందున ఆయన్ను దృష్టిలో వుంచుకొని భగవానుడు పై విధంగా చెప్పియుండవచ్చును.

మరియు ఈ ప్రపంచములో జ్ఞానులకంటే అజ్ఞానులే అధిక సంఖ్యలో వున్నారు. మున్ముందు వారందరి శ్రేయస్సునుద్దేశించి కూడా భగవానుడు అర్జునుని పరంగా ఈ హితబోధచేశాడు అని ఆశించవచ్చు. ఈ విధంగా భగవానుడు మానవకోటిని ఉద్దేశించి చెప్పనిచో ప్రతివాడు తాను నిర్విషయస్థితిని పొందానని తలంచితాను చేయవలసిన కర్మలను చేయక సోమరియై పరాన్న భుక్కుగా మారి భుక్తిని, ముక్తికి రెండింటికి చెడిన రేవడుగా మారును- అందువల్లనే ఈ విధంగా చెప్పడంజరిగింది.

"జ్ఞేయస్స నిత్య సన్న్యాసీ
యోన ద్వేష్టి న కాంక్షతి
నిర్ద్వంద్వో హి మహాబాహో
సుఖం బంధాత్ప్రము చ్యతే"  శ్లో -3

అర్జునా!
దేనిని ద్వేషింపనివాడు
దేనిని కోరని వాడు
అతడేనిత్య సన్న్యాసి
ద్వంద్వములనుండి
విడివడినవాడు సులభముగ
సంసారబంధము నుండి విముక్తుడు
కాగలడు

"సాంఖ్యయోగౌ పృథగ్బాలాః
ప్రవదన్తిన పండితాః
ఏకమప్యా స్థితః సమ్య
గుభయోర్విందతేఫలమ్"    శ్లో -4

అవివేకులైనవారు
సాంఖ్యము వేరు, యోగము
వేరు అని తలంచెదరు కాని
పండితులైన వారు అట్లు
తలంపరు, ఆ రెండింటిలో
ఏ ఒక్కదానినైనను మనుజుడు
చక్కగా ఆచరించగలిగినచో
ఆ రెండింటి యొక్క ఫలమును
అతడు పొందుచున్నాడు

"యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానం
తద్యోగై రపిగమ్యతే
ఏకం సాంఖ్యం చ యోగంచ
యః పశ్యతి స పశ్యతి"    శ్లో -5

జ్ఞానయోగులు పొందు స్థానమును
కర్మయోగులు కూడా పొందుచున్నారు
"జ్ఞానం-కర్మం" ఈ రెండింటిని
ఒకటిగ చూచువాడు నిజమును
చూచువాడైయున్నాడు

"సన్న్యాసస్తు మహాబాహో!
దుఃఖమాప్తుమయోగతః
యోగయుక్తో మునిర్బ్రహ్మ
న చిరేణాధి గచ్ఛతి"    శ్లో -6

యోగము లేకుండా సన్న్యాసమును
పొందుట కష్టముతో కూడుకున్న
విషయము, యోగయుక్తుడైన
మననశీలుడు బ్రహ్మమును
శీఘ్రముగ పొందుచున్నాడు

"యోగయుక్తో విశుద్ధాత్మా
విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మ భూతాత్మా
కుర్వన్నపి న లిప్యతే"    శ్లో - 7

యోగయుక్తుడును, విశుద్ధ
హృదయుడును, మనో
జయము కలవాడును
జితేంద్రియుడును
సర్వుల యందలి ఆత్మయు
తన ఆత్మయు ఒకటేయని
తెలుసుకున్నవాడును అగు
మనుజుడు కర్మలను చేసినను
వాటి చేత అంట బడడు

నైవ కించిత్క రోమీతి
యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర
న్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ శ్లో- 8

"ప్రలప న్విసృజ న్గృ హ్ణన్
ఉన్మిషన్ నిమిషన్నపి
ఇంద్రియాణీంద్రియార్థేషు
వర్తన్త ఇతి ధారయన్"    శ్లో - 9

తత్త్వమునెరిగిన యోగయుక్తుడు
చూచుచు, వినుచు, తాకుచు
నడుచుచు, నిద్రించుచు, శ్వాసించుచు
విడుచుచు, పలుకుచు, గ్రహించుచు
కనులు తెరుచుచు, మూయుచు
ఇంద్రియములు ఆయా విషయము
లందు ప్రవర్తించు చున్నవేగాని
నేనేమియు చేయుట లేదని తలంచును

"బ్రహ్మణ్యాధాయ కర్మాణి
సంగం త్యక్త్వాకరోతియః
లిప్యతే న సపాపేన
పద్మ పత్ర మివామ్భసా" శ్లో - 10

తాను చేయుకర్మలను
భగవానునికి, సమర్పించి
ఆసక్తిని విడనాడి కర్మలు
చేయుమనుజుడు
తామరాకునీటి చేత
అంటబడనట్లు పాపముల
చేత అంటబడడు

"కాయేన మనసా బుద్ధ్యా
కేవలై రింద్రియైరపి
యోగినః కర్మకుర్వన్తి
సంగం త్యక్త్వాత్మ శుద్ధయే" శ్లో -11

యోగులు ఆత్మశుద్ధి కొరకు
ఫలము పై ఆసక్తిని వీడి
దేహేంద్రియ మనో బుద్ధుల
ద్వారా కర్మలనాచరించుచున్నారు

"యుక్తః కర్మఫలంత్యక్త్వా
శాంతిమాప్నోతి నైష్ఠికీమ్
అయుక్తః కామకారేణ
ఫలే సక్తో నిబధ్యతే" శ్లో - 12

యోగయుక్తుడు కర్మఫలములను
త్యజించి భగవత్ప్రాప్తి రూపమగు
శాంతిని పొందుచున్నాడు, యోగము
లేనివాడు కామప్రేరితుడై కర్మఫలము
నందు ఆసక్తి కలిగినవాడై కర్మలకు
బద్ధుడగుచున్నాడు

"సర్వకర్మాణి మనసా
సన్న్యస్యాస్తే సుఖంవశీ
నవ ద్వారేపురే దేహీ
నైవ కుర్వన్న కారయన్" శ్లో -13

ఇంద్రియ నిగ్రహముగల
సంయమి సమస్తకర్మములను
మనస్సు చే సన్న్యసించి
వాటిని తాను చేయనివాడై
చేయించనివాడై నవద్వార
పురమునందు సుఖముగా వుంటున్నాడు

జీవితము ఆనందమయముగ ఎట్లుండునో దానిని గురించి ఇక్కడ చెప్పబడింది. అందుకు గాను ముందుగా మానవుడు తన ఇంద్రియములను స్వాధీన పరుచుకొనవలెను. రెండవ పాదములోని చివరి పదము అయిన "వశీ" అను పదానికి వర్తించే అర్థము ఇదే. ఇంద్రియములు వశమందులేనిచో ఈ ప్రపంచమంతా వశమందున్నను వ్యర్థమే,

ఇంద్రియ నిగ్రహముగల వానికే పూర్ణ సుఖము లభిస్తుంది. కావున సుఖాన్ని, శాంతిని కాంక్షించేవాడు ముందుగా తన ఇంద్రియములను వశమందుంచు కొనవలెను.

అట్టి సంయమనశీలుడు మనస్సుచే సమస్త కర్మల యొక్క ఫలములను త్యజించి ఈ దేహమనే నగరమునందు తానేమియు చేయకయు, చేయించకయు సుఖమును, శాంతిని బడయుచున్నాడు. సుఖమును శాంతిని కోరువాడు రెండు సాధనములను తప్పక అవలంభించవలెనని ఈ శ్లోకము తెలియజేస్తున్నది. అవి (1) ఇంద్రియ నిగ్రహము, మనోజయము(2) సర్వకర్మ ఫలత్యాగము

ఇక్కడ "నవద్వారములు" అంటే

| | | |
|---|---|---|
| 1 | కంటి ద్వారములు | - 2 |
| 2 | చెవిద్వారములు | - 2 |
| 3 | ముక్కుద్వారములు | - 2 |
| 4 | నోటి ద్వారము | - 1 |
| 5 | మూత్రద్వారము | - 1 |
| 6 | మలద్వారము | - 1 |
| | | ------- |
| | ఈ మొత్తము కలిపి | 9 |
| | | -------- |

దేశపాలకుడైన రాజు నివాసానికి ఇప్పటి రాష్ట్రపతి లేక ప్రధానమంత్రి రాజభవనమునకు (రాష్ట్రపతిభవనానికి రాష్ట్రపతిభవన్, ప్రధానమంత్రి నివాసానికి (ప్రైమినిస్టర్స్ హౌస్) బలమైన ద్వారాలుంటాయి. వాటిలో ఎవరు ప్రవేశించలేరు. అక్కడ రాజు సుఖముగా కాలము గడుపును. ద్వారములన్నీ సురక్షితముగ వున్నపుడే రాజు ఆ భవనంలో సురక్షితంగా వుండగలుగుతాడు. అట్లే "నవద్వారపురమైన"ఈ దేహములో జీవుడు (ఆత్మ) అనే రాజు ఇంద్రియ నిగ్రహము కలిగివున్నపుడే సుఖముగ వుండగలడు, లేనిచో జీవునకు ఎల్లప్పడు అశాంతియే.

Renouncing with the mind
All actions, the dweller in the
body, who is master himself,
rests happily in his city
of nine gates, neither doing
nor getting any thing done

The prinicIple gates of the body are the two eyes, the two Nostrills, the two ears, the mouth and two organs of excretion- though really speaking the countless pores of the skin are no less gates. If the gate keeper always remains on the alert and performs his task, letting in or out only the objects that deserve ingress or egreess, then of him it can truly be said that he has no part in the ingress or egrees but that he is a passive witness. He thus does nothing nor gets any thing done.

From the Gospal of Self Less Action pages 215 and 216

"నకర్తృత్వం నకర్మాణి
లోకస్య సృజతి ప్రభుః
నకర్మ ఫల సంయోగం
స్వభావస్తు ప్రవర్తతే" శ్లో -14

పరమాత్మ కర్తృత్వమునుగాని
కర్మములను గాని, కర్మఫల
సంబంధములను గాని
కలుగజేయడు, సృష్టి
యందు ప్రకృతి స్వభావమే
ఆ విధంగా ప్రవర్తించుచున్నది

సృష్టికర్త యగు పరమేశ్వరుడు జీవరాసులలో దేనికిని కర్తృత్వాదులను సృష్టించలేదు. ప్రకృతి జన్యమగు వారి వారి జన్మాంతర సంస్కారముననుసరించి మానవులు ఆయా కర్మలను చేయుచున్నారు. మానవుడు తనను తాను ఉద్ధరించుకొనుటకు లేదా పతనమునొందించుకొనుటకుగాను తనకు తానే సమర్థుడు. ఇందులో ఇంకొకరి సంబంధము ఏమియువుండదు, కాకపోతే పూర్వజన్మ సంస్కారము ఇందుకుకొంత దోహదపడుతుంది, కనుక మానవుడు ఉన్నతి నొందుటకు అనేక అవకాశాలున్న ఈ మానవ జన్మను ఆత్మోద్ధరణ నిమిత్తం సద్వినియోగ పరుచుకోవలసి వుంది.

"నాదత్తే కస్య చిత్పాపం
నచైవ సుకృతం విభుః
అజ్ఞానేనా వృతం జ్ఞానం
తేనముహ్యన్తి జన్త వః" శ్లో -15

జనుల యొక్క పాపపుణ్యములను
పరమాత్మ గ్రహింపడు, జ్ఞానము
అజ్ఞానము చేత ఆవరించబడియున్నది
అందువలన జనులు మోహమును పొందుచున్నారు.

The 14th and 15th Shlokas are an echo of the Sankhyan doctrine that Purusha does not act. Only prakrithi acts, and asVedeanta equates purusha or Atman with the Supreme the words Prabhu (14) and Vibhu (15) meaning the Lord or the pervading or the presiding principle are here used. Gandhiji takes both words to mean the Supreme, while some take them to mean the individual self. In either case, the meaning is the same. Let no one however run in to the error that the Supreme of the Gita is thus like the Aristotelian God, a contemplative or abstract conception, never acting, never interesting Himself in the universe, a king that reigns but does not Govern. It is the reign of the law that is emphasized in the Sholkas, though the ultimate source of all law is the supreme Being pervading all, sustaing all, ఈ విషయన్నే 15 అధ్యాయము 17లో ఈ విధంగా భగవానుడు ప్రకటించాడు.

"ఎవడు అవినాశియు, ఈశ్వరుడును
అయి మూడులోకములను ప్రవేశించి
భరించుచున్నాడో అట్టి ఉత్తమ
పురుషుడే పరమాత్మయని తెలుసుకో"

ప్రకటించాడని తెలుపుతూ అదే సమయములో

Whilst for the Sankhya or the Jnana Yogi the supreme acting as the universal law, is enough, the KarmaYogi or Bhaktha will not be satisfied with any thing less than a God willing to accept his devotion, an ever ready friend and comforter, as we shell see is Shloka 29 of this discourse.

నేను యజ్ఞతపస్సులను
అనుభవించు వాడననియు
సర్వలోక నియామకుడననియు
సర్వ ప్రాణులకు ఆప్తుడననియు
తెలిసికొని శాంతిని పొందుచున్నాడు 5-29

8-17,19-18-13,5-1 అధ్యాయములలోని శ్లోకాలను కూడా పరిశీలించి చూచినపుడు పై విషయము అవగతం కాగలదు.



బ్రహ్మదేవుని యొక్క పగటిని
వేయి యుగముల పరిమితి
గలదానిగను, రాత్రిని కూడా
అదే విధంగా వేయి
యుగముల పరిమితికల
దానిగను తెలియు వారు
రాత్రింబవళ్ల యొక్క
పరిణామమును చక్కగా
ఎరిగినవారగు చున్నారు 8-17

అర్జునా !
సర్వభూతములు బ్రహ్మకు
పగలగునపుడు ఆవిర్భవించును
రాత్రి అయినపుడు అంతరించును
ఈ విధంగా జనన మరణములను
మరల మరల పొందుచున్నారు 8-19

అర్జునా!
కర్మసిద్ధాంతమును తెలుపు
సాంఖ్యశాస్త్రమునందు
సర్వకర్మలు నెరవేరుటకు
చెప్పబడిన ఐదు కారణాలను
నావలన వినుము 18-13
సర్వకర్మలు నెరవేరుటకు
దేహము, కర్త, ఇంద్రియములు,
వివిధములగు క్రియలు, దైవము
అను ఈ అయిదు కారణములై వున్నవి18-15
మనో వాక్కాయములచేత
మనుజుడు ప్రారంభించెడి కర్మ
న్యాయమైనను, అన్యాయమైనను
అట్టి దానికి ఈఐదును కారణములై వున్నవి18-16

దీనంతటిని లోతుగా ఆలోచించి చూచినప్పుడు కలిగేది భ్రమయేనని గాంధీజీ తిరిగి ఈ విధంగా వ్యాఖ్యానిస్తున్నారు

We are all trying to think of the unthinkable, to describe the indescribable, to know the unknown, that is why our speech falters, is inadequate and contradictory,. That is why the Vedas describe Brahman has not this, if we exisist, if our parents and their parents have exisisted, then it is proper to believe in the parent of the whole creation. If he is not, we are nowhere, and that is why all of us call one God differently. He is one and yet many. He is smaller than an atom and bigger than the Himalayas. He is contained even in a drop of the ocean and yet not even the seven seas can compass him. Reason is power less to know him. He is beyand the reach or grasp of reason.

(Gandhiji in Young India 21st Jan 1926)

"జ్ఞానేన తుతదజ్ఞానం
యేషాం నాశిత మాత్మనః
తేషామాదిత్యవ జ్ఞానం
ప్రకాశయతి తత్పరమ్" శ్లో - 16

ఎవరి అజ్ఞానము ఆత్మ
జ్ఞానము వలన నశించునో
అట్టివారి జ్ఞానము సూర్యునివలె
పరమాత్మను ప్రకాశింపజేయుచున్నది

'తద్బుద్ధయస్త దాత్మానః
తన్నిష్ఠాస్తత్పరాయణాః
గచ్ఛన్త్య పునరావృత్తిం
జ్ఞాన నిర్ధూత కల్మషాః" శ్లో -17

బ్రహ్మమునందే బుద్ధి కలిగి
పరబ్రహ్మయే ఆత్మయని
ఎరిగి, బ్రహ్మమునందే నిష్ఠ
కలిగి, బ్రహ్మయే పరమ
గతియని భావించినవారు
జ్ఞానము చేత పాపమును
నాశనమొనర్చి జన్మరహిత
మైన మోక్షపథమును పొందుదురు

"విద్యావినయ సంపన్నే
బ్రహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ
పండితాస్సమదర్శినః" శ్లో -18

విద్యా వినయ సంపన్నుడైన
బ్రహ్మత్వము గలవాని యందును
గోవునందును కుక్కయందును
ఛండాలుని యందును జ్ఞానులు
సమత్వ బుద్ధిని కలిగి యుందురు

"ఇహైవతైర్జితః సర్గో
యేషాం సామ్యేస్థితం మనః
నిర్దోషం హి సమంబ్రహ్మ
తస్మాద్బ్రహ్మణితే స్థితాః" శ్లో - 19

ఎవరి మనస్సు స్థిరముగ సమ
భారమునందుండునో వారు
ఈ జన్మమునందే జీవన్ముక్తులు
అగుచున్నారు, బ్రహ్మముదోష
రహితమైనది, సమమైనది
అందువలన వారు బ్రహ్మనిష్ఠులే
అవుతున్నారు

"న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య
నోద్విజేత్ప్రా ప్యచా ప్రియం
స్థిర బుద్ధిర సమ్మూఢో
బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః" శ్లో -20

స్థిర బుద్ధి గలవాడును
మోహరహితుడును
అగు బ్రహ్మ వేత్త బ్రహ్మము
నందున్నవాడై ప్రియము
కలిగినపుడు సంతసించడము
కాని అప్రియము కలిగినపుడు
శోకించడం కాని కలిగి యుండడు

"బాహ్య స్పర్శేష్వ సక్తాత్మా
విన్దత్యాత్మనియత్సుఖం
స బ్రహ్మ యోగ యుక్తాత్మా
సుఖమక్షయ మశ్నుతే" శ్లో - 21

బాహ్య విషయములందు
ఆసక్తి లేనివాడై ఆత్మ
సుఖమునను భవించెడి
బ్రహ్మవిదుడు నాశరహిత
మైన బ్రహ్మపదమును పొందును

యేహిసం స్పర్శ జా భోగా
దుఃఖ యోనయేవతే
ఆద్యంత వన్తః కౌంతేయ!
నతేషు రమ తేబుధః శ్లో -22

అర్జునా!
ఇంద్రియ విషయ సంయోగము
వలన పుట్టిన భోగములు
ఆద్యంతములు కలిగిదుఃఖ
హేతువులగుచున్నవి
జ్ఞాని ఈ విషయ భోగముల
యందు ఆసక్తుడుకాడు

"శక్నోతీహైవయ స్సోఢుం
ప్రాక్శరీరవిమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం
సయుక్తః స సుఖీనరః" శ్లో - 23

ఎవడు ఈ దేహయాత్రను
చాలించుటకు పూర్వమే
తనలోని కామక్రోధముల
వలన కలుగు సంక్షోభము
లను అరికట్టగలడో అతడే
యోగియును, సుఖవంతుడును
అయి వున్నాడు

యోన్తః సుఖోన్త రారామ
స్తథాంతర్జ్యోతి రేవ యః
స యోగీ బ్రహ్మనిర్వాణం
బ్రహ్మ భూతోధి గచ్ఛతి శ్లో - 24

ఆత్మయందే ఆనందించుచూ
ఆత్మయందే రమించుచూ
ఆత్మయందే ప్రకాశముగల
వాడైయున్నట్టియోగి బ్రహ్మ
భూతుడై బ్రహ్మసాక్షాత్కారమును
పొందుచున్నాడు

"లభన్తే బ్రహ్మనిర్వాణ
మృషయః క్షీణ కల్మ షాః
ఛిన్నద్వైధాయతాత్మానః
సర్వభూతహితేరతాః" శ్లో - 25

పాపరహితులును, సంశయ
రహితులును, దేహేంద్రియ
మనోబుద్ధులను జయించినవాడును
సర్వ భూతహితులును అగు
ఋషులు బ్రహ్మ సాక్షాత్కారమును
పొందుచున్నారు

"కామక్రోధ వియుక్తానాం
యతీనాం యత చేతసాం
అభితో బ్రహ్మ నిర్వాణం
వర్తతే విది తాత్మనాం" శ్లో -26

కామక్రోధములు లేనట్టియు
నిశ్చల చిత్తులును, ఆత్మజ్ఞానులు
అగుయతులు (ఋషులు)
పరిపూర్ణ బ్రహ్మజ్ఞానము
కలవారై యున్నారు

"స్పర్శా న్కృత్వా బహిర్బా హ్యాన్
చక్షుశ్చై వాంతరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌకృత్వా
నాసాభ్యంతర చారిణౌ" శ్లో - 27

"యతేంద్రియ మనో బుద్ధి
ర్మునిర్మోక్ష పరాయణః
విగతేచ్ఛా భయక్రోధో
యస్సదాముక్త ఏవసః" శ్లో - 28

బాహ్యమున వున్న శబ్దాది
విషయములను బాహ్యము
నందే వుంచి, దృష్టిని భ్రూమధ్య
మందు నిలిపి, ముక్కు పుటము
లలో సంచరించెడి ప్రాణాపాన
వాయువులను సమముగ జేసి
ఇంద్రియ మనోబుద్ధులను
నిగ్రహించి, ఇచ్ఛా, భయ
క్రోధాదులను విడిచినవాడై
మోక్షాపేక్ష కలిగిన మనన శీలుడు
ఎల్లప్పుడును ముక్తుడే

సాధారణంగా మానవులలో ప్రాణాపానవాయువులు సమముగ ప్రవహించవు. ప్రాణాయామ భ్యాసముచే వానిని క్రమరీతిని పోవు లాగున చేయుట ఆరోగ్యమునకు, చిత్తైకాగ్రతకు కూడా ఎంతో అవసరం, కనుకనే ప్రాణాయామమను దానిని అష్టాంగయోగములలో ఒకదానిగా పేర్కొనడం జరిగింది. ప్రాణమునకు మనస్సునకు అత్యంత సన్నిహిత సంబంధము కలదు. ఒకదానిని నిరోధించిన మరి యొకటి విరుద్ధముగ ప్రవహించును. కావున అతి సూక్ష్మమగు మనస్సును నిగ్రహించుటయందు సహాయకారిగా వుండుటకై ప్రాణాయామమును శాస్త్రమునందు విధించారు. ప్రాణాపానములను సమముగా చేయుటచే మనస్సుచపలత్వమును వీడి ఏకాగ్రతను పొందును.

ఈ విషయం గాంధీమహాత్ముడు ఈ విధంగా తెలియజేస్తున్నాడు.

"These Shlokas refer to some of the Yogic practices laid down inthe "Yoga Sutras" A word of caution is necessiary regarding these practices. They serve for the Yogin the same purpose as Athletics and gymnastics do for the Bhogin (who pursues worldly pleasures) His physical exercises help the latter to keep his senses of enjoyment in full vigour. The yogic practices help the yogin to keep his body in condition and his senses in subjection, men versed in these practices are rare in these days, and few of these turn them to good account. He who has achieved the preliminary stage on the path of the self discipline, he who has a passion for freedom, and who having rid himself of the pairs of opposites has conquered fear, would do well to go in for these practices which will surely help him. It is such a disciplined man alone who can through these practices, render his body a holy temple of God. Purity both of the mind and body is a sine qua-non, without which these proceses are likely in the first instance, to lead a man astray and then drive him deeper in to the slough of delusion, that this has been the result in some cases may know from actual experience. That is why that prince of yogins "Patanjali" gave the first place to "Yamas" (cardinal vows) and niyamas (casual vows), and held as eligible for yogic practices only those who have gone through the

preliminery discipline. The fine cardinal vows are non-violence, truth, non-stealing, five celibaey non possession. The five casual vows are - bodily purity, contentment, the study of the scriptures, austerity and meditation of God.

"భోక్తారం యజ్ఞ తపసాం
సర్వలోకమహేశ్వరం
సుహృదం సర్వభూతానాం
జ్ఞాత్వామాం శాంతి మృచ్ఛతి" శ్లో - 29

నేనుయజ్ఞ తపస్సులను
అనుభవించువాడను
సర్వలోక నియామకుడను
సర్వప్రాణులకు ఆప్తుడను
నన్ను గూర్చి ఈ విధంగా తెలుసు
కున్నవారు శాంతిని పొందుచున్నారు

ఈ విధంగా ఉపనిషత్తును బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన
శ్రీ మద్భగవద్గీత యందలి కర్మసన్న్యాసయోగము అను పేరుగల
అయిదవ అధ్యాయము సమాప్తముగావించబడింది



# గీతా సంహిత

## అధ్యాయము ఆరు | ఆత్మ సంయమ యోగము

భావన, వివేచనల ద్వారా మానవుడెంతటి ఉన్నతోన్నత స్థానమును అందుకొనగలడో వెనుకటి అధ్యాయములో పరిశీలించాము. "కర్మ- వికర్మ- అకర్మ" కలిసినపుడు సాధన అంతాపూర్తి అగునని కూడా తెలుసుకొంటిమి. కర్మ అనునది స్థూల వస్తువు. మనము ఆచరించే స్వధర్మ కర్మలలో మానసిక సహకారముండవలెను. మానసిక శిక్షణ కొరకు చేయబడు కర్మను- వికర్మ, విశేష కర్మ లేక సూక్ష్మ కర్మ అని చెప్పబడుతున్నది. కనుక "కర్మ- వికర్మ" రెండును అవసరమే. ఈ రెండింటి ప్రయోగముతో "అకర్మ"కు భూమిక ఏర్పడుతున్నది. ఈ భూమికలో కర్మ, సన్న్యాసం రెండును ఏక రూపమే అని వెనుకటి (అయిదవ) అధ్యాయములో తెలుసుకున్నాము.

ఇక ఈ ఆరవ అధ్యాయము మొదట కర్మ యోగము యొక్క భూమిక, సన్న్యాసం యొక్క భూమిక నుండి వేరుగ అగుపడుచున్నను వాస్తవానికి ఈ రెండును ఏకరూపమే. మన దృష్టిలో మాత్రమే ఈ భేదం, ఐదవ అధ్యాయములో వివరించిన స్థితిని పొందించు సాధనలను అన్వేషించుటయే తరువాత వచ్చే అన్ని అధ్యాయాలలోని విషయము.

భగవద్గీత సమస్త ప్రపంచమునుద్దేశించి సమస్త మానవకోటినుద్దేశించి చెప్పబడింది. అది ఏదో కొందరు సాధువుల కొరకు చెప్పబడింది కాదు. ప్రతి మానవుని ఉన్నతి కొరకు ఉద్దేశించిచెప్పబడింది. సాధారణ జనులందరిని అది ఉన్నత మార్గాన నడిపించే సాధనము. భారత జాతీయోద్యమ నాయకులలో అగ్రగణ్యుడైన తిలక్ మహారాజు తమ "గీతారహస్యము" నందు ఈ విషయాన్నే స్పష్టీకరించారు. జాతీయోద్యమ నాయకులలో

అగ్రగణ్యులైన మహర్షి అరవిందుడు, మహర్షి వినోబా కూడా దానిని బలపరిచారు. సాధారణ మానవుణ్ణి అధిమానవుడుగా రూపొందించుటకు కురుక్షేత్ర యుద్ధరంగాన ఆవిర్భవించిన మహోపదేశం ఇది. మానవుల వ్యవహారములు శుద్ధముగను, నిర్మలముగను ఉంచుకొనుచు మానసిక తృప్తిని, శాంతిని మనం ఎట్లు పొందగలమో దానికి మార్గమును చూపించడమే గీత చేసేపని. మన వ్యావహారిక విషయములన్నింటిలోను గీత ఏదో ఒక రూపంలో ప్రత్యక్షమవుతూనే వుంటుంది. నిన్ను వున్న దగ్గరనే వుంచుట గీత యొక్క లక్ష్యముకాదు. నిన్ను చేయిపట్టుకొని చివరి మెట్టుదాకా తీసుకొని వెళుతుంది. మానవుడు ఎంత దరిద్రుడు, దుర్బలుడు, మూర్ఖాతిమూర్ఖుడు అయినను అతని వద్దకు "గీతామాత" తిన్నగా వెళ్లి చేయిపట్టుకొని ముందునకునడుపుటకున్ను, పైకెత్తుటకున్ను, మానవుడు తన వ్యవహారమును పరిశుద్ధముగ వుంచుకొనుటకున్ను తద్వారా పరమోత్కృష్ట స్థితిని పొందుటకును గీత కొని పోతుంది. గీత ఆవిర్భావం అందుకే "నేను జడుడను, లౌకికుడను, సాంసారిక జీవిని" అని చుట్టూగోడకట్టుకొని కూర్చుండడం కాదు కావలసింది. ఈ మూడున్నర మూరల శరీరమే నా సరస్వము అని, నా వలన ఏమౌతుంది? అని చుట్టూకట్టుకొన్న గోడలలో మానవుడు తనను తాను బంధించుకోరాదు. ముందుకు సాగి ఊర్ధ్వగతికి పోయె సాహసము చేయాలి.

ఈ అధ్యాయంలోని ఐదవ శ్లోకం ఏం చెపుతున్నదో చూడండి.

"తనను తానే ఉద్ధరించుకొనవలెను
తనను తాను అధోగతి పాలు చేసుకో
కూడదు. తన ఆత్మయే తనకు
బంధువు, తన ఆత్మయే తనకు శత్రువు" అని చెపుతున్నది.

నన్ను నేను తప్పక పైకి తీసుకుపోవుదును అనే ధైర్యముతో ముందుకు సాగాలి. నేనొక క్షుద్ర సాంసారిక జీవిని అని అనుకోకూడదు. మనశ్శక్తిని చంపి వేసుకోకూడదు "సద్భావనలు" అను రెక్కలను విరిచి వేసుకోవద్దు. నీ భావనా వైశాల్యమును పెంచుకో. ఇందుకు చండుల పక్షిని ఉదాహరణగా ఉంచుకోమంటాడు మహర్షి వినోబా. చండుల పక్షి ప్రాతఃకాల సూర్యుని చూచి ఆయన వద్దకు ఎగిరి పోవలెననుకొంటుంది. మనమును అట్లే చేయవలసి వుంటుంది. పాపము దుర్బలమైన రెక్కలతో సూర్యుని అంత ఎత్తుకు చండుల పక్షి ఎగురగలదా? అంటే జవాబు లేదు అని వస్తుంది. కాని అది తన భావనలో తప్పక సూర్యుని చేరుకుంటుంది. మరి మన ఆచరణో ఇందుకు విరుద్ధంగా వుంటుంది. మనం పోగల అంత ఎత్తునకైనను కనీసం పోకుండా, భావనలకు అంతరాయము కల్పించుకొని మనలను మనమే మరింత దిగద్రోసికొనుచున్నాము. ఉన్నశక్తిని సంకుచిత భావనల ద్వారా నష్ట

పరుచుకొనుచున్నాము. భావనయే కాళ్లు విరిగి కూర్చున్నపుడు అధఃపతనం కాక మరేమి వున్నది? కనుక మన భావనలు ఎప్పుడును ఊర్ధ్వముఖంగా సాగి ముందుకు పోతుండవలెను. అందువలన భావనలను సంకుచిత పరుచుకోకూడదు. ఆత్మను అవమానపరుచుకోకూడదు, విశాలమగు భావనయు, ఆత్మ విశ్వాసము వుండిననే సాధకుడు నిలువగలడు. దీనివలనే ఆత్మోద్ధరణ జరుగుతుంది. అంతేగాని ధర్మము కేవలము సాధువుల కొరకేయని చెప్పి "నీ పరిస్థితులను బట్టి ఇపుడు నీవు చేస్తున్న పని ఉచితమైనదే" సాధువులన బడే వారి నుండి అంగీకార పత్రమును పొందే ఆలోచన సరైందికాదు. భేదజనకమయిన ఇట్టి ఆలోచనల వలన నిన్ను నీవు బంధించుకొంటున్నావు. ఉన్నతమైన ఆకాంక్షను పెట్టుకొనకపోయినచో నీవు ఒక్క అడుగు అయినను ముందుకు వేయలేవు.

ఈ దృష్టి, ఈ ఆకాంక్ష, ఈ మహోన్నత భావన వున్న వానికే సాధనల సహకారము అవసరము, అది లేనిచో సర్వము సమాప్తము. బాహ్యకర్మకు సహాయకారిగా వికర్మయను మానసిక సాధన చెప్పబడింది. కర్మకు సహాయముగ ఎప్పుడును వికర్మ వుండవలెను. ఈ రెండింటి యొక్క కలయిక వలన అకర్మయను దివ్యస్థితి లభించును. దానిని, దాని రీతులను అయిదవ అధ్యాయములో చూచి యుంటిమి. ఆరవ అధ్యాయము నుండి వికర్మ యొక్క రీతులను, మానసిక సాధనమును గూర్చి చెప్పబడుతున్నది. ఈ మానసిక సాధనము గూర్చి చెప్పటకు ముందు గీత ఇట్లనుచున్నది. "ఓ సోదర జీవుడా! నీవు దేవుడవు కాగలవు, నీవీ దివ్యమైన ఆకాంక్షను పెట్టుకొనుము. మనస్సును నిర్లిప్తంచేసుకొని దాని రెక్కలను దృఢపరుచుకొనుము" అనగా వికర్మకు భక్తియోగము, ధ్యానం, జ్ఞాన, విజ్ఞానములు గుణ వికాసము, ఆత్మానాత్మ వివేకము మొదలైన రూపములున్నవి. ఈ ఆరవ అధ్యాయంలో ధ్యానయోగము (ఆత్మసంయమన యోగము) యొక్క మార్గమును గూర్చి చెప్పబడింది.

ఈ అధ్యాయములో 47 శ్లోకాలున్నాయి. ఇందలి ప్రధాన విషయాలు

1 నిష్కామకర్మయోగ ప్రస్తావన యోగారూఢుని లక్షణాలు (1నుండి 4వ శ్లోకము వరకు)
2. ఆత్మోద్ధరణ, జ్ఞానియొక్క స్వభావము (5 నుండి 10వ శ్లోకము వరకు)
3. ధ్యాన యోగ పద్ధతి (11వ శ్లోకము నుండి 32వ శ్లోకము వరకు)
4. మనోనిగ్రహమును గూర్చి (33వ శ్లోకము నుండి 36వ శ్లోకము వరకు)
5. యోగభ్రష్టునికి సద్గతి, ధ్యాన యోగము యొక్క మహిమ (37 నుండి 47వ శ్లోకము వరకు)

నిష్కామకర్మ యోగ ప్రస్తావనతో భగవానుడు ఈ ధ్యానయోగమును (ఆత్మ సంయమన యోగము)ను ప్రారంభిస్తున్నాడు.

"అనాశ్రితః కర్మఫలం
కార్యం కర్మ కరోతి యః
స సన్న్యాసీ చ యోగీచ
న నిరగ్నిర్న చాక్రియః శ్లో - 1

తాను చేయవలసిన పనులను
ఫలాపేక్ష లేకుండా చేయువాడే
సన్న్యాసి, యోగి. అగ్నిహోత్రాదు
లను విడిచినంత మాత్రం చేత
అతడు సన్న్యాసి కాడు, కర్మలను
చేయనంత మాత్రము చేత
యోగియునుకాడు

యం సన్న్యాస మితి ప్రాహుః
యోగం తం విద్ధి పాండవ
న హ్యసన్న్యస్తసంకల్పో
యోగీ భవతి కశ్చన శ్లో - 2

అర్జునా!
దేనిని సన్న్యాసమనియనియెద
అదియే యోగమని గ్రహింపుము
సంకల్పత్యాగము చేయని వాడు
ఎవడును యోగి కానేరడు

అరురుక్షోర్మునేర్యోగం
కర్మకారణ ముచ్యతే
యోగారూఢస్య తస్యైవ
శమః కారణ ముచ్యతే శ్లో - 3

యోగస్థుడు కాగోరు
వానికి నిష్కామ కర్మ సాధనము
యోగస్థుడైనవాడు
కర్మారాహిత్యమును పొందవలెను

యదా హి నేంద్రాయార్థేషు
న కర్మస్వనుషజ్జతే
సర్వసంకల్ప సన్న్యాసీ
యోగారూఢస్తదోచ్యతే శ్లో - 4

ఇంద్రియ విషయములందును
కర్మల యందును అపేక్ష
నుంచక సర్వసంకల్పములను
వీడిన వాడు యోగారూఢుడు అన
బడుచున్నాడు

ఉద్ధరే దాత్మనాత్మానం
నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు
రాత్మైవ రిపు రాత్మనః శ్లో - 5

తనను తానే ఉద్ధరించుకొనవలెను
తనను తాను అధోగతి పాలు చేసుకో
కూడదు. తన ఆత్మయేతనకు
బంధువు, తన ఆత్మయేతనకు శత్రువు

బంధు రాత్మాత్మన స్తస్య
యేనాత్మైవాత్మనా జితః
అనాత్మనస్తు శత్రుత్వే
వర్తేతాత్మైవ శత్రువత్ శ్లో - 6

ఎవరు ఆత్మ నిగ్రహము
కలిగి యుందురో వారి
ఆత్మయే వారికి బంధువు
ఆత్మనిగ్రహము లేనివారికి
వారి ఆత్మయే శత్రువు

జితాత్మనః ప్రశాన్తస్య
పరమాత్మా సమాహితః
శీతోష్ణ సుఖదుఃఖేషు
తథా మానావమానయోః శ్లో - 7

మనస్సును జయించినవాడును
ప్రసన్నమైన అంతఃకరణ
గలవాడును అగు మానవునకు
శీతోష్ణ సుఖదుఃఖములయందును
మానావ మానముల యందును
ఆత్మాను భవము చెదరక యుండును.

జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా
కూటస్థో విజితేంద్రియః
యుక్త యుత్యుచ్యతే యోగీ
సమలోష్టాశ్మకాంచనః శ్లో - 8

జ్ఞాన విజ్ఞానములచేత
తృప్తి చెందినవాడును
కూటస్థుడును, జయింప
బడిన ఇంద్రియములు
గలవాడును యోగి అన
బడుచున్నాడు. అట్టి యోగి
మట్టిగడ్డయందును, రాతియందును,
బంగారము
నందును సమత్వము కలిగి యుండును

భగవానుని యొక్క నిర్గుణ, నిరాకార తత్వమును ఎరుంగుట విజ్ఞానము. జ్ఞాన విజ్ఞానములచేత తృప్తుడైన జితేంద్రియుడు కూటస్థుడు, యోగి అని పిలువబడుచున్నాడు. అతని దృష్టిలో మట్టి, రాయి, బంగారము అంతా ఒక్కటే అంతా సమానమే.

సుహృన్మిత్రార్యుదాసీన
మధ్యస్థద్వేష్య బంధుషు
సాధుష్వపి చ పాపేషు
సమబుద్ధిర్విశిష్యతే శ్లో - 9

సుహృదులు, మిత్రులు, శత్రువులు
ఉదాసీనులు, మధ్యస్థులు, ద్వేషులు
బంధువులు, సాధువులు, పాపులు
మొదలగు వారియందు సమబుద్ధి
కలవాడు శ్రేష్ఠుడు

యోగీ యుఞ్జీత సతతం
ఆత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా
నిరాశీర పరిగ్రహః శ్లో - 10

యోగియగు మనుజుడు
రహస్య ప్రదేశమునందు
ఏకాంతమున వున్నవాడై
వశీకృతమైన దేహేంద్రియ
ములుకలవాడై, ఆశలేనివాడై
ఇతరులనుండి ఏమియు ఆశించక
నిరంతరమును మనస్సును పరమాత్మ
యందే వుంచవలెను

శుచౌ దేశేప్రతిష్ఠాప్య
స్థిరమాసన మాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం
చైలాజిన కుశోత్తరం శ్లో - 11

తత్రైకాగ్రం మనః కృత్వా
యతచిత్తేంద్రియ క్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యాత్
యుద్యోగమాత్మవిశుద్ధయే శ్లో 12

పరిశుభ్రమైన ప్రదేశమునందు
మిక్కిలి ఎత్తును, మిక్కిలి పల్లమును
గానిచోట ఆసనము నేర్పరుచుకొని
ఆ ఆసనముపై దర్భలును,
మృగచర్మమును
వస్త్రమును క్రమముగా వుంచి, మనస్సును
ఇంద్రియములను స్వాధీనము చేసుకొని
మనస్సు నేకాగ్రము చేసి, ఆ ఆసనముపై
కూర్చుండి ఆత్మశుద్ధి కొరకు యోగాభ్యాసం
చేయవలెను

సమం కాయశిరోగ్రీవం
ధారయన్న చలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం
దిశశ్చా నవలోకయన్ శ్లో -13

ప్రశాన్తాత్మా విగత భీః
బ్రహ్మచారివ్రతే స్థితః
మనస్సంయమ్య మచ్చిత్తో
యుక్త ఆసీత మత్పరః శ్లో 14

యోగి అయినవాడు
తన శరీరమును, శిరమును
కంఠమును కదలనీయకుండా
స్థిరముగ నిలుపుచు దిక్కులపై
దృష్టిని సారించక నాసికాగ్రము
నందు దృష్టిని నిలపి, మనస్సును
నిగ్రహించి, భయరహితుడై
ప్రశాంత చిత్తముగలవాడై
బ్రహ్మచర్య వ్రతదీక్షయందు
కొనసాగుతూ చిత్తమును
నా యందేనిలపి, నన్నే పరమ
గతిగా భావించివుండవలెను

యుంజన్నేవం సదాత్మానం
యోగీ నియతమానసః
శాన్తిం నిర్వాణ పరమాం
మత్సంస్థామధిగచ్ఛతి శ్లో - 15

ఈ విధముగ నిశ్చలచిత్తుడై
మనస్సును ఆత్మధ్యానమందు
నిలిపిన యోగి నా స్వరూపమును
పొంది ఉత్తమ మోక్షపథమును
పొందుచున్నాడు

నాత్యశ్నతస్తు యోగోస్తి
న చైకాంత మనశ్నతః
న చాతిస్వప్న శీలస్య
జాగ్రతో నైవ చార్జున! శ్లో - 16

అర్జునా!
మిక్కుటముగ తినువానికి
అసలు తిననివానికి
ఎక్కువగా నిదురించు వానికి
ఎప్పుడును మేల్కొని యుండు
వానికి ఈ యోగము సిద్ధించదు

యుక్తాహార విహారస్య
యుక్తచేష్టస్య కర్మసు
యుక్త స్వప్నా వబోధస్య
యోగో భవతి దుఃఖహా శ్లో - 17

మితాహార విహారములు
మితనిద్ర, మెలుకువలు
గలవానికి, ఉచిత రీతిన
కర్మలయందు సంచరించువానికి
ఈ యోగము దుఃఖహరము అగుచున్నది

యదా వినియతం చిత్తం
ఆత్మన్యేవావతిష్ఠతే
నిస్పృహస్సర్వకామేభ్యో
యుక్త ఇత్యుచ్యతే తదా శ్లో - 18

నిగ్రహింపబడిన మనస్సు
ఆత్మయందునిలిచి యున్నపుడు
సర్వకామముల నుండి విముక్తుడై
యోగయుక్తుడగుచున్నాడు

యథా దీపో నివాతస్థో
నేఙ్గతే సోపమా స్మృతా
యోగినో యత చిత్తస్య
యుఞ్జతో యోగ మాత్మనః శ్లో - 19

ఆత్మధ్యానమును అభ్యసించు
యోగి యొక్క నియమిత
చిత్తము గాలిలేని స్థలమందుండు
దీపం వలెనిశ్చలముగ
వుండును, అందువల్లనే యోగి
యొక్క నిశ్చల చిత్తము గాలిలేని
స్థలమందలి దీపముతో పోల్చబడింది.

యత్రోపరమతే చిత్తం
నిరుద్ధం యోగసేవయా
యత్రచైవాత్మనాత్మానం
పశ్యన్నాత్మని తుష్యతి శ్లో -20

సుఖమాత్యన్తికం యత్త
ద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియం
వేత్తియత్ర నచైవాయం
స్థితశ్చలతి తత్త్వతః శ్లో - 21

యోగాభ్యాసము వలన
నియమితమైన మనస్సు
ఎచ్చట ఉపరతినొందుచున్నదో
ఎచ్చట తన ఆత్మను ఆత్మయందు
ఆత్మచేత దర్శించుచూ సంతసము
నొందుచున్నదో
మరియు ఇంద్రియములకు
అతీతమై బుద్ధికి తెలియ
దగు ఉత్తమ సుఖమును
ఎచ్చట తెలుసుకొనుచున్నాడో
అచ్చట ఆ స్థితిననుభవించు యోగి
తత్వమునుండి చలింపడు.

యం లబ్ధ్వా చాపరం లాభం
మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన
గురుణాపి విచాల్యతే శ్లో -22

తం విద్యాత్ దుఃఖ సంయోగ
వియోగం యోగ సంజ్ఞితం
న నిశ్చయేన యోక్తవ్యో
యోగోనిర్విణ్ణ చేతసా శ్లో -23

యోగాభ్యాసముచేత
నిగ్రహింపబడిన మనస్సుతో
పరమశాంతిని పొందుచూ
పరిశుద్ధమైన మనస్సుచే
ఆత్మను సందర్శించుతూ
తన యందే ఆనందమును
బడయుచు, ఇంద్రియములకు
గోచరము కానిదియును, బుద్ధిచే
గ్రహింప దగినదియును, అంతము

లేనిదియునగు సుఖమును అనుభ
వించుచూ, స్వానుభవమునుండి
ఏమాత్రము చలింపకుండాయుండడం
వలన ఘోరమైన దుఃఖము
నకు దూరమై దుఃఖ సంబంధము
లేశమైనను లేక యుండుటను
ఆత్మసాక్షాత్కార మని తెలిసికోవలెను.
అట్టి ఆత్మసాక్షాత్కార రూపమగు
దుఃఖముచే
కలత నొందని ధీరమనస్సు కలిగి
యోగ విద్యను సాధించవలసి యుంది.

సంకల్ప ప్రభవాన్ కామాన్
స్త్యక్త్వా సర్వా నశేషతః
మనసై వేంద్రియగ్రామం
వినియమ్య సమంతతః శ్లో 24

శనైః శనై రుపరమేత్
బుద్ధ్యా ధృతిగృహీతయా.
ఆత్మసంస్థం మనః కృత్వా
న కించిదపి చింతయేత్ శ్లో - 25

సంకల్పముల వలన కలిగెడు
కోరికలనన్నింటిని సంపూర్తిగా
విడిచిపెట్టి, మనస్సుచే
ఇంద్రియములను అన్ని
వైపుల నుండి బాగుగా
నిగ్రహించి, బుద్ధిచే
మెల్లమెల్లగా బాహ్య
ప్రపంచము నుండి మనస్సును
మరలించి అంతరంగమున
విశ్రాంతి నొంద వలెను.

ఇంకను మనస్సును ఆత్మ
యందు లయించి ఆత్మేతర
మైన దానిని దేనిని కూడా
చింతింపక వుండువాడే యోగి

యతో యతో నిశ్చరతి
మనశ్చంచల మస్థిరం
తతస్తతో నియమ్యైత
దాత్మన్యేవ వశం నయేత్ శ్లో - 26

చంచలమైనదియు, నిలుకడలేనిదియు
అగుమనస్సు ఏ ఏ విషయములందు
సంచరించుచుండునో ఆయా
విషయముల
నుండి దానిని మరలించి ఆత్మ యందే
దానిని స్థాపితము చేయవలెను

ప్రశాన్తమనసం హ్యేనం
యోగినం సుఖ ముత్తమం
ఉపైతి శాన్త రజసం
బ్రహ్మభూత మకల్మషమ్ శ్లో - 27

ప్రశాంత చిత్తుడును
రజోగుణములు లేని
వాడును, బ్రహ్మభూతుడును
నిష్కల్మషుడును అగు ధ్యాన
యోగిసర్వోత్తమమైన
సుఖమును పొందును

యుంజన్నేవం సదాత్మానం
యోగీ విగత కల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శ
మత్యన్తం సుఖ మశ్నుతే శ్లో - 28

ఈ ప్రకారముగ మనస్సును
ఎల్లప్పుడును ఆత్మయందే
నిలిపిన దోషరహితుడైన
యోగి బ్రహ్మసాక్షాత్కార
రూపమగు పరమ సుఖమును
సులభముగ పొందుచున్నాడు

సర్వభూతస్థ మాత్మానం
సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శనః శ్లో - 29

ఆత్మయోగి అయినవాడు
అంతటను సమ దృష్టి
కలిగి సర్వభూతములను
తనయందు దర్శించుచున్నాడు

యోమాం పశ్యతి సర్వత్ర
సర్వంచమయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి
సచమేన ప్రణశ్యతి శ్లో - 30

ఎవడు నన్ను సర్వభూతముల
యందును, సర్వభూతములను
నాయందును గాంచుచున్నాడో
అట్టివానికి నేను సాక్షాత్కారమిత్తును
నాకును అతడు సాక్షాత్కరించగలడు

సర్వభూతస్థితం యో మాం
భజత్యేకత్వమాస్థితః
సర్వథా వర్తమానోపి
స యోగీ మయి వర్తతే శ్లో - 31

సర్వభూతములయందున్న
నన్ను అభేద బుద్ధి కలిగి
సేవించువాడు అతడు
ఏ రీతిగ ప్రవర్తించు చున్నను
నాయందే ప్రవర్తించుచున్న
వాడుగా యున్నాడు

ఏ విధముగ ప్రవర్తించుచున్నను అను సమాసాన్ని విపరీతార్థముతో తీసుకోకూడదు దాని అర్థము సర్వభూతముల యందున్న ఆత్మను అంటే ఆ భగవానుని అభేద బుద్ధితో చూచువాడు అతడు సమాధినిష్ఠలో వున్నను లౌకిక వ్యవహారములందున్నను అని దాని యొక్క విశేషార్థము.

ఆత్మౌపమ్యేన సర్వత్ర
సమం పశ్యతి యోర్జున
సుఖం వా యది వా దుఃఖం
స యోగీ పరమో మతః శ్లో - 32

అర్జునా!
సమస్త ప్రాణులయందు
కలుగు సుఖ దుఃఖములను
సమాహిత చిత్తముతో
ఒకే రీతిగా చూచువాడు
పరమ శ్రేష్ఠుడైన యోగి
అని చెప్పబడుచున్నాడు

భగవానుడు బోధించిన ఈ జీవబ్రహ్మైక్య రూపమగు యోగమును అర్జునుడు అందుకొనజాలక తిరిగి ఈ విధముగ భగవానుని ప్రశ్నిస్తున్నాడు.

యోయం యోగస్త్వయా ప్రోక్తః
సామ్యేన మధుసూదనః
ఏతస్యాహం న పశ్యామి
చంచలత్వాత్ స్థితిం స్థిరామ్ శ్లో - 33

చంచలం హి మనః కృష్ణ!
ప్రమాథి బలవద్దృఢం
తస్యాహం నిగ్రహం మన్యే
వాయోరివ సుదుష్కరమ్ శ్లో - 34

కృష్ణా!
సమత్వభావనతో కూడిన
ఏ యోగమును నీవు ఉప
దేశించితివో ఆ యోగము యొక్క
స్థిరమైన స్థితిని మనస్సు యొక్క
చంచల స్వభావము చేత తెలుసు
కోలేక పోతున్నాను
అందువలన ఓ కృష్ణా!
చంచలమైనట్టిదియును
క్షోభను కలిగించునట్టిదియును
బలవంతమును, దృఢమైనట్టిదియును
అగు మనస్సును నిగ్రహించుట గాలిని
బంధించడం ఎంత దుస్సాధ్యమో అంత
దుస్సాధ్యమని నాకు తోచుచున్నది
కనుక మనస్సును బంధించుట ఎట్లో
తెలుపుము

అర్జునుడు వేసిన ఆ ప్రశ్నలను వినిన శ్రీకృష్ణభగవానుడు దానికి జవాబుగా మనస్సును నిగ్రహించే విషయాన్ని గూర్చి తెలియజేస్తున్నాడు.

అసంశయం మహాబాహో
మనో దుర్నిగ్రహం చలం
అభ్యాసేన తు కౌన్తేయ!
వైరాగ్యేణ చ గృహ్యతే శ్లో - 35

అర్జునా!
నిజమే, మనస్సు చంచలమైనది
నిగ్రహించుటకు శక్యము కానిది
ఇందుకు సందేహము లేదు, కాని
అభ్యాస వైరాగ్యముల చేత
మనస్సును నిగ్రహించవచ్చును

అసంయతాత్మనా యోగో
దుష్ప్రాప ఇతి మే మతిః
వశ్యాత్మనా తు యతతా
శక్యోవాప్తు ముపాయతః శ్లో - 36

మనో నిగ్రహం లేనివానికి
యోగసిద్ధి కలగడం దుర్లభం
మనో నిగ్రహము కలిగి సాధించు
ప్రయత్నము చేయువానికి
యోగసిద్ధి కలగడం సులభం

యోగము నందు శ్రద్ధ కలిగి వుండి కూడా మనో నిగ్రహముబడయుచు మరణించిన సాధకుడు తదుపరి ఏ గతిని పొందును అని అర్జునుడు తిరిగి ప్రశ్నిస్తున్నాడు.

అయతి శ్శ్రద్ధయో పేతో
యోగాచ్చలిత మానసః
అప్రాప్య యోగ సంసిద్ధిం
కాం గతిం కృష్ణ! గచ్ఛతి శ్లో - 37

కచ్చిన్నో భయవిభ్రష్టః
ఛిన్నాభ్రమివ నశ్యతి
అప్రతిష్ఠో మహాబాహో!
విమూఢో బ్రహ్మణః పథి శ్లో - 38

కృష్ణా!
శ్రద్ధగలవాడయ్యును, ప్రయత్నము
చేయనివాడు, చలించిన మనస్సు గలవాడు
యోగసిద్ధిని పొందనపుడు అతని
గతి ఏ మగును!
మరియు ఓ కృష్ణా!
బ్రహ్మజ్ఞాన మార్గమునందు
స్థిరత్వము లేని మూర్ఖుడు
ఉభయభ్రష్టుడై, చెదరిన
మేఘము వలె నశింపడు గదా!

ఏతం మే సంశయం కృష్ణ!
ఛేత్తు మర్హ స్య శేషతః
త్వదన్యః సంశయస్యాస్య
ఛేత్తా న హ్యుప పద్యతే శ్లో - 39

కృష్ణా!
నా సంశయమును పూర్తిగా
తొలగించుటకు నీవే
సమర్థుడవు, నా ఈ సంశ
యమును నివారించుటకు
నీవు తప్ప మరెవ్వరును లేరు

అర్జునుని ఈ ప్రశ్నకు భగవానుడు సమాధానమొసంగుచున్నాడు.

పార్థ!నై వేహ నాముత్ర
వినాశస్తస్య విద్యతే
న హి కల్యాణ కృత్కశ్చిత్
దుర్గతిం తాత గచ్ఛతి శ్లో - 40

అర్జునా !
యోగమునందున్న వాడు
ఒకవేళ భ్రష్టుడైనను
అతనికి ఇహపరములు
రెండింటియందును
కూడా వినాశము కలుగదు

గాంధీగారు తమ Gospel of Self Less Action లో దానికి సంబంధించి రెండు ఉదాహరణలు వ్రాశారు.

(Plato in "Apology" uses almost identical language "Know of a certainty that no evil can happen to a good man, either in life or in death." Cf. also Koran:"Then who so doeth good works and is a believer, there will be no rejection of his effort. Lo! We record it for him.)

ప్రాప్య పుణ్యకృతాం లోకా
నుషిత్వా శాశ్వతీః సమాః
శుచీనాం శ్రీ మతాం గేహే
యోగభ్రష్టోభిజాయతే శ్లో 41

యోగభ్రష్టుడు అయినప్పటికీ
పుణ్యాత్ములు వసించెడి
లోకములను పొంది, అచట
అనేక సంవత్సరములుండి
ఆ పిదప సదాచార సంపన్నులైన
శ్రీమంతుల గృహములలో
జన్మించుచున్నారు

అథవా యోగినామేవ
కులే భవతి ధీమతాం
ఏతద్ధి దుర్లభతరం
లోకే జన్మ యదీదృశమ్ శ్లో - 42

అట్లు కానిచో
జ్ఞానవంతులైన యోగుల
వంశమునందు పుట్టుచున్నారు
ఈ విధంగా జన్మించడము ప్రపంచమున
చాలా అరుదుగా నుండును

తత్ర తం బుద్ధి సంయోగం
లభతే పౌర్వదేహికం
యతతే చ తతో భూయః
సంసిద్ధౌ కురునందన! శ్లో - 43

అర్జునా!
ఈ ప్రకారముగ అతడు
యోగుల వంశమునందు
జన్మించి పూర్వ శరీర
సంబంధమైన బుద్ధితో
సంపర్కమును పొందుచున్నాడు
అట్టి సంపర్కముతో తిరిగి
పూర్వపు యోగసిద్ధికై ప్రయత్నించును

పూర్వాభ్యాసేనతేనైవ
హ్రియతే హ్యవశోపి సః
జిజ్ఞాసురపి యోగస్య
శబ్ద బ్రహ్మాతి వర్తతే శ్లో - 44

పూర్వజన్మయందలి అభ్యాస
ప్రభావము చేత అతడు
ప్రయత్నము చేయక
పోయినను యోగము వైపు

ఆకర్షింపబడుచున్నాడు
యోగము నందు జిజ్ఞాస
గలవాడైనందున దాని ప్రభావం
వలన శబ్ద బ్రహ్మమును
అతి క్రమించుచున్నాడు

ప్రయత్నాద్యత మానస్తు
యోగీ సంశుద్ధకిల్బిషః
అనేక జన్మ సంసిద్ధః
తతో యాతి పరాం గతిమ్ శ్లో - 45

అనేక జన్మలయందు
ఆచరించిన అభ్యాసము
చేత సిద్ధిని పొందిన ఆ
యోగి తదుపరి బ్రహ్మ
సాక్షాత్కారమును
పొందుచున్నాడు

తపస్వి భ్యోధికో యోగీ
జ్ఞానిభ్యోపి మతో ధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ
తస్మాద్యోగీ భవార్జున! శ్లో - 46

అర్జునా!
యోగి అయినవాడు
తపమాచరించు వారికంటెను
జ్ఞానుల కంటెను, కర్మ పరాయణుల
కంటెను కూడా ఉత్తముడని
తెలియబడుచున్నాడు
కనుక ఓ అ ర్జునా! నీవు
కూడా యోగివి కమ్ము

యోగినామపి సర్వేషాం
మద్గతేనాంత రాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం
స మే యుక్తతమో మతః శ్లో - 47

ఏ మనుజుడు నాయందు
మనస్సు నిలిపి శ్రద్ధతో
నన్ను సేవించుచున్నాడో
అట్టివాడు యోగులందరి
కంటెను ఉత్తముడని నా
అభిప్రాయము

"The yogin eulogized here is the yogin who has achieved complete union with the Supreme. Though he is the contemplator of the Impersonal, the meditative mystic, and although we have the meditative mystic, describe in discourses VI-VIII, Lord Krishna's partiality for the devotee of the Personal is obvious in shloka 47 as in other shlokas.

(From the Gospel of selfless action)

ఈ ఆత్మసంయమన యోగంలో మూడు ముఖ్యవిషయాలు తెలుపబడినాయి. 1. చిత్తైకాగ్రత 2. చిత్తైకాగ్రతకు ఉపయోగపడు మితజీవనము 3. సమదృష్టి కలిగియుండడం. ఈ మూడు లేకపోతే సాధన వుండదు. చిత్తైకాగ్రత అంటే చిత్తచాంచల్యముపై అంకుశము పెట్టుట. మితజీవనమనగా ఆహార విహారాల పట్ల జాగ్రత్తగా వుండుట. సమదృష్టి అనగా విశ్వములోని భూతకోటినంతటిని సమభావముతో చూచుట, ఈ మూడింటికి తోడుగా అభ్యాసము, వైరాగ్యము కూడా వుండ వలెను.

ప్రతి పనియందును చిత్తైకాగ్రత అవసరము. వ్యావహారిక విషయములో కూడా ఈ చిత్తైకాగ్రత అవసరము. వ్యావహారికానికి, పారమార్థికమునకు కావలసిన సద్గుణములు వేరు వేరనుకొనుట సరైందికాదు. వ్యావహారికమును పరిశుద్ధపరుచుటయే పరమార్థము యొక్క అంతరార్థము. వ్యవహారమేదైనను దాని యశోవశములు, సఫలతా విఫలతలు

ఏకాగ్రత మీదనే ఆధారపడివుంటాయి. వ్యాపారము, వ్యవహారము, శాస్త్రపరిశోధన, రాజనీతి, రాజ్యతంత్రము వీటివల్ల లభించే యశస్సు, ఆయాకర్తల చిత్తైకాగ్రత ననుసరించియే యుండును. నెపోలియన్ గూర్చిన ఒక ఉదంతం వుంది. దానిని ఈ విధంగా చెప్పకొనెదరు. అతడు యుద్ధమునకు అవసరమయ్యే ఏర్పాట్లన్నీ చేసి తదుపరి ఆయుద్ధభూమిలోనే గణిత శాస్త్ర పరిశోధనలోనిమగ్నమై యుండేవాడట. తన సైన్యపు గుడారాలపై తుపాకి గుండ్లు వర్షిస్తున్నా, తన సైనికులు మరణిస్తున్నా నెపోలియన్ మనస్సు మాత్రము తన గణిత శాస్త్రముపైననే సంలగ్నమై యుండెడిది, నెపోలియన్ ఏకాగ్రత అంత గొప్పదికాకపోయినా అది ఏకాగ్రతకు నిదర్శనము. అంతకు మించిన ఉదాహరణలు ఇంకా వున్నాయి. ఖలీఫా ఉమర్‌ను గూర్చి కూడా ఇలాంటి మాట లే వున్నాయి. యుద్ధము జరుగుతున్నప్పడు మధ్యలో నమాజు వేళ అయిందంటే అతడు అక్కడికక్కడే చిత్తైకాగ్రతతో మోకరించి నమాజు చేసేవాడట. ఇరు పక్షాలలో ఎవరు చనిపోయారు అన్న స్పృహ కూడా లేకుండా ఆయన తన మనస్సును ప్రార్థనలో నిమగ్నముచేసేవాడట.

ఇటీవల కాలంలో ఒక ఫకీరుకు ఒకసారి అతని శరీరములో బాణము గుచ్చుకొనిందట. దానిని బయటకు లాగబోతే అతనికి బాధ మరింత అధికమయింది. అందుచేత లాగుటకు వీలుకాలేదు. ఆ సమయానికి దగ్గర క్లోరోఫారం లాంటి మత్తుమందు ఏదియును వైద్యుని దగ్గర లేదు. అందువలన నొప్పి తెలియకుండా బాణమును ఫకీరు శరీరములో గుండా తీయడం ఎంతో కష్టమైంది. అపుడు ఫకీరును ఎరిగివున్న కొందరు అక్కడకు వచ్చి బాణాన్ని తీయడానికి ఇపుడు మీరు ప్రయత్నించవద్దు. కొంత సేపైతే నమాజువేళ వచ్చును. అపుడు తీయవచ్చును అని చెప్పిరట. సాయంసమయపు నమాజు వేళ అయింది. ఫకీరు మోకరించి నమాజు మొదలు పెట్టెను. ఇంతలో అతడు ఏకాగ్రచిత్తుడయ్యెను. వెంటనే బాణాన్ని అతని శరీరము నుండి లాగివైచిరి. బాణాన్ని తీసిన సంగతే ఫకీరుకు తెలియదు, ఏకాగ్రత అంటె ఇదే.

సారాంశము ఇది :

వ్యావహారికములో నైనను, పారమార్థికము లోనైనను చిత్తైకాగ్రత లేకుండా ఫలితం దుర్లభం. ఏకాగ్రత వుండిన ఎడల శక్తి సామర్థ్యములకు ఎప్పడును కొదవ యుండదు. మానవునికి వార్ధక్యము వచ్చుచున్న కొద్ది అతనిలో మానసిక శక్తి వృద్ధి పొందు చుండవలెను.

ఈ విధంగా ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన
శ్రీ మద్భగవద్గీత యందలి ఆత్మయంయవ యోగము అను పేరుగల
ఆరవ అధ్యాయము సమాప్తముగావించబడినది.



# గీతా సంహిత

**అధ్యాయము ఏడు** | **విజ్ఞాన యోగము**

అర్జునునకు స్వధర్మ పాలనను గూర్చి సంశయము కలిగినపుడు అతని మనస్సులో స్వ-పరసంబంధమైన మోహము ఉత్పన్నమై స్వధర్మాచరణము నుండి తప్పించుకొనుటకు అతడు ఉపాయమును వెదకనారంభించెను. నిరర్థకమైన ఈమోహము మొదటి అధ్యాయమునందు చూపబడినది. దానిని అతని నుండి తొలగించుట కొరకై రెండవ అధ్యాయము ఆవిర్భవించింది. అందులో ఈ మూడుసిద్ధాంతములు ప్రవేశపెట్టబడినవి.

1. అనశ్వరమైన ఆత్మసర్వత్రా నిండి యున్నది. 2.దేహము నశ్వరము. 3. స్వధర్మమును ఎన్నడును త్యజింపరాదు. ఈ మూడింటితోపాటు కర్మఫలత్యాగము గూర్చి కూడా చెప్పడం జరిగింది. ఈ పై సిద్ధాంతములను ఆచరణలో పెట్టుటకు కర్మయోగము ప్రబోధింపబడింది. ఈ కర్మ యోగమును గూర్చి వివరిస్తున్నపుడు "కర్మ- వికర్మ- అకర్మ"-ల గూర్చిన ప్రసక్తి వచ్చింది.

కర్మ- వికర్మల సంయోగము నుండి ఉత్పన్నమగు అకర్మ యొక్క రెండు రూపాలను అయిదవ అధ్యాయములో తెలుసుకున్నాము. ఆరవ అధ్యాయమునందు వికర్మ యొక్క భిన్న భిన్న రూపములను గూర్చి భగవానుడు ప్రకటించాడు. ఈ అధ్యాయములోనే సాధనకు సంబంధించిన ఏకాగ్రత గూర్చి చెప్పబడింది.

ఇపుడు ఈ ఏడవ అధ్యాయములో వికర్మ యొక్క విశాలత్వమును గూర్చి విపులంగా వివరించుటకు "జ్ఞాన యోగము" అను కొత్త అధ్యాయము తెరువబడింది. ఈ అధ్యాయములో భగవానుడు మోహ రూపకారకమైన ఈ జగదృశ్యము యొక్క రహస్యమును వివరిస్తున్నాడు.

ఈ సృష్టిలో అనంత వస్తువులును, అనంత ప్రవృత్తులును కనబడుతున్నాయి. కాని ఈ అంతర్బాహ్య సృష్టి అంతయు "అఖండాత్మ- అష్టవిధప్రకృతి", అను ఈ రెండింటి సంయోగము చేతనే ఏర్పడినది. క్రోధాన్వితుని యొక్క క్రోధము, ప్రేమించువాని ప్రేమ, దుఃఖితుని ఆక్రందనము, సంతసిల్లువాని కర్మాను రక్తి ఇవన్నియు ఒక చైతన్య శక్తి లీలలు. ఈ పరస్పర విరుద్ధ భావముల మూలములో ఒక చైతన్యము నిండియున్నది. లోపలి చైతన్యము ఒక్కటే అయినట్లు బాహ్య ప్రకృతి స్వరూపము కూడా ఒక్కటే. చైతన్యమయమైన ఆత్మ- జడ ప్రకృతి ఈ రెండింటి యొక్క సంయోగము వలననే సృష్టి అంతయు జన్మించినదని మొదటి నుండి భగవానుడు చెప్పుతూనే వస్తున్నాడు.

"ఆత్మ- దేహము- పర- అపర" ప్రకృతులు సర్వత్ర ఒక్కటే. అయినను మానవుడు మోహములో ఎందుకు పడిపోవుచున్నాడు? ఒకనితో సాంగత్యము కావాలని మరొకనితో దూరముగ వుండవలెనని ఎందులకను కొనుచున్నాడు? వీడు దగ్గరగా వుండవలెను? వాడు దూరముగ వుండవలెను! వీడునావాడు- వాడు పరాయివాడు, అని ఎందుకనుకొనుచున్నాడు? అని విచారిస్తే వీటన్నింటికి మోహమే కారణము.

ఈ మోహము వల్లనే మనుష్యుడు సమయము వచ్చినపుడు తన కర్తవ్యమును వదిలి వేయుచున్నాడు. ఈ మోహము నుండి విముక్తులము కావలెనన్న సృష్టికర్త యొక్క హస్తకౌశల రహస్యమును గ్రహింపవలసి వుంది.

ఈ విషయంగా మహర్షి వినోబా "బృహదారణ్య కోపనిషత్తు"లోని "నగారా"ను దృష్టాంతరంగా పేర్కొన్నాడు. ఒక్క నగారా నుండియే భిన్న భిన్న నాదములు వెలువడును. కొన్ని నాదములు విని భయపడుదుము. కొన్ని నాదములు విని ఆనందముతో నృత్యము చేయుదుము. ఈ భిన్న భావములను జయింపవలెననిన "నగారా" వాయించు వాని కౌశలమును పట్టుకొనవలెను. అతని కౌశలమును మనం గ్రహించినంతనే అతడు పలికించిన నాదము మనకు అవగతమగును. ఈ అధ్యాయము 14వ శ్లోకంలో "దైవ సంబంధం, త్రిగుణాత్మక మయినా నా మాయదాట శక్యము కానిది, అయినను నన్ను శరణు పొందిన వారు మాయను దాటుచున్నారు" - అని భగవానుడు ప్రకటించాడు.

మరి మాయ అంటే ఏమిటి? - దానికి జవాబుగా పరమేశ్వరుని శక్తి, అతని కళాకౌశలము మాయ అని బుధజనులు ప్రకటించారు.

జైనుల పరిభాషలో "ప్రకృతి"- "ఆత్మ"ను "జీవము- అజీవము" అంటున్నారు.

ఈ రెండింటిని కలిపి రంగు రంగుల సృష్టిని రచించిన వాని శక్తియే లేక కళయే మాయ అంటున్నాడు వినోబా . పరమేశ్వరుని తెలుసుకొనుటకు ఒకలోకోత్తర సాధన, ఒకలోకోత్తర వికర్మ వుంది. దానిని తెలియజెప్పుటకే విజ్ఞాన యోగము (భక్తి) అనే ఈ ఏడవ అధ్యాయము ఆవిర్భావమొందింది. ఇదొక భవ్య సుందరమందిరం.

ఈ అధ్యాయము నందు 30 శ్లోకములు కలవు.

1. జ్ఞానము యొక్క ప్రస్తావన *(1 నుండి 3వ శ్లోకము వరకు)*
2. పరాపరశక్తుల యొక్క వర్ణనము *(4 నుండి 7వ శ్లోకమువరకు)*
3. అసురీశక్తుల యొక్క గర్హణము దైవీశక్తుల యొక్క ప్రశంస *(13 నుండి 19వశ్లోకము వరకు)*
4. ఇతర దేవతల యొక్క ప్రస్తావన *(20 నుండి 23 శ్లోకముల వరకు)*
5. భగవానుని ప్రభావము ఎరుగని వారు- ఎరిగిన వారిని గూర్చిన వివరణ *(24 నుండి 30 శ్లోకం వరకు)*

ఆరవ అధ్యాయం చివర శ్లోకంలో

"నా యందు మనస్సును
నిలిపి నన్ను శ్రద్ధతో
సేవించు వారు అందరి
(యోగులలో)లో ఉత్తముడు"

అని భగవానుడు తెలిపి యున్నాడు పరమాత్మ యొక్క స్వరూప స్వభావములు తెలుసుకొంటేనే అట్టి ఏకాగ్ర చింతనము సాధ్యపడుతుంది. కనుక భగత్స్వరూపమును దాని మహిమను, అనుభూతిని తెలియజేయు నిమిత్తము భగవానుడు ఈ అధ్యాయమును ఈ విధంగా ప్రారంభిస్తున్నాడు.

మయ్యాసక్తమనాః పార్థః
యోగం యుంజన్మదాశ్రయః
అసంశయం సమగ్రం మాం
యథా జ్ఞాస్యసి తృచ్ఛృణు శ్లో - 1

*అర్జునా!*
*నా యందు ఆసక్తి కలిగిన*
*మనస్సు కలవాడవై*
*నన్నే ఆశ్రయించి యోగమును*
*అభ్యసించుచు*
*సంశయ రహితముగా*
*సంపూర్ణముగ నన్నెట్లు*
*తెలుసుకొన గలవో*
*ఆ విషయాన్ని గూర్చి నీకు తెలుపు*
*తున్నాను. వినుము.*

"జ్ఞానం తేహం సవిజ్ఞాన
మిదం వక్ష్యామ్య శేషతః
యజ్ఞాత్వా నేహ భూయోన్య
జ్ఞాతవ్య మవశిష్యతే          శ్లో - 2

దేనిని తెలుసుకొనుటవలన
ఇంకా ఈ లోకములో
తెలుసుకోదగినది మిగిలి
వుండదో అట్టి అనుభవ
సహితమైన జ్ఞానమును
నీకు సమగ్రముగ బోధించెదను

మనుష్యాణాం సహస్రేషు
కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం
కశ్చిన్మాం వేత్తి తత్త్వతః          శ్లో - 3

వేలమంది మనుష్యులలో
ఏ ఒక్కడో సిద్ధికొరకు యత్నించును
ఆ విధంగా యత్నించెడి వారిలో కూడా
నన్ను గూర్చి యధార్థముగా తెలుసు
కున్నవాడు ఎవడో ఒక్కడే

భూమిరాపోనలో వాయుః
ఖం మనోబుద్ధి రేవచ
అహంకార ఇతీయం మే
భిన్నా ప్రకృతిరష్టధా          శ్లో - 4

భూమి, నీరు, నిప్పు, గాలి
ఆకాశము, మనస్సు, బుద్ధి
అహంకారము అను ఎనిమిది
గుణములుగా నాప్రకృతి
విభాగింపబడి వున్నది

పరాప్రకృతిని గూర్చి వివరించడానికి ముందు అపరా ప్రకతిని గూర్చి భగవానుడు తెలియజేశాడు.

1.భూమి 2. నీరు 3. నిప్పు (అగ్ని) 4. గాలి (వాయువు) 5. ఆకాశము ఈ అయిదు పంచభూతాలు, వీటితో పాటు 1. మనస్సు 2. బుద్ధి 3. అహంకారము ఈ మూడున్ను పై వాటితో కలిసి మొత్తము ఎనిమిదిగా ప్రకృతి విభాగించబడింది. ఇవన్నీ కలిసిన దానిని పరాప్రకృతి అన్నాడు భగవానుడు.

అపరేయమిత స్త్వన్యాం
ప్రకృతిం విద్ధి మే పరాం
జీవభూతాం మహాబాహో!
యయేదం ధార్యతే జగత్          శ్లో - 5

అర్జునా!
ఈ అపరా ప్రకృతి చాలా
అల్పమైనది ప్రాణులకు
జీవరూపమైనది, శ్రేష్ఠమైనది
అగు పరాప్రకృతి అనునది
మరొకటున్నది దానిని గూర్చి తెలుసుకో

ఈ విషయమును నిరూపించుట కొరకు దృష్టాంతరముగ ఆదిశంకరాచార్యుల వారు "వివేక చూడామణి" లో ఈ విధంగా తెలిపి యున్నారు.

"ఘటం జలం తద్గత మర్కబింబం
విహాయ సర్వం దివివీక్ష్యతేర్క
తటస్థ ఏ తత్రతయావభాసకః
స్వయం ప్రకాశో విదుషా యధా తథా"

వివేక చూడామణి - 221

కుండను, నీటిని, అందలి సూర్య ప్రతిబింబమును అన్నిటిని వదలి వీటికి సాక్షిగా వుండి అన్నిటిని ప్రకాశింప జేయునట్టి స్వయం ప్రకాశపరమాత్మయను "సూర్యబింబము" ను విజ్ఞులు ఆశ్రయింతురు

ఏతద్యోనీని భూతాని
సర్వాణీత్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః
ప్రభవః ప్రళయస్తథా శ్లో - 6

సకల భూతములును
ఈ రెండు విధములైన
ప్రకృతుల వలననే
జనించుచున్నవి
అంతేకాదు ఈ సమస్త
మైన జగత్తు యొక్క
పుట్టుకకు, ప్రళయమునకు
కారకుడను నేనే
యని తెలుసుకో

మత్తః పరతరం నాన్యత్
కించి దస్తి ధనంజయ!
మయి సర్వమిదం ప్రోతం
సూత్రే మణిగణా ఇవ శ్లో - 7

అర్జునా!
నాకంటే శ్రేష్ఠమైనది
మరొకటి లేదని తెలుసుకో
దారమందలి మణులవలె
ఈ సమస్త ప్రపంచమంతయును
నాయందే కూర్చబడి యున్నది

పాలయందుండు వెన్నవలె, నువ్వులయందుండు నూనెవలె, మణిమాలయందు దాగియున్న దారమువలె పరమాత్మ జగత్తునంతను వ్యాపించియున్నాడు. ఆయన లేని చోటు లేదు. ఈ సత్యమును ఈశ్లోకములో భగవానుడు నిరూపించాడు.

మణిమాలయందు దారము లేనిచో
మణులు నిలువవు, మణులు మాలగా
నిలుచుటకు దారము ఆధారము, అది
లేనిచో మణులు మాలగా నిలుచుటకు
స్వతశ్శక్తి లేదు. దారము లేనిచో అవి
చెల్లాచెదరై పోవును, మణులు అనేకము
వుండవచ్చు. వాటిలోపలి దారము మాత్రము ఒక్కటే
ఈ జగత్సృష్టియందలి చరాచర ప్రాణి
కోట్లన్నియు, వివిధ జాతులు, వివిధమతాలు
పరమాత్మ అనే దారమునందు కూర్చబడి
వున్నవి. పరమాత్మ లేనిచో ప్రాణికోట్లు
నిలువ జాలవు, ప్రాణికోట్లనన్నింటిని
ఒక్కచోట కూర్చకలిగినది అంతర్యామి
యగు ఆ పరమాత్మ ఒక్కటే, ఆయన
ఆధారము వలననే ప్రాణి కోట్లన్నియు
వర్తించుచున్నవి. స్థూలదృష్టికి
మణిమాలయందలి మణులు మాత్రమే
అగుపిస్తూ దారము ఏ విధము
పైకి అగుపించదో అదే విధముగ భగవానుడు
స్థూల దృష్టికి, చర్మ చక్షువులకు గోచరించడు
జ్ఞాన నేత్రములకు మాత్రమే ఆయన గోచరించును
అనునది దాని సారాంశము

ఇందుకు దృష్టాంతరముగ ఆదిశంకరుల వారు తమ "ఆత్మ బోధ" లో ఈ విధంగా తెలిపారు.

సర్వగం సచ్చిదానందం జ్ఞాన చక్షుర్నిరీక్షతే

అజ్ఞాన చక్షుర్నే క్షేత్ర భాస్వస్తం భానుమన్ధవత్ "అంటే సర్వ వ్యాపకుడగు సచ్చిదానంద పరమాత్మను జ్ఞాన నేత్రుడే చూడగలడు. ప్రకాశ మానుడగు సూర్యుని గ్రుడ్డివాడు చూడజాలనట్లు అజ్ఞాని పరమాత్మను చూడజాలడు"

రసోహమప్సు కౌంతేయ!
ప్రభాస్మి శశిసూర్యయోః
ప్రణవః సర్వవేదేషు
శబ్దః ఖే పౌరుషం నృషు శ్లో - 8

అర్జునా!
నీటియందలి సారమును
(రుచియు) చంద్రసూర్యుల
యందుగల ప్రకాశమును
వేదములందలి "ఓంకారము"ను
ఆకాశమునందలి శబ్దమును
మనుష్యులయందలి పరాక్రమమును
నేనే అయి వున్నాను

పుణ్యోగంధః పృథివ్యాంచ
తేజశ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు
తపశ్చాస్మి తపస్విషు శ్లో - 9

భూమియందలి సువాసనయు
అగ్నియందలి తేజమును
సర్వభూతముల యందలి
ప్రాణమును, తపశ్శీలుల
యందలి తపస్సును నేనే
అయి వున్నాను

బీజం మాం సర్వభూతానాం
విద్ధి పార్థ! సనాతనం
బుద్ధిర్బుద్ధిమతామస్మి
తేజస్తేజస్వినామహం శ్లో - 10

అర్జునా!
సర్వభూతములకును
బీజస్థానమును నేనే
బుద్ధిమంతులయొక్క
బుద్ధియు, ధీర పురుషుల
యొక్క ధైర్యమును
నేనే అయి వున్నాను

బలం బలవతామస్మి
కామరాగవివర్జితం
ధర్మావిరుద్ధో భూతేషు
కామోస్మి భరతర్షభః శ్లో - 11

అర్జునా!
బలవంతుల యొక్క
సామర్థ్యమును వారిలో
అనురాగము (కోరికలు) లేని బలమును
ప్రాణులలో ధర్మ విరుద్ధము
కాని కామమును నేనె అయివున్నాను

యే చైవ సాత్త్వికాభావా
రాజసాస్తామసాశ్చయే
మత్త ఏవేతి తాన్విద్ధి
న త్వహం తేషు తే మయి శ్లో - 12

సత్త్వరజస్తమో గుణముల
వలన కలుగు భావములు ఏల కలవో
అవన్నియు నా వలననే కలుగుచున్నవి
అవి నాయందున్నవి కాని నేను
వానియందు లేను

**వివరణ:-** ఈ సమస్త ప్రపంచమునకును, అందలి పదార్థములకు ఆధారము పరమాత్మ. ఆయన సత్తువల్లనే అవి సత్తువ కలిగి యున్నవి. అందువల్లనే భగవానుడు ఇచట సాత్వికాది గుణముల వలన కలిగిన సమస్త పదార్థములు నావలననే కలిగినవని చెప్పడం జరిగింది. ఈ విధంగా జగద్రూపకములైన వస్తువులన్నియు పరమాత్మపై ఆధారపడి యున్నవి. కాని ఆయన మాత్రం దేనిపై ఆధారపడి లేదు.

త్రిభిర్గుణమయైర్భావైః
రేభిస్సర్వమిదం జగత్
మోహితం నాభిజానాతి
మా మేభ్యః పర మవ్యయమ్ శ్లో -13

*త్రివిధములగు గుణములయొక్క*
*వికార స్వభావములచేత*
*ఈ ప్రపంచమంతయు సమ్మోహమును*
*పొంది, ఇందుకు విలక్షణమై నాశరహితమై*
*యున్ననన్ను గ్రహింపజాలకున్నది*

దైవీ హ్యేషా గుణమయీ
మమ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యంతే
మాయా మేతాం తరంతితే శ్లో - 14

*ఎందువల్లనంటే*
*దైవసంబంధమైనదియు*
*త్రిగుణాత్మకమును అయిన*
*నా ఈ మాయ దాటశక్యము*
*కానిది. కాని నన్ను ఎవరు*
*శరణు పొందుచున్నారో*
*వారు మాత్రము మాయను*
*దాటుచున్నారు*

న మాం దుష్కృతినో మూఢాః
ప్రపద్యన్తే నరాధమాః
మాయయాపహృతజ్ఞానా
ఆసురం భావ మాశ్రితాః శ్లో - 15

*పాపాత్ములు, మూఢులు*
*రాక్షస స్వభావము*
*గలవారును అగు మానవాధములు*
*నన్ను శరణు పొందుటలేదు*

చతుర్విధా భజన్తే మాం
జనాస్సుకృతి నోర్జున!
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ
జ్ఞానీ చ భరతర్షభ! శ్లో - 16

*అర్జునా!*
*నాలుగు రకాలైనపుణ్యాత్ములు*
*నన్ను భజించుచున్నారు, వారు*
*ఆపదయందున్నవారు, జ్ఞానాసక్తి*
*గలవారు, ధనమును గోరువారు,*
*మరియు జ్ఞానులు*

తేషాం జ్ఞానీ నిత్యయుక్త
ఏకభక్తి ర్విశిష్యతే
ప్రియో హి జ్ఞానినోత్యర్థం
అహం సచ మమ ప్రియః శ్లో - 17

*ఈ నాలుగు రకాల వారిలో*
*నిత్యయుక్తుడును,*
*ఏకాంతభక్తిగలవాడును*
*అగు జ్ఞాని శ్రేష్ఠుడుగా*
*యున్నాడు. అట్టి జ్ఞానికి*
*నేను మిగుల ఇష్టమైన*
*వాడను. నాకును అతడు*
*ప్రియమైన వాడే*

ఉదారా! సర్వ ఏవైతే
జ్ఞానీ త్వాత్మైవ మే మతం
ఆస్థితః సహి యుక్తాత్మా
మా మేవానుత్తమాం గతిమ్ శ్లో - 18

ఈ భక్తులందరును ఉదార చరితులే
కాని జ్ఞాని మాత్రము నేనే అని
నిశ్చయము. అతడు ఆత్మయోగ
పరుడై నన్నే ఉత్తమ ప్రాప్య
స్థానముగ ఆశ్రయించుకొని యున్నాడు

బహూనాం జన్మనామన్తే
జ్ఞానవాన్మాం ప్రపద్యతే
వాసుదేవః స్సర్వమితి
స మహాత్మా సుదుర్లభః శ్లో - 19

అనేక జన్మ పరం పరల నుండి
సంపాదించిన జ్ఞానమును
ఆత్మజ్ఞాని అయినవాడు
సర్వమును వాసుదేవుడే
యనిగ్రహించి నన్ను సేవించు
చున్నాడు. అట్టి మహాత్ములు
మిక్కిలి అరుదుగ వుందురు

ఇక వచ్చే శ్లోకము నుండి కోరికలతో
ఆరాధించే వారిని గూర్చి భగవానుడు
తెలియజేస్తున్నాడు.

కామైస్తై స్తైర్హృతజ్ఞానాః
ప్రపద్యన్తేన్యదేవతాః
తం తం నియమ మాస్థాయ
ప్రకృత్యా నియతాః స్వయా శ్లో - 20

మానవులు తమ తమ
స్వభావములను అనుసరించి
కోరికలతో జ్ఞానమును
పోగొట్టుకొనిన వారై, ఆయా
కోరికలకు తగిన దేవతలను
ఆరాధించుచున్నారు

యో యో యాం యాం తనుం భక్తః
శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్య తస్యాచలాం శ్రద్ధాం
తామేవ విదధామ్యహమ్ శ్లో - 21

ఏ ఏ భక్తుడు ఏ ఏ కోరికను
కలిగి ఏ ఏ దేవతా రూపమును
శ్రద్ధతో ఆరాధింపను అభిలషించు
చున్నాడో అతనికి అట్టిస్థిరమైన
శ్రద్ధనే నేను కలుగజేయుచున్నాను

స తయా శ్రద్ధయా యుక్తః
తస్యారాధన మీహతే
లభతే చ తతః కామాన్
మయైవ విహితాన్హి తాన్ శ్లో - 22

అతడు అట్టి శ్రద్ధను కలిగిన
వాడై ఆయా దేవతలను
ఆరాధించుచున్నాడు. అనంతరము
నాచే నిర్ణీతములైన ఆయా హిత
ఫలములను పొందుచున్నాడు

అన్తవత్తు ఫలం తేషాం
తద్భవత్యల్ప మేధసాం
దేవాన్దేవయజో యాన్తి
మద్భక్తా యాన్తి మా మపి శ్లో - 23

దేవతలను పూజించువారు
దేవతలనే పొందుచున్నారు
అల్పబుద్ధి గలవారు పొందెడి
ఆ ఫలము నాశవంతమైనట్టిది
నా భక్తులైన వారు నన్నే పొంది
నాశ రహితులుగా వుందురు

అవ్యక్తంవ్యక్తి మాపన్నం
మన్యంతే మా మబుద్ధయః
పరం భావ మజానంతో
మమావ్యయ మనుత్తమమ్ శ్లో - 24

అవ్యయమైనట్టిదియును
సర్వోత్కృష్టమైనట్టిదియును
పరమమైనట్టిదియును అగు
నా యొక్క స్వభావమును
తెలియని అజ్ఞానులు అవ్యక్తమైన
నన్ను వ్యక్తస్వరూపునిగ తలంచుచున్నారు

నాహం ప్రకాశఃసర్వస్య
యోగమాయాసమావృతః
మూఢోయం నాభిజానాతి
లోకో మా మజమవ్యయమ్ శ్లో - 25

యోగమాయచేత ఆవరించ
బడియుండుట వలన నేను
అందరికిని గోచరించువాడను
కాను, అజ్ఞానులగు ఈ మానవులు
నన్ను పుట్టని వానిగను, నశించని
వాని గను ఎరుగరు

వేదాహం సమతీతాని
వర్తమానాని చార్జునః
భవిష్యాణి చ భూతాని
మాంతు వేద న కశ్చన శ్లో - 26

అర్జునా!
నేను భూత, వర్తమాన
భవిషద్విషయముల
నన్నింటిని ఎరుంగుదును
కాని నన్ను మాత్రము ఎవరును
ఎరుంగరు

ఇచ్ఛాద్వేషసముత్థేన
ద్వంద్వ మోహేన భారత
సర్వభూతాని సంమోహం
సర్గే యాన్తి పరంతప! శ్లో - 27

అర్జునా!
పుట్టుకతోడనే ఇష్టానిష్టములు
సుఖదుఃఖరూపమైన ద్వంద్వములు
కలుగుచున్నవి, ఈ ద్వంద్వములు
సకల భూతములకును సమ్మోహమును
కలిగించుచున్నవి. దాని నుండి
అజ్ఞానము కల్గుచున్నది.

యేషాం త్వన్తగతం పాపం
జనానాం పుణ్యకర్మణాం
తే ద్వంద్వ మోహనిర్ముక్తా
భజంతే మాం దృఢవ్రతాః శ్లో - 28

పాపరహితులైన పుణ్యాత్ములు
ద్వంద్వములు లేనివారై
మోహము లేనివారై నిశ్చల
భక్తులై నన్ను సేవించుచున్నారు

జరామరణమోక్షాయ
మా మాశ్రిత్య యతన్తియే
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నం
అధ్యాత్మం కర్మ చాఖిలమ్ శ్లో - 29

నన్నుఆశ్రయించి జనన మరణములను
పోగొట్టుకొనుటకు యత్నించువారు
సమస్త ప్రత్యగాత్మస్వరూపమును
సకల కర్మ స్వభావమును పరమాత్మయే
యని తెలుసుకొందురు

సాధిభూతాధిదైవం మాం
సాధియజ్ఞం చ యే విదుః
ప్రయాణకాలేపి చ మాం
తే విదుర్యుక్త చేతసః శ్లో - 30

నేనే అధిభూత, అధిదైవ
అధియజ్ఞములను
అని వీటిని గూర్చి ఎవరు
తెలుసుకొనుచున్నారో
వారు మరణకాలమందు
కూడా మనోనియమం
కలవారై నన్నెరుంగుదురు

ఈ విధంగా ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన
శ్రీ మద్భగవద్గీతయందలి విజ్ఞాన యోగము అను పేరుగల
ఏడవ అధ్యాయము సమాప్తము గావించబడినది



# గీతా సంహిత

## అధ్యాయము ఎనిమిది | అక్షర పరబ్రహ్మ యోగము

మానవజీవితము అనేక సంస్కారములతో కూడియుండును. అనేక కార్యములు మానవుల వలన జరుగుచుండును. రోజులో ఇరువది నాలుగు గంటలును ఏదో ఒకపని చేయుచునే యుందుము. అందులో తినుట-త్రాగుట- కూర్చుండుట- నిద్రించుట- నడుచుట తిరుగుట దైనందికమైన ఇతర కార్యక్రమాలు నిర్వహించుట, వ్రాయుట, మాటలాడుట, చదువుట వీటన్నింటితోపాటు నిదురించు సమయంలో కలిగే నానా విధ స్వప్నాలు, మేల్కొని యున్నపుడు కలిగే రాగద్వేషాలు, మానావమానాలు, సుఖదుఃఖాలు ఇవన్నీ ఇమిడి వున్నాయి. ఇవన్నీ మన మనస్సును అంటియుండును. ఇవన్నీ చూస్తూ జీవితం అంటే ఏమిటి? అని ప్రశ్నించుకుంటే వచ్చే జవాబు ఏమిటి? అని ఆలోచిస్తే మహర్షి వినోబా చెప్పిన ఒక సుందరమైన జవాబు మనకు కనిపిస్తుంది.

"సంస్కార సంచయమే జీవితం" అని వినోబా అన్నారు. సంస్కారములు మంచివి వుండవచ్చు చెడువి కూడా వుండవచ్చు. ఈ మంచి-చెడు సంస్కారముల పరిణామము మానవజీవితం మీద కనబడుతూ వుంటుంది.

మానవజీవితంలో జరిగిన క్రియలు, వాటి వలన కలిగిన జ్ఞానానుభవములు అనేక విధములుగ వుండును. అయితే ఈ క్రియలు, అనుభవాలు హరించిపోయి చివరకు కొన్ని సంస్కారములు మాత్రమే మానవునిలో మిగిలి వుంటాయి. ముఖ్యమైనవి మాత్రమే జ్ఞప్తి యందుండి మిగతావన్ని అస్పష్టములై పోవును. మహత్వపూర్ణమైన ఏ కొద్ది ఘటనలో స్ఫురణకు వచ్చును. అవియే మనకు సంస్కారములుగ మిగులును. అనేక క్రియలు చేసి

అనంతమైన జ్ఞానానుభవములు పొందిన పిమ్మట కూడా చివరకు మనస్సులో మిగిలియుండు సంస్కారములు ఎన్నో వుండవు. భిన్న భిన్నములైన కర్మలు, భిన్న భిన్నములైన అనుభవములు కలిగించి పోతాయి. అందులోనుండి దృఢమైన ఏ అయిదారు సంస్కారములు మాత్రమే మిగిలి వుంటాయి. ఈ సంస్కారములే మన జీవితాలకు మూలధనములు. మనము జీవితము అను వ్యాపారమును నడుపుచూ సంస్కారములను సంపదను మాత్రము కూడబెట్టుదుము. సాధారణ వ్యాపారస్థుడు రోజువారీ, నెలవారీ, సంవత్సరవారీ లెఖ్ఖలను వ్రాసి వాటినను సరించి జమ-ఖర్చులను నిగ్గు తేల్చి లాభమో, నష్టమో ఒక్క అంకెలో తేల్చివేయును. కాని జీవిత వ్యాపారం అట్లు కాదు. అది అనేక జన్మల సంస్కారముల పట్టిక. ఆ పట్టిక పెరిగి, పెరిగి చివరకు మిగిలే సారము బహుకొద్ది.

జీవితము యొక్క తుదిఘడియలో ఆ కొద్దినే (స్వల్పమునే) ఆత్మజ్ఞప్తికి తెచ్చుకొంటుంది. జన్మ పొడుగునను చేసిన పనులను స్ఫురణకు తెచ్చుకొన్నప్పుడు ముఖ్యమైన ఏ రెండుమూడు విషయములో మనకు జ్ఞప్తికి వచ్చును. ఇదే మన జీవితంలో మనం తెచ్చుకొన్న ఆదాయం అంతా. అయితే మానవుడు తానాచరించిన కర్మలు, పొందిన జ్ఞానానుభవములు అన్నియు వ్యర్థముగ పోయినవని భావించ కూడదు. వాని పని పూర్తయిపోయినది. అంతే, అంతవరకు మన భావనలు వుండవలె. వేలకొలది రూపాయలు వ్యాపారములో పెట్టిన ఒక వ్యాపారస్థుడు తనకు అయిదు వేలు నష్టమో, పదివేలు లాభమో చిట్టాతేల్చి చెప్పినపుడు నష్టాన్ని గూర్చి వినగానే గుండెలు బాదుకొని ఏడ్చును. లాభాన్ని గూర్చి తెలుసుకొన్నపుడు ఆనందంతో నృత్యం చేయును.

మన జీవిత విషయము కూడా ఇంతే, మరణ సమయమందు జిహ్వేంద్రియవాసన కలిగి జీవితమంతా రుచులను అనుభవించిన అభ్యాసంతో వాటిని గూర్చి తలంచి ఇక అవి లభించవా! అని తల్లడిల్లును. జిహ్వేంద్రియ వాసనయే అతని జీవిత సంపాదన. మరొక విషయ మేమంటే మరణ మాసన్నమైనపుడు భార్య అయితే భర్త, బిడ్డలు, భర్త అయితే భార్య, బిడ్డలు జ్ఞప్తికివచ్చి రక్తసంబంధమగు సంస్కారము వారిలో జనించి అదిబలిష్ఠముగ నాటుకొని పోయినదని తెలసుకోవలెను. ఆ సమయములో తానాచరించిన ఇతర అసంఖ్యాకములైన కర్మలన్నియును గౌణమై పోవును. జీవితంలో అనేక సంస్కారములు నశించి చివరకు ఏ ఒక్క బలమైన సంస్కారమో నిలిచి వుంటుంది. జీవితము అను ప్రశ్నకు సమాధానము ఇదే. అంత్య సమయమున స్ఫురణకు వచ్చినదే జీవితమునకు ఫలము. అందువల్లనే భగవానుడు ఈ అధ్యాయం 5వ శ్లోకంలో

"మరణకాలమందునన్నే స్మరిస్తూ
దేహమును త్యజించువాడు
నిస్సంశయముగ నన్ను పొందుచున్నాడు"అని ప్రకటించాడు.

జీవితము యొక్క ఈ అంతిమ సారము, ఈ అంతిమక్షణము మధురమగునట్లు మన పనులన్నియును వుండవలెను. తుదిఘడియ మధురమైనచో జీవితమంతయు మధురమే, ఈ లక్ష్యమును దృష్టిలో పెట్టుకొని జీవిత సమస్యలన్నియును పరిష్కరించుకొనవలెను. జీవిత కార్యక్రమమంతయును ఈ దృష్టితోనే నియమించుకొనవలసి వుంది. అహోరాత్రములు ఈ దృష్టితోనే ముందుకు సాగవలసి వుంటుంది.

మరణ సమయమున మనస్సులో ప్రబలముగ వుండు భావన యే రానున్న జన్మలో బలిష్ఠముగ పనిచేయును అని ఈ ఎనిమిదవ అధ్యాయము సిద్ధాంతీకరించుచున్నది. ఈ సత్యమును దారి బత్తెముగ తీసుకొని మానవుడు భావి యాత్రకు బయలుదేరవలెను. ఈనాటి అనుభవాలను ఆధారముచేసుకొని రేపునిద్రనుండి లేవగానే ఆనాటి జీవన యాత్రను ప్రారంభింతుము. ఈ విధముగనే ఈ జన్మలో పొందిన అనుభవ జ్ఞానములను ఆధారముగ జేసుకొని దానిని రేపటి మనమూలధనముగ ఎంచి మరణమను నిద్రతరువాత తిరిగి మన యాత్ర ప్రారంభమైనపుడు దానిని ఉపయోగించుకోవలసి వుంది. ఈ జన్మయొక్క అంతమే రానున్న జన్మకు ప్రారంభము. కనుక నిరంతరమును జ్ఞప్తి యందుంచుకొని జీవితయాత్రను సాగించవలసి వుంటుందని ఈ అక్షర పరబ్రహ్మ యోగం మనలను ప్రబోధిస్తున్నది. "క్షర" అంటే నశించునది. "అక్షర"అంటే నాశరహితమైంది. నాశరహితమగు పరబ్రహ్మను గూర్చి బోధించడం వలన ఈ అధ్యాయానికి "అక్షర పరబ్రహ్మ యోగం" అని పేరు వచ్చింది.

ఈ అధ్యాయమునందు 28 శ్లోకాలున్నాయి.

1. బ్రహ్మము, ఆధ్యాత్మికము, కర్మము మున్నగు వానిని గూర్చిఅర్జునుని ప్రశ్నలు వాటికి భగవానుడిచ్చిన సమాధానాలు *(1 నుండి 7వ శ్లోకం వరకు)*
2. ప్రణవోపాసన గూర్చిన వివరాలు *(8 నుండి 16వ శ్లోకం వరకు)*
3. సృష్టి, ప్రళయములను గూర్చిన వివరణ *(17 నుండి 19వరకు)*
4. భగవానుని సనాతన స్వరూపము *(20నుండి22వ శ్లోకం వరకు)*
5. శుక్ల, కృష్ణమార్గముల వివరణ *(23 నుండి 26వ శ్లోకము వరకు)*
6. యోగి యొక్క మహిమ *(27 నుండి 28వ శ్లోకము వరకు)*

కిందటి అధ్యాయంలో జరామరణ విముక్తికై తన్నాశ్రయించి ప్రయత్నించువారు బ్రహ్మమును గూర్చి చక్కగా తెలుసుకొందురని తెలిపి ఆ బ్రహ్మమునకుగల విశేషములు ఏమిటో శ్రీకృష్ణభగవానుడు వివరించాడు. వాటిని గూర్చి వివరముగ తెలుసుకోగోరిన అర్జునుడు ఈ ప్రకారముగా ప్రశ్నిస్తున్నాడు.

కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం
కిం కర్మ పురుషోత్తమః
అధిభూతం చ కిం ప్రోక్త
మధిదైవం కిముచ్యతే శ్లో - 1

అధియజ్ఞః కథం కోఽత్ర
దేహేఽస్మిన్ మధుసూదన
ప్రయాణ కాలే చ కథం
జ్ఞేయోసి నియతాత్మభిః శ్లో - 2

*కృష్ణా!*
*బ్రహ్మం అనగానేమి?*
*ఆధ్యాత్మికం అంటే ఏమిటి?*
*కర్మం అంటే ఏమిటి?*
*అధిభూతము అని చెప్పబడు*
*తున్నది ఏది? అధిదైవం*
*అని దేనిని అంటున్నారు*

*కృష్ణా!*
*అధియజ్ఞుడనగా ఎవరు?*
*ఈ దేహమునందు ఏ విధముగా*
*దర్శించవచ్చును?నియమిత*
*చిత్తులగు యోగులు ప్రాణావసాన*
*దశయందు నిన్నెటుల తెలుసుకొన*
*గలరు నాకీ ఈ విషయములను గూర్చి*
*చెప్పండి*

అర్జునుడు వేసినపై ప్రశ్నలకు జవాబులుగా భగవానుడు ఈ విధంగా సమాధానము చెబుతున్నాడు.

"అక్షరం బ్రహ్మ పరమం
స్వభావోఽధ్యాత్మముచ్యతే
భూతభావోద్భవకరో
విసర్గః కర్మసంజ్ఞితః శ్లో - 3

*అర్జునా!*
*సర్వోత్తమమైనదియు*
*నాశరహితమైనదియు*
*"బ్రహ్మం" అనుబడుచున్నది.*
*ప్రత్యగాత్మ భావము*
*(స్వభావమును) ఆధ్యాత్మికము*
*అని చెప్పబడుతున్నది, భూతము*
*లకు స్వభావ జననములను*
*కలిగించు విసర్గ కర్మమనబడుచున్నది*

అధిభూతం క్షరోభావః
పురుషశ్చాధిదైవతం
అధియజ్ఞోహ మేవాత్ర
దేహే దేహభృతాం వర! శ్లో - 4

*అర్జునా!*
*ఈ దేహమునందు నశించు*
*స్వభావముగలది అధిభూతం*
*పురుషుడు(ఆత్మ) అధిదైవతం*
*నేనే అధియజ్ఞుడను*

అన్తకాలే చ మామేవ
స్మరన్ ముక్త్వా కళేబరం
యః ప్రయాతి స మద్భావం
యాతి నాస్త్యత్ర సంశయః శ్లో - 5

ఎవడు మరణకాలమందు
నన్నే స్మరించుచూ దేహమును
త్యజించుచున్నాడో అతడు
నిస్సంశయముగ నన్నే పొందు
చున్నాడు

యం యం వాపి స్మరన్ భావం
త్యజ త్యన్తే కళేబరం
తం తమేవైతి కౌంతేయ!
సదా తద్భావభావితః శ్లో - 6

అర్జునా!
మరణకాలమందు ఎవడు
ఏ ఏ భావములను స్మరించుచు
మరణించునో అతడు తద్భావ
జనితమగు సంస్కారముచే
అదే రూపమును పొందుచున్నాడు

తస్మాత్స ర్వేషు కాలేషు
మా మనుస్మర యుధ్యచ
మయ్యర్పిత మనో బుద్ధిః
మా మేవైష్యస్య సంశయః శ్లో- 7

అందువలన
సర్వకాలములందును
నన్నే స్మరించుచు యుద్ధము
చేయుము, నాయందు సమర్పించ
బడిన మనోబుద్ధులుగలవాడవైనచో
నీవు నిస్సంశయముగ నన్నే పొందగలవు

అభ్యాసయోగయుక్తేన
చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం
యాతి పార్థానుచింతయన్ శ్లో - 8

అర్జునా!
అభ్యాసము అను యోగముతో
కూడినదియును, అన్య విషయముల
పైకి పోనిదియును అగు మనస్సు
చేత శ్రేష్ఠుడైన పరమపురుషుని
స్మరించు మనుజుడు ఆయననే
పొందుచున్నాడు

కవిం పురాణ మనుశాసితార
మణోరణీయాంస మనుస్మరేద్యః
సర్వస్యధాతారమచిన్త్యరూపం
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ శ్లో-9

ప్రయాణకాలే మనసా చలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
సతం పరం పురుష ముపైతి దివ్యమ్
శ్లో - 10

సర్వజ్ఞుడును, సనాతనుడును
నియంతయును, అణువుకంటెను
సూక్ష్మమైనవాడును, సమస్తమునకు
దాతయును, చింతించ వీలుకానివాడును,
సూర్యసన్నిభుడును, తమస్సుకంటెను
వేరైనవాడును
అగుపరమపురుషుని మరణ కాలమందు
నిశ్చలమైన మనస్సుతోను,
యోగబలముతోను,
కూడినవాడై భ్రూమధ్యమందున
ప్రాణమును నిలుకడగ నిలపి, దివ్యమైన
వాడు, సర్వోన్నతుడును అగు ఆ పరమ
పురుషుని ఎవరుస్మరించెదరో అట్టివారు
ఆయననే పొందుచున్నారు

**వినోబా** : "జీవితము మృత్యువు దెసకు నడుచుచున్నదన్న సంగతిని లక్ష్యమందుంచుకొని, అంతిమ క్షణము పుణ్యము అనియు అత్యంత పవిత్రమనియు, అది పవిత్రము కావలెనన్న ఆత్రముతో బ్రతికినంతకాలము మానవుడు సాధన చేయవలెను. మంచి విషయములపైకి మనస్సును మరల్చవలెను. వాటియందు మునిగి తేలవలెను. అది నీకు నిజమైన మేలుకొలుపు. రేయింబవళ్లు ఆత్మనిరీక్షణ చేసుకొనుచు జాగరూకుడవగుము" తప్పదారిన వెళ్లుతున్న మానవులను పై శ్లోకమును దృష్టి పథం నందుంచుకొని పరోక్షంగా హెచ్చరించాడు వినోబా.

మహాత్మా గాంధీ పై రెండు శ్లోకాలకు ఆంగ్లములో అర్థం ఈ విధంగా తెలిపారు.

"Whose, at the time of death, with unwavering mind, with devotion and fixing the breath rightly between the brows by the power of yoga, meditates on the Sage, the Ancient the Ruler, subtle than the subtlest the supporter of all, the inconceivable, glorious as the Sun beyond the darkness,- He goes to that Supreme Celestial Being.

**పండిత గోపదేవశాస్త్రిగారు** : "పరమేశ్వరుడు కవి, ఆదికవి, వేదరచయిత క్రాంతదర్శి. పదార్థము అంతర్బాహ్యములను ఎరిగిన వాడు. పురాణ పురుషుడు ఆదిలేని వాడు, కారణ రహితుడు సంఘటక పదార్థములచే ఏర్పడిన తత్త్వము కలవాడు కాదు. వేదవిజ్ఞానము మూలమున మానవులకు ధర్మజ్ఞానము కలిగించువాడు. సూక్ష్మతత్త్వములగు జీవ ప్రకృతుల కంటెను మిక్కిలి సూక్ష్మమైనవాడు. బ్రహ్మాండమునగల సమస్త పదార్థములకు ఆధారము, అతని స్వరూపము, లక్షణము రాగద్వేషాదిగుణయుక్తమగు సాధారణ మనస్సునకు అందదు. అజ్ఞానమునంటక జ్ఞాన జ్యోతియై వెలుగుచుండును. మరణకాలమున దేహమును త్యజించునపుడు యోగబలముతో చిత్తమును ఏకాగ్రముచేసి ప్రాణమును భ్రూమధ్యమున చేర్చి భక్తితో నాపరతత్త్వమును ధ్యానించువాడు, స్మరించు వాడు పరమేశ్వరుని పొందును. మోక్షానందమును అనుభవించును" శ్రీ మద్భగవద్గీత -పేజి 165

**డాక్టర్‌బోయిభీమన్నగారు**: వ్యక్తి, భక్తుడో, యోగో, ఏకాగ్రచిత్తుడో అయివుండడం చాలదు. మరణించేటప్పుడు భగవన్నామస్మరణ చేస్తూ మరణించాలి సరే. అట్టి ప్రత్యేక వ్యక్తుల్ని వదిలివేద్దాం. మరి సామాన్య మానవుల సంగతేమిటి? మానవేతర జీవుల సంగతేమిటి? మరణ కాలములో ఏకాగ్రత సాధ్యమా? భగవన్నామస్మరణ చేసుకోగలిగినంత స్వస్థత వుంటుందా? భక్తుడూ, యోగీ, ఏకాగ్రచిత్తుడూ కాని వారి ఆత్మ ఏమౌతుంది?

ఇవన్నీ ప్రశ్నలు. ఈ రెండు శ్లోకాలలోను చెప్పిన పద్ధతి వలన సామాన్య మానవుడికి ప్రయోజనం చేకూరదు. సామాన్య మానవుడుకి ప్రయోజన కరమైన "సర్వధర్మాన్ పరిత్యజ్య" వంటి సులభమార్గానికి ఈ రెండు శ్లోకాలలోను చెప్పబడిన మార్గం విరుద్ధమైంది"

ఇదిగో ఇది భగవద్గీత - 20పేజి

ఈ శ్లోకం శిఖరాయమానం. ఏకైక ఫలం, కత్తిచేత బట్టి , కనుపించే సంపదనల్లా దోచుకొనే ఉన్మాద మ తాలనుండి సర్వసంగ పరిత్యాగముచేసి, సమస్తమూ పోగొట్టుకొనే సన్యాసి మతాల వరకు ప్రపంచములోని అన్ని మతాలకు మూలం ఈ శ్లోకమేనని నా అభిప్రాయం.

ఎన్నిమనువులు పోయినా పొయ్యిని ఊదడం (వంట చెయ్యడం) తప్పదన్నట్టు, ఏమతంలో చేరినా ఆమతం దేవుడిని ఆశ్రయించక తప్పదు. ఒక్కొక్క మతానికి ఒక్కొక్క తల్లి భాష వుంటుంది. ఒక మతం దేవుడికి మరొక మతం భాష అర్థం కాదు. అర్థమైతే మతకలహాలు అసలే వుండవు కదా! ఇది వివిధ మానవజాతుల మధ్య చిరకాలంగా నడుస్తున్న చరిత్ర.

ఒక్కొక్క భాషలో దేవుడికి ఒక్కొక్కమాట వుంటుది. తమ భాషలోని మాటే సరైన మాట అంటూ ప్రతిభాషవాళ్లూ వాదిస్తారు. ఏకాత్మతా జ్ఞానం ఎవరికీ అబ్బడం లేదు.

"బీజహం సర్వభూతానాం" అంటున్న శ్రీకృష్ణుడిని ఎవరూ పట్టించుకోకపోవడం దురదృష్టం.

"సృష్టిలోని సమస్త జీవరాసులకూ
చరా చరకోటికి, సమస్త స్థావర
జంగమాదులకు బీజం పరమాత్మ
ప్రతి అణువుకు తానే బీజం
తానే విత్తనం" 7-10

దేవుడో, బ్రహ్మదేవుడో ఎక్కడో కూర్చొని సర్వసృష్టిని చేశాడనడం కేవలం అపోహ, సహేతుకం కాదు. పరమాత్మ తానే బీజంగా తనను తానే సృష్టించుకుంటున్నదనడం మాత్రమే సహేతుకము. వాస్తవం.

ఒక విత్తనం నాటితే దానంతటదే మొలకెత్తుతుంది. మొలకెత్తేశక్తి విత్తనంలోనే వుంది. ఆ శక్తే పరమాత్మ, ఆ దెంతటి మహాశక్తో అంతటి అణుశక్తి కూడా, అది స్వయంప్రేరకం, స్వయం చోదకం, స్వయంభవం, ఆనందచేతనం.

దాని నిత్య నిరంతర చలనం నుంచి ఓంకారం పుట్టింది. ఓంకార మేతత్, దాని అభివ్యక్తి ప్రకృతి. సత్, ఈ శక్తి త్రిపుటినే "ఓంకారం" అంటున్నాము.

"అన్ని ధర్మాలు వదిలివేసి నన్నే
శరణుపొందు, సర్వపాపాల
నుండి నిన్ను విడుదల చేస్తాను
విచారించవద్దు" అంటాడు
భగవానుడు 18 అధ్యాయం 66వ శ్లోకంలో

మానవుని శ్రేయస్సుకు ఇంతకంటే అభయం ఏ భగవంతుడు మాత్రం ఈయగలడు? భగవద్గీతకు ఈ శ్లోకం శిఖరాయమానం అంటారు శ్రీ బోయిభీమన్నగారు తమ "ఇదిగో, ఇదీ భగవద్గీత" అనే పుస్తకంలో పేజి -220

ప్రపంచములోని ఏ మతాన్ని నమ్ముకొన్నవారైనా చెయ్యవలసిన పనులు నాలుగు అవి:

1. ఆ మతం చెప్పే విధినియమాలకు కట్టుబడి వుండి జీవించడం.
2. ఆ మతం చెబుతున్న ఒకే దేవుడిని నమ్ముకోవడం.
3. తాను ఏ పనిచేసినా దైవార్పణంగా చేయడం.
4. మరణానంతరం తన ఆత్మకు ఆదేవుడే రక్షకుడు కాగలడని పూర్తిగా విశ్వసించడం.

భగవద్గీత ఈ నాలుగు విధాల కూడా మానవుడికి సంపూర్ణ సంతృప్తిని కలిగిస్తున్నది. అభయాన్నిస్తున్నది.

"సర్వధర్మాన్ పరిత్యజ్య" అనే ఈ శ్లోకంలో "యత్కరోషి" అనే శ్లోకాన్ని కలిపి చదువుకొన్నపుడు, అర్థము చేసుకొని ఆచరించినపుడు సుఖశాంతులతో కూడిన సంపూర్ణమానవ జీవితం రూపుదిద్దుకుంటుంది.

భారతీయ సమాజం గుణకర్మల తేడా మీద ఆధారపడినాలుగు వృత్తులుగానూ, ధర్మార్థకామమోక్షాలనే నాలుగు పురుషార్థాలుగాను విభజించబడినట్టిది, వృత్తులన్నీ సమానమే, పురుషార్థాలు సమానమే, సమాజ వికాసం కోసం, వ్యక్తిగత జీవితం కోసం అవి ఆ విధంగా ఏర్పాటు చేయబడినై. గౌరవ ప్రతిపత్తులలో తేడాలులేవు. అయితే మరణానంతరం ఏం జరుగుతుంది? అనే ప్రశ్న ప్రతి మానవుడుకీ ఆందోళన కరంగానే వుంటుంది. కనుక ఈ ప్రశ్నకు తృప్తికరమైన జవాబు పొందడం కోసమే అతడు జీవితం పొడుగునా ఆరాటపడుతూ వుంటాడు. ఆ ప్రశ్నకు జవాబు చెప్పడం కోసమే మతాలన్నీ ఏర్పడ్డాయి. అప్పటికే అమలులో వున్న అన్ని మతాలను సమన్వయ పరిచి ఒకే మాట చెప్పడం కోసం వెలువడినటువంటిది గీత.

"నీవు చేసే ప్రతి పనినీ నాకు అర్పించి చెయ్యి" అన్ని ధర్మాలను పరిత్యజించి నన్నే శరణు పొందు" అనేది ఆ మాట. ఇక్కడొక చిన్నవివరణ.

"అన్ని ధర్మాలను పరిత్యజించి" అనేదానిలో "పరిత్యజించి" అనే మాట వుంది. అంటే త్యాగం చేసి అని అర్థము. కర్మఫలత్యాగం అని ఇదివరలో చెప్పబడినది. ఈ త్యాగము అనే మాటకు సరైన 'అర్థము "వదిలేసి" అని కాదు, "నా పరంచేసి"' అని అంటే భగవంతునికి అర్పించి అని .సర్వధర్మాలు భగవంతుని నుంచి వచ్చినవే, పరమాత్మ నుంచి పుట్టినవే. వాటిని తిరిగి పరమాత్మ పరం చెయ్యవలసి వుంది. సహజంగా అవన్నీ పరమాత్మ పరంకాకతప్పదు, అయితే తాను స్వయంగా వాటన్నింటిని పరమాత్మ పరంచేస్తున్నాననే తృప్తి కలగడం కోసమే ఈ ఉపదేశం చేశాడు కృష్ణుడు.

త్యాగం అంటే వదిలెయ్యడం కాదు అనేది మనం గుర్తించవలసి వుంది. తమ యోగక్షేమాలు పరమాత్మ వహిస్తాడులెమ్మని తన కర్తవ్యాలను వదిలివేసి, బాధ్యతల నుంచి వైదొలగి మఠాలలో చేరే సోమరులు వుంటారు. అట్టి వాళ్లందరికీ, అన్ని మతాలకు చెందిన వారికీ ఈ శ్లోకం వర్తించిన విస్తరికారాదు.

మరొక విషయము "నన్నే శరణు పొందు" అని శ్రీకృష్ణుడు అంటున్నాడు. ఆయన కూడా పుట్టి, పెరిగి మరణించిన మానవుడే కదా! ఇప్పుడు లేడు కదా! మరి ఎవరిని శరణుకోరాలి? ఈ ప్రశ్నకు జవాబు చెప్పవలసివుంది.

శ్రీకృష్ణుడు రూపంతో ఇప్పుడు లేని మాట నిజమే. అతడు పరమాత్మ యొక్క సమగ్ర అవతారంగా, సంపూర్ణ వ్యక్తీభూతుడుగా ఆ మాట చెప్పాడు. శరీరం పోయినా సర్వభూతాలలోను తానేవున్నాడు కనుక, సర్వ దేవతారూపాలు తానే అయి వున్నాడు కనుక ఏ భూతాన్నయినా శ్రీకృష్ణుడుగా అర్పించవచ్చు. ఏదేవతారూపానికైనా ఆత్మార్పణంచేసుకోవచ్చు.

(డాక్టర్ బోయి భీమన్నగారి ఇదిగో ఇది భగవద్గీత నుండి 219నుండి 222 పేజీలు)

యదక్షరం వేదవిదో వదన్తి<br>
విశన్తి యద్యతయో వీతరాగాః<br>
యదిచ్ఛంతో బ్రహ్మచర్యంచరన్తి<br>
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే శ్లో - 11

సర్వద్వారాణి సంయమ్య<br>
మనో హృది నిరుధ్య చ<br>
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ<br>
మాస్థితో యోగధారణామ్ శ్లో -12

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ
వ్యాహరన్మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం
స యాతి పరమాం గతిం శ్లో - 13

వేదవేత్తలు దేనిని అవినాశి
యని చెప్పుచున్నారో
రాగరహితులగు యతులు
దేనిని చేరుచున్నారో, దేనిని
కోరుచు జనులు బ్రహ్మచర్యమును
అనుష్టించు చున్నారో అట్టి స్థానమును
గూర్చి నీకు సంగ్రహముగ వివరిస్తున్నాను
ఎవడు సకల ఇంద్రియ వ్యాపారములను
నియమించి మనస్సును హృదయము
నందు నిలపి, ప్రాణమును సహస్రారము
నందు చేర్చి, యోగయుక్తుడగుచు
పరబ్రహ్మ వాచకమైన "ఓంకారము"ను
ఉచ్చరించుచూ, నన్నే స్మరించుచు
దేహమును విడిచి పోవుచున్నారో
వారు సర్వోత్కృష్టమైన మోక్షమును
పొందుచున్నారు

అనన్య చేతాస్సతతం
యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థః
నిత్యయుక్తస్య యోగినః శ్లో - 14

అర్జునా!
ఎవడు అనన్య చిత్తముతో
నిరంతరము నన్ను స్మరించు
చున్నాడో అట్టి నిశ్చల చిత్తము
గలయోగికి నేను సులభముగా
లభింతును

మాముపేత్య పునర్జన్మ
దుఃఖాలయమశాశ్వతం
నాప్నువంతి మహాత్మానః
సంసిద్ధిం పరమాం గతాః శ్లో - 15

ఉత్తమమైన మోక్షమును
పొందిన మహాత్ములు నన్ను
పొందినవారై దుఃఖమును,
అనిత్యమైన జన్మమును
తిరిగి పొందరు

ఆబ్రహ్మభువనాల్లోకాః
పునరావర్తినోఽర్జున!
మాముపేత్య తు కౌంతేయ
పునర్జన్మ న విద్యతే శ్లో -16

బ్రహ్మలోకము వరకు గల
లోకములకు వెళ్లిన వారందరును
తిరిగి పుట్టుచునే యున్నారు
నన్ను పొందిన వారికి మాత్రం
పునర్జన్మ లేదు

సహస్రయుగపర్యంత
మహర్యద్బ్రహ్మణో విదుః
రాత్రిం యుగసహస్రాంతాం
తే అహోరాత్రవిదోజనాః శ్లో - 17

ఏ జనులు బ్రహ్మదేవుని
యొక్క పగటిని వేయి
యుగముల పరిమితిగల
దానిగను అట్లే రాత్రిని వేయియుగముల
పరిమితిగల దానినిగను తెలుసుకుందురో
అట్టివారు రాత్రింబవళ్ల
యొక్క పరిణామ క్రమమును
చక్కగా ఎరిగి యున్నారు.

అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః
ప్రభవన్త్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయంతే
తత్రైవావ్యక్త సంజ్ఞకే శ్లో - 18

బ్రహ్మదేవునికి పగలు ప్రారంభ
మగునపుడు అవ్యక్తము
నుండి *(ఆయన సూక్ష్మశరీము నుండి)*
సర్వభూతములు ఆవిర్భవించు
చున్నవి. మరల రాత్రి ప్రారంభం
కాగానే అట్టి అవ్యక్త మునందే
*(ఆయన సూక్ష్మ శరీరమునందే)*
అవన్నీ విలీనం అగుచున్నవి.

భూతగ్రామస్స ఏవాయం
భూత్వాభూత్వా ప్రలీయతే
రాత్ర్యాగమేవశఃపార్థ!
ప్రభవత్యహరాగమే శ్లో - 19

*అర్జునా!*
సర్వభూతములు
బ్రహ్మకు పగలగునపుడు
ఆవిర్భవించును, రాత్రియైనపుడు
అవి అంతరించును, ఈ విధంగా
జనన మరణములను మరల
మరల పొందుచున్నవి

పరస్తస్మాత్తు భావోన్యో
వ్యక్తో వ్యక్తాత్సనాతనః
యస్స సర్వేషు భూతేషు
నశ్యత్సు న వినశ్యతి శ్లో - 20

ఏ పరబ్రహ్మం
అవ్యక్తం కంటే వేరై
శ్రేష్ఠమై, తెలియరానిదై
శాశ్వతమైనది అయి వున్నదో
అట్టి పరబ్రహ్మం సర్వ ప్రాణులు
నశించినను తాను మాత్రం నశించదు

అవ్యక్తోక్షర ఇత్యుక్తః
స్తమాహుః పరమాం గతిం
యం ప్రాప్య న నివర్తంతే
తద్ధామ పరమం మమ శ్లో - 21

ఏది అక్షరము
ఏది అవ్యక్తము అని
చెప్పబడినదో అదియే
సర్వోత్కృష్ఠమైన స్థితి
దేనిని పొందిన పిదప
తిరిగి జన్మింపదో అదియే నా స్థానం

పురుషః స పరః పార్థ!
భక్త్యా లభ్యస్త్వ నన్యయా
యస్యాన్తః స్థాని భూతాని
యేన సర్వమిదం తతం శ్లో - 22

*అర్జునా!*
ఈ చరాచర భూతము
లన్నియు ఎవనియందున్నవో
ఈ సమస్త ప్రపంచము ఎవని
చేత పరివ్యాప్తమై యున్నదో
అట్టి పరమాత్మ అనన్య భక్తి వలననే
లభ్యముకాగలడు

అందువల్లనే శ్రీ పోతనామాత్యులవారు తమ భాగవతంలోని గజేంద్రమోక్షములో ఆపదలో వున్న గజేంద్రుని చేత ఈ విధంగా పలికించాడు.

ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండులీనమై
యెవ్వని యందు డిందుఁ బరమేశ్వరుఁడెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వము దానయైన వాఁ
డెవ్వడుఁ వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేఁడెదన్

తా॥ ఈ ప్రపంచము పుట్టుట, లయించుట ఎవరివలన నగుచున్నదో, ఎవడు దాని కధిపతియో, యెవడు జగముల సృష్టికైన పదార్థమో, యాదిమధ్యాంతము లెవనికి లేవో, యెవండు కోరినంతనే మనసులో నగుపడునో వాని నాశ్రయించుచుంటిని.

క॥ ఒకపరిజగముల వెలినిడి
యొకపరి లోపలికిఁగొనుచు నుభయముఁదానై
సకలార్థ సాక్షియగు న
య్యకలంకు నాత్మ మయుని నర్థిఁదలంతున్

తా॥ ఒకసారి లోకములను వెలుపలనుంచుచు ఒకమారు లోనుంచుకొనుచు లోకములకు పురుషుడుతానేయై, ప్రపంచ వ్యవహారమున కంతకును సాక్షియై యుండు పరిపూర్ణుని దేహాత్మలకు గారణమైన వానిని అపేక్షతో గొల్తును.

క॥ లోకంబులు లోకేశులు
లోకస్థులు దెగిన తుది నలోకంబగు పెం
జీఁకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్

తా॥ లోకములు లోకపతులు లోకవాసులు నశింపగా లోకము లేని స్థితిలో మహాంధకారమున కవ్వల నెవడు ప్రకాశించునో వాని గొల్తును.

క॥ నర్తకుని భంగిఁ బెక్కగు
మూర్తులతో నెవ్వఁడాడు మునులును దివిజుల్
కీర్తింపనేర రెవ్వని
వర్తన మొరు లెఱుఁగ రట్టి వాని నుతింతున్

తా॥ నటునివలె నెవఁడనేక రూపములతో వర్తించునో, యెవని వర్తనమును మునులు, సురల తెలియఁజాలరో, సాధారణుల కెవఁడర్థము గాఁడో యట్టి భగవంతునిఁ గొల్తును.

ఆ॥ ముక్త సంగులైన మునులు దిదృక్షులు
సర్వభూతహితులు। సాధు చిత్తు
లసదృశ వ్రతాఢ్యు లైకొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు దిక్కునాకు

సీ॥ భవము దోషంబు రూపంబు కర్మంబు నా
హ్వయమును గుణములెవ్వనికి లేక
జగములఁగలిగించు సమయించు కొఱకునై
నిజమాయ నెవ్వఁడ న్నియును దాల్చు
నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ
కిద్ధరూపికి రూప హీనునకును
జిత్రచారునికి సాక్షికి నాత్మరుచికిని
బరమాత్మునకుఁబర బ్రహ్మమునకు

ఆ॥ మాటల నెఱుకల మనములఁజేరంగఁ
గాని శుచికి సత్త్వ గమ్యుఁడగుచు
నిపుణులైనవారి నిష్కర్మతకు మెచ్చు
వాని కే నొనర్తు వందనములు

తా॥ ఎవడు పుట్టుక, దానివలన గుణసము దాయము లేక సృష్టి సంహారములపై వానినన్నింటిని పొందునో, అట్టి పరబ్రహ్మమునకు, మేర లేని శక్తి రూపారూపములుగలవానికి ఆవాఙ్మానసగోచరులకు, సర్వ గుణులకు నగుపడువానికి, నిష్కామ్యకర్మల మెచ్చువానికి నమస్కరించుచున్నాను.

క॥ యోగాగ్ని దగ్ధ కర్మలు
యోగీశ్వరు లేమహాత్ము నొండెఱుఁగక స
ద్యోగ విభాసిత మనముల
బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్

తా॥ యోగాగ్ని చేఁబూర్వకర్మలఁ గాల్చిన యోగులు యోగపుగాంతిచేఁదమ మనస్సులందు జూచు దేవుని ధ్యానింతును.

సీ॥ పరధర్మ కామార్థ వర్జిత కాములై
విబుధు లెవ్వాని సే వింతు రిష్ట
గతిఁ బొందుదురు చేరి కాంక్షించువారి క
వ్యయ దేహమిచ్చె నె వ్వాఁడు కరుణ
ముక్తాత్ము లెవ్వాని మునుకొని చింతించు
రానందవార్ధిమ గ్నాంతరంగు
లేకాంతు లెవ్వాని నేమియుఁగోరక
భద్రచరిత్రంబు బాడుచుందు

ఆ॥ రా మహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మ
యోగగమ్యుఁ బూర్ణు సన్నుతాత్ము
బ్రహ్మమయిన వానిఁ బరుని నతీంద్రియు
నీశు స్థూలు సూక్ష్ము నే భజింతు

తా॥ పురుషార్థములకు సంబంధింపని కోర్కులుగల పండితు లెవరినిఁ గొలుతురో, అట్లు కొలుచువారి కెవఁడభీష్టముల నిచ్చునో, ఎవఁడట్టి వారికి నాశరహితదేహ మొసంగునో, జీవన్ముక్తు లానందమునను, ఏకాంతులు గానముచేతను ఎవనిని నుతింతురో యట్టి మహాత్ముని, పరపూర్ణుని, స్థూల సూక్షములైన వానిని స్తుతించుచున్నాను.

సీ॥ పాపకుం డర్చుల భానుండు దీప్తుల
నెబ్భంగి నిగిడింతు రెట్లడంతు
రాక్రియ నాత్మక రావళిచేత బ్ర
హ్మాదుల వేల్పుల నఖిలజంతు
గణముల జగముల ఘననామరూప భే
ధములతో మెఱయించి తగ నడంచు
నెవ్వఁడు మనము బుద్ధీంద్రియంబులుఁదాన
యై గుణసంప్రవాహంబు నెఱపు

తే॥ స్త్రీ నపుంసక పురుషమూ ర్తియును గాక
తిర్యగమరనరాది మూ ర్తియును గాక
కర్మగుణభేద సదసత్ప్ర కాశిగాక
వెనుక నన్నియుఁ దానగు విభుఁదలంతు

తా॥ ఏ మహనీయుడు అగ్ని మంటలను, సూర్యుడు కాంతులను అగుపరచి తమలో నిముడ్చుకొనినట్లు, పిపీలికాది బ్రహ్మ పర్యంతమును సంకల్పమాత్రమున సృజించి యణచివేయునో, ఎవఁడు బుద్ధీంద్రియములై లోకవర్తనము నెఱుపునో, యెవఁడు లింగభేదము లేక జంతు నర దేవతల తెగలకుఁ జేరక, కర్మగుణములు గాక, సదసత్తులు గాక యన్నిటికి మూల ద్రవ్యమగునో వానిఁదలంతును.

గజరాజు దైవసిద్ధాంతానుసారముగా భగవంతునిఁ బ్రార్థించెను. ఆ దైవము వినలేదు. గజరాజు స్తుతించెనుగాని యది యార్తితోఁ గూడి నది కాదు. అందులకై కవి యతనిని అర్జునునివలెనే ననుమానపడువానిఁజేసి అతనిలో యార్తినగు పఱచుచున్నాడు. శంక యేర్పడిననేగాని సద్భక్తి కుదరదని కొందఱభిప్రాయపడుదురు. అందువల్ల గజరాజు తిరిగి యీ విధంగా ఆర్తితో తన ప్రార్థనను మొదలు పెట్టాడు.

క॥ కలడందురు దీనుల యెడఁ
గలఁడందురు పరమయోగి గణములపాలం
గలఁడందు రన్ని దిశలను
గలఁడు కలండనెడువాఁడు కలఁడో లేఁడో

అని పల్కించాడు పోతనామాత్యుడు గజరాజు చేత -ఇంకా ఈ విధంగా పలికిస్తున్నాడు.

సీ॥ కలుఁగడే నా పాలి కలిమి సందేహింపఁ
గలిమి లేములు లేక కలుగువాఁడు
నాకడ్డ పడరాఁడె నలినసాధువులచేఁ
బడిన సాధుల కడ్డ పడెడువాఁడు
చూడఁడే నాపాటు జూపులఁ జూడక
చూచువారలఁ గృపఁ జూచువాడు
లీలతో నా మొఱా లింపఁడే మొఱఁగుల
మొఱలెఱుంగుచు: దన్ను మొఱఁగువాఁడు

తే॥ అఖిల రూపులు దన రూపమైనవాడు
ఆదిమధ్యాంతములు లేక యడరువాఁడు
భక్త జనముల దీనుల పాలివాఁడు
వినఁడె చూడఁడె తలఁపఁడె వేగ రాఁడె

దాసులయందును, యోగిజనులయందును, సర్వదిశలందును కలడని నిరూఢిగా చెప్పబడు దైవము ఇంతవరకు నా ప్రార్థనాలకించి రాలేదుగదా! కడుకున్నాడా! లేడా! అంటూనే....

పెద్ద పిన్నయను తారతమ్యము లేకుండువాడు నా యోగ్యతను గూర్చి సందేహించు చున్నాడా! సాధుల బాధించు దుర్మదుల మదమును అడంచువాడు నాకడ్డుపడరాకున్నాడే? ఏమిటీ వైచిత్ర్యం? అంతర్దృష్టులలో జూచువారిని దయతో గనువాడు నన్నను గ్రహింపడా? తానగుపడక ఎక్కడ ఎవరు పెట్టిన మొరను వినువాడు నాఆర్తిని ఆలకింపడా? సకల జంతుకోటిరూపును తానే ధరించిన వాడు, ఆది మధ్యాంతములు లేక దీనులను భక్తులను రక్షించువాడు మొరవినక నాగ్లాని చూడక నన్ను కాపాడకుండా వున్నాడే?

ఏమిటిదంతా! అని విసుగు నొందక తిరిగి

క॥ విశ్వకరు విశ్వదూరుని
విశ్వాత్ముని విశ్వవేదు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మ ప్రభు
నీశ్వరునిం బరమ పురుషు నే సేవింతున్

అని పలికి తన మనంబునందు ఆ గజేంద్రుండు ఈశ్వరసన్నిధానంబు కల్పించుకొని ఇటులనియె

శా॥ లావొక్కింతయు లేదు ధైర్యము విలో లంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్దప్పెను, మూర్ఛవచ్చెఁ, దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితః పరంబెరుగ మన్నింపం దగున్ దీనునిన్
రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!

తా॥ దేహ మనోబలములు తగ్గిపోయినవి, ప్రాణములు తావులు దప్పినవి, అలసటచే నొడలు స్రుక్కిపోతున్నాయి, కడకు నిలుచుటకైనను శక్తిలేదు, ఇట్టి దీనత పొందిన నన్ను రక్షింపగా రమ్ము.

క॥ వినుదట జీవుల మాటలు
చనుదట చనరానిచోట్ల శరణార్థులకో
యనుదట పిలిచిన సర్వము
గనుదఁట సందేహమయ్యెఁ గరుణావార్ధీ!

తా॥ ఓ దయా సముద్రుఁడా! ఎవరనిన మాటలను విని వారికై పోరాని చోట్లకు పోయి యార్తులకుఁ బలుకుచు నంతయుఁ దిరుగుదవని యందురు. అది నా కనుమానముగా నున్నది.

ఉ॥ ఓ కమలాప్త యో వరద యో ప్రతిపక్ష విపక్షదూర కు
య్యో కవియోగివంద్య సగుణోత్తమ యో శరణాగతామరా
నోకహ యో మునీశ్వర మనోహర యో విమల ప్రభావ రా
వే! కరుణింపవే! తలఁపవే! శరణార్థిని నన్నుఁ గావవే

అని పలికి మరియు నదక్షితరక్షకుండైన ఈశ్వరుండాపన్నుండైన నన్నుంగాచుగాక యని నింగి జూచుచు నిట్టూర్పులు నిగిడించుచు బయలాలకించుచు నగ్గజేంద్రుడు మొఱసేయుచున్న సమయంబున

ఆ॥ విశ్వమయత లేమి వినియు నూరకయుండి
రంబుజాననాదు లడ్డపడక
విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు
భక్తియుతున కడ్డ పడఁదలంచె

మ॥ అలవైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు దా
పల మందారవనాంతరామృతసరః ప్రాంతేందు కాంతోపలో
త్పలపర్యంక రమా వినోదియగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహిపాహియనఁగుయ్యాలించి సంరంభియై

గజేంద్రుడీ విధంగా మొరపెట్టుకొంటున్న సమయమందు విష్ణువు కలువల పాన్పుపై ధర్మపత్నితో వినోదించుచుండెను. ఆకలువ పాన్పు అమృతపు కొలను ప్రక్కగా వుండినది. ఆ కొలను విష్ణువు భవనము ప్రక్కగా మందార వనమునందుండినది. గజరాజు మొరవినగానే అట్టి సుందర భవనంలో ధర్మపత్నితో వినోదిస్తున్న ఆ శ్రీ మహావిష్ణువు గజేంద్రుని రక్షింపగోరి

మ॥ సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముంజేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణి కాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజ ప్రాణావ నోత్సాహియై

మ॥ తనవెంటన్ సిరి లచ్చివెంటనవరోధవ్రాతమున్ దాని వె
న్నను బక్షీంద్రుఁడు వానిపొంతను ధనుః కౌమోదకీశంఖచ
క్ర నికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండు రావచ్చిరో
య్యన వైకుంఠపురంబునం గలుగు వా రాబాలగోపాలమున్

అపుడు ఒక్క విష్ణువేకాదు, మొత్తం వైకుంఠానికి వైకుంఠమే కదలిందిగజేంద్రుని వద్దకు పరమాత్మ మానవునకు లభ్యం కావాలంటే ఈవిధమైన అనన్య భక్తి కావలసి వుంటుంది. అందుకై ప్రతిమానవుడు ప్రయత్నించాలి. ఇదే మనకు గజేంద్రమోక్షము తెలిపిన రహస్యాతి రహస్యమైన అంశం.

యత్ర కాలే త్వనావృత్తి
మావృత్తిం చైవయోగినః
ప్రయాతా యాన్తితం కాలం
వక్ష్యామి భరతర్షభ శ్లో - 23

అర్జునా!
ఏకాలమున గతించిన
యోగులు జన్మ రాహిత్యము
నొందుదురో, ఏకాలమునందు
గతించిన పునర్జన్మమును పొందుదురో
ఆయా విషయములను చెప్పుచున్నాను
వినుము

అగ్నిర్జ్యోతిరహః శుక్లః
షణ్మాసా ఉత్తరాయణం
తత్రప్రయాతా గచ్ఛంతి
బ్రహ్మ బ్రహ్మవిదో జనాః శ్లో - 24

అగ్ని, జ్యోతి, దినము
శుక్ల పక్షము ఈ నాలుగు
షణ్మాసముల (ఆరుమాసాలు)తో
కూడిన ఉత్తరాయణము
ఈ అయినంలో సూర్యుడు
మకర రాశియందు ప్రవేశించును
ఈ రాశిలో దేహయాత్రను చాలించిన
బ్రహ్మవేత్తలైన జనులు
బ్రహ్మమును పొందుతున్నారు

1.అగ్ని 2. జ్యోతి 3. దినము (పగలు) 4. శుక్లపక్షము 5. ఉత్తరాయణమును గురించి ఈ శ్లోకమునందు చర్చించబడింది.

ఇందులోని మొదటి నాలుగు ప్రకాశము (వెలుగు)ను సూచించును. ఐదవది అయిన ఉత్తరాయణము ఊర్ధ్వగతిని నిరూపిస్తుంది.

ప్రకాశరూపమగు జ్ఞానమును ఆశ్రయించినవాడు తప్పక బ్రహ్మత్వమును పొందగలడన్నది ఈ శ్లోకము యొక్క ప్రధాన ఉద్దేశం. మానవుడు పరమాత్మను పొందవలెనన్నచో జ్ఞానము ద్వారానే పొందవలెను. అందుకుగాను ఊర్ధ్వ మార్గమున పయనించవలసి వుంది. ఊర్ధ్వ మార్గమంటే, సత్య మార్గం, ఊర్ధ్వ దృష్టిని, ప్రకాశరూపమగు జ్ఞాన దృష్టిని ఉత్తరాయనకాలము, అగ్న్యాది ప్రకాశక పదార్థములు సూచించుచున్నవి.

ఇందువలననే తండ్రి వలన స్వచ్ఛందమరణ వరాన్ని పొందిన భీష్మ పితామహుడు మహాభారత యుద్ధమందు దక్షిణాయణంలో పతనమైనా వరప్రసాదము వలన సూర్యుడు మకరరాశిలో ప్రవేశించునంత వరకు జీవించి అంపశయ్యపై నుండి ధర్మం కొరకు ధర్మరాజుకు ధర్మసూత్రాలను బోధిస్తూ ఆ పిదప తనువును వీడినట్లు మనం మహాభారతంలో చూస్తాం.

ధూమో రాత్రిస్తథా కృష్ణః
షణ్మాసా దక్షిణాయనం
తత్ర చాంద్రమసం జ్యోతిః
యోగీ ప్రాప్య నివర్తతే శ్లో - 25

*పొగ, రాత్రి, కృష్ణపక్షం*
*ఈ మూడును ఆరుమాసాలతో*
*కూడిన దక్షిణాయనము*
*ఈ అయనం నందు తనువు*
*చాలించిన యోగులు చంద్ర*
*సంబంధమైన జ్యోతిని పొంది*
*తిరిగి వెనుకకు మరలి వస్తున్నారు*
*అంటే పునర్జన్మలను పొందుతున్నారు*

జ్ఞానము ఎట్లు ప్రకాశరూపం అయివున్నదో అట్లే అజ్ఞానం అంధకారరూపం అయివున్నది. అట్టి అంధకార రూపంలో శరీరయాత్రను చాలించినవాడు యోగి అయినా మరల చంద్రమండలాన్ని చేరి అక్కడ కొంతకాలముండి తిరిగి జన్మించును. ఇక్కడ 1. పొగ 2. రాత్రి 3. కృష్ణపక్షము అంధకారాన్ని సూచించగా నాలుగవది అయిన దక్షిణాయనము అధోమార్గాన్ని సూచిస్తున్నది. ఆత్మజ్ఞానములేనివాడు ఇట్టి అంధకారమార్గాన పయనిస్తాడని దీని విశేషార్థము.

భీష్మపితామహునికి స్వచ్ఛంద మరణ వర ప్రభావం వుండడం వలన దక్షిణాయనంలో యుద్ధంనందు పతనమైనను ఉత్తరాయన పుణ్యకాలం ప్రవేశించునంత వరకు సజీవం గానుండి ఉత్తరాయణం రాగానే తనువు చాలించాడు.

సామాన్య మానవుల సంగతి అట్లు వుంచితే ఎందరో యోగులు కూడా దక్షిణాయనమున తమ దేహయాత్రను చాలిస్తున్నారు. మూర్ఖులైనటువంటి వారు ఎందరో ఉత్తరాయనమున మరణిస్తున్నారు. దీని ప్రకారము దక్షిణాయనమున దేహయాత్రను చాలించిన యోగులు తిరిగి జన్మిస్తారని, ఉత్తరాయణమున దేహాన్ని చాలించిన మూర్ఖులు బ్రహ్మపదవిని నొందగలరనిదీని అర్థమా? ఇది సరికాదు.

ఉత్తర, దక్షిణ మార్గాలు జ్ఞానాన్ని, అజ్ఞానాన్ని సూచించే మార్గాల విషయం తెలుపడానికి ఇంత తికమక పెట్టడం జరిగింది. గీతాధ్యయన పరులు దీనిని స్వానుభవంతో తెలుసుకోవలసి వుంటుంది.

శుక్ల కృష్ణే గతీహ్యేతే
జగతః శాశ్వతే మతే
ఏకయా యాత్యనావృత్తి
మన్యయావర్తతే పునః శ్లో - 26

ఈ శుక్ల, కృష్ణ మార్గములు
రెండును జగత్తునందు
శాశ్వతముగ నున్నవి
ఇందలి మొదటి మార్గము
వలన జన్మరాహిత్యం,
రెండో మార్గము వలన పునర్జన్మము
కలుగుచున్నది

నైతే సృతీ పార్థ! జానన్
యోగీ ముహ్యతి కశ్చన
తస్మాత్సర్వేషు కాలేషు
యోగయుక్తో భవార్జున! శ్లో - 27

అర్జునా!
ఈరెండు మార్గములను
తెలిసిన యోగి ఎవడును
మోహమును పొందడు
అందువలన సర్వకాలముల
యందును నీవు యోగివికమ్ము

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ శ్లో - 28

ఈ విషయమును తెలుసుకున్న
యోగి వేదముల వలనను
యజ్ఞముల వలనను
దానము వలనను కలుగు
ఫలములను దాటి పోవుచున్నాడు
అంతేకాదు ఆద్యమైనట్టియును
ఉత్కృష్టమైనట్టి పదమును
పొందుచున్నాడు

మహర్షి వినోబా "శుక్ల-కృష్ణ" గతులను గూర్చి ఈ విధంగా తెలియజేశారు.

"పరమేశ్వరుని మీద శ్రద్ధయుంచి మనోవాక్కర్మల ద్వారా రేయింబవళ్లు పోరాటమునసలు పుచున్నచో అంత్య సమయము మహత్తరముగ పరిణమించును. అప్పుడు దేవతలందరును అనుకూలురగుదురు. ఈ విషయమే ఈ అధ్యాయము చివర ఒక రూపకాలంకారము ద్వారా నిరూపింపబడింది. ఈ రూపకమును మీరు అవగాహన చేసుకొనుడు. ఎవరి మరణ సమయమున అగ్ని మండుచుండునో, సూర్యుడు ప్రకాశించు చుండునో, శుక్లపక్ష చంద్రుడువృద్ధిలో నుండునో ఉత్తరాయణము వచ్చి ఆకాశమంతయు మేఘరహితమై సుందరముగ నుండునో అట్టివాడు బ్రహ్మయందు విలీనమగును.

ఎవని మృతి సమయమందు పొగ వ్యాపించియుండునో, బహిరంతరములు అంధకారమయమై యుండునో, కృష్ణపక్ష చంద్రుడు క్షీణించు చుండునో దక్షిణాయనము వచ్చి ఆకాశమంతయు నల్లని మేఘములతో కప్పబడి యుండునో అట్టివాడు తిరిగి జనన మరణ చక్రములో పడును.

చాలామంది ఈ రూపకమును చూచి తబ్బిబ్బగుచు పుణ్యమరణము కావలె నన్నచో అగ్ని, సూర్య, చంద్రాదిదేవతల, ఆకాశాధిభూతముల కృపయుండవలెను. అగ్ని కర్మకును యజ్ఞజ్వాల మండుచుండవలెనని న్యాయమూర్తి ర్యానాడేగారు ఇట్లనుచున్నారు.

కర్తవ్య కర్మను నిరంతరము పాలించుచు మరణించిన వాని జన్మము ధన్యము. ఏదో ఒక స్కంధమును పఠించుచునో వ్రాయుచునో, ఒక సత్కార్యము చేయుచునో నేను మరణించితినా ధన్యుడనే! అగ్నిమండుచున్నదనిన అర్థమిది. మరణ సమయమున కూడా

కర్మను ఆచరించుట అగ్ని యొక్క కృప. సూర్యుని కృపయనగా బుద్ధియొక్క ప్రభ చివరవరకును ప్రకాశించుట. చంద్రుని కృపయనగా అంత్యసమయములో పవిత్ర భావనలు వృద్ధి చెందుట. చంద్రుడు మనస్సు యొక్క భావన యొక్క అధిదేవత, శుక్ల పక్ష చంద్రునివలె మనస్సులో ప్రేమ, భక్తి, ఉత్సాహము, పరోపకారం, దయ ఇత్యాది శుద్ధ భావనలు పూర్ణవికాసమును పొందవలెను. ఆకాశము యొక్క కృపయనగా హృదయాకాశములో ఆసక్తియను మేఘపు సంచారము ఏమాత్రము వుండరాదని అభిప్రాయము. ఒకసారి గాంధీగారు ఈ విధంగా అన్నారు.

"నేను అహర్నిశము చరఖా- చరఖాయని ఎలుగెత్తి కేకలు వేయుచున్నాను. చరఖాను నేను అతి పవిత్ర వస్తువుగా భావింతును. కాని అంత్యసమయములో నాలో దాని వాసన ఏ మాత్రం వుండరాదు.

(మతదురహంకారుడైన గాడ్సే గాంధీజీని పిస్టల్‌తో కాల్చినపుడు హే! రాం! హేరాం! హే! రాం! అంటూ నేలకొరిగాడుగాని చరఖాగాని మరొక ఏ నిర్మాణ కార్యక్రమంగాని ఆ సమయంలో ఆయన ముందులేదు)

నన్ను చరఖా దిశకు ప్రేరేపించిన భగవంతుడే దాని భవిష్యత్తును గూర్చి ఆలోచించుటకు సర్వవిధముల సమర్థుడు, యోగ్యులైన ఇతరులు ఇపుడు రాట్నమును చేపట్టినారు. చరఖాను గూర్చిన ఆలోచనను వదిలి నేను పరమాత్మునియందులీనమగుటకు సిద్ధముకావలె అన్నాడు.

పై దాని సారాంశమిది. ఉత్తరాయణమనగా ఆస్తియను మేఘములు హృదయాకాశమును ఆవరింప కుండా వుండుట.

చేతిలో ఏదో ఒక సేవాకార్యము జరుగుతుండగా, భావనయను పూర్ణము ప్రకాశించు చుండగా, హృదయాకాశము బొత్తుగా ఆసక్తిలేనిదై వుండగా, బుద్ధి తేజస్వంతమయి వుండగా మరణించినవాడు పరమాత్మలోలీనమగును. ఇట్టి పరమ మంగళ రూపమగు అంత్యదశను చేరుటకు నిరంతరమును జాగరూకతతోను, దక్షతతోను, పోరు సలుపు చుండవలెను. ఒక్క అశుభ సంస్కారమున నైనను మనస్సులో తావీయవద్దు. ఇట్టి బలము చేకూరుటకు ఈశ్వరుని సతతము ప్రార్థించు చుండవలెను. నామ స్మరణము, తత్వస్మరణము మరల మరల చేయు చుండవలెను.

ఈ విధంగా ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును

శ్రీకృష్ణార్జున సంవాద రూపమును అయిన

శ్రీమద్భగవద్గీత యందలి అక్షర పరబ్రహ్మ యోగము అను పేరుగల

ఎనిమిదవ అధ్యాయము సమాప్తము గావించబడినది



# గీతా సంహిత

**అధ్యాయము తొమ్మిది** | **రాజవిద్యా-రాజ యోగము**

మహాభారతమునకు మధ్యలో ''గీత''- ''గీత''కు మధ్యలో రాజవిద్యా- రాజగుహ్య యోగము (ఆత్మసమర్పణ యోగం) అను ఈ తొమ్మిదవ అధ్యాయము అమర్చబడియుంది. ఈ అధ్యాయము పూర్తిగా హరి నామము యొక్క అపూర్వమహిమను గూర్చి తెలుపుచున్నది. అందువలననే ఈ అధ్యాయానికి ఇంత పవిత్రత. మహాభారతంలో అమర్చబడిన గీతలో ఈ అధ్యాయాన్ని వ్యాసభగవానుడు కూర్చి ఒక్క భారతావనికే కాక మొత్తము మానవ కోటికంతకూ ఎంతో మహోపకారాన్ని చేశాడు.

ఇందులో భగవానుడు అర్జునునకిచ్చిన సందేశం మాటలతో ప్రకటించబడేదికాదు. వ్యాసమహర్షి దయవలన గుప్త విషయానికి వాగ్రూపం కలిగింది.

ఈ అధ్యాయం ప్రారంభంలోనే (2వ శ్లోకం) భగవానుడు

''ఈ జ్ఞానము అన్ని విద్యలకు
రాజులాంటిది, ఇది అతి
రహస్యమైనది. ఉత్తమమైనది
పవిత్రమైనది, ప్రత్యక్షానుభవం ద్వారా
కూడా పొందదగినది, ధర్మస్వరూప
మైనది, ఆచరించుటకు సులభ
సాధ్యమైనది, నాశరహితమైనది''అని ప్రకటించియున్నాడు.
''మరణానంతరం లభించు స్వర్గము
వలనను దానిని గూర్చిన కథలను వినుట
వలనను మనకేమి లాభం? స్వర్గము

నకు బోవు వారెవరో? యమపురికి
జనువారెవరో ఎవరు చెప్పగలరు?
బ్రతికియున్న నాలుగు రోజులు
రాముని దాసుడనై యుండుట
లోనే నాకు ఆనందం వున్నది"

అని తులసీరామాయణ కర్త మహర్షి తులసీదాసు అంటాడు. రామదాసులై బ్రతుకుటలో వున్న మాధుర్యం అంతా ఈ అధ్యాయంలో మనకు ప్రత్యక్షముగ కనబడును.ఈ దేహములోనే, కన్నులార చూడదగిన సత్ఫలములను ఇప్పుడే, ఇక్కడే అనుభవ వేద్యములయిన విషయములను ఈ అధ్యాయం తెలుపుతున్నది. పంచదారను తినినప్పుడే దాని మాధుర్యం ప్రత్యక్షముగ అవగతమవుతుంది. రాముని దాసుడగుటలో వున్న రుచి ఈ అధ్యాయంలో అగుపిస్తుంది.

వెనుకటి అధ్యాయంతో ఈ అధ్యాయానికి గల సంబంధం ఈ విధంగా వుంది.

ఏడవ అధ్యాయమైన విజ్ఞాన యోగంలో భగవానుడు సగుణ- నిర్గుణ రూపములను గూర్చి వర్ణించి చెప్పుతూ చివరకు అధిభూత, అధిదైవాది సహితముగ బ్రహ్మమును సాక్షాత్కరింపజేసుకొను విషయమును గూర్చియు, అంత్య కాలమున చిత్తమును పరమాత్మయందు నెలకొలుపు విషయముల గూర్చియు భగవానుడు సూచన మాత్రముగ తెలుపగా అపుడు వెంటనే అర్జునుడు వాటి వివరములు తెలుసుకోదలచి వివిధరకాలైన ప్రశ్నలను వేశెను. ఆ ప్రశ్నలకు జవాబుగా ఏడవ అధ్యాయంలో పూర్వం తాను తెలిపి యుండిన జ్ఞాన, విజ్ఞాన విషయములనే తిరిగి విపులంగా ఈ అధ్యాయంలో బోధిస్తున్నాడు. ఈ అధ్యాయంలో మొత్తం 34 శ్లోకాలున్నాయి.

1. ఆధ్యాత్మిక విద్యాప్రబోధం *(1నుండి 3వ శ్లోకం వరకు)*
2. భగవత్స్వ రూప వర్ణనము *(4నుండి6వ శ్లోకం వరకు)*
3. జగత్ ఉత్పత్తిని గురించి *(7వ శ్లోకం నుండి 10వ శ్లోకం వరకు)*
4. అసురీ దైవీ ప్రకృతులు వాటి లక్షణాలు *(11నుండి 15వ శ్లోకం వరకు)*
5. భగవానుని సర్వాత్మ స్వరూపం *(16 నుండి 19వ శ్లోకం వరకు)*
6. సకామ, నిష్కామ ఉపాసనలకు ఫలములు *(20 నుండి 25వ శ్లోకం వరకు)*
7. నిష్కామ కార్యాచరణ మహిమ *(26నుండి 34వ శ్లోకం వరకు)*

ఇదం తు తే గుహ్యతమం
ప్రవక్ష్యామ్యనసూయవే
జ్ఞానం విజ్ఞానసహితం
యజ్ఞాత్వా మోక్ష్యసే శుభాత్  శ్లో - 1

దేనిని తెలుసుకొనిన పిదప
అశుభము నుండి విడివడి
శుభమును పొందెదవో
అట్టి అనుభవ సహితమైన
రహస్య జ్ఞానమును అసూయ
లేని నీకు నేను చెప్పుచున్నాను

రాజవిద్యా రాజగుహ్యం
పవిత్ర మిదముత్తమం
ప్రత్యక్షావగమం ధర్మ్యం
సుసుఖం కర్తుమవ్యయమ్  శ్లో - 2

ఈ జ్ఞానము సర్వవిద్యలలో
రాజైనటువంటిది, పవిత్ర
మైంది, అతి రహస్యమైంది
ఉత్తమమైంది, ప్రత్యక్షాను
భవము ద్వారా పొందదగినది
ధర్మస్వరూపమైనది, ఆచరించు
టకును  సులభ సాధ్యమైంది
నాశరహిత మయింది అయివున్నది

అశ్రద్ధధానాః పురుషా
ధర్మస్యాస్య పరంతపః
అప్రాప్య మాం నివర్తన్తే
మృత్యుసంసార వర్త్మని  శ్లో - 3

అర్జునా!
ఈ ధర్మమునందు
శ్రద్ధలేని మనుజులు
నన్ను పొందనివారై మరల
జనన మరణ రూపమైన
సంసారమునందు చేరుచున్నారు



మయా తతమిదం సర్వం
జగదవ్యక్త మూర్తినా
మత్ స్థాని సర్వభూతాని
న చాహం తేష్వవస్థితః శ్లో - 4

ఈ సమస్తమైన విశ్వం
అవ్యక్తస్వరూపుడనైన
నాచేత వ్యాప్తమై యున్నది
సమస్త ప్రాణికోటి నాయందున్నవి
నేను వాటియందుండుట లేదు

న చ మత్‌స్థాని భూతాని
పశ్యమే యోగమైశ్వరం
భూతభృన్న చ భూతస్థో
మమాత్మా భూతభావనః శ్లో - 5

భూతములు నాయందులేవు
ఈశ్వరీయమగునాయోగ
శక్తిమహిమను గాంచుము
నా స్వరూపము భూతములను
భరించునదియును, రక్షించునదియును
అయినను భూతములయందున్నదికాదు

యథాకాశస్థితో నిత్యం
వాయుః సర్వత్రగోమహాన్
తథా సర్వాణి భూతాని
మత్ స్థానీత్యుపధారయ శ్లో - 6

సర్వసంచారియును
గొప్పదియునగు వాయువు
ఏ విధముగా ఆకాశమునందు
నిత్యమై యున్నదో అవిధంగానే
సకలభూతములును నాయందున్న
వని గ్రహించుము

సర్వభూతాని కౌంతేయ
ప్రకృతిం యాంతి మామికాం
కల్పక్షయే పునస్తాని
కల్పాదౌ విసృజామ్యహమ్ శ్లో - 7

అర్జునా!
ప్రళయకాలమున
సమస్త ప్రాణులు నా
ప్రకృతిని చేరుచున్నవి
తిరిగి సృష్ట్యారంభమున
నేను వానిని సృజించుచున్నాను

ప్రకృతిం స్వామవష్టభ్య
విసృజామి పునః పునః
భూతగ్రామమి మం కృత్స్నం
అవశం ప్రకృతేర్వశాత్ శ్లో - 8

స్వీయమైన ప్రకృతిని
అనుసరించి అస్వతంత్రమైన
సర్వభూతములను ప్రకృతి
వశమున మరల మరల
పుట్టించు చున్నాను

న చ మాం తాని కర్మాణి
నిబధ్నన్తి ధనఞ్జయ!
ఉదాసీనవదాసీన
మసక్తం తేషు కర్మసు శ్లో - 9

అర్జునా!
కర్మలయందు సంగమం
లేక తటస్థునివలె వున్న
నన్ను ఆకర్మలు బంధించవు

మయాధ్యక్షేణ ప్రకృతిః
సూయతే సచరాచరం
హేతునానేన కౌంతేయ
జగద్విపరివర్తతే శ్లో - 10

అర్జునా!
నా పర్యవేక్షణలోనే
చరాచర భూతప్రపంచమును
ప్రకృతి సృజించుచున్నది
ఈ కారణము వల్లనే జగత్తంతా
నాచే ప్రవర్తించబడుచున్నది

అవజానన్తి మాం మూఢా
మానుషీం తనుమాశ్రితం
పరంభా వమజానంతో
మమ భూతమహేశ్వరం శ్లో - 11

మూఢులైనవారు నా
పరతత్వమును గూర్చి
తెలుసుకో లేక, సర్వ
భూతములకు ప్రభువునై
మానవ దేహముతో వున్న
నన్ను గుర్తించ లేక నన్ను
అవమాన పరుస్తున్నారు

మోఘాశా మోఘకర్మాణో
మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీమాసురీం చైవ
ప్రకృతిం మోహినీం శ్రితాః శ్లో -12

వ్యర్థమైన కోరికలుకోరెడివారును
వ్యర్థమైన కర్మలుచేసెడివారును
అజ్ఞానులును, అవివేకులును
మోహ, అసుర సంబంధమైన
ప్రకృతినే పొందుచున్నారు

మహాత్మానస్తు మాం పార్థ!
దైవీం ప్రకృతి మాశ్రితాః
భజన్త్యనన్యమనసో
జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ శ్లో - 13

అర్జునా!
మహాత్ములైనవారు
ప్రకృతిని ఆశ్రయించిన వారై
నన్నుభూతములకు కారణముగాను
నాశరహితునిగాను తెలుసుకొని
యోగయుక్తులై భజించు చున్నారు

సతతం కీర్తయంతో మాం
యతన్తశ్చ దృఢవ్రతాః
నమస్యన్తశ్చ మాం భక్త్యా
నిత్యయుక్తా ఉపాసతే శ్లో - 14

అహర్నిశములు నన్ను
కీర్తించువారును, దృఢవతులై
ప్రయత్నించువారును, భక్తితో
నాకునమస్కరించెడి వారును
అయిన నిత్యయుక్తులు నన్ను
సేవించుచున్నారు

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే
యజంతో మాముపాసతే
ఏకత్వేన పృథక్త్వేన
బహుధా విశ్వతోముఖమ్ శ్లో - 15

మరికొందరు జ్ఞానయజ్ఞము
చేతను విరాడ్రూపుడైన నన్ను ఏక
రూపునిగా ఉపాసించుచున్నవారై
మరికొందరు బహురూపునిగను
ఉపాసించుచున్నారు, ఇంకొందరు
బహురూపునిగను నానా విధములుగ
పూజించుచునే యున్నారు

అహం క్రతురహం యజ్ఞః
స్వధాహమహమౌషధం
మంత్రోహమహమేవాజ్య
మహమగ్ని రహం హుతం శ్లో - 16

నేనే క్రతువును
యజ్ఞమును నేనే
పితృపిండమును, ఔషధమునునేనే
మంత్రమును, హవిస్సును, అగ్నిహోత్రమును నేనే
నేను హోమ కర్మమును కూడా అయి వున్నాను

I am the sacrificial vow
I am the sacrifice
I the ancestral oblation
I the herb I the sacred text
I the clarified butter I the fire
I the burnt offering
(From the Gospel of self less action)

పితాహమస్య జగతో
మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోంకార
ఋక్సామయజురేవచ శ్లో - 17

ఈ జగత్తుకు
తల్లిని, తండ్రిని నేనే
సంరక్షకుడను, తాతను
తెలియదగిన "ఓంకార"
ప్రణవమును నేనే
నేనే ఋక్, యజుర్, సామవేదములను

Of this universe I am Father,
Mother, Creator, Grandsire
I am what is to be known,
the sacred syllable AUM
the Rig, the Saman and the Yajus

Note : The Goal which all the Vedas repeat, which all the austerities speak of, desiring which men practise brahmacharya that Goal I declare to thee in brief it is AUM. The sacred syllable, corresponding to Logos, is described thoughout the Upanishads as

both the goal and the means of meditation. Indeed the two words akshara and pada convey both meanings, Imperishable and Word, and Goal and Word respectively. The Mundaka Up., in a most beautiful metaphor, described the whole process of meditation as the practice of archery in which one has to direct the arrow of one's Atman, sharpened by devotion, from the bow of AUM, to Brahman which is the target.. BY undistracted contemplation, we are told, can the bow pierce the mark and become one with it. The Prashna Up. describes meditation through repetition of the sacred syllable as a spiritual charm to cleanse oneself of sins, and Mandukya is solely devoted to expounding the spiritual content of the mystic Word.

The triple syllable is thus invariably the means of meditation as well as the goal, and has since been interpreted to stand for all kinds of trinities. It is enough for our present purpose to note that following closely, as the reference does, the description of the different processes of the evolution and involution of Brahman, the syllable may be understood to stand for prakriti, the individual self and the Supreme. 'AUM' is Brahman 'AUM' is this all, says the Taittiriya Up. X It is with this knowledge that one must use the sacred symbol for meditation, and supreme is the good fortune of him who can, at the time of death, put himself in tune with the Infinite through repeatig this sacred syllable.

గతిర్భర్తా ప్రభుసాక్షీ
నివాసః శరణం సుహృత్
ప్రభవః ప్రళయః స్థానం
నిధానం బీజమవ్యయం శ్లో - 18

ఈ జగత్తుకు నేనే గతిని
భర్తను, ప్రభువును, సాక్షిని నేనే
ప్రాణుల నివాసమును, శరణమొంద
దగినవాడను, హితమొనర్చువాడను
సృష్టిస్థితి లయ కర్తను నేనే
నిక్షేపమును, నాశరహితమైన
బీజమును నేనే

I am the Goal
the Sustainer, the Lord
the Witness, the Abode
the Refuge, the Friend
the Origin, the End, the Preservation
the Treasurehouse, the Imperishable Seed

తపామ్యహమహం వర్షం
నిగృహ్ణామ్యుత్సృజామి చ
అమృతం చైవ మృత్యుశ్చ
సదసచ్చాహమర్జున! శ్లో - 19

అర్జునా!
నేను తపింపజేయుచున్నాను
వర్షమును కురిపించుచున్నాను
ఆపుచున్నాను, అమృతమును
మృత్యువును కూడా నేనే
సదసత్తులు నేనే

I give heat
I hold back and pour forth rain
I am deathlessness and also death
O arjua, Being and not-Being as well

(The seminal text for this paradoxical description is the famous Nasadiya Sukta of Rig Veda beginning, 'There were then neither Asat (not-Being) nor Sat(Being). Since then the Prius of all existence has sometimes been described as Sat, sometimes as Asat, from which Asat and Sat respectively were born. Thus in Taitt. Up. 2.7 we have :"In the beginning was Asat; from it was born Sat" and in Chh. Up. 62 we have: "In the beginning verily all was Sat without a second." When the Prius is described as Asat (not-Being) it is the state before beig (in the sense of coming out or becoing) that is emphasized. When it is described as Sat it is its aspect of reality that is emphasized, that alone being the Real all else existing because of It. The Gita sums up both the conceptions. Again we find Br. Up. referring to Death as the origin of all things. Why not then

Deathlessness? They are nothing but different words for not-Being and Being. In a word, God is the sum of all relatives and combines all contraries. As the Br. Up. says:X"Brahman has indeed two aspects- the concrete and the inconcrete, the mortal and the immortal, the moving and the fixed, the this and the that....It is the Reality of all Realities for all these are realities and it is the Supreme Reality.")

"From the Gospel of self less action"

త్రైవిద్యామాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్దివి దేవభోగాన్ శ్లో - 20

వేదాధ్యయనం చేసినవారు
నన్ను పూజించి, సోమపానం
చేసి పాపవిముక్తులై స్వర్గ
స్థితిని గూర్చి ప్రార్థిస్తున్నారు
వారి పుణ్యపదమగుఇంద్రలోకమును
పొంది అచ్చట దివ్యభోగమును
అనుభవించుచున్నారు

Followers of the three Vedas
who drink the soma juice and
are purge of sin worship Me
with sacrifice and pray for
going to heaven they reach
the holy world of the gods
and enjoy in heaven the divine
joys of the gods

ఈ విషయమై మహాత్మాగాంధీగారి అభిప్రాయం ఇట్లున్నది.

The reference is to the sacrificial
ceremonies and rites in vogue
in the days of the Gita. We cannot
definitely say what they were
like nor what the soma juice exactly
was.

శ్రీ అరవింద మహర్షి ఈ విషయమై తనభావాన్ని ఈ విధంగా తెలియజేశారు.

"మూడువేదముల విద్యను
పొందిన వారు సోమపానము
చేసి పాపములు నశించిన
వారై పవిత్రులై యజ్ఞాల
చేతనన్ను పూజించి స్వర్గాన్ని
కోరతారు"

అటువంటి వారు తమ బాహ్య సంపర్కానికి చెందిన యజ్ఞ కర్మలను ఆచరిస్తారు. వారి లక్ష్యం భూజీవితానికి సంబంధించిన సుఖదుఃఖాల తదనంతరం స్వర్గ సుఖాలను అనుభవించడం, అంటే భూమి మీద లభించే సుఖానికన్న మించిన సుఖాన్ని పొందడం, కాని ఇది కూడా వ్యక్తిగతమైన ప్రాపంచిక భోగమే, కాని ఈ పరిమిత బాధామయ ప్రాపంచిక క్షేత్రాలకన్న విస్తారమైన ప్రపంచంలో వారు ఈ భోగాలను అనుభవిస్తారు. వారు ఆకాంక్షించిన దానిని వారు తమ విశ్వాసాలవలన కృషి వలన సాధిస్తారు. భౌతిక స్థితి భూసంబంధకార్యకలాపాలు మాత్రమే మన వ్యక్తిగత పరిణామానికి సర్వ పరిధికాదు, విశ్వాసానికి సంబంధించిన సమస్త సూత్రము కాదు. విస్తారమైన ఇతర లోకాలున్నాయి వేదాలకు ఈ విధమైన బాహ్య ఫలితాలు, అర్థం వున్నాయి. వైదిక కర్మనిష్ఠులు ఈ అర్థాన్ని గ్రహించి పాపవినిర్ముక్తులై, దేవతాసంబంధం అనే సోమరసాన్ని సేవించి, యజ్ఞమను పుణ్యకర్మలవలన స్వర్గసుఖాలను అన్వేషించారు, ఈ ప్రపంచమే స్వర్గము అనుకోక దీనికి అతీతంగా అస్థిత్వము వున్నదని విశ్వసించి ఈ దివ్యతర ప్రపంచాన్ని అన్వేషించి వారు స్వర్గసుఖాలను పొందగల బలాన్ని అంతరాత్మకు సమకూర్చారు. వారి శ్రద్ధకు, అన్వేషణకు ఈ స్వర్గసుఖమే కేంద్రం, అయితే ఈ స్వర్గసుఖాలు శాశ్వతమైనవి కావు. అందుచేతనే తరువాతి శ్లోకంలో భగవానుడు ఈ విధంగా ప్రకటించాడు.

తేతం భుక్త్వాస్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే — శ్లో - 21

వారు విశాలమగు స్వర్గలోక
భోగములనను భవించి
పుణ్యంక్షీణించగనే మరల మనుష్య
లోకమున జన్మించుచున్నారు
ఈ రీతిగా కామ్య కర్మల ననుష్ఠించెడి
వారు జనన మరణములను పొందుచున్నారు

అంటే వారు మర్త్యస్థితి యొక్క నిజమైన లక్ష్యాన్ని తెలుసుకోకపోవడం వలన తిరిగి తిరిగి మళ్లీ మర్త్య జన్మలోకి రాక తప్పడం లేదన్నమాట. మర్త్య జీవితం సుఖభోగాల కోసం వచ్చినది కాదు. దైవాన్ని ఎక్కడనో కాక ఈ భూమిమీద కనుగొనడమే మర్త్య జీవితానికి గమ్యం. అపరిపూర్ణమైన భౌతిక మానవ ప్రకృతి నుంచి అంతరాత్మకు చెందిన దివ్యప్రకృతిని పెంపొందించడం దైవంతో మనుష్యునితో, విశ్వంతో ఏకత్వం ద్వారా అస్థిత్వానికి సంబంధించిన సమస్త విస్తార సత్యాన్ని కనుగొనడం, దానిలో జీవించడం, కంటికి కనిపించె దానిని అద్భుతంగా తీర్చి దిద్దడం మర్త్య జీవితము యొక్క పరమ లక్ష్యం. ఆ విధంగా జరిగితేనే మన పరిణామ సుదీర్ఘ వృత్తంపూర్తి అవుతుంది. మనకు పరమ ఫలాన్ని పొందడానికి అనుమతి లభిస్తుంది. అంతరాత్మకు ఈ అవకాశాన్నివడం కోసమే మనకు మానవజన్మ లభించింది. అది పూర్తిగా నెరవేరే దాకా మానవజన్మ ఆగిపోదు. భగవత్ప్రేమి విశ్వంలో మన జన్మకు ఈఅంతిమ ఆవశ్యకతను గుర్తించి, ఏకాగ్రభక్తి, ఆరాధనల ద్వారా దాని వైపు పురోగమిస్తాడు. దాని వలన అతడు పరమదైవాన్ని విశ్వ దైవాన్ని తన జీవిత పరమార్థంగా తన ఆలోచనకు దర్శనానికి సమస్త ప్రయోజనంగా చేసుకొంటాడు. అంతేగాని అహంకార ప్రాపంచిక సంతృప్తి గాని స్వర్గలోక సుఖంగాని అతని ధ్యేయంకాదు. ఈ భావాన్ని భగవానుడు వెల్లడించాడు అని శ్రీ అరవిందమహర్షి వ్యాఖ్యానించారు పై రెండు శ్లోకాలలోని సోమపానం గురించి "రాహుల్‌సాంకృత్యాయన్ తమ ఋగ్వేద ఆర్యులు" అనే గ్రంథంలో ఈ విధంగా తెలిపారు.

**1. సోమపానం :** మత్తును కల్గించు పానముల్లో సోమపానమొకటి. ఇది ఆర్యుల్లో చాల ఎక్కువగా వుంది. ఒకరకమైన సురను కూడ వారు త్రాగేవారు. కాని దానికి అంతగా ప్రాముఖ్యం లేదు. కణ్వపుత్రకుసీది సోమపానం ఇంద్రునకు ప్రియమైందని చెప్పాడు. (8-71-8) "చమసుల్లో (గిన్నెల్లో), చమూల్లో (కొయ్యపాత్రల్లో) నీ కొరకు సోమాన్ని వడగట్టి ఉంచాం. ఓ ఇంద్రుడా! నీవు దీన్ని త్రాగుము. నీవు దీనికి యజమానివి."(7)

పాత్రల్లోని సోమం నీటిలో చంద్రునివలె కనబడుతున్నది. నీవు దీన్ని త్రాగుము. దీనికి నీవు ఈశ్వరుడవు. (8)

సోమాన్ని గురించి ఉన్న తొమ్మిదవ మండలం విశ్వామిత్రపుత్ర మధుచ్ఛందుని సూక్తంతో ప్రారంభమవుతుంది. అందలి మొదటి ఋక్కు యిట్లున్నది. (9-1-1).

స్వాదిష్ఠయా మదిష్ఠయా పవస్వ సోమధారయా
ఇంద్రాయ పాతవేసుతః

"ఓ సోముడా, నీవు యింద్రుడు త్రాగుటకొరకు వడకట్టబడి, స్వాదిష్ఠమై, మదిష్ఠమై ధారగా ప్రవహించుము."

శునఃశేపుడు సోమాన్ని వర్ణించాడు (౨-3-1).

ఏషదేవో అమర్త్యః వర్ణవీరివ దీయతి

అభిద్రోణాన్యాసదం

"ఈ అమరదేవుడు ద్రోణము (కలశము) ల్లోనికి పక్షివలె యెగురుతూ పోతున్నాడు"

సోమం గురించి ఎక్కువ సూక్తములు రచించిన ఋషి అసితదేవలుడు ఆయన ఏమి చెప్పారో చదవండి (౨-5-1).

సుమిద్ధో విశ్వతస్పతిః పవమానో విరాజతి

ప్రీణాన్ వృషా కనిక్రదత్

"పరాక్రమవంతుడు, పతి, ఉద్దీప్తుడు, పవమానుడు అయిన సోముడు శబ్దం చేస్తున్నాడు. సంతోషపెట్టుతూ శోభిల్లుతున్నాడు."

"పవమాన, (వడకట్టుటచే పవిత్రమైన) సుందర, మహాసోముడు రాత్రిని, దర్శనీయమగు ఉషస్సును కాంక్షిస్తున్నాడు.'2 (6)

"పవమాన సుందర సోముని భార్యలగు భారతి, సరస్వతి, ఇళా ముగ్గురూ మా యీ యజ్ఞంలోకి రావలసింది." (8)

అసిత ఋషి యింకా వర్ణిస్తున్నాడు. (౨-8-4-6)

"ఓ సోముడా, నిన్ను పదివ్రేళ్ళు శుభ్రపరుస్తున్నాయి. ఏడు స్తుతులు ప్రసన్నం చేస్తున్నాయి. తర్వాత విప్రులు నిన్ను సేవించి మత్తిల్లుతున్నారు." (౨-8-4)

"పసుపుపచ్చని బంగారు వన్నెగల సోముడు కలశాల్లోకి ప్రవహిస్తూ సాలు అను వస్త్రం ధరిస్తున్నాడు."

ఓ సోమరాజా, నీవు మా కొరకు ప్రవహించు మా గోవుల మేలుకోరి, మా గణముల మేలుకోరి, మా గుర్రముల మేలుకోరి, ఔషధముల మేలుకోరి ప్రవహించుము."(3)

"ఎర్రని రంగుగలవాడును, స్వశక్తికలవాడును, ద్యౌను తాకువాడును అగు సోముని కొరకు గాథను పాడండి."

"నమస్కరిస్తూ దగ్గరకు రండి. సోమాన్ని పెరుగుతో కలపండి. ఇంద్రునికి సోమం యివ్వండి. (6)

సోమం గురించిన స్తుతుల్లో ఎక్కువభాగం మూడుపాదాలు గల గాయత్రీ పద్యమందున్నవి అని మీరు గుర్తుంచుకొనవలసి ఉంది. ఉత్తర భారతంలో చాలా ప్రదేశాల్లో పల్లెపదాల్లో (లోక గీతముల్లో) యీ ఛందము (పద్యము) వాడుకలో వుంది. చివరి మూడవ పాదాన్ని మరొకసారి అన్నప్పుడు అది నాల్గుపాదములు కల పద్యమవుతుంది. ఋగ్వేదకాలంలో కూడ ఈ విధంగానే ఉండవచ్చు. ఋగ్వేద ఆర్యులకు ప్రియమైన పానం సోమపానం. అది వారి దేవతలకు కూడ మత్తును కల్గించేది. అందుచేతనే అసిత దేవలుడు పులకితుడై సోముని గుణాలను కీర్తిస్తున్నాడు (౨-15-1-2-4).

ఏషధియా యాత్వణ్యా శూరో రథేభి రాశుభి:
గచ్ఛన్నిన్ద్రస్య నిష్కృతం (1)
ఏషపురూధియా యతే బృహతే దేవతా తయే
యత్రామృతాస ఆసతే(2)
ఏష శృంగాణి దోధు వచ్చిశీతే యూథ్యోవృష్టా
నృమ్ణా దధాన ఓ జసా (4)

"ఈశూరుడు (సోముడు) ఇంద్రుని వద్దకు సూక్ష్మ స్తుతులతో వేగంగా పోవు రథములపై వెళుతున్నాడు."

"అమరులున్న ఈ మహాయజ్ఞమందు సోముడు చాలా శ్రద్ధవహిస్తున్నాడు."

"యూథపతి వృషభం కొమ్ములను ఆడిస్తున్నట్లు సోముడు తన ఓజస్సుతో పరాక్రమిస్తూ ఉన్నాడు."

"శీఘ్రగామియగు రథాలవలె, విడువబడిన గుర్రాలవలె సోముడు శబ్దం చేస్తున్నాడు."(1)

"ఈ సోముడు పెనుగాలివలె, పర్జన్య వృష్టివలె, అగ్నిశిఖవలె వ్యాపిస్తున్నాడు."(2)

"దధి మిశ్రిత పవిత్ర సోమాన్ని విప్రులు స్తుతుల ద్వారా విస్తరింప చేస్తున్నారు. (3)

త్వం సోమ పణిభ్య ఆ వసుగవ్యాని ధారయ:
తతం తంతు మచిక్రద: (7)

"ఓ సోముడా, నీవు పణుల నుండి గోవులను హరిస్తున్నావు గొప్ప యజ్ఞమందు సవ్వడి చేస్తున్నావు."

సోమం ఆ దినాల్లో దొరకంది కాదు. అందుచేతనే దాని వాడకం అమితంగా ఉంది. తొమ్మిదవ మండలంలో - సోమ మండలంలో 114 సూక్తముల్లో సోముని మహత్తును గురించి వర్ణించినంతగా దీని పుట్టుకను గురించిగాని, యితర విషయాలను గురించిగాని చెప్పలేదు. సోమం ఎత్తయిన కొండలపై ఉండేదని రహూగణపుత్రగోతముని ఋక్కువలన తెలుస్తుంది. (10-32-2)

వీంద్రయాసి దివ్యాని రోచనాని పార్థివాని
రజసా పురుష్టుత
యేత్వావహంతి ముహురధ్వరాం ఉపతేసు
వన్వంతు వగ్నానాం ఆరాధస:

"పర్వతసానువులపై వున్న సోముడా! నీ కొరకు ఆవులు నేతిని, పాలను పిండుతున్నాయి.'

రహూగణుడు ప్రాచీన ఋషి భరద్వాజుని కంటెకూడ ప్రాచీన ఋషుల్లోని వాడు. దివ్యపానమగు సోమం గురించి ప్రశంసిస్తూ ఆయన చెప్పిన గేయగీతములు

తరతరాలవరకు ప్రజల నాలుకలపై వుండేవి అని చెప్పితే ఆశ్చర్యపడనవసరం లేదు. రహూగణుడు సోముని గురించి యిట్లు చెప్పాడు. (౯-37-1)

ససుత: పీతయే వృషాసోమ: పవిత్రే ఆర్షతి

విఘ్నన్ రక్షాంసి దేవయుః

"అతడు రాక్షసులను నాశనం చేస్తాడు. దేవకాముడు, పరాక్రముడు సోముడు వడకట్టబడి పాత్రల్లోనికి పానం కొరకు వెళుతున్నాడు."

"ఆ తడిసిన సోముడు కవి ద్వారా స్తుతించబడి ఇంద్రుని కొరకు కలశముల్లోకి పరుగిడుతున్నాడు." (6)

ఆయాస్యుడు సోముని కీర్తిస్తూ మూడు సూక్తములను రచించాడు (44,45, 46). అతడు ఒక సూక్తమందు సోముని యిట్లు వర్ణించాడు. (౯-46-1,2,5)

"పర్వతంపైన పెరిగిన సోముడు ప్రవహిస్తూ నైపుణ్యం గల గుర్రంవలె యజ్ఞం కొరకు సిద్ధపర్చబడుతున్నాడు."(1)

"తల్లిదండ్రులచే చక్కదిద్దబడు కన్యవలె పరిష్కృత సోముడు వాయువు వద్దకు వెళ్ళుచున్నాడు.(2)

"ఓ ధన విజేతా, మార్గవేత్త సోముడా! మాకు మహా ధనమును యిప్పిస్తూ ప్రవహించుము." (5)

అవత్సార ఋషికూడ సోముని గురించి చెప్పాడు (౯-56-3).

"ఓ సోముడా! జారుణ్ణి కన్య పిలిచినట్లుగ నిన్ను పదివ్రేళ్ళు పిలుస్తున్నాయి. ఇచ్చుటకొరకు నిన్ను శుభ్రపర్చుతున్నారు. " సోముని సర్వవిజేత అనేవారు. (౯-5౯-1)

"ఓ గోవిజేతా, అశ్వవిజేతా, విశ్వవిజేతా, రమణీయతావిజేతా, సోమా! ప్రవహించుము. నా కొరకు సంతాన సమేతంగా రత్నాలను తెమ్ము."

"సహస్రాక్షుడు, సూక్ష్మదర్శి, వడకట్టబడుచున్న సోముని గాయత్ర నామం గానం చేయండి." (౯-60-1)

ఆ మహీయు అంగిరసుడు సోముని చారిత్రక కృత్యాలను ఉల్లేఖించాడు. (౯-61-1,2,20)

"ఓ సోముడా త్రాగుటకై ప్రవహించుము. నీ యొక్క మత్తుచేతనే ౯౯ పురాలు ధ్వంసం చేయబడినాయి."(1)

"నీవు యీ ప్రకారంగా శంబరుని పురాలను, తుర్వశ, యదులను దివోదాసుకు వెంటనే వశపర్చావు." (2)

"నీవు అమిత్ర పుత్రుని చంపావు. ప్రతిదినం అన్నం యిచ్చావు. నీవు గోదాతవు, అశ్వదాతము. (20)

విధ్రువ కాశ్యపుడు సోముని మహిమను కీర్తిస్తూ చెప్పాడు. (9-63,3,4,5)

"ఇంద్ర, విష్ణులకై వడకట్టబడి కలశముల్లోకి ప్రవహించే సోముడు వాయుదేవునికి మధురంగా నుండుగాత(3)

"పింగళ వర్ణుడు, శ్రీప్రగాముడు సోముడు యజ్ఞధారలో సుళ్ళు తిరుగుతూ ప్రవహిస్తున్నాడు."(4)

ఇంద్రం వర్ధన్తోకృణ అప్తురఃవంతో విశ్వమార్యం అవఘ్నన్తో అరావ్ణః (5)

"ఇంద్రుని ఉత్సాహపరుస్తూ, జలంతెస్తూ, అన్ని పనులుచేస్తూ, పిసినిగొట్టులను నిర్మూలిస్తూ ప్రవహిస్తున్నావు."

ఆర్య సమాజంవారు "కృణ్వంతో విశ్వమార్యం" (అందరినీ ఆర్యులుగా చేస్తూ) అన్న వాక్యం చదువుకొని ఎగిరి గంతువేస్తారు. అందరినీ ఆర్యులుగా చేసిన శ్రేయస్సు సోమపానానికి (భంగుత్రాగుటకు) నిధ్రువ ఋషియిచ్చిన సంగతిని వీరు తెలుసుకోలేక పోతున్నారు. ఋషి తర్వాత యిట్లు చెప్పాడు. (9-63-12,13)

"నీవు మాకు ఆవులతోను, గుర్రాలతోను సహస్రధనాన్ని, అన్నాన్ని, యక్షాన్ని కూడా యిమ్ము." (12)

"రాళ్లతో కొట్టబడి వడకట్టబడి సోముడు సూర్యునివలె కలశాల్లోకి చక్కగా ప్రవహిస్తున్నాడు."(13)

జమదగ్ని భృగుపుత్రుడు కూడ సోముని వర్ణించాడు (9-65-1-8,15)

"గొప్పతనాన్ని కాంక్షించు వ్రేళ్ళు అను చెల్లెళ్ళు ప్రవహింపచేయవలె నను కోర్కెతో సోముని ప్రేరేపిస్తున్నారు."(1)

"పింగళవర్ణుడు, మధురసప్రదుడు సోముని రాళ్లతో నూరి ఇంద్రుడు త్రాగేందుకు సారం పిండుతున్నారు."(8)

"ఓ సోముడా, రాళ్లనుండి తీయబడి మత్తును కల్గించు తీవ్ర రసమగు నీవు పాపాలను హరిస్తూ ప్రవహిస్తున్నావు."(15)

జమదగ్ని తన సోమగాథలో సోముని పుట్టుక చోటును గురించి కొద్దిగా పరిచయమిచ్చాడు.

యే సోమాసః పరావతియే అర్వాతి సున్విరే

యే వాదః శర్యణావతి (9-65-22)

"ఏ సోముడు పశ్చిమాన, ఏ సోముడు తూర్పున, ఏ సోముడు శర్యణావతంలో వడకట్టబడిననాడో"

"ఏ సోముడు ఆర్జీకులందు (వ్యాస నదీతీర వాసులందు), ఋత్విజులందు, పస్త్యలందు, పంచజనములందు వడకట్టబడినాడో" (౨-65-23)

"ఆ సోముడు ఆకాశం నుండి వృష్టిని, వీరులయిన సంతానాన్ని మాకు తెచ్చుగాక."(24)

ఆవుతోలుపై తయారు చేయబడి జమదగ్ని, ఋషిచే స్తుతింపబడి బంగారు రంగుగల సోముడు ప్రవహిస్తున్నాడు.'(25)

ఆంగిరస పవిత్ర ఋషి యీ క్రింది మంత్రమును సోముని మహిమను కీర్తిస్తూ చెప్పాడు. కాని రామానుజ మతస్తులు 6,7శతాబ్దాల నుండి కోట్లాదిజనానికి భుజములపై లోహముతో ఆబోతును కాల్చినట్లు శంఖ చక్రాలను ముద్రించారు. గుడ్డి ఎద్దు చేలో పడిన చందమున ఉన్నటువంటి ఈ అన్యాయానికి ఏమైనా అంతమనేది వుందా?

పవిత్రంతే వితతం బ్రాహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి
పర్యేషి విశ్వత:
అతప్తత నూర్న తదామో అశ్నుతే శృతాస
ఇద్వహన్తస్తత్ సమాశత (౨-83-1)

" ఓ బ్రహ్మణస్పతి (మంత్రపతి) సోముడా నీ గిన్నెలు అంతటవున్నవి! ఓ ప్రభూ, నీవు గాత్రములద్వారా అంతటా చేరుతున్నావు. అతప్త శరీరుడు (అపరిపక్వుడు)నిన్ను పొందలేడు. పక్వమైన వారు నిన్ను వహిస్తూ పొందుతున్నారు."

గృత్సమదుడు సోముని వర్ణించాడు (౨-83-47)"వడకట్టునప్పుడు నీ ప్రవాహములు గొర్రెయొక్క సూక్ష్మరోమములను దాటుతున్నాయి. ఓ సోముడా, రెండుపాత్రల్లో నీవు గోరసంతో మిశ్రమం చేయబడి, వడకట్టబడి కలశాల్లోకి వెళ్ళుతున్నావు."

వసిష్ఠునకు సోముని మహిమ తెలుసు. యుద్ధమందు సోమపానం చేసి మత్తిల్లిన వీరులు అద్భుత పరాక్రమాన్ని చూపేవారు. శాంతికాలంలో సోమాన్ని త్రాగిప్రజలు ఆనందించేవారు. ప్రాచీనమందు భక్తి వున్నప్పటికీ ఆధునికులకు సోమముపట్ల ఋషులకువున్న భావంలేదు. నేడు అంతటా మద్యపానానికి వ్యతిరేక వాతావరణ ముండుటయే, అసహ్యత ఉండుటయే దీనికి కారణం. సప్తసింధులోని ఆర్యులు సోమునికి ఎందుకింత భక్తులయ్యారో, వసిష్ఠ మహర్షి ఎందుకింతగా ప్రశంసించాడో సోముని ప్రశంసిస్తూవున్న ఋక్కులను చదివితే తెలుస్తుంది.

"ఓ సోముడా! వీరులు కలవాడవై, బలవంతుడవై, విజేతవై, ధనదాతవై తీక్షణ ఆయుధాలు కలవాడవై, వేగంకల ధనుస్సు కలవాడనై, యుద్ధమందు అజేయుడవై, యుద్ధమందు శత్రువులను పీడించువాడవై ప్రవహించుము." (౯-౯౦-౩)

ప్రతాపవంతుడైన దివోదాసుని పుత్రుడు ప్రతర్ధనుడు, ఇతడనేక యుద్ధాల్లో పాల్గొన్నాడు. బహుశా ఇతణ్ణి వంచించి సుదాసు భరతులకు రాజై వుండాలి. ప్రతరనుడు దివోదాసు జ్యేష్ఠ పుత్రుడైనప్పటికీ యుద్ధమందునూ, శాసనా పటిమలోనూ తమ్ముడైన సుదాసుకు దీటైనవాడు కాడని భావిస్తున్నారు. కుల పురోహితుడైన భరద్వాజుడు ప్రతర్ధనుని పక్షం వహించి వుండవచ్చు. కాని ఆయన ఏమీ చేయలేక పోయాడు. వసిష్ఠుడు సుదాసు వీపు కాచాడు. ఇంకేముంది అతడు భరతులకు రాజైపోయాడు. ప్రతర్ధనుడు సోముని కీర్తిస్తూ 24 త్రిషుపములు చెప్పి యోగ్య ఋషిగా నిరూపించుకున్నాడు. అతడు సోముని గురించి చెప్పిన ఉపమానాలు సైనికుని మనస్సుకు మాత్రమే తట్టగలవు. (౯-౯౬-1,5,6,11,12)

ప్రసేనానీఃశూరో అగ్రేరథానాం గవ్యన్నేతి హర్షతే అస్యసేనా

భద్రాన్ కృణ్వన్నింద్ర హవాన్త్సఖిభ్య ఆ సోమో వస్త్రారభసాని దత్తే (1)

సోమః పవతే జనితా మతీనాం జనితా దివో జనితా పృథివ్యాః

జనితాగ్నేర్జనితా సూర్యస్య జనితేంద్రస్య, జనితో తవిష్ణోః (5)

"సేనాని, శూర్యుడు, సోముడు గోవులను దోపిడి చేయతలపెట్టి రథమునకు ముందు పోతున్నాడు. అతని సేన హర్షిస్తున్నది. ఇంద్రుని ఆహ్వానాన్ని కల్యాణ ప్రదం చేస్తూ సోముడు సఖులకొరకు శ్రీఘ్రంగా వస్త్రాలను యిస్తున్నాడు." (1)

"బుద్ధులకు (కవితలకు) జనకుడు, ద్యౌకు జనకుడు, పృథ్వికి జనకుడు, అగ్నికి జనకుడు, సూర్యునకు జనకుడు, విష్ణువుకు జనకుడు సోముడు ప్రవహిస్తున్నాడు."(5)

"సోముడు దేవులందు బ్రహ్మయై, కవులందు కవితయై, విప్రులందు ఋషియై, మృగములందు మహిషమై, గ్రంథములందు డేగయై, వనములకు కుఠారమై శబ్దం చేస్తూ పాత్రల్లో పొంగుతూ ప్రవహిస్తున్నాడు." (6)

"ఓ పవమాన సోముడా! నీతో మా పూర్వపితరులు కర్మలు చేశారు. ఓ వీరుడా! నీవు ఆగని అశ్వాలతో శత్రువులను చంపుతున్నావు. నీవు మాకు యింద్రుడవు కమ్ము."(11)

"ఓ సోముడా! నీవు మనువుకొరకు ఏ విధంగా ఆయుధం ధరించి, శత్రునాశనం చేసి ధనయుక్తుడవై, హవియుక్తుడవై ప్రవహించావో, అదే విధంగా మా కొరకు ధనం తెస్తూ ప్రవహించుము. ఇంద్రుని సహాయంతో ఆయుధాలను ఉత్పన్నం చేయుము."(12)

తమ్ముడు సుదాసుతో యుద్ధం చేసేటప్పుడు ప్రతర్దనుడు సోమ మహిమను కీర్తిస్తూ యీ త్రిష్టుపములను రచించాడా ఏమిటి?

కుత్సఋషి అరువది వేల ధనాన్ని సోముని కృపవలన పొందాడు. (౨-౨7-53)

ఉతన ఏనా పవయా పవస్వాధిశ్రుతే
శ్రువాయ్యస్య తీర్థే
షష్టిం సహస్రా నైగుతో వసూని వృక్షం నపక్వం
ధూనవద్రణాయ

"ఓ సోముడా! నీవు మా కొరకు కీర్తివంతుడవై ప్రసిద్ధ తీర్థమందు ఈ ధారతో ప్రవహించుము. పండిన పండును పొందుటకై చెట్టును ఊపినట్లుగా అడిగిన తోడనే శత్రునాశకుడగు సోముడు 60,000 ధనం మాకు ఇచ్చాడు."

సోముని వడకట్టునప్పుడు ప్రాచీన కాలపు గాథలు పాడబడేవని కాశ్యపరేభ ఋషి ఋక్కువలన తెలుస్తోంది. (౨-౨౨-4)

"వడకట్టునప్పుడు సోముని ప్రాచీన గాథలతో కీర్తిస్తున్నాం. ఇటునటు తిరుగుతున్న వ్రేళ్ళు దేవుళ్లను స్మరిస్తూ హవిని ధరిస్తున్నాయి."

విశ్వామిత్ర వాక్పుత్రుడు లేక ప్రజాపతి ఋషి "సోమాన్ని వడకట్టుటకు ఉన్ని వస్త్రం ఆవుతోలు అవసరమని" చెప్పాడు. (౨-101-16)

అవ్యోవారేభిః పవతే సోమో గవ్యే అధిత్వచి

కనిక్రదద్ వృషా హరిరాద్రస్యాభ్యేతి నిష్కృతం

"సోమం ఆవుతోలు పైన ఉన్ని రోమముల మధ్యను వడకట్టబడుతున్నది. పరాక్రమవంతుడు బంగారువర్ణంకల సోముడు ఇంద్రుని స్థానమునకు పోతున్నాడు."

కశ్యప మరీచి పుత్రుడు సోమపాన స్థానముల గురించి చెప్పాడు (౨-113-1,2,7,౨,11)

"వృత్రహంతకుడు యింద్రుడు శర్యణావతంలో సోమాన్ని త్రాగాడు. శరీరమునకు బలము కల్గి మహా విక్రమాన్ని చూపాడు. అట్టి యింద్రునికై ఓ సోముడా! నీవుప్రవహించుము.(1)

"ఓ దిక్పతి సోముడా! నీవు ఋక్కులతో, సత్యవచనములతో, శ్రద్ధతో, తపస్సుతో వడకట్టబడితివి. ఓ సోముడా, నీవు ఆర్జీకమునుండి (బియాసు వుపత్యక నుండి) ప్రవహించుము."(2)

"నిరంతర జ్యోతి వుండుచోటికి స్వర్గమున్న లోకానికి, అక్షుణ్ణమైన అమరలోకానికి ఓ సోముడా! నన్ను తీసుకొని పొమ్ము."(7)

"ఏ మూడు స్వర్గములందు యిచ్ఛానువర్తులై కిరణములు ప్రసరించుచున్నవో, ఎచ్చట జ్యోతిర్లోకము లున్నవో,అచ్చటకు నన్ను కొనిపోయి అమరునిగ చేయుము" (౯)

"ఎక్కడ ఆనంద మోద, ముద, ప్రముదము లున్నవో, ఎక్కడ కోరికలన్నీప్రాప్తించునో, అక్కడకు నన్ను కొనిపోయి ఆమరునిగ చేయము. ఓ సోముడా, నీవు ఇంద్రునికై ప్రవహించుము."(౧౧)

సోమం సప్తసింధు ఆర్యులకు ఆనందమునిచ్చే, మత్తును కల్గించే శ్రేష్ఠమైన పేయము. ఇంతేకాదు, దేవతలను సంతృప్తి పర్చుటకు ఆర్యులకిది గొప్పసాధనం అని వేరుగా చెప్పనవసరం లేదు. హోమంలో నెయ్యి, మాంసం, మొదలైన హవిస్సును దేవతల కొరకు సమర్పించేవారు. దానిలో చాలా భాగం, నిప్పులో కాలిపోయి పనికిరాకుండా పోయేది. ఆవుతోలుమీద రెండు రాళ్లమధ్య నూరబడి, వడకట్టబడి కొయ్యపాత్రలోను, లోహకలశాల్లోనూ పోయబడివుంచిన సోమాన్ని త్రాగుటకు ఇంద్రుడు, అగ్ని మొదలగు దేవతలను ఆహ్వానించేవారు. ఆర్యభక్తుల నమ్మకాన్ని బట్టి ఆ దేవతలు వచ్చి సోమపానాన్ని చేసి వెళ్ళేవారు. ప్రాచీన ఋషులగోష్ఠులందు ఇంద్రుడు, అగ్ని, మిత్రావరుణులు సశరీరులై వచ్చి సోమపానాన్ని చేశారు. ఈ విషయంలో శపథం చేయటానికి తర్వాత కాలపు ఋషులు సిద్ధపడ్డారు. దేవపూజకు సోమరసం సాధనమైనందున ఒక్క చుక్కకూడా పోకుండా చూసేవారు. పాత్రల్లోనూ, కలశాల్లోను నిండివున్న పెరుగు, తేనెలతో కలిపిన సోమరసాన్నంతా భక్తులు ఆరగించేవారు.

సోమపానం ఆర్యులకు సర్వ సాధారణమైనప్పటికీ అది దివ్యపానమైంది. కాబట్టి దేవతల పేరుతోనే దాన్ని దివ్య ప్రసాదముగ తీసుకొనేవారు. ఈనాడు కూడ బైరాగి సాధువులు పరమాన్నం కూడ తాము తింటున్నామని చెప్పకుండా ముందుగా 'రామ్‌జీ' పేరు చెపుతారు. అంటే మొదట భోజనమంతా రామునికి ఆరగింపుచేసిన తర్వాత ఎవరివంతు వారు పవిత్ర భోజనం చేస్తారు. ఇదే విధంగా వైదిక ఆర్యులు కూడ దేవతల పేరు చెప్పకొని ప్రసాదరూపంలో సోమరసాన్ని త్రాగేవారు.

సోమం పవిత్రమైంది. పరమ గ్రాహ్యమైంది. కాని సురను (మద్యమును) హీనంగా చూచేవారు. నేడు కూడా హిందువులు భంగు, సారాయంపట్ల అటువంటి భావాన్నే కల్గివున్నారు. టిబెట్టు భంగును 'సోమరాజ' మంటారు. అక్కడ అది ఎక్కువగ ఉత్పత్తి అవుతుంది. మత్తును సేవించనివారు టిబెట్టులో లేరనే చెప్పాలి. కాని సోమరాజమును మత్తును కల్గిస్తుందనికాని, అందు పాలు, పంచదార, మిరియం ఏలకులు కలిపి మిక్కిలి రుచికరంగా తయారుచేయవచ్చుననికాని వారికితెలియదేమో ననిపిస్తుంది. మనకు జనుము, గోగువలె వారికి సోమరాజము ఉపయోగపడుతుంది. వారు దాని నారతో

తాడు పేనుతారు. మనదేశంలో కూడ ప్రాచీనకాలంలో భంగు (గంజాయి) నారతో వస్త్రాలను నేసేవారు. ఇప్పుడు కూడ కుమాయుూ గఢవాల్‌లో భంగేడా తయారు చేస్తారు. దాన్ని వంద సంవత్సరాల క్రితం ప్రజలు ధరించేవారు. ఇప్పుడది సంచులకు ఉపయోగిస్తోంది. కొరియాలో భంగునారతో వస్త్రాలను నేస్తారు. అచ్చట ప్రజలకు కూడ టిబెట్టువారివలెనే భంగు ఉపయోగం యింతమాత్రం అని తెలుసు. టిబెట్టువారు సోమరాజము దగ్గరకు పోరు. దానికిబదులుగా వారు తమకున్న ఛజ్ (యవలతో తయారు చేయబడిన పచ్చిసారా) త్రాగుతారు. వారికి అర (అరకు, బ్రాంది) అంటే చాలా యిష్టం. కాని అది చాల ప్రియం. టిబెట్టీయులది ఋగ్వేద ఆర్యులకు పూర్తిగా విరుద్ధమైన పద్ధతి. వారికి భంగు యిష్టంలేదు. కాని సారా త్రాగుతారు.

అనన్యాశ్చింతయంతో మాం
యే జనాః పర్యుపాసతే
తేషాంనిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహం — శ్లో - 22

ఎవరు ఏకాగ్ర చిత్తముతో
నన్నే స్మరిస్తూ ఉపాసించు
చుందురో, నాయందే మనస్సును
స్థిరీకరించి యుండు అట్టివారి
యోగక్షేమములను నేనె వహించుచుందును

యేప్యన్య దేవతాభక్తా
యజంతే శ్రద్ధయాన్వితాః
తేపి మామేవ కౌంతేయ!
యజంత్య విధిపూర్వకం — శ్లో - 23

అర్జునా!
ఎవరైతే అన్యదేవతా రాధకులై
శ్రద్ధతో వారిని ఆరాధించుచున్నను
వారు దారితప్పినవారైనను నన్నే
ఉపాసించువారై యున్నారు

అహంహి సర్వయజ్ఞానాం
భోక్తాచ ప్రభురేవచ
నతు మామభిజానంతి
తత్త్వేనాతశ్చ్యవంతితే — శ్లో - 24

సమస్త యజ్ఞములకు
భోక్తను, ప్రభువును నేనే
అట్టి నన్ను వారు యథార్థముగ
గ్రహించుట లేదు. అందుచేతనే
వారు పతనమగుచున్నారు

యాన్తి దేవవ్రతా దేవాన్
పితౄన్ యాన్తి పితృవ్రతాః
భూతాని యాన్తి భూతేజ్యాః
యాన్తి మద్యాజినోపి మాం      శ్లో -25

దేవతలనారాధించు వారు
దేవతలను, పితృదేవతల
నారాధించువారు పితృదేవతలను
భూతములను ఆరాధించెడువారు
భూతములను పొందు చున్నారు
నన్ను సేవించేవారు నన్నే పొందుచున్నారు

పత్రం పుష్పం ఫలం తోయం
యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత
మశ్నామి ప్రయతాత్మనః      శ్లో - 26

భక్తితో పత్రమునుగాని
(ఆకును) పుష్పమునుగాని
పండునుగాని, జలమును
(నీటిని)గాని నాకు సమర్పించు
వారు పరిశుద్ధాత్ములు
భక్తిపూర్వకముగ సమర్పించిన
ఆ పత్రపుష్పఫలాదులను
నేను ఆరగింతును

Any offering of leaf
flower fruit or water
made to Me in devotion
by an earnest soul
I lovingly accept.



That is to say, it is the Lord in every being whom we serve with devotion who accepts the service.

ఈ విషయమై మహర్షి మలయాళ స్వాములవారు ఈవిధంగా తెలియజేశారు.

"దీనియందు" ప్రయతాత్మనః" అని చేయబడిన పదప్రయోగాన్ని గూర్చి "పరిశుద్ధమైన హృదయము" గలవానిని గూర్చి ప్రయోగించినదిగా తెలుసుకోవలెను. అట్లుకాని పూజలన్నీ కళాయిలేని పాత్రలో వండిన పప్పుపులుసులాంటివి. కళాయి లేని పాత్రలో వండిన పప్పుపులుసునందు చిలుమువూరును. మరియు ఈ శ్లోకం కేవలము పేద భక్తుల గురించి ఉపదేశించబడినది (మనం చూస్తున్నాము గదా ఈనాడు మఠాధిపతులనబడేవారందరు అర్ధలక్షో, లక్షో రూపాయలిచ్చేవారి ఇళ్లకే పాద పూజలకు వెళ్లడాన్ని గురించి మనకు కావలసింది ఇలాంటి మఠాధిపతులు కాదు ఈ విషయమై జాగ్రత్త వహించాలని భగవానుడు హెచ్చరించినట్లున్నది).

ఒక్కొక్కరు అనేక విధోత్సవములు, నైవేద్యములు సమారాధనలు చేయుచున్నారే, మాకు అట్టి పుణ్యం సమారాధనలు చేయుచున్నారే, మాకు అట్టిపుణ్యం లేదేయని తలంచి సంకట పడనక్కరలేదు. "పత్రము, పుష్పము, ఫలము, తోయము" అన్నట్లువీటిలో దేనిని సమర్పించినను చాలును. అయితే నిర్మలమైన మనస్సు కలిగి యుండవలెను. కుచేలుడు ఇచ్చిన అటుకులను, విదురుడు ఇచ్చిన ఆకుకూరను, గంజిని భగవానుడు ఎంతో ప్రేమతో భుజించెను గదా! ఈ తత్వాన్ని మరువకుండా వుండడమే మానవుల లక్ష్యం కావాలి అన్నారు మహర్షి స్వాములవారు.

శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు ఈ విధంగా తెలియజేశారు.

ఈ శ్లోకము వలన భగవంతుని అనుగ్రహం మానవుడిచ్చు వస్తువు యొక్క గొప్పతనం పైగాని , విలువపైగాని ఆధారపడిలేదు. అతని యొక్క మనస్తత్వము (అంటే పరిశుద్ధహృదయముపై) ఆధారపడియున్నది. అతని యొక్క నిర్మలభక్తి, నిర్మలమనస్తత్వము, (హృదయము) వీటిపైనే సర్వేశ్వరుని కృప ఆధారపడివున్నది. అందువల్లనే ఎంతటి కోటీశ్వరుడైనను, రాజాధిరాజైనను, మహాపండితుడైనను, భగవంతుని అనుగ్రహము పొందలేకుండుటయు, ఆయన దయకు పాత్రుల కాకుండుటయుచరిత్రయందు స్పష్టంగా అగుపిస్తున్నవి. భక్తి, చిత్తశుద్ధి ఈ రెండే భగవంతుని దృష్టిలో ప్రధానమైన అంశాలు. అట్టి నిర్మల భక్తితో ఇచ్చిన దానిని పరమాత్మ గ్రహించడమే కాకుండా, అనుభవించునని, భుజించునని స్పష్టమగుచున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| భగవంతునకు | పత్రమును | - | విదురుడు, ద్రౌపది | భక్తితో సమర్పించి కృతార్థులైరి |
| | పుష్పమును | - | గజేంద్రుడు | |
| | ఫలమును | - | శబరి | |
| | తోయమును | - | రంతిదేవుడు | |

యత్కరోషి యదశ్నాసి
యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ!
తత్కురుష్వ మదర్పణం శ్లో- 27

నీవు చేయు కర్మలను
భుజించు ఆహారమును
చేసెడి హోమములను
ఇచ్చెడిదానములను ఆచరించెడి
తపస్సును సర్వమును నాకు అర్పింపుము

శుభాశుభఫలై రేవం
మోక్ష్యసే కర్మబంధనైః
సన్న్యాసయోగయుక్తాత్మా
విముక్తో మాముపైష్యసి శ్లో -28

ఈ విధముగ కర్మలను
నాకు అర్పణము చేయుట చేత
పుణ్యాపాపఫలరూపములైన
కర్మబంధముల నుండి నీవు
విముక్తుడవగుదువు, ఇట్లు
నీవు విముక్తుడవై నన్నే పొందెదవు

సమోహం సర్వభూతేషు
న మే ద్వేష్యోస్తిన ప్రియః
యే భజంతి తు మాం భక్త్యా
మయితే తేషు చాప్యహం శ్లో- 29

నేను
సర్వప్రాణులయందును
సమయముగ వున్న వాడను
నాకు ద్వేషింపదగినవాడు
గాని, ప్రేమించదగినవాడు
గాని ఎవడును లేడు, నన్ను
ఎవరైతే భక్తితో సేవించుచుందురో
వారు నాయందును, నేను వారి
యందును ఉందును

అపి చేత్సుదురాచారో
భజతే మామనన్యభాక్
సాధురేవ స మంతవ్యః
సమ్యగ్వ్యవసితో హి సః శ్లో- 30

మిగుల దురాచారము
గలవాడైనను, అనన్య
భక్తి గలవాడైనను
స్థిరచిత్తముతో భజించిన
ఎడల అతడు సాధువే
యని యెంచబడుచున్నాడు

క్షిప్రం భవతి ధర్మాత్మా
శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ! ప్రతిజానీహి
న మే భక్తః ప్రణశ్యతి శ్లో - 31

అతడు శీఘ్రముగా
ధర్మాత్ముడగు చున్నాడు
అంతేకాదు శాశ్వతమైన
శాంతిని బడయుచున్నాడు
అర్జునా! "నా భక్తుడు నశించడు"
అని ప్రతిజ్ఞ చేయుచున్నాను

మాం హి పార్థ వ్యపాశ్రిత్య
యే పి స్యుః పాపయోనయః
స్త్రి వైశ్యాస్తథా శూద్రా
స్తే పి యాన్తి పరాంగతిమ్ శ్లో - 32

పాపపు జన్మలెత్తిన వారైనను
స్త్రీలును, వైశ్యులును, శూద్రులును
అయినను నన్ను శరణు పొందినచో
ఉత్తమమైన గతిని పొందుచున్నారు

భగవంతుని ముందు స్త్రీలకు, పురుషులకు సమాన హక్కులున్నవి. కారణం దైవచైతన్యం వ్యక్తులనుగాని, సాంఘీక విచక్షణలనుగాని, నిర్బంధాలనుగాని గణించడు. మధ్యంతర బంధక పరిస్థితులేవీ లేకుండగానే అందు సరాసరి భగవానుని దగ్గరకు వెళ్లవచ్చు. అంటే సంపూర్ణంగా ఆత్మ సమర్పణ చేయాలనే కోరిక (ఇచ్ఛ) వుంటే ఆ ఇచ్ఛ ఆత్మ చైతన్యం ద్వారాలన్నింటిని తెరుస్తుంది. దానికి సమాధానంగా మానవ జీవికి భగవంతుని సంపూర్ణ అవరోహణను ఆత్మార్పణను తీసుకొని వస్తుంది. తన్ను ఆయనకు సమర్పించుకున్నవారికి ఆయన తన్ను కూడా వారికి అర్పించుకొంటాడు. దాని మూలంగా మన నిమ్న ప్రకృతి ఆధ్యాత్మిక ప్రకృతిగా అతివేగంగా పరివర్తన పొంది మనలో వున్న ప్రతి అంశాన్ని దివ్య స్థితికి చెందినధర్మంగా తిరిగి రూపొందించి విలీనం చేసి వేస్తుంది. ఆత్మార్పణ సంకల్పం తనశక్తి వలన దైవానికీ, మనుష్యునకు మధ్యగల తెరను ఛేదిస్తుంది. అది ప్రతిపొరపాటును రద్దుచేస్తుంది. ప్రతి అడ్డంకిని ధ్వంసం చేస్తుంది. తమమానవశక్తితో జ్ఞానకృషి వలన గాని, పుణ్యకార్యాచరణ కృషివల్లగాని శ్రమతో కూడిన ఆత్మ శిక్షణా కృషి వల్లగాని ఆకాంక్షించేవారు పరమాత్మ వైపు పెరగడం చాలా ఆతురతతో కూడిన కష్టంగా వుంటుంది. కాని అంతరాత్మ తన అహంకారాన్ని కర్మను దైవానికి సమర్పించ గలిగినప్పుడు దైవమే స్వయంగా మన దగ్గరకు వచ్చి మనభారాన్ని వహిస్తాడు. అజ్ఞానులకు దివ్యజ్ఞాన ప్రకాశాన్ని, బలహీనులకు దివ్యేచ్ఛాశక్తిని, పాపులకు దివ్య పవిత్రతా ముక్తిని దుఃఖితులకు అనంత ఆధ్యాత్మిక సంతోషాన్ని ఆనందాన్ని తీసుకొని వస్తాడు. వారిబలహీనతగాని, వారి మానసిక శక్తికి చెందిన తడబాట్లుగాని ఏ తేడాను కలిగించవు.

“ఇదినా ప్రతిజ్ఞవాక్యం, నన్ను ప్రేమించినవాడు నాశనం కాడు అని దైవవాణి అర్జునునికి చెప్పింది. పూర్వం జరిగిన కృషికి, సంసిద్ధంతో ప్రయత్నించి బ్రాహ్మణుని పవిత్రతకు, పరిశుద్ధతకు కర్మ జ్ఞానాలలో గొప్పవాడైన రాజర్షి దీప్త శక్తికి విలువ లేకపోలేదు. ఈ విశాల దర్శనాన్ని ఆత్మ సమర్పణను చేరడానికి, అపరిపూర్ణ మానవజీవికి వీరివలన సులభ మార్గం దొరకుతుంది. కాని ఈ సంసిద్ధత లేకపోయినా, సంపదను ఆర్జించే సంకుచిత కర్మలో, వైశ్యుడు ఉత్పత్తి చేసే శ్రమలో వేలాది కఠిన నిర్బంధాలకు లోనైన శూద్రుడుగాని, తన ఆత్మ

విస్తరణచుట్టూ సంఘం నిర్మించిన సంకుచిత వలయంలో మూసుకొనిపోయి అభివృద్ధిమందగించి పోయిన స్త్రీగాని, తన గత కర్మలవలన పాప జన్మల నెత్తిన ఛండాలుడుగాని ఎవరైనా సరే మానవున్ని ప్రేమించే దైవాన్ని ఆశ్రయిస్తే దైవ ద్వారాలు వారి ముందు తెరుచుకొని వుంటాయి.

శ్రీ అరవిందుల గీతాదర్శనము నుండి పై నాలుగు శ్లోకాల సారము ఇక్కడ పొందుపరచబడింది.

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా
భక్తా రాజర్షయ స్తథా
అనిత్యమసుఖం లోకం
ఇమం ప్రాప్య భజస్వ మాం  శ్లో - 33

ఇక పుణ్యాత్ములైన
బ్రహ్మవేత్తలు, రాజర్షుల
విషయము చెప్పవలసిందే
మున్నది గనుక! కావున
అనిత్యమూ, సుఖరహితము
అయినట్టి ఈ లోకమును పొందిన
నీవునన్ను భజించి ముక్తుడవగుము

మన్మనా భవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు
మా మే వైష్యసి యుక్త్వైవ
మాత్మానం మత్పరాయణః  శ్లో - 34

నీవు నాయందే మనస్సు

కలవాడవు కమ్ము

నా భక్తుడవు కమ్ము

నన్నే అర్చించుము

నన్నే నమస్కరింపుము

ఈరీతిగా నీ మనస్సును

నా యందే నిలిపి నన్నే

పరమగతిగ ఎన్నుకొనిన

నీవు తుదకు నన్నే పొందగలవు

ఈ విధంగా ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాద రూపమును అయిన
శ్రీ మద్భగవద్గీత యందలి రాజవిద్యా- రాజగుహ్యాయోగము అను పేరుగల
తొమ్మిదవ అధ్యాయము సమాప్తముగావించబడినది.



# గీతా సంహిత

**అధ్యాయము పది** | **విభూతి యోగము**

వెనుక పరిశీలించిన తొమ్మిది అధ్యాయములతో గీతయొక్క పూర్వార్థము పూర్తి అయింది. ఇక ఈ పదవ అధ్యాయము నుండి గీత యొక్క ఉత్తరార్థము ప్రారంభముకాబోతున్నది. ఈ అధ్యాయములో మనం ప్రవేశించబోయె ముందు పూర్తి అయిన వెనుకటి తొమ్మిది అధ్యాయముల గూర్చి ఒకసారి మనం సమీక్షించుకొని మననం చేసుకోవడం ఎంతైనా అవసరం. మొదటి అధ్యాయములో అర్జునుడు ఎందుకు విషాదాన్ని పొందాడో తెలుసుకున్నాము.

రెండవ అధ్యాయంలో అర్జునునిలో గలిగిన మోహం ఏవిధంగా నాశనం కాగలదో దాని కొరకై భగవానుడు బోధించిన స్వధర్మ ప్రవృత్తి, జీవితము యొక్క ముఖ్య సిద్ధాంతము. ఆత్మతత్వము, కర్మయోగము, స్థిత ప్రజ్ఞ దర్శనము మొదలుగాగల అతి ప్రధాన సూత్రాలను గూర్చి తెలుసుకున్నాము.

మూడు, నాలుగు, అయిదు అధ్యాయములలో కర్మ-వికర్మ-అకర్మల సమస్యల యొక్క పరిష్కారమార్గాన్ని గూర్చి తెలుసుకున్నాము. కర్మ అంటే స్వధర్మ ఆచరణ అనీ బాహ్యముగా జరుగు స్వధర్మాచరణమును బలపరుచు మానసిక కర్మను వికర్మయనీ కర్మ-వికర్మ రెండును ఏకరూపమై చిత్తము శుద్ధిచేయబడి మాలిన్యమంతయు నిర్మలమై పోవుననియు, వాసనలు క్షీణించి మనస్సులోని వికారములు తొలగుననియు, దానివలన శాంతి లభించుననియు, భేదభావము నశించుననియు తెలుసుకున్నాము. ఆస్థితిలో అకర్మ దశకలుగుతుంది. ఈ అకర్మదశ రెండు విధములు. రేయింబవళ్లుపని చేయుచున్నను లేశమాత్రమైనను దానిని చేయనట్లుండుట మొదటి పద్ధతి. ఏ కర్మను కూడా ఆచరింపక నిరంతరము ఆచరించునట్లు వుండువాని స్థితి రెండవ  పద్ధతి.

ఈ రెండును వేరు వేరుగ అగుపించుచున్నను. వాస్తవానికి రెండింటి యొక్క సారము ఒక్కటియే. పూర్ణరూపంలో వాటిని కర్మయోగము సన్న్యాసం అని చెప్పబడుతున్నవి. అకర్మదశ అంటే ఇదే. దీని అంతిమ లక్ష్యము మజిలీ "మోక్షము" ఈ విధంగా మొదటి రెండు అధ్యాయాలలోనూ మనం జీవితం యొక్క శాస్త్రార్థమునంతయు అధ్యయనం చేశాం.

ఆ తరువాత అకర్మయను లక్ష్యము చేరుటకు గాను అనేక రూపాలైన వికర్మ మార్గాలను ఆరవఅధ్యాయంలో పరిశీలించాము. మనస్సును పరిశుద్ధపరుచుటకు అవలంభించు తప స్సాధనలలో కొన్ని ముఖ్యమైన విషయాలు ఇందులో పొందుపరచబడ్డాయి. ఈ అధ్యాయంలో చిత్తైకాగ్రత కొరకు ధ్యాన యోగము అవసరమని చెప్పి అభ్యాస, వైరాగ్యములు ఇందుకు సహకారులుగా వుండునని నిరూపించబడినవి. ఏడవ అధ్యాయంలో విశాలమైన భక్తి ఉత్కృష్ట సాధనముగ చెప్పబడింది.

"నీవు ఈశ్వరుని వద్దకు ప్రేమ భావముతో వెళ్లుము. జిజ్ఞాసువుగ వెళ్లుము. లేదా విశ్వకల్యాణమునిమిత్తము వ్యాకులుడవై వెళ్లుము. లేక నీ వ్యక్తిగత వాంఛలతో వెళ్లు. ఈ తెలుపబడినవాటిలో నీవు ఏ ఉద్దేశముతోనైనను ఒక్కసారి ఆయన దర్బారులో ప్రవేశింపుము. ఈ విషయము పురస్కరించుకొనియే మహర్షి వినోబా ఈ "విజ్ఞాన యోగాన్ని" "ప్రపత్తియోగం" అని తెలియజేశారు. అంటే ఈశ్వరుని శరణు జొచ్చుటకు ప్రేరేపించు యోగం అని వివరించారు. ఈ విధంగా భగవానుడు ఏడవ అధ్యాయంలో ప్రపత్తియోగమును గూర్చి తెలిపి ఎనిమిదవ అధ్యాయం అయిన "అక్షర పరబ్రహ్మ యోగంలో సాతత్వయోగము ను గూర్చి బోధించారు. సాతత్వయోగం అంటే అంత్యకాలము వరకు సాధనను అవిరామముగ నడుపు చుండుట. అంటే నీవు నిశ్చయించుకొని తొక్కిన మార్గంలో ఆగకుండా చివరి దాకా ముందుకు సాగగలను సాతత్సయోగం అని వినోబా పేరిడారు. సాధనను కొన్ని దినములు సాగించి వదలినచో గమ్యమును చేరవలెనను ఆశ ఎన్నటికినీ నెరవేరదు. ఇంకెన్నాళ్లీ సాధన అని మాత్రము ఎప్పుడును తలపకూడదు. ఫలము సిద్ధించు వరకునూ సాధన చేస్తూవుండవలసిందే. ఈ విధంగా ఎనిమిదవ అధ్యాయములో "అక్షర పరబ్రహ్మ యోగం" అనే సాతత్వయోగాన్ని పరిచయం చేసి తదుపరి తొమ్మిదవ అధ్యాయం అతి సరళమైన జీవిత స్వరూపమునే మార్చి వేయగల ఒక ప్రధాన విషయమును ఇక్కడ భగవానుడే వివరించాడు. ఇదే "రాజవిద్యా, రాజగుహ్య యోగం" దీనిని మహర్షి వినోబా సరళమైన భాషలో "రాజయోగం" అని పిలిచారు. ఇందులో క్షణక్షణమును నీవు ఆచరించు కర్మలనన్నింటిని "కృష్ణార్పణము చేయుము" అని బోధించబడింది. ఈ ఒక్కమాటతో శాస్త్ర సాధనలు, కర్మ-వికర్మలు అన్నీ కొట్టుకొని పోతాయి. ఈ రాజయోగాన్నే "సమర్పణ యోగం" అని కూడా వినోబా అన్నారు. ఈ సమర్పణ యోగములో సమస్తము మునిగిపోతాయి. సాధనలన్నీ సమాప్తం అవుతాయి.

విశాలమును శక్తివంతమును అయిన ఈశ్వరార్పణ సాధన చూచుటకు అతి సామాన్యముగ వున్నను వాస్తవానికి అది అతికఠినమైంది. ఒక విదంగా సరళమైందికూడా. గ్రామీణుడు మొదలు కులీనుడు- మహాపండితుని వరకు విశేషశ్రమలేకుండా అందరును దానిని ఇంటివద్ద కూర్చుండియే ఆచరించవచ్చును. ఇది ఇంత సులభమైనదైనప్పటికీ ఆచరించుటకు గొప్పదైన పుణ్య సంస్కారం వుండవలెను. అనేక జన్మల పుణ్య సంచయముండిననే తప్ప ఈశ్వరుని యందు రుచి ఉత్పన్నము కాదు. ఏదైన కొంచెము కష్టంకలిగితే కంటతడిపెట్టే మానవుడు భగవంతుని నామమును ఉచ్చరించుచుండగా కన్నీటి బొట్టు కూడా రాలదు. ఎందుకు? ఒక విధంగా చూస్తే ఈ సాధన అతి సుకరము, మరొక విధంగా చూస్తే అతిదుష్కరము కనుక ఈనాడు జడవాదము మన కన్నుల పటలాలను కప్పివేయుచున్నది. అసలు ఈశ్వరుడు అనేవాడు ఒకడున్నాడా? అను ప్రశ్నతోనే వాదము ప్రారంభమగును. అలాంటప్పుడు ఆయన ఎందుకు అగుపిస్తాడు? మన జీవితమంతయు విషయలోలము, వికారమయము, విషపూరితము అయి పోయింది. అలాంటప్పుడు నీకు ఈశ్వరుడు ఎట్లు అగుపించగలడు? ఇప్పుడు ఆరితేరినామని చెప్పుకుంటున్న వేదాంతులదృష్టి కూడా అంతా వికారమయమే విషపూరితమే పైగా ఈనాడు ప్రపంచంలో వున్నదుర్భరపరిస్థితుల దృష్ట్యా అన్నము అందరికి కడుపునిండా దొరకుట దుర్లభమైపోయింది. ఈనాటి పెద్దసమస్య. ఆహారసమస్య, జనాబా పెరుగుదల సమస్య. ఈ సమస్యలను పరిష్కరించడానికి అందరి బుద్ధి అటుగా మళ్లింది. అందువల్లనే ఏనాడో "సాయణాచార్యుడు" రుద్రుని గురించిన వ్యాఖ్యానము ఈ విధంగా చేశాడు.

"బుభుక్షమాణః రుద్రరూపణే అవతిష్ఠతే" అని అంటే ఆకలిగొన్నవారంతా రుద్రావతారముదాల్చినారన్నమాట. వారి క్షుత్బాధనుశమింపజేయుటకు ప్రపంచంలో అనేక తత్వదాన బోధనలు, రాజశాసనాలు ఏర్పడ్డాయి, భిన్న భిన్న వాదములు అంటే ఈ అన్నం సమస్య కాంగ్రెసుపార్టీవల్లనే పరిష్కారం అవుతుందనీ కాంగ్రెసువారు, సోషలిష్టులు వల్లనే పరిష్కారమౌతుందని సోషలిస్టు పార్టీవారు, కమ్యూనిష్టులవల్లనే పరిష్కారమౌతుందని కమ్యూనిస్టుపార్టీవారు, భారతీయజనతా పార్టీవల్లనే పరిష్కారమౌతుందని బిజేపీవారు తెలుగుదేశం పార్టీవల్లనే పరిష్కారమౌతుందని తెలుగుదేశం పార్టీలవారు బాకాలూదుతున్నారు. ఈవాదనలతో అధికారాన్ని పొందడానికి ఈ చర్చల్లో మునిగి తేలుతున్నారు. పార్టీలవారు అసలు సమస్యను పక్కకు నెట్టి కలహాలుపెంచుకుంటున్నారు. ప్రజాజీవనాన్ని శాంతియుతంగా వుండనీయడం లేదు. ఇపుడు ఇట్టివిచిత్రమైన సమాజం ఏర్పడివుంది. ఈ స్థితిలో వారికి ఈశ్వరార్పణవంటి బుద్ధి ఏ విధంగా లభిస్తుంది? అన్నదే యిక్కడ ప్రధాన ప్రశ్న ఆ ఈశ్వరార్పణ బుద్ధి ఏవిధంగా లభిస్తుందో అటు పిమ్మట పరమేశ్వరుని దర్శనానికి మార్గం ఏ విధంగా సులభం కాగలదో ఆ విషయాన్ని గూర్చి "విభూతియోగం" లేక "విభూతి" అను ఈ పదవ అధ్యాయంబోధిస్తుంది.

ఈ అధ్యాయంలో 42శ్లోకాలున్నాయి. ఈ శ్లోకాలన్నీ భగవంతుని విభూతిని, యోగశక్తులు, భక్తి యోగము యొక్క నిరూపణను గురించి తెలుపడంతో పాటు అర్జునుడు భగవానుని స్తుతించి స్వకీయ విభూతి యోగ శక్తిని గూర్చి తెలుపమని ప్రార్థించగా అటు పిమ్మట భగవానునిచే గావించబడిన విభూతి వర్ణనము తెలుపబడ్డాయి.

1. విభూతి యోగశక్తుల వర్ణన *(1నుండి 7వ శ్లోకం వరకు)*
2. ఫలప్రభావపూరితంగా భక్తియోగవర్ణనము *(8నుండి 11వ శ్లోకం వరకు)*
3. అర్జునుడు భగవానుని స్తుతించి స్వకీయమైన యోగశక్తిని, విభూతిని తెలియజేయమని ప్రార్థించుట *(12నుండి 18వశ్లోకము వరకు)*
4. విభూతి వర్ణనము *(19 నుండి 42వ శ్లోకం వరకు)*

వెనుకటి అధ్యాయంలో భగవానుడు తాను చెప్పిన విభూతి సంబంధములైన వచనాలనే ఇపుడు ఇంకా విస్తృతముగా తెలుపుతున్నాడు.

భూయ ఏవ మహాబాహో!
శ్రుణు మే పరమం వచః
యత్తేహం ప్రియమాణాయ
వక్ష్యామి హితకామ్యయా శ్లో - 1

*అర్జునా!*
నా వచనమును విని సంతసించుచున్న
నీకు నీ హితమును గోరి నేను మరల
చెప్పబోయెడి ఉపదేశములను
ఆలకింపుము

నమే విదు స్సురగణాః
ప్రభవం న మహర్షయః
అహ మాదిర్హి దేవానాం
మహర్షీణాంచ సర్వశః శ్లో - 2

నా యొక్క ప్రభావము
దేవగణములకును
మహర్షులకును కూడా తెలియదు
దేవతల, మహర్షుల ఆవిర్భావము
నకు కారణభూతుడను నేనే

యో మామజమనాదిం చ
వేత్తి లోకమహేశ్వరం
అసంమూఢస్స మర్త్యేషు
సర్వపాపైః ప్రముచ్యతే          శ్లో - 3

నేను
ఆదినిగాని, అంతమును గాని
లేనివాడను, సర్వలోక
ప్రభువును, అట్టి నన్ను
ఎవడు తెలుసుకొనుచున్నాడో
అతడు మానవులలో అజ్ఞానము
లేనివాడై సర్వకల్మషముల
నుండి విడివడుచున్నాడు

బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః
క్షమా సత్యం దమశ్శమః
సుఖం దుఃఖం భవో భావో
భయం చాభయమేవచ          శ్లో - 4

అహింసా సమతా తుష్టి
స్తపో దానం యశోయశః
భవంతి భావా భూతానాం
మత్త ఏవ పృథగ్విధాః          శ్లో -5

నిశ్చయ జ్ఞానం
తత్వజ్ఞానం
అప్రమత్తత, సహనం
సత్యం, దమం, శమం
సుఖం, దుఃఖం, భయం
అభయం
అహింస, సమత్వం
సంతృప్తి, తపస్సు
దానము, కీర్తి, అపకీర్తి
మొదలగు భావములన్నీ
నావలననే కలుగుచున్నవి



మహర్షయస్సప్త పూర్వే
చత్వారో మనవస్తథా
మద్భావా మానసా జాతా
యేషాం లోక ఇమాః ప్రజాః      శ్లో -6

ప్రపంచమునందలి
ఈ జనులు (మానవకోటి)
ఎవరి యొక్క సంతతి
అయివున్నారో వారు పూర్వీకులైన
ఏడుగురు మహర్షులును
సనకాది దేవర్షులును
స్వయంభువాది మనువులును
నా భావముగలవారై
నామానసపుత్రులై జన్మించిరి

**1. సప్తఋషులు** : 1. మరీచి 2. అంగిరుడు 3. అత్రి 4. పులస్త్యుడు 5. పులహుడు 6. క్రతు 7. వశిష్ఠుడు ఈ ఏడుగురుసప్తఋషులు

**2. నలుగురు సనక సాదులు** : 1. సనకుడు 2. సనందనుడు 3. సనాతనుడు 4.సనత్కుమారుడు

**3. చతుర్ధశ మనువులు** : 1. స్వాయంభువుడు 2. స్వారోచిషుడు 3. ఉత్తముడు 4. తామసుడు 5. రైవతుడు 6. చాక్షుషుడు 7. రైవస్వతుడు 8. సూర్యసావర్ణి 9.రక్షసావర్ణి 10.బ్రహ్మసావర్ణి 11. ధర్మసావర్ణి 12. రుద్రసావర్ణి 13. రౌచ్యుడు 14. భౌచ్యుడు. అనుపదునలుగురు మనువులుండేవారు

ఇందులో కొన్ని పేర్లు వేరు వేరు చోట్ల వేరు వేరు విధాలుగా వ్రాయబడ్డాయి.

సమస్త మానవులు పైన తెలిపిన మహర్షుల నుండియే ఉద్భవించిరి అని తెలుపడం వలన మానవకోటికి మూలపురుషులు వారేనని స్పష్టమౌతున్నది దీనిని బట్టి ఎవరును అల్పులమని, అల్పజాతికి చెందినవారమని తలంచకూడదు. ఎవరు ఏ జాతికి, మతానికి, వర్ణానికి చెందినా అందరూ ఆ మహర్షుల సంతానమే అని భావించి దైవోత్తేజాన్ని పొందవలెను. ఆ మహర్షుల యొక్క పవిత్ర రక్తము మానవకోటి యందంతటను ప్రవహిస్తున్నది. ఇపుడు కులాలు, మతాలు, వర్ణాలుగా విడిపోయిన వారందరూ ఈ సత్యాన్ని గుర్తుంచుకోవాలి. తమ పూర్వజుల జ్ఞానధనాన్ని, దైవవారసత్వాన్ని పొందుటకు కృషిచేయాలి. ఇది ఏఒక్కరి సొత్తుకాదు. దానిపైమానవకోటికంతటికీ అధికారం వుంది.

ఈ సత్యాన్ని బోధించడానికే శ్రీకృష్ణపరమాత్మ ఇచట వంశపారంపర్యమును గురించి వర్ణించడం జరిగింది.

ఇప్పటికి నీవు మనం మన పూర్వీకుల వంశానుక్రమాణికలను వ్రాయిస్తున్నాము కదా! ఎందుకు? తమ వంశస్థులు ఏ ధర్మమార్గాన పయనించారో ఆ ధర్మమార్గన పయనించడానికి ప్రయత్నించుటకే ఆ విధంగా వ్రాయించడం.

ఏతాం విభూతిం యోగం చ
మమ యో వేత్తి తత్త్వత:
సోవికమ్పేన యేగేన
యుజ్యతే నాత్ర సంశయః                శ్లో - 7

నా ఈ ఐశ్వర్యమును
యోగమును గూర్చి యదార్థముగా
ఎవడు తెలుసుకొనునో అతడు
నిశ్చలమగు యోగముతో కూడిన
వాడగుచున్నాడు. ఇందును
గురించి సంశయించ వలసిన అవసరంలేదు

అహం సర్వస్య ప్రభవో
మత్తస్సర్వం ప్రవర్తతే
ఇతి మత్వాభజంతే మాం
బుధా భావసమన్వితాః                శ్లో - 8

ఈ జగత్తంతయునావల్లనే
జనించినది. నావల్లనే నడుచు
చున్నది అనిగ్రహించిన జ్ఞానులు
నన్నే సేవించుచున్నారు

మచ్చిత్తా మద్గత ప్రాణా
బోధయన్తః పరస్పరం
కథయన్తశ్చ మాం నిత్యం
తుష్యన్తి చ రమన్తిచ                శ్లో -9

మనస్సును, ప్రాణమును
నాయందే లగ్నము చేసి
నన్ను గురించి ఒకరికొకరు
ముచ్చటించుకొనుచు
బోధించుకొనుచున్న
వారు సదా తృప్తిని ఆనందమును
పొందుచున్నారు

తేషాం సతతయుక్తానాం
భజతాం ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగం తం
యేన మా ముపయన్తితే శ్లో - 10

యోగయుక్తులై సదా
నన్ను భజించువారు
నన్ను పొందగల బుద్ధికి
యోగమునకు అర్హులై యున్నారు
అట్టివాటినివారికి నేను ప్రసాదించుచున్నాను

తేషా మేవానుకం పార్థ
మహామజ్ఞానజం తమః
నాశయామ్యాత్మ భావస్థో
జ్ఞానదీపేన భాస్వతా శ్లో - 11

వారలనుద్ధరించుట కొరకే
నేను వారి ఆత్మలయందు
నిలిచి స్వప్రకాశమైన జ్ఞాన
దీపము చేత అజ్ఞానము
వలన కలిగిన వారి అంధకారమును
పోగొట్టుచున్నాను

భగవానుడుపైన తెలిపిన భక్తి చక్కగ ఏర్పడి అభివృద్ధి నొందించుకొనుటకు భగవద్విభూతులు భగవన్మహిమలు తెలుసుకొనడం అవసరమని భావించిన అర్జునుడు భగవానునకు ఈ ప్రశ్నలు వేస్తున్నాడు.

పరంబ్రహ్మ పరం ధామ
పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య
మాది దేవమజం విభుం శ్లో - 12

ఆహుస్త్వా మృషయ స్సర్వే
దేవర్షిర్నారద స్థథా
అసితో దేవలో వ్యాస
స్స్వయం చైవ బ్రవీషి మే శ్లో - 13

నీవు పరబ్రహ్మవు
పరంధాముడవు
పరమపావనుడవు
శాశ్వతుడవు, దివ్యమైన
వాడవు. ఆదిదేవుడవు
నీవు ప్రభువువు అని
ఎల్లరు ఋషులును
దేవఋషియైన నారదుడును
అసితుడును, దేవలుడును
వ్యాసుడును తెలిపియే యుండిరి.
నీవును అట్లే చెప్పుచున్నావు

**ఎల్లరు ఋషులు :** అనగా ఇదే అధ్యాయ ఆరవశ్లోకంలో తెలిపిన సప్త ఋషులు.

**దేవఋషినారదుడు :**

1. బ్రహ్మకంఠం నుండి జన్మించినవాడని బ్రహ్మ వైవర్తపురాణం తెలియజేస్తున్నది.
2. విష్ణుమూర్తే నారదుడు అనే దేవర్షియై కర్మ నిర్మోచకమైనవైష్ణవ మంత్రాన్ని ప్రబోధించాడని భాగవతం తెలియజేస్తున్నది.
3. బ్రహ్మ కుమారుడైన నారదుడు దక్షుని శాపం వలన నిరంతరం నారాయణ నామజపం చేస్తూ, సంచరిస్తూ "అకంపనుడి" దుఃఖాన్ని పోగొట్టడమే కాకుండా, సృంజయుని కుమారుణ్ణి బ్రతికిస్తాడు. ఇతనికి కలహ భోజనుడనే పేరు వుంది. పార్వతీదేవిని అపహరించమని చెప్పి శివుని చేతిలో అతడు మరణించునట్లు చేస్తాడు. ఇతడు ఏడు జన్మలెత్తాడు. "విష్ణువు" అతని మాయ గురించి బోధిస్తాడు.

హనుమంతుడు రాళ్లు కరిగేటట్లు పాడి నారదుణ్ణి ఒకసారి అవమానపరిచినట్లు అద్భుత రామాయణము తెలుపుతుంది.

## అసితుడు:

1. అసితుడు జనకుడికి పూర్వ జన్మవృత్తాంతమును బోధించెనని బ్రహ్మాండపురాణము తెలుపుతున్నది.
2. సగరుడి తండ్రి, సూర్యవంశంవాడైన భరతుని కుమారుడు, శత్రువులకు భయపడి భృగుమహర్షి ఆశ్రమంలో వున్నప్పుడు గర్భిణితోవున్న అతని భార్య కళిందికి సవతి విషాహారాన్ని పెడుతుంది. అదే సమయానికి ఆ ఆశ్రమానికి విచ్చేసిన చ్యవన మహర్షిని దర్శించి తనకు కుమారుడు పుట్టునట్లు ఆశీర్వదించమంటుంది కళింది. గరళసహితుడైన కుమారుడు జన్మిస్తాడని చ్యవన మహర్షి ఆమెను ఆశీర్వదించాడు. ఇతడే సగరుడు.

## దేవలుడు :

1. అష్టవసువులలో ఒకడైన ప్రత్యూషుడి కుమారుడు, గజేంద్రమోక్ష కథలో ఇతనిదొక పాత్ర (భారతము)
2. వేదాలలో నిపుణుడైన ఒక ముని, దౌముని సోదరుడు, ఇతనికి సువర్చల అనే ఒక కూతురు, ఇద్దరు కుమారులు వున్నారు.
3. వ్యాసుని శిష్యుడు. శివుడి వరంవలన అసితునికి జన్మించిన కుమారుడు, రంభ ఇతనిని ప్రేమిస్తుంది.

## వ్యాసుడు :

మహాభారతకర్త. సత్యవతి-పరాశరుల కుమారుడు. ఈయన "ఆశ్రమం శష్యా పాసం. సత్యవతి ద్వితీయ భర్త అయిన శంతన మహారాజు ద్వారా జన్మించిన ఇద్దరు కుమారులలో ఒకరైన విచిత్ర వీర్యుడు నిస్సంతుగా మరణించినందున వంశోద్ధరణ నిమిత్తం ఆమె కోరికపై విచిత్రవీర్యుని భార్యలు అంబిక అంబాలికల ద్వారా ధృతరాష్ట్ర, పాండురాజుల్ని కంటాడు. అంబిక దాసివలన విదురుడు అను మరొక కుమారుణ్ణి కంటాడు. ద్రౌపదిని వివాహమాడుటకై ద్రుపద నగరానికి వెళ్లమని పాండవులను ప్రోత్సహిస్తాడు. ధర్మరాజుకు ప్రతిస్మృతి అనే విద్యను నేర్పుతాడు. మహాభారతయుద్ధము జరుగుతున్నప్పుడు ధర్మరాజు- అశ్వత్థామ- గాంధారి, ధృతరాష్ట్రులు, కుంతి మొదలైన వారికి దుఃఖోపశమనం చేస్తాడు. వేదాలను విభజించినందున వ్యాసుడు వేదవ్యాసుడయ్యాడు.

"పొష్యంజి- పొల- వైశంపాయనులు" వేదవ్యాసుని శిష్యులు, శుకరూపంలోవున్న ఘృతాచివలన ఈతనికి "శుకుడు" అనే కుమారుడు జన్మిస్తాడు. భారతాన్నే కాకుండా అటు పిమ్మట భాగవతాన్ని కూడా వ్రాసి దానిని కుమారుడైన శుక్రునిచేత చదివిస్తాడు.రాబోయె సూర్యసావర్ణికాలంలో ఈయన సప్త ఋషులలో ఒకడౌతాడు. (భాగవతం) కాశిలో ఈయన నివాసమున్న ప్రాంతాన్ని వ్యాసకాశి అని అంటారు. ఈయనకు కృష్ణద్వైపాయనుడనే మరొకపేరు కూడా వుంది. (భారతం- భాగవతం బ్ర.వై. పురాణం ఉ.దా)

సర్వమేతదృతం మన్యే
యన్మాం వదసి కేశవ!
న హి తే భగవన్! వ్యక్తిం
విదుర్దేవా న దానవాః శ్లో - 14

కృష్ణా!
నీవు నాకు చెప్పినదంతయును
సత్యమే, నీయొక్క నిజ
స్వరూపమును దేవతలుగాని
దానవులు గాని ఎరుగరు

స్వయ మేవాత్మనాత్మనం
వేత్థత్వం పురుషోత్తమః
భూతభావన! భూతేశ!
దేవదేవ జగత్పతే శ్లో -15

పురుషోత్తమా!
సర్వప్రాణులను సృష్టించు ఓ దేవా!
జగత్పాలకా! దేవదేవ! జగన్నాథ!
నిన్ను నీవే తప్ప వేరె ఎవ్వరును ఎరుగరు

వక్తు మర్హ స్యశేషేణ
దివ్యాహ్యాత్మ విభూతయః
యాభి ర్విభూతిర్లోకాన్
ఇమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి శ్లో - 16

నీవు ఏ విభూతుల చేత
ఈ లోకములనన్నింట
వ్యాపించియున్నావో
అట్టి దివ్యములగునీ
విభూతములనన్నింటిని
సంపూర్ణముగ బోధించుటకు
నీవే అర్హుడవు

కథం విద్యామహం యోగిం
స్త్వాం సదా పరిచిన్తయన్
కేషు కేషు చ భావేషు
చింత్యోసి భగవన్మయా శ్లో - 17

యోగీశ్వరా!
నిన్ను తెలుసుకొనుటకు
నిరంతరముగ నేను ఏ విధముగ
ధ్యానం చేయవలెను, ఓ భగవానుడా!
నిన్నునేను ఏ ఏ భావములతో
ధ్యానించవలెను?
ఆ విషయాన్ని గూర్చి నాకు వివరముగ
తెలుపుము.

విస్తరేణాత్మనో యోగం
విభూతిం చ జనార్దన!
భూయః కథయ తృప్తిర్హి
శృణ్వతో నాస్తిమేమృతమ్ శ్లో - 18

జనార్ధనా!
నీ యొక్క యోగమహిమను
విభూతులను గూర్చి సవివరముగ
మరల చెప్పుము, నీ జ్ఞానామృతమును
గ్రోలుచున్న నాకు తనివి తీరకున్నది.

అర్జునుని యొక్క ఈ ప్రార్థనను ఆలకించిన భగవానుడు తన విభూతులను గూర్చి ఈ విధంగా వర్ణించసాగెను.

హన్తతే కథయిష్యామి
దివ్యా హ్యాత్మవిభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ!
నాస్త్యంతో విస్తరస్య మే శ్లో - 19

అర్జునా!
దివ్యములగు నా విభూతులు
అనంతములు. అందువలన
వాటిని గూర్చి వాటి వాటి ప్రాధాన్యత
క్రమములో నీకు తెలియజేసెదను

అహమాత్మా గుడాకేశ!
సర్వభూతాశ యస్థితః
అహమాదిశ్చ మధ్యంచ
భూతానామంత ఏవ చ శ్లో - 20

సర్వభూతముల యొక్క
హృదయ మందున్నటువంటి
ఆత్మను నేనే భూతములయొక్క
ఉత్పత్తి, స్థితిలయములకు
కారకుడను కూడా నేనే

ఆదిత్యానా మహం విష్ణుః
జ్యోతిషాం రవిరంశుమాన్
మరీచి ర్మరుతామస్మి
నక్షత్రాణా మహం శశీ శ్లో - 21

నేను
ఆదిత్యులలో విష్ణువును
జ్యోతులయందు సూర్యుడను
మరుత్తులయందు మరీచిని
తారలయందు చంద్రుడను
అయి వున్నాను

**1. ఆదిత్యులు** : వీరు పండ్రెండు మంది. అదితికుమారులు, వీరందరిని కలిపి ద్వాదశ (పండ్రెండుమంది) ఆదిత్యులు అని చెప్పబడుతున్నారు. వీరు 1. దాత 2. మిత్రుడు 3. ఆర్యముడు 4. శక్రుడు 5. వరుణుడు 6. అంశువు 7. భగుడు 8. వివస్వంతుడు 9. పూష 10. సవిత 11. త్వష్ట 12. విష్ణువు అను పేర్లు కలిగియున్నారు.

**2. మరుత్తులు** : వీరు ఏడుగురు 1. అవహుడు 2. ప్రవహుడు 3. నివహుడు 4. వరావహుడు 5. ఉద్వహుడు 6. సంవహుడు 7.పరివహుడు (మరీచి)

ఆదిత్యులలో చివరివాడైన విష్ణువును, మరుత్తులలో కూడా చివరివాడైన పరివహుడు(మరీచి) అంటే మరీచిని తానుగా భగవానుడు ప్రకటించుకోవడంతో భగవానుడు ఎల్లపుడును దిగువస్థాయి వారిపట్ల అంటే చిన్నవారి ఎడల ఎంతదయకలిగి వుంటాడో అన్నవిషయాన్ని ఒక అర్థములో తీసుకోవచ్చు.

బహుళార్థములో "విష్ణువు" అంటే ప్రళయం తరువాత "విశ్వం" నూట ఇరవై బ్రహ్మసంవత్సరాల కాలం పాటు నిశ్శబ్దంగా వుంటుంది. అప్పుడు విష్ణుమూర్తి "వటపత్రం" మీద ప్రత్యక్షమౌతాడు. అదే సృష్ట్యాదికి చిహ్నం. నీటి మీద వుంటాడు కాబట్టి నారాయణుడన్నారు. ఈయన వాహనం గరుడుడు, నివాసం వైకుంఠం. ఆయుధం చక్రం, భార్య లక్ష్మి, అంధక, మధుకైటభ, రాహు, వృత్తాసురుల్ని సంహరిస్తాడు. శివలింగం ఆద్యంతాలు చూసే విషయంలో బ్రహ్మతో పోటీ పడతాడు. భృగువు, బృంద, తులసి, పర్వత, నారదులు ఈయనకు శాపమిచ్చినట్లు వ్రాయబడింది. (శివపురాణం)

**మరీచి** : మరుత్తులు ఏడుగురు దేవతలు. దితి-కశ్యపుల కుమారులు, ఇంద్రుడు దితి కుమారులను సంహరించుచుండెను. ఆమె పుత్రశోకమున కుందుచుండెను. ఇంద్రుని సంహరింపగోరు పుత్రునికొరకై భర్తను ప్రార్థించెను. కశ్యపుడు అనుగ్రహించెను. దితి గర్భవతి అయ్యెను. తనకు శత్రువుపుట్టబోవుచున్నాడని ఇంద్రుడు తెలుసుకొని అతనొక బాలుని రూపమును ధరించి వచ్చి దితికి పరిచర్యలు చేయుచుండెను. ఒకనాడామె నిదురించుచుండగా ఇంద్రుడు ఆమె గర్భంలో ప్రవేశించి గర్భంలోని శిశువును ఏడు ముక్కలుగా ఛేదించి వేసెను. ఆ ఏడుముక్కలు శిశువులై ఏడవసాగెను. ఇంతలో దితి మేల్కొని శిశువులను చంపవలదని ఇంద్రుడిని వేడుకొనెను. నీకు పుట్టబోయెవాడునాకు శత్రువు గనుక నేనట్లు చేసితిని అనెను. వీరు నీకు శత్రువులుకారు నీకు మిత్రులే అగుదురని దితి చెప్పెను. వారు మరణమొందలేదు. అందులో చివరివాడే మరీచి. (పరివహుడు) ఇంద్రుని సంహరించగలశక్తి కలవాడు. అందువల్లనే కాబోలు మరుత్తులలో నేను మరీచుడను" అన్నాడు భగవానుడు.

వేదానాం సామవేదోస్మి
దేవానామస్మి వాసవః
ఇంద్రియాణాం మనశ్చాస్మి
భూతానా మస్మి చేతనా శ్లో - 22

నేను
వేదములందు సామవేదమును
దేవతలయందు ఇంద్రుడను
ఇంద్రియములందు మనస్సును
భూతములయందు చేతనాశక్తిని
నేనే అయి వున్నాను.

1. **సామవేదం** : సామవేదం ఒక ప్రత్యేక వేదంకాదు. ఋగ్వేదములోని అనేక ఋక్కులకు సామవేదం అని చెప్పబడుతున్న ఈ వేదంలో చక్కటి స్వరకల్పన చేశారు. ఋక్కుల శక్తి వాటికి సామవేదం ఇచ్చిన స్వరం మీద ఆధారపడి వుంటుందని విశ్వాసం. ఈ వేదాన్ని భారతీయ సంగీతానికి మూలముగా భావిస్తారు.

2. **ఇంద్రుడు** : అదితి -కశ్యపుల కుమారుడు. దిక్పాలకులలో ఒకరు. ఈయన తూర్పు దిక్కుకు అధిపతి. "ఇంద్ర" అనే శబ్దము, వ్యక్తి యొక్క నామం కాదు అది పదవిని సూచిస్తుంది. అందుకనే మనం సాధారణంగా ఫలానా వాడు ఇంద్రపదవి లాంటి పదవిని పొందాడు. వాడు అదృష్టవంతుడు అనడం పరిపాటి.

నూరు యజ్ఞాలు చేసినవాడు ఎవడైనా ఇంద్రుడు కావచ్చు. ఉత్తమ మన్వంతరంలో సుఖాంతుడు, రైవతమన్వంతరంలో విభుడు, చాక్షసమన్వంతరంలో మనోజవుడు అను వారలు ఇంద్రులయ్యారు. తల్లిని దాస్యం నుంచి తప్పించడానికి గరుడుడు దేవలోకం నుంచి అమృతమును తీసుకొని పోతున్నపుడు ఇంద్రుడు వజ్రాయుధం ప్రయోగించి విఫలుడౌతాడు. తిలోత్తమ అనే అప్సరస నాట్యాన్ని- అందాన్ని చూడడానికి ఒళ్లంతా కళ్లు చేసుకున్నాడట. కుంతి భర్తతో హిమాలయాలకు ఆవలగావున్న శతశృంగ పర్వతం పై మకాం చేసివున్నపుడు ఇంద్రుని ప్రభావంతో ఆమెకు అర్జునుడు జన్మిస్తాడు. దధీచి యొక్క ఎముకతో చేయబడిన ఆయుధంతో వృతాసురుల్ని ఇంద్రుడు సంహరిస్తాడు. అశ్వనీ దేవతలకు అమృతాన్ని పంచి ఇవ్వకుండా పేచీపెట్టి తదుపరిచ్వవనుని మాటమీద వారికి అమృతాన్ని ఇచ్చుటకు అంగీకరిస్తాడు విశ్వరూపుడు అనే తమ్ముని కొడుకును సంహరిస్తాడు. పాండవుల పూర్వీకుడైన యయాతిని భూలోకంలోకి తోసివేస్తాడు. ఖాండవవన దహన సమయంలో తక్షకుణ్ణి రక్షిస్తాడు. పాండవులు ఇంద్రప్రస్థాన్ని నిర్మించే సందర్భంలో నారదుడు "ఇంద్రుని సభాభవనం" ఎట్లుంటుందో పాండవులకు వివరిస్తాడు. (ఈనాటి మన ఢిల్లీనగరం అప్పట్లో ఇంద్రుని సభాభవనం వలె నిర్మించబడినదే)

దమయంతి స్వయం వరం అయిన తరువాత "కలి" నరుణ్ణి శపించబోతే ఇంద్రుడు నివారిస్తాడు. భృగుమహర్షి ఆశ్రమంలో మంత్రజలం త్రాగిన యవనాశ్వుడి కడుపున పుట్టిన మాంధాత నోట్లో చూపుడువేలును పెట్టాడు. అతడికి నన్ను త్రాగేనాడు అను అర్థమిచ్చే పేరుపెట్టినవాడు ఇంద్రుడే. మహాశని తనను బంధించినపుడు విష్ణువు నాశ్రయించి శివ, విష్ణువు అంశలతో జనించిన పురుషుడి సహాయంతో శనిని చంపిస్తాడు.

బ్రహ్మతనను ఆహ్వానించకుండా "ఇంద్రద్విష్ట," అనే యజ్ఞం చేశాడనిభంగీశ్వరున్ని స్త్రీగా మార్చి బ్రహ్మకు- అతనికుమారులకు విరోధం కల్పిస్తాడు. భంగాశ్వనుడికోరిక ప్రకారం అతణ్ణి స్త్రీగా వుంచుతాడు. (భారతం).

భార-శుక్రుడు- మరుత్వానుడు- జిష్ణుడు మొదలైనవి ఇంద్రుని పేర్లు.

రుద్రాణాం శంకరశ్చాస్మి
విత్తేశో యక్షరక్షసాం
వసూనాం పావకశ్చాస్మి
మేరుశ్శిఖరిణామహం శ్లో -23

నేను
రుద్రుల యందు శంకరుడను
యక్షుల యందును, రాక్షసులయందును
కుబేరుడను, వసువులయందు
అగ్నిహోత్రుడను, పర్వతములయందు
మేరుపర్వతమును అయి వున్నాను

1. **రుద్రులు** : రుద్రులు పదకొండుమంది వారు 1. హరుడు 2. బహురూపుడు 3. త్రయంబకుడు 4. అపరాజితుడు 5. వృషాకపి 6. శంభువు 7. కపర్థి 8. రైవతుడు 9. మృగవ్యాధుడు 10. శర్వుడు11. కపాలి అను పేర్లు కలిగి వున్నారు. వీరిని ఏకాదశరుద్రలంటారు.

2. **వసువులు** : వసువులు ఎనిమిది మంది వారు 1. ధరుడు 2. ధ్రువుడు 3. సోముడు 4. అహుడు 5. అనిలుడు 6. అనలుడు 7. ప్రత్యూషుడు 8. ప్రభాసుడు

3. **మేరుపర్వతము** : దీనినే మేరుమందరం అని భాగవతంలో తెలియజేయబడింది. బ్రహ్మాండపురాణము ప్రకారము ఇదొక బంగారు పర్వతము. ఇది భూమి చుట్టూ వడ్డాణము వలె వుంటుంది. దీని చుట్టూ సూర్యచంద్రులు తిరుగుతుంటారు. దాని శిఖరాలపైన దేవతలు విహరిస్తుంటారు. దానికి అయతి, నియతి అను కూతుళ్లుంటారు. వీరిని దాత- విదాతలకిచ్చి వివాహం చేస్తుంది.

పురోధసాం చ ముఖ్యం మాం
విద్ధి పార్థ! బృహస్పతిం
సేనానీనామహం స్కందః
సరసామస్మి సాగరః శ్లో - 24

అర్జునా!
నేను రాజపురోహితులలో
ప్రముఖుడైన బృహస్పతిని
సేనాధిపతులలోకుమారస్వామిని
సరస్సులలో సాగరుడను అయివున్నాను

1. **బృహస్పతి** : 1. ఒకరుషి, ముఖ్యప్రాణదృష్టితో ఉద్గీథ ప్రణవోపాసన చేశాడు. కనుక ముఖ్యప్రాణాన్ని బృహస్పతిరూపంగా తలుస్తారు. (చాందోగ్యోపనిషత్తు)

2. అంగీరసుని కుమారుడు, అందువలన అంగిరసుడని కూడా పిలుస్తారు. దేవతలకు గురువు. కనుక గురుడు అంటారు. ఉతర్యుడు- సంవర్తనుడు ఇతని సోదరులు. భార్యతార, కొడుకుశంయుడు, శివుడు భస్మంచేసిన ఇంద్రుణ్ణి జీవించ నిమ్మని శివుణ్ణి ప్రార్థించాడు. కనుక ఈయనకు జీవుడు అనే పేరు వచ్చింది.

ఇతడు తన సోదరుని భార్య "మమత" అనునామెను కామించి ఆమె తిరస్కరించినా బలాత్కరిస్తాడు. ఆమె గర్భంలోని శిశువు బృహస్పతిని నిందిస్తుంది. ఇతడది గుడ్డిదయ్యేట్టు శపిస్తాడు. ఆ శిశువు బృహస్పతి వీర్యాన్ని బయటకు తంతాడు. అదే భరద్వాజుడుగా మారుతుంది.

ఇతడొకసారి శుక్రుడురూపంలో వెళ్లి రాక్షసుల రహస్యాలు తెలుసుకుంటాడు. (మత్స్యపురాణం) తనకూతురు సురేఖను బలాత్కరించబోయిన రావణున్ని రాముని చేతిలో మరణించమని శపిస్తాడు. (కంబరామాయాణం) హనుమంతుణ్ణి తన శిష్యుడుగా స్వీకరించాడు. అందువలన హనుమంతుడు సూర్యుని శిష్యుడు అవుతాడు. (ఉత్తరరామాయణం)

శుకుడికి గురువు (దేవీభాగవతం) భరద్వాజుడికి ఆగ్నేయాస్త్రం ప్రసాదిస్తాడు (భారతం)

మహర్షీణాం భృగు రహం
గిరామస్మ్యేక మక్షరం
యజ్ఞానాం జపయజ్ఞోస్మి
స్థావరాణాం హిమాలయం: శ్లో - 25

మహర్షులలో నేను
భృగుమహర్షిని, వాక్కులలో
ఏకాక్షరమగు ఓంకారమును నేనే
యజ్ఞములలో జపయజ్ఞమును
స్థావరములలో హిమాలయపర్వతమును
అయివున్నాను

1. **భృగుమహర్షి :**

1.భాగీరథీనదీతీరములో వుండే ఒకగ్రామానికి చెందిన బ్రాహ్మణుడు. ఇతడు ఎంతకు ఆత్మావలోకనం చేసుకోలేక పోతుంటే పద్మడనే నాగరాజును ఆ విషయము గూర్చి అడుగమని ఒక హితుడు చెప్పాడు. "సర్వభూతాలు ఒక్కటే" అనే విషయాన్ని పద్మడు ఇతనికి చెప్పాడు. (భారతం)

౭. ఒకముని బ్రహ్మహృదయం నుండి పుట్టిన వాడు. ఇతని భార్యదితి, కూతురు దేవపర్ణిని ఈమెను విశ్వహోబ్రహ్మకిచ్చి వివాహం చేస్తాడు. విష్ణువు తన భార్యను చంపాడని అతడిని మానవుడిగా పుట్టమని శపిస్తాడు. దానితో విష్ణువు రాముడుగా జన్మిస్తాడు. (రామాయణము)

ఇతడు "ఖ్యాతిని' వివాహమాడి దాత- విదాతలకు జన్మనిస్తాడు. ఇతనికి "పులోమ" అను భార్య కలదు. ఆమెను పులోముడనెడివాడు ఎత్తుకుపోతాడు. కాని ఇతని కుమారుడు చ్యవనుడు కళ్లు తెరవడంతో పులోముడు భస్మమైపోతాడు.

**2. ఓం కారం (ఏకాక్షరం)** ఓం కారమంటే ప్రణవం, సారవంతమైన ఒకే ఒక అక్షరం, ఇతరములైన నూరువాక్యములను ఉచ్ఛరించడం కంటే సారవంతమైన ఈ ఒక్క అక్షరాన్ని ఉచ్ఛరించడంలోనే ఎంతో మేలున్నది. సమస్త మంత్రములకు అది ప్రాణము. అందువల్లనే అది ప్రణవం. సమస్త వేదములకు అది సారము. కనుకనే అది పరబ్రహ్మ వాచకమైంది. అది దానిని జపించు వాని యొక్క పాపములను పోగొట్టును. అర్థమును బాగుగా మననం చేసుకోగలిగిన వానికి మోక్షాన్ని ప్రసాదించును. ఆ కారణంగానే సమస్తమైన వేదములు, శాస్త్రములు ఈ ప్రణవమును గూర్చి విశేషంగా ప్రశంశించినవి, వాక్కులన్నింటిలోను అది సారభూతమైన వాక్కు అయినందున ఈ ఏకాక్షరం సాక్షాత్ భగవస్వరూపమై వెలయుచున్నది.

**3. జపయజ్ఞము :** జపము కూడా ఒక యజ్ఞమే అది పవిత్రమైంది. చిత్తశుద్ధికి అది క్రతువువంటిది. మనశాస్త్రాలలో అనేక యజ్ఞాల గురించి చెప్పబడింది. వాటిని ఆచరించడం ఎంతో ప్రయాసతో కూడిన పని. అందువలన అతిసులభమైన, అందరికీ అందుబాటులో వున్నదై ఆచరణ సాధనమై, ఏ విధమైన ప్రయాసలేనట్టిదైన ఈ జపయజ్ఞము యజ్ఞములన్నింటిలోను మేటిదై యున్నది. అందువల్లనే భగవానుడు దానిని తన రూపముగా అభివర్ణించాడు.

**4. హిమాలయము :** భారతదేశానికి ఉత్తరాన వున్న పర్వత రాజు. ప్రపంచములోని అన్ని పర్వతముల కంటే అతి ఎత్తైన పర్వతం ఇది. ఈయన కుమార్తె పార్వతి. ఈమె సాక్షాత్ ఆపరమశివునికి భార్య అవుతుంది.

అశ్వత్థ స్సర్వవృక్షాణాం
దేవర్షీణాం చ నారదః
గంధర్వాణాం చిత్రరథః
సిద్ధానాం కపిలో మునిః శ్లో - 26

నేను
వృక్షములలో రావిచెట్టును
దేవర్షులలో నారదుడను
గంధర్వులలో చిత్రరథుడను
సిద్ధులలో కపిలమునిని

1. **అశ్వత్థవృక్షము** : అశ్వత్థవృక్షము గురించి స్కందపురాణంలో ఈవిధంగా తెలియజేయబడింది.

1. "మూలేవిష్ణుః స్థితోనిత్యం స్కన్దేకేశవ ఏవచ నారాయణస్తు శాఖాను పత్రేసు భగవాన్హరిః"
2. ఫలేత్సుతో నసందేహ సర్వేదేవై, సమన్వితః
3. స ఏవ విషుర్ద్రుమ ఏవమూర్తా
మహాత్మాభిః సేవితపుణ్యమూలః
యశ్శాస్రయః పాపసహస్రహన్తా
భవేన్నృణాం కామదుమో గుణాఢ్యః

(స్కందపురాణం- నాగరఖండం 274-41, 42, 43)

తా॥ రావిచెట్టు మూలమందు విష్ణువును, బోదెయందు కేశవుడిని, కొమ్మలలో నారాయణుడిని, ఆకులలో శ్రీహరిని, ఫలములందు అచ్యుతుడిని, కలిగి సమస్త దేవతలతో విరాజిల్లుచుండును. ఇది చెట్టు ఆకారమును ధరించి వచ్చిన విష్ణువే! అందువలననే మహనీయులందరు ఈ అశ్వత్థవృక్షమును సేవించెదరు. దానిని ఆశ్రయించిన వారి పాపజాలము నంతటిని ఇది నశింపజేయును. అంతేకాకుండా ఈ వృక్షము మానవుల కోరికలను నెరవేర్చునదిగాను సద్గుణములను, పుణ్యములను ఒసంగునదిగాను ప్రశంసింపబడుచున్నది. అందువలననే రావిచెట్టుకు ప్రదక్షిణ, పూజాదికార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. మరొక ముఖ్యమైన విషయము ఏమిటంటే ఔషధపరంగా రావి చెట్టుకు గొప్ప ప్రాముఖ్యత వున్నది.

2. **చిత్రరథుడు :** దేవగంధర్వుడు. అర్జునుని చేతిలో ఓడి అతనికి చాక్షుషీ విద్యను నేర్పినవాడు. ఇతనికి మరొకపేరు అంగారపర్ణుడు అని కలదు.

3. **కపిలముని :** విష్ణ్వంశతో పుట్టిన వాడు. సాంఖ్యశాస్త్రముల బోధించినవాడు.

ఉచ్చైశ్శ్రవస మశ్వానాం
విద్ధి మామమృతోద్భవం
ఐరావతం గజేంద్రాణాం
నరాణాం చ నరాధిపమ్ శ్లో - 27

గుఱ్ఱములలో అమృతముతో
పాటుపుట్టినట్టి ఉచ్చైశ్శ్రవమును
నేను ఏనుగులలో ఐరావతముగాను
నరులలో రాజుగాను నన్ను గూర్చి తెలుసుకొనుము

1. ఉచ్చైశ్రవము - 2. ఐరావతము క్షీరసాగరమధన సమయములో ఈ ఉచ్చైశ్రవము ఐరావతము (ఏనుగు) పాలసముద్రము నుండి జన్మించినది.

ఆయుధానామహం వజ్రం
ధేనూనామస్మి కామధుక్
ప్రజనశ్చాస్మి కందర్పః
సర్పాణామస్మి వాసుకిః శ్లో - 28

ఆయుధములలో నేను
వజ్రాయుధమును
గోవులలో నేను కామధేనువును
నేను సంతాన కరుడగు మన్మధుడను
సర్పములలో వాసుకిని, నేనే

అనంతశ్చాస్మి నాగానాం
వరుణో యాదసామహం
పితౄణామర్యమా చాస్మి
యమ స్సంయమతా మహమ్ శ్లో - 29

నాగులలో నేను అనంతుడను
జలదేవతలలో నేను వరుణుడను
పితృదేవతలలో నేను ఆర్యముడను
సంయమనము చేయువారిలో నేను
యముడను అయి వున్నాను

28వ శ్లోకములో తెలుపబడిన "వాసుకి" అనే సర్పమును దేవతలు క్షీరసాగర మధన సమయంలో కవ్వపుతాటిగా ఉపయోగిస్తారు. భూభారమును వహించే ఏడుగురిలో వాసుకి ఒకరు.

ఈ 29వ శ్లోకంలో "అనంతనాగుడు" వేయిశిరస్సులు గల నాగుసర్పము. ఈ అనంతనాగుని శిరస్సులపై భగవాన్ విష్ణువిశ్రాంతి తీసుకొనునని శాస్త్రాలు ప్రబోధిస్తున్నాయి.

**యముడు** : దిక్పాలకులలో ఒకరు. దక్షిణదిక్కుకు అధిపతి. సంయమనము కలవాడు అంటే ధర్మాచరణము కలవాడు.

**వరుణుడు** : దిక్పాలకులలో ఒకరు. పశ్చిమదిక్కునకు అధిపతి. జలరాశులకు అధిపతి. అందువలన జలదేవత అని పిలువబడుచున్నాడు.

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం
కాలః కలయతా మహం
మృగాణాం చ మృగేంద్రోహం
వైనతేయశ్చ పక్షిణామ్ శ్లో - 30

*దైత్యుల (రాక్షసులు)లో నేను*
*ప్రహ్లాదుడను, గణితశాస్త్రంలో*
*కాలమును నేనే! మృగములలో*
*సింహమును నేను. పక్షులలో*
*గరుత్మంతుడను నేను అయివున్నాను*

1. **ప్రహ్లాదుడు** : అసుర వర్గమునకు చెందిన హిరణ్య కశిపుని కుమారుడు. అసురులు అంటే రాక్షసులు, రాక్షసవంశములో జన్మించినను ప్రహ్లాదుడు విష్ణుభక్తుడు. అతని తండ్రి విష్ణువుకు వ్యతిరేకి, హిరణ్య కశిపుడు ప్రహ్లాదునకు శుక్రాచార్యుని కుమారులగు చండామార్కులచేత చదువు చెప్పించెను. అచిరకాలములోనె అతడు శాస్త్రములనన్నింటిని నేర్చుకొనెను. తోటి విద్యార్థులకు వేదాంతమును, విష్ణుభక్తిని గూర్చి ప్రబోధించేవాడు. అతడెంతవరకు చదివాడో దానిని గూర్చి పరీక్షింపదలచిన తండ్రి అతనిని తన తొడపై

కూర్చుండబెట్టుకొని ముద్దాడి ఒక పద్యమును చదువమనగా జవాబుగా ప్రహ్లాదుడు పద్యమునిట్లు చెప్పెను.

క॥ చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థముఖర శాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్లఁజదివితిఁదండ్రీ!

సీ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులుచూడ్కులు శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి

తే॥ దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
దండ్రి! హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి

సీ॥ కంజాక్షునకుగాని కాయంబు కాయమే? పవన గుంభిత చర్మభస్త్రిగాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వడిమే. ఢమఢమ ధ్వనితో క్ర ఢక్క గాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే? తరుశాఖ నిర్మిత దర్విగాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే? తను కుడ్య జాల రంధ్రములు గాక

ఆ॥ చక్రిచింత లేని జన్మంబు జన్మమే?
తరళ సలిల బుద్బుదంబు గాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే?
పాదయుగము తోడి పశువు గాక

సీ॥ సంసారజీమూత సంఘంబు విచ్చునే? చక్రిదాస్యప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్ని లాఱునే? విష్ణుసేవామృత వృష్టి లేక
సర్వంకషాఘమౌ జలరాసు లింకునే? హరి మనీషా బడబాగ్ని లేక
ఘన విపద్గాఢాంధకారంబు లణఁగునే పద్మాక్షు నుతి రవిప్రభలు లేక

తే॥ నిరుపమాపునరావృత్తి నిష్కళంక
ముక్తినిధిఁ గానవచ్చునే? ముఖ్యమైన
శార్ఙకోదండ చింతనాంజనము లేక
తామర సగర్భునకు నైన దానవేంద్ర!
అని పాడెను.

ప్రహ్లాదుని విష్ణుభక్తి ఇట్టిది, భక్తియొక్క పరాకాష్ఠస్థితిలో భక్తుడు- భగవంతుడు ఇద్దరు ఒకటే అవుతారు. అందువల్లనే భగవానుడు నేనే ప్రహ్లాదుడుని అన్నాడు. భక్తికి జాతి, మత, లింగ, వర్గ భేదాలు అనే విచక్షణ వుండవు.

**కాలము** : ఇక కాలాన్ని గురించి విచారిస్తే అది మహాపరము పవిత్రమైంది. కాలాన్ని వ్యర్థము చేయకూడదు. దుర్వినియోగపరచకూడదు. కాలమే భగవానుడు.

వైనతేయశ్చ పక్షిణా : ఈ 30వ శ్లోకం చివరి పాదంలో గరుత్మంతుడు మొదలు గాగల ఇతర ప్రాణికోట్లను గూర్చి తెలపడం జరిగింది.

గరుత్మంతుడు ఒక పక్షి- హనుమంతుడు వానరుడు- గజేంద్రుడు ఒక మృగము అయినను వీరందరు తమ తమ. అచంచలమైన భక్తి చేతను, నిరంతర దైవస్మరణ చేతను సాక్షాత్ భగవత్ స్వరూపులు కాగలిగారు. ఈ విధముగా పశుపక్ష్యాదులే భక్తి చేత ముక్తి నొందగా జ్ఞానమున్న మనిషి ఎందుకు ముక్తి నొందకూడదు? అన్నది ప్రశ్న కనుక ఈ శ్లోకం మనకు బోధిస్తున్న దేమంటే సోమరితనాన్ని వీడి, కాలాన్ని వృధా పుచ్చక మహనీయులైన వారి నుండి మహద్విషయాలు తెలుసుకొని భూతకోటి సంక్షేమానికి యథాశక్తిగా కృషి చేస్తు మానవత్వాన్ని సార్థకము చేసుకొని మోక్షపదవిని అలంకరించమని.

పవనః పవతామస్మి
రామశ్శస్త్రభృతా మహం
ఝషాణాం మకరశ్చాస్మి
స్రోతసామస్మి జాహ్నవీ  శ్లో - 31

పవిత్రమొనర్చువారిలో
నేను వాయువును
ఆయుధధారులలో నేను
శ్రీరాముడను చేపలలో
నేను మొసలిని. నదులలో
గంగానదిని నేనే అయివున్నాను

1. **వాయువు** : అష్టదిక్పాలకులలో ఒకరు. పూర్వజన్మలో పూతాత్ముడనబడే బ్రహ్మవేత్త. శివుడు ఈయనకు దిక్పత్వమును ఇచ్చెను పరబ్రహ్మను సమీపించడము వలన దేవతలలో శ్రేష్ఠుడు.

2. **శ్రీరాముడు** : విష్ణువు యొక్క ఏడవ అవతారం కోసలదేశాధీశుడైన అయోధ్యానగర వాసి దశరథమహారాజుకు-కౌసల్య ద్వారా శ్రీరామచంద్రుడు జన్మిస్తాడు. రావణ సంహారము కొరకు "కోదండం" అనే ఆయుధాన్ని ధరిస్తాడు. అందుకనే

ఆయనకు కోదండపాణి- కోదండ రాముడు అను పేర్లు వచ్చాయి. రాముని అవతారం తరువాతి అవతారమే కృష్ణావతారం. అందువలన రామకృష్ణులు ఇరువురును ఒకటే.

3. **గంగానది :** అది అతి పవిత్రమైంది. విష్ణువు పాదపద్మములనుండి జనించింది కనుక అది సాక్షాత్ ఆశ్రీమహావిష్ణువే.

సర్గాణామాదిరంతశ్చ
మధ్యం చైవాహమర్జున
అధ్యాత్మవిద్యా విద్యానాం
వాదః ప్రవదతామహమ్ శ్లో - 32

అర్జునా!
సకల సృష్టులకు
ఆదిమధ్యాంతములను నేనే
విద్యలలో ఆధ్యాత్మిక విద్యయు
వాదించు వారియొక్క వాదమును నేనే

అక్షరాణా మకారోస్మి
ద్వంద్వస్సామాసికస్య చ
అహమేవాక్షయః కాలో
ధాతాహం విశ్వతోముఖః శ్లో - 33

అక్షరములలో అకారమును
సమాసములలో ద్వంద్వ
సమాసమును, అనంతమైనకాల
మును, అనంతముఖములు
గలధాతను నేనే అయి వున్నాను

మృత్యుస్సర్వ హరశ్చాహ
ముద్భవశ్చ భవిష్యతాం
కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం
స్మృతిర్మేధా ధృతిః క్షమా శ్లో - 34

సర్వంసంహారకరుడనైన
మృత్యువును నేనే జన్మించ
బోవు వారలకు జన్మమును నేనే
స్త్రీలలో కీర్తి, సంపద, వాక్కు
స్మృతి, బుద్ధి, ధైర్యము, ఓర్పు నేనే

బృహత్సామ తథాసామ్నాం
గాయత్రీ ఛందసా మహం
మాసానాం మార్గశీర్షోహం
ఋతూనాం కుసుమాకరః — శ్లో - 35

సామవేదములో బృహత్సామమును
నేనే, ఛందస్సులలో గాయత్రినినేనే
మాసములలో మార్గశీర్షమును నేనే
ఋతువులలో వసంతృతువును నేనే అయివున్నాను

ఈ క్రింది కారణములవలన మార్గశీర్షమాసము శ్రేష్ఠత్వమును కలిగియున్నది.

1. మహాభారతకాలములో సంవత్సరం మార్గశీర్షమాసంతో ప్రారంభమయ్యేది (మహాభారతం అనుశాసన పర్వము 106-109 అధ్యాయములు) అందువలన మాసములన్నింటిలో అది మొదటిది.
2. ధనుర్మాసకాలం అతి పవిత్రమైంది. ఆకాలంలో వ్రతోపవాసాలు సలిపే వారికి మంచిఫలితాలు చేకూరతాయని శాస్త్రాలు చెబుతున్నాయి.
3. అది కొత్త పంట చేతికి వచ్చే సమయము. ఆ సమయములో అందరివద్ద ధాన్యం పుష్కలంగా వుంటుంది.
4. వాల్మీకి రామాయణంలో మార్గశీర్ష మాసమును సంవత్సరమునకు భూషణముగ వర్ణించబడింది.
5. భగవద్గీత ఈ మార్గశీర్షమాసమునందే ఆవిర్భవించింది. (మార్గశిరశుద్ధ ఏకాదశినాడు) అంటే మహాభారతయుద్ధం మార్గశీర్షమాసములో ఆరంభమైంది.
6. అవతార పురుషుడైన దత్తాత్రేయుడు ఈ మార్గశీర్ష మాసమునందే జన్మించారు (మార్గశిరశుద్ధ పౌర్ణమినాడు)
7. వాతావరణము చల్లగా వుండుటవలన మానవుల హృదయములు కూడ ఉల్లాసంగా వుంటాయి.

**ఋతునాం కుసుమాకరః** : అంటే అదివసంత ఋతువు. ఈ ఋతువునందు చెట్లన్నియు చిగిర్చి ప్రకృతి శోభాయమానముగా వుండును. అట్టి సమయంలో వాతావరణము కూడా సమశీతలముగా వుండి అందరికీ ఆహ్లాదాన్ని కలుగుజేస్తుంది. విష్ణువతారాలలో ఏడవ అవతారమైన శ్రీరామచంద్రుడు ఈ వసంతఋతువునందే జన్మించాడు.

ద్యూతం ఛలయతామస్మి
తేజస్తేజస్వినామహమ్
జయోఽస్మి వ్యవసాయోఽస్మి
సత్త్వం సత్త్వవతామహమ్ శ్లో - 36

మోసకారులయొక్క జూదమును
నేనే, తేజోవంతులయొక్క
తేజమునూ నేనే, జయశీలుర
జయమును,. ప్రయత్నమును నేనే
సాత్వికుల యొక్క సత్వగుణమును
నేనే అయి వున్నాను

ప్రపంచములోని సమస్త పదార్థముల యందును, మంచి వాని యందును చెడ్డవానియందును వుండే అస్థిత్వము భగవానునిదే! ఆయన సాన్నిధ్యమే సమస్త పదార్థములకు, క్రియలకు శక్తిని ప్రసాదించుచున్నది. ఈ సత్యాన్ని నిరూపించుటకే భగవానుడు ఈ విభూతియోగములో దేవతలను, దానవులను, జంతువులను, జడపదార్థములను, వాటిలో గల కొన్ని క్రియలను కూడా స్పష్టముగ పేర్కొనెను, సంక్షేపించి చెప్పటవలన ఒక్కొక్క తరగతికి ఒక్కొక్క దానిని గూర్చి చెప్పతూవెళ్లాడు. ఏ వస్తువును జూచినను ఏ క్రియను పరికించినను అచ్చట సాక్షాత్ భగవానుని యొక్క అస్థిత్వమును భావన చేయవలెను. ఈ కారణంగానే మోసకారుల యొక్క జూదమును నేనే అని భగవానుడు ప్రకటించాడు.

"పాండవులలో నేను అర్జునుడను మునులలో నేను వ్యాసుడను" అని ఈ శ్లోకమునందు శ్రీకృష్ణుడు ప్రవచించినందుననే మహర్షి వినోబా 21-2-1932లో ధూళియా జైల్లో రాజకీయ ఖైదీలనుద్దేశించి గీతపై ప్రవచిస్తూ ఈ విధంగా అన్నారు "గీతను గానంచేసినవాడు శ్రీకృష్ణుడు -వినినవాడు అర్జునుడు, రచించినవాడు వ్యాసుడు గనుక చెప్పిన వాడు- వినినవాడు- వచించిన వాడు అందరూ శ్రీకృష్ణుడే" అని వివరించారు. ఈ విధముగా వారి ముగ్గురిలో అద్వైతం ఉత్పన్నమై వారు ఏకరూపమును పొందినారని ప్రకటించారు.దీనిని బట్టి వినోబా ఎంతటి యోగి యో అవగతమౌతున్నది.

**శుక్రాచార్యుడు :** ఇతడు రాక్షసుల గురువు. భృగు మహాముని కుమారుడు. శుక్రాచార్యుణ్ణి ఉషనాకవి యని పురాణాలు తెలుపుతున్నాయి.

# శ్రీకృష్ణుని వంశవృక్షము

(ఈ వంశం మూలపురుషుడు వృష్ణి అందువలన శ్రీకృష్ణుని వంశానికి వృష్ణి వంశం అనేపేరు వచ్చింది)

వృష్ణి




వృష్ణి వంశానికి పూర్వపు వంశం యదువంశము. యదువు సంతానాన్ని యాదవులంటారు.

వృష్ణీనాం వాసుదేవోఽస్మి
పాండవానాం ధనంజయః
మునీనామప్యహం వ్యాసః
కవీనాముశనా కవిః   శ్లో - 37

వృష్ణివంశీయులలో నేను
వసుదేవుని కుమారుడను
పాండవులలో అర్జునుడను
మునులలో వ్యాసుడను
కవులలో శుక్రాచార్యుడను
నేనే అయివున్నాను

దండో దమయతామస్మి
నీతిరస్మి జిగీషతాం
మౌనం చైవాస్మి గుహ్యానాం
జ్ఞానం జ్ఞానవతామహం   శ్లో - 38

నేను
దండించు వారియొక్క
దండమును, జయశీలుర
యొక్క నీతిని నేను
నేను రహస్యములలో
మౌనాన్ని జ్ఞానవంతుల
లోని జ్ఞానమును అయివున్నాను

యచ్చాపి సర్వభూతానాం
బీజం తదహమర్జునః
న తదస్తి వినా యత్స్యా
న్మయా భూతం చరాచరమ్   శ్లో - 39

అర్జునా!
సకల భూతములకుబీజము
నేనే, ఈ చరాచర స్వరూపమైన
భూతసమూహమునందు నేను
మినహా మరేమియును లేదు

[illegible]

అర్జునా!
నా యొక్క దివ్యవిభూతులకు
అంతము లేదు. నా విభూతుల
యొక్క ఈ వివరణమును
ఇంతవరకు నీకు సంక్షిప్తము
గా తెలిపితిని

యద్యద్విభూతిమత్సత్త్వం
శ్రీమదూర్జితమేవ వా
తత్తదేవావగచ్ఛ త్వం
మమ తేజోంశసంభవమ్   శ్లో - 41

విభూతి యుక్తమును
శాంతియుతమును
ఉత్సాహవంతమును
అగు వస్తువు ఏది కలదో
అది నా యొక్క అంశము
వలన కలిగిన దానినిగా నీవెరుగుము

అథవా బహునైతేన
కిం జ్ఞాతేన తవార్జున!
విష్టభ్యాహమిదం కృత్స్న
మేకాంశేన స్థితో జగత్   శ్లో - 42

అర్జునా!
విశేషమైన నా విభూతులను
తెలియుట వలన నీకు
కలిగే లాభం ఏమిటి?
ఈ సమస్త జగత్తును
అంతటిని ఒక్క అంశ
చేతనే నేను వ్యాపించియున్నాను

మహర్షి వినోబా 24-4-32నాడు ధూళియా జైలులో ఈ అధ్యాయం తమ ప్రసంగంతో ముగిస్తూ సుందరమైన మాటలలో ఈవిధంగా తెలిపారు.

"స్థూలము, సూక్ష్మం, సరళము, మిశ్రమము, సరళాక్షరములు, సంయుక్తాక్షరములు అన్నియు నేర్చుకొనుము. చివరకు పరమేశ్వరుడు లేని స్థానమే లేదను అనుభవమును పొందుము. అణురేణువుల యందున్నవాడుకూడా అతడే. చీమ మొదలు బ్రహ్మాండమువరకు సర్వము పరమాత్మతో నిండియున్నది. ఆయన సమస్తమును ఒకే రకముగ కనిపెట్టి చూచు కృపాళువు. జ్ఞానమూర్తి, వత్సలుడు, సమర్థుడు, పావనుడు, సుందరుడు అయిన పరమాత్మ నలుదిశల సర్వత్ర నిలిచియున్నాడు.

ఈ విధంగా ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన
శ్రీమద్భగవద్గీత యందలి విభూతియోగమను పేరుగల
పదవ అధ్యాయము సమాప్తము గావించబడింది.





# గీతా సంహిత

## అధ్యాయము పదకొండు | విశ్వరూప సందర్శన యోగము

ఈ విశ్వములోని అనంతవస్తువులలో వ్యాపించియున్న పరమాత్మను మనమెట్లు గుర్తించవలెనో, మన కన్నులకు అగుపడుచున్న ఈ విరాట్రూపమును గూర్చిమనమెట్లు హృద్గతము చేసుకొనవలెనో వెనుకటి అధ్యాయములో విపులముగ తెలుసుకొంటిమి.

మొదటస్థూలము, తదుపరి సూక్ష్మము, మొదట సరళము, తదుపరి జటిలము ఈవిధంగా సమస్త వస్తువులలోను వున్న భగవంతుడిని సాక్షాత్కారము చేసుకొనవలెనని, ఎడతెగని అభ్యాసము వలన సమస్త విశ్వమును ఆత్మస్వరూపముగ చూచుట నేర్చుకొన వలెనని కూడా మనం వెనుకటి అధ్యాయంలో చర్చించుకున్నాము.

ఇపుడిక "విశ్వరూప సందర్శన యోగము" అనబడు ఈ పదకొండవ అధ్యాయమున భగవంతుడు తన ప్రత్యక్షరూపమును చూపించి ఆయన తన పరమ దయారసము (కృపారసము)ను అర్జునునిపై కురిపించబోవు చున్నాడు.

"ప్రభూ! నీ ప్రభావమును ప్రకటించు రూపమును చూడగోరుచున్నాను. నాకు నీ ఆ రూపమును చూపవా? అని అర్జునుడు ప్రార్థించాడు. అర్జునుడు భగవానుని కోరుకున్న దర్శనమిది. ఇదేవిశ్వరూప సందర్శనము.

"విశ్వము, జగత్తు" అను మాటలు సాధారణముగ మనము వాడే మాటలే. ఈ భూమండలం విశ్వంలో ఒక చిన్న భాగము మాత్రమే. దానిని గురించి అయినను మనము సమగ్రముగా తెలుసుకోలేకున్నాము. ఈ భూమండలము ఇంతవిశాలముగ అగుపడుచున్నను సమస్త విశ్వమును దృష్టిలో పెట్టుకొని చూచినచో ఈ భూమండలము అల్పమైనదని గ్రహించగలము. రాత్రివేళ కొంచెము దృష్టిని ఆకాశమువైపు నిలిపి చూచినచో అసంఖ్యాకము

లైన గోళములు మనకు అగుపడును. విశాలాకాశమున సుందరములైన రంగురంగుల చిన్న చిన్న పూలవలె మినుకు మినుకుమను లక్షలకొలది నక్షత్రముల స్వరూపము మనకు కనుపించును. ఈ చిన్న చిన్న నక్షత్రాలు మహాప్రచండమైనవి. వాటిలో లెక్క లేనన్ని సూర్యమండలములు ఇమిడి వున్నవి. రసమయములై, తేజోమయములై, ప్రకాశించు గోళరాసులు అవి. ఈ అనంతరాసుల లెక్కను ఎవరు తేల్చగలరు! వీటికి దరీ (ఆది)లేదు. అంతము లేదు. మనసాధారణ నేత్రములకే అవి వేలకొలదిగ అగుపడును. దుర్భిణివేసి చూచినచో అవి కోట్లకొలదిగ అగుపడును. దీనికి అంతం ఎక్కడున్నదో, అదెట్లుండునో తెలుసుకొనుట మహాకష్టసాధ్యం, పైన, క్రింద, సర్వత్రను వ్యాపించియున్న అనంతసృష్టిలో ఒక చిన్న భాగమును భూమండలము అంటున్నాము. కాని ఈ చిన్నది కూడా ఎంతో విశాలమైనదిగి కనబడుచున్నది.

ఈ విశాల సృష్టి పరమేశ్వరుని రూపము యొక్క ఒక వైపుమాత్రమే. ఇకదాని రెండవ వైపును కూడా విచారిద్దాము . అదికాలము. ఇంతవరకు గడిచిన కాలమును ఐతిహాసికముగా ఎంతచూచినను పది, పదిహేను వేల సంవత్సరాలకు మించదు. భవిష్యత్తు మన ఊహకే అందదు. చారిత్రక కాలము పది, పదిహేనువేల ఏండ్లు అయినా మన జీవిత పరిమితి నూరేండ్లు దాటుట కష్టము. నిజానికి కాలము అనునది అనాది. అనంతము, గడచిన కాలానికి హద్దు, పద్దులు లేవు. ఇక గడువనున్న కాలము మన ఊహకు అందనిది. అనంత విశ్వముతో పోల్చిన భూమండలం ఎంత అల్పమో, అనంతకాలములో ఈపది, పదిహేను వేల సంవత్సరములు అంతే అల్పములైనవి. భూతకాలము అనాది, భవిష్యత్తు అనంతం. మనం చూస్తున్న ఈ కొద్ది పాటి వర్తమానకాలం మనము మాటలాడుకుంటుండగానే భూతకాలములోనికి వెళ్లిపోతుంది. ఇదుగో! ఇది వర్తమానకాలము అని అంటుండగానే అది భూతకాలములో విలీనం అయిపోతున్నది. ఇట్లు మన వర్తమాన కాలము అత్యంత చపలచిత్తమైనది. ఈ విధముగ కాలమను మహానది అఖండముగ ప్రవహించుచున్నది. కాని దాని ఆద్యంతములు మనకు తెలియవు. ఈ ప్రవాహము యొక్క అత్యల్పమైన మధ్య భాగము మాత్రము మనకు కనుపిస్తున్నది.

ఈ విధముగ విశ్వము యొక్క రెండవ వైపు అయిన కాలము అనంతత్వమును గూర్చి తెలియజేస్తున్నది. దీనిని బట్టి సృష్టి యొక్కఆది-అంతము ఊహకందకుండా యున్నదని తేలుతున్నది.అట్టి సృష్టి క్రమములో ముల్లోకములలోని, భూత, భవిష్యత్, వర్తమానములను, పైన, క్రిందను, నడుమను సర్వత్రా వ్యాపించియున్న పరమేశ్వరుని యొక్క విరాడ్రూపమును ఒక్క సారిగా చూడవలెనన్న ఇచ్ఛ (కోరిక) అర్జునునిలో బయలు దేరింది. ఈ ఇచ్ఛనుండియే "విశ్వరూప సందర్శన యోగం" అనబడే ఈ పదకొండవ అధ్యాయం ఆవిర్భవించింది.

అందువలననే తనను ఏయేరూపములలో చింతన చేయవలెనో ఆయారూపములను గూర్చి భగవానుడు

“నేను ఆదిత్యులలో విష్ణువును
జ్యోతులయందు మరీచిని
తారలయందు చంద్రుడును
వేదములయందు సామవేదమును
దేవతలయందు ఇంద్రుడను,
ఇంద్రియములయందు  మనస్సును
రుద్రుల యందు శంకరుడను
యక్షుల యందు, రాక్షసులయందు కుబేరుడను
వసువులయందు అగ్నిహోత్రుడను,
పర్వతముల యందు మేరు పర్వతమును
రాజపురోహితులలో బృహస్పతిని
సేనాధిపతులలో కుమారస్వామిని
మహర్షులలో భృగుమహర్షిని
వాక్కులలో ఏకాక్షరమగు “ఓంకారము”ను,
యజ్ఞములలో జపయజ్ఞమును
స్థావరములలో హిమాలయ పర్వతమును,
వృక్షములలో రావిచెట్టును, సరస్సులలో సాగరుడను
దేవర్షులలో నారదుడును
గంధర్వులలో చిత్రరథుడను సిద్ధులలో కపిలమునిని నేనె
అశ్వములలో ఉచ్ఛైశ్రవమును
ఏనుగులలో ఐరావతమును నరులలో రాజును
ఆయుధములలో వజ్రాయుధమును
గోవులలో కామధేనువును, సంతానకరుడగు మన్మధుడను,
సర్పములలో వాసుకిని, నాగులలో
అనంతుడను, జలదేవతలలో
వరుణుడను, పితృదేవతలలో ఆర్యముడను
సంయమనము చేయువారిలో యముడను
దైత్యులలో ప్రహ్లాదుడను, గణిత శాస్త్రములలో కాలమును

మృగములలో సింహమును
పక్షులలోగరత్మంతుడను
పవిత్రము చేయువారిలో వాయువును
ఆయుధధారులలో శ్రీరామచంద్రుడను
నదులలో గంగానదిని విద్యలలో ఆత్మవిద్యను
వాదించువారి వాదమును, అక్షరములలో అకారమును
సమాసములో ద్వంద్వసమాసమును
సర్వసంహారకుడైన మృత్యువును
జన్మించబోవు వారల జన్మలకు జన్మమును
స్త్రీలలోని కీర్తి, సంపద, వాక్కు, స్మృతి, బుద్ధి
ధైర్యము, ఓర్పును నేను, సామవేదములో బృహత్సామమును
ఛందస్సులలో గాయత్రిని
మాసములలో మార్గశీర్షమును
ఋతువులలో వసంతఋతువును
మోసకారుల యొక్క జూదమును
తేజోవంతుల యొక్క తేజమును
జయశీలుర యొక్క జయమును
సాత్వికుల యొక్క సత్వగుణమును
వృషివంశములో శ్రీకృష్ణుడను
పాండవులలో అర్జునుడను
మునులలో వ్యాసుడను
కవులలో శుక్రాచార్యుడను"

అని ప్రకటించి అర్జునునకు దివ్యదృష్టిని ప్రసాదించి తన దివ్యరూపం చూడవలెననుకొన్న అర్జునుని కోరికను సఫలం చేశాడు భగవానుడు. ఈ దివ్యరూపము యొక్క భవ్యవర్ణనే ఈ పదకొండవ అధ్యాయం అంతా.

1. విశ్వరూపమును ప్రదర్శించవలసినదిగా భగవానుని అర్జునుడు ప్రార్థించుట *(1 నుండి 4వ శ్లోకం వరకు)*
2. భగవానుడు విశ్వరూపమును గూర్చి వర్ణించుట *(5 నుండి 8వ శ్లోకం వరకు)*
3. సంజయుడు ధృతరాష్ట్రునకు విశ్వరూపమును గూర్చి వర్ణించిచెప్పుట *(9 నుండి 14వ శ్లోకం వరకు)*
4. అర్జునుడు భగవానుని యొక్క విశ్వరూపమును దర్శించుట దానిని స్తుతించుట *(15నుండి 31వ శ్లోకం వరకు)*

5. భగవానుడు తనశక్తిని వెల్లడించుచు అర్జునుని యుద్ధమునకై ప్రోత్సహించుట
*(32నుండి 34వ శ్లోకం వరకు)*

6. భగవానుని విశ్వరూపమును దర్శించి భీతిల్లిన అర్జునుడు భగవానుని స్తుతించుట తిరిగి చతుర్భుజరూపము ధరించమని ప్రార్థించుట. *(35నుండి 46శ్లోకము వరకు)*

7. భగవానుడు విశ్వరూప సందర్శన మహిమను గూర్చి చెప్పుట తిరిగి సౌమ్య రూపమును ధరించుట. *(47నుండి 50వ శ్లోకం వరకు)*

8. అనన్యభక్తి వలననే విశ్వరూపసందర్శనం సాధ్యపడగలరని చెప్పుట
(51 నుండి 55వరకు)

ఈ అధ్యాయములోని శ్లోకాలకు తెలుగు అనువాదంతోపాటు మహాత్మాగాంధీగారి ఆంగ్ల అనువాదం కూడా ఇవ్వబడుతోంది.

భగవానుని ఈ విధంగా క్రింది నాలుగు శ్లోకములు ద్వారా అర్జునుడు ప్రార్థిస్తున్నాడు.

మదనుగ్రహాయ పరమం
గుహ్య మధ్యాత్మ సంజ్ఞితం
యత్త్వయోక్తం వచస్తేన
మోహోయం విగతో మమ శ్లో- 1

*ప్రభూ! కృష్ణా!*
*నన్ను అనుగ్రహించుటకై*
*నీవు ప్రబోధించిన ఉత్తమము*
*రహస్యము అయిన ఆత్మవిద్యా*
*ప్రభావము వలన నామోహం నశించింది*

Out of Thy grace towards me
Thou hast told me the supreme mystery revealing
the knowledge of the Supreme;
it has banished my delusion.

భవాప్యయౌ హి భూతానాం
శ్రుతౌ విస్తరశోమయా
త్వత్తః కమలపత్రాక్ష!
మహాత్మ్య మపిచావ్యయం శ్లో -2

కృష్ణా!
ప్రాణులయొక్క ఉత్పత్తి, నాశముల
గూర్చి నీవలన వింటిని. అవ్యయమైన
నీ యొక్క మహాత్మ్యమును కూడా వింటిని

Of the origin and destruction of beings
I have heard from Thee in full detail,
as also of Thy imperishable majesty,
O Kamala- patraksha.

ఏవ మేత ద్యథాత్థత్వం
ఆత్మానం పరమేశ్వర!
ద్రష్టు మిచ్ఛామి తే రూపం
ఐశ్వర్యం పురుషోత్తమః   శ్లో - 3

పరమేశ్వరా!
నిన్ను గురించి నీవు చెప్పినదంతయు
సరియైనదేనని నేను విశ్వసించుచున్నాను
పురుషోత్తమా! నీ యొక్క ఈశ్వర
సబంధమైన విశ్వరూపమును
నేనిపుడు చూడదలుచుచున్నాను

Thou art indeed just as Thou hast
described Thyself,
Parameshvara! I do crave to behold,
now, that form of
Thine as Ishvara.

మన్యసే యది తచ్ఛక్యం
మయా ద్రష్టుమితి ప్రభో!
యోగేశ్వర! తతో మే త్వం
దర్శయాత్మాన మవ్యయమ్   శ్లో -4

ప్రభూ!
నీ స్వరూపమును దర్శించుట
నాకు సాధ్యమగునని నీవు భావించితి వేని
యోగేశ్వరా! నీఅవ్యయమైన
విశ్వరూపమును నాకు జూపుము

If, Lord,
Thou thinkest it possible
for me
to bear the sight;
reveal to me, O Yogeshvara,
Thy imperishable form.

పశ్య మే పార్థ! రూపాణి
శతశోథ సహస్రశః
నానా విధాని దివ్యాని
నానావర్ణాకృతీని చ   శ్లో - 5

అర్జునా!
అనేక విధములైన రంగులు
ఆకారములుగలవియును
దివ్యములైనవియు, అసంఖ్యాకము
లైనవియునగు నాయొక్క
రూపములను గాంచుము

Behold today, O Partha,
my forms divine in their hundreds and
thousands,
infinitely diverse,
infinitely various in colour and aspect.

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రాన్
అశ్వినౌ మరుతస్తథా
బహూ న్యదృష్టపూర్వాణి
పశ్యాశ్చర్యాణి భారత!   శ్లో - 6

అర్జునా!
ఆదిత్యులను, వసువులను
రుద్రులను, అశ్వినులను
మరుత్తులను, ఇంకను నీవు
చూచియుండని అనేకము
లైన అద్భుతములను చూడుము

Behold the Adityas,
the Vasus, the Rudras,
the two Ashwins, and
the Maruts; behold, O Bharata,
numerous marvels never revealed
before.

ఇహైకస్థం జగత్కృత్స్నం
పశ్యాద్య సచరాచరం
మమ దేహే గుడాకేశ!
యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి శ్లో - 7

అర్జునా!
నీవుచూడగోరిన సమస్తమైన
చరాచర ప్రపంచమును ఇంకను
ఏమిచూడదలచితివో వాటిని
నాశరీరమందు ఒకే చోట దర్శించుము

Behold today,
O Gudakesha, in my body,
the whole universe, moving
and unmoving, all in one,
and whatever else thou cravest to see..

భౌతిక నేత్రములచే ఎవరును విశ్వ రూపమును దర్శించలేరు అందువలన భగవానుడు తన విశ్వరూపాన్ని సందర్శించుటకు వీలుగా అర్జుననకు దివ్యదృష్టిని ప్రసాదిస్తున్నాడు.

[illegible]

అర్జునా!
నీవు నీ చర్మ చక్షువులచేత
నన్ను చూడలేవు. నా ఐశ్వర్యమును
గాంచుటకు నీకు దివ్యదృష్టి అవసరం
అట్టి దివ్యదృష్టిని నీకు ప్రసాదిస్తున్నాను
దానితో నీవు నన్ను దర్శించుము

But thou canst not see Me
with these thine own eyes.
I give thee the eye divine;
behold My sovereign power!

అర్జునునికి దివ్యదృష్టినొసంగిన పిదప భగవానుని యొక్క విశ్వరూప విశేషములను సంజయుడు ధృతరాష్ట్రునకు వివరిస్తున్నాడు.

ఏవముక్త్వా తతో రాజన్
మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ
పరమం రూపమైశ్వరమ్ శ్లో - 9

ఓ ధృతరాష్ట్ర మహారాజా!
తన విశ్వరూపమును గూర్చి
ఈవిధంగా తెలిపిన మహా
యోగేశ్వరుడైన ఆ శ్రీ హరి
దైవసంబంధమైన తన
విశ్వరూపమును అర్జునుని
కొరకు ప్రదర్శించెను

With these words, O King,
the great Lord of Yoga,
Hari, then revealed to Partha
His supreme form as Ishvara.

అనేక వక్త్రనయన
మనేకాద్భుత దర్శనం
అనేక దివ్యాభరణం
దివ్యానేకోద్యతాయుధం శ్లో - 10

దివ్యమాల్యాంబరధరం
దివ్యగంధానులేపనం
సర్వాశ్చర్యమయం దేవం
అనన్తం విశ్వతోముఖమ్ శ్లో- 11

అనేక ముఖములు, కన్నులు
గలదియు, అనేకానేకవిచిత్రములు
గలదియు, అనేక దివ్యాభరణములు
గలదియు, పైకి ఎత్తబడిన అనేక
దివ్యాయుధములు
గలదియు, దివ్యములైన పుష్పమాలలను
వస్త్రములను ధరించినదియు, దివ్యమైన
గంధపు పూతగలదియు, సర్వాశ్చర్య
కరమైనదియు, అంతములేనిదియు
అన్నివైపుల ముఖములుగలదియు
స్వయం ప్రకాశమునయిన తన
విశ్వరూపమును భగవానుడు ప్రదర్శించెను

With many mouths and many eyes,
many wondrous aspects, many divine
ornaments,
and many brandished weapons divine;
Wearing divine garlands and
vestments,
annoninted with divine perfumes,
it was the form of God,
all-marvellous, infinite, seen
everywhere.

దివి సూర్యసహస్రస్య
భవేద్యుగపదుత్థితా
యది భాస్సదృశీ సా స్యాత్
భాసస్తస్య మహాత్మనః శ్లో - 12

ఒకే పర్యాయము ఆకసమునందు
వేలకొలది సూర్యులు ప్రభవిస్తే
ఎంతటి తేజముండునో అంతటి
తేజము ఆ పరమాత్ముని యొక్క
విశ్వరూప ప్రదర్శనములో
గోచరించసాగింది.

Were the splendour of a thousand suns
to shoot forth all at once in the sky
that might perchance resemble
the splendour of that Mighty One.

తత్రైకస్థం జగత్కృత్స్నం
ప్రవిభక్తమనేకధా
అపశ్యద్దేవదేవస్య
శరీరే పాండవస్తదా శ్లో - 13

తత స్స విస్మయావిష్టో
హృష్టరోమా ధనంజయః
ప్రణమ్య శిరసా దేవం
కృతాంజర భాషత శ్లో - 14

అపుడు అర్జునుడు
అనేక విధములుగ విభజింప
బడియున్న జగత్తును దేవదేవుడగు
శ్రీకృష్ణపరమాత్ముని దేహమునందు
ఒక్కచోటనే వున్నదానినిగ దర్శించెను
దానిని గాంచి విస్మయ మొందినవాడై
పులకాంకితుడై, చేతులు ముకుళించి
దేవదేవుడగు శ్రీకృష్ణునకు శిరమును
వంచి నమస్కరించిన అర్జునుడు ఇట్లనెను

Then did Pandava see the whole universe
in its manifold divisions gathered as one
in the body of that God of gods.
Then Dhananjaya, wonder-struck and
thrilled in every fibre of his being,
bowed low his headf before the Lord,
addressing Him thus with folded hands.

శిరస్సును వంచి చేతుల జోడించి నమస్కరించుట వినయమునకు, వినమ్రతకు, భక్త్యతిశయమునకు సూచకాలు.

మహాశ్చర్యముతో భగవానుని విశ్వరూపమును దర్శించిన అర్జునుడు భగవానుని ఈ విధంగా ప్రశంశిస్తున్నాడు.

"పశ్యామి దేవాంస్తవ దేవ! దేహే
సర్వాంస్తథా భూతవిశేషసంఘా
బ్రహ్మాణమీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్
శ్లో -15

ఓ దేవ దేవా!
నీ దేహమందు సమస్తమైన
దేవతలు, చరాచరభూతజాలమును
సృష్టికర్తయు, కమలాసనుడును అయిన
బ్రహ్మను, సకల ఋషులను, సమస్తము
లైన సర్పములను చూచుచున్నాను

Within Thy form, O Lord,
I see all the Gods and the diverse
multitudes of beings,
the Lord Brahma, on his lotus-throne
and all the seers and the serpents
divine.

అనేక బాహూదర వక్త్ర నేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపం
నాంతం న మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప శ్లో -16

విశ్వేశ్వరా! విశ్వరూపా!
అన్నిచోట్లను అనేకములైన
బాహువులును, ఉదరములును
ముఖములను, నేత్రములను
కలిగిన అనంతరూపునిగ నిన్ను
గాంచు చున్నాను, నీ రూపమునకు
ఆదిగాని, మధ్యంగాని అంత్యము
గాని నాకు గోచరింపకున్నది

With many arms and bellies,
mouths and eyes, I see Thy
infinite form every where.
Neither Thy end, nor middle, nor
beginning,
do I see, o Lord of the Universal-formed

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతం
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తాత్
దీప్తానలార్క ద్యుతిమ ప్రమేయం
శ్లో - 17

కిరీటము, గద, చక్రము
గలవానిని గను, అంతటను
ప్రకాశించుచున్న వానినిగను
తేజోమయుని గను, ప్రజ్వలించెడి
అగ్ని సూర్యుల ప్రకాశముగల
వానినిగను, అప్రమేయునిగను
నిన్ను సమస్త ప్రదేశముల
యందుగాంచుచున్నాను

With crowned mace and disc,
a mass of effulgence, gleaming every where I see Thee,
so dazzling to the sight, bright with the splendour of the fiery sun
blazing from all sides,-incomprehen sible.

త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానం
త్వ మవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మేశ్లో - 18

నీవు అక్షరస్వరూపడవు
పరమాత్మవు, తెలియదగిన
వాడవు, ఈ విశ్వమునకు
పరమాశ్రయుడవు, శాశ్వత
ధర్మరక్షకుడవు, అవ్యయుడవు
సనాతనుడవైన పురుషుడవు

Thou art the Supreme Imperishable worthy to be known;
Thou art the final resting place of this universe;
Thou art the changeles guardian of the Eternal Dharma;
Thou art, I believe, the Everlasting Being.

అనాదిమధ్యాన్త మనన్త వీర్యం
అనంతబాహుం శశిసూర్యనేత్రం
పశ్యామి త్వాందీప్తహుతాశవక్త్రం
స్వతేజ సా విశ్వమిదం తపన్తంశ్లో - 19

ఆదిమధ్యాన్త రహితునిగను
అనంత వీర్యవంతునిగను
అనేక హస్తములుగల వానిగను
చంద్ర సూర్యులు నేత్రములుగా
గలవానినిగను, ప్రజ్వలించు
అగ్నివంటి ముఖములుగల
వానినిగను, స్వప్రకాశముచే
విశ్వమంతటని దీప్తిమంతం
చేయువానిగనునిన్ను
దర్శించుచున్నాను

Thou hast no beginning, middle nor end;
infinite is Thy might;
arms innumerable
for eyes, the sun and the moon;
Thy mouth a blazing fire, overpowering the universe with Thy radiance.

ద్యావాపృథివ్యోరిదమంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః
దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్
శ్లో - 20

మహాత్మా!
భూమ్యాకాశముల మధ్య
ప్రదేశమును, దిక్కులన్నియును
నీచేతనే పరివ్యాప్తమై యున్నవి
అద్భుతమైనట్టి, భయంకరమైనట్టి
నీ రూపమును జూచి ముల్లోకములు
మిగుల భీతి నొందుచున్నవి

By Thee alone are filled the spaces
between heaven and earth
and all the quarters;
at the sight of this
Thy wondrous terrible form,
the three worlds are sore oppressed,
O Mahatman!

అమీ హి త్వాం సురసంఘా విశంతి
కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః
శ్లో - 21

దేవతా సమూహము
లన్నియును నీలో
ప్రవేశించుచున్నవి
కొందరు భీతిచెందినవారై
చేతులు జోడించి
స్తుతించుచున్నారు
మహర్షులు, సిద్ధుల సమూహములు
"స్వస్తి" పలుకుచూ అనేక
స్తుతులచేత నిన్ను ప్రార్థించుచున్నారు

Here, too, the multitudes of gods are seen to enter Thee;
some awa-stuck praise Thee with folded arms;
the hosts of great seers and siddhas, All Hail'on their lips, hymn Thee with songs of praise.

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ
గంధర్వయక్షాసురసిద్ధసంఘా
వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే శ్లో - 22

రుద్రులు, ఆదిత్యులు,
వసువులు, సాధ్యులు
విశ్వదేవతలు, అశ్వినీ
దేవతలు, వాయుదేవతలు
గంధర్వులు, యక్షులు, అసురులు
సిద్ధులు మొదలుగా గలవారందరు
ఆశ్చర్యమును పొందినవారై నిన్ను
గాంచుచున్నారు

The Rudras, Adityas, Vasus, Sadhyas, all the gods,
the twin Ashwins, Maruts, Manes, the hosts of Gandharvas, Yakshas, Asuras and Siddhas - all gaze on Thee in wonderment.

రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదం
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాఃప్రవ్యథితాస్తథాహం
శ్లో - 23

కృష్ణా!
అనేకముఖములు, నేత్రములు
కలిగినట్టియు, అనేకములగు
బాహువులు, ఊరువులు
పాదములు కలిగినట్టియు
అనేక ఉదరములు కలిగినట్టియు
అనేకములైన కోఱలచే భయంకర
మైనట్టి నీ అద్భుత రూపమును
జూచి జనులందరు భయపడు
చున్నారు, నేనును అదే విధముగ
భయపడుచున్నాను

At the sight of Thy mighty form,
O Mahabahu,
many-mouthed, with eyes, arms, thighs and feet innumerable,
with many vast bellies, terrible with many jaws,
the worlds feel fearfully opressed, and so do I.

నభః స్పృశం దీప్తమనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రం
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో!
శ్లో - 24

కృష్ణా !
నీవు గగనమునంటియున్న వాడవు
అనేక వర్ణములతో ప్రకాశించుచున్నవాడవు
ప్రజ్వలించెడివిశాలమైన నేత్రములు
గలవాడవు
అగు నిన్ను చూచి నామనస్సు
భీతిలుచున్నది
నేను ధైర్యమును గాని, శాంతిని గాని
పొందలేకుండా యున్నాను

For as I behold Thee touching the sky,
glowing, numerous-hued with gaping
mouths and wide resplendent eyes,
I feel oppressed in my innermost being;
no peace nor quiet I find, O Vishnu!

దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశః జగన్నివాస! శ్లో - 25

కోరలచేత భయంకరమైన
ప్రళయాగ్నిని బోలిన నీ ముఖములను
జూచి నేను దిగ్భ్రాంతిని చెందితిని
నీ ముఖమును కూడా చూడలేకుండ
నున్నాను కనుక ఓ దేవదేవా!
జగదాశ్రయా! ప్రసన్నుడవు కమ్ము

And as I see Thy mouths with fearful jaws,
resembling the Fire of Doom,
I lose all sense of direction,
and find no relief.
Be gracious,
O Devesha, O Jagannivasa!

అమీచ త్వాం ధృతరాష్ట్ర స్యపుత్రాః
సర్వే సహైవావనిపాలసంఘైః
భీష్మోద్రోణస్సూతపుత్రస్తథాసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః
శ్లో - 26

వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రా కరాళాని భయానకాని
చిద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః
శ్లో - 27

ఈ ధృతరాష్ట్ర కుమారులందరును
వివిధ రాజుల సమూహములును
భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు
ఇంకను మన పక్షాన యున్న యుద్ధ
ప్రముఖులందరును కోఱలతో
వికారముగను, భయంకరముగను
గోచరించు నీ నోళ్లయందు
త్వరత్వరగా ప్రవేశించుచున్నారు
కొందరితలలు ముక్కలు ముక్కలై
చూర్ణితములై నీదంతముల సందుల
యందు చిక్కుకొని కనుపించుచున్నవి

All the sons of Dhritarashtra,
and with them the crowd of kings,
Bhishma, Drona, and that Karna too,
as also our chief warriors ;
Are hastening into the fearful jaws of
Thy terrible mouths.
Some indeed, caught beteen Thy teeth,
are seen their heads being crushed to
atoms.

యథా నదీనాం బహవో మ్బువేగా
సముద్రమేవాభిముఖా ద్రవంతి
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతిశ్లో - 28

సముద్రమునకు అభిముఖముగా
నదీ ప్రవాహములు ప్రవహించెడి
రీతిన ఈరాజ శ్రేష్ఠులందరును
ప్రజ్వలించుచున్న నీ ముఖమునకు
అభిముఖులైనీలో ప్రవేశించు చున్నారు

As rivers, in their numerous torrents,
run headlong to the sea,
even so the heroes of the world of men
rush into Thy flaming mouths

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశంతి నాశాయ సమృద్ధవేగాః
తథైవ నాశాయ విశంతి లోకాః
తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః శ్లో -29

ఏ విధముగ మిడుతలు
అతిరయమున మండుచున్న
అగ్నియందు ప్రవేశించి
నశించుచున్నవో అదే విధమున
మానవ కోటి అంతయును అతిరయమున
నీనోళ్ళయందు నాశము గోరి
ప్రవేశించుచున్నది

As moths, fast-flying, plunge into a
blazing fire,
straight to their doom, even so these
rush headlong into Thy mouths, to
their destruction.

లేలిహ్యసే గ్రసమానః సమన్తా
ల్లోకాన్సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః
తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో! శ్లో-30

ఓ ప్రభూ! విష్ణు మూర్తీ!
మండుచున్న నోళ్లలో
అన్నివైపులను సమస్త
మైనలోకములను మ్రింగుచు
వాటిని ఆస్వాదించుచున్నావు
నీ యొక్క ప్రచండమైన కాంతులు
సమస్తమైన జగత్తును నింపి
దానిని (జగత్తును) తరింపజేయుచున్నవి

Devouring all these form all sides,
Thou lappest them with Thy flaming
tongues;
Thy fierce rays blaze forth,
filling the whole universe with their
lustre.

అఖ్యాహి మే కో భవానుగ్రరూపో
నమోస్తుతే దేవవర! ప్రసీద
విజ్ఞాతుమిచ్ఛామి భవంతమాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్
శ్లో- 31

దేవదేవా!
ఈ భయంకర రూపధారివియైన
నీవు ఎవరివో తెలుపుము, నీ
ప్రవర్తనమునాకు తెలియకున్నది
కనుక ఆద్యపురుషుడవైన
నీ యొక్క స్వభావమును
నేను తెలియగోరుచున్నాను

Tell me, Lord, who Thou art so dread of form!
Hail to Thee, O Devavara! Be gracious!
I desire to know Thee,
Primal Lord; for I comprehend not what
Thou dost.

అర్జునుని పై ప్రశ్నకు భగవానుడు సమాధాన మొసంగుచున్నాడు.

కాలోస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్సమాహర్తు మిహ ప్రవృత్తః
ఋతేపిత్వా న భవిష్యంతి సర్వే
యేవస్థితాః ప్రత్యనీకేషు యోధాః

శ్లో -32

నేను
లోక సంహారకుడనై విజృభించిన
కాలుడను, ప్రాణులను సంహరించుట
కొరకు ఈ ప్రపంచమున ప్రవర్తించు
చున్నాను. శత్రు సైన్యమునందలి
వీరులు ఒకవేళనీవు సమరము
విరమించుకున్నను, లేక నీవు లేక
పోయినను వారు జీవించి వుండరు అన్న
విషయమును తెలుసుకో

Doom am I, full-ripe, dealing death to
the worlds,
engaged in devouring mankind.
Even without thy slaying them not one
of the warriors,
ranged for battle against thee, shall
survive.

తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రున్భుజ రాజ్యం సమృద్ధం
మయైవేతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్

శ్లో - 33

అందువలన
నీవు లెమ్ము, శత్రువులను జయించి
కీర్తిని పొందుము, సంపూర్ణమైన
రాజ్యభోగాన్ని అనుభవింపుము
ఇక్కడ ఈ కురుక్షేత్ర రణరంగమున
మొహరించియున్న వీరందరు
నాచేత ఇది వరకే చంపబడియున్నారు
నీవు కేవలము నిమిత్తమాత్రుడవు కమ్ము

Therefore, do thou arise, and win renown!
Defeat thy foes and enjoy a thriving
kingdom.
By Me have these already been
destroyed;
be thou no more than an instrument,
O Savyasachin.

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాన్యానపి యోధవీరాన్
మయాహతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్

శ్లో- 34

ఇదివరకే
నాచేత చంపబడియున్న
ద్రోణాచార్యుని, భీష్మాచార్యుని
జయద్రధుని, కర్ణుని అదేవిధంగా
ఇతర యుద్ధ ప్రముఖులందరిని
నీవు చంపుము, భయపడకుము
యుద్ధము చేయుము, శత్రువులను
జయించగలవు

శ్రీకృష్ణుడు గీతను బోధించే సమయములో కురుక్షేత్ర రణరంగాన భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు మున్నగు వారందరూ అత్యంత ఉత్సాహముతో తమ తమ శంఖములను పూరించి ధనుర్బాణాలను చేతబూని యుద్ధానికి సంసిద్ధులయే వున్నారు. అలాంటప్పుడు వారందరు తనచేత యుద్ధ భూమిలో మరణించారని అర్జుననితో శ్రీకష్ణుడు చెప్పాడు. ఏమిటిదంతా? అనే ప్రశ్న ఉత్పన్నము అవుతోంది. ఈ విషయములును ఇంతకు ముందు ఈ అధ్యాయము 27వ శ్లోకంలో అర్జునుడు స్వయంగా ఈ విధంగా తెలిపి యున్నాడు.

"ఈధృతరాష్ట్ర సుతులందరును
రాజసమూహములన్నియును
భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడును
మన పక్షానయున్న యుద్ధ ప్రముఖులును
కోఱలతో వికారముగ, భయంకరముగ
గోచరించు నీ నోళ్లయందు త్వరత్వరగా
ప్రవేశించుచున్నారు, కొందరు తలలు
ముక్కలు ముక్కలై చూర్ణితమై
నీ దంతముల సందుల యందు చిక్కుకొని
కనుపించుచున్నారు"

దీనిని బట్టి మనం గ్రహించవలసిం దేమిటంటే భగవంతుడు కాలాతీతుడని ఆయనకు భూత, భవిష్యత్, వర్తమానము అనే కాలభేదము లేదు. అందువల్లనే భవిష్యదృత్తాంతమును అంటే భీష్ముడు మొదలైన వారి మృతిని గూర్చి అపుడు అంటే యుద్ధప్రారంభంకావడానికి ముందే చూపడం జరిగింది. దీనివలన మానవకోటికి మంచిగుణ పాఠంలభిస్తున్నది. అదేమిటంటే ఈ కనుపించు బంధుమిత్రాదులు భవిష్యత్కాల మున వినాశ మొందె వారే అయివున్నారన్న అంశం తెలియ జెప్పబడింది.

Drona, Bhishma, Jayadratha and Karna,
as also the other warrior chiefs-
already slain by Me-
slay thou! Be not dismayed! Fight!
Victory is thine over the foes in the field.

భగవానుడు ఆ విధంగా తెలుపగా తదుపరి అర్జునుడు ఏం చేసెనో దానిని గూర్చి సంజయుడు ధృతరాష్ట్రునకు తెలుపుతున్నాడు.

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ
నమస్కృత్వాభూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీత భీతః ప్రణమ్యశ్లో - 35

అర్జునుడు శ్రీకృష్ణుని వచనములను
ఆలకించి చేతులు జోడించి
వణుకుచు శ్రీకృష్ణునకునమస్కరించి
భయకంపితుడై, వినమ్రమైన గద్గద
స్వరముతో ఈ విధముగా పలికెను

Hearing this word of Keshava,
crownwearer Arjuna folded his hands,
and trembling made obeisance.
Bowing and all hesitant,
in faltering accents,
he proceeded to address Krishna once more.

స్థానే హృషీకేశ! తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతేచ
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధ సంఘాః
శ్లో -36

కృష్ణా!
నీ మహాత్మ్యమునకు జగత్తంతయు
సంతసించుచున్నది. అనురాగమును
పొందుచున్నది, రాక్షసులు భయపడినవారై
పలుదిక్కులకు పరుగిడుచున్నారు
సిద్ధుల సమూహములన్నియు నీకు
నమస్కరించు చున్నవి, ఇవన్నియు
నీ మహిమకు నిదర్శనములు

Right proper it is, O Hrishikesha,
that Thy praise should stir the world
to gladness and tender emotion;
the Rakshasas in fear fly to every quarter
and all the hosts of Siddhas do reverent homage.

కస్మాచ్చ తే న నమేర్మహాత్మన్!
గరీయసే బ్రహ్మణోప్యాదికర్త్రే
అనంత! దేవేశ! జగన్నివాసః
త్వ మక్షరం సదసత్తత్పరం యత్
శ్లో - 37

మహాత్మా! అనంతరూపా!
దేవదేవా! జగదాశ్రయా!
నీవు సదసత్తులకు పరమమైన
అక్షరబ్రహ్మవు, సృష్టికర్త
అయిన బ్రహ్మదేవునకు మూలకర్తవు,
మహాత్ముడవైన నీకు ఎవరు నమస్కరింప
కుండా వుండగలరు!

And why should they
not bow down to Thee,
O Mahatman?
Thou art the First Creator,
greater even than Brahma.

O Ananta, O Devesha, O Jagannivasa,
Thou art the Imperishable,
Being, not- Being,
and That which transceds even these.

త్వ మాది దేవః పురుషః పురాణ
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానం
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనంతరూప!

శ్లో - 38

*అనంత రూపా!*
నీవు ఆదిదేవుడవు
పురాణ పురుషుడవు
ప్రపంచమునకు ఆధారుడవు
సర్వమును తెలిసినవాడవు
అందరిచేత తెలియదగిన
పరంధాముడవు, విశ్వము
నీ చేత వ్యాప్తమై యున్నది

Thou art the Primal God,
the Ancient being;
Thou art the Final Resting Place
of this Universe;
thou art the Knower, the 'to-be-known',
the Supreme Abode;
by Thee, O myriad-formed, is the
Universe pervaded.

వాయుర్యమోగ్ని ర్వరుణ శ్శశాంకః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ
నమో నమస్తేస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోపి నమో నమస్తే

శ్లో- 39

నీవు
వాయువువు యముడవు
అగ్నివి, వరుణుడవు, చంద్రుడవు
ప్రజాపతివి, అతనికి తండ్రివి
కూడా నీవె అయివున్నావు, నీకు
అనేక నమస్కారములు, మరల
మరల నీకు వందనములు

Thou art Vayu, Yama, Agni, Varuna,
Shashanka, Prajapati,and
Prapitamaha!
All hail to Thee,
a thousand times all hail!
Again and yet again all hail to Thee!

నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోస్తుతే సర్వత ఏవ సర్వ!
అనంతవీర్యామితవిక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోసి సర్వః

శ్లో - 40

*సర్వరూపుడవైన ఓ ప్రభూ!*
నీకు ముందు, వెనుక, అన్ని
వైపులను నమస్కరించు
చున్నాను, నీవు శక్తిమంతుడవు
పరాక్రమవంతుడవు, సమస్తమును
నీచేత వ్యాపించబడియున్నది. కనుకనే
నీవు సర్వరూపుడవు అనబడుచున్నావు

All hail to Thee from before and behind!
All hail to Thee from every side,
O All; Thy prowess is infinite,
Thy might is measureless!
Thou holdest all; therefore Thou art all.

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాపి

శ్లో - 41

యచ్చాపహాసార్థ మసత్కృతోసి
విహారశయ్యాసన భోజనేషు
ఏకోథవాప్యచ్యుత! తత్సమక్షం
తత్క్షామయే త్వా మహ మప్రమేయం

శ్లో - 42

*ప్రభూ, కృష్ణా!*
*నీ మహిమను తెలియక*
*పొరపాటున గాని, చనువు చేతగాని*
*నిన్ను సామాన్య మిత్రునిగా భావించి*
*"ఓ కృష్ణా! ఓ యాదవా! ఓ సఖా!"*
*అని నిర్లక్ష్యముగా నిన్ను ఇంతవరకు*
*పిలుచుచుంటిని, మరియు విహరించు*
*నపుడుగాని, నిద్రించునపుడుగాని*
*కూర్చొని యుండినపుడుగాని, ఆరగించు*
*చున్నపుడుగాని, ఒంటిరిగా నుండునపుడు*
*గాని, ఇతరుల ఎదుట పరిహాసము*
*కొరకు గాని నేను అపరాధములు*
*చేసి యుంటినో వాటి విషయములో*
*నన్ను క్షమించుటకై నిన్ను భక్తి పూర్వకముగ*
*ప్రార్థించు చున్నాను.*

If ever in carelessnes,
thinking of Thee as comrade,
I addressed Thee saying,
'O Krishna!', 'O Yadava!' not knowing
Thy greatness,
in negligence or in affection.

పితాసి లోకస్య చరాచరస్య
త్వ మస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్
నత్వత్సమోస్త్యభ్యధికః కుతోన్యో
లోకత్రయేప్యప్రతిమ ప్రభావ! శ్లో-43

*కృష్ణా !*
*సాటిలేని ప్రభావము గలవాడా!*
*నీవు చరాచర ప్రపంచమునకు*
*తండ్రివి, గురువువు, పూజ్యుడవు*
*ముల్లోకములలోను నీకు సమానుడు*
*లేడు, నిన్నుమించినవాడు ఎక్కడ వుండ*
*గలడు!*

Thou art Father of this world,
of the moving and the un-moving;
Thou art its adored, its, worthiest,
Master;
there is none equal to Thee;
how then any greater than Thee?
Thy power is matchless in
the three worlds

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశ మీడ్యం
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుర్హ

శ్లో - 44

కనుక
నీవు ఈశ్వరుడవు
స్తుతింపదగినవాడవు
నీకు సాష్టాంగ ప్రణామము
నన్ను కరుణింప వేడుకొనుచున్నాను
తండ్రి కుమారుని తప్పును, మిత్రుడు
తన మిత్రుని అపరాధమును, ప్రియుడు
ప్రియురాలి యొక్క పొరపాటును
క్షమించినట్లు నీవు నా అపరాధమును
క్షమింపుము

Therefore I prostrate myself
before Thee,
and beseech Thy grace,
O Lord Adorable!
As father with son, as comrade
with comrade,
so shouldst Thou bear,
beloved Lord, with me,
Thy loved one.

అదృష్టపూర్వంహృషితోస్మిదృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే
తదేవ మే దర్శయ దేవః రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస!

శ్లో-45

దేవ దేవా!
మునుపెన్నడును దర్శించని
నీ రూపమును గాంచి సంత
సించితిని నా మనస్సు
భీతినొందుచున్నది
జగన్నివాసా! నాకు
నీ పూర్వపు మంజుల
రూపమునే దర్శింపజేయనీయుము
ప్రభూ! కృష్ణా! కరుణించుము

I am filled with joy to see what never
was seen before,
and yet my heart is oppressed with fear.
Show me that original form of Thine,
O Lord! Be gracious, Devesha,
O Jagannivasa!

అని స్తుతించి తాను చూడదలచిన సౌమ్య రూపమును గూర్చి అర్జునుడు తిరిగి ఈ విధంగా వర్ణింపసాగాడు.

కిరీటినం గదినం చక్రహస్తం
ఇచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో! భవ విశ్వమూర్తే!

శ్లో - 46

ఓ విశ్వరూపా!
ఓ సహస్రబాహూ;
కిరీటము, గదా, చక్రములు
చతుర్భుజములు గల
నీ మంజుల రూపమును
నేను దర్శించగోరుతున్నాను
ప్రభూ! ఆ రూపంతో నను అవధరింపుము

I crave to see Thee even as Thou wast,
with crown, with mace, and disc in
hand; wear Thou, once more, that four-
armed form, O thousand-armed
Vishvamurti!

ఈ శ్లోకమును గూర్చి శ్రీవిద్యా ప్రకాశానంద గిరి స్వాములవారు ఈ విధంగా అభిప్రాయ మును వెలిబుచ్చారు.

1. విశ్వరూపమును చూపుటకు ముందుగా భగవానుడు తన చతుర్భుజాకారమును అర్జునునకు కన్పరచి యుండవచ్చును.

ఇదే అధ్యాయములోని 50వ శ్లోకంలో "భూయః స్వకం రూపం దర్శయామాస"(తిరిగి తన రూపమును జూపెను) అని చెప్పి వెంటనే "పునస్సౌమ్యవపుర్భూత్వా"(మరల శాంత రూపమును ధరించెను) అనిపలుకుట వలన మొదట చతుర్భుజాకారమును చూపి, ఆ పిమ్మట శాంతమగు మానవ రూపమును ధరించి యుండవచ్చును.

2. దేవకీ దేవి గర్భాన భగవానుడు జన్మించి నపుడు శంఖు చక్రాది చిహ్నములుండె నని అది చాలా ప్రసన్నమైన రూపముగా వుండెనని అర్జునుడు వినియుండవచ్చును.

3. విశ్వరూప దర్శనమువలన శ్రీకృష్ణుడు సామాన్య మానవుడు కాదని సాక్షాత్ ఆయన ఆ శ్రీమహావిష్ణువే యని తెలుసుకొనుటచే వైకుంఠమందట్టి చిహ్నములతోనే సదా ప్రసన్న రూపుడై వెలయుచుండునని ఎరిగియుండుట వలన అర్జునుడు ఆవిధంగా ప్రశ్నించి యుండవచ్చును.

అర్జునుని యొక్క ఆ ప్రార్థనను వినిన భగవానుడు తన సౌమ్యరూపముతో తిరిగి ప్రత్యక్షముగానున్న వాడై విశ్వరూపముయొక్క మహిమను ముందుగా వెల్లడించుచున్నాడు

మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్
తేజో మయం విశ్వమనంత మాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్
శ్లో - 47

అర్జునా!
తేజో మయమైనదియు
విశ్వరూపమైనదియు, అనంతమైనదియు,
ఆది
యందుండునదియు,
నీ కన్నా వేరైన వారి చేత
ఇప్పటి వరకు చూడబడనిదియు
అగు ఏ పరమమైన రూపం
గలదో అట్టిది ప్రసన్నుడనగు
ఆత్మయోగం వలన నాచే
నీకు చూపబడినది

It is to favour thee, O Arjuna,
that I have revealed to thee,
by My own unique power,
this My Form Supreme,
Resplendent, Universal, Infinite, Primal
which none save thee has ever seen.

న వేద యజ్ఞాధ్యయనై ర్నదానై
ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః
ఏవం రూపశ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురు ప్రవీర!
శ్లో - 48

అర్జునా!
ఈ మానవలోకమందు నీవు తప్ప
అన్యులెవ్వరు వేదాధ్యయనము
వలనగాని, యజ్ఞములు, దానములు

వైదిక కర్మల వలన గాని, ఉగ్రతపస్సు
వలన కాని నన్ను చూడలేరు

Not by the study of the Vedas,
not by sacrifice, not
by the study of other scriptures,
not by gifts, nor yet by
performance of rites
or of fierce austerities can I,
in such a form, be seen
by any one
save thee in the world of men,
O Kurupravira!

మాతేవ్యథా మాచ విమూఢభావో
దృష్ట్వారూపం ఘోరమీదృగ్మమేదం
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య శ్లో-49

భయంకరమైన
నా ఈ విశ్వరూపమును జూచి
నీవు భయమునుగాని, చిత్త
సంక్షోభమును గాని పొందవద్దు
నీవు భయమును వీడిన వాడవై
సంతోష్టాంతరంగుడవై ఇకనా
పూర్వ రూపమును దర్శించుము

Be thou neither oppressed nor bewildered
to look on this awful form of Mine.
Banish thy fear, ease thy mind,
and lo! behold Me once again as I was.

ఈ విధంగా చెప్పి తదుపరి శ్రీకృష్ణుడేమి చేసెనో దానిని గూర్చి సంజయుడు వివరిస్తున్నాడు.

ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా
శ్లో - 50

మహానుభావుడైన
శ్రీకృష్ణుడు ఇట్లు పలికి
సౌమ్య రూపుడై తన పూర్వ
రూపమును మరల అర్జుననకు
చూపి ఆయన్ను ఓదార్చెను

So said Vasudeva to Arjuna,
and revealed to him once more His
original form.
Wearing again His form benign,
the Mahatman consoled him terrified.

భగవానుడు ప్రదర్శించిన శాంతరూపమును, తిరిగి దర్శించిన అర్జునుడు ఈ విధంగా భగవానుని స్తుతించుచున్నాడు

దృష్ట్వేదం మానుషం రూపం
తవ సౌమ్యం జనార్దన!
ఇదానీ మస్మి సంవృత్తః
సచేతాః ప్రకృతిం గతః శ్లో 51

ప్రభూ!కృష్ణా!
నీ యొక్క సౌమ్యమైన
మానవరూపమును తిరిగి
గాంచిన నేను ఇపుడు
సహజ స్వభావుడను
భయరహితుడను
ప్రసన్న చిత్తముగల
వాడను అయితిని

Beholding again Thy benign human form
I am come to myself and am once more
in my normal state.

అర్జునుని ప్రార్ధనను విని భగవానుడు తాను చూపిన రూపము యొక్క మహిమాతిశయ మును వర్ణించుచున్నాడు.

సుదుర్దర్శ మిదం రూపం
దృష్టవానసి యన్మమ
దేవా అప్యస్య రూపస్య
నిత్యం దర్శన కాంక్షిణః శ్లో -52

నాహం వైదైర్న తపసా
న దానేన న చేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం
దృష్టవానసి మాం యథా శ్లో - 53

అర్జునా!
నీవు చూచిన ఈ విశ్వరూపము
చూడ శక్యముకానిది, దేవతలు
సైతము సదా ఈ రూపమును
దర్శించగోరెదరు
నీవు దర్శించిన ఈ విశ్వరూపము
వేదముల చేతగాని, యజ్ఞము, దాన
తపముల చేతగాని దర్శింప శక్యంకానిది

Very hard to behold is that form of Mine
which thou hast seen; even the gods
always yearn to see it.
Not by the Vedas,not by penance,
nor by gifts, nor yet by sacrifice,
can any behold Me inthe Form that
thou hast seen.

భక్త్యా త్వనన్యయా శక్య
అహమేవం విధోర్జున!
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన
ప్రవేష్టుం చ పరంతప శ్లో - 54

అర్జునా!
విశ్వరూపుడనైన నన్ను
వాస్తవముగ గ్రహించుటకు
దర్శించుటకు, ప్రవేశించుటకు
అంతటికీ అనన్య భక్తియే సాధనము

But by single-minded devotion,
O Arjuna, I may in this Form be known
and seen,
and truly entered into, O Parantapa!

మత్కర్మ కృన్మత్పరమో
మద్భక్తస్సఙ్గవర్జితః
నిర్వైరస్సర్వ భూతేషు
యస్స మా మేతి పాండవ! శ్లో - 55

అర్జునా!
ఎవడు నా కొరకే కర్మలు
ఆచరించుచు, నేనే పరమ
గతియని భావించి, నాకు
భక్తుడై, సంగరహితుడై
సకల భూతముల యందును
వైరబుద్ధి లేక యుండునో
అట్టి వాడు నన్ను పొందుచున్నాడు

He alone comes to me, O Pandava,
who does My work, Who has made
Me his goal
Who is my devotee
who has renounced attachment,
who has ill will towards none.

గీతలో ఈ శ్లోకము ఎంతో ముఖ్యమైన దానిగా ఆదిశంకరాచార్యుల వారు భావించి నట్లు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు అందుకు కారణాలు ఇవి అని వారి అభిప్రాయం వెలిబుచ్చారు.

1. మత్కర్మకృత్- నాకర్మలను చేయుము అంటే కర్మయోగము

2. మత్పరమః-నాయందు తత్పరుడవై యుండుము అంటే ధ్యానయోగము

3. మద్భక్తః-నా యెడల భక్తి కలగియుండుము అంటే భక్తియోగము

4. సఙ్గవర్జితః- దృశ్య పదార్థములయందు సంగము లేకుండ యుండుము అంటే జ్ఞాన యోగము

5. నిర్వైర స్సర్వభూతేషు - సమస్త ప్రాణుల యెడదయ కలిగి యుండుము అంటే పత్యం.

కనుక సాధకులు ఈ శ్లోకము యొక్క తాత్పర్యమును పదే పదే మననము చేయుచు, భక్త్యాది సుగుణములు కలిగి పరమాత్మ సాయుజ్యమును ఈ జన్మయందే పొందు లాగున యత్నించవలెను అని శ్రీ స్వాముల వారు అభిప్రాయపడిరి.

ఈ విధంగా ఉపనిషత్తును బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాద రూపమును అయిన
శ్రీ మద్భగవద్గీత యందలి విశ్వరూప సందర్శయోగము అను పేరుగల
పదకొండవ అధ్యాయము సమాప్తముగావించబడింది



# గీతా సంహిత

**అధ్యాయము పండ్రెండు** | **భక్తి యోగము**

గంగానది ప్రవాహం అన్ని ప్రదేశములలోను పవిత్రమైందే, కాని దాని ప్రవాహం "హరిద్వారము-కాశీ- ప్రయాగ"వంటి ప్రదేశాలలో మిక్కిలి పవిత్రమైంది. ఆ నదీప్రవాహ క్షేత్రాలు ప్రపంచమునంతటిని పావనం చేసేటటువంటివి. భగవద్గీత విషయం కూడా అంతే! భగవద్గీత మొదటి నుంచి చివరి దాకా అంతా పవిత్రమే! కాని మధ్య మధ్యలో కొన్ని అధ్యాయాలు మిగుల పవిత్రమైన తీర్థక్షేత్రాలు. ఇపుడు "భక్తియోగం" అని పిలువబడుతున్న అధ్యాయం పరమ పవిత్రమైన తీర్థక్షేత్రం అని చెప్పుకోవలసివుంది అందువలననే దీనిని స్వయంగా భగవానుడే ఈ అధ్యాయం 20వ శ్లోకంలో

"ఎవరైతే శ్రద్ధావంతులై
నేనే పరమగతి యని
భావించిన వారై, నేను
ఇంతవరకు తెలిపిన
విధముగ ఈ ధర్మ
స్వరూపమైన పీయూషమును
(అమృత ధారను) సేవించు
చున్నారో వారు నాకు అత్యంత ప్రియులు"
అని ప్రకటించాడు.

కేవలము ఇరువది శ్లోకములతో కూడిన ఈ అధ్యాయము అమృతమువలె మధురమైన, సంజీవనియై యున్నది. ఈ అధ్యాయములో భగవానుడు స్వయముగ భక్తి రసము యొక్క మహిమను దాని తత్వమును గానము చేసినాడు.

వాస్తవంగా వెనుకవైపుకు ఒకసారి మరలి చూస్తే ఆరవ అధ్యాయము నుండియే ఈ భక్తిరసతత్వము ప్రారంభమైంది. అయిదవ అధ్యాయము చివరి దాకా జీవన శాస్త్రము గురించి చూచాము. స్వధర్మాచరణ రూపమైన కర్మలు, వానికి సహకారియయిన వికర్మయను మానసిక సాధన, ఈ రెండు సాధనల వలన సమస్త కర్మములను భస్మము చేయగల అంతిమ సోపానమైన అకర్మయొక్క భూమిక ఈ విషయుల విచారణ మొదటి అయిదు అధ్యాయములలో చూడడం జరిగినది. దీనితో జీవశాస్త్రం సమాప్తమయింది. ఆరవ అధ్యాయం నుండి పదకొండవ అధ్యాయం వరకు ఒక విధంగా భక్తి తత్వ విచారణ జరిగినది. అది ఏకాగ్రతతో ప్రారంభం అయింది. చిత్తైకాగ్రత ఎట్లు కలుగ గలదో, దానికి ఏయే సాధనలున్నవో, వాని ఆవశ్యకత ఏమిటో ఆరవ అధ్యాయము నందు చెప్పబడినది. పదకొండవ అధ్యాయములో సమగ్రతను గూర్చి బోధింపబడింది. ఏకాగ్రతమొదలుకొని సమగ్రత వరకును గల పెద్ద మజిని మనమెట్లు దాటగలమో ఇపుడు ఇక్కడ ఈ పండ్రెండవ అధ్యాయంలో చూడవలసి వుంది.

ఆరవ అధ్యాయం చిత్తైకాగ్రతతో ప్రారంభమయింది. ఏకాగ్రత సిద్ధించిన మీదట ఏ విషయమునైనను మనుష్యుడు ఆలోచించిన మీదటనే దానిని ఆచరించుటకు ముందుకు సాగును, అందుకుగాను మన దృష్టి భగవంతుని చరణముల దిశకు మరల వలెనని ఏడవ అధ్యాయము తెలుపుతున్నది. భగవంతుని చరణముల యందు ఏకాగ్రదృష్టి నిరంతరము నిలువ వలెనని మన వాణి, చెవి, కన్ను ఆచరణముల యందే సతతం లగ్నం కావలెనని, దానికై మరోపర్యంతము ప్రయత్నించవలెనని ఎనిమిదవ అధ్యాయము బోధించుచున్నది. ఇంద్రియములన్నింటికిని ఇది అభ్యాసం కావలె.

అన్ని ఇంద్రియములకును భగవంతుని పొందవలెనను ఉత్కంఠ కలుగ వలెను. మన ఎదుట ఒకరు విలపించుచుండవచ్చును. ఇంకొకడు భజన చేయుచుండవచ్చును. మరొకడు వాసనారూపమైన వలను అల్లుచుండవచ్చును. విరాగులైన మహాత్ములయొక్క సమ్మేళనము జరుగుచుండవచ్చును. సూర్యుడు వెలుగుచుండవచ్చును. చీకటి క్రమ్మి యుండవచ్చును. ఏది ఎట్లున్నను మరణకాలమందు పరమేశ్వరుడు చిత్తములో ప్రత్యక్షమగుస్థితిని అన్ని ఇంద్రియములకు జీవితము పొడుగునను అలవడవలెను. ఈ సాతత్వశిక్షణ ఎనిమిదవ అధ్యాయమునందు ఇవ్వబడినది. ఆరవ అధ్యాయములో ఏకాగ్రత, ఏడవ అధ్యాయంలో ఆ ఏకాగ్రత ఈశ్వరాభిముఖముకావలెననునటయు గురించి తెలుసుకొని ఆచరించుటకు ప్రయత్నం జరిగింది. ఈశ్వరాభిముఖంగా పయనించే ఆ ఏకాగ్రతయే ప్రపత్తి అని చెప్పబడుతున్నది. తొమ్మిదవ అధ్యాయంలో సమర్పణ గూర్చి బోధింపబడింది. పదవ అధ్యాయంలో ఈశ్వరుని యొక్క "విభూతులు" గూర్చి క్రమాను గుణముగ చెప్పబడినవి. ఒక్కొక్క అడుగు ముందుకు

వేయుచు ఈశ్వర స్వరూపమును ఎట్లు హృద్గతము చేసుకొనవలెనో చీమ మొదలు బ్రహ్మ వరకు వ్యాపించి యున్న పరమాత్మను మెల్లమెల్లగా హృదయంలో ఇముడ్చుకోవలెనో చెప్పబడింది. పదకొండవ అధ్యాయంలో సమగ్రతను గూర్చి చెప్పబడింది. విశ్వరూప దర్శనమందు సామాన్య రజఃకణములో కూడా విశ్వమంతయు ఇమిడివున్నదన్న అనుభవమును పొందుటయే విశ్వరూపదర్శనము యొక్క మహోన్నత సిద్ధాంతము. విరాట్ దర్శనం అంటే ఇదే, ఈ విధంగా ఆరవ అధ్యాయము నుండి పదకొండవ అధ్యాయము వరకు భక్తి రసము అనేక విధముల ఒడియగట్టబడి సారము వెలికి తీయబడింది.

ఈ పండ్రెండవ అధ్యాయంలో భక్తితత్వ విచారణ పూర్తి చేయవలసి వుంది. అర్జునుడు ఈ సమాప్తికి సంబంధించిన ప్రశ్నవేసెను. అయిదవ అధ్యాయంలో జీవశాస్త్ర విచారణ సమాప్తి సందర్భములో వేసినటువంటి ప్రశ్ననే తిరిగి ఇక్కడ కూడా అదే రీతిగా ప్రశ్నిస్తున్నాడు. అందుకై అర్జునుడు ఇట్లుడగుచున్నాడు.

"ప్రభూ!
కొందరు భక్తులు మనస్సును
సదా నీయందే నిలిపి నిన్ను
ఉపాసించుచున్నరో, మరి
కొందరు అవ్యక్తమైన అక్షర
పరబ్రహ్మను ధ్యానిస్తున్నారు
వీరిలో ఎవరు ఉత్తములు?
నీకెవరుప్రియులు?
అన్నది అర్జునుని ప్రశ్న

అర్జునుడు వేసిన ఈ ప్రశ్నకు భగవానుని జవాబు కంటే ముందు మహర్షి వినోబా ధూళియా జైల్లో వున్నపుడు తోటి రాజకీయఖైదీలతో గీతపై ఇందును గురించి చేసే వ్యాఖ్యను ముందుగా పరిశీలించి తదుపరి భగవానుడిచ్చిన సమాధానంలోకి వెళ్లదాం.

"ఒక తల్లికి ఇద్దరు బిడ్డలు వున్నారనుకొనుడు, వారిరువురిలో చిన్నవాడిది తల్లిని వదలి వుండలేని వయస్సు. తల్లిని చూస్తుంటే అతడు ఆనందపరవశుడౌతుంటాడు. తల్లి ఏ కొంచెము సేపు అగుపించకపోయినను వాడు వ్యాకులుడు అగును. తల్లి వియోగమును అతడు ఏ మాత్రము సహించలేడు. తల్లి అగుపించనిచో అతనికి ప్రపంచమే లేదు. అంతా శూన్యం.

చిన్నవాని పరిస్థితి ఈవిధంగా వుందనుకొందాం. ఇక పెద్దవాడి సంగతేమిటి? అతనికి కూడా తల్లిపైన అపారమైన మాతృప్రేమ వుంది. అయిదారు మాసాల పాటు తల్లి చూడకుండగనే వుండగలశక్తి అతనికి వుంది. పనిపాటలలో నిమగ్నమై వున్నందున తల్లి ప్రత్యక్షంగా కనుపించక పోయినను అతడు ఆమెను ఆపనుల్లోనే దర్శిస్తూ వుంటాడు. ఆ రకంగా తల్లి ఎడబాటును అతడు సహించగలడు. ఇతని చర్యలకు తల్లి ఎంతో ఆనందించును.

చిన్నవాని చర్య తల్లిని విడిచి వుండలేనిది, పెద్దవాని చర్య తల్లిని విడిచి వుండగల ఓర్పుగలది. ఆ ఇద్దరు కుమారులను గూర్చి ఏమమ్మా! నీ ఈ ఇద్దరి కుమారులలో ఎవరినో ఒకరిని నీ యొద్ద వుండనిచ్చెదము. ఇందులో నీ కెవరు కావలయునో కోరుకో అంటే అపుడు ఆ తల్లి ఏమంటుంది? అపుడామె మానసిక స్థితి ఎట్లుంటుంది? సహజంగా ఆమెకు ఇద్దరు కావాలి. ఏ ఒక్కరిని వీడుటకైనను మనస్సు, ప్రాణము, శరీరం విలవిల కొట్టుకుంటుంది. అయితే గత్యంతరం లేనిస్థితి ఏర్పడినపుడు మాత్రం ఇందులో ఒకరి వియోగం తప్పనిసరి అయినప్పుడు పెద్దవానిని తీసుకొనుడు అని అంటుంది. ఎందువల్ల? ఆమె వియోగాన్ని అతడు సహించగలడు. ఆమె కూడా అతని వియోగాన్ని సహించగల సహనం ఏర్పడి వుండింది. అందువల్ల పెద్దవానిని తీసుకోండి అంటుంది. అట్లు అంటూనే చిన్నవాడిని హృదయానికేసి(గుండెకు) అదుముకొనును.

అయితే ఇద్దరిలో ఎవరి యందు ఎక్కువ ప్రేమ? అన్న ప్రశ్నకు ఇది జవాబుకాదు, ఏదో ఒక జావాబు చెప్పాలి కనుక ఆ విధంగా చెప్పినదే ఆ జవాబు. అర్జునుడు వేసిన ప్రశ్న ఇదే విధంగా భగవానున్ని సందిగ్ధావస్థలో పడవేసింది.

ఆ సందిగ్ధావస్థ నుండియే భగవానుడు ఈ అధ్యాయంలో అర్జునునకు జవాబిస్తాడు. ఈ అధ్యాయంలో గల ముఖ్య విషయాలు

1. సాకార, నిరాకారోపాసనలను గూర్చిన విషయాలు *(1 నుండి 5వ శ్లోకం వరకు)*
2. భక్తియొక్క మహత్తర ఫలం *(6నుండి 8వ శ్లోకం వరకు)*
3. వివిధ ఆధ్యాత్మిక సాధనలు *(9 నుండి 12వ శ్లోకం వరకు)*
4. భక్తుని లక్షణాలు *(13నుండి 20వ శ్లోకం వరకు)*

సాకార, నిరాకరోపాసకులలో ఎవరు శ్రేష్ఠులు? అను అర్జునుని ప్రశ్నతో ఈ అధ్యాయం మొదలౌతుంది.

ఏవం సతత యుక్తాయే
భక్తాస్త్వాం పర్యుపాసతే
యే చాప్యక్షర మవ్యక్తం
తేషాం కే యోగవిత్తమాః శ్లో - 1

కృష్ణా!
కొందిర భక్తులు వారి మనస్సును
సదానీయందే నిలిపినిన్ను
ఉపాసించుచున్నారు
మరి కొందరు అవ్యక్తమైన
అక్షర పరబ్రహ్మను ధ్యానిస్తున్నారు
వీరిరువురిలో ఎవరు శ్రేష్ఠులు?

అర్జునునికి కలిగిన పై సంశయాన్ని తొలగించుటకు దిగువ శ్లోకాల ద్వారా భగవానుడు ప్రయత్నిస్తున్నాడు.

మయ్యావేశ్య మనో యే మాం
నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతాః
తేమే యుక్తతమా మతాః శ్లో - 2

అర్జునా!
నా యందే మనస్సు నిలిపి
నిత్యయుక్తులై సరియగు
శ్రద్ధతో నన్నే ఉపాసించు
వారు యోగి శ్రేష్ఠులు

యేత్వక్షరమనిర్దేశ్యం
అవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచిత్యం చ
కూటస్థ మచలం ధ్రువమ్ శ్లో -3

సంనియమ్యేన్ద్రియగ్రామం
సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మా మేవ
సర్వభూతహితే రతాః శ్లో - 4

ఇంద్రియములను నిగ్రహించి
అన్ని వైపులను సమబుద్ధికలిగి
వుండి, సమస్త ప్రాణులకు
మేలు చేయుటయందు పరమాసక్తి
గలవారై అక్షరము, అనిర్దేశ్యమును
సర్వవ్యాపియు, చింతించుటకు
వీలుకానిదియును, కూటస్థమును
(సర్వకాల సర్వావస్థలయందు ఒకే
రీతిగ వుండునది) అచలము, ధృవమును
అయిన బ్రహ్మమును ఉపాసించువారు
నన్నే పొందు చున్నారు

పరమాత్మ ఒకడే. అయితే ఆయన సాకారముగను, నిర్గుణముగను కూడా వుండును. ధ్యానించువారి ధ్యానము అది సగుణమైనను, నిర్గుణమైనను దాని లక్ష్యం ఒక్కటే. శ్రద్ధతో, నిర్మల భక్తితో పై రెండు విధములలో ఏ విధంగా ధ్యానించినను అట్టివారు ఆ పరమాత్మను చేరెదరు. ఇక్కడ ఈ 3,4 శ్లోకాలలో నిర్గుణ బ్రహ్మను ధ్యానించు వారిని గూర్చి చెప్పబడింది. మొదటి శ్లోకంలో బ్రహ్మమును గూర్చిన విశేషణాలను, రెండవ శ్లోకంలో బ్రహ్మప్రాప్తికి అవసరమయ్యే శీలసంపత్తిని గూర్చి తెలుపబడింది.

సాధకుడు పరమాత్మను ధ్యానించి నప్పటికీ, అతనిలో హృదయశుద్ధి లేనిచో, ఇంద్రియనిగ్రహం కలిగి వుండనిచో, ప్రాణికోటి యెడ దయలేనిచో అతడు చేసే ధ్యానము

చక్కటి ఫలితాన్ని ఇవ్వజాలదు. అట్టి వారికి బ్రహ్మానుభూతి కలుగుట దుస్తరం, అతని ఉపాసన అంతా కళాయి లేని పాత్రలో వండిన పప్పు పులుసు వలె నుండునని శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు తెలుపుతున్నారు. వస్తువులన్నియు మంచివే అయినను పాత్రశుద్ధిగా లేకపోతే ఆపాత్రలో వండిన పులుసు చిలుమెక్కిపోతుంది. తినుటకు యోగ్యమైనది కాక నిరుపయోగమౌతుంది. అదే విధంగా ఇంద్రియనిగ్రహం, భూతదయ, మొదలగు పవిత్ర గుణాలు లేక భగవంతుని నిరాకారముగా గాని, సాకారముగా గాని, ఏ విధంగా అర్చించినను ఫలితము సక్రమమైనదిగా వుండదు. అందువల్లనే మానవకోటికి ఇదొక హెచ్చరిక లాంటిది.

క్లేశోధికతరస్తేషాం
అవ్యక్తాసక్తచేతసామ్
అవ్యక్తా హి గతిర్దుఃఖం
దేహవద్భిరవాప్యతే శ్లో - 5

అవ్యక్తమైన అక్షర పరబ్రహ్మ
చింతనం బహుకష్టసాధ్యమైనపని
దేహాభిమానులైన వారిచే ఉపాసించ
బడే ఈ అవ్యక్తోపాసన అతి ప్రయాసతో
కూడుకొనిన దై యున్నది

అహం భావము లేక, ఇంద్రియనిగ్రహం కలిగిన, నిష్కామ కర్మానుష్ఠానము చేత చిత్తశుద్ధిని బడసిన వారికి నిర్గుణోపాసన వలన ఏమికష్టము కలుగదు, కలిగే కష్టమంతా దేహాభిమానం వున్నవారికే, అందువల్లనే దేహాభిమానులైన వారిచేత ఉపాసించబడే అవ్యక్తోపాసనం అతి కష్టమైనది అని తెలుపబడింది.

యే తు సర్వాణి కర్మాణి
మయి సన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన
మాం ధ్యాయన్త ఉపాసతే శ్లో - 6

తేషామహం సముద్ధర్తా
మృత్యుసంసారసాగరాత్
భవామి న చిరాత్పార్థః
మయ్యావేశిత చేతసామ్ శ్లో - 7

అర్జునా!
సర్వకర్మలను నాయందే సమర్పించి
నేనే పరమగతి యని భావించి
అనన్యయోగముచే నన్నే ధ్యానించుచు
సేవించుచూ నాయందు చిత్తమును
నిలిపిన వారలను జనన మరణములు
అను సంసార సాగరమునుండి నేను
శ్రీఘ్రముగ ఉద్ధరించెదను

అని భగవానుడు ప్రకటించి యున్నందు వలన ఇక్కడ జాతి, మత, లింగ, కులభేదములు లేక ఎవరైనను భగవంతుని ఆశ్రయించి తరించవచ్చునని ఈ శ్లోకం స్పష్టీకరిస్తున్నది.

మయ్యేవ మన ఆధత్స్వ
మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ
అత ఊర్ధ్వం న సంశయః శ్లో - 8

నీ మనస్సును నాయందు నిలుపుము
నీ బుద్ధిని నాయందు ప్రవేశపెట్టుము
ఆ తదుపరి నీవు నాయందే నివసింతువు
ఇందుకు ఎలాంటి సంశయం ఉండనక్కరలేదు

ఆదర్శ విద్యార్థికి, ఆదర్శ గురువు ఏ విధంగా పాఠాలు బోధించునో ఇక్కడ భగవానుడు అర్జునునకు బోధించాడు. ఈ బోధన మానవకోటి కంతటికీ వర్తించేదే.

ఈ పాఠ్యక్రమంలో మొదట

1. మనస్సును, బుద్ధిని స్థిరముగ పరమాత్మయందు నిలుపమని తెలుపడం జరిగింది.
2. తదుపరి మనోబుద్ధులను రెండింటిని దృశ్య వస్తువుయందు ప్రవేశింపనీయక పరమాత్మయందు సంలగ్నము చేయుట.
3. ఆ విధంగా చేసినపుడు మనుజుడు సదా పరమాత్మ యందే నివసించును.

అథ చిత్తం సమాధాతుం
న శక్నోషి మయి స్థిరం
అభ్యాసయోగేన తతో
మామి చ్ఛాప్తుం ధనఞ్జయ! శ్లో - 9

అర్జునా!
నీవు నీ మనస్సును
ఇంకను నాయందు స్థిరముగా
నిలుపుటకు అశక్తుడవైనచో
అభ్యాస యోగముచే నన్ను
పొందుటకు ప్రయత్నించుము

ఒకవేళ మనస్సు దైవము నందు నిలువనిచో (నిలుకడ పొందనిచో) అభ్యాసము వలన ఏ విధంగా నైనను దానిని నిలుకడ పొందించే విధంగా ప్రయత్నము చేయవలెనని భగవానుడు ప్రకటిస్తున్నాడు.

ప్రారంభ సమయంలో మనస్సు ధ్యేయము నందు నిలుపలేక పోయినచో దానిని మెల్ల మెల్లగా అభ్యాసము చేత ధ్యేయము వైపుకు మరలించే ప్రయత్నం చేయవలెను. మనస్సు ఆత్మయందు లయించి, ఆత్మరూపమును పొందుటనే మోక్షము అనబడుచున్నది. ఈ విషయాన్ని 6వ అధ్యాయము 26వ శ్లోకంలోనే "యతో యతో నిశ్చరతి"అని అంటే

"చంచలమైనదియును, నిలుకడ
లేనిదియును అగు మనస్సు
ఎచ్చటెచ్చట సంచరించు
చుండునో అచ్చటచ్చట నుండి
దానిని మరల్చి ఆత్మయందే నిలుపవలెను"

అని భగవానుడు ప్రకటించియున్నాడు, ఇట్టి అభ్యాసమును గూర్చియే భగవానుడు తిరిగి ఈ పంద్రెవ అధ్యాయంలోని 9వ శ్లోకము నందు అర్జునునకు తెలియజెప్పాడు.

అభ్యాసేప్య సమర్థోసి
మత్కర్మపరమో భవ
మదర్థమపి కర్మాణి
కుర్వన్సిద్ధి మవాప్స్యసి శ్లో - 10

ఈ అభ్యాసయోగమును
ఆచరించుటకు కూడా నీవు
అసమర్థుడవైనచో నా
నిమిత్తమైన కర్మల యందైనను
ఆసక్తి కలవాడవుగా కమ్ము
అట్లు నా కొరకు కర్మలను
ఆచరించినను నీవు సిద్ధిని పొందగలవు

అథైతదప్యశక్తో సి
కర్తుం మద్యోగ మాశ్రితః
సర్వకర్మఫలత్యాగం
తతః కురు యతాత్మవాన్ శ్లో - 11

అర్జునా!
నానిమిత్తమైన కర్మలను
ఆచరించుటకు కూడా నీవు
అశక్తుడవైనచో ఆత్మనిగ్రహం
కలిగి, నన్నే ఆశ్రయించి కర్మ
ఫలాసక్తిని వీడి కర్మలనా చరింపుము

శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్
జ్ఞానాద్ధ్యానం విశిష్యతే
ధ్యానాత్కర్మ ఫలత్యాగ
త్యాగాచ్ఛాంతిరనంతరమ్ శ్లో - 12

అభ్యాసము కంటే జ్ఞానము
శ్రేయోదాయకమైనది
జ్ఞానము కంటే ధ్యానం
ఉత్తమమైనది, ధ్యానము
కంటెను కర్మఫల త్యాగము
ఉన్నతమైంది, ఈ కర్మ
ఫలత్యాగము చేత శాంతిని పొందగలవు

అద్వేష్టా సర్వభూతానాం
మైత్రః కరుణ ఏవచ
నిర్మమో నిరహంకారః
సమదుఃఖ సుఖః క్షమీ శ్లో - 13

సంతుష్టస్సతతం యోగీ
యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పిత మనోబుద్ధిః
యో మద్భక్తస్సమే ప్రియః శ్లో - 14

భూతకోటిని ద్వేషింపనివాడును
మైత్రీ భావము, దయాభావము
గలవాడును, మమకార, అహంకారము
లకు దూరుడైనవాడును, సుఖదుఃఖములు
యందు సమత్వము కలిగిన వాడును
సహనశీలుడును, సదా సంతృప్తి
చెందియుండువాడును, మనో
బుద్ధులను నాయందే సమర్పించిన
వాడును అగుభక్తుడు నాకు ఇష్టుడు

యస్మాన్నోద్విజతే లోకో
లోకాన్నో ద్విజతే చ యః
హర్షామర్షభయోద్వేగైః
ముక్తోయస్స చ మే ప్రియః శ్లో - 15

ఎవని వలన లోకమునకు
భయము కలుగదో
లోకము వలన ఎవడు
భయమును పొందడో
సంతోషము, క్రోధము
భయము, ఉద్వేగము
నుండి ఎవడు ముక్తుడో
అట్టి వాడు నాకు ప్రియుడు

అనపేక్షశ్శుచిర్దక్ష
ఉదాసీనో గతవ్యథః
సర్వారంభపరిత్యాగీ
యో మద్భక్తస్స మే ప్రియః శ్లో - 16

వాంఛారహితుడను
(కోరికలు లేనివాడును)
పరిశుద్ధుడు, సమర్థుడును
నిర్లిప్తుడును, వ్యథలు
అంతరించిన వాడును
కర్మలయందు కర్తృత్వ
బుద్ధిని వదలినవాడును
అయిన నాభక్తుడు నాకు ఇష్టుడు

యో న హృష్యతి న ద్వేష్టి
న శోచతి న కాంక్షతి
శుభాశుభపరిత్యాగీ
భక్తిమాన్యస్సమే ప్రియః    శ్లో - 17

**ఎవడు సంతసించడో**
**ద్వేషించడో, దుఃఖింపడో**
**అభిలషించడో, శుభాశుభ**
**కర్మలను విడిచిన వాడో**
**అట్టి భక్తుడు  నాకు ఇష్టుడు**

సమశ్శత్రౌ చ మిత్రే చ
తథా మానవ మానయోః
శీతోష్ణ సుఖదుఃఖేషు
సమస్సంగవివర్జితః    శ్లో - 18

తుల్యనిందాస్తుతిర్మౌనీ
సంతుష్టో యేనకేనచిత్
అనికేతః స్థిరమతిః
భక్తిమాన్మే ప్రియో నరః    శ్లో - 19

**శత్రువునందును, మిత్రుని యందు**
**మానావ మానముల యందును**
**శీతోష్ణ సుఖ దుఃఖముల యందును**
**నిందాస్తుతుల యందును సమ**
**బుద్ధిగలవాడై, సంగరహితుడై**
**మననశీలుడై, లభించిన దానితో**
**తృప్తి నొందువాడై, నిర్దిష్టమైన**
**నివాసస్థలం లేని వాడై స్థిరబుద్ధి**
**కలిగియున్న భక్తుడెవడో అతడు**
**నాకు ఇష్టుడు**



1. శత్రుమిత్రులు 2. మానావమానములు 3. శీతోష్ణములు 4. సుఖదుఃఖములు 5. నిందాస్తుతులు. ఈరెండు శ్లోకాలలో ఈ అయిదు ద్వంద్వ పదాలు భగవానునిచే ఉచ్ఛరించబడ్డాయి.

ఈ అధ్యాయమునందు భక్తుని లక్షణములు ఎట్టివో అవి ఎన్నో వివరించబడ్డాయి.

1. ఏ ప్రాణిని ద్వేషింప కుండా వుండుట.
2. మైత్రీభావముతో వుండుట.
3. కరుణ కలిగి వుండుట.
4. మమత్వము లేకుండుట.
5. అహంకారము లేకుండుట.
6. సుఖదుఃఖములయందు సమభావము కలిగివుండుట.
7. ఓర్పును కలిగియుండుట.
8. నిత్యసంష్టుడై యుండుట.
9. మనోనిగ్రహం కలిగి యుండుట.
10. దృఢనిశ్చయముతో వ్యవహరించుట.
11. మనోబుద్ధులను భగవంతునకు సమర్పించుట.
12. లోకము వలన తానుగాని, తన వలన లోకము గాని భయపడకుండా వుండుట.
13. హర్షము, భయము, క్రోధము లేకుండుట.
14. దేనియందును అపేక్ష లేకుండుట (అనాసక్తము)
15. శుచిత్వం కలిగి యుండుట.
16. కార్యసామర్థ్యము కలిగియుండుట.
17. తటస్థత్వముతో వ్యవహరించుట.
18. మనో వ్యాకులత్వము లేకుండుట.
19. సర్వ కర్మముల యొక్క ఫలములను పరిత్యజించుట.
20. హర్షము లేకుండుట.
21. ద్వేషము లేకుండుట.
22. శోకము లేకుండుట.
23. కోరికలు లేకుండుట.
24. శుభాశుభములను పరిత్యజించుట.
25. శత్రుమిత్రుల యందు సమానత్వము కలిగియుండుట.

26. మానావమానములయందు సమభావన కలిగియుండుట.
27. శీతోష్ణముల యందు సమత్వము కలిగి యుండుట.
28. సుఖదుఃఖములయందు సమభావన కలిగియుండుట.
29. సంగవర్జితత్వము కలిగియుండుట.
30. నిందాస్తుతులయందు సమత్వము కలిగియుండుట.
31. మౌనము వహించి యుండుట.
32. దొరికిన దానితో సంతుష్టి పొందుట.
33. నివాసము నందు అభిమానము లేకుండుట.
34. స్థిరబుద్ధి కలిగి యుండుట.
35. భగవంతుని యందు భక్తి కలిగియుండుట.

ఈ ముప్పై అయిదు భక్తుని యొక్క లక్షణాలుగా ఈ అధ్యాయము నందు పేర్కొనడం జరిగింది.

ఈ ముప్పై అయిదు సద్గుణములతో విరాజిల్లు వాడే భక్తుడు. ఇవన్నీ జ్ఞానియొక్క లక్షణాలు. దాని వలన పరాభక్తికి, జ్ఞానమునకు భేదం ఏమిలేదని తెలుస్తున్నది.

ఆదిలో అంటే ప్రారంభంలో భగవానుని పత్రపుష్పాదుల చే పూజించు భక్తుడు అతని లోని చిత్తము క్రమంగా వికాసము నొందుతూ రాగా ఆ పిమ్మట సర్వాంతర్యామియగు భగవానుని మనః పుష్పము (మనస్సు అనే పుష్పములతో) పూజించును.

ఆది శంకరులవారు తమ 'శివానందలహరి'లో

ఓ పరమేశ్వరా!
చిత్తమను కమల పుష్పమును
నీ కర్పించి సుఖముగనుండుటను
ఈ జనులేల తెలుసుకోలేకున్నారు!
అని వినమ్రంగా ప్రశ్నించారు.

భక్తుని 35 లక్షణములలో "అహింసాతత్వము- ఇంద్రియ నిగ్రహము- భూతకోటి యందు దయ, క్షమ, శాంతి, తపస్సు, ధ్యానము, సత్యము సద్గుణములు అనబడే అను ఎనిమిది పుష్పాలు విష్ణు భగవానునికి చాలా ప్రీతికరములైనవని శ్రీ విద్యా ప్రకాశా నందగిరి స్వాముల వారు తమ గీతా మకరందం 818వ పేజీలో తెలియజేశారు.

యే తు ధర్మ్యామృత మిదం
యథోక్తం పర్యుపాసతే
శ్రద్ధధానా మత్పరమా
భక్తాస్తే తీవ మే ప్రియాః శ్లో - 20

శ్రద్ధావంతులై
నేనే పరమ గతియని
భావించి ఇంతవరకు
నేను తెలిపిన విధంగా
ఈ ధర్మస్వరూపమైన
పీ యూషమును (అమృతమును)
సేవించువారునాకు అత్యంత ప్రియులు

సగుణ, నిర్గుణముల పరస్పర పూరకములను గురించి మహర్షి వినోబా "శ్రీరామచంద్రుని, శ్రీకృష్ణుని చరిత్రల నుండి దృష్టాంతరములను ఈ విధంగా తాము 8-5-3న ధూళియా జైలులో తోటి రాజకీయ ఖైదీలనుద్దేశించి, చేసిన గీతా ప్రవచనముల సారాంశమును ఇక్కడ పొందుపరుస్తున్నాము.

రాముడు వనవాసమునకు వెళ్ళునప్పుడు లక్ష్మణుని తనవెంట తీసికొని వెళ్ళుటకు సిద్ధముగలేడు. ఆ తమ్ముని సాయమవసరమని రామునికి అనిపించలేదు. అతడు లక్ష్మణునితో ఇట్లనును - " లక్ష్మణా! తండ్రిగారి ఆజ్ఞానుసారము ననేనడవికి వెళ్లుచున్నాను. నీ వింటివద్ద నుండుము. నా వెంట వచ్చి దుఃఖములోనున్న తల్లిదండ్రులను మరింత దుఃఖపెట్టకుము. పితరుల సేవచేయుచు నీవు వారియొద్దనున్నచో నేను నిశ్చింతముగా నుందును. నా ప్రతినిధివిగ నీవిక్కడ నుండుము. నేనడవికి పోవుటచే కష్టముల పాలగుదునని తలపవలదు. ఋష్యాశ్రమములకే కదా నా యీ ప్రయాణము?" ఈ విధముగ రాముడు తమ్మునికి నచ్చ చెప్పినాడు. కాని లక్ష్మణుడు అన్న చెప్పినదాని నెల్లను ఒక్కమాటతో ఎగుర గొట్టెను. ఒక్క దెబ్బతో అది రెండుముక్కలయ్యెను. తులసీదాసు దీనిని సుందరముగా చిత్రించినాడు. లక్ష్మణుడిట్లనను- "నీవు చెప్పినది ఉత్కృష్టమగు నిగమగతియే, నిజమునకు నేను దానిని పాలింపవలసినవాడనే. కాని యీ రాజ్యభారమును నేను మోయలేను. నీకు ప్రతినిధిగ నుండగల శక్తినాకు లేదు. నేను బాలుడను.

హంస మేరుపర్వతమును మోయగలదా? రామచంద్రా! నేను నేటివరకును నీ ప్రేమలో పెరిగితిని. ఈ రాజనీతిని నీవు మరెవరికైనను నేర్పుము" అని చెప్పి లక్ష్మణుడు ఊరకుండెను.

చేప నీటిని వదలియుండలేనట్లయినది లక్ష్మణుని స్థితి. రాముని వదలి యుండు శక్తి అతనిలో లేదు. రాముని యెడల సహానుభూతి అతని రోమరోమములోను నిండియున్నది. రాముడు నిద్రించుచున్నపుడు కూడ తాను మేల్కొని అతని సేవ చేయువాడు. ఇందులోనే అతనికి ఆనందముండెడిది. ఎవరైనను కంటిమీద కంకరఱాయి విసరినచో వెంటనే చేయిపైకి లేచి ఆ దెబ్బను తాను భరించి కంటిని కాపాడును. అట్లే లక్ష్మణుడు రామునికి చేతివలె నుండువాడు. రామునిపై దెబ్బ పడబోయినచో లక్ష్మణుడా దెబ్బను తట్టుకొనువాడు. తులసీదాసు లక్ష్మణుని గూర్చి ఒక చక్కని యుదాహరణ నిచ్చినాడు. జెండా ఒక దండముపై ఎత్తున నెగురుచుండును. గానము, వందనము మొదలైన వన్నియు జెండాకే చేయుదుము. దాని రంగు, ఆకారము మొదలైన వానిని గూర్చి స్తుతి గీతములు పాడుదుము. కాని సూటిగా నిలిచియున్న ఆ స్తంభమును తలచు వారెవరూ రాముని యశస్సను పతాతకు ఆధారమైనదండము లక్ష్మణుడు. జెండాదండ మెప్పడును ఒరగియుండరాదు. అట్టి దండమై నిలిచిన లక్ష్మణుడును ఎన్నడును ఒరగి యుండలేదు. యశస్సెవరికి వచ్చినది? రామునికి. ప్రపంచమునకు కనబడునది పతాక దండముతో నెవ్వరికి పనిలేదు. శిఖరము కనబడును. కాని క్రిందనున్న పునాది యెవరికిని కనబడదు. రాముని యశస్సు వ్యాపించి యున్నది. కాని లక్ష్మణుని యూరును పేరును లేదు. పదునాలుగు వత్సరములు ఈ దండ మట్లే నిలిచి యుండెను. ఏ వైపునకును ఇంచుక ఒరగలేదు. అతడు స్వయముగ రాముని వెనుకనే నిలిచి రామ యశమును వ్యాపింప జేయుచుండెను. రాముడు అత్యంత కఠిన కార్యములను లక్ష్మణుని చేత చేయించెను. సీతను అడవిలో వదలిపెట్టు పని చివరకు లక్ష్మణునికే అప్పగించెను. పాపము లక్ష్మణుడట్లే ఆమెను అడవిలో వదలి వచ్చెను. లక్ష్మణునికి స్వతంత్రముగా నెట్టి అస్తిత్వమును లేదు. లక్ష్మణుడు రాముని నేత్రములు, హస్తములు, పాదములు, మనస్సు అయెను. నది సముద్రములో కలిసినట్లే లక్ష్మణుని సేవ రామునిలో లీనమై పోయినది. అతడు కేవలము రాముని ఛాయగా నయ్యెను. లక్ష్మణుని ఈ భక్తి సగుణ భక్తి.

భరతుడు నిర్గుణ భక్తుడు. అతని పాత్రను గూడ తులసీదాసు బాగుగనే చిత్రించినాడు. రాముడడవికి వెళ్ళినప్పడు భరతు డయోధ్యలో లేడు. అతడు తిరిగి వచ్చునప్పటికి దశరథుడు చనిపోయెను. 'ఇక నీవు రాజ్యము చేయవలె' నని గురువైన వసిష్ఠుడు భరతునికి నచ్చచెప్పచుండగానతడు "నేను పోయి రాముని కలిసికొని రావలె" నన్నాడు.

రాముని చూచి రావలెనని భరతుడు లోలోపల తహతహ పడుచునే దానితో పాటు రాజ్యనిర్వహణమునకు వలసిన యేర్పాట్లు చేయుచుండెను. "ఇది రాముని రాజ్యము. దానిని నిర్వహించుట యనగా రాముని కార్యము నిర్వహించుటయే. ఈ సంపత్తికెల్ల యజమానుడు రాముడు. దానికి తగిన యేర్పాటు చేయుటయే నా కర్తవ్యము" అని భరతుని భావము. లక్ష్మణుని వలె భరతుడు ఈ కర్తవ్య భావన నుండి విముక్తుడు కాలేకపోయెను. భరతుని భూమిక యిది. రాముని మీది భక్తియనగా రాముని కార్యము చేయుటయే. లేకున్నచో ఆ భక్తి యెందులకు! రాజ్య నిర్వహణమునకు ఏర్పాట్లన్నియు చేసి రాముని కలిసికొనుటకు భరతుడు అడవికి వెళ్లెను. "అన్నా! ఈ రాజ్యము నీది, నీవు-" అని యనునంత లో రాముడు "భరతా! నీవే రాజ్యము చేయుము" అనెను. అంత భరతుడు సంకోచముతో అట్లే నిలబడిపోయి "నీ యాజ్ఞ నాకు ప్రమాణము" అనెను. రాముడన్నదెల్ల భరతునికి ప్రమాణము. అతడు తన సర్వమును రాముని కర్పించివేసెను.

తిరిగి వెళ్లి రాజ్యపాలనను ప్రారంభించెను. కాని అందలి విశిష్టతను చూడుడు- అయోధ్యకు రెండుమైళ్ల దూరములో అతడు తపస్విగా నుండి రాజకార్యములు చక్కబెట్టుచుండెను. చివరకు రాముడు తిరిగివచ్చి భరతుని కలిసినప్పుడు వారిలో వనమునందుండి తపస్సు చేసిన వారెవరో తెలిసికొనుట ప్రజలకు కష్టమయ్యెను. వయసులో కొంచెము భేదమున్నను రామభరతుల ముఖముద్రలలో ఒకటే తపో నిష్ఠ. కాన ప్రజలు రాముడెవరో భరతుడెవరో గుర్తింపలేని స్థితిలో బడిరి చిత్రకారుడెవడైన ఈ దృశ్యమును చిత్రించినచో అదెంత పవిత్రమైన దగును! ఇట్లు భరతుడు శారీరకముగ రామునికి దూరమునందున్నను మానసికముగ ఒక్క క్షణకాలమైనను రాముని ఎడబాయలేదు. ఒక ప్రక్కనతడు రాజ్యపాలన చేయుచున్నను మానసికముగ రామునియొద్దనే యుండెను. నిర్గుణములో సగుణభక్తి పూర్ణముగ నిండియుండును. కనుక అట్టిస్థితిలో వియోగమను మాట భరతునికి స్ఫురించుడెట్లు? అతనికి వియోగబాధ కలుగనేలేదు. అతడు తన ప్రభువు యొక్క కార్యమును నిర్వహించుచునే యుండెను..

రామ నామము, రామభక్తి, రామోపాసన ఇదంతయు మాకుబోధపడుట లేదు. మేము చేయునదంతయు దేవుని పనియే" అని ఈ కాలపు యువజనులనుచుందురు ఈ కార్యమెట్లు చేయవలెనో భరతుడు చేసి చూపించెను. రాముని కార్యము చేయుచు భరతుడు రామ వియోగమును విస్మరించెను. భగవద్వియోగము ననుభవించుటకు తీరిక లేకుండ భగవత్కార్యము నిర్వహించుట వేరు, భగవంతునితో ఆత్మీయమగు

సంబంధము కాసంతయు లేక ఊరక అతసుని గూర్చి మాటలాడుట వేరు. భగవంతుని కార్యములు చేయుచు సంయమ పూర్ణమైన జీవితము గడుపుట దుర్లభము. భరతునిది నిర్గుణ భక్తియైనను దానికి సగుణము యొక్క ఆధారము లేక పోలేదు. "రామా! నీ మాట నాకు ప్రమాణము. నీవేది చెప్పినను, అందు నాకు సందేహమేమియు లేదు" అని భరతుడు వెళ్ళబోవుచూ మరలా వెనుకకు తిరిగి "రాముని వంకచూచి రామా మనసు తృప్తి పడుటలేదు ఏదో వెలితి అయినట్లు తోచుచున్నది." అనెను. వెంటనే రాముడతని మనోభావమును గ్రహించి "ఈ పాదుకలు తీసికో" అన్నాడు. చివరకు సగుణము నెడల ఆదరణ ఉండనే యున్నది సగుణము వచ్చి నిర్గుణమునకు మృదుత్వము నిచ్చెను. లక్ష్మణుడైనచో ఆ పాదుకలతో తృప్తి పడువాడు కాడు ఇది యతని దృష్టిలో పాలు కావలసిన వానికి మజ్జిగ దొరికినట్లుండును. భరతుని భూమిక వేరు. అతడు రామునికి దూరముగా నుండి కర్మనాచరించెను. కాని అతని హృదయము రామమయము భరతుడు కర్తవ్యపాలనముననే రామభక్తిగా నెంచుకొనెను. అతనికి పాదుకల ఆవశ్యకము ఎంతైనను కనబడెను. పాదుకలు లేకపోయినచో అతడు రాజ్యపాలన చేయలేడు. పాదుకల ఆజ్ఞననుసరించి అతడు తన కర్తవ్యమును నిర్వహించెను. లక్ష్మణుడెంత రామ భక్తుడో, భరతుడును అంతే. బాహ్యముగ చూచిన ఇరువురి భూమికలు వేరువేరు. భరతుడు కర్తవ్యనిష్ఠుడు. తత్త్వనిష్ఠుడు అయినను ఆ తత్త్వనిష్ఠకు పాదుకలతోడి ఆవశ్యకము తప్పలేదు.

సగుణ నిర్గుణములు పరస్పర పూరకములు: కృష్ణుని చరిత్ర నుండి దృష్టాంతము.

హరిభక్తి యను ఆర్ద్రత ముఖ్యముగ కావలెను. ఇందుచేత భగవంతుడర్జునునితో - "మయాసక్తమనా:పార్థ" అర్జునా! నాయం దాసక్తితో, నా కృపారసమును క్రోలుచు కర్మనాచరింపుము- అని పదే పదే చెప్పచు వచ్చినాడు. ఆసక్తియను శబ్దమునే సూచింపని, ప్రేమింపని భగవద్గీత, అనాసక్తుడవై రాగద్వేషరహితుడవై నిరపేక్షతో కర్మనాచరింపుమని పదే పదే నొక్కి చెప్ప భగవద్గీత, అనాసక్తిని, నిస్సంగత్వమును పల్లవి అను పల్లవిగా చేసిన భగవద్గీత "అర్జునా! నాయందాసక్తి నుంచుము" అని యనుచున్నది. కాని భగవంతునియందాసక్తి కలిగి యుండుట చాల ఉత్కృష్ట విషయమను సంగతి మనము లక్ష్యమునందుంచుకొనవలె. అది ఏ భౌతిక వస్తువు మీదనో మనము చూపు ఆసక్తి కాదు. సగుణము నిర్గుణము- ఈ రెండును ఒక దానితో నొకటి పెనవేసికొని యుండును. సగుణము నిర్గుణము యొక్క ఆశ్రయమును పూర్తిగ వదలియుండజాలదు. అట్లే నిర్గుణమునకు సగుణము యొక్క ఆర్ద్రత అవసరము. ఎల్లప్పడును కర్తవ్యకర్మ నాచరించు వానికర్మ పూజారూపమే. కాని పూజతో పాటు

రసము ఆర్ద్రత (భక్తి) ఉండవలె. "మా మనుస్మరయుద్ధ్యచ" నా స్మరణ చేయుచునే కర్మనాచరింపుము. కర్మము వస్తుతః పూజయే! కాని దాని వెనుక సజీవమైన భక్తి భావము ఉండవలె. కేవలము పువ్వులతో చేయునది పూజకాదు. దానిలో భక్తిభావము ఉండవలెను. పుష్పములు సమర్పించుట ఒక పూజా విధానము. సత్కర్మలద్వారా పూజ చేయుట మరి యొక పద్ధతి. కాని రెంటిలోను భక్తిభావము ఉండవలెను. పుష్పములు సమర్పింపుము. కాని భక్తి లేనిచో ఆ పూవులు కేవలము ఱాతిమీద పడవేసినట్లే. కనుక ముఖ్యవస్తువు భక్తి సగుణము- నిర్గుణము, కర్మ- ప్రేమ, జ్ఞానము-భక్తి- వీని యన్నటి రూపమును ఒకటే. వీని ద్వారా పొందు అనుభవము చివర కొకటే.

ఉద్ధవార్జునుల విషయము తీసికొనుడు. రామాయణము నుండి ఒక్కసారిగ మహాభారతములోనికి దుముకుచున్నాను. ఇందులకు నా కాధికారమున్నది. ఎట్లనగా రాముడన్నను కృష్ణుడన్నను ఒకటే. భరత లక్ష్మణులవంటి వారే ఉద్ధవార్జునులు. కృష్ణుడున్న చోట నెల్ల ఉద్ధవు డుండవలయును. కృష్ణుని తోడి వియోగము ఉద్ధవుడు క్షణమాత్రము కూడ సహింపలేడు. అతడు నిరంతరము కృష్ణుని సేవలో నిమగ్నుడైయుండును. కృష్ణుడు వినా ప్రపంచమంతయు అతనికి రసవిహీనముగ నుండును. అర్జునుడు కూడ కృష్ణుని సఖుడే! కాని యతడు దూరముగా ఇంద్రప్రస్థలో నుండును. అర్జునుడు కూడ కృష్ణుని కార్యము నెరవేర్చువాడే! కాని కృష్ణుడు ద్వారకలోను, అర్జునుడు ఇంద్రప్రస్థములోను ఉందురు. ఇద్దరి సంబంధమిది.

కృష్ణుడు దేహత్యాగము చేయవలసి వచ్చినప్పడు అతడుద్ధవునితో "ఉద్ధవా! నేనిక పోవుచున్నాను" అనెను "నన్ను కూడ మీతో తీసికొని వెళ్లరా? మనమిద్దరమును కలిసియే పోవుదము" అన్నాడు ఉద్ధవుడు. కాని కృష్ణుడు "ఇది నాకు సమ్మతము కాదు. సూర్యుడు తన తేజస్సును అగ్నిలో ఉంచి వెళ్లినట్లే నా జ్యోతిని నీలో ఉంచి పోవు చున్నాను" అని చెప్పినాడు ఈ విధముగ భగవంతుడు ఉద్ధవుని పట్ల చరమనిర్ణయ మొనర్చి, జ్ఞానమును ప్రసాదించి అతనిని పంపెను. తరువాత కొన్నాళ్లకు కృష్ణుడు తన లోకమున కేగెను. ఈ వార్త ఉద్ధవునికి తీర్థయాత్రలో మైత్రేయ ఋషి వలన తెలియవచ్చెను. కాని దీని కతడించుకయు చలింపలేదు. ఏమియు జరుగనట్లే యుండెను.

"గురువు చనిపోగా శిష్యుడేడ్చినాడు. ఉభయులును బోధను వ్యర్థమొనర్చినారు."

ఇట్టి గతి ఉద్ధవునికి పట్టలేదు. వియోగము కలుగనట్లే యున్నాడతడు. అతడు జీవితము పొడుగునను సగుణోపాసన చేసినాడు. ఎప్పుడును పరమేశ్వర సన్నిధినే

ఉండువాడు. కాని ఇప్పుడతడు నిర్గుణములోనే ఆనందమును పొందుచు, నిర్గుణమను మజిలీని చేరుకున్నాడు. సాధన సగుణముతో ప్రారంభమైనను నిర్గుణమను మెట్టును ఎక్కవలసియే యున్నది. లేకున్న పరిపూర్ణత కలుగదు.

అర్జునుని స్థితి దీనికి వ్యతిరేకము. శ్రీకృష్ణుడు అతని నేమి చేయుమనెను? తాను పోయిన తరువాత తన స్త్రీల రక్షింపుమనెను. అర్జునుడు ఇంద్రప్రస్థము నుండి ద్వారకకు వచ్చి శ్రీకృష్ణుని స్త్రీలను తీసికొని ఇంద్రప్రస్థకు బయలు దేరెను. దారిలో హిసార్ దగ్గర పాంచాలచోరులు వారిపై బడి సొమ్మును దోచుకొని పోయిరి. తానొక్కడే నరుడని, మహావీరుడని, పరాజయ మెరుగని వాడని, విజయుడని ప్రసిద్ధికెక్కిన అర్జునుడు, ప్రత్యక్షముగ యుద్ధము చేసి శివుని ఓడించిన అర్జునుడు చివర కీ సందర్భములో అజమీరునకు పారిపోయి ప్రాణమును రక్షించుకొనెను. కృష్ణుని వియోగము వలన అతడు చాల కలతపడి జీవచ్ఛవమై పోయినాడు. దీని సారాంశమిది: సర్వదా కర్మరతుడయి, కృష్ణునికి దూరముగ నుండి నిర్గుణోపాసన చేసిన అర్జునునికి చివరకీ వియోగభారము దుస్సహమయినది. దీనితో అతడు చేసిన నిర్గుణోపాసనకే ముప్ప వాటిల్లినది. నిర్గుణమునకు సగుణాను భవము తప్పినది కాదు. సగుణము, నిర్గుణము పరస్పర పూరకములయి పూర్ణత్వమును పొందును. దేనికది పూర్ణము కాదు:

అందువలన సగుణ నిర్గుణోపాసనకు లిరువుర నడుమ నుండు భేదమును వివరింపవలెనన్న భాష కుంటుపడును. సగుణము, నిర్గుణము చివరకొకటే. భక్తి ప్రవాహము మొదట సగుణములతో ఆరంభమైనను చివరకు నిర్గుణములతో పరిసమాప్తి నొందును.

**ఈ విధంగా ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును**
**శ్రీకృష్ణార్జున సంవాద రూపమును అయిన**
**శ్రీమద్భగవద్గీత యందలి భక్తియోగమను పేరుగల**
**పన్నెండవ అధ్యాయం సమాప్తము గావించబడింది.**



# గీతా సంహిత

**అధ్యాయము పదమూడు** | **క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము**

భగవద్గీతయందు విశేషమైన చర్చగాని, విశేషమైన వ్యాఖ్యగాని లేదు. ఇందుకు ముఖ్యకారణము గీతలో తెలుపబడిన ప్రతివిషయాన్ని మానవుడు పరిశీలించుకొని వాటిని తన నిత్యజీవితంలో ప్రయోగించుకొనవలెనన్నదే భగవానుని ఉద్దేశము. జీవితమునకు ఉపయోగపడు ఉద్దేశములే భగవద్గీతయందు ఉల్లేఖించబడినవి.

భారత, భగవద్గీతల రచనా కర్త శ్రీ వ్యాసమహర్షి ఉద్దేశము కూడా అదే. అందువల్లనే వ్యాసమహర్షి గీతాతత్వమును క్లుప్తంగా చెప్పి సంతృప్తి పొందిమిన్నకున్నాడు. ఇట్లు ఆయన తృప్తి పడుటలో ఆయన సత్యనిరతి, ఆత్మవిశ్వాసం ఏమిటో మనకు స్పష్టంగా అవగతమౌతున్నది. సత్యమైన విషయాన్ని సమర్థించుటకు ఎక్కువ యుక్తిని పన్నుట అవసరం లేదు.

గీతపై మానవుడు ఎందుకు దృష్టిని ప్రసాదించవలసి వున్నది అంటే మనకు సహాయం అవసరమైనపుడు అది మనకు సహాయాన్ని , సానుభూతిని అందిస్తుంది కనుక. దానిని అధ్యయనం చేస్తున్న ప్రతిక్షణ క్షణము గీత మనకు సహాయపడుతున్నట్లు మనం కనుగొనగలము. గీత మానవునికి జీవనోపకారి యగు శాస్త్రము. అందువలననే గీతలో స్వధర్మము గూర్చిఅంత గట్టిగానొక్కిచెప్పబడింది. మానవుని జీవితానికి స్వధర్మాచరణ మే గట్టి పునాది. జీవిత సౌధము అంతా ఈ పునాదిపైననే ఆధారపడి వుంది. ఈ పునాది యొక్క గట్టితనమును బట్టి మానవ భవనము యొక్క మనుగడ ఆధారపడివుంటుంది.

ఈ స్వధర్మాచరణను గూర్చియే గీత "కర్మ" అని చెబుతున్నది. స్వధర్మాచరణమునకు సన్నిహితముగా వుండే అనేకమగు ఇతర విషయములు కూడా గీతయందు ప్రతిపాదింపబడినవి. వాటిరక్షణ కొరకు అనేక వికర్మలు సూచించబడినవి.

స్వధర్మాచరణను సుందరముగాను, ఆకర్షణీయముగాను, ఫలప్రదముగాను చేయుటకు కావలసిన ఆధారాలు, సహాయమును సమకూర్చడం అవసరం. ఇటువంటి సంగతులను ఎన్నింటినో ఇంతవరకుమనం అధ్యయనము చేసిన పంద్రెండు అధ్యాయాలలో చూచినాము. ఇవన్నీకూడా చాలా వరకు భక్తిరూపమైనవే. ఇపుడు ఈ పదమూడవ అధ్యాయములో మనం చూడబోయె విషయాలు కూడా స్వధర్మాచరణకు ఎంతో ఉపయోగకరమైనవి. భావ వికాసమువలననే మానవునికి ఈ సహాయము జరుగుతుంది. స్వధర్మమును ఆచరించేవాడు ఫలత్యాగము చేయవలసియున్నాడను ముఖ్యవిషయముగీతలో పదే పదే చెప్పబడింది. విధిగా కర్మను చేయుము. దాని ఫలమును విడిచిపెట్టుము. చెట్టునకు నీరు పోసి పోషింపుము.కాని దాని నీడను, ఫల పుష్పములను స్వయముగ అనుభవించవలెనని కోరకుము స్వధర్మమును ఆచరించు కర్మయోగము యొక్క రూపము అంటే ఇదే. కర్మయోగము అంటే కేవలము కర్మలను చేయడము కాదు. ఈ సృష్టిలో కర్మ దానంతట అది జరుగుతూనే వుంటుంది. ఆ విషయాన్ని లెక్కలోకి తీసుకోవలసిన అవసరం లేదు. కాని అటువంటి కర్మకాక, స్వధర్మాచరణరూపమైన కర్మను చక్కగా ఆచరించుచు దాని ఫలమును వదలిపెట్టుమని చెప్పుట తేలికయే. కాని దానిని ఆచరించడం ఎంతో కష్టము. ఎందువల్లనంటే ఏ కార్యమునైనను మానవుణ్ణి ప్రేరేపించునది దాని ఫలవాంఛయే. ఫలవాంఛ లేకుండా కర్మనాచరించుట తలక్రిందు పద్ధతి. ఫలవాంఛ లేకుండా వ్యవహరించడం అంటే లోకవ్యవహారమునకు విరుద్ధము. గీత దృష్టిలో బహుకర్మలాచరించు వాడు కర్మయోగి అని మనము తలంచెదము. ఎడతెగకుండా పనులు చేయువాని జీవితము కర్మయోగమయమని మన లెక్క. కాని ఈ నిర్వచనం సరైందికాదు. గీత యిచ్చిన నిర్వచనాన్ని బట్టి చూస్తే ఇట్టివాడు కర్మయోగికాడు. కర్మలను ఆచరించు కోట్లాది ప్రజలలోను వట్టి కర్మలే కాక స్వధర్మమును ఆచరించు వారిలోనూ గీతనిరూపించిన కర్మయోగులు దొరుకుట దుర్లభము.

కర్మయోగము యొక్క సూక్ష్మమైన , నిజమైన అర్థమును బట్టి చూచినచో సంపూర్ణుడైన కర్మయోగి ఎక్కడను దొరకడనియే చెప్పవచ్చును. కర్మను ఆచరించుట, దాని ఫలమును వదలివేయుట కేవలము అసాధారణమైన విషయము. అది అసాధారణ విషయమే అయినప్పటికీ గీత మాత్రము "కర్మను- కర్మ ఫలము"ను వేరు చేయమని చెప్పుచున్నది. ఇది ఆచరణ యోగ్యమగుటచే దానిని గూర్చి తిరిగి ఈ పదమూడవ అధ్యాయములో "ఆత్మానాత్మ వివేకం" అనే పేరుతో చెప్పబడుతున్నది.

"కర్మను ఆచరించుము, దాని నుండి
వచ్చే ఫలమును ఆశింపకుము"

అను అంశాన్ని బలపరుచుటకుగాను "దేహమును-ఆత్మను వేరు చేయుము" అను మహోత్కృష్టమైన ఈ అంశం మానవునికి ఎంతో సాయ పడుతుంది. ఈ పదమూడవ అధ్యాయములో ప్రతిపాదింపబడిన ప్రధాన అంశం ఇదియే. మనకన్నులకు అగుపడురూపమును మూర్తి, ఆకారము, దేహము అని అంటున్నాము. మన నేత్రములకు బాహ్యరూపము పరిచితమైనను దాని అంతః రూపాన్ని కూడా మనం తెలుసుకోవలె. పండు యొక్క పై తోలును తీసి లోపలి గుంజును (గుజ్జు) తీసి దాని రుచిచూడవలె. కొబ్బరిపైగల టెంకమును (కవచము)ను తొలగించినపుడు లోపల వుండే కొబ్బరి మనకు అగుపిస్తుంది. పనసపండు విషయము కూడా అంతే. పనస తొనలపై గల చెక్కును తీసివేస్తే లోపల వుండే తీయటి తొనలు మనకు అగుపిస్తాయి. మన స్వంత విషయములో గాని, ఇతరుల విషయములోగాని బహిరంతములను వేరు చేసి చూచుట అవసరము, పై తొడుగును వేరుచేయడం అంటె వస్తువు యొక్క బాహ్యరూపం నుండి లోపలి సారమును వేరు చేసి చూచుట అని అర్థము. దానిని బట్టి ప్రతి వస్తువుకును వెలుపల నుండునది దేహమని, లోపలనుండునది ఆత్మయని తెలుసుకొనవలెను. ఈ విధంగా ప్రతి వస్తువుకు "బాహ్యము- అంతరము" అనిరెండు రూపాలుండును.

కర్మ విషయములో కూడా ఇంతే, బాహ్య ఫలము కర్మకు దేహము. కర్మను ఆచరించుటచే కలుగు చిత్త శుద్ధికర్మకు ఆత్మయని గుర్తించవలసి వుంది. కనుక స్వధర్మాచరణ యొక్క బాహ్యఫలమును దేహమును వదలిపెట్టుము. అంతరమగు చిత్తశుద్ధియను ఆత్మను గ్రహించి నూతన చైతన్యమును పొందుము. ఈ విధముగా చూస్తూ అభ్యాసముతో దేహమును వేరుచేసి , ప్రతివస్తువులోని సారమును గ్రహించు దృష్టినిమనము అలవరుచుకొనవలెను. కంటికి, మనస్సునకు, భావనకు ఇటువంటి శిక్షణను, ఇవ్వవలసి వుంటుంది. ప్రతి విషయములోను దేహమును వేరుపరచి ఆత్మను గౌరవింపవలెను. కనుకనే మానవుని యొక్క భావ వికాసము కొరకు ఈ పదమూడవ అధ్యాయం ఆవిర్భవించింది.

ఈ అధ్యాయంలో 35శ్లోకాలున్నాయి. ఇందులో

1. క్షేత్రం , క్షేత్రజ్ఞులయొక్క స్వరూపమును గూర్చిన వివరణ*(1నుండి 7వ శ్లోకం వరకు)*
2. అమానిత్వాదిజ్ఞానగుణములు *(8 నుండి 12వ శ్లోకం వరకు)*
3. జ్ఞేయ వస్తు ప్రతిపాదనము *(13నుండి 18వ శ్లోకంవరకు)*
4. ప్రకృతి పురుషుల వర్ణనము *(19నుండి 35వ శ్లోకం వరకు)*

క్షేత్రం అనగా గీతార్థములో శరీరము అని క్షేత్రజ్ఞుడనగా ఆత్మయని అర్థము. క్షేత్రం పంచభూతాత్మకమైనది. క్షేత్రజ్ఞుడు క్షేత్రాన్ని గూర్చి తెలుసుకొన్న ప్రత్యగాత్మ. క్షేత్రమునశ్వరమును

వికారవంతమును అయినటువంటిది. క్షేత్రజ్ఞుడు చిన్మయ రూపుడు, శాశ్వతుడు, వికార రహితుడు. ఈ రెండింటి యొక్క స్వభావములు వివరింపబడి, కలిసియున్నట్టి వాని యొక్క విభజనమును గూర్చి తెలుపబడిన అధ్యాయమగుటవలన ఈ అధ్యాయమునకు "క్షేత్ర, క్షేత్రజ్ఞ విభాగ యోగం" అనే పేరు కలిగింది. అర్జునుడు నిర్గుణ పరమాత్మ యొక్క తత్వమును, జ్ఞాన సంబంధమైన విచారణలను పరిపూర్ణంగా తెలుసుకోగోరినవాడై వాటిని గురించి భగవానునికి వేసిన ప్రశ్నతో ఈ అధ్యాయము మొదలౌతున్నది.

ప్రకృతిం పురుషం చైవ
క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ
ఏతద్వేదితు మిచ్ఛామి
జ్ఞానం జ్ఞేయం చ కేశవః శ్లో - 1

*కృష్ణా!*
*ప్రకృతి- పురుషుడు*
*క్షేత్రం- క్షేత్రజ్ఞుడు*
*జ్ఞానం- జ్ఞేయం*
*వీటిని గురించి నేను*
*సంపూర్ణంగా తెలుసుకో*
*గోరుతున్నాను, దయతో*
*వాటి స్వరూప- స్వభావాలను*
*గూర్చి తెలియ జేయవా?*
*అని అర్జునుడు ప్రశ్నించాడు*

గీతకు ప్రప్రథమ భాష్యకారులైన ఆదిశంకరాచార్యుల వారు తమ భాష్యంలో ఈ శ్లోకాన్ని గూర్చి ప్రస్తావించలేదు. "కర్మయోగరహస్య" గ్రంథకర్త ప్రముఖస్వాతంత్ర్యసమర నాయకులు లోకమాన్య శ్రీ బాలగంగాధర తిలక్‌గారు కూడా ఈ శ్లోకాన్ని గూర్చిన ప్రస్తావనను తమ భాష్యములో ఇది ప్రక్షిప్తమని దానిని త్రోసివేశారు.

ఇదే విధంగా జాతిపిత మహాత్మాగాంధీగారు కూడా ఈ శ్లోకాన్ని పరిగణనలోకి తీసుకోకుండా వారు తమ"Gospel of Slef Less Action" లో దాని తరువాత శ్లోకాన్ని తీసుకొని దానికి మాత్రమే భాష్యము చెప్పారు. గోరక్‌పూర్‌నుండి "గీతా" ప్రెస్‌వారు ప్రచురించిన "జయదయాల్ గోయనంద్‌కా" గారి వ్యాఖ్యానంలో కూడా ఈ శ్లోకం అగుపించదు.

అయితే ఈ శ్లోకమును గూర్చి "ఏర్పేడు" వ్యాసాశ్రమ పీఠాధిపతులు మహర్షిమలయాళ స్వాములవారి వ్యాఖ్యానంలోను, శ్రీకాళహస్తిలోని శుకబ్రహ్మాశ్రమ పీఠాధిపతులు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి గీతామకరందం లోను, తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రచురించిన శ్రీ శిష్ట్లా సుబ్బారావుగారి "శ్రీ మద్భగవద్గీతా' అనే గ్రంథంలోను, రాజమండ్రిలోని ధవళేశ్వరంలో శ్రీ సుందరచైతన్యానందా శ్రమపీఠాధిపతులు శ్రీ సుందరచైతన్యానంద స్వాములవారు వ్యాఖ్యానించిన "శ్రీ మద్భగవద్గీత" లోను, పుట్టపర్తిలోని ప్రశాంతి నిలయం సంస్థాపకులు శ్రీ సత్యసాయిబాబా గారు వ్యాఖ్యానించిన తమ గీతా వాహినిలోను పూజ్యశ్రీ ఎ.సి. భక్తి వేదాంత స్వామి ప్రభుపాదులవారు తమ భాష్యంలో దీనిని గురించి ప్రముఖంగా వివరించారు.

**అర్థము** : అర్జునః= అర్జునుడు, ఉవాచ=పలికెను; ప్రకృతి=ప్రకృతిని; పురుషం, చ, ఏవ= పురుషుని (భోక్తను); క్షేత్రం= క్షేత్రము (దేహము) క్షేత్రజ్ఞం, ఏవ, చ =క్షేత్రజ్ఞుడనియు (దేహము నెరింగినవాడు) ఏతత్= ఇదియంతయు; వేదితుం= తెలిసికొనుటకు; ఇచ్ఛామి= కోరుచున్నాను, జ్ఞానం= జ్ఞానమును; జ్ఞేయం,చ= తెలిసికొనదగిన దానిని; కేశవ= ఓ కృష్ణా!

శ్రీ భగవాన్= దేవదేవుడు; ఉవాచ= పలికెను. ఇదం= ఈ; శరీరం= దేహము; కౌన్తేయ= కుంతీపుత్రా! క్షేత్రం, ఇతి=క్షేత్రమని; అభిధీయతే= చెప్పబడుచున్నది; ఏతత్= దీనిని; యః= ఎవడు; వేత్తి= ఎరుంగునో; తం= అతనిని; ప్రాహు= చెప్పుదురు; క్షేత్రజ్ఞః, ఇతి= క్షేత్రజ్ఞుడని; తత్-విదః= దానినెరింగినవారు.

**అనువాదము** : అర్జునుడు పలికెను.ప్రియమైన ఓ కృష్ణా! నేను ప్రకృతిని గూర్చియు, పురుషుని (భోక్తను) గూర్చియు, క్షేత్రమును గూర్చియు, క్షేత్రము నెరింగిన వానిని గూర్చియు, జ్ఞానమును గూర్చియు, తెలిసికొనదగిన దానిని గూర్చియు ఎరుంగగోరుచున్నాను.

దేవదేవుడు పలికెను. ఓ కుంతీపుత్రా! ఈ దేహము క్షేత్రమనియు ఈ దేహము నెరింగినవాడు క్షేత్రజ్ఞుడనియు అనబడును.

**భాష్యము** : అర్జునుడు ప్రకృతి, పురుషుడు, (భోక్త) క్షేత్రము, (దేహము)క్షేత్రజ్ఞుడు (దానిని తెలిసికొనువాడు), జ్ఞానము, జ్ఞేయము అను వానిని గూర్చి తెలుసుకొనవలెనని కుతూహల పడుచుండెను. వీటినన్నిటిని గూర్చి అర్జునుడడిగినపుడు కృష్ణుడు, ఈ దేహము క్షేత్రమన బడుననియు, దేహము నెరుంగువాడు, క్షేత్రజ్ఞు డనబడుననియు తెలిపెను. బద్ధజీవికి ఈ దేహము కర్మ క్షేత్రము. బద్ధజీవి భౌతిక జీవితమున బంధింపబడి దానిచే భౌతిక ప్రకృతిపై అధికారముచలాయింపవలెనని యత్నించును. అందుచే భౌతిక ప్రకృతిపైఅధికారము వహించు

తన సామర్థ్యము ననుసరించి అతడు కర్మ క్షేత్రమును పొందును. దేహమే కర్మక్షేత్రము. ఆదేహమెట్టిది? ఆ దేహము ఇంద్రియములతో కూడినది. బద్ధజీవి ఇంద్రియ తృప్తి ననుభవింపగోరుచు,ఆయనుభవమునకు తనకుగల సామర్థ్యము ననుసరించి దేహమును లేక కర్మక్షేత్రమును పొందును. అందుచే దేహము క్షేత్రమని లేక బద్ధజీవికి కర్మ క్షేత్రము అని చెప్పబడినది. తానే దేహమని గుర్తించువ్యక్తి, క్షేత్రజ్ఞుడు లేక క్షేత్రమును తెలిసినవాడు అని చెప్పబడియున్నాడు. క్షేత్రమునకును, క్షేత్రజ్ఞునకు అనగా దేహమునకును, దేహము నెరింగినవానికిని గల భేదమును తెలిసికొనుట కష్టము కాదు. బాల్యమునుండి వార్ధక్యము వరకు మానవుడు దేహమునందు పెక్కు మార్పులను పొందినను ఆ పూర్వపు వ్యక్తిగనే తానున్నానని తలంపగలడు. ఈ విధముగా క్షేత్రజ్ఞునికిని, నిజమయిన కర్మక్షేత్రమునకును భేదము కలదు. జీవించుచున్న బద్ధజీవి, తాను దేహముకంటె భిన్నుడనని అవగాహన చేసికొనజాలును. జీవి దేహమునందు ఉన్నాడనియు దేహము శైశవమునుండి బాల్యమునకు, బాల్యమునుండి యౌవనమునకును, యౌవనమునుండి వార్ధక్యము వరకును మారుచున్నదనియు, దేహముకలవాడు దేహము మారుచున్నట్లు ఎరుంగుననియును 'దేహినోస్మిన్' అని మొదటనే వర్ణింపబడినది. దేహముగలవాడే క్షేత్రజ్ఞుడనుట స్పష్టము. ఒక్కొక్కపుడు జీవి నేను సుఖముగా నున్నాను, నేను పురుషుడను, నేను స్త్రీని, నేను కుక్కను, నేను పిల్లిని అని తలంచుచుండును. ఇవి క్షేత్రజ్ఞుని యొక్క దైహికస్థితులు కాని క్షేత్రజ్ఞుడు దేహముకంటె భిన్నుడు. వస్త్రములు మొదలగు పెక్కు వస్తువులను మనము వాడుచున్నను వాడబడుచున్న వస్తువుల కంటె భిన్నులమని మనమెరుంగుదుము. అట్లే కొంచెమాలోచించినచో మనము దేహముకంటె భిన్నులమని తెలిసికొందుము. నేనుగాని, నీవుగాని, దేహముగల మరి ఎవ్వరుగాని క్షేత్రజ్ఞుడనియు అనగా కర్మక్షేత్రము నెరింగిన వారమని అనబడుదుము. దేహము క్షేత్రము లేక కర్మక్షేత్ర మని అనబడును. భగవద్గీత యందలి మొదటి ఆరు అధ్యాయములలో దేహము నెరింగినవాడును (జీవియు) అతడు దేవదేవు నెరుంగు పరిస్థితియు వర్ణించబడినవి. భగవద్గీత మధ్యనున్న ఆరు అధ్యాయములలో దేవాదిదేవుడును, భక్తియుక్త సేవా విషయమున జీవాత్మకును పరమాత్మకునుగల సంబంధమును వర్ణింపబడినవి. ఈ అధ్యాయములలో దేవాదిదేవుని దివ్య స్థితియు జీవాత్మ యొక్క పరతంత్రస్థితియు స్పష్టముగా నిర్వచించబడినవి జీవులన్ని పరిస్థితులలోను పరతంత్రులేగాని, ఆ విషయమును విస్మరించుటచేవారు బాధ నొందుచుందురు. పవిత్ర కార్యములచే జ్ఞానవంతు లయినపుడు వారు-అర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞాని అను వివిధ రూపములలో పరమపురుషుని చేరుదురు. అది కూడ వర్ణింపబడినది. ఈ పదమూడవ అధ్యాయము మొదలుకొని జీవి భౌతిక ప్రకృతితోనెట్లు సంబంధము పొందునో, పరమ పురుషుడు కామ్య కర్మల విధానము ద్వారా జ్ఞానాభ్యాసము

ద్వారా భక్తియుక్త సేవానిర్వహణము ద్వారా, పరమపురుషునిచే ఆతడెట్లు రక్షింపబడునో వివరింపబడినది. జీవి భౌతిక శరీరముకంటె పూర్తిగా భిన్నుడయ్యును ఏదోవిధముగా దానితో సంబంధము గలవాడగును. అదికూడ వివరింపబడినది. ప్రముఖ జాతీయోద్యమనాయకుడు అరవిందమహర్షి వారు వ్యాఖ్యానించిన " శ్రీ అరవిందుల వారి గీతాదర్శనం"లోను స్వామి చిద్భవానందగారిచే ఆంగ్లంలో వ్యాఖ్యానింపబడి శ్రీరామకృష్ణతపోవనం వారిచే ప్రచురించబడిన "భగవద్గీత"లోను ఈ శ్లోకమును గూర్చిన ప్రస్తావనలు విపులంగా వున్నాయి.

## 1. ఈ శ్లోకం గురించి శ్రీ మలయాళస్వాములవారు

1. ప్రకృతి అనగా ఎట్టిది? 2. పురుషుడు అనగా ఎట్టివాడు?

3. క్షేత్రం అంటే ఏమిటి? 4. క్షేత్రజ్ఞుడంటే ఎలాంటివాడు

5. జ్ఞానం అంటే ఏమిటి? 6. జ్ఞేయం అంటే ఏమిటి? అను ప్రశ్నలకు సమాధానమిస్తూ ఈ ప్రశ్నలను బాగుగా మననం చేసుకున్నపుడు మాత్రమే మున్ముందు భగవానుడుపదేశించే ఉపదేశము గోచరమునకురాగలదు అని తెలిపారు.

## 2. శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు

సగుణ బ్రహ్మను గూర్చి ఇంతవరకు బాగుగా వినియున్న అర్జునునకు ఇక నిర్గుణ బ్రహ్మమును గూర్చి తెలుసుకోవాలన్న కుతూహలం జనించడం వలన భగవానుణ్ణి పై విధంగా (శ్లోకంలో తెలుపబడిన రీతిగా) ప్రశ్నించాడు అని తెలియజేశారు.

## 3. శ్రీ శిష్ట్లా సుబ్బారావుగారు

"కొన్ని గ్రంథములందు ఈ శ్లోకం కనుపించదు. గీతమోక్ష సప్తశతియనియు, కావున అందు ఏడువందల శ్లోకములు మాత్రమే వుండవలయుననియు ఒక సాంప్రదాయముకలదు. ఈ శ్లోకంతో కూడా గీత ఏడువందల ఒక శ్లోకం అగుచున్నదికనుక వదలివేయుటకు ఇతర శ్లోకములకంటే ఇదియే మిక్కిలి అనుకూలమని దానిని లుప్తం చేసిరి" అని తెలిపారు.

అందువల్లనే కాబోలు శ్రీ సుబ్బారావుగారు "అర్జున విషాద యోగం" అనే మొదటి అధ్యాయంలో ధృతరాష్ట్రునిచే వేయబడిన ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమందు యుద్ధము చేయుటకై మోహరించిన నాకుమారులును, పాండురాజతనయులు ఏం చేసిరి? సంజయా! అన్న ప్రశ్నకు

ఈ పదమూడవ అధ్యాయంలోని రెండవ శ్లోకాన్ని "ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే" శ్రీకృష్ణుడు అర్జునునకు తెలిపిన సమాచారంతో అనుసంధించి మానవదేహమే ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమనియు, మనస్సునందలి దుర్భావ, సద్భావములే కౌరవ, పాండవులని వాటికి నిత్యము జరుగుపోరాటమే భారతయుద్ధము అని వ్యాఖ్యానించి

క్షేత్ర-క్షేత్రజ్ఞుల విషయాన్ని గూర్చి వివరించారు. వారి వ్యాఖ్యప్రకారము

"క్షేత్రమన పొలము. పొలమున కృషిసలిపి ధాన్యాది ఫలములను పొందునట్లే మానవుడు తన మానసిక క్షేత్రమందు కృషి సలిపి ఈశ్వరప్రాప్తియను ఫలమును పొందగలుగుటచే కాబోలు పెద్దలు ఈశరీరమును క్షేత్రము అనిపిలిచిరి. ఈ క్షేత్రమందుండి దానిని ఎరుగువాడు అనగా లోని చైతన్యాంశను క్షేత్రజ్ఞుడు అనబడుచున్నాడు" అని తెలియజేశారు.

## 4. శ్రీ సుందరచైతన్యానందస్వామి

ఈ శ్లోకమును పెద్దలు ప్రక్షిప్తము అని తెలిపినందున దానిని సంఖ్యానుక్రమాణికలో చేర్చలేదు. అని తెలిపి భగవద్గీతపై భాష్యంలో శ్లోకసంఖ్యను సూచించె అంకెవేయకుండా ఒట్టిగా శ్లోకాన్ని మాత్రం వ్రాశారు.

## 5. చిద్భవానందస్వాములవారు

"This stanza is not found in all the editions of the Gita. Hence it is kept unnumbered అంటూనే మూలశ్లోకాన్ని మాత్రం తమ వ్యాఖ్యలో వ్రాశారు

## 6. శ్రీ చిన్న జీయర్ స్వాములవారు

సీతానగరం రామానుజస్వామి పీఠాధిపతులు శ్రీ చిన్నజీయర్ స్వాములవారు కూడా "ఇదం శరీరం కౌంతేయ" 13వ అధ్యాయాన్ని ప్రారంభించినందున భగవద్ శ్రీరామానుజులవారు కూడా తమ భాష్యంలో "ప్రకృతిం పురుషం చైవ" అనుశ్లోకాన్ని గూర్చి పట్టించుకున్నట్లు లేదు.

## 7. మహర్షి అరవిందుల వారు

నిమ్న ప్రకృతి నుంచి అంతరాత్మను దివ్యప్రకృతిలోనికి పైకి తేవడానికి అవలంబించిన మార్గాన్ని అర్జుననకు భగవానుడు ఉపదేశించడం జరిగింది. కాని దానిని ఇంకాస్పష్టమైన సంపూర్ణమైన జ్ఞానంమీద నిలబెట్టవలసిన అవసరం వుంది. చివరి ఆరు అధ్యాయాలలోను గీత ఆ ఉపదేశాన్ని మరొక రూపంలో తిరిగిఇస్తున్నది. ప్రధానంగా అది ఇప్పడు అందించబోయేది ఇదివరకు ఇచ్చిన ఆజ్ఞానాన్నే. అయితే ఇందులోని సూక్ష్మాంశాలను, సంబంధాలను ఇప్పడు ప్రముఖంగా చెప్పడం, వాటికి పూర్తి ప్రాముఖ్యతను ఆపాదించడం, మరొక ప్రయోజనానికి సంబంధించిన వెలుగులో సాదారణంగా లేదా అక్కడక్కడా వచ్చిన ఆలోచనలను, సత్యాలను, వాటియొక్క సంపూర్ణమైన విలువలను ద్యోతకం అయ్యేటట్లుగా ప్రకటించడం ఇపుడు జరుగుతున్నది. ఆ విధంగా మొదటి ఆరు అధ్యాయాలు నిర్వికార ఆత్మకు, ప్రకృతిలో మరుగున వున్న అంతరాత్మకు మధ్యగల విచక్షణకు

కావలసిన జ్ఞానానికే అత్యంత ప్రాముఖ్యతను ఇచ్చాయి. అక్కడ ఆత్మను గురించి, పురుషుని గురించి చెప్పడం జరిగినా అది చాలా సంక్షిప్తంగా వున్నదే తప్ప బాహాటంగా లేదు. ప్రపంచంలో కర్మలను సమర్థించడానికి దానిని ఊహించడమే అయింది. దానిని మన అస్థిత్వానికి ప్రభువుగా నిర్ధారించడం జరిగింది. అంతకు తప్ప అది ఏమిటో మిగిలిన వాటితో దాని సంబంధం ఏమిటో వివరించడం మాట అట్లా వుంచి కనీసం సూచన కూడా చేయలేదు. ఈ అణిగి వున్న జ్ఞానాన్ని స్పష్టమైన వెలుగులో బలిష్ఠమైన ప్రాధాన్యతలో పైకి తీసుకురావడానికి ప్రభువుకు ఈశ్వరునికి, పర- అపరాకృతుల మధ్య గల విచక్షణకు, సర్వానికి ప్రభవస్థానమై సర్వాన్ని నిర్మించిన ప్రకృతిలో వున్న దైవాన్ని గురించిన దర్శనానికి సర్వ జీవులలో వున్న "ఏకా"నికి ప్రాముఖ్యతను ఇస్తున్నాయి. ఈ విధంగా చేయడంలో గల ఉద్దేశం కర్మలకు -భక్తికి జ్ఞానంతోమూలంలో ఏకత్వాన్ని నెలకొల్పడం, కాని ప్రస్థుతం పరమ పురుషునికి, నిర్వికార ఆత్మకు జీవునికి కర్మ ప్రవృత్తమై గుణాత్మకమై వున్న ప్రకృతికీ మధ్యన వున్న కచ్చితమైన సంబంధాలను ఇంకా ఎక్కువగా నిశ్చితంగా బయటకు తీసుకొనిరావడం అవసరం, అందుచేత భగవంతుడు ఇంతవరకు సరిగా స్పష్టం కాని ఈ విషయాలన్నింటినీ స్పష్టంగా వివరించడానికిగాను

"ప్రకృతిం పురుషం చైవ- క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ
ఏతద్వేది తుమిచ్ఛామి- జ్ఞానం జ్ఞేయం చ కేశవ"
ప్రశ్నవేసేట్టు చేశాడు అని తెలిపారు.

అర్జునుడు వేసిన పై ప్రశ్నను పురస్కరించుకొని అతడు అడిగిన ఆరు విషయాలగురించి భగవానుడు సమాధానమిస్తున్నాడు.

ఇదం శరీరం కౌంతేయ!
క్షేత్ర మిత్యభిధీయతే
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః
క్షేత్రజ్ఞ ఇతి తద్విదః శ్లో - 2

*అర్జునా!*
*ఈశరీరమే క్షేత్రమనియు*
*దానిని గూర్చి తెలుసుకున్నవాడు*
*క్షేత్రజ్ఞుడనిపిలువబడుచున్నాడు*

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి
సర్వక్షేత్రేషు భారత
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం
యత్తద్ జ్ఞానం మతం మమ శ్లో - 3

అర్జునా!
సర్వక్షేత్రములయందున్న
నన్ను సర్వశరీరములయందున్న
నన్ను క్షేత్రజ్ఞుడుగ తెలుసుకొనుము
దాని గూర్చి తెలుసుకొనుటయే నిజమైన
జ్ఞానం

తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ
యద్వికారి యతశ్చ యత్
స చ యో యత్ప్రభావశ్చ
తత్సమాసేన మే శృణు శ్లో - 4

ఆక్షేత్రం ఎట్టిదో
అది ఎటువంటి వికారములు
గలదిమో, ఎచట నుండి ఏ విధంగా
ఆవిర్భవించిందో, అందులోని క్షేత్రజ్ఞుడు
ఎవడో, అతనిలోగల ప్రభావం ఎట్టిదో
ఆ విషయాలన్నింటిని సంక్షిప్తముగ
చెప్పెద, వాటిని నావలన వినుము

ఋషిభిర్బహుధా గీతం
ఛందోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్రపదైశ్చైవ
హేతుమద్భిర్వినిశ్చితైః శ్లో - 5

ఈ క్షేత్ర, క్షేత్రజ్ఞుల గూర్చిన
విషయాలు ఋషుల వలన
వేదములయందు అనేక విధముల
ప్రతిపాదితములై యున్నవి
బ్రహ్మసూత్రముల యందు సైతం
వీటిగురించి హేతు దృష్టితో సంశయ
రహితముగా అభివర్ణించబడియున్నది.

మహాభూతాన్యహంకారో
బుద్ధిరవ్యక్తమేవ చ
ఇన్ద్రియాణి దశైకం చ
పంచ చేంద్రియ గోచరాః శ్లో - 6

ఇచ్ఛా ద్వేషస్సుఖం దుఃఖం
సంఘాతశ్చేతనా ధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన
సవికార ముదాహృతమ్ శ్లో - 7

మహాభూతాలు
అహంకారము, బుద్ధి, అవ్యక్తం
దశేంద్రియాలు, మనస్సు, శబ్దాది
ఇంద్రియ విషయాలు గోచరాలు
ఇవన్నీ కలిసి ఇరవైనాలుగు
తత్వాలు, ఇవిగాక
ఇచ్ఛ, ద్వేషము, సుఖం, దుఃఖం
సంఘాతం, చేతనం, ధృతి ఇవన్నీ
సవికారమైనవి, ఇవన్నీ కలిసిందే క్షేత్రం

అమానిత్వ మదంభిత్వం
అహింసా క్షాంతిరార్జవం
ఆచార్యోపాసనం శౌచం
స్థైర్య మాత్మవినిగ్రహః శ్లో - 8

ఇంద్రియార్థేషు వైరాగ్య
మనహంకార ఏవ చ
జన్మమృత్యుజరావ్యాధి
దుఃఖదోషానుదర్శనం శ్లో - 9

అసక్తిరనభిష్వంగః
పుత్రదారగృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వం
ఇష్టానిష్టోపపత్తిషు శ్లో - 10

మయిచానన్య యోగేన
భక్తిరవ్యభిచారిణి
వివిక్తదేశసేవిత్వ
మరతిర్జన సంసది శ్లో- 11

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం
తత్త్వజ్ఞానార్థదర్శనం
ఏతత్ జ్ఞానమితిప్రోక్తం
జ్ఞానం యదతోన్యథా శ్లో - 12

ఆత్మస్తుతి దంభం లేకుండా వుండడం
అహింసా వ్రతంతో క్షమ, నీతి నిజాయితీ
గురుసేవ, శౌచం, స్థిరత్వము,
ఆత్మనిగ్రహం కలిగి వుండడం
ఇంద్రియవిషయాలపట్ల వైరాగ్యం
కలిగి అహంకారంలేకుండా వుండడం
జనన, మరణ, జరా(వృద్ధాప్యం) వ్యాధి
ఆదిగాగల దుఃఖాలలో వున్న దోషాలను
గూర్చి ఆలోచించడం
పుత్రులు, భార్య, గృహం వీటిపట్ల
ఆసక్తి లేకుండా వుండడం, దేనితో
కూడా అనుబంధం లేకుండా వుండడం,
ఇష్టానిష్టాల ప్రాప్తిపట్ల అనునిత్యం
సమచిత్తాన్ని కలిగి వుండడం
నాయందు అనన్య యోగముచేత
దారితప్పని భక్తితో ఏకాంతవాసాన
సమూహాలకు దూరంగా వుండి వాటి
పట్ల ప్రీతి లేకుండా వుండడం
ప్రతిక్షణం ఆధ్యాత్మిక భావంతో
తత్వజ్ఞానార్థాన్ని దర్శించడం
అనునది జ్ఞానం అనబడుతుంది.
మిగతాదంతా అజ్ఞానం అనబడుతుంది.

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి
యద్ జ్ఞాత్వామృత మశ్నుతే
అనాది మత్పరం బ్రహ్మం
న సత్తన్నా సదుచ్యతే శ్లో - 13

తెలియదగినది ఏదో
దేనిని తెలుసుకుంటే
అమృతస్థితిని పొందగలరో
అదిలేనిదైన ఆ పరబ్రహ్మ
సత్తుకాదు, అసత్తుకాదు
జ్ఞేయమంటే అదే

సర్వతః పాణిపాదం తత్
సర్వతోక్షి శిరోముఖమ్
సర్వతః శ్రుతిమల్లోకే
సర్వమావృత్యతిష్ఠతి శ్లో - 14

ఆ బ్రహ్మ సర్వత్రా చేతులు
కాళ్లు కలవాడు, సర్వత్రా
కళ్లు, శిరస్సులు, ముఖాలు,
నోళ్లు కలవాడు, సర్వత్రా
చెవులు కలిగి సర్వాన్ని ఆవరించి వున్నాడు

సర్వేంద్రియగుణాభాసం
సర్వేంద్రియ వివర్జితం
అసక్తం సర్వభృచ్చైవ
నిర్గుణం గుణభోక్తృచ శ్లో - 15

సర్వేంద్రియగుణములతో
ప్రకాశిస్తున్నాడు కాని
వాటన్నింటిని వర్జించి యున్నవాడు
సమస్తమును ధరించినవాడేగాని
దేనియందును ఆసక్తి లేనివాడు
గుణములను భోగిస్తున్నవాడే
గానీ, అయితే ఆయన నిర్గుణుడు

బహిరంతశ్చ భూతానం
అచరం చరమేవ చ
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం
దూరస్థం చాన్తికే చతత్ శ్లో - 16

బ్రహ్మం ప్రాణుల లోపల
వెలుపల స్థావర, జంగమ
రూపంగా వున్నాడు, సూక్ష్మంగా
వుండడం వలన తెలియబడకుండా
వున్నాడు, ఆయన అందరికీ దూరంగానూ
సమీపంగాను కూడా వున్నాడు

అవిభక్తం చ భూతేషు
విభక్త మివ చ స్థితమ్
భూతభర్తృచ తద్ జ్ఞేయం
గ్రసిష్ణు ప్రభవిష్ణు చ శ్లో - 17

విభజన లేనట్టి బ్రహ్మం
సమస్త భూతములలో
విభజింపబడివున్నట్లుగా
వుంది, భూతములను
భరించేది, లయించేది
ఉత్పత్తి చేసేది అని
ఆ బ్రహ్మను గూర్చి తెలుసుకోవాలి

జ్యోతిషామపి తజ్జ్యోతిః
తమసః పరముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం
హృది సర్వస్య విష్ఠితమ్ శ్లో - 18

బ్రహ్మం
తేజస్సులకు తేజస్సు
తమస్సుకు వేరైనట్టిది
అదిజ్ఞానం, జ్ఞేయం
జ్ఞానమునకు గమ్యమైనది
సర్వభూతముల హృదయములలో
ప్రకాశించునదియునై యున్నది

ఇతిక్షేత్రం తథాజ్ఞానం
జ్ఞేయం చోక్తం సమాసతః
మద్భక్త ఏతద్విజ్ఞాయ
మద్భావా యోపపద్యతే శ్లో- 19

ఈ విధంగా జ్ఞానాన్ని, జ్ఞేయాన్ని
గూర్చి సంగ్రహంగా చెప్పాను
నా భక్తుడైనవాడు దానిని తెలుసుకొనిన
నా భావాన్ని పొందడానికి అర్హుడౌతాడు.

ప్రకృతిం పురుషం చైవ
విద్ధ్యనాది ఉభావపి
వికారాంశ్చ గుణాంశ్చైవ
విద్ధి ప్రకృతి సంభవాన్ శ్లో - 20

ప్రకృతి-పురుషులు రెండును
అనాది అని తెలుసుకో!
వికారాలు, గుణాలు అన్ని
ప్రకృతి నుండి పుట్టాయని తెలుసుకో

కార్యకారణకర్తృత్వే
హేతుః ప్రకృతిరుచ్యతే
పురుష స్సుఖదుఃఖానాం
భోక్తృత్వే హేతురుచ్యతే శ్లో - 21

కార్యకారణాలుపుట్టుటకు
ప్రకృతి హేతువు, సుఖ
దుఃఖానుభవానికి పురుషుడు
హేతువు అని తెలుసుకో

పురుషః ప్రకృతిస్థో హి
భుంక్తే ప్రకృతిజాన్గుణాన్
కారణం గుణసంగోస్య
సదసద్యోని జన్మసు శ్లో- 22

ప్రకృతిలో వున్న పురుషుడు
ప్రకృతి వలన పుట్టిన గుణాలను
అనుభవిస్తున్నాడు, ఈ గుణాలతో
అనుబంధము వలన అతడు
ఉత్తమ, చెడు జన్మలను పొందుతున్నాడు

ఉపద్రష్టానుమన్తా చ
భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో
దేహేస్మిన్ పురుషః పరః శ్లో - 23

చూస్తూ వుండే సాక్షిగాను
అనుమతినిచ్చే వాడుగాను
భరించువాడుగాను, అనుభవించే
వాడుగాను, మహేశ్వరుడిగాను
పరమాత్మగాను చెప్పబడే
పురుషుడు ఈ శరీరములో
వేరైన వాడుగా వున్నాడు

ఈ శ్లోకం అత్యంత గంభీరమైనది. ఇది పరమ పురుషుని తత్వాన్ని అతి చక్కగా వర్ణిస్తున్నది. పరమ పురుషుడే ఈ శరీరంలో సాక్షిగా, అనుమతించువానిగా, భర్తగా, భోక్తగా, పరమాత్మగా, పరమేశ్వరుడుగా వున్నాడని ప్రబోధిస్తున్నది.

య ఏవం వేత్తి పురుషం
ప్రకృతిం చ గుణైస్సహ
సర్వథా వర్తమానోపి
న స భూయోభిజాయతే శ్లో- 24

ఈ విధంగా పురుషుని గురించిన
గుణములలోప్రకృతిని గురించి
తెలుసుకొన్న వాడు సర్వవిధములుగ
ప్రవర్తించినప్పటికి తిరగి జన్మించడు

పురుషుని గురించిన జ్ఞానమేగాక గుణములతో సహ ప్రకృతిని గురించిన జ్ఞానము కూడా అవసరమని భగవానుని భావము. కారణము ప్రకృతి లేని పురుషుడు గాని, పురుషుడు లేని ప్రకృతి గాని వుండవు. అపరా ప్రకృతి రూపంలో కాకపోయినను, పరా ప్రకృతిగా ప్రకృతి పరమాత్మలో వుండనే వున్నది. ప్రకృతీ, పురుషులు అప్పుడు ఈశ్వరుడు, ఈశ్వరి అవుతారు. వీరిద్దరి మధ్యగల వ్యవహారమే సర్వవిశ్వస్థితి. అందువలన పూర్ణజ్ఞానానికి వీరిద్దరిని గురించిన జ్ఞానము అవసరం. అటువంటి జ్ఞానము పొందినవాడు మరల జన్మనెత్తడు.

ధ్యానేనాత్మని పశ్యంతి
కేచిదాత్మాన మాత్మనా
అన్యేసాంఖ్యేన యోగేన
కర్మయోగేన చాపరే శ్లో -25

కొందరు ధ్యానము చేతను
మరికొందరు జ్ఞానయోగము
చేతను, ఇంకొందరు కర్మ
యోగముచేతను ఆత్మలోని
ఆత్మను దర్శిస్తున్నారు

ఈ జ్ఞానం రావడానికి గల మార్గాలలో మొదటిది ధ్యానము, రెండవది జ్ఞానము, మూడవది కర్మ. ఈ మూడింటివలన ఆత్మలోని ఆత్మను ఎవరైనను దర్శించ వచ్చును.

అన్యే త్వేవ మజానన్తః
శ్రుత్వాన్యేభ్య ఉపాసతే
తేపి చాతితరం త్యేవ
మృత్యుం శ్రుతిపరాయణాః శ్లో - 26

ఈ ప్రకారము పరమాత్మను
ఎరుగక వేరేకొందరు
ఇతరుల వలన విని ఉపాసన
చేస్తున్నారు. వినుటయందే
తత్పరులైన వారు కూడా
మృత్యువును దాటుతున్నారు

మనము ఇతరుల ద్వారా ఈ జ్ఞానాన్ని విని శ్రద్ధతో ఏకాగ్రతతో మనస్సునందు మూస పోయవచ్చును. జ్ఞానాన్ని ఏ విధంగా పొందినను అది మృత్యువును దాటించి అమృతత్వాన్ని ప్రసాదిస్తుంది.

యావత్సం జాయతే కించిత్
సత్త్వం స్థావరజంగమం
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్
తద్విద్ధి భరతర్షభ! శ్లో - 27

అర్జునా!
స్థావర, జంగమ రూపములైన
అన్ని వస్తువులును క్షేత్ర, క్షేత్రజ్ఞుల
సంయోగము వల్లనే జన్మిస్తున్నాయి.

సమం సర్వేషు భూతేషు
తిష్ఠన్తం పరమేశ్వరం
వినశ్య త్స్వ వినశ్యన్తం
యః పశ్యతి స పశ్యతిః శ్లో - 28

సర్వభూతములయందు
సమంగావున్న ఆ పరమేశ్వరుని
యొక్క ప్రాణులు నశిస్తున్నా
తాను నశించని వాడుగా చూచు
వాడు మాత్రమే సరిగా
చూచినవాడు అగుచున్నాడు

సమం పశ్యన్హి సర్వత్ర
సమవస్థిత మీశ్వరం
న హినస్త్యాత్మనాత్మానం
తతో యాతి పరాం గతిమ్ శ్లో -29

సర్వత్రా సమంగా వున్న
ఈశ్వరుని చూస్తున్నవాడు
ఆత్మను ఆత్మచేత హింసించు
కొననివాడు ఉత్కృష్టమైన
గతిని పొందుచున్నాడు

ప్రకృత్యైవ చ కర్మాణి
క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాత్మాన
మకర్తారం స పశ్యతి శ్లో - 30

కర్మలనన్నింటిని ప్రకృతియే
చేస్తున్న దని చూచువాడు
ఆత్మను గూర్చి అకర్తగా
తెలుసుకొన్నవాడగుచున్నాడు

యదా భూతపృథగ్భావం
మేకస్థ మనుపశ్యతి
తత ఏ వచ విస్తారం
బ్రహ్మ సంపద్యతే తదా శ్లో- 31

భూతముల యొక్క పృథగ్భాగాన్ని
ఏకమందున్న దానినిగా చూచువాడు
దానివలననే సర్వము విస్తరించిందని
తెలుసుకున్నవాడు బ్రహ్మమే అవుతున్నాడు

అనాదిత్వాన్నిర్గుణత్వాత్
పరమాత్మా య మవ్యయః
శరీరస్థోపి కౌంతేయ
న కరోతి న లిప్యతే శ్లో - 32

ఆదియును, అంతమును
గుణమును లేని ఈ పరమాత్మ
శరీరములో వున్నప్పటికినీ
కర్మలను ఆచరించడు. కర్మ
ఫలాలను ఆశించడు

యథా సర్వగతం సౌక్ష్మ్యా
దాకాశం నోపలిప్యతే
సర్వత్రావస్థితో దేహే
తథాత్మా నోపలిప్యతే శ్లో - 33

ఆకాశం సర్వవ్యాప్తమై
ఉన్నప్పటికీ అది సూక్ష్మము
కావడం వలన దేనిని అంటి
పెట్టుకొని వుండదో ఆ విధంగానే
ఆత్మ శరీరమందు సర్వత్రా
వ్యాపించి వున్నప్పటికినీ ఆ
శరీరాన్ని ఎల్లప్పుడు అంటి
పెట్టుకొని యుండదు

యథా ప్రకాశయత్యేకః
కృత్స్నం లోక మిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం
ప్రకాశయతి భారతః శ్లో- 34

సమస్తమైన ఈ లోకాన్నంతటినీ
ఒకే ఒక సూర్యుడు ఏ విధంగా
ప్రకాశింపజేస్తున్నాడో అదే విధంగా
క్షేత్రజ్ఞుడైన ఆ పరమేశ్వరుడు
సమస్తమైన క్షేత్రాలన్నింటిని ఏక
సమయంలో ప్రకాశింపజేస్తున్నాడు

క్షేత్ర క్షేత్రజ్ఞయోరేవం
అన్తరం జ్ఞానచక్షుషా
భూతప్రకృతి మోక్షం చ
యే విదుర్యాంతి తే పరమ్ శ్లో - 35

ఈ విధంగా క్షేత్ర, క్షేత్రజ్ఞుల
భేదాన్ని, భూత, ప్రకృతి
మోక్షాన్ని గూర్చి జ్ఞాన నేత్రములతో
ఎవరు తెలుసుకొనగలుగుతున్నారో
వారే పరమేశ్వరుని పొందుతున్నారు

ఇక్కడ "భూత ప్రకృతి మోక్షంచ" అను వాక్యానికి భూతముల నుండి ప్రకృతికి మోక్షము అనే అర్థములో చెప్పుకోవచ్చునని శ్రీ అరవిందులవారు పేర్కొన్నారు.

ఈ విధంగా ఉపనిషత్తును బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన
శ్రీమద్భగవద్గీత యందలి క్షేత్ర, క్షేత్రజ్ఞ విభాగ యోగమను
పేరుగల పదమూడవ అధ్యాయం సమాప్తముగావించబడింది.



# గీతా సంహిత

**అధ్యాయము పదునాలుగు** | **గుణత్రయ విభాగ యోగము**

ఈ పదునాలుగవ అధ్యాయము ఒక విధంగా పదమూడవఅధ్యాయంలో తెలిపిన ఆత్మానాత్మ వివేకమును గూర్చి తెలిపిన అంశాలలో మిగిలి పోయిన వాటిని పూర్తి చేయడానికే జనించినదని మనం గ్రహించాలి.

వాస్తవానికి ఆత్మ చేయవలసిన పనులు ఏమియును లేవు. ఆత్మస్వయం సంపూర్ణము. స్వభావము చేత ఆత్మ ఊర్ధ్వగామియే . దేనికైనా క్రింద ఒక పెద్దబరువును కట్టినచో ఆ బరువు దానిని ఎట్లు క్రిందికి లాగునో ఆ విధంగానే శరీరము అనే బరువు ఆత్మను క్రిందికి సదాలాగుతుంటుంది. ఏ విధంగానైనను దేహాన్ని- ఆత్మను వేరు చేయగలిగినచో మానవునకు ప్రగతి కలుగుతుందని మనం పదమూడవ అధ్యాయం అయిన ఆత్మానాత్మ వివేకములో గ్రహించితిమి. ఈ రెడింటిని అంటే దేహాన్ని- ఆత్మను వేరు చేయడం ఎంతో కఠినమైన పని. అయినా శ్రమపడి ఆ విధంగా చేయడం వలన కలిగే ఫలితం మాత్రం ఎంతో గొప్పది. ఆత్మయను పాదములను బంధించిన దేహమను సంకెళ్లను మనం త్రుంచగలిగితే దాని నుండి కలిగే ఆనందం చాలా గొప్పది. అపుడుమానవుడు శారీరక క్లేశముల వలన దుఃఖపడడు. అతడు స్వతంత్రుడగును. మనుష్యుడు ఈ దేహమును జయింపగలిగినచో ఇక అతనిపై ఈ ప్రపంచములో అధికారము చెలాయించగలవారు ఎవరును వుండరు. తన్ను తాను శాసించుకోగలవాడు ఈవిశ్వానికే సామ్రాట్టు కాగలడు. ఆత్మపై దేహము చలాయించు అధికారమును అతడు తొలగించుకొనును. దేహమునకున్న సుఖదుఃఖములన్నియు స్వదేశీయములుకావు. అవి విదేశీయములు. పరకీయములు. ఆత్మతో అతనికి తిలమాత్ర సంబంధము కూడా వుండదు.

దేహము తునకలై పోతునప్పుడు కూడా మనస్సును శాంతముగను, ఆనందమయము గను వుంచుకొనవలెను. అది ఎప్పుడు సమకూరుతుంది? ఒకవైపున వివేకము, రెండవ వైపుననిగ్రహము వున్నపుడు మాత్రమే అది సాధ్యపడుతుంది.

వివేకమునకు వైరాగ్యము అను రక్షణ వుండవలెనని భక్త తుకారాం ప్రకటించాడు. దేహాత్మలను వేరు చేయుటకు వివేకము వైరాగ్యము రెండును అవసరమని స్పష్టపడుతున్నది. వైరాగ్యమంటే నిగ్రహము అంటే తితీక్ష. అంటే ఓర్పు.

ఈ పదునాలుగవ అధ్యాయములో నిగ్రహమార్గం గురించి తెలుపబడింది. నావ నడుపు పని తెడ్లది దిశను (మార్గాన్ని) చూపించుపని చుక్కానిది, కనుక నావను నడుపవలెనన్న తెడ్లు- చుక్కాని రెండును కావలెను. అదే విధంగా శారీరక సుఖ దుఃఖములనుండి ఆత్మను వేరు చేయుట కొరకు వివేకము- నిగ్రహము రెండునూ అవసరమే.

వైద్యుడు రోగియొక్క ప్రకృతిని అనుసరించి ఔషధమును ఇచ్చునట్లే భగవంతుడు ఈ పదునాలుగవ అధ్యాయములో ప్రకృతి నంతటిని పరిశీలించి పృథక్కరణము చేసి అందుదేనికేయే రోగములున్నవో నిరూపించాడు. ఈ అధ్యాయమందు ప్రకృతి విభజన చక్కగా చేయబడింది. రాజనీతిలో విభజక సూత్రమని ఒక గొప్ప సూత్రముంది. ఎదుట మొహరించియున్న శత్రుదళమును చీలదీయగలిగినచో శత్రువును త్వరగా ఓడించవచ్చును. ఇదే రాజనీతిసూత్రము. అంటే "విభజించి పాలించు" అన్నది రాజనీతి సూత్రము. ఇక్కడ భగవంతుడు చేసిన పని ఇదే. నాయొక్క- నీ యొక్క జీవులన్నిటి యొక్క, సర్వ చరాచరముల యొక్క ప్రకృతిలో మూడుగుణాలున్నాయి. ఇది ఆయుర్వేదవైద్యములో చెప్పబడుతున్న కఫ, వాత, పిత్తము లాంటిది. "సత్వ, రజస్సు, తమము" లనబడు మూడు గుణాలు ప్రకృతిలో వున్నాయి. ఈ మూడుగుణాల చేరికతోనే అంతా నిండి వుంది. ఒకదానిలో ఒకగుణము తక్కువైన రెండో గుణము హెచ్చుగా వుంటుంది. ఇదే వీటిలో అగుపించే భేదము. ఈ మూడింటి నుండి ఆత్మను వేరు చేయగలిగినచో దేహము నుండి ఆత్మను వేరు చేసినట్లే. ఈ మూడు గుణములను పరీక్షించి వానిని జయించుటయే దేహము నుండి ఆత్మను వేరు చేయు విధానము. నిగ్రహము ద్వారా రజస్తమో గుణములను జయించి చివరకు సత్వగుణమునకు చేరుకోవలసి వుంది.

ఇదే మనకు ఈ పదునాలుగవ అధ్యాయము ప్రబోధిస్తున్న ప్రధాన అంశము.

ఈ అధ్యాయంలో 27 శ్లోకాలున్నాయి. ఇందులోని ప్రధాన విషయాలు.

1. జ్ఞానము యొక్క గొప్పదనము ప్రకృతి- పురుషులవలన జగదుత్పత్తి (1నుండి 4వ శ్లోకం వరకు)
2. సత్వ రజస్తమోగుణముల యొక్క స్వరూప స్వభావం (5నుండి 13వ శ్లోకం వరకు)
3. ఆయా గుణముల వల్ల కలిగే ఫలితాలు (14నుండి 18వ శ్లోకం వరకు)
4. భగవద్ప్రాప్తికి ఉపాయము (19నుండి 20వ శ్లోకం వరకు)
5. గుణాతీతుని లక్షణాలు (21 నుండి 27వ శ్లోకం వరకు)

పదమూడవ అధ్యాయములో భగవానుడు ప్రకృతి పురుషులను గూర్చి తెలుపుచూ 20వ శ్లోకమునందు ప్రకృతి సంభవములగు త్రిగుణములను గురించి ప్రకటించాడు. అక్కడ నుండి తరువాత 22వ శ్లోకము వరకు ప్రకృతి జనితములగు సత్వరజస్తమో గుణములే మానవుని ఉచ్ఛ, నీచ జన్మలకు కారణమని తెలియజేశాడు. సహజంగానే శ్రోతకు వాటిని గూర్చి తెలుసుకోవాలన్న కుతూహలం ఆస్థితిలో కలుగుతుంది. అవి ఆత్మను ఏ విధంగా బంధించగలవో, దాని నుండి విముక్తిని పొందే మార్గం ఏమిటో తెలుసుకోవాలని జిజ్ఞాసువుకు కలుగుతుంది. ఈ కారణంగానే శ్రోత అయిన అర్జునుడు దానిని గురించి అడుగకుండానే దయాళువైన భగవానుడు తనంతట తానే ఆ విషయాలను తెలియజేయుటకు ఈ అధ్యాయంలో ఉపక్రమిస్తున్నాడు.

పరం భూయః ప్రవక్ష్యామి
జ్ఞానానాం జ్ఞాన ముత్తమం
యజ్ఞాత్వా మునయస్సర్వే
పరాం సిద్ధి మితోగతాః శ్లో - 1

అర్జునా!
దేనిని గూర్చి తెలుసుకొని
మునులందరు ఉత్తమమైన
మోక్షమును పొందిరో అట్టి
విద్యలలో ఉత్తమమైన
పర విద్యను గూర్చి మరలచెప్పెదను
వినుము

ఇదం జ్ఞాన ముపాశ్రిత్య
మమ సాధర్మ్య మాగతాః
సర్గేపి నోపజాయంతే
ప్రళయే న వ్యథ న్తిచ శ్లో - 2

ఈ జ్ఞానమును
ఆశ్రయించి నా స్వరూపమును
పొందినవారు సృష్టికాలమున
జన్మింపరు. ప్రళయకాలమున
నశింపరు అని తెలుసుకో

మమయోనిర్మహద్బ్రహ్మ
తస్మిన్ గర్భం దధామ్యహం
సంభవస్సర్వ భూతానాం
తతో భవతి భారత శ్లో- 3

అర్జునా!
గొప్పదియగు మాయ
(మూలప్రకృతి) నాకు
గర్భస్థానము. అద్దానియందు
గర్భకారణమైన చైతన్యరూపమైన
బీజమును నేను వుంచుతున్నాను
దానివలన సర్వప్రాణులయొక్క
ఉత్పత్తి జరుగుచున్నది

జడమగు ప్రకృతితో చైతన్య రూపుడగు పరమాత్మయొక్క కలయిక చేత సృష్టి ఏర్పడుచున్నవి.

సర్వయోనిషు కౌంతేయ!
మూర్తయ స్సంభవంతి యాః
తాసాం బ్రహ్మ మహద్యోనిః
అహం బీజప్రదః పితా శ్లో - 4

అర్జునా!
ఉత్పన్నమయ్యెడి సర్వ
భూతములకు ప్రకృతి మాతృస్థానము
అయితే బీజ ప్రధానము చేయు
తండ్రిని నేనే అయి వున్నాను

సమస్త భూతములకు ప్రకృతియే తల్లి పరమాత్మయే తండ్రి.

సత్వరజస్తమోగుణములు ప్రకృతి నుండియే ఆవిర్భవించిన వనియు బంధనమునకు కారణములు అవియేనని భగవానుడు పేర్కొనుచున్నాడు.

సత్వం రజస్తమ ఇతి
గుణాః ప్రకృతిసంభవాః
నిబధ్నన్తి మహాబాహో!
దేహే దేహిన మవ్యయమ్ శ్లో- 5

అర్జునా!
ప్రకృతి నుండి జనించిన
సత్వ రజస్తమో గుణములు
అవ్యయుడగు ఆత్మను దేహము
నందు బంధించు చున్నవి

సత్వరజస్తమోగుణములు మూడును ప్రకృతి నుండి జనించినవి. అవి ఆత్మకు లేవు. ఆత్మ నిర్గుణుడు. గుణాతీతుడు అయినను మానవుడు తన యధార్థ స్వరూపమగు ఆత్మను విస్మరించి, తాను సత్వ రజస్తమో గుణ యుతుడనని భావించి ఆ గుణములతో తాదాత్మ్యమును పొందుతున్నాడు. దానివలన దేహము నందు, సంసారము నందు బంధి తుడగు చున్నాడు. ఆ మూడు గుణము లలో ఏ ఒక్క గుణము మిగిలి యున్నప్పటికీ ఆ మానవుడు ఇంకను ప్రకృతి (మాయ) యందే ఇంకను చేరుకోవలసి యున్నదని తెలుసు కోవలసి వుంది.

తత్ర సత్వం నిర్మలత్వాత్
ప్రకాశక మనామయం
సుఖసంగేన బధ్నాతి
జ్ఞానసంగేన చానఘః                    శ్లో - 6

అర్జునా!
ఈమూడు గుణములలో
సత్వగుణము నిర్మలమైన
దగుటచేత అది ప్రకాశము
కలుగజేయునదియును
అయివున్నది. అయితే
అది సుఖాభిలాష
చేతను, జ్ఞానాభిలాష
చేతను మానవుణ్ణి బంధించుచున్నది

ఈ సత్వగుణమును మానవుణ్ణి సుఖాసక్తి చేతను, జ్ఞానాసక్తిచేతను ఆత్మను బంధించు చున్నది.

నేను సుఖవంతుడను అనే దేహేంద్రియాది క్షేత్రధర్మమైన సుఖమును ఆత్మయందు ఆరోపించుటయను సుఖ సంసక్తిచేతను ప్రాపంచిక లేక పాండిత్య విషయమైన వృత్తి రూపమగు అంతఃకరణ ధర్మమును ఆత్మ యందు ఆరోపించడం వలన కూడా ఆత్మ బంధింపబడుచున్నది. ఈ బంధనమును వదిలించుకొని కేవలం ఆత్మస్థితిని బడయు మని భగవానుడు అర్జునునకు ఈ శ్లోకము ద్వారా బోధించాడు.

రజో రాగాత్మకం విద్ధి
తృష్ణా సంగసముద్భవం
తన్నిబధ్నాతి కౌంతేయ
కర్మ సంగేన దేహినమ్                    శ్లో - 7

అర్జునా!
రజోగుణము రాగరూపమై
విషయాభిలాషను కలిగించు
నదియని తెలుసుకొనుము
కర్మాసక్తిచేత అది మానవుణ్ణి బంధిస్తున్నది

లభించని వస్తువు కొరకు ప్రాకులాడటమే కోరిక(తృష్ణ) అనబడుచున్నది. లభించిన దానిపై అభిమానము పెంచుకొనుట సంగము కోరిక- సంగము రెండింటిని ఈ రజోగుణము కలుగజేయుచున్నది. అనేకమైన బాహ్యాడంబరములచేతను, దృశ్యసంబంధములైన వివిధ క్రియాకలాపముల చేతను రజోగుణము ఆత్మను బంధించి వైచుచున్నది. సత్వగుణమును గూర్చి చెప్పినపుడు, బధ్నాతి, అని తెలిపి, రజోగుణము, తమోగుణములను గూర్చి చెప్పినప్పుడు "నిబధ్నాతి" అని పేర్కొనడం జరిగింది. దీనిని బట్టి రజోగుణము, తమోగుణము ఆత్మను పకడ్బందీగా బంధించివేస్తున్నవని గ్రహించవలసి వుంది.

తమస్త్వజ్ఞానజం విద్ధి
మోహనం సర్వదేహినామ్
ప్రమాదాలస్య నిద్రాభిః
తన్నిబధ్నాతి భారత! శ్లో - 8

అర్జునా!
అజ్ఞాన జనితమైన
తమోగుణము సర్వజీవులకును
మోహమును కలుగజేయుచున్నది
దానివలన మరుపు, అలసత్వము
నిద్రలలో జీవుని బంధించివైచు
చున్నది

మాత్సర్యము, సోమరితనము, అతినిద్ర, అజాగ్రత్త, బద్ధకము మున్నగునవి ఎవనికుండునో అతనిలో తమోగుణముపూర్తిగా వున్నదని గ్రహించవలెను. ఇట్టి లక్షణములనుముందుగను తెలుసుకొని వాటిని నివారించుట ద్వారా అంధకారసదృశమగు తమోగుణమును హృదయమునుండి దూరముగా పారద్రోల వలసి వుంది. లేక పోతే తమోగుణము గలవాని వలన సమాజమునకు ఎంతటి చెడుజరుగుతుందో ఊహించలేము. సోమరితనము-నిద్ర-మరుపు ఈ మూడు విషయములను జయించినచో తమోగుణమును జయించినట్లే. సత్వ రజస్తమో గుణముల గురించి ఆచార్య వినోబా భావే తాము ధూళియా జైలులో వున్నపుడు తోటి రాజకీయఖైదీలనుద్దేశించి తెలిపిన అంశాలను జిజ్ఞాసువులైన పాఠకుల ప్రయోజనం నిమిత్తం ఇక్కడ పొందుపరచడం జరిగింది. వాటి వివరాలు ఈ విధంగా వున్నాయి.

1. **సత్వగుణము :** సత్వగుణము నుండి ఆత్మను వేరుచేయుట ఎట్లు?. అనే అంశాన్ని సూక్ష్మంగా పరిశీలించవలసివుంది. సత్వగుణాన్ని ఒక్కసారిగా నిర్మూలనం చేయకూడదు. రజ, స్తమోగుణములను మాత్రం పూర్తిగా నాశనము చేయవలెను. ఈ రెండింటి కంటే

సత్వగుణము యొక్క భూమిక వేరు. ఎక్కడైనను పెద్ద గుంపును చెదరగొట్టవలసి వచ్చినపుడు నడుము పైభాగమున దెబ్బతగలకుండా కాళ్ల పై తుపాకులను ప్రేల్చండని సిపాయిలకు కమాండర్ ఆజ్ఞనిచ్చును. ఈ విధంగా చేసినచో మనిషి చావడు. గాయములు మాత్రము తగులుతాయి. ఇదేవిధంగా సత్వగుణమును గాయపరచవలసిందే కాని చంపరాదు. రజస్తమో గుణములు రెండును పోయిన పిదప ఇకమిగిలి వుండే శుద్ధసత్వమే. శరీరమున్నంతవరకు ఇందేదో ఒక భూమికలో వుండక తప్పదు. ఇట్లు రజస్తమములు రెండింటిని వదలిన తరువాత మిగిలెడు సత్వగుణములనుండి ఆత్మ వేరగుట అనగా అర్థమేమి?

నేను సాత్వికుడను అనే దురభిమానము మానవులలో ప్రవేశించవచ్చు. అపుడా దురభిమానము ఆత్మను శుద్ధసత్వమునకు క్రిందికి లాగివేస్తుంది. లాంతరు యొక్క ప్రకాశము బాగుగా వుండవలెనినిన అద్దములోపలి వైపుగల మసిని పూర్తిగా తుడిచివేయవలెను. అటుపైని రజోగుణము అను దుమ్మును కూడా తుడిచి శుభ్రము చేయవలెను.

ఈ విధముగా రజస్తమో గుణములను తుడిచివేయగా సత్వగుణమను నిష్కళంకమైన అద్దము మిగిలి వుండును.

ఇక మిగిలివున్న సత్వ గుణమునుకూడా దూరము చేయవలెనినిన అద్దమును కూడా బ్రద్దలు కొట్టమని తెలిపినట్లవుతుంది. అట్లుకాకూడదు. అద్దమును బ్రద్దలు కొట్టినచో లాంతరు యొక్క పని నెరవేరదు. జ్యోతి యొక్క ప్రకాశము వ్యాపించవలెనినిన అద్ధము అవసరము. కనుక పరిశుభ్రమైన అద్దమును పగుల గొట్టము. కన్నులు మిరుమిట్లుగొనకుండ అద్దముపై ఒక కాగితము ముక్కను అడ్డుపెట్టుకుందుము. మనకు కావలసిన దల్లా కన్నులు మిరుమిట్లు గొనకుండా చూచుకొనడమే. ఈ విధంగా మనము సత్వగుణమును జయించుట అనగా దాని యందు దురభిమానమును, ఆసక్తిని తొలగించుకొనుటయే. అంటే సత్వగుణమును అహంకారరహితముగ చేసుకొనవలెను.

2 **రజోగుణము** :పెక్కురకముల పనులు చేయవలెనన్న పేరాస, మానవాతీతమైన అద్భుతకార్యములు చేయవలెనను అపారమైన ఆసక్తి రజోగుణమునకు ప్రధాన లక్షణాలు. రజోగుణమువలన అపారమైన కార్యాసక్తి మనుష్యులలో ఆవహిల్లును. లోభాత్మకమైన కార్యాసక్తి ఉత్పన్నమగును. తదుపరి వాసనా వికారముల వేగము హెచ్చును. దీనిని అరికట్టడానికి వీలుకాదు. ఇక్కడ వున్న పర్వతమును తీసుకువెళ్లి ఎక్కడో వున్న గోతిని పూడ్చవలెనని, నీటిని నింపి సహారా ఎడారిని సముద్రముగ చేయవలెనని బుద్ధిపుట్టును. ఇక్కడ సూయజ్‌కాలువ తవ్వవలెనని అక్కడ పనామా కాలువ నిర్మించవలెనని

రజోగుణముగల మానవుడు వెర్రితలలు వేస్తుంటాడు. ఏదో ఒకదానిని నిర్మించడం ఇంకొక దానిని నాశనము చేయడం తప్ప అతనికి మరొక ఆలోచన వుండదు. ఈ పనులన్నీ చిన్నపిల్లవాడు గుడ్డపీలికలను తీసుకొని ఇంకా చిన్నగా చింపుటవలెను లేదా అతుకులు పెట్టుట వలె వుండును. దానిని దానిలో కలుపుము. దానిని మరొక దానిలో ముంచుము అనే చేష్టలతో రజోగుణ ప్రవృత్తి గలవాడు ప్రవర్తిస్తుంటాడు. రజోగుణము యొక్క మతిలేని చేష్టలు ఈ విధంగా వుంటాయి.

రజోగుణము కలవాడు వున్నదున్నట్లు వుండడాన్ని సహింపడు, అతని దృష్టిలో అంతా తారుమారుకావలె.

రజోగుణముగల మనుష్యునకు బుద్ధి స్థిరత్వముండదు. అతడు తాత్కాలిక ఫలములనే కోరుచున్నాడు. తాను చేసే పనికి ఏ కొంచెము విఘ్నము కలిగినను వెంటనే అతడు అంగీకృతమార్గమును విడిచివేయును. అతడు నిరంతరము ఒక దానిని సేకరిస్తూ అంతకు ముందు సేకరించిన దానిని విడిచివేస్తుంటాడు. అతని నిర్ణయములు రోజు రోజుకు ఒక్కోసారి క్షణ క్షణానికి మారుతుంటాయి. దాని పరిణామము ఏమిటంటే చివరకు అతనికి ఏ ఒక్కటియు చేతికి దొరకదు.

“రాజసంచలమధ్రువం” రజోగుణ ప్రధానుని పనులన్నియు చంచలములు, అనిశ్చితములు. చిన్న పిల్లలు గోధుమ గింజలను పాతిపెట్టి అప్పుడే మరల వానిని పెల్లగించి చూచెదరు. అదే విధంగా రాజసికుడు ఫలమంతయు అప్పటికప్పుడు కనుపించవలెనని కోరుకొనును. అది అగుపించకపోతే అంతలోనే అతడు అధీరుడై పోవును. ఒక్కచోట కాలూని గట్టిగా నిలబడుట వానికి తెలియనే తెలియదు. ఇక్కడొక చిన్న పనిని మొదలు పెట్టి మరొక చోట గౌరవమును పొందవలెనని ప్రయత్నించును. అది అట్లుంగానే వెంటనే మూడవ చోటికి ప్రయాణానికి సమకట్టును.ఈ రోజు మద్రాసులో సన్మాన పత్రము, రేపు కలకత్తాలో, ఎల్లుండి బొంబాయిలోను, ఆవటెల్లుండి నాగపూర్‌లోను, దేశములో ఎన్ని మున్సిపాలిటీలున్నవో వాటన్నింటి ద్వారా సన్మాన పత్రములను స్వీకరించుటకు లాలసపడుచుండును. గౌరవ ప్రతిష్ఠలు మాత్రమే అతనికి కావలసింది. ఒక్కచోట కూర్చుండిపనిచేయు విధానమే అతనిలో అగుపించదు. అందువలన రజోగుణము గలవాని యొక్క స్థితి ఎంతో భయంకరమైనది.

రజోగుణప్రవృత్తిగల మానవుడు అన్నింటిలో తానే వున్నానని భావించును. స్వధర్మము అనునది అతనికి వుండదు. నిజమైన స్వధర్మము అంటే ఇతరకర్మలనన్నింటిని వదలిపెట్టుటయే. గీతలోని కర్మయోగము స్వధర్మమునకు రామబాణము. రజోగుణమంతయు చంచలత్వమే. అది పర్వతాగ్రము పైబడి అన్ని వైపులకు ప్రవహించి

నామరూపాలు లేకుండా నిరర్థకమై పోయిన వర్షపునీరులాంటిది. కాని ఆ నీరంతా ఏదో ఒక దిశగా ప్రవహించి వుంటే అదొక నదియై దాని నుండి శక్తి ఉద్భవించి దేశమునకు లాభము చేకూరును. అందువలన మానవుడు తన శక్తిని వివిధ కార్యములలో ప్రవేశపెట్టక దానిని ఏకముఖి మొనర్చినచో పని సఫలం అవుతుంది. అందువలననే స్వధర్మములో ఎంతో మహత్వమున్నదని తెలియజేశారు తత్వజ్ఞులు.

3. **తమోగుణము** : ఆధునిక సామాజిక వ్యవస్థలో తమోగుణముయొక్క భయంకర పరిణామాలు మనకు క్షణ క్షణం అగుపిస్తూనే వున్నాయి. తమోగుణము యొక్క ముఖ్య పరిణామము సోమరితనము. ఈసోమరితనము నుండియే నిద్ర- మరపు వస్తున్నాయి.

మానవుడు సోమరితనాన్ని-నిద్రను, మరపును జయించగలిగినచో తమోగుణమును జయించినట్లే, ఈ మూడింటిలో సోమరితనం మిక్కిలి భయంకరమైనది. ఉత్తమోత్తములు అయిన వారు కూడా ఈ సోమరి తనము వలననే పనికిమాలిన వారగుచున్నారు. ఈ సోమరితనము సమాజము యొక్క శాంతిసుఖములను పూర్తిగా నాశనము చేయును. మానవునికి ఇదొక పెద్ద శత్రువు. ఇది చిన్నవారినుండి పెద్దవారి వరకు అందరిని పాడుచేయును. ఏ కొంచెము అవకాశము దొరికినా ఆ శత్రువు మనలో ప్రవేశిస్తుంది. తినవలసిన దానికంటే ఎక్కువ తింటివా కాసేపునడుము వాల్చమని ఒత్తిడి చేస్తుంది ఈ సోమరితనం. అట్లు కొంచెము ఎక్కువసేపు నడుము వాల్చితివా కన్నులలో సోమరితనము తాండవ మాడును. అపుడు నిన్ను నిదుర ఆవరించును. ఎక్కువసేపు నిదురపోతివా చేయవలసిన పనులను చేయలేవు.

అందువలన సోమరితనమునకు ఏ మాత్రము తావులేని జాగరూకతను మనం కలిగి యుండవలెను. నలమహారాజు అంతటి మహనీయుడు పాదములు కడుగుకొనునపుడు ఏదో ఒక పాదం ఒక మూలన కొంచెము తడియలేదట. ఆ తడియని ప్రాంతం గుండా వెంటనే కలి నలమహారాజును ఆవరించి అయన్ను అష్టకష్టాల పాలు చేసినట్లు పురాణాలు తెలియజేస్తున్నాయి.పెద్దలు వచిస్తున్నారు. అందుకని ప్రతిచిన్న పనినైనను మానవుడు అతి జాగరూకతతో వ్యవహరించి దానిని స్వచ్ఛముగ, నిర్మలముగ ఆచరించవలెను. నలమహారాజు అత్యంత పరిశుద్ధుడు. అన్ని విధాల ఆయన నిష్కళంకుడు. కాని అలసత్వము వలన పాదములు బాగుగా కడుగుకొనక పోయినంతనే కలి అతనిలో ప్రవేశించింది. ఇక మన శరీరాలైతే ఏదో ఒక మూలన కాక ఆపాదమస్తకం కలి ప్రవేశించుటకు వీలును కలిగియుంటుంది. ఎక్కడి కక్కడనే సోమరితనము మనలో ప్రవేశించగలదు. శరీరానికి సోమరితనము అబ్బినచో అది క్రమంగా మన బుద్ధులను

కూడా ఆవహిస్తుంది. ఈనాటి సమాజము ఈ సోమరితనము మీదనే ఆధారపడియున్నది. దాని వలన మితిలేని దుఃఖములు ఏర్పడుతున్నవి. మనమీ సోమరితనం పోగొట్టుకున్నచో దుఃఖములను అన్నింటినికాక పెక్కింటినైనను దూరం చేసుకొనగలము.

సమాజములో ఈనాడు ఒకవైపున సంపదలు కుప్పతిప్పలుగ -మరొక వైపున దారిద్ర్యపు లోతైన గోతులు వ్యాపించియున్నాయి. ఎందుకిట్లావుంది? అని ఆలోచిస్తే సోమరితనము సమాజాన్ని ఆవరించియుంది. దానిని వదలి అందరు పనిచేస్తే కనీసం మన సోమరితనం వలన కలుగుచున్న దుఃఖమును కొంతవరకైనా నివారించవచ్చును. అందుకు వీడువాడని అనకుండా ప్రతివాడు శరీరశ్రమను చేయనిశ్చయించుకోవలసి వుంది. తమోగుణమును నిర్మూలించుటకు ఇదే ఉత్తమమైన మార్గము.

సత్త్వం సుఖే సంజయతి
రజః కర్మణి భారత!
జ్ఞాన మావృత్య తు తమః
ప్రమాదే సంజయత్యుత శ్లో - 9

*అర్జునా!*
*సత్వగుణము సుఖమునందును*
*రజోగుణము కర్మమునందును*
*తమోగుణము జ్ఞానమునందును*
*ఆవరించియుండి ప్రమాదపుటంచుకు*
*జీవుని(ఆత్మను) చేర్చుచున్నవి*

1. ఆత్మను సత్వగుణము ఆవరించివున్నచో దీపముపై గాజు చిమ్నీని బోర్లించినట్లుండును.
2. ఆత్మను రజోగుణము ఆవరించి యున్నచో దీపముపై అలకని గంప బోర్లించినట్లుండును.
3. ఆత్మను తమోగుణము ఆవరించియున్నచో దీపముపై కుండ బోర్లించి నట్లుండును. అంటే సత్వగుణము, ప్రాపంచిక సుఖమునందును, రజోగుణము ప్రాపంచిక కర్మమునందును, తమోగుణము నిద్రా ప్రమత్తతలయందును అంటే సోమరి తనమునందు మానవుణ్ణి చేర్చుచున్నవి.

రజస్తమశ్చాభిభూయ
సత్త్వం భవతి భారత!
రజస్సత్త్వం తమశ్చైవ
తమస్సత్త్వం రజ స్తథా       శ్లో- 10

అర్జునా!
సత్వగుణము
రజస్తమోగుణములను
రజోగుణము సత్త్వతమో
గుణములను, తమోగుణము
సత్వరజోగుణములను
ఈ విధంగా ఒకదానినొకటి అణగ
ద్రొక్కుటకు ప్రయత్నించును

ఏ ఏ గుణములు మానవుని యందు అధికముగా వున్నవో తెలుసుకొనుటకు దిగువ తెలిపిన మూడు శ్లోకముల ద్వారా భగవానుడు ప్రకటిస్తున్నాడు.

సర్వద్వారేషు దేహే స్మిన్
ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యాత్
వివృద్ధం సత్త్వ మిత్యుత       శ్లో - 11

అర్జునా!
ఈ శరీర ద్వారములందలి
సర్వేంద్రియములందును
జ్ఞానము ఆవిర్భవించినపుడు
సత్వగుణము బాగుగా వృద్ధిచెందును

లోభః ప్రవృత్తి రారంభః
కర్మణా మశమః స్పృహా
రజస్యేతాని జాయంతే
వివృద్ధే భరతర్షభ       శ్లో - 12

అర్జునా!
రజోగుణము వృద్ధినొందినపుడు
మానవునిలో లోభము, వ్యాపకము
కర్మారంభము, అశాంతి, ఆశ
మొదలుగాగల గుణములు కలుగుచున్నవి

అప్రకాశో ప్రవృత్తిశ్చ
ప్రమాదో మోహ ఏవ చ
తమస్యేతాని జాయంతే
వివృద్ధే కురునందన!       శ్లో - 13

అర్జునా!
తమోగుణము వృద్ధిచెందినపుడు
అవివేకము, సోమరితనము
ప్రమాదము, మూఢభావము కలుగుచున్నవి

యదా సత్త్వే ప్రవృద్ధే తు
ప్రళయం యాతి దేహభృత్
తదోత్తమ విదాం లోకాన్
అమలాన్ ప్రతిపద్యతే       శ్లో - 14

సత్వగుణము వృద్ధిఅయినపుడు
జీవుడు దేహమును వీడినచో
ఉత్తమజ్ఞానులు పొందెడి పుణ్య
లోకములను పొందును

రజసి ప్రళయం గత్వా
కర్మసంగిషు జాయతే
తథా ప్రలీన స్తమసి
మూఢయోనిషు జాయతే శ్లో - 15

రజోగుణము వృద్ధినొందినపుడు
మరణించు వాడు కర్మసంగత్వము
కలవారి యందును, తమోగుణము
వృద్ధిచెందినపుడు చనిపోయినవాడు
మూఢజీవులయందును జన్మించుచున్నాడు

కర్మణస్సుకృతస్యాహుః
సాత్త్వికం నిర్మలం ఫలం
రజసస్తు ఫలం దుఃఖం
అజ్ఞానం తమసః ఫలమ్ శ్లో- 16

సుకృతములైన సాత్విక కర్మలకు
నిర్మలత్వము, రాజసకర్మలకు
దుఃఖము, తామస కర్మలకు
అజ్ఞానము ఫలమని
పెద్దలైనవారు తెలుపుతున్నారు

సత్త్వాత్ సంజాయతే జ్ఞానం
రజసో లోభ ఏవ చ
ప్రమాదమోహౌ తమసో
భవతోజ్ఞాన మేవచ శ్లో -17

సత్వగుణమువలన జ్ఞానము
రజోగుణము వలన లోభము
తమోగుణము వలన మరుపు
మోహము, అజ్ఞానముకలుగుచున్నవి.

ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా
మధ్యే తిష్ఠంతి రాజసాః
జఘన్యగుణవృత్తిస్థా
అధో గచ్ఛంతి తామసాః శ్లో-18

సత్వగుణముగలవారు
ఊర్ధ్వలోకమునకు పోవుచున్నారు
రజోగుణముగలవారు మధ్యలోకమున
జన్మించుచున్నారు. తమోగుణము
గలవారు క్రిందిలోకములకు త్రోయ
బడుచున్నారు

నాన్యం గుణేభ్యః కర్తారం
యదా ద్రష్టానుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి
మద్భావం సో ధిగచ్ఛతి శ్లో - 19

ఎవడు గుణములకంటెను
అన్యమగు కర్తను ఎప్పుడు
దర్శించడో, ఎవడుతనను
గుణములకంటెను అన్య
మైన వానినిగా గుర్తించు
చున్నాడో అట్టి ఆత్మ
జ్ఞాని నాస్వరూపమునే
పొందుతున్నాడు

గుణానేతానతీత్య త్రీన్
దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యుజరాదుఃఖైః
విముక్తో మృత మశ్నుతే శ్లో -20

దేహమునకు కారణమగు
ఈ త్రిగుణములను దాటి
జన్మము, మృత్యువు, ముసలితనము
వ్యాధులచేత విడువబడినవాడై
మోక్షమును పొందుచున్నాడు

ఈ త్రిగుణములను దాటి మోక్షపదవిని పొందవచ్చును అని శ్రీకృష్ణభగవానుడు చెప్పగా అట్లు ఆ గుణములుయేమిటని వాని లక్షణములు ఏమిటో తెలుపమని అర్జునుడు కోరుతున్నాడు.

కైర్లింగై స్త్రీన్ గుణానేతాన్
అతీతో భవతి ప్రభో
కిమాచారః కథం చైతాం
స్త్రీన్గుణానతి వర్తతే శ్లో -21

కృష్ణా!
ఈ మూడు గుణములను జయించిన
మానవుని లక్షణమేమిటి? అతని
ఆచారమెట్లుండును. ఈ గుణములను
అతడు ఎట్లు అతిక్రమించును?

భగవానుని సమాధానం
ప్రకాశం చ ప్రవృత్తిం చ
మోహ మేవ చ పాండవః
న ద్వేష్టి సంప్రవృత్తాని
న నివృత్తాని కాంక్షతి శ్లో - 22

ఉదాసీనవదాసీనో
గుణైర్యోన విచాల్యతే
గుణావర్తన్త ఇత్యేవ
యోవ తిష్ఠతి నేంగతే శ్లో - 23

సమదుఃఖ సుఖస్వస్థః
సమలోష్టాశ్మకాంచనః
తుల్యప్రియాప్రియో ధీరః
తుల్యనిందాత్మసంస్తుతిః శ్లో - 24

మానావమానయోస్తుల్యః
తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారంభపరిత్యాగీ
గుణాతీతస్స ఉచ్యతే శ్లో - 25

ఎవడు తనకు సంప్రాప్తమైన
ప్రకాశమునుగాని, ప్రవృత్తినిగాని
మోహమునుగాని ద్వేషింపడో
అవి విడిచిపోయినను తిరిగి
వాటిని ఆశించడో, ఉదాసీనుడుగా
వున్నవాడై గుణముల చేత చలింప
జేయబడడో, గుణచలనమును
మాత్రము గ్రహించి యుండునో
చలింపక నిశ్చలముగ నిండునో
ఆత్మయందే స్థిరముగ నుండునో
మట్టిగడ్డ, రాయి, బంగారమును
సమముగా జూచునో, ఇష్టానిష్టములందు
సమత్వభావము కలిగి యుండునో
ధైర్యము గలవాడై, కర్తృత్వబుద్ధిని
వదలినవాడై యుండునో అట్టివాడు
గుణాతీతుడని చెప్పబడుచున్నాడు.

అచంచలభక్తితో తనను సేవించు వాడు త్రిగుణము దాటి బ్రహ్మ సాక్షాత్కారమును పొందుచున్నాడని భగవానుడు అర్జునునకు తెలియజేస్తున్నాడు.

మాం చ యో௨ వ్యభిచారేణ
భక్తియోగేన సేవతే
స గుణాన్సమతీత్యైతాన్
బ్రహ్మ భూయాయ కల్పతే శ్లో - 26

అర్జునా!
ఎవడు నన్నే అచంచలమైన
భక్తిచేత సేవించుచున్నాడో
అట్టివాడు ఈ గుణత్రయమును
అతిక్రమించి బ్రహ్మ తత్వమును
పొందుటకు అర్హుడగుచున్నాడు

బ్రహ్మణో హి ప్రతిష్ఠాహం
అమృతస్యావ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య
సుఖస్యైకాంతికస్య చ శ్లో - 27

అమృతస్వరూపమును
అవ్యయము, శాశ్వతము
ధర్మస్వరూపమునగు పూర్ణానంద
స్వరూపమునకు నేనే ఆశ్రయుడను

ఈ విధంగా ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రము
శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన
శ్రీ మద్భగవద్గీతయందలి గుణత్రయ విభాగ యోగమను పేరుగల
పదనాలుగవ అధ్యాయము సమాప్తముగావించబడింది.



# గీతా సంహిత

**అధ్యాయము పదునైదు** | **పురుషోత్తమ ప్రాప్తి యోగము**

ఈ అధ్యాయముతో మనము గీత యొక్క కొనకు చేరుకున్నామని చెప్పుకొనవచ్చును. చెప్పదలచిన విషయాలు అన్నీ సమగ్రంగా ఈ పదునైదవ అధ్యాయంలో చెప్పబడినవి. తరువాత వచ్చే పదహారు, పదిహేడవ అధ్యాయములు ఈ అధ్యాయానికి అనుబంధాలుగా వ్యవహరిస్తాయి. ఇక పదునెనిమిదవ అధ్యాయము ఉపసంహారము అని తెలుసుకోవాలి. ఈ కారణముననే భగవానుడు ఈ అధ్యాయాంతములో - (15-20)

అర్జునా!
మిగుల రహస్యమైన
యోగశాస్త్రమును నీకు
**తెలిపితిని**, దీనిని తెలుసుకున్న
వాడు బుద్ధిమంతుడును, కృతార్థుడును అగును
అని ప్రకటించారు.

చివరన భగవంతుడిట్టన్నాడు. జీవిత శాస్త్రమును గురించి, దాని సిద్ధాంతములను గురించి చెప్పవలసిన దంతయు పూర్తి అయినది. కనుక ఇది శాస్త్రము అని భగవానుడు తెలిపాడే కాని ఇది చరమాధ్యాయమని ప్రకటించలేదు. ఈ అధ్యాయంలో పరమార్థం పూర్తిగా బోధింపబడినది. వేదసారమంతయు ఇందులో వచ్చినది. పరమార్థము యొక్క చైతన్యమును మానవునిలో కలిగించుటయే వేదములపని. ఈ అధ్యాయము చేస్తున్న పని ఇదే. అందువలననే దానికి వేదసారము అనుగౌరవప్రదమైన పదవి లభించింది.

పదమూడవ అధ్యాయంలో దేహమును ఆత్మ నుండి వేరుచేయడం గురించి తెలుసుకున్నాము. పదునాలుగవ అధ్యాయములో తత్సంబంధమైన ప్రయత్నవాదమును పరిశీలించినాము. రజస్తమో గుణములను నిగ్రహంతో త్యజింపుము. సత్వగుణమును వికసింపజేసి దాని యందలి ఆసక్తిని జయింపుము. దాని ఫలమును త్యజింపుము. ఈ విధముగ ప్రయత్నము చేయవలెనని, ఈ ప్రయత్నము పూర్తిగా సఫలమగుటకు ఆత్మ జ్ఞానము ఎంతో అవసరమని భక్తిలేనిచో ఆత్మజ్ఞానము అసంభవమని ఈ అధ్యాయము చివర చెప్పబడింది. అయితే భక్తిమార్గము ప్రయత్నమార్గము నుండి వెళ్లవలసినటువంటిదే. దానిని సూచించుటకే ఈ పదిహేనవ అధ్యాయము ఆవిర్భవించింది. అధ్యాయము ప్రారంభములోనే ఈ ప్రపంచాన్ని ఒక మహావృక్షముతో పోల్చడం జరిగింది. త్రిగుణములచే పోషింపబడుచున్న ప్రచండమైన శాఖలు ఈ వృక్షానికున్నాయి. అనాసక్తి, వైరాగ్యము అను శాస్త్రములతో ఈ వృక్షాన్ని నరికివేయవలెనని ఆరంభములోనే తెలుపబడింది. వెనుకటి అధ్యాయములో గల సాధనామార్గాన్ని ఇక్కడ ఈ అధ్యాయము ప్రారంభంలో తిరిగి చెప్పడం జరిగింది.

రజస్తమములను నశింపజేయడం ద్వారా స్వవికాసమును పొందవలెను. ఇందులో ఒకటి వినాశకము, ఇంకొకటి విధాయకము. రెండింటిని కలిపిన యెడల దాని పరిణామముగా వచ్చునది. ఒకటే మార్గము. గడ్డినికోయుట, విత్తనములను విత్తుట ఈ రెండును ఒకే క్రియ యొక్క భిన్న రూపములు. రజస్తమోగుణములను గూర్చియు, సత్వ గుణమును గూర్చియు చెప్పినది కూడ ఇట్టిదే.

ఇక్కడ కాస్త రామాయణమును గూర్చి చర్చిద్దాము. రామాయణములో మనకు అగుపించే రావణుడు- కుంభకర్ణుడు-విభీషణుడు ముగ్గురును అన్నదమ్ములే. ఈ ముగ్గురిలో కుంభకర్ణుడిది తమోగుణము. రావణుడిది రజోగుణము. విభీషణుడిది సత్వగుణము. మన శరీరములో ఈ మూడు గుణములతో అనునిత్యము రామాయణము రచింపబడుతున్నది. రామాయణములో రావణ, కుంభకర్ణులనాశనము ఉచితమైనదే. ఇక మిగిలిన విభీషణుని తత్వము హరిచరణములను ఆశ్రయించిన తత్వము. అందువలన అతనిలోని హరిచరణతత్వము ప్రగతికి సాధనము, పోషకము అయింది. మనము ఇట్టి స్థితిని అలవర్చుకోవలసి వుంది. ఈ విషయాన్ని పదునాలుగవ అధ్యాయములో తెలుసుకున్నాము. ఈ పదునైదవ అధ్యాయములో మొదట ఆ వెనుకటి విషయమే వచ్చినది. సత్వ రజస్తమో భరితమైన ఈ ప్రపంచమును అసంగము అను శస్త్రముతో ఛేదించవలసి వుంది. రజస్తమములను నిరోధించి, సత్వగుణమును వికసింపజేసి పవిత్రులము కావలసి వుంది. ఇక్కడ కమలము యొక్క ఆదర్శమును భగవద్గీత విశదీకరిస్తున్నది. మన భారతీయ సంస్కృతిలోని జీవితాదర్శాలు ఉత్తమోత్తమమైనవి. వాటిని కమలముతో పోల్చడం జరిగింది. కమలము భారతీయ సంస్కృతికి చిహ్నము. ఉత్తమోత్తములైన


ఊర్ధ్వమూల మధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయం
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్

భావములను ప్రకటించుటకు కమలము స్వచ్ఛము, పవిత్రము అయి నిర్లిప్తముగనుండును. పవిత్రత నిర్లిప్తత అను శక్తి ద్వయము కమలమునకు వున్నది. భగవంతుని వివిధ అవయములను కమలముతో పోల్చెదరు. నేత్రకమలము, పదకమలము, ముఖకమలము, నాభికమలము, హృదయకమలము, శిరః కమలము మొదలగు ప్రయోగాలున్నాయి. సర్వత్ర సౌందర్యము, పవిత్రత, వీటితోపాటే నిర్లిప్తత కూడా వున్నదను భావము ఈ ప్రయోగాల ద్వారా అవి మనహృదయములో అంకితమైపోతున్నాయి.

"జాకరూకులైన వారిని వేదములు
ప్రేమించును, వారిని కలియుటకు
ఆ వేదములు వచ్చును, అని వేదముల
గురించి ఋషులు చెప్పియున్నారు

అంటే జాగ్రత్తకలవారి యొద్దకు వేదనారాయణుడువచ్చును. వారి యొద్దకు జ్ఞానమును, భక్తియును వచ్చును అని పై వాక్యాలు స్పష్టీకరిస్తున్నాయి. దానిని బట్టి భక్తి జ్ఞానాలు ప్రయత్నమార్గములోని రెండు అంగాలు, ఈ మార్గానికి ఈ రెండును మాధుర్యమును చూకుర్చుచున్నవి. ప్రయత్నముతో ఆత్మజ్ఞానమును, భక్తిని జోడించినప్పుడు పూర్ణత్వము సిద్ధిస్తుంది. దీనిని ఈ అధ్యాయంలో మనం చూస్తాం. ఈ అధ్యాయంలో మొత్తం 20 శ్లోకాలున్నాయి. ఈ మొత్తము పురుషోత్తమ ప్రాప్తిని కలుగజేసే భక్తి ప్రబోధితశ్లోకాలే. అందువలన వీటిని వివిధ అంశాలుగా విడగొట్టలేదు.

సంసారమను అశ్వత్థవృక్షమును గూర్చి భగవానుడు తెలియజేస్తున్నాడు.

ఊర్ధ్వమూల మధశ్శాఖం
అశ్వత్థం ప్రాహురవ్యయం
ఛందాంసి యస్యపర్ణాని
యస్తం వేదస వేదవిత్ శ్లో - 1

*వేళ్లు(మూలము) పైకి*
*కొమ్మలు క్రిందికి విస్తరించి*
*యున్నట్టిది అశ్వత్థ(రావి) వృక్షము*
*దానికి నాశముగాని, క్షయముగాని*
*లేదు, దాని ఆకులు వేదఋక్కులు*
*వానిని గూర్చి తెలుసుకున్నవాడు*
*వేదవిదుడు, అంటే జ్ఞాని*

భక్తియోగము యొక్క ప్రాముఖ్యతను గూర్చి చర్చించిన పిమ్మట వేదముల విషయమేమి? అని ఎవరైన నడుగవచ్చును. వేదాధ్యయనము యొక్క ప్రయోజనము కృష్ణునెరుంగుటయే అని ఈ అధ్యాయమున వివరింపబడుచున్నది. కృష్ణచైతన్యములో నున్నవాడును, భక్తియుక్తసేవలో నిమగ్నుడైనవాడునువేదముల నెరుంగును.

భౌతిక ప్రపంచబంధమిచ్చట అశ్వత్థవృక్షముతో పోల్చబడినది. సకామకర్మలందాసక్తి కలవాని విషయమున ఈ అశ్వత్థవృక్షమునకు అంతములేదు. అతడు ఒకశాఖనుండి ఇంకొక శాఖకును, అచ్చునుండి మరియొక శాఖకు తిరుగుచుండును. భౌతిక ప్రపంచమను ఈ వృక్షమున కంతము లేదు. దీనియందాసక్తుడై యుండువానికి ముక్తిపొంద నవకాశము లేదు. మానవునుద్ధరించుటకు ఉద్దేశింపబడిన వేద ఋక్కులు ఈ వృక్షమునకు ఆకులని పేర్కొనబడినవి. దీనివేళ్లు విశ్వమునందలి అత్యూర్ధ్వ లోకము నందున్న బ్రహ్మనుండి ఆరంభించుటచే పైభాగమునకు పెరుగును. ఈ అక్షయమైన మాయావృక్షము నెరుంగ గలిగినచో మానవులు దాని నుండి వెలువడగలరు.

ఈ విముక్తి విధానమును గూర్చి అవగాహన చేసికొనవలయును. భౌతిక బంధములనుండి వెలువడు విధానములు చాల గలవని వెనుకటి అధ్యాయమున వివరింపబడినది. త్రయోదశాధ్యాయము వరకు దేవదేవుని భక్తియుక్త సేవయే అందుకత్యుత్తమ మార్గమని మన మెరింగితిమి. ఇప్పుడు భౌతిక వ్యాపారములపై అనాసక్తియు, భగవంతుని దివ్యసేవపై ఆసక్తియు, భక్తియుక్తసేవ యొక్క మూలసిద్ధాంతమని తెలియవచ్చినది ఈ అధ్యాయము యొక్క ఆరంభమున భౌతిక ప్రపంచాసక్తిని ఛేదించు విధానము చర్చించబడినది. ఈ భౌతిక జీవితము యొక్క మూలము పైకి పెరుగును. అది భౌతిక వస్తు సర్వస్వము నుండియు, విశ్వము యొక్క అత్యున్నత లోకము నుండియు ఆరంభమగునని అర్థము. అచ్చట నుండి వివిధ గ్రహమండలములకు ప్రాతినిధ్యము వహించు పెక్కు శాఖలతో విశ్వమంతయు విస్తరించును ఫలములు- మతము, అర్థికాభివృద్ధి, ఇంద్రియతృప్తి, మోక్షము అను జీవుని యొక్క వ్యాపార ఫలితములను సూచించును.

ఈ ప్రపంచమున కొమ్మలు క్రిందికి, వేళ్లు పైకిని గల చెట్టు మనకెచ్చటను ప్రత్యక్షముగ కానరాదు. కాని అట్టిదొకటి యున్నది. ఆ చెట్టు జలాశయము ప్రక్క గోచరించును. ఒడ్డుననున్న వృక్షములు శాఖలు క్రిందికున్నట్లును వేళ్లు పైకున్నట్లును జలము నందు ప్రతిబింబము కనిపించును. వేరు మాటలతో చెప్పవలెనన్న ఈ భౌతిక ప్రపంచమను వృక్షము ఆధ్యాత్మిక ప్రపంచమను నిజమైన వృక్షము యొక్క ప్రతిబింబము. వృక్షము యొక్క ప్రతిబింబము జలములో కానవచ్చునట్లు ఆధ్యాత్మిక ప్రపంచము యొక్క ప్రతిబింబముకామముపై గోచరించును. వస్తువులు ప్రతిబింబితమైన భౌతిక కాంతితో నుండుటకు కామమే కారణము. ఈభౌతిక జీవితము నుండి ముక్తి పొందగోరువాడు సవివరమైన అధ్యయనముచే ఈ వృక్షమును పూర్తిగ నెరుంగవలెను. అప్పుడతడు దానితో గల సంబంధమును ఛేదింపగలడు.

నిజమైన వృక్షమునకు ప్రతిబింబమగుటచే ఈ వృక్షము సరియైన ప్రతిపత్తి. ఆధ్యాత్మిక ప్రపంచమున సర్వమును కలదు. నిరాకారవాదులు ఈ భౌతిక వృక్షమునకు బ్రహ్మమే మూలమని తలంతురు. సాంఖ్యతత్త్వము ననుసరించి ఈ మూలము నుండి ప్రకృతి, పురుషులును, తరువాత త్రిగుణములును, పిమ్మట పంచమహాభూతములును, అనంతరము దశేంద్రియములును, మనసును ఉద్భవించినవి. ఈ విధముగ భౌతిక ప్రపంచమంతను వారు చతుర్వింశతి తత్త్వములుగ విభజింతురు. సర్వ వ్యక్తీకరణములకును బ్రహ్మమే మూలమైనచో ఈ భౌతిక ప్రపంచము కేంద్రము యొక్క 180డిగ్రీల వ్యక్తీకరణము. మిగిలిన 180 డిగ్రీలును ఆధ్యాత్మిక ప్రపంచ రూపమున నున్నవి. భౌతిక ప్రపంచము విపర్యస్తమైన ప్రతిబింబము. అందుచే ఆధ్యాత్మిక ప్రపంచము యథార్థముగ అట్టి వైవిధ్యమునే కలిగియుండవలెను. ప్రకృతి పరమపురుషుని యొక్క బాహ్యశక్తి. పురుషుడు పరమ పురుషుడే. అదే భగవద్గీతలో వివరించబడినది. ఈ వ్యక్తీకరణము భౌతిక మగుటచే తాత్కాలిక మైనట్టిది. ప్రతిబింబమెప్పుడు తాత్కాలికమే. ఏలయన అది ఒకప్పుడు కనిపించి మరియొకప్పుడు కనిపింపదు. కాని ఈ ప్రతిబింబము దేనినుండి కలుగుచున్నదోఆమూలము శాశ్వతమైనట్టిదే. యథార్థ వృక్షము యొక్క భౌతిక ప్రతిబింబమును ఛేదించి వేయవలెను. ఒక వ్యక్తి వేదముల నెరుంగునని చెప్పబడినపుడు ఈతడీ భౌతిక ప్రపంచముపై ఆసక్తిని ఛేదించుటెట్లో తెలిసికొనెనని భావింపవలెను. అతడా విధానము నెరింగినచో వేదములను కూడ నిజముగ నెరుంగును. వేదముల యందలి కర్మకాండకు సంబంధించిన సిద్ధాంతములచే నాకర్షించబడువాడు ఆ వృక్షము యొక్క సుందరములైన పచ్చని ఆకులచే ఆకర్షించబడును. అతడు వేదముల యొక్క నిజమైన ప్రయోజనముల నెరుంగడు. దేవదేవుని చేతనే చెప్పబడినట్లు, ప్రతిబింబితమైన ఈ వృక్షమును ఛేదించి ఆధ్యాత్మిక ప్రపంచమను యథార్థ వృక్షమును పొందుటయే వేదముల యొక్క ప్రయోజనము.

అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్యశాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాళాః
అధశ్చమూలాన్యనుసన్తతాని
కర్మానుబన్ధీని మనుష్యలోకే          శ్లో - 2

ఈ సంసార వృక్షము యొక్క కొమ్మలు
త్రిగుణములచేత పోషింపబడి అవి
ఊర్ధ్వముఖంగాను, అధోముఖంగాను
విస్తరించివున్నాయి, విషయవాంఛలు

అనునవి ఈ చెట్టు యొక్క పిందెలు
దీని (చెట్టు )వేళ్లు మఱి ఊడలవలె
క్రిందివైపుకు దిగజారి మానవలోకమందు
కర్మబద్ధములై విస్తరించి పాతుకుపోయాయి

అశ్వత్థ వృక్షము యొక్క వర్ణన మిచ్చుట ఇంకను వివరింపబడుచున్నది. దాని కొమ్మలు అన్ని వైపులకును వ్యాపించును. క్రింది భాగములందు మానవులు, జంతువులు, గుఱ్ఱములు, గోవులు, కుక్కలు, పిల్లులు, మొదలగు వివిధ జీవుల రూపములుండును. ఇవన్నియు కొమ్మల క్రిందిభాగములందుండగ పై భాగములందు దేవతలు, గంధర్వులు మున్నగు ఉన్నత జీవజాతులకు చెందిన ఉన్నత రూపములుండును. వృక్షము జలముచే పోషింపబడునట్లు ఈ వృక్షము భౌతిక ప్రపంచమునకు సంబంధించిన త్రిగుణములచే పోషింపబడును. ఒక్కొక్కప్పుడు కావసినంత నీరు లేని కారణమున కొంత భూభాగము నిష్పలముగా నుండుటయు, ఒక్కొక్కప్పుడుకొంత భూభాగము పచ్చగా ప్రకాశించుచుండుటయు మనము చూచుచుందుము. అట్లే భౌతిక ప్రకృతి యొక్క ప్రత్యేక గుణములు పరిమాణము నధికముగా నున్నపుడు తదనుగుణముగనే వివిధ జీవజాతులు కూడా వ్యక్తములగుచుండును.

ఈచెట్టు యొక్క చిగురాకులు ఇంద్రియార్థములుగ పరిగణింపబడినవి. భౌతిక ప్రకృతియందలి వివిధ గుణముల నభివృద్ధిచే మనము వివిధములైన ఇంద్రియములను పెంపొందించుకొందుము. ఇంద్రియముల ద్వారా వివిధములైన ఇంద్రియార్థముల ననుభవించు చుందుము. వివిధములైన ఇంద్రియార్థములందాసక్తిగల చెవులు, ముక్కు, కన్ను మొదలగు ఇంద్రియములు శాఖల అగ్రములు. శబ్ద స్పర్శ రూప రసాదులగు ఇంద్రియార్థములు చిగురాకులు. వివిధములైన బాధలవలనను, ఇంద్రియ భోగముల వలనను తరువాత పుట్టు ఆసక్త్యనాసక్తులు ఉపమూలములు. అన్ని వైపులకును వ్యాపించు ఈ ఉపమూలము నుండియే ఆచారానాచారములకు సంబంధించిన ప్రవృత్తులుద్భవించునని భావింపబడుచున్నది. యథార్థమైన మూలము బ్రహ్మలోకమునందుండును. మిగిలిన మూలములు మానవలోకమునందుండును. మానవుడు ఊర్ధ్వలోకములో పుణ్యకర్మల ఫలితముల ననుభవించినపిమ్మట క్రిందినున్న భూమికి వచ్చి అభివృద్ధికై కామ్యకర్మలను కొనసాగించును. మానవులు నివసించు ఈ లోకము కర్మక్షేత్రముగ భావింపబడుచున్నది.

న రూపమస్యేహ తథోపలభ్యతే
నాంతో న చాదిర్న చ సంప్రతిష్ఠా
అశ్వత్థ మేనం సువిరూఢమూలం
అసంగశస్త్రేణ దృఢేన చిత్వా శ్లో - 3

తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్గతా న నివర్తన్తి భూయః
త మేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ శ్లో - 4

ఈ లోకమునందు సంసారవృక్షము
యొక్క రూపంగాని, తుది, మొదళ్లుగాని
తెలియదు, విషయవాంఛలు లేనివారు
మాత్రమే ఈ అశ్వత్థవృక్షము యొక్క
వేళ్లను నరికి వేయగలరు
అసంగత్వము అను ఆయుధముతో
ఈ సంసారవృక్షాన్ని నరికి పురుషోత్తమ
ప్రాప్తిని పొందినవారు తిరిగి ఈ భూలోకానికి
రారు, ఎవరివలన ఈ సంసార ప్రవృత్తి
ఏర్పడినదో ఆ ప్రథమ (ఆది ) పురుషుడను
నేనే, నేనే ఆ స్థితిని పొందెదను. అట్టి
నన్ను భక్తి భావముతో శరణు పొంది
భవబంధములనుండి ముక్తిని పొందవలసి వుంది.

ఈ అశ్వత్థవృక్షముయొక్క నిజమైన రూపము, ఈ భౌతిక ప్రపంచమున తెలిసికొనబడజాలదని ఇచ్చట స్పష్టముగా చెప్పబడినది. వేళ్లు పైకుండుటచే ఆ నిజమైన వృక్షముయొక్క వ్యాప్తి రెండవచివరనుండును. వృక్షము యొక్క భౌతిక వ్యాప్తులలో చిక్కుకొన్నప్పుడు అది ఎంతవరకు వ్యాపించునో, అది ఎచ్చట మొదలిడునో ఎవరును చూడజాలరు. అయినను మానవుడు కారణమును కనుగొనవలెను. నేను నా తండ్రి కుమారుడను. నా తండ్రి అట్టివాని కుమారుడు. ఈ విధముగా శోధించినచో అతడు గర్భోదకశాయి విష్ణువుచే పుట్టింపబడిన బ్రహ్మచెంతకు వచ్చును. చివర కీ విధముగ అతడు దేవాదిదేవుని సమీపించినపుడు పరిశోధన కార్యము ముగియును. దేవాదిదేవుని గూర్చి జ్ఞానముగల వ్యక్తుల సాహచర్యము ద్వారా దేవాదిదేవుని రూపమైన ఈ వృక్షము యొక్క మూలాధారము నన్వేషింపవలయును. అప్పుడు దాని నర్థము చేసికొనుటచే అతడు క్రమముగ యథార్థతత్త్వము యొక్క మిథ్యాప్రతిబింబము నుండి వేరుపడి జ్ఞానముచే సంబంధమును ఛేదించి యథార్థవృక్షము నందు ప్రతిష్ఠితుడగును.

నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వన్ద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై
గచ్ఛన్త్యమూఢాః పద మవ్యయం తత్ శ్లో - 5

దురభిమాన రహితుడును
భ్రాంతి రహితుడును
దుస్సాంగత్యమునుండి
ముక్తుడైనవాడును
శాశ్వత తత్వమును
గూర్చి తెలుసుకొన్నవాడును
మోహరహితులు
సుఖదుఃఖాది ద్వంద్వములనుండి
ముక్తులైన వారును ఆ దేవాదిదేవుని
శరణు జొచ్చుటఎట్లో తెలుసుకున్నవారును
అవ్యయమైన మోక్షపదమును పొందెదరు

శరణాగతి విధానము ఇందు చక్కగా వర్ణింపబడినది. గర్వభ్రాంతుడు కాకుండా యుండుటయే అందుకు కావలసిన మొదటి అర్హత. బద్ధజీవుడు భౌతిక ప్రకృతికి ప్రభువునని తలంచుచు గర్వితుడై యుండుటచే అతడు దేవాదిదేవుని శరణుపొందుట చాల కష్టము. యథార్థ జ్ఞానాభ్యాసముచే అతడు తాను భౌతిక ప్రకృతికి ప్రభువు కాదనియు, దేవాదిదేవుడే ప్రభువనియు ఎరుంగవలెను. గర్వముచే కలుగు భ్రాంతి నుండి ముక్తుడైనపుడు అతడు శరణాగతి విధానము నారంభించవచ్చును. ఈ భౌతిక ప్రపంచములో ఎల్లపుడు ఏదో గౌరవము నపేక్షించువానికి దేవదేవుని శరణు జొచ్చుట వీలుకాదు. మాయ లేక భ్రాంతియే గర్వమునకు కారణము. ఏలయన మానవుడీ లోకమునకు వచ్చి స్వల్పకాలముండి మరణించినను అతనికి ప్రపంచమునకు తానే ప్రభువునను మూఢభావముండును. ఈ విధముగ అతడన్ని వస్తువులను సంకీర్ణముల నొనరించి ఎప్పుడు కష్టదశలోనే యుండును. ప్రపంచమంతయు ఈ భావముతోనే ప్రవర్తించుచుండును. స్థలము, ఈ భూమి మానవ సమాజమునకై చెందునని తలంచు ప్రజలు తామే యజమానులమను మిథ్యాభావనచే స్థలమును విభజించియున్నారు. మానవ సమాజమే ఈ ప్రపంచమునకు యజమానుడను మిథ్యా భావము మానవులనుండి తొలగవలయును. అట్టి మిథ్యాభావము నుండి ముక్తులైనపుడు కుటుంబమునకు సంబంధించినట్టియు, సాంఘికములైనట్టియు, జాతీయములైనట్టియు అనురాగములచే కలిగించబడిన మిథ్యాసాహచర్యములనుండి వారు విముక్తులగుదురు. ఈ దుష్టసాహచర్యములు వారిని భౌతిక ప్రపంచములోనికి బంధించును.

ఈ దశదాటిన తర్వాత మానవుడు ఆధ్యాత్మిక జ్ఞానమును పెంపొందించుకొనవలెను. అతడు నిజముగ తనకు చెందినదేదో తనది కాని దేదో ఎరుంగు జ్ఞానము నభ్యసింపవలెను. వస్తువులను యథాతథముగ అర్థము చేసికొన్నప్పుడతడు సుఖదుఃఖములు, బాధావినోదములు అను ద్వంద్వములనుండి విముక్తుడగును. అతడు జ్ఞానపరిపూర్ణుడైనప్పుడు దేవాదిదేవుని శరణుపొందుట సాధ్యమగును.

న తద్భాసయతే సూర్యో
న శశాంకో న పావకః
యద్గత్వా న నివర్తంతే
తద్ధామ పరమం మమ శ్లో- 6

*ఆమోక్షస్థానమందు (దివ్యస్థానము)*
*సూర్యుని ప్రకాశముగాని, చంద్రుని*
*వెన్నెలగాని, అగ్ని యొక్క వేడిగాని*
*వుండదు. మానవులు ఏ స్థితిని*
*పొందితే తిరిగి జన్మకురారో*
*అదే నానివాసము, అదే పరమపదము*

కృష్ణలోకము గోలోక బృందావనమని ప్రసిద్ధి నొందిన దేవాదిదేవుని దివ్యధామమైన ఆధ్యాత్మిక ప్రపంచము యిచ్చట వర్ణింపబడినది. ఆధ్యాత్మికాకాశమున సూర్యకాంతికి కాని, చంద్రకాంతికిగాని, అగ్నికి గాని, విద్యుత్తునకు కాని అవసరములేదు. ఏలయన ఆ లోకములన్నియు స్వయంప్రకాశములు,. ఈ విశ్వములో సూర్యుడొక్కడే స్వయం ప్రకాశమైన గ్రహము. కాని ఆధ్యాత్మికాకాశము నందలి గ్రహములన్నియు స్వయం ప్రకాశములే. వైకుంఠములనబడు ఈ గ్రహముల (లోకముల)న్నిటి యొక్క ప్రకాశించుకాంతియే బ్రహ్మజ్యోతి అనబడు ప్రకాశమానమైన ఆకాశమును ఏర్పరుచును. నిజమునకు ఈ కాంతి అంతయు కృష్ణలోకమైన గోలోక బృందావనము నుండి బయలు వెడలుచున్నది. ఆ ప్రకాశించు కాంతియొక్క ఒకభాగము మహత్తత్త్వముచే అనగా భౌతిక ప్రపంచముచే ఆచ్ఛాదింపబడియున్నది. అదికాక మిగిలిన ప్రకాశించు ఆకాశము నందలి చాల భాగము వైకుంఠములనబడు ఆధ్యాత్మిక లోకములతో నిండి యున్నది. వానిలో ముఖ్యమైనది గోలోక బృందావనము.

జీవుడు తమోమయమైన ఈ భౌతిక ప్రపంచమున నున్నంతకాలము బద్ధ జీవితమున నుండును. కాని అసత్యమును, విపర్యస్తమునైన ఈ భౌతిక ప్రపంచమను వృక్షమును ఛేదించుకొని ఆధ్యాత్మికాకాశమును చేరగానే అతడు ముక్తుడగును. అప్పుడు అతడిచ్చటికి

తిరిగివచ్చు నవకాశములేదు. బద్ధజీవితమున జీవుడు భౌతిక ప్రపంచమునకు తానే ప్రభువునని భావించును. కాని ముక్తస్థితిలో అతడాధ్యాత్మిక రాజ్యమును ప్రవేశించి పరమపురుషునకు సహచరుడగును. అచ్చట నతడు సచ్చిదానందముల ననుభవించును.

ఎవరైనను ఈ విషయముచే నాకర్షింపబడవలయును. అతడు ఆ శాశ్వత ప్రపంచమునకు తన్ను మార్చుకొనుటకును మిథ్యయయిన ఈయథార్థ తత్త్వము యొక్క ప్రతిబింబము నుండి ముక్తుడగుటకును వాంఛింపవలయును. ఈ భౌతిక ప్రపంచమునందు అత్యంత ఆసక్తికలవానికి ఆ ఆసక్తిని ఛేదించుట చాల కష్టము. కాని అతడు కృష్ణచైతన్యమవలంబించినచో క్రమముగా అనాసక్తుడగుటకు అవకాశముకలదు. ఎవరైనను కృష్ణచైతన్యములో నున్న భక్తులతో సహవాసము చేయవలయును. వారు కృష్ణచైతన్యమునందు దీక్ష వహించిన సమాజము కొరకు వెతికి భక్తియుక్తసేవ నెట్లు నిర్వహింపవలయునో నేర్చుకొనవలయును. ఈ విధముగా భౌతిక ప్రపంచముపై ఆసక్తిని ఛేదింపవచ్చును. కాషాయవస్త్రములను ధరించినంతమాత్రముచేత భౌతిక ప్రపంచ ఆకర్షణములనుండి ఎవ్వరును విడివడజాలరు. వారు భగవంతుని భక్తియుక్త సేవయందు ఆసక్తులు కావలయును. అందుచే యథార్థ వృక్షము యొక్క ఈ మిథ్యా ప్రాతినిధ్యము నుండి విముక్తుడగుటకు ద్వాదశాధ్యాయములో వర్ణింపబడినట్లు భక్తియుక్త సేవయే ఏకైక మార్గమని దృఢముగా విశ్వసింపవలయును. చతుర్దశాధ్యాయమున భౌతిక ప్రకృతి యొక్క పలు విధములైన కలుషీకరణ విధానములును వివరింపబడినవి. భక్తియుక్త సేవ మాత్రమే విశుద్ధ దివ్యత్వముతో కూడినదని వర్ణింపబడినది.

ఇచ్చట 'పరమం మమ' అను పదములు చాల ముఖ్యమైనవి. నిజమునకు ప్రతి మూలము కూడ పరమ పురుషుని ఆస్తియే. కాని ఆధ్యాత్మిక ప్రపంచము పరమమైనది. అనగా షడ్వైభవోపేతమైనది. కఠోపనిషత్తు కూడ (2.2.15) ఆధ్యాత్మిక ప్రపంచములో సూర్యకాంతికి కాని చంద్రకాంతికి కాని నక్షత్రములకు కాని అవసరము లేదని (న తత్ర సూర్యోభాతి న చంద్ర తారకం) ఈ విషయమును సమర్థించుచున్నది. ఏలయన ఆధ్యాత్మికాకాశమంతయు పరమపురుషుని అంతరశక్తిచే ప్రకాశింపజేయబడియున్నది. ఆ దివ్యధామము శరణాగతిచే తప్ప అన్యసాధనములచే పొందబడదు.

మమైవాంశో జీవలోకే
జీవభూతస్సనాతనః
మనఃషష్ఠానీంద్రియాణి
ప్రకృతిస్థాని కర్షతి

శ్లో - 7

ఆ పరమ పురుషుడైన
నాలోని ఒక కిరణమే
ఈసృష్టిలోని జీవులను
అన్నింటిని సృష్టించింది
ప్రకృతి ఆ జీవుల
చుట్టు పంచేంద్రియాలను
మనస్సును పరికల్పించింది

ఈ శ్లోకమునందు జీవుని యొక్కవ్యక్తిత్వము స్పష్టముగా చెప్పబడినది. ఈ జీవుడు శాశ్వతముగ దేవదేవుని అంశభాగమైయున్నాడు. అనగా అతడు బద్ధ జీవితమును వ్యక్తిత్వమును వహించి ముక్త స్థితిలో దేవదేవునితో ఐక్యము పొందునని అర్థము కాదు. అతడు శాశ్వతముగ విభక్తుడే. అతడు సనాతనుడని స్పష్టముగ చెప్పబడినది. వేదకథనము ననుసరించి దేవదేవుడ సంఖ్యాకములైన విస్తృత రూపములతో అవతరించి విస్తరించుచుండును. వానిలో ప్రధాన విస్తృతరూపములు విష్ణు తత్త్వమనియు అప్రధానరూపములుజీవులనియు చెప్పబడును. అనగా విష్ణు తత్త్వము స్వీయ విస్తరణము. జీవులు విభక్త విస్తరణములు తన స్వీయ విస్తరణముచే అతడు రాముడు నృసింహదేవుడు, విష్ణుమూర్తి ఇంకను సర్వప్రధాన దైవములుగ వివిధ రూపములతో వైకుంఠ లోకములందు వ్యక్తమగుచుండును. జీవులవంటి విభక్త విస్తరణములు శాశ్వతముగ సేవక భావములచే ఉండును. దేవదేవుని వ్యక్తిగత స్వరూపములైన స్వీయ విస్తరణములు నిత్యములై యుండును. అట్లే విభక్త విస్తరణములైన జీవులకు కూడ వాని స్వరూపములుండును. దేవదేవుని విభక్తాంశములుగ జీవులు అతని గుణముల విభక్తాంశములను పొంది యుండును. వానిలో స్వాతంత్ర్యమొకటి. ప్రతిజీవికిని వ్యక్తిగత ఆత్మగ స్వీయ వ్యక్తిత్వమును,స్వల్పమైన స్వాతంత్ర్యమును యుండును. ఆ స్వాతంత్ర్యము యొక్క దుర్వినియోగముచే అతడు బద్ధజీవుడును. సద్వినియోగముచే సన్తతముక్తుడును అగుచుండును. ఈ రెండు సందర్భములందును దేవదేవుడున్నట్లే అతడు గుణదృష్టితో శాశ్వతుడై యుండును. ముక్తదశలో అతడీ భౌతిక స్థితినుండి ముక్తుడై భగవంతుని దివ్యసేవలో నిమగ్నుడై యుండును. బద్ధ జీవితమున ప్రకృతి యొక్క భౌతిక గుణము లతనిపై అధికారము వహించుటచే అసలు భగవంతుని దివ్యసేవను మరచిపోవును. దానికి ఫలితముగ ఈ భౌతిక ప్రపంచమున తన జీవితమును పోషించుకొనుటకై అతడు గాఢముగ యత్నింపవలసి యుండును.

మానవులును, కుక్కను, పిల్లులు మొదలగు జీవులు మాత్రమేకాక, భౌతిక ప్రపంచ మహానియంతలైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కూడ దేవదేవుని భిన్నాంశములే. వారందరు శాశ్వతులే కాని తాత్కాలిక వ్యక్తరూపములు కారు. తీవ్రముగా సంఘర్షణము చేయుచుండు

నర్థముగల కర్షతి అను పదము చాల ప్రముఖమైనది. బద్ధజీవుడు ఇనుపగొలుసులచే బంధింపబడినట్లు బద్ధుడైయుండును. అతడు మిథ్యాహంకారముచే బద్ధుడైయుండును. భౌతిక జీవితములో నతనిని నడుపు ముఖ్యసాధనము మనస్సు, మనస్సు సత్త్వగుణములో నున్నపుడు అతని వ్యాపారములు యోగ్యములై యుండును. మనస్సు రజోగుణములో నున్నపుడతని వ్యాపారములు క్లేశకరములై యుండును. మనస్సు తమోగుణములో నున్నపుడు అతడు అల్పజీవ జాతులలో పయనించును. ఈ శ్లోకమును బట్టి బద్ధ జీవులు భౌతిక దేహము తోడను, మనస్సు తోడను. ఇంద్రియముల తోడను ఆవరింపబడి యుండుననియు ముక్తుడైనపుడు ఈ భౌతిక అచ్ఛాదనము నశించునుగాని అతని ఆధ్యాత్మిక దేహము తన వ్యక్తిగత సామర్థ్యముతో వ్యక్తమగుననియు స్పష్టమగుచ్నుది. "మాధ్యందినాయ స్మృతిః సవా ఏష బ్రహ్మణా నిష్ట ఇదంశరీరం మర్త్యం అతిసృజ్యబ్రహ్మాది సంపద్య బ్రహ్మణాపశ్యతి, బ్రహ్మణా శృణోతి, బ్రహ్మణైవేదం అనుభవతి" అని చెప్పబడియున్నది. జీవుడు భౌతిక దేహమును విడచి ఆధ్యాత్మిక ప్రపంచమును ప్రవేశించునపుడు తన ఆధ్యాత్మిక శరీరమును పునరుద్ధరించు కొనుననియు ఈ ఆధ్యాత్మిక దేహములో అతడు దేవాదిదేవుని ముఖాముఖి చూడగలడనియు అతనితో ప్రత్యక్షముగ మాట్లాడి అతని మాటలు వినగలడనియు దేవదేవుని యథాతథంగా అర్థం చేసుకోగలడనియు ఇందు చెప్పబడినది. స్మృతి నుండి కూడ 'వసంతి యత్రపురుషాః సర్వేవైకుంఠ మూర్తయః' అనగా ఆధ్యాత్మిక లోకములందు ప్రతివ్యక్తియు దేవాదిదేవుని దేహము వంటి లక్షణములుగల దేహములతో నివసించునని తెలియవచ్చుచున్నది. శరీర నిర్మాణమునకు సంబంధించినంత వరకు అంశములైన జీవులకును విష్ణుమూర్తి విస్తృతరూపములకును నడుమ నెట్టి భేదము లేదు. అనగా ముక్తి పొందినపుడు జీవుడు దేవాదిదేవుని అనుగ్రహముచే ఆధ్యాత్మిక దేహమును పొందునన్నమాట.

'మమైవాంశః' (దేవదేవుని అంశభాగమును) అను పదము కూడ చాల ముఖ్యమైనది. దేవదేవుని అంశభాగము భిన్నమైన భౌతిక వస్తుభాగము వంటిదికాదు. ఆత్మ అచ్ఛేద్యమని ద్వితీయాధ్యాయమున మనము తెలిసికొని యుంటిమి. ఈ అంశ భాగము భౌతికముగా నిర్మింపబడినదికాదు. ముక్కలుగ చేయబడి మరల అతుకబడుటకు వీలైన భౌతికవస్తువువంటిది కాదది. సనాతన (శాశ్వతుడు) అను సంస్కృతము పదము వాడబడుటచే ఆ భావమిచ్చట అన్వయింపదు. అంశ భాగము శాశ్వతమైనది ద్వితీయాధ్యాయారంభమున, ప్రతి వ్యక్తిగత దేహమునందున దేవదేవుని అంశభాగముండునని కూడ ('దేహినో స్మిన్ యథా దేహే') తెలుపబడినది. ఆ అంశభాగము దేహబంధము నుండి విముక్తమైనపుడు ఆధ్యాత్మికాకాశమున ఆధ్యాత్మిక లోకములో తన మొదటి ఆధ్యాత్మిక దేహమును పునరుద్ధరించుకొని దేవదేవుని

సాహచర్యము ననుభవించును. ఇచ్చట జీవుడు దేవదేవుని అంశభాగమగుటచే బంగారము నందలి భాగము కూడ బంగారమే అయినట్లు గుణములలో భగవంతునితో సమానముగనే యుండును.

శరీరం యదవాప్నోతి
యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి
వాయుర్గన్ధానివాశయాత్ శ్లో -8

గాలి తన వెంట పుష్పపరిమళాన్ని
ఏ విధంగా తీసుకుని వెళ్లునో
అదే విధముగా శరీర ప్రభువైన
జీవుడు శరీరాన్ని వదలి
వెళ్లునపుడు దానికి సంబంధించిన
మనస్సు మొదలైన ఇంద్రియములను
తీసుకొని వెళ్లును

ఇచ్చటజీవుడు ఈశ్వరుడుగ నిజదేహస్వామిగ వర్ణింపబడి యున్నాడు. ఇష్టమైనచోఅతడు తన దేహమును ఉన్నత ప్రమాణమునకు గాని అల్పతరగతికి గాని మార్చుకొనవచ్చును. అతనికి అల్పమైన స్వాతంత్ర్యమున్నది. అతని దేహము గ్రహించు మార్పు అతనిపైనే ఆధారపడియుండును. మరణ సమయమున అతడు సృజించికొనిన చైతన్యము అతనిని ఇంకొక దేహమునకు గొనిపోవును. అతడు కుక్కయొక్కగాని పిల్లియొక్కగాని చైతన్యము కల్పించుకొనినచో అతడు తప్పక కుక్క యొక్క గాని పిల్లి యొక్కగాని శరీరమునకే మారును. అతడు తన చైతన్యమును దివ్యగుణములపై నిల్పినచో అతడు దేవతా రూపమునకు మారును. అతడు కృష్ణచైతన్యములో నున్నచో ఆధ్యాత్మిక ప్రపంచము నందలి కృష్ణలోకమునకు మారి కృష్ణుని సాహచర్యము వహించును. శరీరనాశము తరువాత సర్వమును ముగిసిపోవుననుకొనుట భ్రాంతి. వ్యక్తిగత జీవాత్మ ఒకదేహమునుండి మరియొక దేహమునకు పునర్జన్మ మెత్తుచుండును. అతని వర్తమాన దేహమును, వ్యాపారములను అతని తరువాత దేహమునకు పూర్వరంగమున మానవుడు తన కర్మల ననుసరించి భిన్నమైన శరీరమును పొంది కాలక్రమమున ఈ దేహమును విడువవలసి వచ్చును. భావిదేహ భావమును తనతో వహించు ఈ సూక్ష్మదేహము తరువాతి జన్మమున మరొక దేహమును వహించును. ఒక దేహము నుండి మరియొక దేహమునకు పునర్జన్మ మెత్తుచు శరీరమునందున్నప్పుడు సంఘర్షణ మొందుట అను విధానమే 'కర్షతి' లేక 'జీవితము కొరకు సంఘర్షణ పొందును' అని చెప్పబడును.

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ
రసనం ఘ్రాణ మేవ చ
అధిష్ఠాయ మనశ్చాయం
విషయానుపసేవతే శ్లో - 9

జీవుడు చెవి, కన్ను, చర్మము
నాలుక, ముక్కు, మనస్సు అను
ఆరు ఇంద్రియాల ద్వారా శబ్ద
స్పర్శ, రూప, రసగంధాదులను
అనుభవిస్తున్నాడు

వేరు మాటలలో చెప్పవలెనన్న జీవుడు తన చైతన్యమును పిల్లులయొక్క, కుక్కల యొక్క గుణములతో కలుషీకరించినచో అతడు తరువాతి జన్మమున పిల్లియొక్క కుక్క యొక్కగాని దేహమును పొంది అనుభవించును. మొట్టమొదట చైతన్యము నీటివలె పరిశుద్ధముగనే యుండును. మనము నీటిని ఒక రంగుతో కలిపినచో అది మార్పు చెందును. అట్లే ఆధ్యాత్మికమైన ఆత్మ విశుద్ధమైన దగుటచే చైతన్యము కూడ విశుద్ధమైనదే. కాని ఆ చైతన్యము భౌతిక గుణముల సంపర్కమును బట్టి మార్పు చెందుచుండును. కృష్ణచైతన్యమే యథార్థమైన చైతన్యము. అందుచే ఎవరైనను కృష్ణచైతన్యమందున్నప్పుడు విశుద్ధ జీవనమొందును. కాని అతని చైతన్యము ఒక విధమైన భౌతిక మనస్తత్వముచే కలుషీకృతమైనచో నతడు భావి జన్మమున తదనుగుణమైన దేహమే పొందును. అతడు మరల మానవ శరీరమే పొందవలసిన అవసరము లేదు. 84 లక్షల జీవ జాతులుండుటచే అతడు పిల్లి యొక్క గాని, కుక్క యొక్క కాని, పందియొక్క కాని, దేవత యొక్క కాని బహు సంఖ్యాకములైన ఇతర రూపములలో ఒకదాని యొక్క కాని దేహమును పొందును.

ఉత్క్రామంతం స్థితంవాపి
భుంజానం వా గుణాన్వితమ్
విమూఢా నానుపశ్యంతి
పశ్యంతి జ్ఞాన చక్షుషః శ్లో -10

జీవుడు శరీరము నుండి
వెడలి పోవునపుడును
దేహమునందున్నపుడును
అనుభవించినపుడును
ఆత్మజ్ఞానము లేనివారు

ప్రకృతి గుణాలను గ్రహించరు
అందువలన వారు సాధారణ
మరణము చెందుతారు
వాటిని వివేచించేవారు
జ్ఞానంతో పరమాత్మను
గ్రహిస్తారు

'జ్ఞాన చక్షుష': అను మాట చాల ముఖ్యమైనది. జ్ఞానము లేనిచో ఎవరైనను జీవుడీవర్తమాన దేహమును ఎట్లువిడుచునో, తరువాత జన్మమున అతడెట్టి దేహరూపమును గ్రహింపనున్నాడో, అతడేల ప్రత్యేక విధమైన శరీరములో నివసించుచున్నాడో తెలిసికొనజాలరు. దీనికి ప్రామాణిక ఆధ్యాత్మికాచార్యుల నుండి వినిన భగవద్గీత వలన గాని తత్సదృశ మతగ్రంథముల నుండి కాని తెలిసికొన్న విశిష్టమైన జ్ఞానముండవలయును. ఈ విషయముల నన్నిటిని చూచుటకు సుశిక్షతుడైనవాడు అదృష్టవంతుడు. ప్రతి జీవియు కొన్ని పరిస్థితుల యందు తన శరీరమును విడుచుచున్నాడు. కొన్ని పరిస్థితులయందు నివసించుచున్నాడు. భౌతిక ప్రకృతి ప్రభావమున కొన్ని పరిస్థితులందు అనుభవించుచున్నాడు, దానికి ఫలితముగ ఇంద్రియానుభవమను భ్రాంతితో అతడు భిన్నవిధములైన సుఖదుఃఖములను పొందుచున్నాడు. మోహవాంఛలచే శాశ్వతముగ మూర్ఖులైన వ్యక్తులు తమ శరీరము యొక్క మార్పును ప్రత్యేకమైన శరీరములో తమ నివాసమును తెలిసికొను శక్తినంతను కోల్పోవుదురు. వారు దానిని అర్థము జేసికొనజాలరు. ఆధ్యాత్మిక జ్ఞానమును పెంపొందించుకొన్నవారు ఆత్మ శరీరము కంటె భిన్నమనియు అది శరీరమును మార్చుకొని భిన్నవిధముల ననుభవించుచున్నదనియు, ఎరుగగలరు. అట్టి జ్ఞానము కలవాడు ఈ భౌతిక దేహములో బద్ధజీవుడెట్లు బాధపడుచున్నాడో తెలిసికొనగలడు. అందుచే కృష్ణచైతన్యములో మిక్కిలి అభివృద్ధి పొందినవారు తమ బద్ధజీవితము మిక్కిలి క్లేశకరమగుటచే సామాన్యజనులకీ జ్ఞానముబోధించుటకు శక్తివంచనలేక పనిచేయుదురు. వారు దాని నుండి బయటికి వచ్చి కృష్ణచైతన్యము కలిగి తామాధ్యాత్మిక ప్రపంచమునకు మారునట్లుగ తమ్ము ముక్తులను కావించుకొన వలయును.

యతంతో యోగిన శ్చైనం
పశ్యన్త్యాత్మన్యవస్థితం
యతంతో ప్యకృతాత్మానో
నైవం పశ్యన్త్యచేతసః  శ్లో- 11

యోగులు తమ సాధన వలన
తమలోనే పరబ్రహ్మమును
దర్శించెదరు. అయితే ఆత్మ
సంస్కారములేని వారు ఎంత
ప్రయత్నించినను బ్రహ్మమును
అనుభూతము చేసుకోలేరు
వారిది వృథా ప్రయాస, యోగసాధన
ఆత్మసాక్షాత్కారమును కలుగజేయును

ఆధ్యాత్మికానుభూతి మార్గమున పలువురు యోగులుందురు. కాని ఆత్మానుభూతిని పొందనివాడు జీవుని దేహమున ఎట్టి మార్పులు కలుగుచున్నవో చూడజాలడు. ఈ సందర్భమున 'యోగినః' అనుపదము చాల ముఖ్యమైనది. వర్తమాన కాలమున పలువురు యోగు లనబడువారును పెక్కు యోగి సమాజము లనబడునవియు కలవు కాని నిజమునకు వారు ఆత్మానుభూతి విషయమున అంధప్రాయులు. వారు ఒక విధమైన దేహవ్యాయామమునకు అలవాటుపడి దేహ మారోగ్యముగను పుష్టిగను ఉన్నచో తృప్తిపడుదురు. వారికి ఇతర జ్ఞానమేదియు నుండదు. వారే "యతంతో ప్యకృతాత్మానః" ఏదో యోగవిధానమనబడు దాని యందు యత్నము చేయుచున్నను ఆత్మానుభూతి పొందినవారుకారు. అట్టివారు (జీవా) ఆత్మయొక్క పునర్జన్మ విధానమును అర్థము చేసికొనజాలరు. నిజముగ యోగవిధాన మునందుండి ఆత్మను, ఆత్మ విషయములను, ప్రపంచ విషయములను, దేవదేవుని విషయములను అనుభూతి పొందినవారు మాత్రమే అనగా కృష్ణచైతన్యముతో విశుద్ధ భక్తియుక్త సేవ యందు నిమగ్నులైన భక్తియోగులే పరిస్థితులెట్లు జరుగుచున్నవో అవగాహన చేసికొనగలరు.

యదాదిత్యగతం తేజో
జగద్భాసయతేఖిలం
య చ్చంద్రమసి యచ్చాగ్నౌ
తత్తేజో విద్ధి మామకం శ్లో - 12

సూర్యుని తేజస్సు జగత్తునంతా
ప్రకాశింపజేస్తున్నది. అదే రీతిగా
చంద్రుని వెలుగు, అగ్ని యొక్క
తేజము అన్నీ నా నుండి జనిస్తున్నవే

మందబుద్ధులు శరీరమునందు పరిస్థితులెట్లు జరుగుచున్నవో అవగాహన చేసికొనజాలరు. భగవంతుడిచ్చట వివరించునది అర్థము చేసికొనుటచే ఎవరైనను స్థిరమైన జ్ఞానమును

పొందజాలుదురు. ఎల్లరును సూర్యుని, చంద్రుని, అగ్నిని, విద్యుత్తును చూచుచుందురు. వారు సూర్యుని యొక్కయు, చంద్రుని యొక్కయు, అగ్ని యొక్కయు లేక విద్యుత్తుయొక్కయు కాంతి దేవదేవుని నుండియే వచ్చుచున్నదనియు అర్థము చేసికొనవలయును. కృష్ణచైతన్యమున కారంభమైన అట్టి జీవిత భావనలో ఈ భౌతిక ప్రపంచమునందు బద్ధజీవికి ఎంతో అభివృద్ధి కలదు. జీవులు ముఖ్యముగా దేవదేవుని యొక్క అంశములే. అతడిచ్చట వారు స్వధామమైన దేవత్వమునకు తిరిగి ఎట్లు రాజాలుదురో సూచన లొసంగుచున్నాడు.

ఈ శ్లోకమును బట్టి సూర్యుడు సూర్యమండలమునంతను ప్రకాశింపజేయుచున్నాడని మనము తెలిసికొనగలము. భిన్న విశ్వములును సూర్యమండలములును కలవు. అట్లే భిన్న సూర్యులు చంద్రులును గ్రహములును కూడ కలవు. కాని ప్రతి విశ్వమునందును ఒక్క సూర్యుడు మాత్రమే కలడు. భగవద్గీత (10.21)లో చెప్పబడినట్లు 'నక్షత్రానా మహంశశీ'- చంద్రుడు ఒక నక్షత్రము. సూర్యకాంతికి దేవదేవుని ఆధ్యాత్మికాకాశమునందలి ఆధ్యాత్మిక తేజస్సే కారణము. సూర్యుడుదయింపగనే మానవుల వ్యాపారములు కూడ ఆరంభమగును. ఆహార పదార్థములను సిద్ధము చేసికొనుటకు, కర్మాగారములు మున్నగునవి మొదలు పెట్టుటకును వారగ్నిని ప్రజ్వలింపజేయుదురు. ఇట్లు అగ్ని సహాయముతో పెక్కుపనులు జరుగుచున్నవి. అందుచే సూర్యోదయము, అగ్ని, చంద్రకాంతి జీవులకు మిక్కిలి ఆహ్లాదకరములుగా నుండును. వాని తోడ్పాటు లేకుండ ఏ జీవియు బ్రతుకజాలదు. అందుచే ఎవరైనను సూర్యుని యొక్కయు చంద్రుని యొక్కయు అగ్నియొక్కయు తేజోవైభవములు దేవాది దేవుడగు కృష్ణుని నుండి ఉద్భవించుచున్నవని ఎరుగజాలినచో వారి యందు కృష్ణచైతన్య మారంభమగును. ఓషధులన్నియు (కూరలన్నియు) చంద్రకాంతి చేతనే పోషించబడుచున్నవి. చంద్రకాంతి మిక్కిలి మనోహరమగుటచే ప్రజలు దేవాదిదేవుడైన కృష్ణుని అనుగ్రహము వలెనే తాము జీవించుచున్నామని సులభముగా తెలిసికొనగలరు. అతని అనుగ్రహము లేకుండ సూర్యుడు కాని చంద్రుడు కాని అగ్నికాని ఉండజాలదు. వారి సహాయము లేకుండ ఎవ్వరును జీవింపలేరు. బద్ధజీవునియందు కృష్ణచైతన్యమును రేకెత్తించుటకు ఇవి కొన్ని భావములు.

గామావిశ్య చ భూతాని<br>
ధారయామ్యహ మోజసా<br>
పుష్ణామి చౌషధీస్సర్వాః<br>
సోమో భూత్వా రసాత్మకః      శ్లో - 13

నేను
ఈ భూమియందు ప్రవేశించి
సకల జీవులకు జీవనాధార
మగుచున్నాను, రసస్వరూపుడగు
చంద్రుడనై ఓషధులకన్నిటికిని
జీవరసమును సమకూర్చుచున్నాను

భగవంతుని శక్తి చేతనే గ్రహములన్నియు వాయువు నందు తేలుచున్నవని తెలియుచున్నది. భగవంతుడు ప్రత్యణువునందును, ప్రతిగ్రహమునందును, ప్రతిజీవునియందును ప్రవేశించును. అది బ్రహ్మసంహితలో చర్చించబడినది. దేవాదిదేవుని సంపూర్ణభాగమైన పరమాత్మ గ్రహములందును, విశ్వమందును, జీవునియందును, ప్రత్యణువునందును కూడ ప్రవేశించునని చెప్పబడినది. అతని ప్రవేశమువలన సర్వము తగినట్లు వ్యక్తీభూతమగుచున్నది. ఆధ్యాత్మికమైన ఆత్మ యున్నప్పుడు జీవుడు నీటిమీద తేలగలడు. కాని జీవత్స్ఫులింగము శరీరమును విడుచుటయు, అది చచ్చుటయు సంభవించినపుడు దేహము పతనషగును. అది శిథిలమైనప్పుడు గడ్డివలెను ఇతర వస్తువులవలెను తేలును. కాని మానవుడు మరణించినంతనే అతడు వెంటనే నీటిలో మునిగిపోవును. అట్లే ఈగ్రహములన్నియు ఆకాశమున తేలుచున్నవి. దీనికి దేవాది దేవుని దివ్యశక్తియొక్క ప్రవేశమే కారణము. పిడికెడు దుమ్మువలెను, అతని శక్తి ప్రతిగ్రహమును నిల్పుచున్నది. పిడికిలిలో దుమ్ముపట్టుకొన్నచో ఆ దుమ్ము క్రిందపడి పోవుట కవకాశము లేదు కాని దానిని గాలిలో విడచినచో అది క్రింద పడిపోవును. అట్లే గాలిలో తేలుచున్న ఈ గ్రహములు పరమపురుషుని విశ్వరూపము యొక్క పిడికిలిలో నిల్పబడుచున్నవి. అతని బలశక్తులచే స్థావరజంగమ వస్తువులన్నియు తమతమ స్థానములలో నిల్చుచున్నవి. వైదిక గ్రంథములందు దేవాదిదేవుని కారణమున సూర్యుడు ప్రకాశించుచున్నాడనియు గ్రహములు స్థిరముగ చలించుచున్నవనియు చెప్పబడినవి. ఆ దేవదేవుడులేనిచో గ్రహము లన్నియు గాలిలో దుమ్మువలె చెల్లాచెదురై నశించును. అట్లే దేవాదిదేవుని కారణముచేతనే చంద్రుడు ఓషధుల నన్నిటిని పోషించును. చంద్రుని ప్రభావముచే ఓషధులు వృద్ధికరములగును. చంద్రకాంతి లేనిచో ఓషధులు పెరుగుటకాని రుచికరములుగా నుండుటకాని సంభవింపదు. పరమపురుషుడు, సమకూర్చుచుండుట చేతనే మానవ సంఘము పనిచేయుచు, సుఖముగ నివసించుచు ఆహారము ననుభవించుచున్నది. లేనిచో మానవజాతి నిలిచియుండెడిది కాదు. 'రసాత్మకః' అను పదము చాల ముఖ్యమైనది. పరమపురుషుని ద్వారా చంద్రుని యొక్క ప్రభావముచే వస్తువులన్నియు ఆస్వాదనీయములగుచున్నవి.

అహం వైశ్వానరో భూత్వా
ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః
పచామ్యన్నం చతుర్విధం                                   శ్లో - 14

నేను
వైశ్వానరుడైన జఠరాగ్నిగా
ప్రాణుల యొక్క శరీరముల
నాశ్రయించి ప్రాణాపాన
వాయువులలో చేరి నాలుగు
రకములైన ఆహారములను
పచనము చేస్తున్నాను

ఆయుర్వేద శాస్త్రము ననుసరించి కడుపులోనికి పంపబడిన ఆహారము నంతటిని జీర్ణముచేయునొక అగ్ని ఉన్నదని తెలియుచున్నది. ఆ అగ్ని ప్రజ్వలింపకపోయినచో ఆకలి ఉండదు. అది సరియైన స్థితిలో నున్నప్పుడు మనకాకలికలుగును. ఒక్కొక్కప్పుడు ఆ అగ్ని సరిగా పనిచేయకపోయినచో చికిత్స కావలసివచ్చును. ఏ విధముగ నైనను ఈ అగ్ని దేవాది దేవునికి ప్రతినిధి. వేదమంత్రములు (బృహదారణ్యకోపనిషత్తు 5.9.1), కడుపులో దేవదేవుడు (బ్రహ్మము) అగ్ని రూపమున నుండి సర్వ విధములైన ఆహారములను జీర్ణముచేయునని స్థిరపరుచుచున్నవి. 'అయ మగ్నిః వైశ్వానరోయోయం అంతఃపురుషే యేనేద మన్నం పచ్యతే' ఈ విధముగా అన్ని రకముల ఆహారపదార్థములను జీర్ణము చేయుటకు అతడు తోడ్పడుచుండుటచే భోజన విషయమున జీవుడు స్వతంత్రుడు కాడు. జీర్ణము చేయుటలో అతడు తోడ్పడక పోయినచో తినుట కవకాశములేదు. ఈ విధముగా అతడాహార ద్రవ్యముల నుత్పాదించి జీర్ణము చేయుచున్నాడు. అతని అనుగ్రహముచే మనము జీవితము ననుభవించుచున్నాము. వేదాంత సూత్రములలో (1.2.27) కూడ ఇది స్థిరీకరింపబడినది. "శబ్దాదిభ్యోన్తః ప్రతిష్ఠానాచ్చ" అనగా భగవంతుడు శబ్దమునందును, శరీరమునందును, వాయువునందును, జీర్ణశక్తి రూపమున కడుపునందును ప్రతిష్ఠితుడై యున్నాడు. ఆహార ద్రవ్యములు నాలుగు రకములు: కొన్ని భక్ష్యములు, కొన్ని భోజ్యములు, కొన్ని చోష్యములు, కొన్ని లేహ్యములు . వీనినన్నిటిని జీర్ణము చేయుశక్తిఅతడే.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తస్స్మృతిర్జ్ఞానమపోహనం చ
వేదైశ్చసర్వైరహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహం శ్లో - 15

నేను
సకల ప్రాణుల హృదయములలో
వున్నవాడను, జీవులకు స్మృతిని
జ్ఞానాన్ని మరుపును కలిగించు
వాడను నేనే, వేదాంత పరమార్థాన్ని
వేద హృదయుడను కూడా నేనే

ప్రతి వ్యక్తి హృదయమునందును దేవదేవుడు పరమాత్మ రూపమున నుండును. అతని నుండియే అన్ని వ్యాపారములును ఆరంభమగును. జీవుడు తన గత జీవితమునకు సంబంధించినదంతయు మరచిపోవును. కాని అతడు తన కార్యముల కన్నిటికిని సాక్షియైన పరమ పురుషుని నిర్దేశముననుసరించియే పనిచేయవలయును. అందుచే అతడు తన పూర్వకర్మల ననుసరించియే తన పని నారంభించును. కావలసిన జ్ఞానము అతనికి సమకూర్చబడును. జ్ఞాపకశక్తి ఒసంగబడును. అతడు తన పూర్వ జీవితమును గూర్చి మరచిపోవుట కూడ జరుగును. ఈ విధముగ భగవంతుడు సర్వవ్యాపకుడే కాక ప్రతివ్యక్తి హృదయము నందును స్థానికముగ నుండును. అతడే వివిధములైన కామ్యకర్మఫలితములను ప్రసాదించును. నిరాకార బ్రహ్మముగను, దేవదేవుడుగను, స్థానిక పరమాత్మగను మాత్రమే కాక వేదముల అవతారరూపముగ కూడ అతడు పూజనీయుడు. వేదములు జనులకు సరియైన నిర్దేశము నొసగును. అందుచే వారు తమ జీవితములను తగినట్లుగ మలచుకొని తిరిగి స్వధామమైన దైవత్వమునకు వత్తురు. దేవాదిదేవుడైన కృష్ణునికి సంబంధించిన జ్ఞానమును వేదములే ఒసంగును. వ్యాసదేవుని అవతారములో కృష్ణుడే వేదాంత సూత్రములను కూర్చెను. వ్యాసదేవుడు శ్రీమద్భాగవతములో వేదాంత సూత్రములపై చేసిన వ్యాఖ్యానము, వేదాంత సూత్రముల యొక్క యథార్థమైన అవగాహనము నొసంగును. పరమపురుషుడు సంపూర్ణుడగుటచే బద్ధజీవియొక్క విముక్తికి అతడాహారద్రవ్యములను సమకూర్చి జీర్ణము చేయును. అతని కార్యములన్నిటికి సాక్షిగా నుండును. వేదముల రూపమునను భగవద్గీత నుపదేశించిన దేశికుడును, దేవదేవుడును అయిన శ్రీకృష్ణుని రూపమునను జ్ఞానము నొసంగును. బద్ధజీవికి అతడు పూజనీయుడు. ఈ విధముగ భగవంతుడు సర్వ సత్త్వమయుడు, సర్వకరుణాపూర్ణుడు.

'అన్తః ప్రవిష్టః శాస్తా జనానామ్' వర్తమాన శరీరమును విడిచినంతనే జీవుడు అంతయు మరచిపోవును. కాని దేవదేవునిచే ప్రేరేపింపబడి తన పనిని మరల నారంభించును. అతడు మరచిపోయినను పూర్వజన్మములో ముగించిన దగ్గర నుండి తన పనిని మరల కొనసాగించుటకు దేవదేవుడు తెలివి నొసంగును. అందుచే జీవుడు తన హృదయమున స్థానికుడుగా ప్రతిష్ఠితుడైన పరమపురుషుని నిర్దేశము ననుసరించి సుఖదుఃఖముల ననుభవించుటయే కాక అతని నుండి వేదముల నర్థము చేసికొనుటకు కూడ అవకాశమును పొందును. ఎవరైనను వేదజ్ఞానమును అర్థము చేసికొనుటకు కుతూహలము కల్గియున్నచో అప్పుడు కృష్ణుడు కావలసిన తెలివి నొసంగును. అర్థము చేసికొనుటకు అతడు వేదజ్ఞానము నెందుకొసంగును? జీవుడు వ్యక్తిగతముగ కృష్ణునర్థము చేసికొనవలసిన అవసరమున్నది కావున. యోసౌ సర్వైః వేదైః గీయతే, అనగా నాలుగు వేదములు, వేదాంత సూత్రములు, ఉపనిషత్తులు, పురాణములు మొదలుకొని వైదిక గ్రంథములన్నిటియందును పరమపురుషుడు స్తుతింపబడుచున్నాడు అని వేదవాఙ్మయము దీనిని స్థిరీకరించుచున్నది.

వేదోక్తములైన కర్మముల నాచరించుటచేతను, వేదతత్త్వమును గూర్చి చర్చించుటచేతను, భక్తియుక్త సేవలో భగవంతుని సేవించుట చేతను అతడు పొందబడును. అందుచే కృష్ణునర్థము చేసికొనుటయే వేదములయొక్క ప్రయోజనము. కృష్ణుని అతని అనుభూతి విధానమును తెలిసికొనుటకు వేదములు మనకు నిర్దేశము నొసంగును. దేవాదిదేవుడే చరమ గమ్యము. వేదాంతసూత్రము (1.1.4) తత్ సమన్వయాత్ అను పదములలో ఈ విషయమును స్థిరపరుచుచున్నది. ఎవరైనను మూడుదశలలో సంపూర్ణత్వమును పొందగలరు. వేద వాఙ్మయమును అర్థము చేసికొనుటచే వారు దేవాదిదేవునితో తమకు గల సంబంధమును తెలిసికొనగలరు, వివిధములైన, విధానములను ఆచరించుటచే వారతనిని సమీపించగలరు, చిట్టచివర దేవదేవుని కంటె భిన్నము కాని దివ్య గమ్యమును పొందగల్గుదురు. ఈ శ్లోకములో వేదముల యొక్క ప్రయోజనమును, వేదముల నవగాహన చేసికొనుటయు, వేదముల గమ్యమును స్పష్టముగ నిర్వచింపబడినవి.

ద్వావిమౌ పురుషౌ లోకే
క్షరశ్చాక్షర ఏవ చ
క్షరస్సర్వాణి భూతాని
కూటస్థోక్షర ఉచ్యతే                    శ్లో - 16

ఈ లోకమునందు
క్షరుడు-అక్షరుడు అను
ఇరువురు పురుషులు కలరు
లోకములోని జీవకోటి
క్షరమైనది, అంటే నశించేది
అక్షరమైనది అంటే నశింపు
లేనిది క్షేత్రజ్ఞుడైన పురుషుడు
ఆ అక్షర పురుషుడైన 'అహం' ను నేనే

ఇది వరకు వివరింపబడినట్లు భగవంతుడు వ్యాసదేవుని అవతారమున వేదాంతసూత్రములను సంతరించెను. ఇచ్చట భగవంతుడు వేదాంత సూత్రములందలి విషయముల సారాంశము నొసంగుచున్నాడు. అసంఖ్యాకములైన జీవులను నశ్వరములు, అనశ్వరములు అని రెండు తరగతులుగ విభజింపవచ్చునని అతడు చెప్పుచున్నాడు. భౌతిక ప్రపంచముతో సంపర్కమున్నప్పుడు అవి జీవభూతములని చెప్పబడుచున్నవి. క్షరః సర్వాణి భూతాని, అనుసంస్కృత పదములకు అవి నశ్వరములని అర్థము. దేవాదిదేవునిలో ఏకస్థానమున నున్నవి అనశ్వరము లనబడును. ఏకత్వమనగా వానికి వ్యక్తిత్వము లేదని అర్థముకాదు. వానియందు అనైక్యములేదని అర్థము. అవియన్నియు సృష్టిప్రయోజనమునకు అనుకూలములే. ఆధ్యాత్మిక ప్రపంచమున సృష్టియను నట్టిదే లేదు. కాని వేదాంతసూత్రములలో చెప్పబడినట్లు దేవాదిదేవుడు వ్యక్తములైన పదార్థములన్నిటికి మూలాధారము కావున ఆ భావము వివరింపబడినది.

దేవాదిదేవుడైన కృష్ణ భగవానుని వచనమును బట్టి జీవులు రెండు తరగతులుగ నున్నవి. వేదము దీనికి సాక్ష్యమిచ్చుటచే దీని విషయమున సందేహములేదు. మనస్సు తోడను, పంచేంద్రియములతోడను ఈ ప్రపంచములో తీవ్ర సంఘర్షణము సాగించు జీవులకు మార్పుచెందుచుండు భౌతిక దేహములుండును.జీవుడు బద్ధుడై యుండు నంతవరకు అతని శరీరము భౌతిక వస్తుసంపర్కముచే మార్పు చెందుచుండును. భౌతిక వస్తువులు మార్పుచెందుచుండుటచే జీవుడు కూడ మార్పుచెందుచున్నట్లు కన్పించును. కాని ఆధ్యాత్మిక ప్రపంచమున శరీరము భౌతిక వస్తు నిర్మితము కాకపోవుటచే దానికి మార్పులేదు. భౌతిక ప్రపంచమున జీవుడు జన్మించుట, పెరుగుట, కొంతకాలము జీవించుట, తిరిగి ఉత్పాదించుట, క్షీణించుట, నశించుట అను ఆరు మార్పులను పొందును. ఇవి భౌతిక దేహములయొక్క

మార్పులు. ఆధ్యాత్మిక ప్రపంచమున శరీరము మార్పు చెందదు. వార్థక్యము లేదు జననము లేదు, మరణము లేదు. అచట అంతయు ఏకరూపముననే ఉండును. క్షరః సర్వాణి భూతాని, మొదట సృష్టింపబడిన జీవుడైన బ్రహ్మ మొదలుకొని పిపీలిక వరకును భౌతిక వస్తువులతో సంపర్కమున్న ప్రతిజీవియు, తన శరీరమును మార్చుచుండును. అందుచే వారందరును నశ్వరులు, ఆధ్యాత్మిక ప్రపంచమున వారేకత్వమున నెల్లప్పుడును ముక్తులై యుందురు.

ఉత్తమః పురుషస్త్వ న్యః
పరమాత్మేత్యుదాహృతః
యోలోకత్రయ మా విశ్య
బిభర్త్యవ్యయ ఈశ్వరః                                        శ్లో - 17

నాశరహితమైన ఈశ్వరుడే
ఆ పరమాత్మ, అన్ని జీవులకు
ఆ పరమాత్మే ఆది బీజము
ఈ మూడులోకాలను పాలించేది
ఆ పరమాత్మయే

ఈ శ్లోకమునందలి అభిప్రాయము కఠోపనిషత్తునందును (2.213) శ్వేతాశ్వత రోపనిషత్తునందును (6.13) చక్కగా వ్యక్తము చేయబడినది. బద్ధములైన కొన్నియు, ముక్తములైన కొన్నియు అగు అసంఖ్యాకములైన జీవులకు పైని పరమాత్మ అనబడు దేవదేవుడు కలడని అందు స్పష్టముగా చెప్పబడినది. నిత్యోనిత్యానాం చేతనశ్చే తనానాం అనునది ఆ ఉపనిషత్తునందలి వాక్యము. బద్ధములును ముక్తములును అయిన జీవులన్నిటిలో, వానిని పోషించి వివిధ కర్మలను బట్టి భోగానుభావావకాశము నొసంగు దేవాదిదేవుడను దివ్యపురుషుడొకడు కలడని దీని సారాంశము. దేవాదిదేవుడు పరమాత్మ రూపమున ప్రతివ్యక్తి హృదయమునందును ఉన్నాడు. అతనిని అర్థము చేసికొనగలవాడే బుద్ధిమంతుడు. సంపూర్ణశాంతిని పొందుటకు అర్హుడు, కాని ఇతరులుకారు.

యస్మాత్ క్షరమతీతోహం
అక్షరాదపి చోత్తమః
అతోస్మిలోకే వేదే చ
ప్రథితః పురుషోత్తమః                                        శ్లో - 18

నశించే సర్వజీవరాశి
కంటే నేనుభిన్నుడను
నశింపు లేని జీవుని
కంటెను కూడా శ్రేష్ఠుడను
అందువలన పురుషోత్తముడను

బద్ధజీవుడు కాని ముక్తజీవుడు కాని ఎవ్వరును దేవాది దేవుడైన కృష్ణుని అతిశయింపజాలరు. అందుచే అతడు పురుషులలో అత్యున్నతుడు. దీనిని బట్టి జీవులును, దేవాదిదేవుడును వ్యక్తులని స్పష్టమగుచున్నది. జీవులు బద్ధ స్థితిలో కాని ముక్తస్థితిలో కాని పరిమాణమున దేవాదిదేవుని ఊహాతీతమైన శక్తులను అతిశయింపజాలరనుటయే భేదము. జీవులును, దేవదేవుడును అన్ని విధముల సమాన ప్రతిప్రత్తిలో నున్నవారని తలంచుట సరియైనది కాదు. ఆ ఇరువురి వ్యక్తిత్వముల నడుమను న్యూనాధిక్యములను సమస్య ఎప్పుడును ఉండనే ఉన్నది. 'ఉత్తమ' అను పదము చాలా ముఖ్యమైనది. ఎవరును దేవాది దేవుని అతిశయింపజాలరు.

'లోకే'అనుపదము 'పౌరుషాగమమ్లుందు' (స్మృతి గ్రంథములందు) అని సూచించుచున్నది. 'లోక్యతే వేదార్థోనేన' అనగా వేదముల ప్రయోజనము స్మృతి గ్రంథములందు వివరింపబడినది' అని నిరుక్తి నిఘంటువు సమర్థించుచున్నది.

దేవదేవుని స్థానిక పరమాత్మాంశము వేదములందు కూడ వర్ణింపబడినది. 'తావ దేష సంప్రసాదోస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరంజ్యోతి రూపం సంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే ఉత్తమః పురుషః' అను వాక్యము వేదములందు (ఛాందోగోపనిషత్తు 8.12.3) కనబడుచున్నది. అనగా పరమాత్మ దేహమునుండి వెలువడి నిరాకారమైన బ్రహ్మజ్యోతిని ప్రవేశించును. అప్పుడు తన రూపములో నతడు తన ఆధ్యాత్మికస్థితిలో నుండును. ఆ దివ్యుడే దేవదేవుడనబడును- అని దాని అర్థము. దేవదేవుడు పరమజ్యోతియైన తన ఆధ్యాత్మిక కాంతిని ప్రదర్శించుచు వ్యాపింప జేయుచున్నాడని దీని భావము. ఆ దేవదేవునికి కూడ పరమాత్మగా స్థానికాంశ మొకటి ఉన్నది. అతడు సత్యవతీ పరాశరులకు పుత్రుడై అవతరించి వ్యాసదేవుడుగా వేదజ్ఞానమును వివరించును.

యో మామేవ మసమ్మూఢో
జానాతి పురుషోత్తమం
స సర్వవిద్భజతి మాం
సర్వభావేన భారతః శ్లో - 19

అర్జునా!
భ్రాంతిరహితులై
సకలమును తెలుసు
కున్నవారు నన్ను పురుషోత్తమునిగా
గుర్తించి నన్నే ధ్యానిస్తారు

జీవుల యొక్కయు, పరమ సత్య స్వరూపుని యొక్కయు, సహజస్థితిని గూర్చి తాత్త్వికములైన ఊహాకల్పనము లెన్నో ఉన్నవి. ఈ శ్లోకములో కృష్ణభగవానుని పరమ పురుషునిగా నెరుంగువాడు నిజముగ, సర్వజ్ఞుడని దేవాదిదేవుడు స్పష్టముగ వివరించుచున్నాడు. అపరిపక్వ జ్ఞానము గలవాడు పరమ సత్యమును గూర్చి ఊహాకల్పనలు మాత్రము చేయును. కాని సంపూర్ణ జ్ఞానము కలవాడు, తనకాలము వృధా చేయకుండ, ప్రత్యక్షముగ, కృష్ణచైతన్యమునందును, దేవదేవుని భక్తియుక్త సేవయందును నిమగ్నుడగును. భగవద్గీత యందంతటను పదే పదే ఈ విషయము నొక్కి చెప్పబడినది. అయినను దివ్య పరమ సత్యమును, జీవులును ఒక్కరే అని భావించు పెట్టుదలగల భగవద్గీతా వ్యాఖ్యాతలు పలువురు కలరు.

విని నేర్చుకొనునదగుటచే వేదజ్ఞానము శ్రుతి అనబడును నిజమునకు కృష్ణుడు, అతని ప్రతినిధులు మున్నగు అర్హులైన అధికారుల నుండి వేదసందేశమును గ్రహింపవలయును. ఇచ్చట కృష్ణుడు ప్రతి విషయమును చక్కగా విశ్లేషించి చెప్పును. అందుచే ఎవ్వరైనను, ఈ ఆధారము నుండియే వినవలయును. ఊరకే పందులవలె వినుట మాత్రము చాలదు. అర్హులైన అధికారులనుండి విని ఎవరైనను తెలిసికొనవలయును. కాని వైదుష్యపూరకముగా ఊహాకల్పనలు మాత్రము చేయరాదు. వారు ఈ జీవులు ఎల్లప్పుడు దేవాదిదేవునకు అధీనులే అని విధేయతతో భగవద్గీతనుండి వినవలయును. దేవాదిదేవుడైన శ్రీకృష్ణ ననుసరించి దీనిని తెలిసికొనజాలువాడు వేదములయొక్క ప్రయోజనము నెరుంగును. ఇతరులెవ్వరును దాని నెరుంగరు.

'భజతే' యను పదము మిక్కిలి ముఖ్యమైనది. దేవదేవుని సేవాసంబంధమున ఈ పదము పెక్కుచోట్ల వాడబడినది. ఒక వ్యక్తి సంపూర్ణ కృష్ణచైతన్యమునందు, భగవంతుని

భక్తియుక్త సేవయందును, నిమగ్నుడైనచో అతడు వేదజ్ఞానమునంతను అర్థము చేసికొన్నవాడగును. ఎవరైనను కృష్ణుని భక్తి యుక్తసేవలో నిమగ్నులైనచో దివ్యపరమ సత్యమును తెలిసికొనుటకు మరే ఇతర ఆధ్యాత్మిక విధానమును అవసరములేదని వైష్ణవ పరంపరలో చెప్పబడుచున్నది. వారు భగవంతుని భక్తియుక్తసేవలో నిమగ్నులై యుండుటచే ఇది వరకే యథార్థ స్థితికి వచ్చిన వారగుదురు. అవగాహన విషయమున ప్రాథమిక విధానముల నన్నిటిని వారు ముగించినవారగుదురు. కాని ఎవ్వరైనను వేలకొలది జన్మములలో ఊహాకల్పనలు చేసినను కృష్ణుడే దేవాదిదేవుడనియు, అతని శరణు పొందవలయుననియును, యథార్థవిషయమునకు రానిచో చాల సంవత్సరములందును, జీవితములందును వారు చేసిన ఊహాకల్పన లన్నియు వృథా కాలవ్యయములే యగును.

ఇతి గుహ్యతమం శాస్త్రం
ఇద ముక్తం మయానఘ!
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యాత్
కృతకృత్యశ్చ భారత! శ్లో - 20

అర్జునా!
ఇది పరమరహస్యమైన
యోగశాస్త్రము, దానిని
నీకు తెలియజేశాను
దాని రహస్యమును తెలుసు
కున్నవారు జ్ఞానులౌతారు
జ్ఞానుల లక్ష్యమేమిటో అది
దీని వలన నెరవేరుతుంది

ఇచ్చట భగవంతుడు వ్యక్తములైన మత గ్రంథముల సారాంశ మిదియేయని స్పష్టముగా చెప్పుచున్నాడు. ఎవరైనను దేవదేవునిచే చెప్పబడినట్లే దీనినర్థము చేసికొనవలయును. ఈ విధముగా ఎవరైనను బుద్ధిమంతులును దివ్యజ్ఞాన పరిపూర్ణులును అగుదురు. అనగా దేవాదిదేవుని తత్త్వము నెరుంగుటచేతను, అతని దివ్యసేవలో నిమగ్నుడగుటచేతను ప్రతి వ్యక్తియు భౌతిక ప్రకృతి గుణముల కాలుష్యమునుండి విముక్తుడు కాగలడు. భక్తియుక్త సేవ ఆధ్యాత్మికత్వ అవగాహనమునందలి ఒక విధానము. భక్తియుక్తసేవతోపాటుభౌతిక కాలుష్యము కలసి ఉండజాలదు. ఆధ్యాత్మికత్వముచే కూడియుండుటచే భగవంతునికి భక్తియుక్త సేవకును భేదములేదు. భక్తియుక్త సేవ దివ్యపురుషుని అంతర శక్తిలో జరుగును. భగవంతుడు సూర్యుడనియు, అజ్ఞానము అంధకారమనియు చెప్పబడును. సూర్యుడున్నచోట అంధకారము ప్రశ్నయేలేదు. అందుచే ప్రామాణికాధ్యాత్మికాచార్యుని సరియైన నిర్దేశము ననుసరించి జరుగు

భక్తియుక్తసేవ యున్నప్పుడు అంధకారమునకు తావే లేదు.

ప్రతివ్యక్తియు ఈ కృష్ణచైతన్యమును అవలంభించి భక్తియుక్త సేవలో నిమగ్నుడై బుద్ధిమంతుడును, పవిత్రుడును కావలయును. కృష్ణునర్థము చేసికొను ఈ స్థితికి వచ్చి, భక్తియుక్త సేవలో నిమగ్నుడైనప్పుడు కాని సామాన్య మానవుల దృష్టిలో నెంతో బుద్ధిమంతుడైనను, ఎవ్వడును సంపూర్ణ బుద్ధిమంతుడుకాడు.

అర్జునుని సంబోధించిన 'అనఘ' అను పదము చాల ముఖ్యమైనది. పాపరహితుడను అర్థము గలదానికి ఎవరైనను సర్వపాప ప్రతిక్రియల నుండి విముక్తులైననేకాని కృష్ణునర్థము చేసికొనుట కష్టమని భావము. ఎల్లరును అన్ని కాలుష్యములనుండి పాపకర్మములనుండియు ముక్తులైనప్పుడు అర్థము చేసికొనజాలుదురు. కాని భక్తియుక్తసేవ పవిత్రమును, శక్తిమంతమును అగుటచే ఎవ్వరైన ఒకమారు అందు నిమగ్నులైనచో అప్రయత్నముగానే పాపరహిత స్థితికి వత్తురు.

విశుద్ధ భక్తుల సాహచర్యమున కృష్ణచైతన్యములో భక్తియుక్త సేవ చేయుచున్నప్పుడు పూర్తిగ జయింపవలసిన విషయములు కొన్ని కలవు. వానిలో ముందు జయింపవలసిన ముఖ్యవిషయము హృదయ దౌర్బల్యము. భౌతిక ప్రవృత్తిపై అధికారము వహింపవలెనను కోరికచే మొదటి పతనము కల్గును. అప్పుడు మానవుడు పరమపురుషుని దివ్య ప్రేమయుక్త సేవను విడిచివేయును. మానవుడు భౌతిక ప్రవృత్తిపై అధికారము వహింపవలయునను ప్రవృత్తిని పెంపొందించుకొను కొలది భౌతిక వస్తువుల యందును, భౌతిక వస్తుస్వామ్యము నందు ఆసక్తుడై యుండుట హృదయము యొక్క రెండవ దౌర్బల్యము. ఈ హృదయ దౌర్బల్యములకు భౌతిక జీవిత సమస్యలే కారణములు. ఈ అధ్యాయమునందలి మొదటి ఐదు శ్లోకములు ఈ హృదయ దౌర్బల్యముల నుండి విముక్తి పొందు విధానమును వర్ణించును. ఆరవ శ్లోకము నుండి తుది శ్లోకము వరకును గల మిగిలిన అధ్యాయము పురుషోత్తమ యోగమును చర్చించును.

(ఈ అధ్యాయములోని శ్లోకములన్నిటికి పూజ్యశ్రీ ఎ.సి భక్తివేదాంత స్వామి ప్రభుపాదులవారి భగవద్గీత వ్యాఖ్యానము నుండి యథాతథంగా స్వీకరించబడినది)

**ఈ విధంగా ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమను**
**శ్రీకృష్ణార్జున సంవాదరూపమును అయిన**
**శ్రీ మద్భగవద్గీత యందలి పురుషోత్తమ ప్రాప్తియోగమను పేరుగల**
**పదిహేనవ అధ్యాయము సమాప్తముగావించబడింది.**



# గీతా సంహిత

**అధ్యాయము పదునారు** | **దైవాసుర సంపద్విభాగ యోగము**

జీవిత ప్రణాళిక ఎట్లుండవలెనో, మానవుడు తన జన్మమును ఎట్లు సఫలమొనర్చుకొన గలుగునో వాటిని గురించి గీతలోని మొదటి ఐదు అధ్యాయాలలో మనం చూచి యున్నాము. ఆ పిమ్మట ఆరవ అధ్యాయము మొదలు పదకొండవ అధ్యాయము వరకు భక్తి తత్వమును గూర్చి అనేక రీతులలో విచారణ చేసియున్నాము. పదకొండవ అధ్యాయములో కేవలము భక్తియొక్క స్వరూపమును దర్శించినాము. పండెండ్రవ అధ్యాయములో సగుణ, నిర్గుణముల భక్తియొక్క రూపములను పోల్చి చూచుకొని భక్తుని ఉత్తమలక్షణములను గూర్చి తెలుసుకున్నాము. ఈ అధ్యాయములో తుదివరకు కర్త, భక్తి ఈ రెండింటిని గూర్చి నిజస్థితిని పరిశీలించాము. అయితే జ్ఞానము అనే మూడవ భాగము మిగిలిపోగా దానిని మనము పదమూడవ, పదునాలుగవ అధ్యాయములలో లోతుకు వెళ్లి చూచాము. దేహమునుండి ఆత్మను వేరు చేయుట, దాని కొరకై త్రిగుణములను జయించి చివరకు సర్వత్ర ప్రభువును దర్శించుట ఎటులో తెలుసుకున్నాము. పదునైదవ అధ్యాయములో సంపూర్ణ జీవిత శాస్త్రమును అవగతము చేసుకొన్నాము. పురుషోత్తమయోగములో జీవితము పూర్ణత్వమును పొందినది. దాని తరువాత ఇక మిగిలిందేమియును లేదు.

కర్మయే భక్తి, భక్తియే జ్ఞానము, జ్ఞానమే కర్మ అను అనుభవమును పురుషోత్తమ ప్రాప్తి అనే పదునైదవ అధ్యాయము నుండి పొందినాము.

జీవితములోని ప్రతి క్రియలోను పరమార్థము నిండి యుండవలెను. ప్రతి కార్యము సేవామయము,ప్రేమమయము, జ్ఞానమయము కావలెను. జీవితము యొక్క అన్ని

విభాగములలోను కర్మ, భక్తి, జ్ఞానములు నిండియుండవలెను. ఇట్టిస్థితినే పురుషోత్తమ యోగం అంటున్నారు. జీవితాన్నంతటిని పరమార్థమయము చేయవలెనని చెప్పుట చాల సులభము. కాని ఈ భావము ఆచరణలోకి రావలెనంటే శుద్ధమైన భక్తి, జ్ఞానములతో హృదయమును వికసింపజేసుకొని సాధన చేయవలెను. అందువలన కర్మ, భక్తి, జ్ఞానముల రూపము అక్షరశః ఒకటే. ఈ ఉత్కృష్టస్థితినే పురుషోత్తమ యోగము అంటున్నారు దాని ద్వారా జీవితము చరమ దశను పొందును. ఇపుడీ పదునారవ అధ్యాయములో తెలుపబోతున్న విషయము సూర్యోదయము కాబోయే ముందు సూర్యుని ప్రభ ఆకాశమును నింపినట్లుగానే కర్మ, భక్తి, జ్ఞానములతో కూడిన పూర్ణపురుషోత్తమ యోగము జీవితాకాశములో ఉదయించుటకు ముందు సద్గుణముల యొక్క ప్రభ బహిర్గతము కావలెను. పూర్ణజీవితమును సూచించుచూ ముందుగా వచ్చు ఈ ప్రభయొక్క వర్ణనము ఈ అధ్యాయములో చేయబడింది. ఏ అంథకారములో పొరు సలిపి ఈ ప్రభబయలు వెడలునో దాని వర్ణన కాకుండా ఇక్కడ చేయబడింది. ఏదేని ఒక విషయాన్ని రుజువుచేయుటకు ఇతరములగు కొన్నింటి సాయమవసరమగుచుండును. సేవా, భక్తి, జ్ఞానములు మన జీవితంలో ప్రవేశించాయని మనం తెలుసుకొనేదెట్లు?

పొలములో మనం పనిచేసినందుకు ప్రతిఫలముగా ధాన్యమును కొలిచి తెచ్చుకొందుము. లేదా రొక్కం రూపంలో డబ్బును తీసుకొనెదము. ఈ విధంగానే మనం చేసిన సాధనలు ఏవో, వాటి నుండి మనకు కలిగిన అనుభవము లేమిటో, ఎన్ని సద్వృత్తులు మనలో లోతుగానాటుకొన్నవో, ఎన్ని సద్గుణములు మనలో ప్రవేశించినవో, నిజానికి జీవితము ఎంతగా సేవామయం అయిందో వీటన్నింటిని పరిశీలించుటకు ఈ అధ్యాయము మనకు దారి చూపుతుంది. జీవితకళ ఎంత పురోగమించి వృద్ధి చెందినదో దానిని కొలిచి చూచుకొనుడని ఈ అధ్యాయము మనకు తెలియజెప్పుచున్నది. వికాసయుతమగు ఈ జీవిత కళను గీత దైవసంపద అంటుంది. అందుకు విరుద్ధమైన వృత్తులను అసురసంపద అంటుంది. అందువలననే ఈ అధ్యాయమునకు "దైవా-సురసంపద్వి భాగయోగము" అను పేరువచ్చింది. దైవసంపదకు అసుర సంపదకు మధ్య జరుగు సంఘర్షణ ఈ అధ్యాయమందు వివరింపబడింది.

గీత మొదటి అధ్యాయములో ఒకవైపున కౌరవసేనయు, రెండవవైపున పాండవ సేనయు ఎదురెదురుగ మోహరించియున్నట్లే ఇక్కడ ఈ అధ్యాయములో సద్గుణములు అనెడి దైవసేన- దుర్గుణములనెడి అసురసేన ఒకదాని ఎదుట ఇంకొకటి మోహరించియున్నాయి. మానవ హృదయములో సత్యాసత్య ప్రవృత్తుల మధ్య జరుగుచుండు పోరాటమును ప్రాచీన కాలమునుండియు రూపకాలంకారముల ద్వారా వర్ణించడం పరిపాటి అయిపోయింది.

వేదములలో ఇంద్రునికిని- వృత్రునికిని, పురాణములలో దేవతలకు -దానవులకు, రామాయణములో రామరావణులకును, పారసీక ధర్మగ్రంధములో అహుర్మజుడునకును - అహరిమానునకును, క్రైస్తవ మతములో భగవంతునికి- సైతానుకును, ఇస్లాంలో అల్లాకును, ఇబ్లీసునకును వున్న పోరాటముల వంటవి అన్ని ధర్మగ్రంథాలలో అగుపిస్తాయి. కావ్యములలో స్థూల విషయముల వర్ణన సూక్ష్మవస్తువుల ద్వారా జరుగుచుండగా, ధర్మగ్రంథములలో సూక్ష్మమనోభావములు బ్రహ్మాండమైన వస్తువులతో పోల్చబడి వర్ణింపబడుచుండును. కావ్యములలో స్థూలవస్తువుల వర్ణన సూక్ష్మవస్తువుల ద్వారా జరుగగా, ఇక్కడ సూక్ష్మ వస్తువుల వర్ణన స్థూల వస్తువుల ద్వారా జరుగుతుంది. అట్లని గీతకు ప్రారంభములో చేయబడిన వర్ణన కల్పితమని భావించరాదు. అది చారిత్రక విషయము. అయితే ఇక్కడే వ్యాసమహర్షి తన అభీష్టమును నెరవేర్చుకొనుటకు ఈ యుద్ధమును ఉపయోగించుకొనడం జరిగింది.

కర్తవ్య నిర్వహణములో మనస్సునందు మోహము జనించినప్పుడు మనుష్యుడెట్లు సంచరించవలెనన్న విషయమును యుద్ధము అను రూపకము ద్వారా నచ్చజెప్పడం జరిగింది. మంచి, చెడుల నడుమ జరిగే పోరాటము ఈ అధ్యాయములో చెప్పబడింది. కనుక గీతయందు యుద్ధము యొక్క రూపకము చూపబడింది.

ఈ అధ్యాయములో 24 శ్లోకాలున్నాయి. ఇందలి ముఖ్యవిషయాలు

1. దైవిక గుణ సముదాయము *(1నుండి 3వ శ్లోకం వరకు)*
2. అసుర గుణ సముదాయము *(4వ శ్లోకము)*
3. ఆ రెండింటి యొక్క ఫలము *(5వ శ్లోకము)*
4. అసురసంపద గల వారి యొక్క లక్షణములు వారికి కలిగే అధోగతి *(6నుండి 20వ శ్లోకం వరకు)*
5. నరక ద్వారములు *(21వశ్లోకము)*
6. శాస్త్రవిరుద్ధమగు ఆచరణను త్యజించి శాస్త్రానుకూలమగు ఆచరణమును గ్రహించుట *(22వ శ్లోకము నుండి 24వరకు)*

గ్రహించదగు దైవగుణములను గూర్చియు, విసర్జించదగు అసురగుణముల గూర్చియు భగవానుడు ప్రకటింపదలచి ముందుగా దైవగుణములను గూర్చి పేర్కొనుచున్నాడు.

అభయం సత్త్వసంశుద్ధిః
జ్ఞానయోగవ్యవస్థితిః
దానం దమశ్చ యజ్ఞశ్చ
స్వాధ్యాయస్తప ఆర్జవమ్ శ్లో -1

అహింసా సత్య మక్రోధః
త్యాగశ్శాంతిరపైశునం
దయా భూతేష్వలోలుప్త్వః
మార్దవం హ్రీరచాపలమ్ శ్లో -2

తేజః క్షమా ధృతిశ్శౌచం
అద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దైవీం
అభిజాతస్య భారతః శ్లో - 3

*అర్జునా!*
*భయరహితులు*
*జ్ఞానయోగనిష్ఠయందు ఆసక్తి కలవారు*
*దానధర్మగుణ సంపన్నులు*
*యజ్ఞస్వాధ్యాయనా పరులు*
*అహింసావ్రతులు, సత్యవ్రతులు*
*త్యాగ సంపన్నులు, శాంతి ప్రియులు*
*కరుణ, తేజస్సు, క్షమ కలిగి ద్రోహ*
*చింతన లేనివారు దైవాంశలో జన్మించిన*
*వారుగా చెప్పబడుతున్నారు*

1. భయము లేకుండా వుండడం 2. అంతఃకరణశుద్ధి కలిగియుండడము. 3. జ్ఞానమనుయోగము నందు నిమగ్నుడై వుండడం. 4. దాన గుణము కలిగియుండడము. 5. బాహ్యేంద్రియమును నిగ్రహించగలగడము. 6. యజ్ఞముల (కర్మలయందు) ఆసక్తి కలిగి యుండడము 7. వేదశాస్త్రములను అభ్యసించడము 8. తపస్సు లోకి పయనించు మార్గమును అన్వేషించడం. 9.ఋజుత్వము (కపటములేకుండుట) కలిగి యుండడం 10 ఏ ప్రాణికిని బాధ కలుగజేయకుండా వుండడం (అహింసావ్రతము) 11. సత్యమును వచించడం

12. కోపము (క్రోధము) లేకుండా వుండడం. 13. త్యాగబుద్ధికలిగి యుండడం. 14. శాంత స్వభావము కలిగి యుండడం 15. కొండెములు( చాడీలు) చెప్పకుండా వుండడం. 16. అన్ని ప్రాణుల యందు సమదృష్టికలిగియుండడం. 17. విషయలోలత్వము లేకుండా వుండడం 18. మృదుత్వము కలిగి వుండడం అంటే క్రౌర్యము లేకుండా వుండడం. 19. ధర్మవిరుద్ధ కార్యములయందు సిగ్గును కలిగియుండడం అంటే ధర్మ విరుద్ధ కార్యముల యందు ప్రవర్తించకుండా వుండడం. 20. చంచల స్వభావము లేకుండా వుండడం. 21. ప్రతిభ (తేజస్సు) కలిగియుండం 22. కష్టములయందు సహిష్ణుత కలిగి యుండడం అంటే ఓర్పును కలిగి యుండడం. 23. ధైర్యముతో ముందుకు సాగడం 24. బాహ్యాభ్యంతర శుచిత్వమును కలగియుండడం 25. ద్రోహచింతనము లేకుండా వుండడం 26. స్వాతిశయము లేకుండా వుండడం అంటే తాను పూజింపదగిన వాడను అను అభిమానముగాని గర్వముగాని లేకుండా వుండడం అను ఈ గుణాలన్నీ దైవసంపత్తి యందు పుట్టిన వానికి కలుగుచున్నవన్నది పై మూడు శ్లోకముల ప్రకటన.

1. మొదటి శ్లోకం ప్రారంభంలో "అభయం" అనుపదము ప్రయోగింపబడింది. అభయానికి అర్థము భయరాహిత్యము. ఇది ప్రతి ఒక్కరిలో వుండాలి. ఎందువల్ల నంటే అన్ని దుర్గుణాలకు భయమే పునాది.భయమునుండియే తక్కిన అవగుణాలన్నీ పుట్టుచున్నాయి. అందువలన విజ్ఞులు (పెద్దలు) మొదట భయాన్ని పారద్రోలినచో నిర్భయత్వము అలవడునని తెలిపినారు.

2. ఆ వెనువెంటనే "సత్వ సంశుద్ధిః" అను పదం ప్రయోగించబడింది. కేవలం "శుద్ధిః" అని చెప్పకుండా "సత్వ సంశుద్ధిః" అని చెప్పడంవలన చిత్తము అత్యంత నిర్మలముగా వుండవలెనన్నది దాని భావము.

3. ఆ పిదప "జ్ఞానయోగవ్యవస్థితాః" అని ప్రయోగించబడింది. ఇక్కడ ఆత్మజ్ఞానానుభూతి అన్నింటి యొక్క పరమావధి గనుక జ్ఞానయోగాధిక్యతను గూర్చి భగవానుడు ప్రకటించాడు.

4. "దానం" అను పదమును ప్రయోగించుటలో భగవానుని ఉద్దేశము- భూదానము- సంపద్దానము, అన్నదానము, జలదానం శ్రమదానము, విద్యాదానం, జ్ఞానదానం మొదలుగా గల దానములయందు మానవుడు ఆసక్తుడై ధర్మకర్తృత్వ సిద్ధాంతమును అమలు చేయవలెనని భగవానుని ప్రకటన. వీటినే జాతిపిత మహాత్మాగాంధీ తన జీవిత కాలములో ప్రవేశపెట్టి వీటన్నింటిని తననిత్య జీవితంలో ప్రయోగించారు. అదేవిధంగా

ఆయన అంతేవాసి మహర్షి వినోబా అప్రయత్నంగా 1951లో పోచంపల్లిలో తమకు లభించిన భూదానముతో భూదానయజ్ఞమును ప్రారంభించి దాని నుండి అన్నదానము, సంప్దానము, శ్రమదానము, జ్ఞానదానము, మొదలగు వాటినన్నింటని అమలు చేసి గ్రామస్వరాజ్య సాధనకు కృషి చేశారు.

5. ఆ పిదప "దమశ్చ" అను పదము ప్రయోగింపబడింది.
"శమ"మను అంతరేంద్రియనిగ్రహము "సత్వసంశుద్ధిః" అను పదము ద్వారా మొదట్లోనే చెప్పబడింది. ఇక్కడ ఇపుడు "దమము"అను బాహ్యేంద్రియనిగ్రహము గురించి చెప్పబడింది.

6. అటు తరువాత "యజ్ఞశ్చ' పదప్రయోగం చేయబడింది. యజ్ఞమంటే వివిధ కర్మలను (పనులను) ఆచరించుట. ఇందులో తపోయజ్ఞము, యోగయజ్ఞము, స్వాధ్యాయ యజ్ఞము, జ్ఞానయజ్ఞములు మొదలుగా గలవి ప్రముఖమైనవి.

7. అటు పిమ్మట "స్వాధ్యాయం" -అని ప్రకటింపబడింది. అంటే ఉపనిషత్తులు-బ్రహ్మసూత్రములు రామాయణము- యోగవాసిష్ఠము, మహాభారతం- భగవద్గీత, భాగవతం, ఆదిగాగల ఆధ్యాత్మిక గ్రంథములను మననము చేసి వాటి సారమును గ్రహించి మానవులు తమ జీవితాన్ని ఆ విధంగా మలచుకొనుటకు ప్రయత్నించటం స్వాధ్యాయయజ్ఞము అని చెప్పబడింది.

8. తపః - అను పదప్రయోగము కూడా చేయబడింది. తపస్సంటే తల క్రిందపెట్టి కాళ్లను పైకి లేవనెత్తడం కాదు. గీత 17వ అధ్యాయంలో తెలుపబడినశారీరక, వాచిక, మానసిక తపస్సులని భావము.

9. "ఆర్జవమ్" అంటే శరీరము, వాక్కు, మనస్సు అను మూడింటితోను ఏకరీతిగా వర్తించుట. అంటే త్రికరణ శుద్ధికలిగియుండుట ఈ తొమ్మిది మొదటి శ్లోకము యొక్క భావాలు.

10. ఇక రెండవ శ్లోకం" అహింస" అనుపదప్రయోగంతో ఆరంభమౌతున్నది. దీని నుండి భగవానుడు శరీరముతో గాని, వాక్కుతోగాని, మనస్సుతోగాని ఏ ప్రాణిని హింసించవద్దు అని ప్రకటించాడు.

11. తదుపరి "సత్యం" అను పదప్రయోగం వుంది. శరీరవాఙ్మనంబులతో అసత్యమాడకుండా వుండి సత్యవస్తువగు పరమాత్మను దర్శించమని ప్రకటించాడు. అందువల్లనే మన జాతీయోద్యమనాయకుడు మహాత్మాగాంధీ "సత్యమే నా దేవుడు" అని ప్రకటించి జాతిని ఆ విధంగా ప్రవర్తించమని కోరాడు.

12. "అక్రోధః" అను పదప్రయోగంతో క్రోధము చాలా చెడ్డగుణము దానిని విసర్జించమని ప్రకటించాడు భగవానుడు. క్రోధము మానవునికి ఎంతో చెడ్డను కలిగిస్తుంది. అది మానవుణ్ణి ఆవరించినపుడు అతడు కల్లు త్రాగిన కోతివలె వుండి ఆ కైపులో యుక్తాయుక్తములను విస్మరించి అతడు అధః పతనమునొందుచున్నాడు. అందువల్లనే రెండవ అధ్యాయం 62, 63వ శ్లోకంలో

"ఇంద్రియ విషయాలను గురించి
ఆలోచించిన కొద్ది వాటిపట్ల
ఆసక్తి, అనురక్తికలుగుతుంది
ఆసక్తి వలన కోరికలు జనిస్తాయి
కోరికల వలన కోపము కలుగుతుంది
కోపమువలన అవివేకం
అవివేకము వలన మతిభ్రమ
కలుగుతుంది. మతిభ్రమవలన
బుద్ధినశిస్తుంది, బుద్ధినశించడం
వలన మనిషి తానే నశిస్తున్నాడు
అని భగవానుడు ప్రకటించాడు

13. "త్యాగః "త్యాగేనైకే అమృతత్వ మానశుః "- త్యాగమువల్లనే అమృతత్వము (మోక్షము) సిద్ధిస్తుందని ఉపనిషత్తులు ఉద్ఘోషించుచున్నాయి.

14. "శాంతిః" - చిత్తము శాంతియుతముగ నుండవలెను - కల్లోలయుతముగా (సముద్రము) వుండరాదు. సంకల్పముల (కోరికలే) చేతకొట్టుకొనరాదు. శాంతిలేని వానికి సుఖము వుండదు.

15. "అపైశునమ్" - అను పదప్రయోగముతో ఇతరుల దోషములను లెక్కింపకుండా వుండి, చాడీలు చెప్పకుండా వుండడం, మానవులు తమ హృదయాల్లో దాగివున్న కోటానుకోట్ల దోషములను ముందుగా నిర్మూలించుకోవాలి. ఇతరుల దోషములను లెక్కించవలసిన పనిలేదు.

16. "దయాభూతేషు" అని తెలుపడంతో సమస్త ప్రాణికోటియందు దయకలిగియుండవలెనని భగవానుడు ప్రకటించాడు. ఇదే విషయాన్ని గీతలో అనేక పర్యాయములు ప్రకటించాడు. తిరిగి ఇక్కడ మానవకోటిని అప్రమత్తులను చేయుటకు తిరిగి అదే వాక్యాన్ని భగవానుడు ప్రకటించాడు.

17. "అలోలత్వము" అంటే ఇంద్రియలోలత్వము లేకుండుట. ఇంద్రియముల యొక్క శక్తి అంతయు విషయభోగములందు వ్యర్థమైపోయినచో ఆత్మజ్ఞాన చింతనాదులయందు అది సమర్థవంతమై యుండదు. అందువలన ప్రత్యాహారముతో ఇంద్రియములను విషయ వాంఛలనుండి మరల్చవలెను. అపుడు మనస్సు చపలత్వము లేకుండా యుండి ఆత్మయందు స్థాపితమగును.

18. "మార్దవమ్" అంటే మాటలయందు, చేతలయందు కాఠిన్యము చూపక మృదుత్వమును కలిగి యుండుట, పరుషత్వము వీడవలెను. ఇది సాత్వికగుణ సంపన్నుని లక్షణము.

19. "హ్రీః" అంటే సిగ్గు.
1. పాపకార్యములు చేయుట యందు సిగ్గు కలిగి యుండవలెను.
2. ఉన్నతిని పొందలేకపోయినపుడు సిగ్గుపడవలెను.
3. మహాత్ములను, అనుభవజ్ఞులను దర్శించి తన అవినీతిని గూర్చి సిగ్గును పొందవలెను. వారివలె ఉన్నత పారమార్థిక శిఖరమును అధిరోహించుటకు పట్టుదలతో ప్రయత్నించవలెను.

20. "అచాపలమ్" అంటే చంచలత్వము కలిగి వుండడం. ఇది రజోగుణ స్వభావం, అట్టిది లేకుండా చేసుకొనుటకు ప్రయత్నించవలెను. మనస్సును ఆత్మనుండి చలింపజేయరాదు. "అహింసా" అనుపదము తో ప్రారంభమైన రెండవ శ్లోకం అచాపలమ్ అను పదముతో ముగిసింది. మూడవ శ్లోకం తేజః అన్నపద ప్రయోగంతో ప్రారంభమౌతుంది.

21. తేజః అంటే బ్రహ్మతేజస్సు కలిగి వుండడం.

22. "క్షమా" ఓర్పును (సహనమును) కలిగియుండవలెను. ద్వంద్వములయందు నిర్వికారుడై యుండవలెను. భూదేవి వలెను, ఫలవృక్షముల వలెను క్షమాశీలుడై యుండవలెను. (మానవకోటి అంతా తనపై ఎంత అక్రమాన్ని చేస్తున్నా భూమాత వాటన్నింటిని చూసి కన్నీరు గార్చుచూ ఓర్పుతో సహనముతో వుంటున్నది. ఫలాలనిచ్చే చెట్టుకూడా తనపై ఎందరు రాళ్లు విసురుతున్నను ఓర్పుతో వుంటున్నది)
క్షమాశీలత్వమును గూర్చి శుకయోగీంద్రుడు, యేసుక్రీస్తు మొదలుగా గల యోగీంద్రుల జీవితాలను అధ్యయనము చేసి తెలుసుకోవలసి వుంది.

23. "ధృతిః"- ధైర్యమును కలిగి యుండుట, ఎన్ని విపత్తులు సంభవించినా మేరునగధీరుడుగా గంభీరుడై యుండవలెను.

24. "శౌచమ్"- 1. బాహ్యశౌచము అంటే శరీరాన్ని, గృహాన్ని పరిశుభ్రముగా వుంచుకోవడం, 2. అభ్యంతర శౌచం అంటే ఇంద్రియమనంబుల శుద్ధి కలిగి అపవిత్రసంకల్పములు లేకుండా వుండుట.

"అద్రోహః" ఎవరికిని ద్రోహం తలపెట్టకుండా వుండడం, అంటే ద్రోహచింతన లేకుండా వుండడం.

"నాతిమానితా" తాను గొప్పవాడనని, పూజ్యుడనని ఎవ్వరును, ఎప్పుడుగాని విఱ్ఱవీగకూడదు. తనను మాత్రమే పరులు గౌరవించవలెను. ఇతరులను తాను గౌరవించవలసిన అవసరం లేదని భావించరాదు. దీనివలన అనేకమంది పతనమొందిన సంగతిని మనం చూస్తున్నాం. (చంద్రవంశపు రాజులలో ఒకడైన నహుషుని సంగతి అందరూ ఎరిగినదే. ఇతడు అనేక క్రతువులు చేసి దేవత్వము పొందెను. విశ్వరూపుని చంపిన పాపానికి భయపడి ఇంద్రుడు

నహుషుడు గర్వాంధుడై అగస్త్యాది మహామునులను తన అందలమును మోయుడని ఆజ్ఞాపించెను. అందుకు నిరాకరిస్తూ అతనితో వాదము చేసిన అగస్త్యమహాముని తలపై నహుషుడు కోపంతో తన్నగా అపుడు అగస్త్యుడు నహుషునితో "నీవు మదాంధుడవై ఇట్లు ప్రవర్తించితివిగాన సర్పమువు కమ్మని శపించెను" ఆ శాపము వలన నహుషుడు సర్పముగా మారెను. (మహాభారతం)

దేవలోకము నుండి పారిపోయినపుడు ఆ పదవి మనుషత్వము నుండి దైవత్వముపొందిన నహుషునకు సంప్రాప్తించింది. నహుషుడుఇంద్రపదవిని పొందాక మిక్కిలి గర్వించినవాడై దేవతలను, మునులను అవమానపరుచుచుండెను. ఇంద్రుని భార్య శచీదేవిని చూచి మోహించి ఆమెను తనకడకు రప్పింపుడని ఆజ్ఞాపించెను. ఆమె బృహస్పతియొక్క ఆలోచనమును పొంది మునులు వాహకులుగా ఇంద్రుని పల్లకిపై తన వద్దకు రాగలిగితే అతని పొందును అంగీకరింతునని తెలిపెను.

కనుక ప్రతిమానవుడు ఆంజనేయస్వామి వలె వినయవిధేయతలు గలిగి నిరభిమానము దైవభక్తి వున్నపుడు పరమార్థ మార్గమున పయనించి అమృతత్వమును (మోక్షపదవిని) పొందును.

ఈ ఇరువది ఆరు సుగుణములు దైవసంపత్తి యందు జన్మించినవారికి కలుగుచున్నాయి. ఇవిలేనివారు దైవసంపదకై యత్నించి దానిని పొందవలెను. మోక్షమార్గానికి ఈ సద్గుణాలు అత్యావశ్యకములు. ఇక 4వశ్లోకములో అసురసంపదను గూర్చి భగవానుడు పేర్కొనుచున్నాడు.

దంభోదర్పో భిమానశ్చ
క్రోధః పారుష్య మేవ చ
అజ్ఞానం చాభిజాతస్య
పార్థః సంపద మాసురీమ్ శ్లో -4

*అర్జునా!*
*తామస ప్రవృత్తిగల*
*అసురీ గుణాలతో జన్మించిన*
*వానికి దంభం, గర్వము*
*దురభిమానము, క్రోధము*
*పరుషవదనము, వివేకహీనత*
*వుంటాయి.*

దుర్గుణములలో మొట్టమొదటిది దంభము. ఏ రంగములో కూడా కపటము, వేషము, మోసము పనికిరాదు. తాము గొప్పవారమని నటించినంతమాత్రాన బహుశా వారు లోకులను మోసపుచ్చవచ్చునేమోకాని భగవంతుని మాత్రము మోసగించలేరు. వారి హృదయమునందు దాగి సర్వేశ్వరుడు ఎప్పటికప్పుడు వారి సంకల్పములను కనిపెట్టుచునే యున్నాడు. కనుక దంభము అను దుర్గుణమును మొదట నరికి వేయవలెను. ఆ పిమ్మట గర్వమును పారద్రోలవలెను. తనకేదైన గొప్పపదవి లభిస్తే గర్వపడక అది అంతయు ఆ సర్వేశ్వరుని దయవల్లనే సంప్రాప్తించిందని భావించి వినమ్రుడై వుండవలెను. అదే విధంగా క్రోధమును కూడా విడనాడవలెను. దైవగుణములలో అక్రోధము (కోపము లేకుండుట) అసురగుణములలో క్రోధము (కోపము) కలిగియుండుట చెప్పబడిన విషయాన్ని గమనికలోనికి తీసుకోవలసి వుంది. అక్రోధమును గ్రహింపమని చెప్పినను, క్రోధమును త్యజింపుమని చెప్పినను, రెండింటి యొక్క అర్థము ఒక్కటే . దైవ, అసుర సంపత్తుల రెండింటియందును క్రోధమును గూర్చిన ప్రస్తావన వచ్చినందున క్రోధరాహిత్యము ఒక్క ఆధ్యాత్మిక రంగములోనే కాకుండా అన్ని రంగాలలో ఎంతటి ప్రాధాన్యత వహించి వున్నదో మనం ఊహించవచ్చు. అంతేగాకుండా సాధకుడు పరుషముగా మాట్లాడకూడదు. వాక్కుమున్నగు వాటి యందు కాటిన్యము చూపకూడదు. దైవగుణములలో చూపబడిన మృదుత్వమును స్వీకరించవలెను.

దైవీ సంపద్విమోక్షాయ
నిబంధా యాసురీ మతా
మాశుచస్సంపదం దైవీం
అభిజాతోసి పాండవ! శ్లో- 5

దైవీసంపద అమృతత్వమును
(మోక్షమును) అసురసంపద
బంధనమును(కష్టాన్ని) కలుగ
జేయును. కనుక ఓ అర్జున!
నీవు దైవ సంపద నుండి జనించిన
వాడవు. అందుచేత నీవు
దుఃఖించవద్దు

ద్వౌ భూతసర్గౌ లోకే స్మిన్
దైవ అసుర ఏవ చ
దైవో విస్తరశః ప్రోక్త
ఆసురం పార్థ! మే శృణు శ్లో - 6

అర్జునా!
ఈ లోకమునందు
దైవ, అసుర సంబంధమగు
రెండు విధములైన భూతసృష్టులున్నాయి
వీటిలో దైవసంబంధమైన విషయాలను
నీకు ఇంతకు మునుపే విపులముగా చెప్పితిని
ఇప్పుడిక అసుర సంబంధమైన విషయా
లను వినుము

ప్రవృత్తిం చ నివృత్తిం చ
జనా న విదురాసురాః
న శౌచం నాపి చాచారో
న సత్యం తేషు విద్యతే శ్లో- 7

అసురస్వభావముగలవారు
ప్రవృత్తి మార్గమునుగాని
నివృత్తి మార్గములను గాని
ఎరుగరు- వారిలో శుచి
శుభ్రత, ఆచారము అగుపించదు
సత్యము, ధర్మముగోచరించదు

1. ప్రవృత్తి అంటే చేయదగిన కార్యము.
2. నివృత్తి అంటే చేయగూడని కార్యము.

ఈ శ్లోక ప్రారంభంలో "ప్రవృత్తించ-నివృత్తించ" అని ద్వంద్వ సమాసం ప్రయోగింపబడింది.

అసత్య మప్రతిష్ఠం తే
జగదాహురనీశ్వరం
అపరస్పరసంభూతం
కిమన్యత్కామ హైతుకమ్ శ్లో - 8

అట్టివారు ప్రపంచంలో సత్యం
ధర్మం, ప్రతిష్ఠ ఏదీలేదనియు
ఈశ్వరుడు అనబడే వారు అసలే
వుండడని, వున్నదంతా స్త్రీ పురుషుల
మధ్యగల ఆకర్షణ, కామము
దాని కారణంగానే సృష్టిక్రియజరుగుతున్నదని
అందురు. మరొక కారణము ఏదియు
లేదందురు

వీరినే మనం ఇపుడు భౌతిక పదార్థవాదులని, నాస్తికులు అని పిలుచుచున్నాము.

ఏతాం దృష్టిమవష్టభ్య
నష్టాత్మానో ల్పబుద్ధయః
ప్రభవన్త్యుగ్రకర్మాణః
క్షయాయ జగతోహితాః శ్లో - 9

ఈ భావము కలిగినవారు
ఆత్మవిశ్వాసము లేనివారై
జ్ఞానహీనులై, అనేక
క్రూరకర్మలు చేసి ప్రపంచానికి
అపకారాన్ని కలిగిస్తున్నారు

కామమాశ్రిత్యదుష్పూరం
దమ్భమానదాన్వితాః
మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్
ప్రవర్తంతే శుచివ్రతాః శ్లో - 10

వీరు తృప్తిచెందని కోరికలతో
డాంబికం, దురభిమానము
గర్వము కలిగినవారై
అశుభకార్యాలకు పూనుకొని
మోహంతో అనేక అనాచారాలతో
క్షుద్రారాధన చేస్తూంటారు.



చింతామ పరిమేయాంచ
ప్రళయాంతా ముపాశ్రితాః
కామోపభోగపరమా
ఏతావదితి నిశ్చితాః      శ్లో - 11

ఆశాపాశశతైర్బద్ధాః
కామక్రోధపరాయణాః
ఈహంతే కామభోగార్థం
అన్యాయేనార్థసంచయాన్      శ్లో - 12

అట్టివారు మృత్యువే అంతముగాగల
అపరిమితమైన విషయ వాంఛలకు
లోనై కామోపభోగమే ఉత్తమ
మైనదని భావించి, అదియే పరమార్థ
మని నిశ్చయించి, ఆశాపాశములకు
బద్ధులై, కామ క్రోధ పరాయణులై
వాటిని ఈడేర్చుకొనుటకు
అక్రమ మార్గముల ద్వారా ధనార్జనను చేయుచున్నారు

మానవులయొక్క చింతలకు, కోరికలకు, మనోరథములకు అంతముండదు. వారి యొక్క ఆచింతలను చావో లేక మహాప్రళయమో వచ్చి నిలుపుదల చేయవలసినదే తప్ప వారు తమ కోరికలను స్వయముగా ఆపుకొనలేరు. ముముక్షువులైన వారు దైవమునే తమ పురుషార్థముగను, గమ్యముగను, జీవిత లక్ష్యముగను ఎటుల తలంచెదరో అదే విధముగా ఈ అసురప్రవృత్తి గలవారు నిరంతరము కామోపభోగమునే పరమార్థముగ గ్రహించి అంతకుమించి ఈ ప్రపంచంలో మరొక గొప్పదేదీ లేదని వచించెదరు. వీరు వందల కొలది ఆశలను త్రాళ్లచేబంధింపబడియుండుట వలన ఇక వారిలోని అశాంతి వర్ణనాతీతము. అట్టి వారు కామ క్రోధములను ఎప్పుడును విడిచియుండులేరు. అంతేకాకుండా తమకామోప భోగములను ఈడేర్చుకొనుటకు అన్యాయ మార్గాన ధనాన్ని ఆర్జించుటకు యత్నించుచుందురు. దాని వలన తేలుతున్నదేమంటే వీరు రెండు ఘోర ప్రమాదకరములైన దుష్కృత్యాలను ఆచరిస్తున్నారు. అందులో ఒకటి కామాన్ని ఆశ్రయించి వుండడం. రెండోది అన్యాయమార్గాన ధనార్జన చేయడం- దాని వలన వీరు అంతులేని ఆశ చింతలను కలిగియుందురు.

ఇద మద్య మయా లబ్ధం
ఇదం ప్రాప్స్యే మనోరథం
ఇద మస్తీద మపి మే
భవిష్యతి పునర్ధనమ్ శ్లో - 13

అసౌ మయా హతశ్శత్రుః
హనిష్యే చాపరానపి
ఈశ్వరో హ మహం భోగీ
సిద్ధోహం బలవాన్సుఖీ శ్లో - 14

ఆఢ్యోభిజనవానస్మి
కోన్యోస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్య
ఇత్యజ్ఞానవిమోహితాః శ్లో - 15

ఈ ధనాన్ని నేను సంపాదించాను
దానితోనే నేను నాకోరికలను తీర్చు
కొనగలను. ఈ శత్రువును నేను
వధించాను, మిగిలిన శత్రువులను
కూడా ఇక ముందు చంపగల సామర్థ్యం
నాకున్నది, నేను బలవంతుడను
ఎన్నో సుఖాలను అనుభవిస్తున్నాను
నేను గొప్పవంశంలో జన్మించాను
నాకు సాటి ఎవ్వరునూ లేరు
అని అనేక మోహాలకులోనై
విషయలోలులై నరకములను
అనుభవించెదరు

అనేక చిత్త విభ్రాంతా
మోహజాలసమావృతాః
ప్రసక్తాః కామ భోగేషు
పతన్తి నరకే శుచౌ శ్లో - 16

ఈ మోహంలో చిక్కి విషయ
వాంఛలకు లోనైన వారు కామ
సుఖాలతో పతనమై
నరకము అనుభవిస్తారు

అనుభవిస్తున్న కొద్దీకోరికలు ఇంకను పెరుగుతుంటాయే కాని తరగవు. అందువల్లనే మనస్సులో కోరికలు ఉదయించిన వారు ఒక్కొక్క కోరికను అనుభవించుచూ ఇంకను అనుభవించవలెనను కుతూహలంతో ముందుకు సాగుతారు. అంతేకాదు. నేను గొప్పవాడను. నాతో సమానమైన మరొకడు లేడు అని విర్రవీగుచు గర్వాహంకార యుతుడైపెక్కు చిత్తవికారములు కలిగి తుదకు ఘోరనరకమును పొందును. అందువలన పై దెలిపిన దుర్గుణములనన్నింటిని వివేకవంతులైన వారు త్యజించవలెను. ఈ శ్లోకములలో వివేకహీనులైన వారు గావించు దోషములను ఆ దోషముల యొక్క దుష్ఫలితాలను గురించి వివరించ బడ్డాయి.

ఆత్మసంభావితాః స్తబ్ధా
ధనమానమదాన్వితాః
యజంతే నామయజ్ఞైస్తే
దమ్భే నావిధి పూర్వకమ్ శ్లో - 17

వీరు తమకు తమనే
సకల గుణాభిరాములుగా
వర్ణించుకొని పెద్దలైన వారిపట్ల
వినయవిధేయతలు లేక
దురహంకారముతో పేరు ప్రతిష్ఠలకు
మాత్రం దాన ధర్మాలు చేస్తుంటారు

అహంకార బలం దర్పం
కామం క్రోధం చ సంశ్రితాః
మామాత్మపరదేహేషు
ప్రద్విషంతో భ్యసూయకాః శ్లో - 18

దురహంకారులు, నీచులు
క్రూరులైన వీరు కామక్రోధాదులతో
బలదర్పంతో , అహంకారముతో
విర్రవీగెదరు, అట్టి అధములైన
వీరిని నేనే అధః లోకాలకు
అణగద్రొక్కుచున్నాను

తానహం ద్విషతః క్రూరాన్
సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్రమశుభాన్
అసురీష్వే యోనిషు శ్లో - 19

**సకల జీవులలో వున్న నన్ను**
**ద్వేషించేవారు, నీచులు**
**క్రూరులు, పరమ పాపులుగా**
**రాక్షస సంబంధమైన గర్భములయందు**
**జన్మిస్తారు.**

అసురీం యోని మాపన్నా
మూఢా జన్మని జన్మని
మా మప్రాప్యైవ కౌంతేయ!
తతో యాన్త్యధమాం గతిం శ్లో - 20

**అర్జునా!**
**అసుర జన్మమునెత్తిన**
**మందమతులు ప్రతిజన్మము**
**నందును నన్ను పొందకయె**
**అంతకంతకు అధోగతి**
**పాలయ్యెదరు అని తెలుసుకో**

త్రివిధం నరకస్యేదం
ద్వారం నాశనమాత్మనః
కామ క్రోధస్తథా లోభః
తస్మాదేతత్త్రయం త్యజేత్ శ్లో - 21

**కామము, క్రోధము, లోభము**
**అనునవి నరకమునకు మూడు ద్వారాలు**

ఇవి వినాశాన్ని కలిగిస్తాయి
కావున ఈ మూడింటిని విడువలయును

ఏతైర్విముక్తః కౌంతేయ!
తమో ద్వారై స్త్రిభిర్నరః
ఆచరత్యాత్మనః శ్రేయః
తతో యాతి పరాం గతిమ్ శ్లో - 22

అర్జునా!
అజ్ఞాన ద్వారాలైన
ఈ మూడింటిని విసర్జించిన
నరుడు తనకు శ్రేయమును
కలిగించు కొనుచు, ఆ పిదప
పరమోత్కృష్టమైన మోక్ష
పదమును పొందగలడు

యశ్శాస్త్రవిధిముత్సృజ్య
వర్తతే కామకారతః
న స సిద్ధి మావాప్నోతి
న సుఖం న పరాం గతిమ్ శ్లో - 23

ఎవరు శాస్త్రోక్తవిధులను
విస్మరించి యధేచ్ఛముగా
కామోపభోగములకై
వర్తించుచున్నారో అట్టివారు
సిద్ధినిబడయలేరు, సుఖమును
పొందలేరు, మోక్షమును పొందుజాలరు



తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే
కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం
కర్మకర్తు మిహార్హసి శ్లో - 24

కార్యాకార్యములను
నిర్ణయించుటకు
నీకు శాస్త్రమే ప్రమాణము
శాస్త్రమునందు తెలుప
బడిన కర్మలను నీవు
తెలుసుకొని ఆచరించుము

**సారాంశమిది**

అసుర సంపదను తొలగించుకొని దైవ సంపదను లభింప జేసుకొనుడని భగవానుడు ఈ అధ్యాయములో నొక్కి చెప్పియున్నాడు! మనము భగవానుడు ఆదేశించిన రీతిగా ప్రయత్నించడం నేర్చుకోవాలి.

**ఈ విధంగా ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును**
**శ్రీకృష్ణార్జున సంవాద రూపమును అయిన**
**శ్రీ మద్భగవద్గీత యందలి దైవాసుర సంపద్విభాగయోగమను పేరుగల**
**పదునారవ అధ్యాయము సమాప్తముగావించబడింది.**



# గీతా సంహిత

**అధ్యాయము పదునేడు** | **శ్రద్ధాత్రయ విభాగ యోగము**

మనము ఇపుడు మెల్లమెల్లగా భగవద్గీత చివర దశకు చేరుకున్నాము. పదునైదవ అధ్యాయములో జీవితము యొక్క సంపూర్ణ శాస్త్రమును గూర్చితెలుసుకున్నాము. మానవుని మనస్సులోను, మనస్సు యొక్క ప్రతిబింబమైన సమాజములోను రెండువృత్తుల- రెండు సంస్కృతుల లేక దైవ- అసుర సంపదల మధ్య క్షణ క్షణముజరిగే పోరాటాన్ని గూర్చి పదునారవ అధ్యాయములో మనకు లభించింది.

ఇక ఈ పదునేడవ అధ్యాయంలో మానవునికి భగవానుడు ప్రసాదించిన అనుదిన కార్యక్రమమును గూర్చి తెలుసుకోబోతున్నాము. మానవుని మనోవృత్తి నిర్లిప్తముగను, ప్రసన్నముగను వుండవలెననినచో అతని దైనందిన వ్యవహారములన్నియు ఒక క్రమ విధానమునకు కట్టుబడియుండవలెను. అతని జీవితము నిశ్చితమైన నీతి, నియమాలకు కట్టుబడి వుండవలెను. అపుడే అతని జీవితము నిర్లిప్తముగా వుంటుంది. నది స్వేచ్ఛగా ప్రవహిస్తుంది. కాని దాని ప్రవాహము ఆనకట్టలమధ్య బంధించబడి వుంటుంది. అది అట్లు బంధింపబడనిచో దాని స్వాతంత్ర్యం వ్యర్థమైపోతుంది.

ఈ విషయమై జ్ఞానులను ఉదాహరణగా తీసుకోవచ్చు. సూర్యభగవానుడు జ్ఞానులకు ఆచార్యుడు. భగవానుడు మొట్టమొదట కర్మయోగమును గూర్చి సూర్యునకు తెలిపాడు. తదుపరి ఆ యోగము సూర్యుని నుండి మనువునకు చెప్పబడెను. "మనువు" అంటే ఆలోచన చేయగల మనుష్యుడు. సూర్యుడు సర్వస్వతంత్రుడు. ముక్తుడు, నియమబద్ధుడు, ఆయన స్వాతంత్ర్యం ఇందులోనే ఇమిడివుంది. అదే విధంగా నియమబద్ధతలేని నది స్వతంత్రంగా

ప్రవహించినను దానికి అడ్డూ- ఆపులేని కారణంగా సృష్టికి, భూతకోటికి అపకారాన్ని కలిగిస్తూ చివరకు ఎక్కడో ఒక దగ్గర వ్యర్థంగా సముద్రంలో కలిసి పోతుంది. అది సూర్యుని వలె ముక్తుడుకాదు. దానికి నియమ బద్ధత లేదు. అందుకనే దానికి ఆనకట్టలు కట్టి స్వేచ్ఛగా ప్రవహించే ప్రవాహాన్ని అడ్డగించి సృష్టికి, సమాజానికి దాని నీటిని వినియోగం చేసుకోడానికి ప్రయత్నాలు జరిగాయి.

చూడండి, మనము తెలిసిన మార్గాన వాహ్యాళికి వెళతామనుకోండి. అపుడు మనస్సులో ఏదైనా విషయాన్ని ఆలోచిస్తూ నడుస్తున్నను మనం ఇంటికి తిరిగిరాగలము. అట్లుగాక ఎప్పటికప్పుడు కొత్త మార్గాన వాహ్యాళికి వెళ్లామనుకోండి మన దృష్టి అంతయు నడిచే మార్గంపైననే కేంద్రీకరించవలసి వుంటుంది. సృష్టియొక్క, సమాజము యొక్క ఉపయోగముకొరకు నదికి మనం అడ్డుకట్టలు వేసినట్లుగనే మానవుడు జీవితము భారము కాకుండా వుండడానికి, అది ఆనందమయంగా ముందుకు పోవడానికి అతడు తన వ్యవహారాలనన్నింటిని కట్టుబాటులో వుంచుకోవలసి వుంది.

ఇందుకొరకే భగవానుడు ఈ పదిహేడవ అధ్యాయంలో మనకు ఒక కార్యక్రమాన్ని ప్రసాదించాడు. జన్మ సిద్ధముగ మనము ఈ లోకంలోకి మూడు సంస్థలను వెంట తీసుకొని వచ్చాము. ఈ మూడుసంస్థల కార్యములను చక్కగ నెరవేర్చు మానవుడు తన జీవితమును సుఖమయము చేసుకోగలగడానికి గీత ఈ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసింది. అయితే ఆ మూడు సంస్థలేమిటి? అనేది ఒక ప్రశ్న.

1. మనలను గట్టిగా అంటి పెట్టుకొని యున్న ఈ శరీరము ఒక సంస్థ.

2. మన చుట్టునూ వ్యాపించియున్న ఈ విశాల బ్రహ్మాండం రెండో సంస్థ. ఈ బ్రహ్మాండంలో మనం ఒక అణువు లాంటి వారము.

3. మనము జన్మించిన ఈ సమాజము, మన జన్మకై నిరీక్షించి మనలను కన్న మన తల్లిదండ్రులు, మన సోదరీ, సోదరులు, మన ఇరుగు పొరుగు మూడవ సంస్థ.

ఈ మూడు సంస్థల నుండి మనం ఉపకారాన్ని పొందాము. పొందుతున్నాము. ఈ విధంగా ఈ మూడుసంస్థలు మనవలన కొంతవరకు అరుగుదలను (జీర్ణించిపోవడం) పొందుతున్నది. మనవలన ఈ సంస్థలకు కలుగుతున్న లోటును పూర్తిచేయుటకు మనము సతతము ప్రయత్నించవలసి వుంది. దాని ద్వారా జీవితాన్ని సఫల మొనర్చుకొనవలెనని మనలను గీతకోరుచున్నది. జన్మసిద్ధముగ మనకీ సంస్థల యెడల యేర్పడిన ఈ కర్తవ్యమును మనము నిరహంకారభావముతో నెరవేర్చవలసి వుంది.

ఈ కర్తవ్యములను మనము పూర్తిగా నెరవేర్చవలెననిన దీనికొక ప్రణాళిక వుండవలెను. అది ఎట్లుండవలెను. యజ్ఞం -దానం- తపస్సులతో కూడుకొన్నదై యుండవలెను. ఈ మూడింటి సంయోగము వలననే ఒక కార్య ప్రణాళిక రూపొందుతుంది. యజ్ఞము- దానము- తపస్సు అను ఈ మూడుశబ్దాలు మనకు సుపరిచితమైనవే, అయినను వీటి అర్థము మనకు బాగుగా తెలియదు. మనము వీటి అర్థాన్ని తెలుసుకొని వీటిని ఆ ప్రకారంగా మన నిత్యజీవితంలో ఆచరణలో పెట్టినచో ఈ సంస్థలు సఫలీకృతములు అవుతాయి. మన జీవితాలు కూడా నిర్లిప్తములు, ప్రసన్నములు అవుతాయి. దానిని తెలియజేయునదియే ఈ "శ్రద్ధాత్రయ విభాగ యోగము" ఈ అధ్యాయమునందు మొత్తం 28 శ్లోకాలున్నాయి. ఇందులోని ప్రధాన విషయాలు.

1. మూడు విధములైన శ్రద్ధను గురించిన విషయము *(1నుండి 3వ శ్లోకం వరకు)*
2. మూడు విధములైన ఆరాధనలు శాస్త్రవిరుద్ధమైన తపస్సు*(4నుండి 6వ శ్లోకంవరకు)*
3. మూడు విధములైన ఆహారాలు *(7వ శ్లోకం నుండి 14వ శ్లోకం వరకు)*
4. మూడువిధములైన యజ్ఞములు *(11వ శ్లోకం నుండి 13వ శ్లోకం వరకు)*
5. మూడు విధములైన తపస్సు *(14 నుండి19వ శ్లోకం వరకు)*
6. మూడు విధములైన దానము *(20నుండి 22వ శ్లోకం వరకు)*
7. ఓం తత్ సత్ అను మంత్రమునకు వ్యాఖ్య *( 23 నుండి 27వ శ్లోకము వరకు)*
8. అశ్రద్ధతో చేయు కార్యము యొక్క ఫలితము *(28వ శ్లోకం)*

వెనుకటి అధ్యాయము చివరి భాగంలో శాస్త్రాదేశములకు భిన్నంగా ప్రవర్తించకూడదని, దానినుల్లంఘించి విచ్చల విడిగ ప్రవర్తించినచో మోక్ష సిద్ధి లభించదని భగవానుడు తెలుపగా వాటిని వినినపుడు అర్జునుని మనస్సులో సంశయమేర్పడింది.

యెవరైన అజ్ఞానమువలన గాని లేక మరొక కారణము వలన గాని శాస్త్రవిధిని వదిలేసి, శ్రద్ధతో కూడుకొన్న వారై పూజాయజ్ఞాలు ఆచరించిన అట్టివారి పరిస్థితి ఏ విధంగా వుంటుంది? వారి ప్రవర్తన సత్వగుణ సంబంధమై వుంటుందా? లేక రజోగుణమా? అట్లుకాక పోయిన తమోగుణము క్రింద లెక్కకట్టబడుతుందా? అనేమీమాంసతో తన సంశయాన్ని తీర్చుకొనడానికై ఈ విధంగా అర్జునుడు శ్రీకృష్ణుణ్ణి ప్రశ్నిస్తాడు.

యే శాస్త్రవిధి ముత్సృజ్య
యజన్తే శ్రద్ధయాన్వితాః
తేషాం నిష్ఠా తు కా కృష్ణః
సత్త్వ మాహో రజస్తమః శ్లో - 1

కృష్ణా!
శాస్త్రవిధిని అనుసరించి
యజ్ఞకార్యాలు నిర్వహించక
వాటి పట్ల శ్రద్ధాసక్తులు లేక
పోయినా భక్తితో దేవతారాధన
మాత్రమే చేయువారి యొక్క నిష్ఠ
సాత్వికమా! రాజసమా? తామసమా?

అర్జునుని ఈ ప్రశ్నకు భగవానుడు సమాధాన మిచ్చుచున్నాడు

త్రివిధా భవతి శ్రద్ధా
దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీ చైవ
తామసీ చేతి తాం శృణు శ్లో - 2

అర్జునా!
మనుష్యుల యొక్క స్వభావము
చేత జనించిన అశ్రద్ధ మూడు
విధములు, అది సాత్వికం, రాజసం
తామసంగా గుర్తించబడ్డాయి

సత్త్వానురూపా సర్వస్య
శ్రద్ధాభవతి భారతః
శ్రద్ధామయో యం పురుషో
యో యత్ శ్రద్ధస్స ఏవ సంః శ్లో - 3

మానవుని స్వభావము
అతని విశ్వాసాన్ని బట్టి
వుంటుంది, సాధారణంగా
మనిషి శ్రద్ధామయుడు కనుక
అతనిలోగల శ్రద్ధను బట్టి
అతని గుణము ఏర్పడుతుంది

యజంతే సాత్త్వికా దేవాన్
యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే
యజంతే తామసా జనాః శ్లో - 4

సత్వగుణ ప్రధానులు
దేవతలను ఆరాధిస్తారు
రజోగుణ ప్రధానులు యక్షులను
రాక్షసులను పూజిస్తారు
తమోగుణ ప్రధానులుభూత
ప్రేత, పిశాచాలను ఆరాధిస్తారు

అశాస్త్రవిహితం ఘోరం
తప్యన్తే యే తపోజనాః
దంభాహంకారసంయుక్తాః
కామరాగబలాన్వితాః శ్లో - 5

కర్శయంతశ్శరీరస్థం
భూతగ్రామ మచేతసః
మాం చైవాంతశ్శరీరస్థం
తాన్ విద్ధ్యాసుర నిశ్చయాన్ శ్లో - 6

అహంకారముతో, దంభంతో
కోర్కెలతో, స్వార్థముతో
శాస్త్ర సమ్మతం కాని అనేక
తపస్సులను కొందరు చేస్తుంటారు
అవివేకంతో అట్టివారు తమ
శరీరాలలోని జ్ఞానేంద్రియములను
పరమాత్మగా వున్న నన్నును
కృశింపజేస్తుంటారు
అసుర గుణములు కలవారంటే
అట్టి వారే నని గ్రహించుము

పిమ్మట భగవానుడు మూడువిధాలైన ఆహార- విహారాలు యజ్ఞము- దానము- తపస్సులను గూర్చి ప్రకటిస్తున్నాడు.

ఆహారస్త్వపి సర్వస్య
త్రివిధో భవతి ప్రియః
యజ్ఞస్తపస్తథా దానం
తేషాం భేదమిమం శృణు శ్లో - 7

గుణములను బట్టి శ్రద్ధమూడు విధములుగ వున్నట్లే ఆహారవిహారాలు కూడా మూడు విధములుగ వున్నవి. అదే విధముగ యజ్ఞము- తపస్సు- దానము కూడా మూడు విధములుగనున్నవి, వీటికి గలభేదములెట్టివో ఆలకించుము

ఆయుస్సత్త్వబలారోగ్య
సుఖప్రీతివివర్ధనాః
రస్యాఃస్నిగ్ధాఃస్థిరాహృద్యా
ఆహారాస్సాత్త్విక ప్రియాః శ్లో -8

సాత్వికులైన వారికి ప్రియమైన ఆహారము సాత్వికాహారము, దాని నుండి ఆయుర్వృద్ధి, శరీరానికి బలము ఆరోగ్యము, సంతోషము, మనస్సు నందు సద్భావనము కలుగుతుంది

కట్వామ్లలవణాత్యుష్ణ
తీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారా రాజసస్యేష్టా
దుఃఖశోకామయ ప్రదాః శ్లో - 9

చేదు, పులుపు, ఉప్పు, కారం వున్న ఆహారం వేడి చేయునవిగా వుండును, ఇవి సారహీనమై వుండి ఎక్కువ దాహాన్ని కలుగజేయునదిగాను, శరీరానికి శ్రమ కలిగించేదిగాను దుఃఖమును కలుగజేస్తుంటుంది. ఇది రజోగుణములుగల వారికి ప్రియమైన ఆహారం

యాతయామం గతరసం
పూతిపర్యుషితం చ యత్
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం
భోజనం తామసప్రియమ్ శ్లో - 10

వండిన పిదప ఒక జామునిలువ వున్నట్టిదియును ఇతరులు తినగా మిగిలియున్నట్టిదియును అయిన ఆహారము దుర్గంధముతో రసహీనమై యుండును, పూజార్హం కాని ఈ ఆహారము తమోగుణముగల వారికి ప్రియమైనట్టిది, ఎక్కువవేడి గలవి రజోగుణానికి, ఎక్కువ చల్లని పదార్థములు తమోగుణానికి ప్రాతినిధ్యం వహిస్తాయి అని గ్రహించుము

అఫలాకాంక్షిభి ర్యజ్ఞో
విధిదృష్టో య ఇజ్యతే
యష్టవ్యమే వేతి మనః
సమాధాయ స సాత్త్వికః శ్లో - 11

ఫలాపేక్ష రహితంగా శాస్త్రోక్తమైన రీతిలో ధర్మచింతనతో చేసే ఆరాధన (యజ్ఞము) సాత్వికమైనది అవుతుంది

అభిసంధాయ తు ఫలం
దంబార్థమపి చైవ యత్
ఇజ్యతే భరత శ్రేష్ఠ!
తం యజ్ఞం విద్ధి రాజసమ్ శ్లో - 12

అర్జునా!
ఏ ఆరాధనను ప్రతిఫలవాంఛతోను
కీర్తికాంక్షతోను, ఆడంబరంతో
చేస్తారో దానిని రాజస యజ్ఞం అని అందురు

విధిహీన మసృష్టాన్నం
మంత్రహీన మదక్షిణం
శ్రద్ధావిరహితం యజ్ఞం
తామసం పరిచక్షతే శ్లో - 13

శాస్త్రం అంగీకరించని
అన్న ప్రధానము లేని
దాన దక్షిణలు లేని
భక్తి శ్రద్ధలు లేని
ఆరాధన (యజ్ఞము)
తామస యజ్ఞం
అనబడుతుంది

అన్నదానము, వేదపఠనం, దక్షిణలు ప్రతి యజ్ఞములోను, దైవకార్యములోను సాంప్రదాయికంగా వస్తున్నాయి. వీటిని వదలిపెట్టడం తామసికము అని శాస్త్రాలు తెలియజేస్తున్నాయి.

దేవద్విజగురు ప్రాజ్ఞ
పూజనం శౌచ మార్జవం
బ్రహ్మచర్య మహింసా చ
శారీరం తప ఉచ్యతే శ్లో- 14

దేవతలను, బ్రహ్మవేత్తలను
గురువులను, జ్ఞానులను
పూజించడం, స్నానమువలన
శరీరాన్ని శుద్ధిగావించుకొని
సత్యం, దయాగుణాలచేత
హృదయాన్ని వినిర్మలం చేసుకొని
సత్ప్రవర్తన, బ్రహ్మచర్యం, అహింస
వంటివి శరీర ధర్మాలని చెప్పబడుతున్నది

అనుద్వేగకరం వాక్యం
సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ
వాఙ్మయం తప ఉచ్యతే శ్లో - 15

ఇతరులకు బాధను కలిగించే
మాటలను మాట్లాడకపోవడం
సత్యాన్ని మాత్రమే వచించడం,
వినేవారికి హితంగాను, ప్రియంగాను
వుండునట్లు భాషించడం, అధ్యయనం
చేయడం లాంటి, వాటిని వాక్తపస్సు,
వాంఙ్మయ తపస్సు అని
తెలియజేయబడింది

ఇది చక్కటి సందేశము. వాక్స్వాతంత్రానికిది సరైన నిదర్శనము. అవసరముంటేనే తప్ప లేకపోతే మాట్లాడకూడదు. చెబుతున్నది సత్యమే కదా! అని ఆ సత్యాన్ని కఠినంగా తెలిపి ఇతరుల మనస్సును బాధించరాదు. వాక్స్వాతంత్ర్యము అంటే ఇష్టమువచ్చినటుల మాట్లాడడం కాదు. నాలుకను అదుపులో వుంచుకోవడం నిగ్రహానికి ఇది మొదటి ప్రయత్నం.

మనః ప్రసాదస్సౌమ్యత్వం
మౌనమాత్మవినిగ్రహః
భావసంశుద్ధిరిత్యేతత్
తపోమానస ముచ్యతే శ్లో - 16

ప్రసన్నమైన మనస్సును
శాంతస్వభావమున్ను
మౌనము, ఆత్మనిగ్రహమును
అంతఃకరణ శుద్ధిని కలిగి
యుండడాన్ని మానసిక
తపస్సు అని చెబుతున్నారు

శ్రద్ధయా పరయా తప్తం
తపస్తత్త్రివిధం నరైః
అఫలాకాంక్షిభిర్యుక్తైః
సాత్త్వికం పరిచక్షతే శ్లో - 17

ఫలాపేక్షలేనివాడును
ఈ లోకమునందుగాని, స్వర్గ
లోకమునందుగాని సుఖములను
అపేక్షింపక ఆత్మపై దృష్టిని
నిలిపిచేసే సాధకులను సాత్విక
తపస్సు చేయబడువారు అనబడుచున్నారు

సత్కార మానపూజార్థం
తపో దంభేన చైవ యత్
క్రియతే తదిహ ప్రోక్తం
రాజసం చల మధ్రువం శ్లో - 18

సమాజములో తనకు గౌరవ
ప్రతిష్ఠలు, కీర్తికలగాలని
ఇతరులు తనను పొగుడుతూ
ఆరాధించాలని చేసే వాని
తపస్సులో అహంకారం, స్వార్థం
ఇమిడి వున్నాయి, ఇది రాజసిక తపస్సు

[illegible]
[illegible]
[illegible]
[illegible]

మూర్ఖపు పట్టుదలతో
శరీరాన్ని కష్టపెడుతూ
ఇతరులకు హానికలిగించే
ఉద్దేశంతోను చేసే తపస్సు
తామసిక తపస్సు అన
బడుతున్నది

దాతవ్య మితి యద్దానం
దీయతేనుపకారిణే
దేశే కాలే చ పాత్రే చ
తద్దానం సాత్త్వికం స్మృతం శ్లో - 20

ఎవరికి, ఎప్పుడు, ఎందుకు
దానము చేయాలో తెలుసుకుని
చేసేదానాలు, ప్రతిఫలాన్ని
ఆశించకుండా చేసే దానాలు
సాత్విక దానాలుగా పరిగణింప
బడుతున్నాయి

యత్తు ప్రత్యుపకారార్థం
ఫల ముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం
తద్దానం రాజసం స్మృతం శ్లో - 21

ప్రతిఫలాన్ని లేదా కీర్తిని
ఆశించి చేసే దానము, అయిష్టంగా
ఇచ్చే వితరణను రాజసిక
దానము అని అంటున్నారు

అదేశకాలే యద్దానం
అపాత్రేభ్యశ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతం
తత్తామసముదాహృతం     శ్లో - 22

యోగ్యమైన కాలంలో, యోగ్యులైన.
వారికి, యోగ్యమైన స్థలంలో
ఇవ్వబడిన దానం, తీసుకునే
వ్యక్తి అయిష్టంగా గ్రహించినా
ఆ దానం తామసిక దానం అవుతుంది

ఓం తత్స దితి నిర్దేశో
బ్రహ్మణ స్త్రివిధః స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ
యజ్ఞాశ్చ విహితాః పురా     శ్లో- 23

పరబ్రహ్మకు
ఓం తత్ -సత్
అను శబ్దాలు సంకేతాలు
దానివలననే ప్రాచీన
కాలంలో బ్రాహ్మణాలు
వేదాలు, యజ్ఞాలు ఏర్పడ్డాయి

తస్మా దోమిత్యుదాహృత్య
యజ్ఞదానతపః క్రియాః
ప్రవర్తంతే విధానోక్తాః
సతతం బ్రహ్మవాదినామ్     శ్లో- 24

యజ్ఞాలు, దానాలు, తపస్సు
ఏవిచేసినా వాటిలో "ఓం" అను
ప్రణవమును చేర్చి చేయడం
వలన ఆయా క్రియలకు దోషపరిహారం
జరుగుతుంది, అదే విధంగా చివరగా
ప్రణవోపాసన చేయడం వలన
పూర్ణఫలితం లభిస్తుంది



[illegible]
[illegible]
[illegible]
[illegible] శ్లో - 25

మోక్షకాంక్ష కలవారు
అంటే స్వర్గం పై కాంక్షలేనివారు
యజ్ఞము, తపస్సు, దానం
యొక్క ఫలాలను అపేక్షింపక
"ఓం తత్సత్" మంత్రంలోని "తత్"
ధ్యానములో వుండుట వలన మోక్ష
పదవికి అర్హులయ్యెదరు

సద్భావే సాధుభావే చ
సదిత్యేతత్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా
సచ్ఛబ్దః పార్థ యుజ్యతే శ్లో - 26

"సత్"అను శబ్దం పరబ్రహ్మ
నిత్యమైంది, సత్యమైంది
అని తెలుపుతుంది. అట్లాగే
ఉత్కృష్టమైన కార్యాలను
సత్కార్యాలనీ అంటే విశ్వ
శ్రేయస్సును కాంక్షించి చేసే
కార్యాలుగా చెప్పబడుతున్నాయి

యజ్ఞే తపసి దానే చ
స్థితిస్సదితి చోచ్యతే
కర్మ చైవ తదర్థీయం
స దిత్యేవాభిధీయతే శ్లో - 27

యజ్ఞము, తపస్సు, దానం
చేయాలనే కోర్కె కలిగి దానికి
అంకితం కావడానికి "సత్"
క్రియ పరబ్రహ్మను(తత్)
సమర్థిస్తూ చేసే యోగసాధనను
"ఓం తత్సత్" అని పిలువ
బడుచున్నవి

అశ్రద్ధయా హుతం దత్తం
తపస్తప్తం కృతం చ యత్
అసదిత్యుచ్యతే పార్థ!
న చ తత్ప్రేత్యనో ఇహ                శ్లో - 28

అర్జునా!
శ్రద్ధలేకుండా ఎన్ని యజ్ఞాలు
తపస్సులు- దానాలు చేసినా
ఒకవేళ అవి సత్కర్మలైనప్పటికీ
అవి "అసత్" ఫలాలు అవుతాయి
అవి నిరుపయోగమైనవి, వాటివలన
ఇహానికిగాని, పరానికిగాని ప్రయోజనం
వుండదు

ఇట్లు భగవద్గీత "ఓం తత్సత్" అను వైదిక మంత్రంతో మన సమస్త కర్మలను ఈశ్వరార్పణ చేయు విధానమును గూర్చి తెలుపుతున్నది. తొమ్మిదవ అధ్యాయములో కర్మల నన్నింటిని ఈశ్వరార్పణ చేయు విషయము గూర్చి "యత్కరోషియదశ్నాపి" అను శ్లోకంలో తెలుపబడింది ఈ విషయమే. ఆ విషయమే ఇక్కడ మరల ఈ పదునేడవ అధ్యాయములో వివరించబడింది. పరమేశ్వరునకర్పింపబడు కర్మలు సాత్వికముగ వుండవలెను. అప్పుడే అవి ఈశ్వరునకు అర్పింపబడగలవు. ఈ విషయమే ఈ అధ్యాయంలో ముఖ్యముగా చెప్పబడింది.

ఈ విధంగా ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాద రూపమును అయిన
శ్రీమద్భగవద్గీత యందలి శ్రద్ధాత్రయ విభాగయోగమను పేరుగల
పదునేడవ అధ్యాయము సమాప్తం గావించబడింది.



# గీతా సంహిత

**అధ్యాయము పదుఎనిమిది** | **మోక్షసన్న్యాస యోగము**

"కర్మ సాత్వికము అని - రాజసము అని- తామసము" అని మూడు విధములు. మానవుని జీవితము, మనుగడ ఈ మూడింటిపైనే ఆధారపడి వుంది. ఈ మూడింటిలో రాజసమును, తామసమును త్యజించి సాత్వికమును గ్రహించవలెనని ఇంతకు ముందటి అన్ని అధ్యాయాల ద్వారా గ్రహించాము. అయితే పదునేడవ అధ్యాయములో ఈ విషయమే మరొకరీతిగా తెలుపబడింది. అది "యజ్ఞం- దానం- తపస్సు" అని. యజ్ఞ మనునది జీవితము యొక్క సారము. యజ్ఞమునకు ఉపకరించు ఆహారాది కర్మలకు సాత్విక రూపమును, యజ్ఞరూపమును పొందించి గ్రహించవలెననియు, యజ్ఞరూపము, సాత్వికము అయిన కర్మనే స్వీకరించుచూ మిగిలిన కర్మలనన్నింటిని త్యజించుట ఉచిత మనియు సూచనగా పదిహేడవ అధ్యాయంలో మనం తెలుసుకున్నాము. "ఓం తత్సత్" మంత్రమును ఎందుకు నిరంతరం స్మరింపవలెనో తెలుసుకున్నాము. "ఓం" అనగా సాతత్యము అని "తత్" అనగా నిర్లిప్తము అని, "సత్" అనగా సాత్వీకమని గ్రహించవలసివుంది. అంటే మానవుని సాధనలో సాతత్యము- నిర్లిప్తత- సాత్వికత వుండాలన్నది దాని భావన, అప్పుడే సాధన ఈశ్వరార్పణము అవుతుంది. దానిని బట్టి స్పష్టమౌతున్నది ఏమిటంటే కొన్ని కర్మలు చేయదగినవి, కొన్ని కర్మలు త్యజించదగినవి అని భావించవలెను.

గీతబోధనను ఆదినుంచి గీతపదిహేడు అధ్యాయముల వరకు మొత్తాన్ని పరిశీలించి చూచిన ఎడల కర్మను త్యాగము చేయవలదనియు, కర్మయొక్క ఫలాలను త్యాగము

చేయమని అడుగడుగున బోధిస్తున్నది . కర్మను నిరంతరము చేయుమనియు, కర్మయొక్క ఫలమును మాత్రము త్యజించుమనియు అనునది దీని అర్థము. ఎక్కడ చూచినను గీతలో ఇదే శిక్షణ అగుపిస్తున్నది.

ఇంతవరకు గీతలో ఇదొక దృష్టి, అయితే ఈ పద్దెనిమిదవ అధ్యాయము వేరొక దృష్టిని మనకు ప్రసాదిస్తున్నది. కొన్ని కర్మలు చేవలసినవి అని- కొన్ని కర్మలు చేయగూడనివి అనునది ఆ దృష్టి. అందువలననే ఈపదునెనిమిదవ అధ్యాయం ప్రారంభములో చేయవలసిన కర్మలను, చేయగూడని కర్మల గురించి అర్జునుడు ప్రశ్నిస్తాడు.

"ఒకవైపున ఫలత్యాగపూర్వకముగ కర్మలనన్నింటినీ చేయవలెనని రెండవ వైపున కొన్ని కర్మలను విధిగా త్యజింపవలెనని, ఆ విధంగా కొన్ని మాత్రమే చేయదగినవి అయినపుడు చేయదగిన వాటికీ, చేయకూడని వాటికీ మధ్యగల తేడా ఏమిటి? ఆ రెండింటిమధ్య సామరస్యమునకు ఆస్కారంలేదా? అను మార్గమును తెలుసుకొనుటకై ఫలత్యాగము యొక్క రహస్యమును గ్రహించుటకునూ ఈ ప్రశ్నవేయబడింది. శాస్త్రమును బట్టి "సన్యాసమనగా" సర్వకర్మలను పరిత్యజించుట, గీతలోని ఫలత్యాగమును సాధించుటకు ప్రతికర్మను త్యజించుట అవసరమా? అనునదే ఇపుడు మన ముందున్న ప్రశ్న. ఫలత్యాగమను లక్ష్యమును చేరుటకు సన్యాసము ఏమైనా వుపకరించునా? "సన్యాసము-ఫలత్యాగము" ఈ రెండింటి యొక్క హద్దులేవి? హద్దులనునవి వుంటే అవి ఎంతవరకు. అనునదే ఇక్కడ అర్జునుని ప్రశ్న. ఈ అధ్యాయములో మొత్తం 78 శ్లోకాలున్నాయి.

ఈ అధ్యాయము గురించి మహర్షి మలయాళ స్వాములవారి అభిప్రాయము ఈ క్రింది విధముగా వుంది.

ఈ అధ్యాయమునకు "మోక్షసన్యాసయోగ"మనిపేరు. మోక్షము కొరకు సన్న్యసించవలెనని సామాన్యార్థము. మోక్షమును గూడ సన్న్యసించవలెనని మఱియొకయర్థము గలదు. విశేషార్థము॥ సన్న్యసించుట యనగా సమస్తమును త్యాగము చేయుట యని అర్థము.

దీనిని కర్మత్యాగము కాదనియు, కర్మఫలత్యాగమనియు కొందరర్థము చెప్పుదురు. సర్వసంగమును త్యజించిత్యాగియైయుండుటయే నిజమైన యర్థమగును. కర్మఫలత్యాగమే అర్థమైనచో శ్రీకృష్ణముఖారవిందమునుండి వేరులో అనగా సాక్షాత్తుగా గీతశ్రవణము చేసిన అర్జునుడును ధర్మరాజాదులును జీవితాంతము వరకు గృహస్థాశ్రమమందుండి కర్మల చేయుచు ఫలత్యాగమును జేయవలసియుందురు. శ్రీ మహాభారతమున మహాప్రస్థాన పర్వమునందు పాండవులైదుగురును, ద్రౌపతియు సమస్తమును త్యజించి సాధువేషములను ధరించి,యింద్ర ప్రస్థమును వదలిపోయినట్లు గనబడుచున్నది. ఇందువలన సర్వసంగ పరిత్యాగమే యథార్థమైన యర్థమగును. ఆత్మశుద్ధి గలుగు వరకు సత్కర్మలనాచరించి ఫలత్యాగము చేసి ఫలము ఈశ్వరార్పణముగా జేయవలయుననియే శాస్త్రసిద్ధాంతము, అందువలన అంతఃకరణశుద్ధి గలుగును. అపుడుప్రకృతి రహితమగు జీవన్ముక్తి గలుగుటకు సర్వకర్మత్యాగమును సర్వసంగత్యాగమును జేసి యేకాంతమున తపమొనరించుచు బ్రహ్మచింతనము చేయుచు జీవన్ముక్తి పదమును పొందవలసి యుండును.

రెండవ విశేషమేమనగా మోక్షసన్న్యాసమనగా మోక్షమునుగూడ సన్న్యసించుట. ఇదివరలో 17వ అధ్యాయము వరకు 'నేను చెప్పినట్లు చేసినచో మోక్షము నిచ్చెదనని' చెప్పుచు వచ్చి యిక్కడ "ఏ మోక్షము నిచ్చెదనని చెప్పితినో, దానిని కూడ విడిచిపెట్టుము" అనెనని యొక యర్థము గలదు. అనగా 17వ అధ్యాయమువరకు చెప్పిన విధులన్నియు ననుష్ఠించుచు వచ్చిన ముక్తుడగును. అందువలన మరల మోక్షము కావలెనను భావముండదు, లేక పరమభక్తితో గూడిన యుపాసనా పద్ధతి ననుసరించి చూచిన, ఒకనికి గొప్ప యధికారముగల యొక పరమ ఆప్తుడుండెను. పై జెప్పిన వానికొక యాపత్తుగలిగెను. దానియొక్క నివృత్తికొరకున్న వున్నతోద్యోగి యగు తన పరమ ఆప్తుని దగ్గరకు వెళ్లి చెప్పగా ఆ కార్యము నేను చక్కబరచెదను. నీకిక ఆ తలంపే యక్కర లేదని చెప్పునట్లు 17అధ్యాయముల వరకు చెప్పిన అనుష్ఠానములు చేయుచు వచ్చినచొ, భగవంతుడు తప్పక మోక్షమును గలుగజేయును. అందువలన మోక్షమును గూడ త్యజింపుమని మిక్కిలి వాత్సల్యముతో జెప్పెనని గ్రహించదగును.

ఇక ప్రత్యధ్యాయాంతమున శ్రీ మద్భగవద్గీతను ఉపనిషత్తు అనియుండుట వలన ఉపనిషచ్ఛబ్దమునకు వేదాంతముయొక్క యంత్యమే యర్థమగును. ఆ యుపనిషత్తులు బ్రహ్మమును గురించియే చెప్పుచున్నవి వాటిలో గీతయందు రెండో అధ్యాయములో చెప్పినట్లు ఆత్మయేకాలమందైనను జన్మమెత్తుట గాని, కర్మచేయుటగాని, కర్మఫలము ననుభవించుటగా నిలేదనియు, నా యాత్మ యెల్లప్పుడును బ్రహ్మమయముగా నుంటున్నదనియు, నీ జననాది కార్యములన్నియు మాయ వలన తోచుచున్నవేగాని వాస్తవముగా లేవనియు నీవు సదా ముక్తుడవై యున్నావు. కావున మోక్షమును పొందవలయునని కోరుట భ్రాంతియే. కావున అట్టి సంకల్పమును గూడవిడిచిపెట్టమనియు గలదు. ఇదే ఉపనిషత్తు యొక్క నిజార్థమగును. రోగముతో గూడిన వారికి రోగవిమోచనకార్యము చేయవలసియుండును. ఋణస్థుడైనవానికి ఋణవిమోచనకార్యము చేయవలసి వుండును. బంధింపబడినవానికి బంధవిమోచన కార్యము చేయవలసి యుండును. కారాగృహనిబద్ధుడైన వానికి దాని నుండి విమోచనమగు మార్గము చేయవలసి యుండును. అట్లే పై చెప్పిన రోగము, ఋణము, బంధము, కారాగృహవాసము లేనివానికి మరల వాటినుండి విమోచన కాంక్షియేల కలగవలయును? అయితే పై చెప్పిన యీ నాల్గు వాక్యములను బహుజనులచే వినిగాని లేక ప్రతికలలో పుస్తకములలో చదివిగాని యుండినందుచే పై చెప్పిన నాల్గు దోషములు లేని వాడై యుండియు కలలో నీ నాల్గుగుణములు తనకు గల్గినట్లు ఒకనికి తోచెననుకొనుడు. జాగ్రదవస్థలోనికి వచ్చిన పిమ్మట ఆ స్వప్నదోషము ఎట్లు మిథ్యయను దృఢభావము గలుగునో, ఆత్మయొక్క నిజావస్థయు అటువంటిదే. కావున మోక్షమును కోరుటయనునదికూడ పరమార్థదశయందు లేదు. కావున మోక్షమును గూడసన్న్యసింపుమని యుభయరూపమునగాని లేక నిజతత్వార్థబోధమునగాని శ్రీకృష్ణభగవానుడుపదేశించినట్లు గ్రహించవలెను.

శ్లో ॥ న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో నచ సాధకః
న ముముక్షుర్నవై ముక్తఇత్యేషా పరమార్థతా

పరమార్థదశలో నిరోధముగాని, యుత్పత్తిగాని, బద్ధుడుగాని, సాధకుడుగాని ముముక్షువనిగాని లేవు. ఆత్మ నిత్యముక్తస్వరూపమని యుపనిషత్తు, మరియు ఈ 18వ అధ్యాయమిదివరలో చెప్పినవాటియన్నటి యొక్క సంగ్రహ సారమగును. ఇంతేగాక యిదివరలో 17వ అధ్యాయము వరకుపదేశించనవాటిలో నెచటెచట నేదేది కొరత పడియుండునో, అది యీ యధ్యాయమందు పూర్తిచేయబడుచున్నది. కావున నీ అధ్యాయము గీతయొక్క సంగ్రహమగును. ఇది చాల అగాధార్థములతో గూడినది. ఈ అధ్యాయమున 66వ శ్లోకమునందు "సర్వధర్మాన్‌పరిత్యజ్య" అని చరమశ్లోకమున్నది. ఈ శ్లోకమున ఋష్యాదిన్యాసములో చెప్పబడిన "సర్వధర్మా న్పరిత్యజ్యమామేకం శరణం వ్రజేతిశక్తిః" అని శక్తియు, "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ఇతి కీలకం" అని కీలకమును నిర్దేశింపబడియున్నవి. అనగా గీతయొక్క సర్వశక్తియు, గీతాశాస్త్రము యొక్క కీలకము అనగా రహస్యమును, ఈ శ్లోకమునందు కలదు. కీలకమనగా ఒక యంత్రము నడుపుటకు గల మరకుపేరు. గీతారథముయొక్క యంత్రమునకు నీ శ్లోకమునందు చెప్పినదే కీలకమగును. యంత్రము నడుపుట కేమర త్రిప్పవలెనో తెలియని వానికి మోటారు కారు, విమానము దొరికిన నెట్లుపయోగములేదో, అట్లే యీ శ్లోకములో చెప్పబడిన కీలకము తెలియకపోయినచో ప్రయోజనము లేదు. అట్టివాడు జీవన్ముక్తిని లేక భగవత్ప్రాప్తిని లేక మోక్షమును పొందజాలడు. కావున కీలకమంతయు దీనియందే గలదు. ఈ కీలకము గొప్పయనుభవజ్ఞానులు, బ్రహ్మనిష్ఠులు మహనీయులు నగు వారివలననే తెలిసికొనవలసి యుండును. రెండవ అధ్యాయము 11వశ్లోకము గీతారత్నహారమునకు మొదటిదనియు, 9వ అధ్యాయము 22వశ్లోక మీహారమునకు మధ్యనుండు నాయకమణియనియు, ఈ 18వ అధ్యాయమున66వ శ్లోకము ఈ గీతాభరణమునకు అంత్యమున నుండు మణియనియు గ్రహించుకొవలెను. 18అధ్యాయములలో 9వ అధ్యాయము మధ్య నుండుటవలన 22వ శ్లోకము మధ్యనుండు నాయకమణిగా వర్ణించడమైనది. 2వ అధ్యాయము 11వ శ్లోకము ఋష్యాదిన్యాసములో బీజముగా నిరూపించడమైనది. 9వ అధ్యాయము 22వ శ్లోకము వచ్చునప్పటికి గీతాకల్పవృక్షము

బాగుగా వృద్ధినొంది, ఫలపల్లవ పుష్ప లతాదులచే శోభాయమానమై వృద్ధినొందెను. ఇప్పుడీయధ్యాయమున 66వ శ్లోకము వచ్చునప్పటికి గీతాకల్పవృక్షములోని ఫలములు పరిపక్వములైనవి అనగా పండినవి. ఈ ఫలములనే ముక్తులు బ్రహ్మానంద రసముతో ననుభవించుచున్నారు.

ఇక సర్వసంగ పరిత్యాగమే గీతయొక్క యంత్యోపదేశమని చెప్పినదానికి, మహాభారతము మహాప్రస్థానిక పర్వమందు చెప్పినది చూడుడు

"శిష్యం పరీక్షితం తస్మై దదౌ భరతసత్తమ!।
తతస్తు ప్రకృతీస్సర్వాః సమానాయ్య యుధిష్ఠిరః ॥
సర్వమాచష్ట రాజర్షిః చికీర్షిత మథాత్మనః।
తే శ్రుత్వైవ వచస్తస్య పౌరజానపదా జనాః॥
భృశముద్విగ్నమనసో నాభ్యనన్దన్త తద్వచః ।
నైవ కర్తవ్యమితి తే తదోచుస్తుం నరాధిపమ్ ॥
న చ రాజా తథాకార్షీత్ కాలపర్యాయధర్మవిత్ ।
తతోనుమాన్యధర్మాత్మా పౌరజానపదం జనమ్ ॥
గమనాయ మతిం చక్రే.................।
తత స్స రాజా కౌరవ్యో ధర్మపుత్రో యుధిష్ఠరః ।
ఉత్సృజ్యాభరణాన్యంగాజ్జగృహే వల్కలాన్యుత ।
భీమార్జునయమాశ్చైవ ద్రౌపదీ చ యశస్వినీ ॥
తథైవ జగృహుః సర్వే వల్కలాని నరాధిప!
విధివత్కారయిత్వేష్టిం నైష్ఠికీం భరతర్షభ! ॥
సముత్సృజ్యా ప్సుర్వేగ్నీన్ ప్రతస్థుర్నరపుంగవాః ।
భ్రాతరః పంచ కృష్ణా చ షష్ఠీ శ్వాచైవ సప్తమః ॥

వ॥ శేషించిన కాంచనరత్నాదులాక్షితిపతి పరీక్షుతునకు బరమాదరంబున సమర్పించి యతనిం గృపాచార్యునకు శిష్యుంగా నప్పగించి పౌరజానపద ప్రవరజనంబుల రావించి.

సీ॥ ఆ పార్థపౌత్రునిజూపి మాయేవుర- మాఱుగా మీరిక్కుమారవరుని గైగొని తగనెల్ల కార్యజాతంబు- నడపుచు ననురక్తి నాడునాటి కెక్కుడగుచుండ నీతనియుల్లంబు-రంజిల్ల సమ్యగారాధనంబునందుసం ప్రవణుల రగుడయ్య యని పల్కి- తమనిశ్చయంబునుదాత్తభంగి

తే॥ జెప్పుటయు వారు మొగములు చిన్నబోవ
మమునుపేక్షించి యిటు సేత సముచితంబె
నీదు చిత్తంబు కారుణ్య నిలయ! మేము
దరతరంబ యాశ్రితులము ధర్మశీల!

వ॥ అనిగద్గదకంఠులగుచు నాడిన మాటలకు నమ్మనుజేంద్రుడు దగు తెఱంగున మఱుమాటలాడి తమ గమనంబునకు నజ్జనంబుల నియ్యకొల్పెనప్పుడందు లోనం గొందరనివేశనంబు లధికాభిలాషంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన సహదేవుండు, గలియుగంబు ప్రవేశించుటంజేసి కాదే యిట్టివి పెట్టుదునని తలంచి నవ్వి, నరనాథునకుం జెప్పిన నప్పౌరవోత్తముండు నవ్వుచు మన మనువులు చాలునని పలికి సర్వాభరణంబులునూడ్చి వల్కలాజి నంబులు ధరియించినందమ్ములు, ద్రౌపదియు నట్లజేసిరందఱుం దత్కాలోచితంబులగు నిష్ఠావిధానంబులాచరించి యగ్నులనంబుగతంబులు జేసి మొగంబులం తెలివగ్గలింప గృహంబు వెలువడిరప్పుడు ద్రౌపది షష్ఠత్వనిష్ఠంబోవ సప్తమంబై యొక్క సారమేయంబు వారల వెనుకజనియె నప్పుడు "దీనిచే సర్వసంగ పరిత్యాగరూపమైన సన్న్యాసమే గీతా తాత్పర్యమని తేలుచున్నది."

శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాముల వారి అభిప్రాయము ఈ విధంగా వుంది.

'మోక్షసన్న్యాసయోగము' (1) మోక్షమనగా విడుదల, బంధమునుండి విడుదల. సాంసారిక దుఃఖము నుండి, జనన మరణముల నుండి విడుదల. అనగా బంధవిముక్తి యని భావము. అట్టి బంధవిమోచనరూపమగు కైవల్యము (మోక్షము) త్యాగముచేతనే లభించును.

త్యాగమనినను, సన్న్యాసమనినను, రెండును ఒకటియే. త్యాగము (సన్న్యాసము) అనగా వాస్తవముగ దృశ్యభావనాపరిత్యాగము, సర్వసంగపరిత్యాగము. ప్రపంచము, దేహము,మనస్సు-ఇత్యాది సమస్తదృశ్యవస్తువులయొక్క సంగమును పరిత్యజించి మోక్షరూపుడగు భగవంతునొకరినే, ఆత్మవస్తువునొక్కదానినే శరణు బొందవలెను. దృశ్యవస్తుసంబంధమైన భావనయంతయు ఏక్షణమున మనుజుడు త్యజించివేయునో, ఆ క్షణముననే యతడు దృక్-వస్తువగు ఆత్మగనే శేషించును. అదియే మోక్షస్థితి. అనగా క్షేత్రమును త్యజించుటచే క్షేత్రజ్ఞుడు శేషించునని భావము. దృశ్యసన్న్యాసము (త్యాగము)చే దృగ్రూపమగు మోక్షము (దైవము, ఆత్మ) లభించునని యర్థము. ఈ ప్రకారముగ సన్న్యాసమువలన, త్యాగమువలన, సర్వదృశ్యవస్తు సంగపరిత్యాగమువలన మోక్షము లభించునని బోధింపబడిన అధ్యాయమగుట వలన దీనికి మోక్షసన్న్యాసయోగమను పేరు వచ్చినది.

(2) మోక్షసన్న్యాసమునకు మరియొక అర్థము- మోక్షమనగా దైవము, భగవంతుడు. సన్న్యాసమనగా సమస్తకర్మలను అర్పించుట. సమస్తకర్మలను, ఆ కర్మల యొక్క ఫలములను భగవంతునకు అర్పించుటయే మోక్షసన్న్యాసమనియు చెప్పవచ్చును.

(3) ఇంకొక అర్థము- మోక్షమును సన్న్యసించుట, వదలుట మోక్షసన్న్యాసము. ప్రతివారును మోక్షమును కోరుదురేకాని వదలరుగదాయనిన, కోరునది యెవరు? మోక్షమును కోరునది బంధముననున్నవారే. బద్ధుడే ముక్తిని కోరును. కాని గీత పదునేడధ్యాయములందు తెలుపబడిన అఖండమగు బోధను జీర్ణించుకొనినవాడిక బద్ధుడెట్లగును?అజో నిత్యశ్శాశ్వతోయం పురాణో అని నిత్యసత్యసనాతనమగు తన ఆత్మనెఱింగినవానికిక బంధమెచట? బంధమే లేనపుడిక మోక్షమునుగూర్చిన ప్రశ్నయే యెచట? కాబట్టి అట్టి ముక్తస్థితిలో జీవుడు మోక్షభావనను గూడ త్యజించివైచును, సన్న్యసించివైచును. ఏలయనిన అత్తఱి తానే మోక్షరూపుడై వెలయును. లేక, అట్టి 17వ అధ్యాయముల బోధను చక్కగ అనుభూతమొనర్చుకొనినచో భగవానుడే అతనికి మోక్షమును ప్రసాదించుదురు. కావున మోక్షమును గూర్చిన సంకల్పమే యతని కనవసరము. అత్తఱి మోక్షసంకల్పము నతడు త్యజించివేయవచ్చును. అదియే మోక్షసన్న్యాసము.

ఇంతవరకు 17అధ్యాయములందు తెలుపబడిన బోధలన్నియు ఈ అధ్యాయమున సంక్షేపముగ తెలుపబడినవి. మరియు ఇదివరకు ఏవైనబోధనలు విడిచియుండిన అవియు ఇచ్చోట సంపూర్తిచేయబడెను. కావున ఈ అధ్యాయమును గీతాసారమనిగాని, సంక్షిప్త గీతయనిగాని చెప్పవచ్చును. ఇట్టి అపూర్వ అధ్యాత్మికబోధనలను బడసినవాడిక ముక్తినొందక నుండునా? కావున అట్టివాడిక మోక్షమునుగూర్చిన సంకల్పమును త్యజించవచ్చును. అనగా మోక్షసన్న్యాసమును గావింపవచ్చును. ఇట్టి భావమును సూచించునదియగుటచే గూడ దీనికి మోక్షసన్న్యాసయోగమని పేరుకలిగియుండవచ్చును.

(4) ఇంతదనుక చెప్పబడిన 17అధ్యాయములయొక్క పేర్లు జ్ఞానయోగమని, కర్మయోగమని, భక్తియోగమని- ఈ ప్రకారముగ నుండుటంబట్టి ఆయా పేర్ల యొక్కఅర్థము- 'జ్ఞానముచే భగవదైక్యము (యోగము)ను', కర్మచే భగవదైక్యమును', 'భక్తిచే భగవదైక్యమును' గలుగజేయు పద్ధతులను తెలుపు అధ్యాయములని చెప్పుకొనుచుంటిమి? అట్లే ఇచట 'మోక్షసన్న్యాసయోగ'మని చెప్పినపుడు, 'మోక్షసన్న్యాస'మను క్రియద్వారా భగవదైక్యమును సిద్ధింపజేయు యోగమని ఈ అధ్యాయమును గూర్చి చెప్పవలసివచ్చును. ఈ ప్రకారముగ సాక్షాత్ మోక్షస్వరూపమగు లేక మోక్షప్రదమగు సన్న్యాసముద్వారా, త్యాగముద్వారా లేక భగవదర్పణముద్వారా, సర్వసంగరాహిత్యము ద్వారా యోగము (భగవదైక్యము) సిద్ధించునని తెలుపు అధ్యాయమగుటచేతను దీనికి మోక్షసన్న్యాసయోగమను పేరు గలిగియుండవచ్చును.

పూజ్య శ్రీ భక్తివేదాంతస్వామి ప్రభుపాదుల వారి అభిప్రాయం ఈ విధంగా వుంది.

నిజమునకు భగవద్గీత పదునేడధ్యాయములతోనే ముగిసింది. పదునెనిమిదవ అధ్యాయము ముందు చర్చింపబడిన విషయసంగ్రహ సారాంశముతో కూడిన అనుబంధము. గీతయందలి ప్రతి అధ్యాయనందును కృష్ణభగవానుడు, దేవదేవునికి చేయు భక్తియుక్తమైన సేవయే జీవిత పరమ లక్ష్యమని నొక్కిచెప్పను. ఈ విషయమే పదునెనిమిదవ అధ్యాయములో మిక్కిలి రహస్యమైన జ్ఞానమార్గముగా సంగ్రహింపబడినది. మొదటి ఆరధ్యాయములలో "యోగినామపి సర్వేషామ్' అనగా యోగులందరిలో తనలో నన్ను గూర్చియే యెల్లప్పుడును

తలంచువా డత్యుత్తముడని భక్తియుక్తసేవకుప్రాధాన్యమీయబడినది. మధ్యనున్న ఆరవధ్యాయములలో విశుద్ధ భక్తియుక్త సేవయు, దాని స్వభావ వ్యాపారములును చర్చింపబడినవి. తర్వాతి ఆరవధ్యాయములలో జ్ఞానము, సన్న్యాసము, భౌతిక దివ్య ప్రకృతుల స్వభావములు, భక్తి యుక్తసేవ వర్ణింపబడినవి. పరమపురుషుడైన విష్ణువును సూచించు ఓం తత్ సత్ అను పదములచే తెలుపబడు పరమేశ్వరునికి సంబంధించునట్లుగ అన్ని పనులను చేయవలయునని సారాంశము చెప్పబడినది. భగవద్గీతయందలి మూడవ భాగము భక్తియుక్తసేవ తప్ప మరేదియు జీవిత పరమప్రయోజనము కాదని ప్రకటించినది. పూర్వాచార్యులను, బ్రహ్మ సూత్రములను (వేదాంత సూత్రములను) ఉదహరించుచు ఇది సమర్థింపబడినది. కొందరు నిరాకారవాదులు వేదాంత సూత్రములందలి జ్ఞానము తమ గుత్తసొమ్మని భావింతురు. కాని వేదాంత సూత్రములకు భగవంతుడే రచయిత యగుటచేతను. అతడే దాని జ్ఞాతయగుట చేతను నిజముగా నవి భక్తియుక్తసేవ నవగాహనము చేసికొనుటకే ఉద్దేశించపబడినవి. అది పంచదశాధ్యాయమున వర్ణింపబడినది. ప్రతి మత గ్రంథమునకు వేదమునకును భక్తియుక్తసేవయే పరమార్థము. అది భగవద్గీతలో వివరింపబడినది.

ద్వితీయాధ్యాయమున సర్వవిషయ సారమును వర్ణింపబడియున్నట్లు ఈ అష్టాదశాధ్యాయమునకూడ సర్వబోధకసారము తెలుపబడినది. సన్న్యాసమును మూడు భౌతిక గుణముల నతిక్రమించిన దివ్యస్థితియు జీవిత ప్రయోజనమని సూచింపబడినది. అర్జునుడు త్యాగము, సన్న్యాస జీవితము అను భగవద్గీత యందలి రెండు ప్రత్యేక విషయములను స్పష్టపరుపవలెనని కోరుచు ఈ రెండు పదముల అర్థమును అడుగుచున్నాడు.

ఈ శ్లోకమున పరమపురుషుని సంబోధనలుగా వాడబడిన హృషీకేశ, కేశినిసూదన అను పదములు చాల ముఖ్యమైనవి. హృషీకేశుడు కృష్ణుడు.అతడు ఇంద్రియములకు ప్రభువై మనము మనశ్శాంతిని పొందుటకు తోడ్పడగలడు. అర్జునుడు తాను సమచిత్తుడై యుండునట్లుగా అంతయును సంగ్రహించి తెలుపమని కోరుచున్నాడు. అయినను అతనికి కొన్ని సందేహములు కలవు. ఈ సందేహములను రాక్షసులతో పోల్చవచ్చును. అందుచే అతడు కృష్ణుని కేశిసూదన అని సంబోధించుచున్నాడు. కేశి అనువాడు భగవంతునిచే సంహరింపబడిన

మహాబలశాలియైన రాక్షసుడు. ఇప్పుడర్జునుడు తన యందలి సందేహ రాక్షసుని కృష్ణుడు సంహరింపవలెనని ఆపేక్షించుచున్నాడు.

శ్రీ శిష్ట్లా సుబ్బారావు, ఎం.ఏ గారి అభిప్రాయం ఈ విధంగా వుంది.

మూడవ అధ్యాయారంభమునను, అయిదవ అధ్యాయారంభమునను అడిగిన ప్రశ్ననే అర్జునుడీ సమాప్తి అధ్యాయమునందు కూడ మూడవసారి మరల అడుగుచున్నాడు. క్లిష్టమై వాదవివాదములతో గూడిన ఈ విషమ ప్రశ్నకు భగవానుడు ముమ్మారు తన అభిప్రాయము ముక్తకంఠుడై ఘోషించినాడు. నిత్యకృత్యములను వర్ణాశ్రమ ధర్మ సంప్రదాయముల ననుసరించి గాని అట్టి వ్యవస్థలేనిచోట స్వభావమున కనుగుణమగు సత్కర్మాచరణగాని, నిష్కామ బుద్ధితో ననుష్ఠించి యోగసిద్ధిని బడిసి, స్థిరచిత్తుడై ధ్యానాభ్యాసము వలన పరాభక్తినలవరచుకొని జ్ఞాన సిద్ధినిబడసి, నిశ్చింతుడై మోక్షమందాసక్తిగూడ వదలి పరమాత్ముని చేతి పనిముట్టువలె పనిచేయుటయే జీవిత పరమలక్ష్యమని కృష్ణ భగవానుని సిద్ధాంతము.

జాతిపిత మహాత్మాగాంధీగారి అభిప్రాయం ఈవిధంగా వుంది.

This concluding discourse sums up the teaching of the Gita. It may be said to be summed up in the following : "Abandon all duties and come to Me, the only Refuge" (66). That is true renunciation. But abandonment of all duties does not mean abandonment of actions; it means the abandonment of the desire for fruit. Even the highest act of service must be dedicated to Him, without the desire. That is Tyaga (abandonment) that is Sannyasa (renunciation).

మహర్షి వినోబా గారి అభిప్రాయం ఈ విధంగా వుంది.

జీవితమును సఫలము చేసికొనదలచినచో ఫలత్యాగమను చింతామణిని చూపట్టుము. అది నీకు మార్గదర్శకమగును. ఈ ఫలత్యాగ తత్త్వము తన హద్దులను కూడ అదే సూచించును. మన మీ దీపపు వెలుగులో నున్నందువలన ఏ కర్మలు చేయవలెను. ఏవి మానవలెను, ఏవి యెప్పుడు మార్పు చేయవలెను విషయము దాని యంతట నదే మనకు విదితమగుచుండును.

శ్రీ సుందరచైతన్యానందస్వాముల వారి అభిప్రాయం ఈ విధంగా వుంది.

ఇది పదునెనిమిదవ అధ్యాయము. గీతాభవనమునందు చివరి అంతస్తు. గీతయందు గడచిన పదునేడు అధ్యాయములలోని సారమునంతటిని ఈ అధ్యాయములో భగవానుడు సంక్షిప్తముగ సింహావలోకన పద్ధతిలో తెలియ పరచినాడు. అందుచేత ఈ అధ్యాయమును "సంక్షిప్తగీత" యని కూడా పిలుతురు.

త్యాగ సన్న్యాస తత్త్వములను గూర్చి తెలియగోరి అర్జునుడు అడిగిన ప్రశ్నతో ఈ అధ్యాయము ఆరంభమగుచున్నది. ఇదే ప్రశ్నను ప్రారంభ అధ్యాయాలలో కూడా అర్జునుడు ప్రశ్నించియే యున్నాడు. కానీ ఇక్కడ ప్రశ్నించుటలో విశేషమున్నది. కర్మత్యాగము, కర్మసన్న్యాసములలో ఏది శ్రేష్ఠమో తెలియజేయుమని గడచిన అధ్యాయాలలో ప్రశ్నించాడు. వాటియొక్క యదార్థ తత్త్వమును నిస్సంశయముగ తెలియజేయుమని ఇక్కడ ప్రశ్నించుచున్నాడు.

"కామ్య కర్మలను వదులుట సన్న్యాసమనియు, సర్వకర్మ ఫలములను వదులుట త్యాగమనియు పండితులు చెప్పుదురు" అంటూ శ్రీకృష్ణభగవానుడు ఈ అధ్యాయాన్ని ప్రారంభిస్తాడు. ఈ అధ్యాయము భగవద్గీత కంతటికీ సారభూతమై యున్నదనియు, అంతియేగాక వేదవాఙ్మయము నంతటిని తనలో దాచుకొని యున్నదని శ్రీ శంకరాచార్యులవారు అభిప్రాయపడ్డారు.

బద్ధుడైన వానికి విడుదల కావాలి. బందీ అయినవాడు మోక్షాన్ని గోరుతాడు. జీవునికి యదార్థానికి బంధమేలేదు. అది కేవలం కల్పితమే. అధ్యాసయే. బంధము అధ్యాసయైనపుడు మోక్షము అభాస మాత్రమే అవుతుంది. కనుక మోక్ష భావనను కూడా సన్యసించి, ఆత్మానంద స్వరూపుడై మనగలగాలి. అదియే మోక్ష సన్యాసము సర్వోపద్రముల నుండి విడివడిన దివ్యస్థితి.

" అశోచ్యాన్" అంటూ సాంఖ్యయోగములో భగవానుడు తన దివ్య బోధను ప్రారంభించి. "మాశుచః" దుఃఖించకుము అంటూ ఈ చివరి అధ్యాయంలో ఓదార్చుతున్నాడు. గీత అందరి శోకములను రూపుమాపే దివ్యామృతమై యున్నది.

'నష్టోమోహః స్మృతిర్లబ్ధా"

"మోహము నశించినది. స్మృతి కలిగినది" అంటూ దరహాస వదనముతో అర్జునుడు కార్యరంగంలోకి దిగుతాడు. గీతా విద్యార్థులమైన మనము గూడా అర్జునునివలె మోహమును అంతరింపజేసుకొని జ్ఞానవంతులమై ఆదర్శవంతముగా జీవించాలి.

"కరిష్యే వచనం తవ"

'నీ మాటనే ఆచరిస్తాను"అని అర్జునుడు పలికినట్టు మనము కూడా భగవదాజ్ఞనే శిరాసావహించి శరణాగత భావముతో తరించాలి.

అజ్ఞానాంధకారములో అలమటించు ధృతరాష్ట్రునితోప్రారంభమైన గీత జ్ఞానియైన సంజయునితో సమాప్తమగుచున్నది. ఈ గీతాజ్ఞానమును విననందుకు చెప్పినందుకు సంజయుడు సంబరపడిపోయెను. వ్యాస భగవానుని దివ్యప్రసాద మహిమచే తనకీభాగ్యము కలిగినదని ఉప్పొంగి పోయెను. జ్ఞానియైన సంజయుడు గీతాజ్ఞానము నార్జించిన పిదప చివరగ తన అభిప్రాయమును తెలియజేయుచు

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతి ర్మతిర్మను

"ఎచ్చట యోగీశ్వరుడగు శ్రీకృష్ణుడు ధనుర్ధారియగు అర్జునుడును ఉండునో అచ్చట సంపద విజయము, ఐశ్వర్యమును, దృఢమగు నీతియు నుండును అని నా అభిప్రాయము" అని ముగించెను.

ఎచ్చట నిష్కామ్యమగు కర్మ. పరిశుద్ధమైన జ్ఞానము కలిసి యుండునో అచ్చటనే సర్వశుభములు చేకూరగలవు.

శ్రీ శార్వరిగారి అభిప్రాయం ఈ విధంగా వుంది.

ఇది గీతలోని చివరి అధ్యాయం, సుదీర్ఘమైనది. ఎంత సుదీర్ఘమైనదో అంత ముఖ్యమైనది. ఒక విధంగా భగవద్గీతలోని సారం అంతా ఈ అధ్యాయంలో వుందని చెప్పవచ్చు. మరొక విధంగా సింహావలోకనం అనుకోవచ్చు. విషయవివరణ కొస్తే- దేవుని ప్రసక్తి లేకుండావేదాంతోపనిషత్తుల సారంగా, బ్రహ్మన్ని ఏకైక పరమాత్మగా భావించడం జరిగింది. సామాన్యుల కోసం ఆస్తిక దృష్టితో పరికిస్తే ప్రతివ్యక్తి తనకిష్టమైన దేవతామూర్తిని ఆరాధిస్తాడు, పూజిస్తాడు. తను నమ్మిన రూపం ద్వారా రూపరహితుడైన పరబ్రహ్మను చేరాలని ప్రయత్నిస్తాడు, చేరుతున్నాననే భ్రమిస్తాడు. ఏదైనా పరిణామంలో కాస్తంత ప్రగతి సాధించడమే ప్రతివ్యక్తి చేసే సత్కార్యం.అయినప్పుడు ప్రతివ్యక్తికి సత్ప్రవర్తన అవసరం. ఏది సత్ప్రవర్తన. ఏది సత్క్రియ? ఏది చేయాలి? ఎలా చేయాలి?

'సన్యాసం' అంటే సంసారం వదలి పారిపోవటం కాదు. మనుషుల మధ్యన ప్రపంచంలోనే వుంటూ సత్కర్మచేయటం అసలైన సన్యాసం. పనిచేయకుండా పారిపోవటం అకర్మ, పిరికితనం, సోమరితనం, అధిభౌతికత అంటే, భౌతిక ప్రపంచంలో వుంటూనే ఉత్తమ స్థితిని పొందటంగాని భౌతికాన్నికాదని ఏవో ఆధ్యాత్మిక శిఖరాలు ఎక్కడం కాదు. జీవించటం అంటే, సత్కర్మనాచరించటమే. పనిచేయకపోవటం కానేకాదు- అదీ ఈ ప్రపంచంలోనే, ఏది చేసినా ఏది సాధించినా (ఇతరప్రపంచాలు లేనేలేవు) అస్తిత్వం అనేది భూమిపైనే పంచభూతాలుగానీ, పది భూతాలుగానీ, ఈ ప్రపంచంలోనే వాటి ఉనికి, వాటి వినిమయం. కనుక మన 'స్థితి'లోంచే 'అస్తిత్వం' సాధించాలి. 'పరమాత్మ' సైతం తన అంశ పొందిన అవతారాల ద్వారానే ఏదైనా ప్రగతిని సాధిస్తుంది.

ఈ విచిత్ర ప్రపంచం ఎట్లా ఏర్పడ్డదీ సాంఖ్యం చెబుతుంది. దానినే 'గీత' ప్రబోధించింది. బలపరిచింది. ఉపనిషత్తులు చెప్పే ఆత్మతత్వానికి అది భిన్నంకాదు. 'బ్రహ్మం' ఒక్కడే నన్నది సూత్రం 'అది అద్వితీయం అది ఒక్కటే అనేకం అయ్యింది. బ్రహ్మయే సంపూర్ణ, సమగ్ర విశ్వం. అందులోనిదే ప్రకృతి- అది దృశ్యమానం- ఆత్మ- అది అదృశ్యం- వున్నవి. మనం చూచే యావద్విశ్వం వాస్తవం- అన్ని రూపాలూ వాస్తవాలే. అవి అన్నీ వుంటేనే ప్రపంచం. దానినొక మాయ, భ్రమ అని కొట్టివేయనవసరం లేదు. ఈ విశ్వం యావత్తు బ్రహ్మంలోనిదే. బ్రహ్మమే అద్వైతులు చెప్పే 'మాయ'. ఆ సిద్ధాంతాన్ని ఎక్కడా గీతబలపరిచినట్లు లేదు- మన గమ్యం- బయలుదేరినచోటుకు చేరటం కానేకాదు- పరిణామంలో ముందుకు వచ్చిన వారం, మన గమ్యం వెనక్కు పోవటం ఎలా అవుతుంది? అలాగే శూన్యంలో లయించిపోవటమూ కాదు- అది అరూపబ్రహ్మం. అదే మన గమ్యం అయితే అంతకు మించిన వైరుధ్యం మరొకటి ఉండదు-పైగా మన గమ్యం, మనం జీవితాల్లోకి అరువు తెచ్చుకున్న చెడుగుల్ని తొలగించుకోవటం, అవి మన ప్రగతినికాటువేయకుండా కాపాడుకోవటం. మనం ఆ పరబ్రహ్మకు సరైన, సత్యమైన వారసులం కావాలి. అప్పుడే ఏకం బహుళం అయే లక్ష్యం నెరవేరుతుంది. ప్రతి ఒక్కరు 'పరబ్రహ్మ' అంత కాగలరు. ఆ'ఐక్యత' మనం అనుకునే 'ఏకత్వం'లో లేనేలేదు. సమష్టిసాధనలోనే సమీకృత ఐక్యత వుంది. దాన్ని మనం అనుభవంలో నిరూపించగలగాలి. అప్పుడే మనం 'నేనే బ్రహ్మం' అని చెప్పగలుగుతాం. అది ఎలాగ, ఎప్పటికి సాధ్యపడుతుంది అంటే చెప్పలేం మనయోగ సాధనలో సాధించే ఫలితాలను బట్టి వుంటుంది ఫలితం.

ఇంతకుముందు ఈ లక్ష్యాన్ని ఎవరూ ఛేదించి సాధించిన దాఖలాలు లేవు. కాని ఇకపైన మానవ పరిణామం ఈ పంథాలోనే సాగుతుందన్నది యదార్థసత్యం- ఈ భూ ప్రపంచంపైనే మనం తరతరాలుగా ఊహించిన స్వర్గం ఏర్పడాలి- ఆనాటి కల నిజం కావాలి. సత్యం కావాలి.

ఆంగ్లంలో శ్రీ జయదయాల్ గోయాంద్కాగారు ఇచ్చిన అభిప్రాయం ఈ విధంగా వుంది.

Moksha consists in securing lasting freedom from the bondage of mundane existence in the form of birth and death and realizing God, who is no other than supreme Bliss. Summing up the substance of all previous chapters, the present one discusses, under the names of 'samnyasa' and 'Tyaga' respectively, the Paths of Knowledge and Action, both of which are means to the attainment of Moksha, in all their details; and secondly, the teaching of the Gita has been wound up (XVIII.66) with an exhoratation to offer all actions to God, who is the same as Moskha. It is for these resons that the chapter has been given the title of 'Moksha - Samnyasa-Yoga'.

In the opening verse of this chapter Arjuna expresses his desire to know the truth about Samnyasa and Tyaga; in the second and third the Lord records the views of other thinkers on the subject, in the fourth and fifth He invites Arjuna to hear His own conclusion about Tyaga, and establishes the advisability of not relinqui.....dutes, while in the sixth He gives His own considered opinion in the matter of Tyaga, and declares it as superior to the other views..Thereatter, defining the Tamasika, Rajasika and Sattvika forms of Tyaga in the seventh, eighth and ninth respectively, He describes the marks of a Tyagi (man of renunciation) of the Sattvika type in the tenth and eleventh. Demonstrating the greatness of men of renunciation of the Lord winds up the topic, of Tyaga in the twelfth. Thereafter, inviting Arjuna to hear His dissertation of Sankhya, the Lord discusses up to the fifteenth the five factors which contribute to the accomplishment of actions, viz., Adhisthana etc., according to the viewpoint of Sankhya. Denouncing in the sixteenth the man who regards the pure spirit as the doer, the Lord praises in the seventeenth one who performs actions without claiming the doership. mentioning the threefold incentive to action as well as the three constituents of action in the eighteenth, the Lord introduces the threefold division of knowledge and action as well as of the doer in the nineteenth, and actually divides them under three

heads, viz., Sattvika, Rajasika, and Tamasika from the twentieth to the twenty-eighth. Introuducing in the twenty-ninth the threefold division of Buddhi (reason) and Dhrti (firmness), the Lord divides them under three heads, viz., Sattvika, Rajasika and Tamasika, from the thirtieth to the thirty- fifth. Dividing Sukha (joy) under three heads viz., Sattvika, Rajasika and Tamasika, from the thirty-sixth to the thirty-ninth, the Lord winds up the topic of Gunas and declares the whole world as made up of the three Gunas in the fortieth. Thereafter, introducing the topic of the natural functions of the four grades of society in the forty first the, Lord enumerates the natural functions of the Brahmanas in the forty-second, of the Ksatriyas in th forty-third and of the Vaisyas and Sudras in the forhty-fourth. Declaring in the forty-fifith that men can attain highest perfection through the performance of their respective duties, the Lord tells us in the forty- sixth the method of attaining it. Extolling the performance of one's own duty in the forty- seventh, He discourages renunciation of the same in the forty eight there after, resuming the discussion of Sanyass Yoga from the forty-ninth and declaring that one can attain the highest perfection through Samnyasa, the Lord undertakes in the fiftieth to speak of the culmination of the Yoga of Knowledge and discusses from the fifty- first to the fifty-fifth the Yoga of Knowledge with its fruit. Thereafter, from the fifth- sixth to the fifty- eighth the Lord points out the glory and fruit of Karmayoga which lays special emphasis on Bhakti and commands Arjuna to practise the same, warning him at the same time of the risk involved in not obeying Him. Declaring in the fifty-ninth and sixtieth the inability of arjuna to abandon his natural duties due to his inherent nature, the Lord commands him in the sixty-first and sixty-second to take refuge with all his being in God, who is the Lord and inner controller of all. Winding up the topic in the sixty- third and asking Arjuna to do as he pleased after weighing everything, the Lord invites him in the sixty- fourth to hear once more the most esoteric truth, which is the quintessence of the whole Gita. And imparting in the sixty-fifth and sixty-sixth that most esoteric gospel of exclusive surrender along with its fruit, the Lord winds up the teaching of the Gita by asking Arjuna to take refuge in Him. Thereafter, warning Arjuna in the sixty- seventh not to impart the teaching of the Gita to four types of unqualified persons, the Lord stresses the importance of popularizing the Gita among qualified persons in the sixty- eithth and sixty-ninth, of studying the Gita in the seventieth, and of merely listening with faith to the recitation of the Gita in the seventy-first. In the seventy-second the Lord asks Arjuna if he listened to the Gita with one- pointed attention and whether his delusion was dispelled; and in the seventy- third Arjuna assures the Lord that his delusion was dispelled, wisdom gained and all his doubts removed, and agrees to do His bidding. Thereafter, from the seventy- fourth to the seventy- seventh Sanjaya glorifies the teaching of the Gita in the

form of a dialogue between Sri Krishna and Arjuna, and tells Dhrtarastra how the thought of that dialogue as well as of the consmic form of the Lord filled him with wonder and joy again and again. And he winds up the chapter by proclaiming in the seventy-eighth that the side with which Bhagavan Sri Krishna and Arjuna had ranged themselves was sure to win and atain glory etc.

The gospel of the Gita actually commenced from verse 11 of Chapter II. In verses 11 to 30 of that chapter the Lord taught Jnanayoga and, incidentally establising the advisability of waging war from the viewpoint of the code of morality laid down for a Ksatriya, taught Karmayoga from verse 39 right up end of the chapter. Thereafter, from ChapterIII to Chapter XVII, the Lord detailed a number of disciplines for God-Relaization, some from the viewpoint of Sankhyayoga and other from that of Karmayoga. Having heard of all these, Arjuna now expresses the desire to know separately and clearly the truth of Samnyasa or Jnanayoga and of Tyaga or Karmayoga which consists in relinquishing the attachment for fruit, in order to have the essence of the teaching of all chapters in the present chapter.

సన్న్యాసస్య మహాబాహో!
తత్త్వ మిచ్ఛామి వేదితుం
త్యాగస్య చ హృషీ కేశ!
పృథక్కేశినిషూదన! శ్లో - 1

కేసిరాక్షస సంహారకుడవైన
ఓ మహాబాహో! ఓ హృషీకేశా!
సన్న్యాసము యొక్కయు, త్యాగము
యొక్కయు తత్వములను
గూర్చి నేను విడి విడిగా తెలుసు
కోగోరుతున్నాను. వాటి తత్వము
ప్రయోజనము గూర్చి తెలుపుము

కేసి అనువాడు ఒక రాక్షసుడు. కంసుని యొక్క ఆదేశముపై గోకులంలో ప్రవేశించి కృష్ణుని చంపుటకు ప్రయత్నించెను. కాని శ్రీకృష్ణుడే వానిని సంహరించెను. అందువలన కేశిరాక్షసుని సంహరించిన ఓ హృషీకేశా! అని ఈ శ్లోకంలో శ్రీకృష్ణుని సంబోధించడం జరిగినది. (విష్ణు)

కామ్యానాం కర్మణాం న్యాసం
సన్న్యాసం కవయో విదుః
సర్వకర్మఫలత్యాగం
ప్రాహుస్త్యాగం విచక్షణాః శ్లో - 2

అర్జునా!
భౌతికవాంఛలు ఈడేరుటకొరకై
చేయు పనులను అన్నింటిని విడిచి
పెట్టుటను సన్యాసమని విజ్ఞులు
చెప్పుదురు, కర్మలయొక్క
ఫలములనన్నింటిని త్యజించుటను
త్యాగమని మరికొందరు పండితులు
తెలుపుతున్నారు

ఫలముల కొరకై పనులను చేయుట విడిచి పెట్టవలయునన్నది భగవద్గీత యొక్క ప్రధాన బోధ అయితే జ్ఞానమునునొసంగి ప్రగతిని చూకూర్చె కార్యాలను విడువరాదు అని అదే సమయములో గీత బోధిస్తున్నది.

త్యాజ్యం దోషవదిత్యేకే
కర్మప్రాహుర్మనీషిణః
యజ్ఞదానతపః కర్మ
న త్యాజ్యమితి చాపరే శ్లో - 3

కర్మలు దోషయుతమైనందున
విడువవలెనని కొందరు పండితులు
చెప్పుచుండగా మరి కొందరు
పండితులు యజ్ఞము, దానము
తపస్సు విడువరానివని చెప్పుచున్నారు

నిశ్చయం శృణు మే తత్ర
త్యాగే భరతసత్తమ!
త్యాగో హి పురుషవ్యాఘ్ర
త్రివిధః సంప్రకీర్తితః శ్లో - 4

అర్జునా!
అట్టి కర్మత్యాగము విషయమై
నా నిశ్చయమైన అభిప్రాయం
ఏమిటో విను. ఈ త్యాగము
మూడువిధములుగా వుంది.

యజ్ఞదానతపః కర్మ
న త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞోదానం తపశ్చైవ
పావనాని మనీషిణామ్ శ్లో - 5

అవి యజ్ఞము, దానము, తపస్సు
అనునవి, వాటిని ఆచరించడము
వలన పవిత్రత చేకూరును
అట్టి కార్యములు ఆచరించదగినవే
కాని ఎన్నటికినీ విడువదగినవి కావు

ఏతాన్యపి తు కర్మాణి
సంగ త్యక్త్వా ఫలాని చ
కర్తవ్యానీతి మే పార్థ!
నిశ్చితం మతముత్తమమ్ శ్లో- 6

అయితే అర్జునా!
ఈ యజ్ఞ, దాన, తపః కర్మలను
కూడా ఆసక్తి, ఫలాపేక్ష రహితంగా
ఆచరించవలసివుంది సుమా!
ఇదే నా నిశ్చితాభిప్రాయము

నియతస్య తు సన్న్యాసః
కర్మణో నోపపద్యతే
మోహాత్తస్య పరిత్యాగః
తామసః పరికీర్తితః శ్లో - 7

స్వధర్మమైన, విద్యుక్తమైన, కర్మను
విడుచుట ఎంతమాత్రము తగదు
అజ్ఞానమువలన ఎవ్వడైనను విడిచి
నట్లైతే దానిని తామస త్యాగము అని
చెప్పవలసి వుంది.

దుఃఖమిత్యేవ యత్కర్మ
కాయక్లేశభయాత్త్యజేత్
స కృత్వా రాజసం త్యాగం
నైవ త్యాగఫలం లభేత్ శ్లో - 8

చేయుకర్మ శరీర ప్రయాసను
కలిగిస్తుందని భీతినిచెంది
ఆ పిమ్మట అది దుఃఖాన్ని
కలుగజేస్తుందని భావించి
కర్మను త్యజించువాడు
రాజసత్యాగము చేసిన
వాడగుచున్నాడు

కార్యమిత్యేవ యత్కర్మ
నియతం క్రియతేర్జున!
సంగం త్యక్త్వా ఫలం చైవ
స త్యాగస్సాత్త్వికో మతః శ్లో - 9

శాస్త్రయుక్తమై చేయదగిన
కర్మను ఆచరించి దాని ఫలముల
పట్లగల ఆసక్తిని వీడితే దానిని
సాత్విక కర్మగా నిర్ణయించడమైనది

న ద్వేష్ట్యకుశలం కర్మ
కుశలే నానుషజ్జతే
త్యాగీ సత్త్వసమావిష్టో
మేధావీ ఛిన్నసంశయః శ్లో - 10

సత్వగుణము కలిగిన
ప్రజ్ఞావంతుడు సంశయ
రహితుడై త్యాగశీలతను
కలిగియుండి దుఃఖకరములైన
కర్మలను ద్వేషించడం గాని
సుఖకరములైన కర్మల యందు
ఆసక్తిని కాని చూపడు

నహి దేహభృతా శక్యం
త్యక్తుం కర్మాణ్యశేషతః
యస్తు కర్మఫలత్యాగీ
స త్యాగీత్యభిధీయతే శ్లో - 11

దేహాభిమానము కలవారికి
కర్మలను సంపూర్ణముగ
విడుచుట సాధ్యముకాదు
అయినను అతడు కర్మఫలమును
వీడిన త్యాగియని పిలువబడును

అనిష్టమిష్టం మిశ్రం చ
త్రివిధం కర్మణః ఫలం
భవత్యత్యాగినాం ప్రేత్య
న తు సన్న్యాసినాం క్వచిత్ శ్లో - 12

ఫలాపేక్షను విడువక కర్మలను
ఆచరించువారికి "ఇష్టము,
అనిష్టము, ఇష్టానిష్టము"-
అను మూడు విధములగు ఫలములు

మరణాంతరమున కలుగుచున్నవి
కర్మఫలత్యాము చేసిన వారికివి
ఎప్పటికిని కలుగవు

పంచైతాని మహాబాహో
కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని
సిద్ధయే సర్వకర్మణామ్ శ్లో - 13

అర్జునా!
కర్మసిద్ధాంతమును తెలుపు
సాంఖ్యశాస్త్రమునందు తెలిపిన
సర్వకర్మలు నెరవేరుటకు
చెప్పబడిన ఐదుకారణములను
నావలన వినుము

అధిష్ఠానం తథా కర్తా
కరణం చ పృథగ్విధం
వివిధాశ్చ పృథక్చేష్టా
దైవం చైవాత్ర పంచమమ్ శ్లో- 14

అవి దేహము, కర్మ
ఇంద్రియములు, వివిధములగు
క్రియలు, దైవము, ఈ అయిదు
కలిసి సర్వకర్మలు నెరవేరుటకు
కారణమౌతున్నవి

శరీరవాఙ్మనోభిర్యత్
కర్మప్రారభతే నరః
న్యాయం వా విపరీతం వా
పంచైతే తస్య హేతవః శ్లో - 15

మనోవాక్కాయముల చేత
మనుజుడు ప్రారంభించెడి కర్మ
న్యాయమైనను, అన్యాయమైనను
అట్టి దానికి ఈ ఐదుకారణములు

తత్రైవం సతి కర్తారం
ఆత్మానం కేవలం తు యః
పశ్యత్యకృత బుద్ధిత్వాన్
న స పశ్యతి దుర్మతిః శ్లో - 16

కర్మను గూర్చిన విషయము
ఈవిధంగా వుండగా ఎవడు
అశుద్ధబుద్ధిగలవాడై
ఆత్మనే కర్తగా తలంచు
చున్నాడో అట్టివాడు
సత్యమును గ్రహించలేని అవివేకి

యస్య నాహంకృతో భావో
బుద్ధిర్యస్య నలిప్యతే
హత్వాపి స ఇమాన్ లోకాన్
నహన్తి న నిబధ్యతే శ్లో -17

ఎవడు అహంభావమును
సంగమును విడుచునో
వాడు లోకమునందు అందరిని
చంపినను చంపినవాడు కాదు
అంతేకాదు అతడు కర్మల
చేతబంధింపబడడు

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా
త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి
త్రివిధః కర్మ సంగ్రహః శ్లో - 18

జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత
అనుమూడును కర్మను ప్రేరేపించు
అంశములు కాగా ఇంద్రియములు
కార్యము, కర్త అను మూడు అంశములు
కర్మను ఆచరించుటకు ఆధారములు

ఎల్లప్పుడు పనిచేయుటకు జ్ఞానము, జ్ఞేయ విషయము, జ్ఞాత అను ఈ మూడు విధములైన అంశములు ప్రేరకములు.

కార్యసాధనములు, కార్యము, కర్త అను ఈ మూడు అంశములు కార్యము యొక్క ముఖ్యాంశములు. ఎవరైనను ఏ పనైనను చేయాలంటే అందులో ఈ మూడు అంశాలు ఇమిడి వుంటాయి. ఒకపని చేయాలంటే ముందు దానికి ప్రేరణ కావాలి. ప్రేరణకే ప్రోత్సాహం అనిపేరు. కార్యము ఒక రూపము పొందుటకు ముందు చేయబడు ఆలోచన ఆ పని యొక్క సూక్ష్మరూపము. అప్పుడు పని ఆచరణ రూపమును పొందును. ఆలోచించుట, భావించుట సంకల్పించుట అనునవి ఈ మూడును మానసిక ప్రవృత్తులు. వాటిని అనుసరించే పనికి ఉపక్రమించవలసి వుంటుంది. దీనినే ప్రేరణ అని అంటారు.

1 (1) జ్ఞానం అంటే తెలివి. (2) జ్ఞేయం అంటే తెలియబడదగిన వస్తువు. (3) పరిజ్ఞాతా అంటే తెలుసుకొనువాడు.

2. (1) కర్మ బోధన అంటే కర్మము (పనిని) ను నడిపించుటకు హేతువు అంటే కర్మ ప్రవర్తనము.

(2) కర్మ సంగ్రహః అంటే కర్మము (పనికి) నకు ఆధారము.

(3) కరణమ్ అంటే ఉపకరణము అంటే సాధనము.

ఇక ఇపుడు జ్ఞానము, కర్మ, కర్త అను వానియొక్క సాత్విక, రాజస, తామస స్వరూపములను భగవానుడు ప్రకటిస్తున్నాడు.

జ్ఞానం కర్మ చ కర్తాచ
త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణ సంఖ్యానే
యథావచ్ఛృణు తాన్యపి శ్లో - 19

గుణముల గూర్చి విచారణ చేయు
సాంఖ్య శాస్త్రమునందు జ్ఞానము
కర్మ, కర్త అను మూడు విధములగు
అంశముల గూర్చి చెప్పబడింది
వానిని గూర్చిన యథార్థ విషయమును
ఆలకింపుము.

సర్వభూతేషు యేనైకం
భావ మవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు
తద్ జ్ఞానం విద్ధి సాత్త్వికం శ్లో - 20

విభక్తములై వేరు వేరుగ
వున్న సమస్తమైన చరాచర
ప్రాణులయందు ఒక్కటై
నాశరహితముగా వున్న
ఆత్మను ఏకముగా వున్నట్లు
తెలుసుకొనెడి జ్ఞానము
సాత్త్విక జ్ఞానము అని చెప్ప
బడుచున్నది.

ఇక్కడ అంటే దైవము వున్నాడనేదానికి అర్థము. అజ్ఞానుల దృష్టికి ఈప్రపంచము, అందలి సమస్త పదార్థములు, ప్రాణులు విభజింపబడి వేరు వేరుగ వున్నట్లు అగుపించునుకాని జ్ఞానుల దృష్టికి ఇది అంతయు అవిభక్తము (విభజింపబడనిది)ను, నాశరహితమగు ఒకే వస్తువు (పరబ్రహ్మము) అని గోచరించును. ఏ జ్ఞానముచే అట్టి అవిభక్తము వారికి అనుభూతమగునో అది సాత్త్వికజ్ఞానమని పేర్కొనబడింది.



[illegible]

[illegible] శ్లో - 21

సమస్త భూతముల యందును
గల ఒకే ఆత్మను వేరు వేరని
తలంచే మనుజుడు పొందిన
జ్ఞానము రాజస జ్ఞానమని తెలుసుకో

యత్తు కృత్స్న వదేకస్మిన్
కార్యేసక్త మహైతుకం
అతత్త్వార్థ వదల్పంచ
తత్తామ సముదాహృతమ్ శ్లో - 22

హేతుబద్ధము కానిదియును
పరమార్థము లేనిదియును
అల్పమైనదియును అగు
ఒకే ఒక విషయము నందు
సమస్త జ్ఞానము ఇమిడి
యున్నట్లు తలచే మనుష్యుని
జ్ఞానము తామసజ్ఞానము
అని చెప్పబడుచున్నది

నియతం సంగరహితం
అరాగద్వేషతః కృతమ్
అఫల ప్రేప్సు నా కర్మ
యత్తత్సాత్త్విక ముచ్యతే శ్లో - 23

ఫలాపేక్ష లేనిదై, సంగరహితము
అయినదియును అయి, రాగద్వేషములు
లేకుండా నియమితముగ ఆచరించెడి
కర్మ సాత్త్విక కర్మ అనబడుచున్నది

[illegible]

కోరికలుగల వాని చేతను
అహంకారము గలవాని చేతను
విశేష ప్రయాసతో ఆచరించ
బడెడు కర్మ రాజస కర్మ
అని చెప్పబడుచున్నది

అనుబంధం క్షయం హింసాం
అనపేక్ష్య చ పౌరుషం
మోహాదారభ్యతే కర్మ
యత్తత్తామస ముచ్యతే శ్లో - 25

తన సామర్థ్యము ఏమిటో
తెలుసుకొనక ఆచరింప
బడుకర్మయొక్క పరిణామమును
తద్వారా కలిగెడు హానిని, హింసను
గ్రహించక అవివేకముతో ఆరాధించు
వాని యొక్క కర్మ తామస కర్మ
అని చెప్పబడుతున్నది.

ముక్తసంగో నహంవాదీ
ధృత్యుత్సాహసమన్వితః
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః
కర్తా సాత్త్విక ఉచ్యతే శ్లో- 26

ఫలాపేక్ష రహితుడును
అహంకారము లేని వాడును
ధైర్యము, ఉత్సాహము
గలవాడును, కార్యములు

సిద్ధించినను, సిద్ధించకపోయినను
వికారముచెందనివాడును
అగుకర్త సాత్విక కర్తయని
చెప్పబడుతున్నాడు

రాగీ కర్మఫల ప్రేప్సుర్
లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్షశోకాన్వితఃకర్తా
రాజసః పరికీర్తితః శ్లో - 27

అనురాగముగలవాడు
ఫలాపేక్ష లేనివాడు
లోభియును, హింసా ప్రవృత్తి
కలవాడును, శుచిత్వము లేని
వాడును, హర్షశోకములతో
నిండిన వాడును అగు కర్త రాజస
కర్తయని చెప్పబడుచున్నాడు.

అయుక్తః ప్రాకృతః స్తబ్ధః
శఠో నైష్కృతికోఽలసః
విషాదీ దీర్ఘ సూత్రీచ
కర్తా తామస ఉచ్యతే శ్లో - 28

యుక్తుడు కాని వాడు
జరుడు, వంచకుడు
ఇతరుల బ్రతుకునుపాడు
చేయువాడు, సోమరియు
ఎల్లపుడు దుఃఖముతోనుండు
వాడు, కాలయాపన చేయువాడు
తామస కర్తయని చెప్పబడుచున్నాడు

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ
గుణత స్త్రివిధం శృణు
ప్రోచ్యమాన మశేషేణ
పృథక్త్వేన ధనఞ్జయ! శ్లో - 29

అర్జునా!
గుణములననుసరించి
బుద్ధి, ధైర్యములయొక్క
భేదములు మూడు విధములని
చెప్పబడింది. సంపూర్ణముగను
వేర్వేరుగ చెప్పబడు ఆ విషయమును
గూర్చి వినుము

ప్రవృత్తిం చ నివృత్తిం చ
కార్యాకార్యే భయాభయే
బంధం మోక్షం చ యా వేత్తి
బుద్ధిస్సా పార్థ! సాత్త్వికీ శ్లో -30

అర్జునా!
ప్రవృత్తి, నివృత్తియను
విషయములను కార్యా
కార్యములను భయా భయములను
గూర్చి తెలుసుకొను బుద్ధి
సాత్తిక బుద్ధియనబడుచున్నది

యయా ధర్మమధర్మం చ
కార్యం చా కార్యమేవ చ
అయథావత్ప్రజానాతి
బుద్ధి స్సా పార్థ! రాజసీ శ్లో - 31

అర్జునా!
ధర్మాధర్మములను,
కార్యకార్యములను
వున్నదున్నట్లుగా గాక
అందుకు భిన్నంగా గ్రహించెడి
బుద్ధిరాజసబుద్ధియనబడుచున్నది

అధర్మం ధర్మమితి యా
మన్యతే తమసా వృతా
సర్వార్థాన్ విపరీతాంశ్చ
బుద్ధిస్సా పార్థ! తామసీ శ్లో - 32

అర్జునా!
అజ్ఞానము చేత ధర్మమును
అధర్మముగను, విషయాలను
విపరీతముగ గ్రహించు బుద్ధి
తామసిక బుద్ధి అని చెప్పబడుతున్నది

ధృత్యా యయా ధారయతే
మనః ప్రాణేంద్రియక్రియాః
యోగేనావ్యభిచారిణ్యా
ధృతిస్సా పార్థ! సాత్త్వికీ శ్లో - 33

అర్జునా!
ఏ ధృతి వలన మనస్సు ప్రాణము
ఇంద్రియ చేష్టలు, చెదరనటువంటి
యోగము చేత ధరింపబడుచున్నవో
అట్టి ధృతి సాత్విక ధృతి అని
చెప్పబడుచున్నది

యయా తు ధర్మకామార్థాన్
ధృత్యాధారయతేర్జున!
ప్రసంగేన ఫలాకాంక్షీ
ధృతిస్సా పార్థ! రాజసీ శ్లో - 34

అర్జునా!
ఏ ధృతి చేత ఫలాపేక్ష గలవాడు
ధర్మార్థకామములను ఆసక్తితో
ధరించుచున్నాడో అట్టి వాని
ధృతి రాజసధృతి యనబడుచున్నది

[illegible]
[illegible]
[illegible]
[illegible]

అర్జునా!
దుర్బుద్ధిగలవాడు ఏధృతిచేత
స్వప్నమును, భయమును
శోకమును, విషాదమును
మదమును విడువకున్నాడో
అట్టి వాని ధృతి తామసిక
మైనదని చెప్పబడుతున్నది

సుఖం త్విదానీం త్రివిధం
శృణు మే భరత ర్షభ!
అభ్యాసాద్రమతే యత్ర
దుఃఖాంతం చ నిగచ్ఛతి శ్లో - 36

అర్జునా!
ఏ అభ్యాసముచేత మనుజుడు
దుఃఖనాశనమును, సుఖానుభవమును
పొందుచున్నాడో అట్టిదిపుడు నా చేత
తెలుపబడుచున్నది, అవి మూడు
విధములని గ్రహించుము.

యత్తదగ్రే విషమివ
పరిణామేమృతోపమం
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తం
ఆత్మబుద్ధి ప్రసాదజమ్ శ్లో - 37

తనయొక్క బుద్ధి ప్రసన్నత
వలన కలిగిన సుఖము ఆదియందు
విషమువలెను, అటు పిమ్మట
అమృతమును పోలినదిగ వుండునో
అట్టి సుఖము సాత్విక సుఖము
అని చెప్పబడుతున్నది

విషయేంద్రియసంయోగాత్
యత్తదగ్రేమృతోపమం
పరిణామే విషమివ
తత్సుఖం రాజసం స్మృతం  శ్లో - 38

విషయేంద్రియ సంయోగము
వలన కలిగెడి సుఖము
ప్రారంభమునందు అమృత
తుల్యముగాను అటు పిమ్మట
విషతుల్యముగ వుండును
అట్టి సుఖము రాజస
సుఖము అని చెప్పబడుతున్నది

యదగ్రేచానుబంధే చ
సుఖం మోహన మాత్మనః
నిద్రాలస్య ప్రమాదోత్థం
తత్తామసముదాహృతం  శ్లో - 39

ఆద్యంతముల యందు
మనుజునకు మోహము
కలుగజేయునట్టిదియును
నిద్ర, అలసత్వము, ప్రమోదము
వలన కలుగు సుఖము తామస
సుఖమని పిలువబడుచున్నది

న తదస్తి పృథివ్యాం వా
దివి దేవేషు వా పునః
సత్వం ప్రకృతి జైర్ముక్తం
యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః  శ్లో - 40

ప్రకృతి నుండి జనించిన
ఈ మూడు గుణముల నుండి
విడివడిన వస్తువు భూలోక
మందుగాని, స్వర్గలోకమందుగాని
దేవతల యందు గాని గోచరించదు



బ్రాహ్మణక్షత్రియ విశాం
శూద్రాణాం చ పరంతప!
కర్మాణి ప్రవిభక్తాని
స్వభావప్రభవైర్గుణైః శ్లో - 41

అర్జునా!
వారి వారి గుణములను
అనుసరించి బ్రాహ్మణ,
క్షత్రియ, వైశ్య, శూద్ర
అను వర్గములు ఏర్పాటైనవి

ఈ విషయము గురించి జాతిపిత మహాత్మాగాంధీగారి అభిప్రాయం ఈ విధంగా వుంది

Quite an amount of ignorant criticism is levelled at the doctrine of the performance of Svadharma(one's duty or function) taught in the Gita and the reason for it is the much-abused varna system. This is no place for making out a case for or against the so-called 'caste-system'. It is necessary here to make a few points clear and to point out the bearing of the system on the Gita doctrine. Much of the criticism is directed against a thing which is just a shadow of what existed ages ago. There was a system which existed in ages gone by, which served the then existing social organism magnificently, which was elastic and hence made it possible for a number of different groups of the same race and several races to live together in amity and peace. What we see today is its travesty, a fossil formed out of the incrustations of customs and practices of several centuries. Let not one judge the original from the ghost of it, and say that the author of the Gita sought to clothe a loathsome thing with divine sanction. The system of varnas we find described is certainly no rigid one. The division is no division into water-tight compartments. If the Gita can be said to admit a division, the division is, as we have seen, into two classes-daiva (divine) and asura(devilish)- and that too would hardly appear, on examination, to be a permanent division, inasmuch as there is an eternal war going on between the divine and the devilish in us, no matter to what class or caste we belong. It is therefore difficult for man to characterize or label

brother man. If he cannot lebel himself correctly, much less can he label any one else. Let us note then the main features of that elastic system: (i) The division was entirely vocational, in order that each might serve the best interests of the organism if men devoted themselvess to tasks for which their character and aptitude best fitted them they would be able to give of their best to the community. The criterion was not what one needed but wht one could give to the community; (ii) The division had regard to the requirements of the then existing society and these were broadly divided into (a) intellectual and spiritual, (b) defence, (c) production of wealth by (1) intelligent economy and by (2) labour. Each requirement was assigned to be fulfilled by a class possessing the particular gifts necessary for its fulfilment. The evident inequality of individual attainments was recognized, but the possession of gifts added to one's responsibility rather than improved one's rank. Thus to possess naught was one of the characteristics of a Brahmana whose wealth was that of spirituality and self-denial, while the production of wealth for the community was neessary for a Vaishya, to provide body labour was the privilege of a Shudra. (iii) Purity or virtue was the monopoly of none. Salvation was through the proper selfless performance of one's task. The Bhagawata Purana describes what have been rather loosely described as functions (Karmani) in the Gita as the natural characteristics (Prakritayah)- of the various classes and then says, the ethical rule of life is the same for all, viz. inoffensiveness, truth, non thieving, freedom from wrath and greed, desire to do good to mankind. Hence salvation was more difficult for those who had greater tasks to perform and easier for those entrusted with humbler functions. For these were not cumbered with much knowledge. Whilst it was easy, for instance, for a butcher or for a scavenger to carry on his forefather's profession with equanimity and detachment and as a sacrifice offered to God, it was quite likely for a learned Brahmana to darken counsel with much learning and even "with devotion's visage and pious action sugar o'er the devil himself." Among the Indian saints we have fewer from among the Brahmanas than from the non- Brahmanas. Among the saints of revered memory, Sena was a barber, Sajana was a butcher; Gora a potter, Raidas a cobbler, Chokhamela an untouchable, Tukarama a kunbi, and so on. None disclaimed his

profession but worked his salvation through a detached prayerful performance of it. (iv) The functions were hereditary because heredity is a law of nature, but there were no exclusive divisions, as we know from several cases of intermixure of functions and varnas in the Mahabharata. (v) the organism is shattered to pieces today and there are no defined classes that can answer to the description of the old varnas, but the rule to respect the law of nature may stand even today and all societies which are to any extent well- ordered would on examination be found to be based on a vocational division of some kind.

What then is one to do when performance of one's dharma is considered to be the highest morality, and dharma is to be determined by the shattered caste system?' is a critic's poser. The answer is that dharma or one's duty or the task to which one is born is no wooden phrase. It means the task to which one is born in the particular time or place we have in view.

New occasions teach new duties,

Time makes ancient good uncouth;

and whilest one's allotted task may have been fighting 2500 years ago, today it may be to carry on a bloodless war to end all wars; whilst it may have been a duty to kill a foe then, it may be one's duty to lay down one's life in defending a sacred principle or individual or national honour. 'One's allotted task' has its natural meaning and it should not be more difficult for any one in India to find it out than it is for any one in the West. This is how a modern author on Ethics expresses the moral law: "Thou shalt labour within thy particular province, with all thy heart and with all thy soul and with all thy strength and with all thy mind." That is too what Carlyle meant when he said:" Know what thou canst work at, and work at it like a Hercules." The gita makes the moral law clearer than any other ethical system inthe world by adding to the above some what to this effect: 'Work like a Hercules indeed, but offer thy work at the feet of the Lord as your humble flower of worship, without the thought of reward. A selfish performance even of the best thing would render it worse than void.' For, according to the Gita, doing one's duty is not the highest morality as our critic would assert; Doing one's duty in complete detachment and selflessness is the highest morality. Provided the work taken up is not morally forbiden, the sole criterion to determine its

moral value is detachment, selflessness. Selflessness is the sole content of right.

'But why, then, this insistence on svadharma and paradharma?' the critic rejoins. 'The Gita has no answer to give but this, viz. doing of other's duty is dangerous. Why does the critic want a better answer? The reason lies in the experience of the seer that when one runs after a duty which is not his he runs into a pit. Duties, like things, come to those who prayerfully wait for them, not to those who run after them. As Cardinal Newman sweetly said:

"So works the All-wise! Our services dividing
Not as we ask:
For the world's profit, by our gifts deciding
Our duty-task."

మహర్షి వినోబా యీ విధంగా తెలియజేస్తున్నారు.

చాతుర్వర్ణవ్యవస్థ స్వాభావికము, ధర్మము అయినందువలన నాకు చాల ప్రియము. ఈ స్వధర్మమును వదలినచో పనియే సాగదు. నాకు ప్రాప్తించిన జననీజనకులే నా తల్లిదండ్రులు. వారు నాకు నచ్చలేదనుటలో అర్థమేమున్నది? తల్లి దండ్రులు చేయువృత్తి స్వాభావికముగ పిల్లవానికి ఔరసత్వముగ లభించును. తన పెద్దలనుండి లభించిన వృత్తి నీతి విరుద్ధము కాకున్నచో దానిని సాగించుట చాతుర్వర్ణ్యవ్యవస్థలో నున్నవిశిష్టత. ఇట్టి వర్ణవ్యవస్థ ఈనాడు తారుమారయిపోయినది. దానిని పాలించుట నేడతికఠినమైపోయినది. కాని దీనిని సరియగు పద్ధతిలోనికి తీసికొని రాగలిగినచో చాల బాగుగా నుండును. లేనిచో జీవితములో మొదటి పాతిక, ముప్పది సంవత్సరములు ఒక క్రొత్తపనిని, నూతనవృత్తిని నేర్చుకొనుటలోనే గడచిపోవును. పనినేర్చుకొనిన పిమ్మట మనుష్యుడు తన సేవాక్షేత్రమును వెదకు కొనవలసివచ్చును. ఈ విధముగ మొదటి పాతిక సంవత్సరములును అతడు నేర్చుకొనుచునేయుండును. ఈ శిక్షణకును అతని జీవితమునకు ఏమియు సంబంధముండదు. అతడు "భవిష్య జీవితమునకు సిద్ధపడుచున్నా" నను. అనగా శిక్షణ పొందుచున్న సమయములో అతడు జీవించిలేడని, జీవించుట ఆ తరువాత నని అన్నమాట. మొదట అన్నియు నేర్చుకొనవలెనని, బ్రతుకుట తరువాత యని అతడనును. బ్రతుకుట, నేర్చుకొనుట రెంటికిని సంబంధము లేకుండ చేసికొన్నాడా యన్నట్లుండును. కాని జీవితములో సంబంధములేని స్థితిని మరణమందుము.

భారతదేశములో మనుష్యుని సరాసరి ఆయుర్దాయము ముప్పదిమూడు సంవత్సరములు. ఇందు పాతిక యేండ్లు జీవితమునకు తయారగుటలోనే అనగా క్రొత్తపని, వృత్తి నేర్చుకొనుటలోనే గడచిపోవును. అప్పుడెక్కడనైన అతడు పనిని ప్రారంభించవలెను. ఈ విధానములో మహత్త్వపూర్ణమైన, ఉత్సాహకరమైన కాలమంతయు నిరర్థకముగ గడచిపోవుచున్నది. లోకసేవలో సార్థకము కావలసిన జీవితము వృథాగా పాడగుచున్నది. మానవజీవితము పిల్లల ఆటవంటిది కాదు. జీవించుటకు వృత్తిని వెదకుకొనుటలో అమూల్యమైన మొదటి కాలమంతయు ఖర్చుపడిపోవుట చాల దుఃఖకరమైన విషయము. అందుచేతనే హిందూధర్మము వర్ణవ్యవస్థను ఏర్పరచినది.

చాతుర్వర్ణ్యవ్యవస్థమాట నటుంచినను, అన్ని దేశములలోను- ఈ వ్యవస్థ లేనిచోట్లకూడ- స్వధర్మ మనునది అందరకును ఉండనేయున్నది. ఒక ప్రవాహములో అందరమును ఒక్కొక్క పరిస్థితిలో జన్మించినందువలన స్వధర్మాచరణమను కర్తవ్యము దాని యంతట నదే మనకు లభించినది. ఒకనికి తనపరిస్థితిబట్టి ముఖ్యకర్తవ్యమైనది. మరొకనికి దూరస్థము, అనగా అప్రధానము కావచ్చును. అందువలన ఆ కర్తవ్య మెంత మంచిదిగా కనబడుచున్నను రెండవవాడు దానిని గ్రహింపరాదు. అది తన కర్తవ్య మనుకొనుట సరికాదు. తరచుగా దూరమున నుండు వస్తువులు అందముగా కనబడును. వానిని చూచి మనుష్యుడు మోహితుడగును. మనుష్యుని ప్రక్కనే దట్టమైన పొగమంచు వ్యాపించియున్నను వాని కది కనిపించదు. కొంత దూరములో కనబడు మంచును వ్రేలితోచూపి "అక్కడ మంచు ఎంత దట్టముగ నున్నదో చూడుము" అనును. అక్కడనున్న మరొకడు ఇక్కడ దట్టముగ పడుచున్నదనును. నిజమునకు మంచు అంతటను వ్యాపించియేయున్నది. కాని దగ్గరలో నున్నది కనబడదు. మనుష్యునికి దూరవస్తువులు రమణీయములుగా కన్పించును. దగ్గరదానినతడు నిర్లక్ష్యము చేయును. దూరపు దాని కొరకు కలలుగనును. ఇది మోహము. దీనిని వదలవలె. తనకు లభించిన స్వధర్మము సాధారణమైనదైనను, కొలదిపాటి దైనను, రసహీనమైనను, అది సహజప్రాప్తమైనది కనుక అదే నాకు అనుసరణీయము, శ్రేయోదాకము. సముద్రములో మునిగిపోవు వానికి చేజిక్కిన వంకర టింకర కొయ్య ముక్కయే ఆధారమగును అది సుందరముగా లేదని మెరుగుపెట్టబడలేదని దానిని వాడు త్రోసివేయడు. వడ్రంగి కర్మాగారములో మనోహరమైన నగిషీ చెక్కిన చెక్కలనేకము లుండును. కాని అవి యక్కడనే యున్నవి. ఇతడిక్కడ సముద్రములో మునిగిపోవుచున్నాడు. అందువలన ఆ వంకరటింకర చెక్కయే వానికి తారకము. దానినే యతడు పట్టుకోవలె. ఆ విధముగనే నాకు సహజప్రాప్తమైనసేవయే, అది అప్రధానముగ కనబడుచున్నను నాకుపకరింపవలె. ఆ సేవలో

నిమగ్నుడనై యుండుటయే నాకు శోభాకరము. అదే నన్నుద్ధరింపగలదు. అట్టి సేవను వదలి మరి యొకసేవ కొరకు వెదకు భ్రమలో పడినచో మొదటిది జారిపోవును. రెండవది చేజిక్కదు. అపుడు మనుష్యుడు సేవా వృత్తికే దూరమైపోవును. కాన స్వధర్మమను కర్తవ్యమునకే మనము కట్టుబడియుండవలెను.

మహర్షి మలయాళ స్వాములవారు ఈ విధంగా తెలిపారు.

దీనియందు క్రిందజెప్పబోయెడు నాలుగు రకముల వర్ణస్థులు వారి వారి జన్మాంతర సంస్కారముచే కలిగెడు త్రిగుణముల ననుసరించియే విభజింపబడినారని గుణము చేతనే జాతియని స్పష్టముగా నిరూపించడమైనది ఇందు వలన తమోగుణములో వుండువాడు ప్రయత్నపరుడై రజోగుణమునకును, సత్వగుణమునకును వచ్చెడి యవకాశము గలుగును. అలాగున రజోగుణముకలవాడు, సత్వగుణమునకును వచ్చుటకు మార్గమేర్పడును. అట్లవకాశము లేకపోయిన దానివలననే నిమ్నస్థితిలో నున్నవారున్నత స్థితిలోనికి వచ్చుట కవకాశము లేకపోయెను. ఇంగ్లీషు విద్యను నేర్చుకొన్నవారికి ఉద్యోగ మిచ్చుట వలన ఆ విద్య అంత వ్యాపకమగుటకును, అందరును చదువుటకు ఆసక్తియును గలిగినది. అలాగున ఉన్నతగుణము గలవానికి ఉన్నతస్థాన మిచ్చేలాగున నుండినచో, నిమ్నస్థితిలో నుండువారికి ఉన్నతస్థితిలోనికి వచ్చుటకు ఆసక్తిగలుగును. అట్టి పరిస్థితి భరతదేశమున లేకపోవుటచేతనే యీ దేశమడుగంటుటకు కారణమైనది. మరియు నిట్టి అవకాశము ఇతర దేశములలో నుండుటవలన ఆ దేశములున్నత స్థితిలోనికి వచ్చుటకు వీలేర్పడినది.

శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు ఈ విధంగా తెలిపారు

ఇది వరలో 4వ అధ్యాయమున 13వ శ్లోకమందు చాతుర్వర్ణ్యములవారు వారి వారి గుణములనుబట్టి కర్మలను బట్టి సృష్టింపబడిరని భగవానుడు చెప్పియుండురి. ఇప్పుడును ఆ భావమునే వ్యక్తీకరించుచు వారి వారి జన్మాంతర సంస్కారము వలన నేర్పడిన గుణముల ననుసరించియే వారి వారికి ఆయా కర్మములు, (వానిననుసరించి ఆయా వర్ణములు) విభజింపబడినవని తెలియజేయుచున్నారు. దీనిని బట్టి పుట్టుకతోనే జాతి ఏర్పడుటలేదనియు, వారి వారి గుణములను బట్టియే జన్మ, కర్మలు ఏర్పడుచున్నవనియు స్పష్టమగుచున్నది. ఇట్టి పరిస్థితియందు ప్రతివానికి ఊర్ధ్వస్థితికి బోవుటకు అవకాశము లభించుచున్నది.. అనగా జన్మనా నీచజాతియందు పుట్టినప్పటికి తమ తమ కర్మలయొక్క శుద్ధత్వముచే, పారమార్థిక సాధనాతిశయముచే, పవిత్రతచే ఉత్తమవర్ణస్థులుగా తయారుకావచ్చును. ఈ ప్రకారముగ సర్వులకును ఆధ్యాత్మిక ఉన్నతశిఖరముల నధిరోహించుటకు అవకాశములు కల్పించుట

గీతయొక్క ఒకానొక విశిష్టతయై యున్నది.

పూజ్య శ్రీ ఏ.సి. భక్తివేదాంతస్వామి ప్రభుపాదులవారు ఈ విధంగా తెలిపారు.

భగవద్గీతలో మానవుల వృత్తి ధర్మము నిర్దేశింపబడినది. పూర్వ శ్లోకములలో యిదివరకే చెప్పబడినట్లు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రుల ధర్మములు వారి వారి ప్రత్యేక ప్రకృతి గుణముల ననుసరించి నిర్దేశింపబడినవి. ఒకడు మరొకని ధర్మమును అనుకరింపగూడదు ప్రకృతిచే శూద్రకర్మ విధానముచే ఆకర్షింపబడిన వాడు తాను బ్రాహ్మణకుటుంబంములో పుట్టినను తాను బ్రాహ్మణుడనని కృత్రిమాభిమానము వహింపరాదు. ఈ విధముగా ప్రతివ్యక్తియు తన స్వభావమునననుసరించి పనిచేయవలయును. పరమ పురుషుని సేవలో చేయబడినచో ఏ పనియు హేయమైనదికాదు. బ్రాహ్మణుని యొక్క వృత్తి ధర్మము నిజముగా సాత్త్వికమైనది. కాని ఒక వ్యక్తి స్వభావముచే సాత్త్వికుడు కానిచో అతడు బ్రాహ్మణుని యొక్క వృత్తి ధర్మమును అనుకరింపరాదు. క్షత్రియునికి లేక పరిపాలకునికి చేయవలసిన హేయకార్యము లనేకములున్నవి. అతడు శత్రువులను చంపుటకు నిర్దాక్షిణ్యము వహింపవలసి వచ్చును. ఒక్కొక్కప్పుడు రాజకీయ తంత్రము కొరకు అతడబద్ధము చెప్పవలసి వచ్చును. అట్టి నిర్దాక్షిణ్యమును, కౌటిల్యమును రాజకీయ వ్యవహారముల యందు కనిపించును. కాని క్షత్రియుడు తన వృత్తి ధర్మములను విడిచి బ్రాహ్మణుని వృత్తి ధర్మము ననుసరించుటకు యత్నింపరాదు.

ప్రతివ్యక్తియు పరమపురుషుని తృప్తిచేయుటకు పనిచేయవలయును. ఉదాహరణ మునకు అర్జునుడు క్షత్రియుడైనను పరపక్షముతో పోరుటకు వెనుకంజ వేయుచుండెను. కాని దేవాదిదేవుడైన కృష్ణుని కొరకు ఆ యుద్ధము చేయబడినచో పతనభయము పొందవలసిన అక్కరలేదు. వ్యాపారము నందుకూడ ఒక్కొక్కప్పుడు వర్తకుడు చాల అబద్ధములు చెప్పవలసివచ్చును. అతడట్లు చేయనిచో లాభము కలుగదు. ఒక్కొక్కప్పుడు వర్తకుడు "ప్రియమైన గ్రాహకమహాశయా! నీ విషయమున నేనెట్టి లాభమును గ్రహించుటలేదు" అని చెప్పును. కాని లాభములేకుండ వర్తకుడు తన వ్యాపారము చేయజాలడని ఎరుంగవలెను. అందుచే వర్తకుడు తానెట్టి లాభమును గ్రహించుటలేదని చెప్పినప్పుడు అతడు చిన్న అబద్ధమాడినట్లు తలంపవలయును. కాని తప్పనిసరిగ అబద్ధము చెప్పవలసిన వృత్తిలో తానున్న కారణమున ఆ వృత్తిని విడిచి బ్రాహ్మణవృత్తిని గ్రహింపవలెనని వర్తకుడు తలంపరాదు. అట్టి పని ఉపదేశింపబడి ఉండలేదు. ఏ వ్యక్తియైనను తన పనిచే దేవదేవుని సేవించినచో అతడు క్షత్రియుడైనను, వైశ్యుడైనను, శూద్రుడైనను ఇబ్బంది లేదు. బ్రాహ్మణులు కూడ వివిధములైన యజ్ఞములు చేయునప్పుడొక్కక్కప్పుడు అట్టి యజ్ఞములలో పశువులను బలి

ఈయవలయును, కావున వానిని చంపవలసివచ్చును. అట్లే క్షత్రియుడు తన వృత్తిలో నియుక్తుడైనప్పుడు శత్రువును చంపినచో ఎట్టి పాపమును కలుగదు. తృతీయాధ్యాయమున ఇట్టి విషయములు స్పష్టముగను వివరముగను విశదీకరింపబడినవి. ప్రతివ్యక్తియు యజ్ఞముకొరకు లేక దేవాదిదేవుడైన విష్ణువు కొరకు పని చేయవలయును. ఆత్మేంద్రియ తృప్తికొరకు చేయబడునదేదైనను బంధకారణమగును. ప్రతివ్యక్తియు తాను పొందిన ప్రకృతిగుణము ననుసరించి కార్యతత్పరుడు కావలయుననియు, పరమపురుషుని దివ్యకార్యము కొరకు మాత్రమే పనిచేయుటకు నిశ్చయింపవలెననియు దీనివలన తెలియు సారాంశము.

శ్రీ నోరి శ్రీనాధవేంకట సోమయాజులుగారు ఈ విధంగా అభిప్రాయపడ్డారు.

"బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుల కర్మలు వారి వారి స్వభావముతో పుట్టిన గుణాలను అనుసరించి విభజింప బడ్డాయి, స్వభావము అంటే ఈశ్వర ప్రకృతి, అది త్రిగుణాత్మకము, దానినే మాయ అంటారు. సత్వ రజస్తమో గుణాలనను సరించే వారి వారి కర్మల విభాగములు జరిగినవి"

గీతా సాంఖ్య వ్యాఖ్యాత శ్రీ శార్వరి ఈ విధంగా తెలుపుతున్నారు

పై శ్లోకంలో 'వర్ణం' అనే మాట లేదు. కనుక అది గుణకర్మలను బట్టి జరిగిన వర్గ విభజన అనుకోవచ్చు.

నాల్గవ అధ్యాయం 13వ శ్లోకంలోనూ, ఇక్కడ వున్న చాతుర్వర్ణ విభాగం భగవంతుడే చేశాడట- ఈ భగవంతుడు ప్రకృతి గుణాలకు అనుకూలంగా ఏర్పాటుచేసిన వర్గవిభజన ఇది. తనకు వాటిలో భాగం లేదు. ఈ వర్ణ విభజన ప్రకారం శ్రీ కృష్ణుడు శూద్రుడు కావాలి, అర్జునుడు క్షత్రియుడు అయివుండాలి కనుక ప్రధానమైన అంశం వారి వారి జన్మ సంస్కారం ప్రకృతి శక్తులు వారిలో పనిచేస్తున్న తీరు- దానికి 'జన్మ' తో సంబంధంలేదు. జన్మనుబట్టి గుణాలు ఏర్పడవు- ఆయా గుణాలు, స్వభావాలు మనిషి అర్హతను నిర్దేశిస్తాయి మనిషిని వర్గీకరిస్తాయి- గీత మోక్షమార్గాన్ని చూపుతుంది కనుక అందులో కులాల విభజన ఉండటానికి వీల్లేదు- జీవన సూత్రాలు ఆచరించటంలో కొందరు అర్హులు, కొందరు అనర్హులు కారు.

మానవులు అవతరించిప్పుడే ఈ నాలుగు కులాలు ఏర్పడ్డాయని ఛెప్పే మాటలకు ప్రమాణం లేదు. దాని అవసరం అసలు కనిపించదు- దానిని ఒకనాడు శాశ్వత ప్రాదిపదిక పైన ఏర్పడిన విభజనగానూ అంగీకరించనవసరం లేదు. సమాజ పరిణామంలో, కొన్ని కాలాలలో అవి అవసరమై ఉండవచ్చు. మన దేశంలోను, అంతస్తులను బట్టి తెలివి తేటల్ని బట్టి

అంతరాలు ఏర్పడి అది చారిత్రక ప్రాచుర్యాన్ని సంతరించుకొని వుంటాయి. ఇలాంటి అంతస్తులు ఈనాడూ కొన్ని వర్ధమానదేశాలలో, కులాల విభజనలేనిచోట్ల కూడా కనిపిస్తున్నాయి. తెల్లవారు, నల్లవారు, రెడ్ ఇండియన్స్ వంటి వర్ణజాతుల భేదం అదే- ఈ వర్ణ, వర్గ విభేదంలో 'మతం' పాత్రలేదు- అది కేవలం సామాజికమైన వేర్పాటు. ఏర్పాటు- చరిత్రలో అనేక అవగతులు ఏర్పడి వుంటాయి. ఒక తరగతి వారు మరొక తరగతి వారిని హీనంగా చూడడమన్నది వారి వారి ఆర్థిక అంతస్తులు, మేధా సంపదను బట్టి ఏర్పడినదే. మనిషిలో అహం, స్వార్థం ఈ వర్ణ విభేదానికి ప్రధాన కారణాలు. గీత ప్రకారం ధర్మానికి విలువ ఎక్కువ. ప్రతి మనిషి స్వధర్మాన్ని అనుసరించాలి. పరుల ధర్మం తనది చేసుకోరాదు. అర్జునుడికి శ్రీకృష్ణుడు చేసిన ప్రధానమైన బోధ అదే.

హిందూమతంలో కుల విభజన కృతయుగాంతాన జరిగి ఉంటుంది. (కృతయుగం- అనాగరిక- మానవజాతి యుగం) అంతకు ముందున్నది ఒకే ఒక్క వర్గం. కొంత పరిణామం తర్వాత, కొంత సమాజక్షేమం దృష్ట్యా ఈ విభజన ఏర్పాటైంది. అప్పటి వాతావరణం,పరిస్థితులు వేరు. ఆ విభజన ఈనాడు బొత్తిగా అవసరంలేదు ఈనాడు మనిషి ఒంటరిగా, దూర దూరంగా జీవించడం లేదు- కనుక ప్రాచీన విభజనను, వర్ణాలను నెత్తిన పెట్టుకో పని లేదు. కులాలు ఇప్పుడు మానవులను ఒక త్రాటిపైన నడపాలన్న 'ప్రేరణ'కు మూలమైనాయి. నూతన మానవతావిష్కరణకు అదే ఆలంబనం అయింది. కృతయుగంలోవలె మరల మానవజాతి యావత్తు ఒకే వర్గం అవుతుంది.భారతీయాత్మ ఆ మహత్కార్యం నెరవేర్చగలదు- పర'బ్రహ్మ' భావనే ఆ పని చేయిస్తుంది. జన్మను బట్టి ధర్మం నడవటం పురాణ కాలం నుండీ లేదు. వ్యాసమహర్షి కుమారులైన ధృతరాష్ట్రుడు, పాండురాజు క్షత్రియులు కావటం ఎలా సాధ్యం? కనుక 'జన్మ' ముఖ్యంకానేకాదు.

శ్రీరామకృష్ణమిషన్‌కు చెందిన శ్రీ చిద్భవానందస్వాములవారు ఈవిధంగా తెలుపుతున్నారు.

Svabhava is another name attributed to Prakriti or the Maya Sakti inherent in Iswara. This consmie reality is constituted of the three Gunas. Variation in karma is based on the variation of the Gunas. Karma in its turn leaves its samskara or impress on the mind. As the samskaras get themselves refined, they go to modify the nature or svabhava of the individual. That karma and svabhava are inseparable is a fact ever to be borne in mind. The varna or the grade of evolution of a Jivatman is based on his svabhava or nature. So it is possible to know of the varna of an individual from his svabhava and his karma. Of the two, the svabhava is subtle and hard to be observed. A man of intuition alone can see into it just as we all congnize the contents of a glass case, Karma, on the other hand, is gross. It is possible for us to get at the varna of a

man from the karma to which he is given. The way in which a man makes use of his life is a sure indicator of the varna of that man.

Why has God made some great and others small? is a stock question. But this question is meaningless to the knower of the fundamental. Creation is impossible without differentiation. No two things or beings are alike in the Cosmos. Going back to sameness is going back to destruction, a state unwanted by beings. Creation proceeds on the basis of differentiating one from another. Limbs in the body vary with their functional differences. Bodies vary; species vary; at tempts vary; attainments vary. There is a grandeur in the infinite varieties exhibited by Nature. The omnipotence of the Lord stands self- explained in this way. Infinite scope is provided in Nature for the low to evolve into the high. Life fulfils itself by attempting and attaining the high, stage by stage. Varna dharma is nothing other than a reading of this plan of Nature at all levels in general and at the human level in particular.

గోరక్‌పూర్ గీతప్రెస్‌వారు ప్రచురించిన శ్రీమద్భగవద్గీతకు వాఖ్యవ్రాసిన "శ్రీ జయదయాల్ గోయద్కా వారి అభిప్రాయం ఈ విధంగా వుంది

The duties of the Brahmanas, the Ksatriyas and the Vaisyas, as well as of the sudras, have been divided according to thier inborn qualities, Arjuna.

The Brahmana, the Kstriya and the Vaisya- all these three belong to the category of Dvijas or the twice- born. All the three are entitled to wear the sacred thread (Yajnopavita) and to study the Vedas and perform Vedic rites such as sacrifices and so on. That is why the three words 'Brahmana', 'Kstriya' and 'Vis' have been compounded. The Sudras are not included among the Dvijas and are not competent to wear the sacred thread, study the Vedas or perform sacrifices and other Vedic rites. It is in order to bring out this distinction that the word 'Sudranam' has been separately used.

The sum- total of tendencies or predispositions formed as a result of ations performed by a particular Jiva through a number of lives is known by the name of Svabhava or nature. It is in accordance with this nature that the three Gunas,- Sattva,

Rajas and Tamas- manifest themselves in the mind of living beings. This is what is sought to be conveyed by the use of the compound adjective 'Svabhaveprabhavaih' before 'Gunaih'. Again, it is in accordance with the manifestation of these Gunas that men are born in different castes such as the Brahmanas and so on. Therefore, it is on the basis of these Gunas that the duties of the four Varnas or grades of society have been apportioned by the Sastras. The man who possesses an abundance of unmixed Sattva is born as a Brahmana, hence control of the mind and senses etc., have been declared to be his natural duties or functions. He whose nature is marked by an abundance of Rajas mixed with Sattva is born as a Ksatriya; hence exhibition of valour and interpidity have been declared as his natural duties. He whose nature possesses an abundance of Rajas blended with Tamas is born as a Vaisya; hence agriculture and rearing of cows etc., have been declared to be his natural avocation. And he whose nature is dominated by Tamas mixed with Rajas is born as a Sudra; hence service of the other three classes has been declared his natural duty. This very idea has been explained at length in the commentary on verse 13 of Chapter IV.

శ్రీ శిష్ట్లా సుబ్బారావు ఎం.ఏ గారి అభిప్రాయం ఈ విధంగా వుంది.

జన్మతః నైజమగు గుణకర్మలనుబట్టి వర్ణధర్మము లేర్పడినవి. తమోగుణ ప్రదానుడగు జీవుడు శూద్రుడు. అజ్ఞానము, దేహాభిమానము, ఇంద్రియ సుఖాపేక్ష ఈ జీవికి ప్రధాన లక్షణములు. తమోగుణము యొక్క జడత్వమును, దేహాభిమానమును, వీడుటకే కాయకష్టమును, సేవయు, వీరికి విధింపబడినవి. తమోగుణయుక్తమగు రాజస జీవులు వైశ్యులు. వీరియందు దేహాభిమానముతోపాటు ధనార్జనాసక్తి మెండు. కావుననే ద్రవ్యార్జనము ప్రధాన సాధనములగు పాడిపంట వర్తకము వీరికి నైజకర్మము లైనవి. సత్త్వమిశ్రిత రజోగుణులగు జీవులు క్షత్రియ జాతికి చేరినవి. వీరియందు ఐశ్వర్యము, అధికారము భోగాసక్తితోపాటు త్యాగబుద్ధి యుండును. కావుననే అవసరమైనపుడు వీరు ప్రాణములను కూడ త్యజించుటకు సంసిద్ధులై యుందురు. ఇక సత్వగుణ విశిష్టులగు జీవులు బ్రాహ్మణులు. వీరు విషయ సుఖాసక్తి లేక వైరాగ్యసంపన్నులై తపస్సే ధనముగా గలిగి శమదమాది గుణముల నలవరచుకొని ఆధ్యాత్మికోన్నతికి పాటుపడుదురు. ఇట్లు సాంఘికముగా నాలుగు వర్ణము లెట్లేర్పడినవో అట్లే వ్యక్తిగత జీవితములో బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము అని నాలుగు ఆశ్రమము లేర్పడినవి. స్త్రీలకు గూడ మానవజాతికిగల సామాన్య ధర్మములతోపాటు వారి

ప్రత్యేక పరిస్థితుల ననుసరించి వారు తమతమ నియమిత ధర్మములను స్వలాభమునకు గాక మానవసేవయే మాధవసేవయను భావముతో సంఘసేవ యొనర్చి తద్వారా ఈశ్వరారాధన మొనర్చుటయే జీవిత పరమ లక్ష్యము. ఇట్లొనర్పబడు కర్మలవలన చిత్తశుద్ధి గలిగి మోక్షము కరతలామలక మగును. ఇట్టి కర్మనే శ్రీశంకరులు "యద్యత్కర్మ కరోమిత్తత దుఖిలం శంభో తవారాధనమ్" అని వక్కాణించిరి. మహాభారతమందలి తులాధర ధర్మవ్యాధుల చరిత్ర లిందుకుదాహరణము.

శ్రీ సత్యసాయిబాబా గారు ఈవిధంగా తెలుపుతున్నారు.

భగవత్ విషయమున చిత్తశుద్ధికి ప్రధానస్థానమిచ్చిననూ, పరిపాలనాపద్ధతికి వర్ణవ్యవస్థ, ఈ కట్టుబాట్లు అత్యవసరము. దీనిని యెంత ద్వేషించి పనికిరాదని పారవేసిననూ ఇది పారిపోవునదికాదు. లోక క్షేమము సర్వులకూ ప్రధాన అంశమే కనుక తొందరపడక విచారణ సలిపి పండితులు ప్రభువులు దీనిని ఒక మార్గమునకు తెచ్చుట చాలా మంచిది. ఎవరో అసూయాపరులు వర్ణముపై లేనిపోని దూషణలను రెచ్చగొట్టి నంతమాత్రమున బుద్ధిమంతులూ విద్యావంతులూ కూడా దానిని బలపరుచుట న్యాయమార్గముకాదు. వర్ణము లేదనుటా ఒక వర్ణమే. మతము లేదనుటా ఒక మతమే కదా! ఈ చిన్న విషయమును కూడా యోచించక అన్నియూ తెలిసినవారు కూడా ఈ విషయమున వివేకశూన్యులగుచున్నారన్న ఆశ్చర్యము! ఒక్కొక్క వస్తువునకు కూడా ఒక్కొక్క హద్దు కలదు. ఆ వస్తువులు దానికి నియమించిన హద్దునుమీరిన ఆ వస్తువే నాశనమగును. స్వభావ స్వరూపములు ఏకమగుటే వస్తువు యొక్క సత్యము, అట్లుగాక స్వరూపముమాత్రముండి స్వభావము లేకుండిన అది నిత్యవస్తువుకాలేదు కదా! అటులనే ఒక్కొక్క వర్గమునకు స్వభావమను హద్దులు లేకుండిన ఆ వర్గము యేవర్గముగా నుండును? త్రిశుంకుస్వర్గముగా నుండును. లోకసంరక్షణార్థమై భగవంతుడు నియమించిన హద్దులను మహనీయులు తరతరముల నుండి కాపాడుకొనివచ్చుచుండగా నేడు ఈ కలిలో అతితెలివితేటలు గలవారు దీనిని పనికిరాని పదార్థముగా పాటించుచున్నారు. విచారణచేయక, వివేకముపయోగించక బాహ్యదృష్టితో వ్యష్టిభావముతో చూడరాదు. సమష్టిభావముతో అంతర్దృష్టితో వివేక విచారణలతో పరిశోధించిన పవిత్రత తప్పక పైకి తేలగలదు. పాలలో సర్వ వ్యాపిగా వున్న వెన్నను చక్కని పద్ధతితో మర్దనసల్పిన పైకి విడిగా వచ్చి తేలునటుల నాలుగు వర్ణములందూ వున్న నాణ్యమైన పవిత్రత వివేకబుద్ధితో విచారణ సలిపిన విశదమగును. వికారములు మారును, విషయము తేలును.

ఇదే వర్ణవ్యవస్థను మరి కొంతమంది వేరొక రకమున ప్రచారము సల్పుదురు.

ఏదెట్లున్ననూ, ఒక దేహమందుండిన అంగమువలె ఈ నాలుగు వర్ణములూ నాలుగు అంగములుగా నిలిచినవి. భగవంతుడను దేహమునందే ఉద్భవించిన అంగములే ఈ వర్ణములు. ముఖమునుండి బ్రాహ్మణులనియూ, భుజముల నుండి క్షత్రియులనియూ, తొడల నుండి వైశ్యులనియు, పాదముల నుండి శూద్రులనియు చెప్పబడుచున్నది. అయితే దీనికి సూక్ష్మార్థము వేరు కలదు. గురువువలె జ్ఞానమును ఉపదేశించుటకు వాక్కువంటివాడు బ్రాహ్మణుడనియు, భూభారము వహించువాడు బాహుబలుడగు క్షత్రియుడనియు శరీరమును నిలబెట్టు తొడలవలె సంఘ సౌధమును నిలబెట్టు సమర్థుడు వైశ్యుడనియు, తిరిగి పనీ పాటు చేయుటకు పాదములుపయోగమగునట్టితరి కృత్యములు చక్కబెట్టువాడు, శూద్రుడనియు భావము. శరీరమునకు యే అవయవములు లోటువచ్చిననూ దానికది కొరతయే యగునట్లు సంఘమున కీ కార్యములు చేయువారిలో నెవరు లోటయిననూ లోపము వచ్చి క్షేమము చెడును. శరీరావయవములు అన్నియూ ఉత్తమములయినట్లు వర్ణములన్నియూ శ్రేష్ఠములయినవే. కాలుచేతులు కడుపుపై కోపించి పనిమానుటవంటిదే వర్ణవైషమ్యము. ఒక చక్కెర బొమ్మనుండి వచ్చిన పదార్థములే కదా! తల గిల్లుకొని నోటిలో వేసుకొన్ననూ తీపే కాలుగిల్లుకొని నోటిలో వేసుకొన్ననూ తీపే. అన్నీ ఒక పరమాత్మ దేహము నుండే వచ్చిన ఈ వర్ణములను అంగములు వేరెట్లగును! కర్మలు వేరు వేరు కాని రక్తనాళములూ సుఖదుఃఖములూ, అందరికి ఒక్కటే. దేహమంతా సమాన రక్తమే ప్రసరించును కానీ చేతులకొక రక్తము, పాదములకొక రక్తమూ, ముఖమునకు మరొక రక్తమూ ప్రవహించదు కదా! ఇది వేదవిహితమైన సమానధర్మము కానీ కల్పితమైన మానవ నియమములు కావు, కనుక వర్ణవ్యవస్థను అర్థము చేసుకొనక, వాటివలన లోకమునకు అనేక భేదభావములు కలుగుచూ ద్వేషములకు గురియగుచున్నట్లు తలంచుట అజ్ఞానము తప్ప వేరుకాదు.

వర్ణవ్యవస్థను నిర్మూలము చేసిన లోక క్షేమము కలుగునని వాదించువారు మాత్రమే లోక క్షేమమును కోరుచున్నారని వారు భావింతురు కాబోలు! వర్ణవ్యవస్థ మంచిదని వాదించువారు లోకమునకు హాని కోరువారని వారి ఉద్దేశ్యమై యుండవచ్చును; ఇవి రెండునూ భ్రమలే, వర్ణవ్యవస్థను వ్యతిరేకించువారికంటే వర్ణవ్యవస్థను కాపాడవలెనను వారలలోనే లోకక్షేమము నిండుగా దండిగా నుండును. అది వారు తెలిసికొనలేకున్నారు. ఏదో వర్ణవ్యవస్థను నిర్మూలము చేసిన మేము దేశాన్ని కాపాడినవారముగుదుమని భ్రాంతిపడుచున్నారు. అది అమాయకపు తృప్తి. వర్ణవ్యవస్థను వ్యతిరేకించువారు కానీ పోషించవలెనను వాంఛకలవారు కానీ, చక్కగా విచారణ సల్పి మంచి చెడ్డలు స్పష్టముగా దెల్పి తదుపరి పరిపాలించుటో పాడు చేయుటో చూచుకొనవచ్చును. కాని, వూరికే విషయము

తెలియని వాదనలలో విపరీతార్థములు చెలరేగించిన వింతమార్పు కలుగును. ద్వేషము పెరుగును. అది యెవరికీ క్షేమము కాదు. యెండమావులు జలమను భ్రాంతిచేత తరుముకొనిపోయినట్లు సర్వం సమానమను భ్రాంతితో సర్వులకూ అశాంతిని కలిగించుచున్నారు. ప్రజా ప్రతినిధులయిన పండితులునూ, అనుభజ్ఞులయిన పెద్దలును చేరి పరిపాలకులు పరిశోధనలు సలుపుట చాలా మంచిది. కానీ వీటి విషయమే తెలిసికొనక బాహ్యకర్మలనే ప్రధానముగా పట్టుకొని ఇందులో యేదో విషయమున్నదని అదిరిపడుట అవివేక లక్షణము. పరి పాలకులకు, పండితులకు ప్రజాక్షేమమే ప్రధానము. అసలు ఈ వర్ణములు అందరి క్షేమమునకే అవతరించినవి. దీనిని వినియోగించు విధానములు అనుభవజ్ఞుల ద్వారా యోచించక, ఆచరించక, ఇన్ని అపోహలకు దారి తీసినవి. ఒక చిన్న ఉదాహరణము యోచించుడు. ఇపుడు పరదేశీయులు లక్షలమందిని చంపే బాంబులు తయారుచేసినారు. అవి చెడ్డవనే తెలుసు. వాటికి ప్రభుత్వమే అనేక విధముల తోడ్పడుచున్ననూ చేసిన శాస్త్రజ్ఞుడు తెలివితేటలు గలవాడైననూ వినియోగించే విషయమున, తిరిగి ప్రభుత్వపు అనుమతి అవసరముకదా! చెడ్డవాటికి ప్రభుత్వము సర్వసహాయము చేసిననూ అది అవసరమును బట్టి వినియోగించవలెనేకాని చేసితిమికదా యని యిష్టమొచ్చినట్లు ఉపయోగించిన అందికీ ప్రమాదమే! లోకమున అరాజకము సంభవించినపుడు ఆత్మరక్షణకొరకు వారి వారి దేశరక్షణ కొరకు వాటిని ఉపయోగింతురేకాని లోకమునే నాశనము చేయవలెనను దృష్టికాదుకదా!

అట్లే వర్ణములను తీక్షణమైన రక్షణలను, వారి వారి కర్తవ్యములను కొనసాగించి దేశమును రక్షించునట్టి ఆయుధములనే భావించవలెను. వాటిని యే యే విధముగా క్రమము తప్పక వినియోగింతుమో భద్రపరతుమో అట్లే వాటిని ఆచరించి భద్రపరచవలెను. కానీ వాటిని హద్దూ పద్దూలేక ఇష్టమొచ్చినట్లు ఉపయోగించుటచే ఇంతటి అరాజకమునకు గురి అయినవి. కనుక పూర్వపురుషులు, మహారాజులు, ఉత్తమ పండితులు అనుభవజ్ఞులయిన మహానుభావులు. వీటినెంతటి పవిత్రముగావాడి, తరించి ఇంతకాలము కాపాడుకొనివచ్చినరో ఒకపరి యోచించిన అవి మంచివా చెడ్డవా అని బుద్ధిమంతులకు గోచరము కాగలదు. అవి లోకమునకు అపకారమే చేయునవయినా వారల కేమీ తెలివిలేకనా, లేక ఇప్పటి కాలపు చదువు సంధ్యలు లేకనా, అసలు అమాయకులా? కాదు కాదు, వారి తెలివితేటలు, వారి బుద్ధికుశలతలు వారి ఆత్మవిద్యలూ, వారల పరిశోధనాబలములూ, ఇప్పటివారలలో వెతికిననూ కోటికొక్కరిలో చిక్కవు. వారు కందమూలాదులు భక్షించి, కాయకష్టములు సలిపి, లోకక్షేమమును ప్రాణముగా భావించి తమ తమ సర్వశక్తులనూ ధారబోసిన మహాత్యాగులు, యోగులు, యోధులే, నిజమైన దేశక్షేమమునుకోరి, ఆశించి అన్ని విధములా ధీకొట్టిన మహాబుషులు.

ఇప్పటి వారలవలె మాటలతో క్షేమమును కోరుచూ చేతలతో అంతా నాశనమేచేయుట పూర్వీకులకు తెలియని విద్య. ఇట్టివే నేటి నూతనభావములు నవీనప్లానులు; వీరి ప్లానులు గాలి మేడలు, వారివి వారికే తెలియును తప్ప అన్యులకు అర్థముకాదు. ఒకవైపు కట్టుచూవచ్చుచుండిన మరొకవైపు కూలుచూ వచ్చుచుండును; వూహామేడలు.

జీవునకు దేహమెట్లు ప్రధానమో దేవునకు దేశమట్లు ప్రధానము. దేహమునందలి యే భాగమున యేమి జరిగిననూ జీవునకెట్లు సంబంధమో దేశమున యే భాగమున యేమి ప్రమాదము జరిగిననూ, దేవునకట్లే సంబంధించియుండును. దేహములోని సర్వాంగములూ యెట్లు క్షేమముగా నుండకోరుచుందుమో, దేశములోని సర్వప్రాంతములూ అంత క్షేమముగా నుండవలెననే దేవుని భావము. దేశమంతా దేవుని దేహమయినపుడు, తన అంగముల నాశమును దైవము కోరుకొనుననుట వివేకమా? దైవవిషయమున సర్వులూ సమానులే. దైవమును పొందే విధానమున సర్వులకు అధికారమున్నది. కాని యేయే అవయవములు యే యే కర్మలు చేసి తమ తమ కర్తవ్యమును జరుపవలెనో ఆయా అవయవములు అట్లు చేయవలెను. అట్లే ఆయా వర్ణములవారు తమ తమ హద్దులను దాటక తమతమ కర్తవ్యములను సలిపి దేశక్షేమమునకు పాటుపడవలెను. దేహమున కెట్లు అవస్థాభేదములున్నవో అట్లే దేశమునకు వర్ణములు అవస్థాభేదములు, అట్లుకాక వ్యాపారము చేయువారే అందరూ వుండిన కొనువారెవరు? అందరూ యుద్ధముచేయువారే వుండిన వారికి తగిని తిండి, తీర్థములు , సరఫరా చేయువారెవరు! అందుకనే ఒకరు ఒక వర్గమను వర్ణమును నియమించుకొని, వారి వారి పనులు వారు చేయుచూ, తమ తమ కర్మలన్నియూ దేశ రక్షణ నిమిత్తమని భావించుట చాలా ఉత్తమ మార్గము, చేయవలసిన వెన్నియో ఉండగా అనవసరంగా వర్ణములను అడ్డుపెట్టుకొని మనలోమనము యుద్ధము చేయుచున్నాము. మనం మన దేహములనే హద్దులో పెట్టుకొనలేనివారలము ఇక దేశము నేమి హద్దులో వుంచగలము! వర్ణకలహములుమాని దేశక్షేమమును యోచించుట మంచిది. ఇంత కాలమూ మన పూర్వీకులు యెట్లు కాపాడుకుంటూవచ్చారో అటులనే నేడునూ మన వర్ణములను కాపాడుకొనుట దేశమునకే పరమశ్రేయస్సు.

ఈ వర్ణవ్యవస్థలో పరమాత్ముడు యెట్టి పక్షపాతమూ చేయలేదు. అతనిలో అట్టిగుణమేలేదు. భగవంతునికి కూడా ఈ భేదమెందుకని కొందరు తలంతురు అతనిలో భేదము యేకొననులేదు. చక్కెర ముద్దవంటి చల్లనివాడు. తియ్యనివాడు దేవుడు, సర్వభేదములూ, బాధలూ, అనాత్మభావముగల జీవుల కల్పనలేకానీ దేవుని కల్పనలుకావు.

ఉదాహరణమున కొకవిషయము యోచింతము: ఒక తల్లికి నలుగురు పిల్లలు గలరు. నలుగురూ ఒకే తల్లి గర్భమునుండి జన్మించినవారే! కాని, తొట్టిలో పరుండబెట్టిన బిడ్డ యోగక్షేమములు చూచినట్లు మిగిలిన పిల్లలను ఆ తల్లి చూడదు. అంతేకాక పిల్ల పిలువకపోయిననూ కాలకాలములకూ తగిన ఆహార సదుపాయములు తల్లియే గమనించుచుండును. మిగిలిన ముగ్గురు బిడ్డలూ వచ్చి అడిగిననే అన్నము పెట్టును, ఆటబొమ్మలిచ్చును. అంతమాత్రముచేతనే తల్లి భేదబుద్ధిగలదనికాని, తన ప్రేమంతా కడగొట్టుబిడ్డపై నున్నదనికాని చెప్ప వీలులేదుకదా! బిడ్డలయొక్క శక్తిసామర్థ్యములను పట్టి ఒక్కొక్క రక్షణ బాధ్యతను దేవుడు నియమించినాడు. అట్టి నిస్స్వార్థమైన, నిర్దోషియైన, నిరాడంబరుడైన నిత్యానందునిపై నిందలు మోపుట సూర్యునిలో చీకటిని వెతకుటవంటిది. తన కిరణములు పడినవెంటనే చీకటి పతాపంచలమైపోవును. అట్టిది ఇక తనలో చీకటి నిలచుటకు వీలగునా! ఇది యెంత అజ్ఞానము! ఇట్టివారలను సూర్యుని విషయమే తెలియని వారనవచ్చును.

అసలు ఆధ్యాత్మికదృష్టిలో ఈ వర్ణములను మరొకరీతిగా భావించవలసియుండును. బ్రహ్మనిష్ఠగలవాడే బ్రాహ్మణుడు, అసత్యపక్షమును ధిక్కరించువాడే క్షత్రియుడు; సదా సద్విచారముచేయజాలెడి వ్యవసాయాత్మిక బుద్ధిగలవాడే వైశ్యుడు; కర్మనిష్ఠా సత్యాచరణను సల్పువాడే శూద్రుడు; మానవత్వము పొందుటకు ఈ నాలుగు వృత్తులు అత్యావశ్యకము.

శమోదమస్తపఃశౌచం
క్షాంతిరార్జవమేవ చ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం
బ్రహ్మ కర్మ స్వభావజమ్ శ్లో - 42

అంతరింద్రియనిగ్రహము
అంటే మనోనిగ్రహము
బాహ్యేంద్రియ నిగ్రహము
తపస్సు, శుచిత్వము
ఋజుమార్గవర్తనము
శాస్త్రజ్ఞానము, అనుభవ
జ్ఞానము, ఆస్తిక్యము
కలిగియుండుట బ్రాహ్మణ
కర్మమై యున్నది

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం
యుద్ధే చాప్యపలాయనం
దానమీశ్వర భావశ్చ
క్షాత్రం కర్మ స్వభావజమ్ శ్లో - 43

శౌర్యము, తేజస్సు
అంటే కీర్తి, ప్రతాపములు
ధైర్యము, సామర్ధ్యము కలిగి
యుండి యుద్ధభూమి నుండి
పారిపోకుండా వుండడం
దానప్రవృత్తి కలిగియుండడం
సమర్ధవంతమైన పాలనాశక్తి
కలిగియుండడం అనునవి
క్షత్రియునకు నియమితకర్మలు
అయివున్నవి

కృషిగోరక్ష్య వాణిజ్యం
వైశ్యంకర్మ స్వభావజం
పరిచర్యాత్మకం కర్మ
శూద్రస్యాపి స్వభావజం శ్లో - 44

వ్యవసాయము, పశుపాలనము
వర్తకము వైశ్యునకు స్వభావ
సిద్ధమైన కర్మలు కాగా పరిచర్యలు
చేయుట శూద్రునకు స్వభావ
సిద్ధమైన కర్మ అయివున్నది

ఈ వ్యవస్థపై మహర్షి దయానందస్వాములవారు తమ సత్యార్థ ప్రకాశంలో యీ విధంగా తెలియజేశారు.

వివాహము వర్ణానుక్రమముగ జరుపవలయును. వర్ణవ్యవస్థ గుణకర్మ స్వభావము ననుసరించి యుండవలయును.

నాలుగు వర్ణముల కర్తవ్యకర్మలు, గుణకర్మలు.

అధ్యాపన మధ్యయనం యజనం యాజనం తథా,
దానం ప్రతిగ్రహశ్చైవ బ్రాహ్మణానా మకల్పయత్. మను 1-88
శమో దమస్తపః శౌచమ్ క్షాంతిరార్జవమే వచ,
జ్ఞానం, విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్. భ.గీత. 18-42

చదువుట, చదివించుట, యజ్ఞముచేయుట, చేయించుట, దానమిచ్చుట, గ్రహించుట అను నీ యాఱు కర్మములు బ్రాహ్మణునివి. కాని, 'పరిగ్రహ'ప్రత్యవరః' (మను.10.109) ప్రతి గ్రహము = దానము గ్రహించుట నీచకర్మము. (1)

శమః=మనస్సుతో దుష్టకర్మ మొనర్చుట నెన్నడు గోరరాదు. దమః=నేత్రాది బాహ్యేంద్రియముల నన్యాయాచరణము నుండి మరల్చి, ధర్మమునందు లగ్నముచేయుట, తపః = బ్రహ్మచర్యముతో జితేంద్రియుడై ధర్మానుష్టాన మొనర్చుట. ఇక శౌచము.

అద్భిర్ గాత్రాణి శుద్ధన్తి మనః సత్యేన శుధ్యతి,
విద్యాతపోభ్యాం భూతాత్మా బుద్ధిర్ జ్ఞానేన శుధ్యతి. మను,

జలముతో శరీర బాహ్యాంగములు, సత్యాచరణమువలన మనస్సు, విద్య, ధర్మానుష్ఠానముల వలన జీవాత్మ, జ్ఞానముతో బుద్ధియు బవిత్రములగును. లోపలి రాగద్వేషాదులనబడు దోషములు, వెలుపలి మాలిన్యములు దూరమొనర్చి శుద్ధముగా నుండవలయును. సత్యాసత్యములను విడివిడిగా దెలిసికొని సత్యమును గ్రహించి యసత్యమును ద్యజించిన నిశ్చయముగ మనుజుడు పవిత్రుడగును. క్షాంతి= నిందాస్తుతులు, సుఖదుఃఖములు, శీతోష్ణములు సమానముగా భావించుట, క్షుధాతృష్ణలు-ఆకలి దప్పికలు, మానము నవమానము, హర్షశోకములు మున్నగువానిని విడిచి ధర్మమునందు దృఢనిశ్చయము గలిగి మానము నవమానము, హర్షశోకములు మున్నగువానిని విడిచి ధర్మమునందు దృఢనిశ్చయము గలిగి యుండుట, ఆర్జవమ్= కోమలత, నిరభిమానము, సరళత- సరళ స్వభావము కలిగియుండుట కుటిలతమున్నగు దోషములను విడుచుట; జ్ఞానమ్= వేదాది సర్వశాస్త్రములను సాంగోపాంగముగ నభ్యసించుటకు, అభ్యసింపజేయుటకు వలయు సామర్థ్యము, వివేకము, సత్యమును నిర్ణయించుట- ఏ వస్తువెట్టిదో-యనగా జడమును జడమనియు, చేతనమును జేతనమనియు నెఱుగుట- విశ్వసించుట; విజ్ఞానమ్= పృథివి మొదలు పరమేశ్వరుని వరకుగల పదార్థములను విశేషరూపమున నెరిగి వానిని యోగ్యతకు దగినట్లుపయోగించుట; ఆస్తిక్యమ్= వేదములను, నీశ్వరుని, ముక్తిని, బూర్వపరజన్మముల నంగీకరించుట, ధర్మమును, విద్యను, సత్సంగతిని, దల్లిదండ్రులాచార్యుడతిథుల మున్నగువారిని సేవించుటను విడువ కుండుట, వారి నెన్నడు నిందింపకుండుట యను నీ

పదునైదు కర్మములు, గుణములు బ్రాహ్మణ వర్ణస్థుడైన మనుజునిలో దప్పక యుండవలయును.

(క్షత్రియ గుణములు)

ప్రజానాం రక్షణం దాన మిజ్యాధ్యయనమేవ చ,
విషయేష్వ ప్రసక్తిశ్చ క్షత్రియస్య సమానతః
శౌర్యం తేజో ధృతిర్ దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్,
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్. భ.గీత -

ప్రజానాం రక్షణమ్= న్యాయముతో బ్రజలను బాలించుట, పక్షపాతము లేకుండ శ్రేష్టులను సత్కరించుట, దుష్టులను దిరస్కరించుట, అన్ని విధముల నెల్లరను బాలించుట, దానమ్= విద్యా- ధర్మములందు బ్రవృత్తి సుపాత్రలు సేవలో ధనాది పదార్థములను ఖర్చు పెట్టుట, ఇజ్యా=అగ్ని హోత్రాది యజ్ఞకర్మముల నొనర్చుట, అధ్యయనమ్= వేదాదిశాస్త్రముల నభ్యసించుట, విషయేష్వప్రసక్తిః=శబ్దాది విషయములందాసక్తిని విడిచి జితేంద్రియుడై యుండి యెల్లపుడు శరీరముతో బలము కలిగియుండుట.

శౌర్యమ్= వందలకొలది వేలకొలది యోధులతో యుద్ధరంగమున నొంటరిగా యుద్ధము చేయుటకు భయపడకుండుట, తేజః=ఎల్లప్పుడు తేజస్వియై దీనతను దరిజేరనీయక ప్రగల్భముతో దృఢముగా నుండుట, ధృతిః= ధైర్యవంతుడగుట, దాక్ష్యమ్=రాజు, ప్రజలు నిరువురకు సంబంధించిన వ్యవహారములందును, సర్వశాస్త్రములందును నతిచతురుడుగా నుండుట, యుద్ధేచాప్యలాయనమ్= యుద్ధమునందును దృఢముగా నిఃశంకముగా నుండి, యుద్ధము నుండి వెనుకాడకుండుట- పాఱిపోకుండుట తాను జావక తప్పక విజయము కలుగునట్లు యుద్ధము చేయుట, యొకప్పుడు వెనుకాడుట వలనను, శత్రువులను వంచించుట వలనను విజయము కలుగునెడల నట్లే చేయుట, దానమ్= ఇచ్చు స్వభావము కలిగియుండుట, ఈశ్వరభావః= పక్షపాతము చేయక యోగ్యతకు దగినట్లు వర్తించుట, ఆలోచించుట, ప్రతిజ్ఞను బూర్తిచేయుట, దాని నెన్నడు భంగము చేయకుండుట యను నీ పదునొకండు క్షత్రియుని గుణకర్మములు.

(వైశ్యగుణకర్మములు)

పశూనాం రక్షణం దానమిజ్యాధ్యయనమేవ చ,
వణిక్పథం కుసీదం చ వైశ్యస్య కృషిమేవ చ. మ.

పశునాం రక్షణం=గోవు మున్నగు పశువులను బాలించుట- వృద్ధిచేయుట, దానమ్= విద్యను, ధర్మమును వృద్ధిచేయుటకు ధనాదుల వ్యయము చేయుట, ఇజ్యా= అగ్ని హోత్రాది

యజ్ఞకర్మములను జేయుట నొనర్చుట, కుసీదమ్= ఒక వందకు నాలుగు, ఆరు, ఎనిమిది, పండ్రెండు, పదునారు, ఇరువది యణాలకంటె నెక్కుడు వడ్డీ తీసికొనకుండుట, యియ్యకుండుట, యొక్క రూప్యమిచ్చిన వానినుండి నూరుసంవత్సరములైనను రెండు రూప్యములకంటె నెక్కువ తీసికొనకుండుట. కృషి = వ్యవసాయము చేయుట యను నీ యారును వైశ్యుని గుణకర్మముల.

(శూద్రుని గుణకర్మములు)

ఏకమేవ హి శూద్రస్య ప్రభు కర్మ సమాదిశత్,
ఏ తేషామేవ వర్ణానాం శుశ్రుషామనసూయయా. మ.

నింద, యీర్ష్య, యభిమానముమున్నగు దోషములను వదలి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు దగినట్లు సేవచేయుట శూద్రునకు దగిన పని. దానితోనే తన జీవన నిర్వాహ మొనర్చుకొనుట. ఇవియే శూద్రగుణకర్మములు.

సంక్షిప్తముగా వర్ణముల గుణకర్మములు వ్రాయబడినవి. ఏ పురుషునిలో నేయేవర్ణముల గుణకర్మములుండునో యావర్ణముల యధికారమతని కియ్యవలయును. ఇట్టి వ్యవస్థను బాటించుటవలన మనుష్యులెల్లరు నున్నతశీలురగుదురు. ఉత్తమ వర్ణములవారు తమ సంతానము మూర్ఖత్వాది గుణములు కలవారైన శూద్రులు కావలసివచ్చునని భయపడుదురు. సంతానము కూడ బూర్వము చెప్పబడినట్లు సద్వర్తనము కలవారు, విద్యాయుక్తులు కానివాడు తాము శూద్రులము కావలసినవార మగుదుమని భయపడుదురు. నీచవర్ణస్థులకు నుత్తమ వర్ణస్థులగుటకు నుత్సాహము కలుగును.

విద్యాధర్మములను బ్రచారము చేయుటకు బ్రాహ్మణులు కధికార మొసంగవలయును. వారు పూర్ణ విద్వాంసులు, ధార్మికులు నగుటచే నాకార్యమును యోగ్యతకు దగినట్లు చేయుదురు. క్షత్రియులకు రాజ్యాధికారమిచ్చిన నెన్నడు రాజ్యమునకు హానికాని, విఘ్నములుకాని కలుగవు. పశుపాలనాదుల యధికారము వైశ్యులకుండుట తగును. వారీపనిని బాగుగ జేయగలుగుదురు. శూద్రుడు విద్యావిహీనుడు, విజ్ఞానరహితుడు కావున నతనికి సేవాకార్యము నిచ్చుట యుచితము. అతడు శరీరమునకు సంబంధించిన కార్యములన్నియు జేయగలడు. ఇట్లా యావర్ణములవారిని వారి యధికారమునకు దగిన కార్యములలో బ్రవృత్తులు జేయుట రాజు మున్నగు సభ్యుల కార్యము.

కాని శూద్రపదమును గూర్చి పరిశీలించినపుడు 'వేదతత్త్వ ప్రకాశము' గ్రంథమున శూద్రుడొక సత్పురుషుడుగా తెలియనగును. దస్యునకు శూద్రునకు సామ్య మెక్కడను జూడము.

(1) "యజుర్వేదమున పదునాఱవ" యధ్యాయము చదివిన అందు శూద్రునకు 'నమః' నమస్కారము వంటి ఆదరార్థక పద ప్రయోగము చూడనగును.

(2)యజుర్వేదమున 30 అ.5. మంత్రమున (తపసే శూద్రమ్) శూద్రుడు తపస్వి, పరిశ్రమ మొనర్చువాడు, సాహసికుడు, అని చెప్పబడినాడు. శూద్రుని విషయమున వేదమెట్టి భావమును వెల్లడించుచున్నదో దీనింబట్టి తెలిసికొనవచ్చును.

(3)"రుచం నో ధేహి బ్రాహ్మణేషు, రుచం రాజను నస్కృధి, రుచం విశ్యేషు శూద్రేషు, మయి ధేహి రుచారుచమ్" (యజు.18-48)ఈ మంత్రమున నన్యవర్ణముల వారితోబాటు సమానముగ శూద్రుని కొరకును ప్రీతి, ప్రకాశము నొసంగుమని ప్రార్థన చేయబడినది.

"యచ్ఛూద్రే యదర్యే యదేన శ్చకృమా వయమ్...తస్యావయజనమసి" ( య.20-17) ఓ పరమాత్మా! మేము వైశ్యుని విషయముననను, శూద్రుని విషయముననను జేసిన యపరాధమును గూడ నీవు నష్టము చేయుదువు.' అని యీ మంత్రమున పరమేశ్వరునకు విజ్ఞప్తి చేయబడినది.

(5) "ప్రియం మాదర్భకృణు బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ" అథ. 19-32-8

(6) "ప్రియం మాకృణు దేవేషు ప్రియం మా కురురాజను, ప్రియం సర్వస్యపశ్యత ఉత శూద్ర ఉతార్యే"( అథర్వ. 19-62-1)మున్నగు మంత్రములలో నన్యవర్ణములతో సమానముగ శూద్రునకు సమానమియ్యబడినట్లు చూచుచున్నాము. కావున వేదమున దస్యు శూద్రపదములు సమానార్థకములనుట సంగతముకాదు.

(7) "యథేమాం వాచం కల్యాణీం" అను మంత్రమున శూద్ర, అరణపదములు వేరువేరుగప్రయోగింపబడుట జూతుము. అరణ శబ్దమున కర్థము దస్యుడు, చోరుడు, బందిపోటుదొంగ. కావున దస్యుశూద్రశబ్దములు సమానార్థకములు కావు. ఇట్లే మనుస్మృతిలో బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులుకాక మిగిలినవారు మ్లేచ్ఛభాష నుపయోగించువారు. కావున, ఆర్యభాష మాటాడనివారెల్లరు దస్యులనబడినారు. కావున శూద్రులు దస్యులు కారు. వారు పరిశ్రమచేయు తపస్సంపన్నులనియు, సమాజ ఘటకుల నియు స్పష్టమగుచున్నది.

"ఏవమేవ తు శూద్రస్య ప్రభుకర్మ సమాదిశత్, ఏతేషామేవ వర్ణానాం శుశ్రూషా మనసూయయా" మను.1-9

ఈ మను వచనములను బట్టి శూద్రుడు ఈర్ష్య అభిమానాదులను విడిచి బ్రాహ్మణాదులకు సేవ చేయవలెను అని బోధపడుచున్నది. దస్యునిలో నీగుణమెట నుండివచ్చును? శూద్రుడిట్లు సమాజమున కంగమై యార్యు డనిపించుకొనును. 'ఉత శూద్రే ఉతార్యే' (అథ. 19-62-1) అను నథర్వ వేదమంత్రమును జదివిన తరువాత శూద్రుడార్యుడు కాదనుటెట్లు పొసగును? (సంపాదకీయ టిప్పణి)

స్వే స్వే కర్మణ్యభిరతః
సంసిద్ధిం లభతే నరః
స్వకర్మనిరతః సిద్ధిం
యథా విందతి తచ్ఛృణు శ్లో - 45

*తనస్వాభావిక కర్మయందు*
*ఆసక్తి (శ్రద్ధ)గలమనుజుడు*
*జ్ఞానయోగ్యతా రూపము*
*అనుసిద్ధిని పొందుచున్నాడు*
*ఆ విధంగా తన సమాజ కర్మ*
*యందు నిరతుడైన నాడు*
*సిద్ధిని ఎట్లు పొందగలడో*
*దానిని గూర్చి తెలిపెద వినుము*

యతః ప్రవృత్తిర్భూతానాం
యేన సర్వ మిదం తతం
స్వకర్మణా తమభ్యర్చ్య
సిద్ధిం విందతి మానవః శ్లో - 46

*ఎవరివలన ప్రాణులకు*
*ఉత్పత్తి మొదలుగాగల*
*ప్రవర్తనములు కలుగుచున్నవో*
*ఎవరిచేత ఈ సమస్త ప్రపంచము*
*వ్యాపించబడియున్నదో ఆ*
*పరమాత్మను మనుజుడు తన*
*స్వకీయమగు కర్మచే ఆరాధించి*
*సిద్ధిని పొందుచున్నాడు*

శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మ
కుర్వన్నాప్నోతి కిల్బిషం శ్లో - 47

*చక్కగా ఆచరించబడు*
*పరధర్మముకంటెను*
*తక్కువ దైనను తన స్వధర్మాన్ని*
*ఆచరించడమే శ్రేష్ఠము*
*తన స్వభావానికి, ధర్మానికి*
*తగిన పనులు చేసిన మనుజుడు*
*పాపమును పొందడు.*

స్వధర్మాచరణ ఎప్పుడును అవమాన కరం కాదు, అంటే ఆహారాది ఉత్పత్తి కార్యక్రమాలలో నిమగ్నుడై పనిచేయు శూద్రుడు యజ్ఞయాగాదులు నిర్వహించే బ్రాహ్మణుని కన్నను, రాజ్యాధికారాన్ని చలాయించే రాజు కన్నను, లాభాపేక్షతో వ్యాపారాన్ని నిర్వహించే, వైశ్యునికన్నను ఎప్పుడును తక్కువకాదు. వీరందరు చేసే పనులను స్వధర్మాచరణగా భగవంతుని సేవగా నిర్వహిస్తే చాలు. దానిని "గీత" శ్రమఫలానికిచ్చిన గౌరవంగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులమని చెప్పుకొనేవారు భావించి తీరాలి. గీత చాటుతున్న సందేశం ఇదే.

సహజం కర్మ కౌంతేయ
స దోష మపి న త్యజేత్
సర్వారంభా హి దోషేణ
ధూమేనాగ్ని రివృతాః శ్లో - 48

అర్జునా!
పొగచేత నిప్పుకప్పబడియున్నట్లు
కర్మలన్నీ దోషములచేత కప్పబడి
వున్నాయి. కనుక స్వతసిద్ధమైన
కర్మను ఎవ్వరునూ వదలరాదు

అసక్తబుద్ధిస్సర్వత్ర
జితాత్మా విగతస్పృహః
నైష్కర్మ్య సిద్ధిం పరమాం
సన్న్యాసేనాధిగచ్ఛతి శ్లో - 49

సమస్త విషయముల పట్ల
ఆసక్తి లేని వాడును, ఆత్మ
నిగ్రహముగలవాడును
కోరికలు లేనివాడును అగు
మనుజుడు కర్మఫలత్యాగము
వలన నైష్కర్మ్య సిద్ధిని పొందుచున్నాడు
నైష్కర్మ్య స్థితి అంటే నిష్క్రియా స్థితిఅని
అర్థము.

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ
తథాప్నోతి నిబోధ మే
సమాసేనైవ కౌంతేయ!
నిష్ఠా జ్ఞానస్య యా పరా శ్లో - 50

అర్జునా!
అటువంటి నైష్కర్మ్యసిద్ధిని
పొందినవాడు ఎటుల బ్రహ్మమును
పొందునో అట్టి సిద్ధిని పొందుటకు
ఎటువంటి జ్ఞాననిష్ఠ అవసరమో
దానిని గూర్చి తెలిపెద వినుము

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో
ధృత్యాత్మానం నియమ్య చ
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా
రాగద్వేషౌ వ్యుదస్యచ శ్లో - 51

వివిక్తసేవీ లఘ్వాశీ
యత వాక్కాయ మానసః
ధ్యాన యోగపరో నిత్యం
వైరాగ్యం సముపాశ్రితః శ్లో - 52

అహంకారం బలం దర్పం
కామం క్రోధం పరిగ్రహం
విముచ్య నిర్మమః శాంతో
బ్రహ్మభూయాయ కల్పతే శ్లో - 53

వినిర్మలమైన బుద్ధికలవాడును
ధైర్యముతో ఆత్మ నిగ్రహమును
పొంది, శబ్దాది విషయములను
విడిచి, రాగద్వేషములకు
దూరుడై, ఏకాంతవాసియు
మితాహారియునై, మనోవాక్కాయములను
స్వాధీనమందుచుకొన్నవాడై, సదాధ్యాన
యోగపరాయణుడై, వైరాగ్యమును
ఆచరిస్తూ, అహంకారమును, బలదర్పమును
కామమును, క్రోధమును వీడి,
ద్రవ్యసంగ్రహమును విడనాడి, మమకార

రహితుడైన శాంతవంతుడు
బ్రహ్మత్వమును పొందుటకు
అర్హుడగుచున్నాడు.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా
న శోచతి న కాంక్షతి
సమస్సర్వేషు భూతేషు
మద్భక్తిం లభతే పరాం శ్లో - 54

బ్రహ్మభూతుడైన అట్టి ప్రసన్నాత్ముడు
దేనిని గూర్చి దుఃఖించడు, దేనిని
కోరడు, సమస్త ప్రాణులయందును
సముడై ఉత్తమమైన నాభక్తిని
పొందుచున్నాడు

భక్త్యా మా మభిజానాతి
యావాన్ యశ్చాస్మితత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా
విశతే తదనంతరం శ్లో - 55

నేను ఎటువంటివాడనో, ఎవడనో
భక్తియోగము చేత నాగురించిన
యదార్థమును తెలుసుకున్నవాడు
నాయందే ప్రవేశించుచున్నాడు
అంటే సంలీనం చెందుతున్నాడు

సర్వకర్మాణ్యాపి సదా
కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదాదవాప్నోతి
శాశ్వతం పదమవ్యయం శ్లో - 56

నన్ను శరణు పొందినవాడు
నా అనుగ్రహంవలన
నాశరహితమైన
మోక్షమును పొందుచున్నాడు

చేతసా సర్వకర్మాణి
మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య
మచ్చిత్తస్సతతం భవ శ్లో - 57

చిత్తముచే సర్వకర్మల యొక్క
ఫలాలను నాకు సమర్పించి
మత్పరాయణుడవై, బుద్ధియోగమును
ఆశ్రయించి సదా నాయందే చిత్తమును
నిలిపిన వాడవు కమ్ము

మచ్చిత్తస్సర్వదుర్గాణి
మత్ప్రసాదాత్తరిష్యసి
అథచేత్త్వ మహంకారాన్
న శ్రోష్యషి వినంక్ష్యసి శ్లో - 58

నా యందు చిత్తముగల నీవు
నా అనుగ్రహము చేత సర్వ
సంకటములను దాటగలవు
అహంకారము వలన ఒకవేళ
నీవు వినని యెడల చెడిపోయెదవు

యద్యహంకార మాశ్రిత్య
న యోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయస్తే
ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి శ్లో - 59

ఒకవేళ నీవు అహంకారమును
అవలంబించి యుద్ధముచేయనని
తలంచితివేని అట్టినీ ప్రయత్నము
విఫలమగును, నీ స్వభావమే
నీ చేత యుద్ధము చేయిస్తుంది.

ఇన్ని చెప్పినా, తన విశ్వరూపాన్ని చూపినా అర్జునుడు ఒకవేళ వెనుకడుగు వేస్తాడేమోనన్న తలంపుతో శ్రీకృష్ణభగవానుడు ఈవాడిబాణాన్ని అర్జునునిపై ప్రయోగించాడు.

స్వభావజేన కౌంతేయ!
నిబద్ధః స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్
కరిష్యస్యవశోపి తత్ శ్లో - 60

అర్జునా!
అవివేకము వలన నీవు
నీకర్మను ఆచరించుటకు
ఇచ్ఛగించకపోయినను
స్వభావసిద్ధమైన నీ గుణము
వలన నీలో ఏర్పడిన కర్మయే
నిన్ను బంధించి ముందుకు తోయును
అపుడు నీవు పరవశుడవై యుద్ధము
చేయుటకై ఉపక్రమించెదవు

ఈశ్వరస్సర్వభూతానాం
హృద్దేశేర్జున!తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని
యంత్రారూఢాని మాయయా శ్లో- 61

అర్జునా!
యంత్రమును అధిరోహించిన
వారివలె వున్న సకల విధములైన
ప్రాణులను ఈశ్వరుడు తన మాయ
చేత త్రిప్పుచూ సమస్త జీవుల
హృదయములయందు వెలుగొందుచున్నాడు

తమేవ శరణం గచ్ఛ
సర్వభావేన భారత!
తత్ప్రసాదాత్పరాం శాంతిం
స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ శ్లో - 62

అర్జునా!
సమస్త భావముల చేత ఆ పరమేశ్వరుని
శరణు పొందుము, ఆయన అనుగ్రహము
వలన ఉత్తమమైన శాంతిని, శాశ్వతమైన
మోక్షమును పొందగలవు

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం
గుహ్యాద్గుహ్యతరం మయా
విమృశ్యైతదశేషేణ
యథేచ్ఛసి తథా కురు శ్లో - 63

ఈ విధముగ రహస్యములన్నింటి
కంటెను అతి రహస్యమైన
జ్ఞానమును నీకు బోధించితిని
దానిని బాగుగా విచారించి, ఆ
పిదప నీకుతోచినటులజేయుము

సర్వగుహ్యతమం భూయః
శృణు మే పరమం వచః
ఇష్టోసి మే దృఢమితి
తతో వక్ష్యామి తే హితమ్ శ్లో - 64

రహస్యములన్నింటికంటెను
పరమరహస్యమైనదియును
ఉత్తమమైనదియునగు
నావచనములను మరల
వినుము, నీవునాకు మిగుల
ఇష్టుడవు గనుక నీ మేలు
గోరి చెబుతున్నాను

మన్మనా భవ మద్భక్తో
మద్యాజీమాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే
ప్రతిజానే ప్రియోసి మే శ్లో - 65

నాయందు మనస్సు నుంచుము
నా భక్తుడవు కమ్ము, నన్ను
అర్చించుము, నాకు నమస్కరింపుము
అటుల కావించెదవేని నీవు
నన్నే పొందగలవు, నీవు
నాకు ఇష్టుడవు, ఈ సత్యమును
అందువలన ప్రతిజ్ఞచేసి చెబుతున్నాను

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచః శ్లో - 66

అన్ని ధర్మములను విడిచిపెట్టి
నన్నొక్కనినే శరణు పొందుము
నేను నిన్ను సకల పాపముల నుండి
విడిపించెదను, శోకించవద్దు

ఇదం తే నాతపస్కాయ
నాభక్తాయ కదాచన
న చాశుశ్రూషవే వాచ్యం
న చ మాం యోభ్యసూయతి శ్లో-67

నేను నీకు బోధించిన ఈ గీతాజ్ఞానమును
తపస్వికాని వానికి, భక్తుడు కాని వానికి
శుశ్రూష చేయనివానికి, నన్ను
ద్వేషించువానికి చెప్పకూడదు

య ఇదం పరమం గుహ్యం
మద్భక్తేష్వభిధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా
మామేవైష్యత్యసంశయః శ్లో - 68

పరమ రహస్యమైన ఈ గీతా
జ్ఞానమును నా భక్తులకు
ఎవ్వరు చెప్పుదురోవారు
నాయందు ఉత్తమమైన
భక్తిని కలిగి సంశయరహితులై
నన్నే పొందెదరు

న చ తస్మాన్మను ష్యేషు
కశ్చిన్మే ప్రియకృత్తమః
భవితా న చ మే తస్మాత్
అన్యః ప్రియతరో భువి శ్లో - 69

మనుష్యులలో అట్టివారికంటే
ప్రియమైన వారు నాకు మరొకరు
లేరు, వారికంటే నాకు మిక్కిలి
ప్రియమైన వారు వేరే వుండబోరు

అధ్యేష్యతే చ య ఇమం
ధర్మ్యం సంవాదమావయోః
జ్ఞానయజ్ఞేన తేనాహం
ఇష్టస్స్యామితి మే మతిః శ్లో - 70

ధర్మప్రయోజనమైన మనయొక్క
ఈ సంవాదమును ఎవడు చదువ
నున్నాడో వానిచే చేయబడు జ్ఞానయజ్ఞము
చే నేను ఆరాధించబడుచున్నాను

శ్రద్ధావాననసూయశ్చ
శృణుయాదపి యో నరః
సోపి ముక్తశ్శుభాన్లోకాన్
ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్ శ్లో-71

ఈ గీతాజ్ఞానమును
శ్రద్ధావంతుడై, అసూయారహితుడై
ఆలకించెడి మనుజుడు పాపరహితుడై
పుణ్యాత్ములు పొందెడి లోకములను
పొందుచున్నాడు

